శ్రీ

బాలా త్రిపుర సుందర్యై

నమః

# విజయనగరాంధ్ర కవులు

గ్రంథకర్త

శిష్టా లక్ష్మీకాంత శాస్త్రి,

అష్టావధాని.

నిర్మలా పబ్లిషరు

కుమ్మరివీధి, : విజయవాడ 1

# వి ష య సూ చి క





తెనుఁగు దేశంబు నాయది తెనుఁగుఁ గవిని
తేనె లూరింతుఁ గవనంపుఁ దీరులందు
శాస్త్రి వంశంబువాఁడ నృసింహు నాత్మ
సంభవుండ లక్ష్మీకాంతశాస్త్రి నేను

# పరిచయము

నాకు పితృపాదులు శిష్టా నరసింహశాస్త్రిగారు. వారు షడ్దర్శనముల నామూలాగ్రముగా నభ్యసించిన మహా పండితులు. త్రిమతముల నభ్యసించిన మహా మేధావి. ఉభయ భాషలయందు కావ్యములు రచించిన సాహితీ చక్రవర్తి. తీవ్రమగు విమర్శనాదృష్టి కలవారు. వారు నాకు గురుదేవు లగుట నా యదృష్టము. నిరంతరము వారి పాద సన్నిధియందుండు నవకాశము కలిగినది. నాకు లభించిన యీ కొలది పాండిత్యము వారి ప్రసాదము. వారిదగ్గర మనుచరిత్ర విష్ణుచిత్తీయములు చదువుట నా సుకృత ఫల పరిపాకము. ఆ సంగతి యీనాటికి నేను గుర్తించ కలిగితిని. దాని పరిణామమే యీ విజయనగర ఆంధ్ర కవులు. నా కొలది విజ్ఞానమునకు దోహద మొనరించి పుష్పితము గావించినవారు కోర్కొండభట్టరు కృష్ణమాచార్యులవారు. వారు నా మిత్రులు. సంస్కృతము తెలుగు హిందీ అరవము పరిషియన్ భాషలలో వారు చదవని గ్రంథము లేదు. నాకు అవగతముకాని వైష్ణవ సంప్రదాయములను ఆళ్వారుల రచనలను ఆండాళ్లు పాటలను వాని యర్థములను విమర్శన పూర్వకముగా వివరించి నన్ను ధన్యుని గావించిరి. వారి పరిచయ ఫలమే నా తంజావూరు తెనుగుకవులు, విజయనగరాంధ్రకవు లందలి వైష్ణవమత ప్రదర్శనము. వారికి నా యభివందనములు.

నాకు మిగుల నభిమాన కావ్యములలో మనుచరిత్ర యొకటి. తరువాతిది విష్ణుచిత్తీయము. ఈ రెంటిని జోడించి మా తండ్రిగారు నాకు పాఠము చెప్పిరి. అందలి వేదాంత విషయములను కావ్య ప్రసంగములతోపాటు జతపరచి బోధించిరి. నాకు విద్యాభ్యాస కాలము నుండి పద్యములను గాని శ్లోకములను గాని వ్యాఖ్యానములతోపాటు సునిసితమగు విమర్శనతో చదువుట యలవాటు. ఆ దృష్టియే తిరుపతి కవుల సాహిత్య సమీక్ష నన్ను వ్రాయించినది.

తిరుపతి కవులనిన నాకు మిక్కిలి గౌరవము. వారి రచనలే నన్ను కవిగా చేసినవి. వారితోడి పరిచయము, వారి గ్రంథములలోని తియ్యతనము నన్ను గ్రంథ రూపమున వెలయింపను కదిలించినవి. నా కోరిక సఫలమయినది. కృతకృత్యుడ నయితిని. లోకము దానిని బహుముఖముల వినుతించినది. ప్రకటించిన యారు మాసములలో ప్రతులయి పోయినవి. రెండవ ముద్రణ ప్రతులు దాదాపు కావచ్చినవి. తరువాత తంజావూరు తెనుగు కవులు రచించితిని. దానికి కారణము చేమకూర వేంకట రాజకవి, ముద్దు పళని రచనల మీద నాకుంగల ప్రీతి. రాధికా సాంత్వనము పచ్చి శృంగారమని పెద్ద పెద్దవారు త్రోసిపుచ్చిరి. చిన్నవారు 'ఔను' అనిరి. నాకి వీరికి ఆ కావ్యమర్థము కాలేదు. అది మధుర భక్తి. సత్యము పరిశోధించి లోకమునకు చూపితిని. అందు కృతార్థుడ నయితిని. లోకము అభినుతించినది. ప్రశంసించినది. కనకాభిషేకము చేసినది. ఈ రెండు గ్రంథములు చదివిన నా మిత్రులు, పరిచయులు విజయనగరాంధ్ర కవులను గురించియు పోతనగారి భాగవతమును గురించియు వ్రాయుమని బలవంతి పరిచిరి. విజయనగరాంధ్ర కవులు వ్రాయ గలిగితిని. ఇది రెండు సంవత్సరముల కృషి. పంట బంగారమని యనినవారు కలరు. ఇంక లోకముకూడ పరిశీలించి నిర్ణయింప వలసి యున్నది. ఇది యారు వందలఏబది పేజీలగ్రంథము. ఎవరు దీనిని ప్రకటింతురా యను తలంపు లేకుండ నిర్మలా ముద్రణాలయాధికారులు నా యాప్తులు నగు పరిమి నారాయణమూర్తిగారు దీనిని ముద్రించి ప్రకటింతునని మొదటనే నాకు నుత్సాహము కల్పించిరి. నాకీ యభిప్రాయము కలిగించిన వారిలో వా రొకరు. సాహిత్య పిపాసి. పండిత కవి పక్షపాతి. అన్న మాట తప్పనివాడు. ఈ గ్రంథమును ముద్రించి వెలువరించెను. వారికి నా యభివాదములు.

మొగమోటము లేకుండ సత్యమును ప్రకటించుట విమర్శకుని పని. అట్టి సమయములందు ఒకొక్కప్పుడు కష్టపాటు వాటిల్లుచుండును. దానికి వెనుతీయుట నా తలంపు కాదు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు విఖ్యాత కవి సమ్రాట్టులు. పండితులు, విమర్శకులు.

వారికి తులయగువారు వారే. విశేషించి మా పితృపాదులకు శిష్యులు నాకు మాన్యులు. చిరపరిచితులు. హితాభిలాషులు. వారు మను చరిత్రను గురించి విమర్శనను ప్రకటించిరి. దానిని సందర్భోచిత ముగా ప్రత్యాఖ్యానము చేయవలసి వచ్చినది. అది సాహసమయిన కావచ్చును. అది వారు తార్కిక వాదముగా, పరిగణింపక సత్య మున్న పరిగ్రహింతురని నా నమ్మకము. తదితరుల విషయము నేను చెప్పవలసినది లేదు. అసూయాపరులయి తమ లోపములను పరిగ ణించు కొనలేక తెనుగు దేశమునందు మావంటి విమర్శకులు లేరను కొని అయినవి కానివి తప్పులని, పరాభవింప వచ్చి పరాభవము పొందిన అహంకార మతుల సంగతి పండితలోక మెరుంగును. చెడ పురుగునకు చెడ కొరుకుట స్వభావము. లోకము వారిని లక్ష్యము చేయదు. ఎంత జాగ్రత్తగా పరిశీలించి చూచినను

## కొన్ని జారు పాటులు

ఈ గ్రంథము నందును అక్కడక్కడ కనిపించినవి. ఇట్టి విమర్శ గ్రంథ ములు చదువువారు తప్పక శబ్ద విదులు, కావ్య, శాస్త్ర పరిజ్ఞానము కలవారయి యుందురు. కావున తెనుగునందు పొడమిన అచ్చు పొర పాటులు తమంతట తాము దిద్దుకొన గలరు. కొన్ని సాంస్కృతిక దోషములను మాత్రము తెలుపుచుంటిని.

381 పేజియందు 'శుశ్రూష స్వగురూన్' అను శ్లోకములోని చివరి రెండు పాదము లందలి చివరి పదములు 'భాగ్యేష్వనుత్సేకినీ' యనియు కులస్యాధయః అనియు చదువుకొనునది. కామాంధోపి నప శ్యతి యనియు 511 పేజీ యందు విగతో ఈశః యస్యాసః వీశః అనియు చదువు కొనునది. ఇతరములగు దోషములు సవరించుకొనగలరు.

ఈ గ్రంథము అచ్చగుచున్న కాలమునందు నా దగ్గరనుండి విడి ఫారముల నెప్పటి-కప్పుడు తీసికొనిపోయి మిగుల నుత్సాహ ముతో చదివిన సారస్వత ప్రియులు గలరు. ఇందు వెనుక ప్రకటించిన

రెండు విమర్శన గ్రంథముల కంటె గూడ నింతవరకు వెలువడని వినూతన విషయములు చాల గలవని బహు విధముల వారు ప్రసంగించుచు వచ్చిరి. నా ప్రయాస ఫలించినదని యానందించితిని. అవిలే వివిలే వని విలాపించు వారికంటె ఉన్నవానిలో వినూతనత్వము గ్రహించుకొన గలుగు వారి జీవితములు ధన్యములు. తప్పనుట చాల తేలిక. అందలి యొప్పును తెలిసి కొనుటలో ప్రతిభ యున్నది.

ఇట్లు,
గ్రంథకర్త.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై

నమః

# విజయనగరాంధ్రకవులు

## ౧

### ఏషా వికృతిః

తెలుగు భాష వికృతి. సంస్కృత ప్రాకృతములనుండి పుట్టినది. సంస్కృత ప్రాకృతము లార్య భాషలు. ఆంధ్రు లార్యులు. వారి భాష సంస్కృతము. శాతవాహనుల కాలమునందు ప్రాకృతమే దేశమం దెల్లెడలను వ్యవహరింప బడినది. గ్రంథములు ప్రాకృతము నందు వ్రాయబడినవి. హాలుని సప్తశతి నరయ వచ్చును. అనార్యులైన ఆంధ్రుల సంపర్కమున ప్రాకృతమునకు వికృతత్వము వాటిల్లినది. ఆంధ్రము వికృతి యైనది. ఇచట ఆంధ్ర మనగా ఆంధ్ర దేశమునందు

వ్యవహరించిన భాష యని నా యభిప్రాయము. ఇది పురాణ కాల మందలి విషయము. చరిత్రకాలమునందు తమిళులు రాజులైరి. కొన్ని శతాబ్దములు ఆంధ్రదేశము వారి యేలుబడియం దున్నది. ఆ కాలము నందు ఆంధ్రభాష తమిళ సంప్రదాయములను పుణికి పుచ్చుకొనినది. తమిళ భాషా పదములను అలవరించుకొనినది. కన్నడుల సాంగత్యము చేత కన్నడ పదములను సేకరించుకొన్నది. తురుష్కుల కాలమున తురక పదములను చేర్చుకొన్నది. ఇది యాంధ్ర భాషా తత్వము. ఆంధ్ర దేశమునకు త్రిలింగ దేశమని పేరు. త్రిలింగ శబ్ద భవము తెలుంగు. అదియే తెనుగుగా మారినది. తెనుగు ద్రవిడ భాషలలో నొకటని కాల్డ్వెల్ మొదలగు భాషా పరిశోధకుల అభిప్రాయము. అది పొరపాటు. తమిళ భాష చాలవరకు హలంతశబ్దములు కలది. తెనుగు అజంత మగు భాష. దాని కొక ప్రత్యేక స్వరూప మున్నది. సంప్రదాయ మున్నది. తమిళ భాషకు ద్రవిడ ప్రబంధములు ఆది గ్రంథములు. ఆంధ్రము సంస్కృత ప్రాకృత భవంబయిన వికృతి భాష. దీనికి మూల గ్రంథములు భారతాదులు. కావుననే ఆంధ్ర సాహిత్యము సంస్కృత గ్రంథములను అనువాదములతో ప్రారంభించినది. మొదటి అనువాదము భారతము. దానికి ఆది కర్త నన్నయ. నన్నయ కాలము నుండి శ్రీనాథుని కాలము వరకు గల కవు లందరు సంస్కృత గ్రంథములనే తెనిగించుచు వచ్చిరి. అది ఆంధ్రీకరణ యుగము. ఇట్లనుటచేత స్వతంత్ర కావ్యములు వెలువడ లేదని నా యభిప్రాయము కాదు. వీర శైవ కవులగు పాల్కురికి సోమనాథాదులు బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర, శివలింగ లీలలు, చెన్న బసవ పురాణము మొదలగు గ్రంథములను వ్రాసిరి. నన్నెచోడుడు శివ పురాణములోని పార్వతీ పరిణయము కథను తీసికొని స్వతంత్రము లగు కల్పనలను చేర్చి కుమార సంభవ మను మిశ్రమ కావ్యమును రచించెను.

పంచమ వేదము. వేదములు ఋక్కు లనియు సంహిత లనియు రెండు తీరులుగా నున్నవి. ఋక్కులు మంత్రములు. సంహితలు కథలు. వ్యాసుడు పాండవుల కథను ఇతివృత్తముగా గ్రహించి సంహితలలోని కథలను లోక హితార్థము భారతమునందు పొందుపరచెను. కావున భారతము సంహిత యైనది. భారత సంహితా రచన బంధురు డయ్యె జగద్ధితంబుగాన్ అని నన్నయ నుడివెను. తదనుగుణముగా తన కవితా శయ్యను అమరించి నన్నయ భారతమును తెనిగించుటకు నారంభించెను. అతడు సంహితాభ్యాసుడు నానా పురాణ విజ్ఞాత. వాని రచనయందు నాయా సంప్రదాయములు గోచరించు చుండును. అది వాని రచనకు ఒక ప్రత్యేకత నాపాదించినది. ఈ విషయమును తంజావూరు తెలుగు కవులను గ్రంథమునందు ముచ్చటించితిని. నన్నయ మితభాషి. కొలది పదములలో నమిత మగు భావములను స్ఫురింప చేయును. ఆ భావ ప్రదర్శనములో పాత్రల యాకార రేఖలను పాఠకుని మనసునకు తోపింప చేయును. దుష్యంతుడు కణ్వాశ్రమమును చేరెను.

అతి రుచిరాగతుం డయిన యాతనికిన్ హృదయ ప్రమోద మా
తతముగ నవ్వనంబున లతా లలనల్ మృదు లాని లాపన
ర్తిత కుసు మాక్షతావళులు సేసలు పెట్టిన యట్టి రైరి సం
పత దళిసీ నినాద మృదు భాషల దీవన లొప్ప నిచ్చుచున్

నన్నయ ఆది పర్వములోని చతుర్థాశ్వాసమునందు శకుంతలా దుష్యంతుల కథను దృశ్య ప్రబంధముగా తొంబది యైదు పద్యములలో విరచించెను. అందు మొదట నెనిమిది పద్యములు కణ్వాశ్రమ వర్ణనము. అది ప్రథమ రంగ స్థలము. పై పద్యము కథారంభమునకు నాంది వంటిది. అచ్చటి లతా లలనలు దుష్యంతుని మీద కుసు మాక్షతావళులను చల్లిరి. అళిసీ నినాదములతో దీవెన లిచ్చిరి. ఇందు రూపకాలంకారము కలదు. అర్థశక్తి మూలమున భావి కాలమునందలి

శకుంతలా దుష్యంతుల పరిణయమును వ్యంగ్యముగా స్ఫురింప చేసి నాడు ఆది మహాకవి. ఈ పద్యము వివాహములందు జరుగు ఎదురు కోల యను లాంఛనమును మనస్సునకు తోపింప చేయును. శుభ ముహూర్తమునకు ముందు ఎదురు పోయి పెండ్లి కుమారుని తీసికొని వత్తురు. వేద మంత్రములతో అర్ఘ్య పాద్యాదికముల నొసంగుదురు. అక్షతలను చల్లి దీవింతురు. పెండ్లి వేదికకు కొని పోవుదురు. దీనిని మనస్సునం దుంచుకొని యీ పద్యమును నన్నయ రచించెను. దీని యందు ఒక విశేషాన్వయము కూడ ఇమిడి యున్నది. లతా లలనల్ అను చోట లతల వంటి వారయిన లలనలు అని ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసముచేసి, అళినీ నినాద మృదు భాషలన్ అను నప్పుడు ఆడు తుమ్మెదల నినాదముల వంటి మృదు భాషణములతో నని అర్థము చెప్పుచో, నొక విచిత్ర సుగుణము కాన ముప్పతిల్లును. అచటి లతల వంటి మనోజ్ఞ రూపము కల స్త్రీలు ఆడు తుమ్మెదల నినాద ముల వంటి మృదు భాషలతో కుసుమాక్షతావళులను చల్లి దీవించి రను అర్థాంతరము కలుగును. ఇది కూడ నన్నయ గారి యభిప్రాయమై యుండును. అట్లు కానిచో ఈ పద్య రచన యిట్లుండెను. లలనలు చల్లినవి కుసుమములు. అవి అనిలాపవర్జితములు. కోసినవి కావు. ఆశ్రమ వాసులకు అహింస పరమ ధర్మము. ఒరులకు హాని చేయుట వారిచ్ఛగింపరు. రాలిన పండ్లను ఆరగింతురు. నేల జారిన తృణ ధాన్యములను వండుకొందురు. శబరి నేల రాలిన జంబూ ఫలములను రామున కర్పించినది. తనను మిగుల ప్రీతికరములైనను కుసుమ పల్లవ ములను చిదిమెడిది కాదు శకుంతల.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తేపి యమండ నాపి భవతాం స్నేహేన యా పల్లవం
ఆద్యే వః కుసుమ ప్రసూతి సమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతి గృహం సర్వై రనుజ్ఞాయతాం.

ఇది ఆశ్రమ వాసుల ధర్మము. అనిలాపవర్జితము లైన కుసుమము లనుటచేత కణ్వాశ్రమ వాసులు హింసా కృత్యమునకు సహింప రని అందలి నిగూఢార్థము. ఇట్టి అన్వయముచేత నన్నయ తన నానా రుచిరార్థ సూక్తి నిధిత్వమును ప్రకటించెను. దుష్యంతుడు కణ్వాశ్రమమును చేరుకొనెను. అందు శకుంతలను గాంచెను. ఆమెయు ననంత విలాసంబున జయంతుని బోలె నున్న దుష్యంతుని గుర్తించెను. ఇది కథా వస్తువునకు బీజము. ఆస నార్ఘ్య పాద్యాది విధులం బూజించెను. అనంతరము దుష్యంతుడు

క్రచ్చఱ వేట వచ్చి యిట కణ్వ మహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి మెందుఁ బోయి రొకొ వారు

అని ప్రశ్నించెను. దీనితో నాటక మారంభ మగుచున్నది. రాజులకు వేట యొక వినోదము. దేశము శాంతి యుతమై యున్నప్పుడు పర రాజుల యొత్తిడి లేని సమయములందు రాజులు వేటకు పోవుచుందురు. వేట వచ్చి అనుటచేత తాను మహారాజు ననియు పరావనీపతులవలని భయము లేనివాడ ననియు నిగూఢ మగు నొక యర్థము అందిమిడి యున్నది. ఇందు మూలమున దుష్యంతుని పరాక్రమము వైరి భయంకర మగు దోర్బలము స్ఫురించు చున్నవి. కణ్వ మహామునిఁ జూడగా వచ్చితిమి అనుట వలన దుష్యంతుని వినయాది సద్గుణ శీలములు ప్రకటితము లగుచున్నవి. వాక్యాంతమునందు బహువచన ప్రయోగము చేత దుష్యంతుని రాజసము వెల్లడి యగు చున్నది. ఎందుఁ బోయిరొకొ అనునది తరువాతి వాక్యము. ఒకొ అని వాడుటచేత దుష్యంతు డీ వాక్యమును శకుంతల నుండి ముఖము నావలి వైపునకు మరలించుకొని పైవంక చూచుచు ననియెనని తోపక తప్పదు. ఇందు మూలమున ఆశ్రమ వాసిను లైన కన్యల యెడ వాని పరాఙ్ముఖత స్ఫుట మగు చున్నది. ఈ రెండు వాక్యములచేత నన్నయ దుష్యంతునియందు పరాక్రమము అవి

కత్థనత్వము రాజసము పరస్త్రీ పరాఙ్ముఖత్వము నిరూపించినాడు. అతని నొక ధీరోదాత్త నాయకునిగా రూపొందించినాడు. ఇది నన్నయలోని గొప్పతనము. దుష్యంతుని ప్రశ్నకు శకుంతల

వా

రిచ్చట నుండి యీ క్షణమ మేఁగిరి కానకుఁ బండ్లు దేర మీ
వచ్చు టెఱింగి రేని జన వల్లభ వారును వత్తు రింతకున్.

అని సమాధానము చెప్పెను. ఆమె దుష్యంతుని చూచినది. వాని అంద చందములకు మనస్సునం దబ్బుర వోయినది. వానియందు దను రాగ మంకురించినది. అందు మూలమున సంభ్రమంబు పొడసూపినది. కణ్వ డాశ్రమమునందు లేడు. దుష్యంతుడు వెడలిపోవు నేమో యని యామె భయము. వాని నెట్లయినను నిలువరింప వలయు నని మనస్సు తహతహ లాడినది. దాని కనుగుణముగ వా రిచ్చట నుండి యీ క్షణము యేగిరి అని సమాధానము చెప్పినది శకుంతల. ఇందలి యిచ్చట నుండి యీక్షణమయను రెండు పదములు రెండు సాన తీరిన జాతి రత్నములు. వానియందు శకుంతలహృదయములోని యావేగము ఉబలాటము విస్పష్టముగ గోచరించును. కణ్వమహాఋషులు ఇప్పటివరకు నిచ్చటనే యుండిరి. మీరు వచ్చెడు ఈ క్షణముననే ఆశ్రమమునుండి పండ్లు తేర కానకు నరిగిరి. మీరాకయు వారిపోకయు నేక కాలము ననే జరిగినది. కావున వారెంతో దూరము పోయి యుండరు. అందు మూలమున మీ రాక వారి కెట్లయినను తెలియగలదు. అట్లు తెలియ గానే మరలి రాక తప్పరు. అంతవరకు మీ రిచ్చటనే యుండవలసినది అని నిగూఢముగ నర్థించినది. కాని ఆమె మనస్సు సరిగా గుర్తింప డేమో యను వెరపు పొడమినది. ఆ వెరపు ఆమెను ఊరకుండనీయ లేదు. వెంటనే వారు వచ్చునంత వరకు నొక్క ముహూర్తం బుండునది అని కోరినది. ఇందు శకుంతలా దుష్యంతులు ఆలంబన విభావములు

దుష్యంతుని అనంత విలాసము శకుంతల యెడ నుద్దీపన విభావమైనది. అది ఆమె యందు అనురాగంపు మొలకలను అంకురింప చేసినది. ఇందు వ్యంగ్య రూపమున స్ఫురించుచున్న భయము ఆవేగము వ్యభిచారీ భావములు. ఇట్లు నన్నయ కొలది శబ్దములలో నిగూఢ మగు భావము లను వ్యంగ్య రూపమున స్ఫురింప చేయుటయందు అతి నిపుణుడు. అట్టి నైపుణ్యము మరెవ్వరియందును కానరాదు. ఆ మహాకవి పద ముల పొందికలో లాస్యమును స్ఫురింప చేయును. అందు తాళ గతులు వీనుల విందుగ వినిపించును. కద్రూ వినతలు సముద్ర తీరమునకు వచ్చిరి. అచట వారు

విపి ధోత్తుంగ తరంగ ఘట్టన చల ద్వేలావ నైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా లాస్యంబు లీక్షించుచున్.

చని నారట. ఇందు లతా లాస్యంబులకు అనుగుణముగా లుంగ లవంగ సంగత అను శబ్దములలో తాళ గతులను చూపించినాడు నన్నయ. ఆ మహాకవి పదముల కూర్పులో చిరుగజ్జెగముల మొర యింపులు వినిపించును.

క్వణాదణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాపమున్ రణ
న్మణి కల నూపురంబులు సమ ధ్వని నొప్పగ భక్తిం బాద చా
రిణి యయి

రైవత కాద్రికి వచ్చినదట సుభద్ర. ఈ సమాసంపు కూర్పులో ణ కారము వృత్త్యనుప్రాసగా ప్రస్తరించి పాఠకుల చెవి దోయికి కాంచన కాంచి కలాపములోని కింకిణీ రవమును మరి నూపురముల రణనమును సమానముగ వినిపింప చేసినాడు నన్నయ. ఇది యీ మహామహుని అక్షర రమ్యత. నన్నయ రచనలయందు పాత్రల రూప కల్పనలలో శిల్పము కాన్పించదు. అది తిక్కన పాలిటి సొమ్ము. తిక్కన నన్నయ వంటివాడు కాడు. అతడు మాటకారి. పలుకు చతురత కలవాడు. విపుల

భాషి. కోప మొదవె నేని మొగమోటము పోవు వాడుకాడు. అన తలంచిన నాల్గు మాటలు ముఖ మెదుటనే యనగల తెంపు వానికున్నది. తిక్కన రచనలయందు ఆయా గుణములు పరిస్ఫుటముగ గోచరించును. అతడు చెప్ప దలచుకొన్న విషయమును విపులముగ మనస్సున కెక్కు నట్లు చెప్పుట వాని స్వభావము. కావున వాని వర్ణనలందు శిల్పము అమరి యుండును. రూప కల్పనలు మనో నయనమునకు నిండార కనిపించును.

అల్లదనంబున నడవు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింత తొడవు గాఁగ
వెడ వెడ నూఁగారి వింతయై యేర్పడు
దేరని వళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెరవుల కల మేర
నెల్లను బిగి యెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్కు
తారకంబులఁ గల్కి తనము దొడఁగఁ

జరణములును నడుము జన్నులు గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర సనుదెంచె
నలరు విలుతు పువ్వు టమ్ము వోలె.

ఇది నిండు ప్రాయంపు మేని యంగంబుల జిగి బిగువులం బొందని నాటి యుత్తర రూప కల్పనము. అపు డామె ముగ్ధ. ౧౪ నేడాది గడచినది. నిండారు జవ్వనంపు మేని బెడంగులు కోటి కెక్కనవి. అట్టి యెడ తిక్కన

అడుగుల నునుఁ గాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు
నసదుఁ గౌఁదీఁగె యల్లాడు చుండఁ
దటి వేచి వెనువెంటఁ దగులు కామాంధకా
రము లీలఁ గ్రొవ్వెద గొమరు మిగులఁ
గర్ణ భూషణ మౌక్తిక ప్రభా డోలన
విభ్రాక్షణ దీప్తుల నిసుమడింప

నందియల మొరపంబున కరుగు దెంచి
ప్రౌఢి రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందములఁ దోన
చనఁగ నుత్తర నర్తన శాల కరిగె.

అని వర్ణించెను. ఇప్పు డామె ప్రౌఢ. ఆ ప్రౌఢ తనము ఆ రూప కల్పన యందు గోచరించును. రెండు పద్యములను ఒకటి వెంట నింకొకటి చదివి చూచినచో నా యా కాలములందలి యుత్తర రూప రేఖలు కన్నుల యెదుట వచ్చి నిలుచును. వాని యందలి తారతమ్యము పాఠకులకు కనిపించును. ఆ యా వర్ణనా విశేషములకు అబ్బురపడి మహావ్వా యని చిరు నవ్వులు పొలయ తిక్కన శిల్పమునందలి వైశద్య మును పాఠకుడు వినుతించును. తిక్కన గంటము మిగుల వాడి యైనది. ఎందెటువంటి వంపులు సొంపులు కలవో వానిని వీస మైనను వాసి పోని యక చిత్రించి అంద చందములను తీర్చి దిద్ది పాఠకుని కనుల యెదుట రూపములను నిలుప గలదు. ఒక్కొక్కప్పు డా రూప కల్పనము అలం కార సహితమయి పాఠకుని యూహకు పని కల్పించుచుండును.

2)

ఎలదీఁగఁ గప్పిన లలిత పరాగంబు
　　క్రియ మేన మేదినీ రేణు వొప్పఁ
జంపకంబున నన సౌరభం బెసఁగఁగను
　　కనఁగ నాసిక వేడి గాడ్పు నిగుడఁ
దోయజ దళముల తుది నుంచు దొరఁగెడు
　　గతిఁ గన్నుఁగవ వస్త్ర కణము లూరుల
నిందు బింబము మీఁది కందు చందంబునఁ
　　గురులు నెమ్మొగమున నెరసి యుండ

సర్వ జన వంద్యమైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్య మొంది
యవ్విరాటుని సభఁ జేర నరిగి నిలిచి

నది. ఈ పద్యమునం దుపమాలంకారము కలదు. అందు మూలమున ద్రౌపది శరీరము ఎలదీగ వలె లలిత కోమల మయిన దనియు నాసిక చంపకము వలె మనోహరమయిన దనియు కనులు కమల దళముల వలె నాయతములయి చెవులను దాకుచున్న వనియు కురులు చందురులోని కందు వలె నల్లని వనియు సూచింప బడినవి. ఇది యామె సహజ స్వరూపము. ఆమె సింహబలునిచే తరుముకొని రాబడినది. ఆ కారణముచేత నామె శరీరమునందు పుప్పొడి వంటి దుమ్ము అలముకొన్నది. నాసికనుండి సువాసన గల వేడి నిట్టూర్పులు పొలయుచున్నవి. కంటి కొనల నుండి యశ్రువులు జారుచున్నవి. చందురుని బోలు ముఖము మీఁద పడి కురులు తూగాడుచున్నవి. అని యప్పటి రూపమును చిత్రించినాడు తిక్కన. ఇట్టి యలంకారము శోభిల్లచేత పాత్రయొక్క సహజ స్వరూపము వర్ణింప బడుటయె గాక ప్రకరణమును బట్టి యప్పటి యాకారము కూడ వర్ణిత మగుచుండును. రెండు రూప

ములు పాఠకుని చిత్త నయనములకు గోచరించును. వాని యందలి తారతమ్య మూహా కందించును. దానిని తలంచుకొని పాఠకుడు రసావిష్టు డగును. ఆ మహిమ యీ యలంకారమునం దున్నది. ఇట్టి వర్ణనలలో నుభయ శిల్పమే కాక కావ్యత్వ మున్నది. రస మున్నది. మనోహరత యున్నది. అంద చందము లున్నవి. జీవ మున్నది. శిల్పి వాడియగు తన శాణముతో వంపులు సొంపులు తీర్చి దిద్ది నగ్నమగు ప్రతిమను తయారు చేయును. దానికి సన్నని సున్నితంపుఁ దెలి పట్టు వలిపము కట్టి సర్వాలంకారములు పెట్టి నప్పుడు వినూతన మగు శోభ సజీవ మగు కళ వాటిల్లును. అట్టి రూపమును పరిశీలించు నపుడు శిల్పి తీర్చిదిద్దిన యసలు రూపము వస్త్రాద్యలంకారములలో నుండి దోబూచు లాడును. ద్రష్టకుని చిత్తము నువ్విళు లూరించును. నిజ స్వరూపము నూహకు తెచ్చుకొనును. వైసద్య మటువంటిది. ఒక పాత్రను స్వభావ సిద్ధముగా నున్నది యన్నటుల వర్ణించుట కంటె ఒకొక్కప్పుడు అలంకార సహితమయిన యిట్టి శిల్ప ప్రదర్శనములో కవి చతురతయు వైదుష్యము గొప్పతనము కలదు. కవి హృదయము నగ్నముచేసికొని చదివి నప్పుడు పాఠకుని కానందము వెల్లివిరియును. ఇట్టి శిల్ప కళా ప్రసిద్ధములయిన పద్యములు తిక్కనగారి భారతమునందు పెక్కు గలవు. ఇవి ఆయన స్వయం సముజ్జ్వతములు కావు. ఇట్టి రచనా చాతుర్యము నకు దారి చూపినవాడు నన్నెచోడుడు. ఆయన కుమార సంభవమునందు

అరుణాంఘ్రి తల దీప్తి నవనీ తలంబెల్లఁ
బద్మరాగ స్థల భాతి నొనర
వద నేందు కాంతి దిగ్వదన కైగవముల
కాల చంద్రాతప లీల నెఱయ

నథ రారుణ ద్యుతి నారణ్య తరు లతా
          సమితి పల్లవిత విభ్రమముఁ బడయఁ
తను లత సుడియు నెత్తావి గైకొని సమీ
          రుఁడు గంధవహుఁ డను రూఢిఁ దనర

వళులు నయన రుచులు వన మయూరములు వి
ద్యుల్ల తావలోక నోత్సవంబుఁ
బూరయఁ నరుగుదెంచెఁ దరు వన స్థలి సువి
రాజితముగ శైలరాజ తనయ.

అసి తోత్పలములపై నరణేందు దీధితు
          లెలసినాఁ గనుఁ గవ లెత్తె నయ్యెఁ
దొవలపైఁ బ్రాలేయ లవములు దనరెనా
          మొగములఁ బేర్చిందు లెగయుఁ దెంచెఁ
కలహంస పదువులు గాళ్ళందుఁ దోడరెనా
          మట్టంపు నడపులు మందటిల్లెఁ
దరుణ వల్లరుళపైఁ బురి నమ్మ లూఁగెనా
          వెన్నెలఁ గ్రొవ్వెదల్ విరిసి ప్రేలెఁ

బర్వ తావలిఁ దోలు మొల్ల పంక్ల రసము
ద్రావె నన ముద్దుఁ బలుకులు దడుమ నయ్యె
మధు మదాసక్తి నిజ రూప మహిమ లెడసి
యభిన వాంగ ప్రభాసిత లైరి సతులు.

యిట్టి పద్యములు చాల కలవు. వీనిని తిక్కనగారి పద్యములతో సరిపోల్చి చూచినచో రచనా విధానమునందె కాక భావములందును నన్నెచోడుని అనుకరించె నని తోచును. ఇంక కోపావేశము కలిగినపుడు వెనక ముందర చూచుట యుండదు. తన యావేశమంతయు

వెడల నుడివిన గాని యాగడు. ఇది తిక్కనగారి స్వభావము. దీనినే ద్రౌపది పాత్రయందు ప్రకటించెను. ద్రౌపది విరటుని కొలువు చొచ్చినది. సింహబలుని యాగడము మహారాజుతో విన్నవించుకొనినది. ధర్మజుడు

పలు పోకలఁ బోవుచు వి
చ్చలవిడ నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గుల సతుల గఱువ చందము
దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజ వదనా.

అనెను. ద్రౌపది యొడలు మండినది. కారము రాచుకొని నటు లయినది. ఆమె దెబ్బ తినిన భుజంగము. నురల దండ తాడిత మైనది. కోపము రెండింతలు పెరిగినది. ధర్మరాజునందు కల గౌరవ మైనను తలంప లేదు. భర్త యని పరిగణింప లేదు. ఉసలు కొట్టుచు

నాదు వల్లభుండు నటుఁడింతి నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారు
గానఁ బతుల విధమ కాక యే శైలూషి
గా ననంగ రాదు కంకభట్ట.

అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ. మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదం యాలికి గరువతనం బెక్కడియది.

అని సమాధానము చెప్పినది. అందు నలువురి నొక్కసారి చుట్టు పెట్టినది. మనస్సులోని యక్కసు ఆవేశము కోపము పరితాపము ఒక్క సారిగా వెడల గ్రక్కినది. మాటలతో కసి తీర్చుకొనినది. అప్పటికి గాని ఆమె యావేగము చల్లార లేదు. శ్రీకృష్ణుండు రాయబారియై హస్తినా పురమునకు బయలు దేరెను. ద్రౌపది తాను పడిన భంగపాటులను వానితో చెప్పుకొనినది.

> వరమునఁ బుట్టితిన్ భరత వంశముఁ జొచ్చితి నందు బాండు భూ
> వరునకుఁ గోడలైతి జన వంద్యులఁ బొందితి నీతి విక్రమ
> స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
> సరసిజ నాభ యన్నిటఁ బ్రశస్తికి నెక్కిన దాన నెంతయున్.

> నీవు సుభద్ర కంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
> భావన సేయు దిట్ట నను బంకజ నాభ గొనకొంచు రాజసూ
> యావభృతంబునందు శుచియై పెనుపొందిన వేణి పట్టి యీ
> యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే.

అని తన ఘనతను నిరూపించుకొనుటంతో ప్రారంభించినది ద్రౌపది. అంతటితో నామె యూరకుండ లేదు. ఈ యేవురు చూడగా సభకు నీడ్చె నని యొక్క యెత్తిపొడుపు మాట విసరినది. ఇందు మూలమున తన భర్తలు ఐదుగురుండియు శక్తి విహీనులయి యేమియు చేయలేక బొమ్మల వలె కన్నులప్పగించి యూరకుండి రని భావమును వెళ్ళబుచ్చినది. అది నిగూఢముగా ఆ వాక్యము నందు నివురు గప్పిన నిప్పువలె నిమిడి యున్నది. దానిని తన భర్తలు శ్రీకృష్ణుడును గ్రహింప లేరని కాబోలు

> ఆ సభ కేకవస్త్ర యగు నట్టి ననుం గొని వచ్చి నొంచు దు
> శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై తగు చేష్ట లేక నా
> యాసలు మాని చిత్రముల యాకృతి

నుండి రని విపులీకరించినది. ఇది ఆమెకు భర్తల యెడ గల విద్వేషము కాదు. జరిగిన భంగపాటును జ్ఞప్తికి తెచ్చి యుద్ధ కార్యాచరణకు నుద్రేకితులను చేయుట. ద్రౌపదికి సంధి మాట గిట్ట లేదు. యుద్ధము కావలయును. ధర్మజుడు అయి దూళ్ళిచ్చిన చాలు ననెను. అన్న

మాట త్రోసివేయ లేక తమ్ములు సరె ననిరి. ద్రౌపది కది యొడలు మండించినది. నిద్ర మత్తునం దున్న సింగమునకు కోల యేటు వలె తన భర్తలను ఉద్రేక పూరితులను చేయ వలె నని ఆమె ఆశయము. అంతటితో ఆమె కోపము ముగియ లేదు. ఇంకొక మెట్టు పైకి పోయినది.

ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెండ్రుకల్
దావల చేతఁ బూని యసిత చ్ఛవిఁ బొల్చు మహా భుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాద రోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై

ఆమె రోషము ఇనుమడించినది. ఇంక కూర్చుండ లేక పోయినది. ఉద్రేకమున లేచినది. ఈ వెంట్రుకలను బట్టి యీడ్చిన దుశ్శాసనుని తనువు ఇంత లింతలు తునకలై చెదరి రూపరిన గాని నాయుడు కారదు. రాజ రాజు పీనుంగు ధర్మనందనుఁడు నేనును కన్నార చూడమేని భీమసేనుని బాహు బలంబును కత్తి విక్రమంబును కాల్పనా యన్నది. ఆమె భర్తలను లక్ష్య పెట్టలేదు. రాజరాజయిన దుర్యోధనుని చీరికిం గొనలేదు. మనస్సునందలి యావేశము తుట్టతుది బొట్టు వరకు విపులముగ వెల్వరించిన గాని సంతృప్తి నొందలేదు. వృద్ధుడును, మామగారును నగు ధృతరాష్ట్రునైనను మన్నింప లేదు.

అరయమిం జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటు గాక పాడియై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా.

అని యడిగినది ద్రౌపది శ్రీకృష్ణుని. దానికి సమాధానము లేదు. కృష్ణు నంత వాడు ఆమె మాటలకు నోరు మెదల్ప లేక పోయినాడు. ధృతరాష్ట్రుడు మహా పురుషుండట. అది నిందా గర్భితము. దెప్పిపొడపు. ఒక విధముగ పరిహాసము ఎద్దేవ దాని యందిమిడి యున్నవి. ఇది యంతయు తిక్కనగారి రచనా నైపుణ్యము. భావములు వ్యాసుని వైన కావచ్చును. వెన్నవలె మెత్తనైన తెలుగు భాషలో బల్లెముల కంటె వాడి యయిన తీవ్రత ఆవేగము ఆవేశము రోషము పరిహాసము పదములలో నెలకొల్పిన తిక్కనగారి నేర్పు వినుతింప దగినది. ఇవి ఆయన స్వభావమునకు మనస్సునకు పాండిత్యమునకు ప్రతిబింబము. అంతటివాడు కావుననే ఒక మండలాధిపతికి మంత్రియయి యుండి గణపతి రుద్రదేవుని వంటి మహారాజును లోబరచుకొని మనుమసిద్ధికి రాజ్య మిప్పించ గలిగినాడు. శ్రీకృష్ణుని రాయబారంపు కథా గోష్ఠిలో ద్రౌపది వాక్యములకు ఒక విశిష్టత యున్నది. పాండవుల వాక్యము లన్నియు నొక యెత్తు, ద్రౌపది మాటలు ఒక యెత్తు. అవి సానపెట్టి మొన తేర్చి పదును గావించిన బల్లెములు. వానితో తన యిచ్చ వచ్చినట్లు పాండవ కౌరవుల మర్మములు దూసిపోవు నట్లు ఇటు నటు పొడిచినది. ఆమె మాఱట నోటిది. ఆవేశ పూరితమైన చిత్తము నందు మాటలు నిల్పుకొన లేక పోయినది. నోటికి వచ్చినట్లెల్ల పలికినది. ఆమె కోపము ఆమెను వెనుక ముందరలు చూడనీయ లేదు.

ఆఱడిఁ బోకయున్ ఫలము నందుటయుం గని పల్కనేరమిన్
మాఱట నోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు ప్రేలెదన్ వినుడు కర్జము నెగ్గును గాన నల్కమై
వీఱిడి యైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే.

అని తన వాచాలత్వమును 'అల్కనై వీఱిడి యైన మానిసికి వెండి వివేకము గల్గనేర్చునే' యని సమర్థించుకొనినది. ఈ మాట వాడి తనము ద్రౌపదిది కాదు తిక్కనది. కవి స్వభావము కవితయందు గోచరించునని పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయము. అది సత్యము. ధర్మజుడు ద్రౌపదిని జూదమునం దోడిపోయెను. ఆమెను కొలువునకు కొని రమ్మని ప్రాతికామినిని పంపినాడు రాజరాజు. ప్రాతికామి ఆమెకు సకలము నివేదించినాడు. కొలువు కూటమునకు రమ్మని ద్రౌపది నర్థించినాడు. ఇది యామెకు కఠిన పరీక్ష సమయము. ఆమె

ఏ యుగంబునందు నెట్టి దుష్కితవుండు
భార్య నొడ్డి యోటు వడిన భర్త
గలఁడె యిది వినంగఁ గడు నపూర్వం బయ్యె
నిట్లు సేయు నొక్క యిందు కులుఁడు.

మున్న దన్నోఁటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
గ్రన్నఁ దన్నోటువడియెనో యన్న నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగు దేని

ఎఱుంగ వేని యక్కితవు నడిగి వచ్చి మఱి నన్నుం దోడ్కొని పోవ నగునేని తోడ్కొని పొమ్ము అనినది. ఇది నన్నయ గారి రచన. ద్రౌపది నోట ధర్మరాజును కితవు డనిపించుటకు మిగుల బాధపడె నని తోచును. తిక్కనగారి మాటలయందలి సూది మొన వాడి తనము నన్నయ పలుకులలో నంతగా కనిపించదు. దుశ్శాసనుడు ద్రౌపదిని డాయం బోయెను. ఆమె నేను రజస్వలను నన్ను ముట్టకుము. ఏక వస్త్రనై యున్న దానను గురు బంధు జనాధిష్ఠితం బయిన సభకు నే నెట్లు రానేర్తును అని ధర్మ పన్నముల నుపన్యసించినది. తన్ను సభ కీడ్చి తెచ్చి నపుడు సహితము ధర్మజుని యెడ నొక్క పరుషంపు

మాట నోట వెలువడనీయ లేదు. మిగ్గాదు నిక్కలి ధర్మజుని వినుతించినది.

> అనుపము డైన యోగ హతుఁడయ్యు సవశ్యము ధర్మ సంపదం
> దనరున కాక ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మ పథంబు తప్పఁ డ్రో
> క్కునె కురు వృద్ధులార ఘృణ కోపనుఁ డితఁడు నన్ను నేల దు
> ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె నవిచార పరుండయి దుర్మదంబునన్.

మొదటినుండి చివరి వరకు పలుకు సంయమనము ధర్మ నిర్దేశమునకై పెనుగులాడుటయు నామె స్వభావ మైనది. అది ఆమెది కాదు. నన్నయగారిది. ఆ స్వభావమె ఆయన కావ్యమునం దెల్లెడలను గోచరించును. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించెను. శకుంతల దాదాపు యిరువది పద్యములలో ధర్మము సత్యము నీతిని గురించి చెవులు గింగురు పోవున ట్లుపన్యసించినది. అంతియ కాని దుష్యంతుని ఒక్క మాటయైనను తూలనాడ లేదు. నన్నయకు ధర్మ మన్నను నీతి యన్నను అంత ప్రీతి. అవకాశము చిక్కినప్పు డెల్ల వానిని గురించి ప్రస్తావించుచునే యుండును.

> ఆ వనజాననం గురు కులాపశేదుండు గడంగి రాజ సూ
> యావభృథంబునందు వసుధామర మంత్ర పవిత్ర వారి ధా
> రావళిఁ జేసి పావనము లైన శిరోజములం దెమల్చి పా
> పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమ మందిచూడఁగన్.

నన్నయ సంహితాభ్యాసుడు. ధర్మములు మంత్రములు తంత్రములు ఆయన మనస్సున నెప్పటి కప్పుడు పొడగట్టు చుండును. అవి వానికాదరణీయములు. ఆ యాదరాభిమానములు ద్రౌపదియందు కూడ పొందు పరచినాడు. ఆమె నొక ధర్మ స్వరూపిణినిగా రూపొందించినాడు. ఆమె నోట నా భావములనే పలికించినాడు. పై పద్యమును

'నీవు సుభద్రకంటెం గడు నెయ్యము గారవముం దలిర్ప సంభావన చేయుదువు' అనుపదముతో సరి పోల్చి చూచినచో నన్నయ తిక్కనల స్వభావములు హృదయ గతములు కాగలవు. నన్నయగారి పద్యమున్ని కురుకులాపశదుండు తిక్కనగారిపద్యమందు ఒకండు అయినాడు. అది సంస్కృత శబ్దము. ఇది దేశీయ మైన తెలుగు శబ్దము. పై శబ్దముకంటె మిగుల వాడి యైనది. ఇందు నీచాతి నీచుడు అను భావము నిగూఢముగా నిమిడి యున్నది. రాజసూయావభృథంబు నందు అనునది యిద్దరకు నభిహితమే. కాని వసుధామర మంత్ర పవిత్ర వారి ధారావళి నన్నయకు నాదరణీయమై నంత తిక్కనగారికి కాక పోయినది. కావున దానిని విడిచి పుచ్చెను. నన్నయగారి పావనత తిక్కనయందు శుచి యైనది. వసుధామర కులమునందలి అభిమానము వేద మంత్రములందలి గౌరవము నన్నయగారిని అట్టి సమాస సంఘటనమునకు పురికొల్పినది. సమయము దొరికి నప్పుడెల్ల తన భారతము నందు ఇట్టి గౌర వాదరములు ప్రదర్శించుచునే వచ్చెను. నన్నయగారు తన పద్యమునందు శిరోజములు అని వాడెను. అదిచాల సమంజసము. తిక్కనగారు 'పెనుపొందిన వేణి' అని ఉపయోగించిరి. ఇది నాగరికము. ద్రౌపది రజస్వల. ఏక వస్త్ర. భారతీయ స్త్రీలు రజస్వల కాలమున కురులను వేణిగా నల్లరు. ముడిని వేయుదురు. దుశ్శాస నావకృష్ట యైన ద్రౌపది కొప్పు వీడినది. ఆమెను కురులు పట్టి సభ కీడ్చి తెచ్చినాడు దుశ్శాసనుడు. కావున నన్నయగారి శిరోజ శబ్దము భారత జాతి స్త్రీకి సహజమైన సదాచారమును పాఠకుని తలంపునకు తెచ్చును. దానికి లోపము రానీయ డా మహాకవి నన్నయ. వేణి యనగా జడ. అది నవ నాగరి కాంగనల యంద చందములను వెలయించుశబ్దము. తిక్కన మిక్కిలి లౌక్యుడు. సౌంద ర్యోపాసకుడు. నాగరకత ఆయన స్వభావము. దీనికి లోటుకలుగ నీయ డీ మహాకవి. నన్నయ వైదికముగా ప్రారంభించిన భారత సంహిత తిక్కనయందు లౌకిక మయినది. నన్నయ రచనలోని సంస్కృత సంప్రదాయములు

తిక్కన భారతమందు దేశీయతను పునికి పుచ్చుకొనినవి. నన్నయ లోని విపులార్థ ప్రతిపాదకము లైన మిత భాషణములు తిక్కనలో విరివియై మాట వాడితనమును సంతరించుకొన్నవి. ఆదికవిలోని అక్షర రమ్యత తిక్కనయందు అపరూపు వహించినది. నన్నయ భారతమునందు చిక్కనైన రస మకరందము తిక్కన భారతములో పాల వలె జాలు వారినది. నన్నయ భారతము పండిత కవులకు కర్ణ రసాయనము. తిక్కన భారతము రస పిపాసువులగు తెలుగు కవులకు విందు భోజనము. ఇదియే నన్నయ తిక్కన భారతములలోని తారతమ్యము. ఆ యా మహా కవుల స్వభావములు వారి వారి రచనల యందు కనిపించును. ఇది సత్యము. నన్నయ తిక్కనలు భారతాంధ్రీకరణమునందు తమ అభిరుచిని బట్టి ఒక్కొక్క చోట కథను పెంచిరి. ఒక్కొక్క చోట కుంచించిరి. ఇట్లే ఆంధ్రీకరణ యుగములోని కవులందరు తమ తెలివితేటల కనుగుణముగ ఉత్తర రామాయణము నృసింహ పురాణము, భాగవతము మొదలగు పెక్కు గ్రంథములను విరచించిరి. సంస్కృత గ్రంథములను తెలిగించుటయందు కవికి స్వేచ్ఛా స్వాతంత్ర్యము లుండవు. మూలములోని కథను తమ యభిరుచి ననుసరించి మార్చుటకు వీలు లేదు. నూతన భావములను చొనిపించుటకు అధికారము లేదు. తమ బుద్ధి నేర్పును వినియోగించి మూలమునకు విఘాతము రాకుండ రచన సాగింప వలయును. ఎట్లైన భాస్కరుండు పోతనాదులు అట్లే కావించిరి. తమ పలుకుబడిలోని యంద చందములను మెత్తందనమును ప్రకటించిరి. తమ గ్రంథములను వన్నె వాసులు వెలయించిరి. కీర్తిని సంపాదించిరి. తరువాత

## కావ్యయుగము

నకు దారి తీసినవాడు శ్రీనాథు డని సారస్వత చరిత్ర కారుల యభిప్రాయము. దానిని విమర్శకు లంగీకరించిరి. శ్రీనాథుడు మహాభోగి.

అతి స్వతంత్రుడు. దైవము నైనను లక్ష్యపెట్టని స్వభావము కలవాడు. వాని చాటు పద్యములవలన విషయ లోలుడని కూడ ఊహింప వలసి యున్నది.

తోలకరి మించుఁ దీవ గతిఁ గోప దుకాణము మీఁద నున్నయా
యలికుల వేణితోఁ దమలపాకుల బేరము లాడఁ బోయి నే
వలచుట కేమి శంకరుని వంటి మహాత్ముఁడు లింగ రూపియై
కులుకు మిటారి గబ్బి చను గుబ్బల సందునఁ దాండ వింపఁగన్

ఆమె జంగ మాంగన. మెడయందు లింగకాయ యున్నది. అది స్తవ ముల నడుమ నూగు లాడుచున్నది. ఆ యూగులాట తాండవముగా నుత్ప్రేక్షింప బడినది. శంకరుడు జగత్పిత. సంసారి యయ్యును యోగ స్వరూపుడు. కావున ఆతడు మహాత్ముడు. మహాయోగి యగు శంక రుడే యామెను వరించెను. ఇందలి యర్థ శక్తి మూలమున శివుని పర స్త్రీ లోలత్వము జంగమాంగన సౌందర్యము వ్యంజితము లగుచున్నవి. శ్రీనాథుడు వీరశైవుడు. శివారాధన తత్పరుడు. తన యారాధ్య దైవమగు శివుడే యామెను వరించిచను గుబ్బల సందున తాండవించు చుండంగాతాను మాత్ర మేల యామెనువరింపరాదు అనివాని భావము. అవును. అది సమంజసమే. యథా దేవ స్తథా భక్తః. ఇది కావ్య లింగము. ఇది గొప్పక విధముగా పరిహాసము, వేళాకోళము. తన కార్యమును సమర్థించుకొనుట కుపాయము శివుడు బోళా శంకరుడు. వందించినను నిందించినను పాటించువాడు. కాడని సరిపెట్టు కొందుము గాక. కాళి మహా భయంకర స్వరూపురాలు. ఆమె తనయెడ నెట్టియప చారము సహింపదు. ఆను నైనను మన్నింప లేదు శ్రీనాథుడు.

గొఱియల మేక పోతులను గొమ్ము పోతుళ్ళను గావుగొందు వీ
వరయఁగ సందెకాడఁ దగ వత్తు నటంచు భవచ్చిరంబుపైఁ
గర మిడి పోయినట్టి తిలఘాతుకురాలు తదీయ శప్తముల్
పెరుకఁగ లేవు నీవు నొక భీకర మూర్తివె కాళి కేశ్వరీ !

అని యెత్తిపొడిచినాడు. ఇత్యాది పద్యము లాతని చాటువులందు పెక్కు గలవు. వాని నాధారముగా చేసికొని శ్రీనాథుడు విషయ లోలుడని విమర్శకులు నిరూపించిరి. అయిన గావచ్చును. అది యొక తప్పు కాదు. అవకాశము లభింపవలయును గాని యారాటపడనివారు లేరు. వ్యాస పరాశరుల వంటి వారికే పట్టు పగ్గములు లేక పోయినవి పరుల మాట చెప్ప వలసిన దేమున్నది. అందుకనే "ఇనుప కచ్చడా లట్టినముని మ్రుచ్చులెల్ల దామరస నేత్ర లింగ్ల బందాలు కారె"అన్నాడు పెద్దన. కావున శ్రీనాథుని వనితా లోలుడని నిందించుట యవివేకము. వారు మాత్రము మడి కట్టుకొంటిరా?

"తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుగరు"

అన్నాడు వేమన. అతడు శతక కవులలో చాల యనుభవము కలవాడు. శ్రీనాథుడు చాల గడుగ్గాయి. అతని విషయ లాలసత్వ మాతనిని భోగ పరుని గావించినది. సుఖానుభవములకు మనస్సును పురికొల్పినది. వానికి కస్తురి కావలయును. దానిని మేననలందుకొని పరిమళము దిశల నలముకొన వీథుల వెంట తిరుగ వలయును. మేడి పల్లెములందు మహారాజులతో పాటు షడ్రసోపేతముగా ప్రతి దినము విందు భోజనములు కుడుచుచుండ వలయును. పచ్చకర్పూరముతోడి పలు విధములగు సుగంధ ద్రవ్యములు నెనసిన తాంబూల చర్వణమున కే నాడును లోటు రాకూడదు. వీని కన్నిటికి ధనము కావలయును. ధన సంపాదనకు కవిత్వము సాధనగా నొనరించుకొనినాడా కవి సార్వభౌముడు. రాజుల కొలువు కూటములందు ప్రవేశించెను. అతడు పండితుడు. మహాకవి. వాని కత్తికి రెండు వైపులను పదు నున్నది. వాగ్వాదములలో పండితుల నెదిరించి జయించెను. ఇంక కవిత్వము సంగతి చెప్పవలసిన పనిలేదు. దీనార టంకాలతో కనకాభిషేకము చేయించుకొనినాడు. మహారాజు లాతని కవితా శక్తి కబ్బుర పోయిరి. అధికముగా ధనము నొసంగిరి. బహు విధముల సన్మానించిరి. ఆ ధనములు

వాని కే మూలకు రాలేదు. మధ్య మధ్య కావ్య రచనకు పూను కొనెను. వానిని ధనికోత్తంసులకు మంత్రులకు కృతి నిచ్చెను. ధనార్జన కావించెను. అప్పటికి తెనుగు చేయతగిన పురాణములు నుద్గ్రంథములు పెక్కు గలవు. వానిని సంపూర్ణముగా నాంధ్రీకరించుటకు చాల కాలము పట్టును. అంతవర కాత డాగలేడు. ఎప్పటి కప్పుడు ధనము సంపాదింప వలయును. అత డుపాయశాలి. వానియందలి భాగములను తెనిగించి ప్రత్యేకకావ్యములుగానిర్మించెనుకాశిఖండముభీమ ఖండము లిట్టివంటివి. అవి స్కాంధ పురాణములోనివి.కావ్యములలోని యందమగు కథా ఘట్టములను తెనిగించి హార విలాస మను పేరు పెట్టెను. అది ఖండ కావ్యముల సంపుటి. ఇంక మిగిలి పోయినది శృంగార నైషధము. సంస్కృత గ్రంథమును తెనుగు చేయుటలో తేలిక మార్గము కని పెట్టినవాడు శ్రీనాథుడు. సంస్కృత శ్లోక మున్నది యున్నటుల తెనుగునం దేనృత్తముగో సరిపోవునో వానికి బాగుగా తెలియును.

సువర్ణ దండైక సితాతపత్రితో
జ్జ్వల ప్రతా పావళి కీర్తి మండలః — నైషథం

తపనీయ దండైక ధవ ళాతపత్రితో
ద్దండ తేజః కీర్తి మండలుండు. — శృం. నై.

అంతగా నిడమక పోయినప్పుడు వచన ముండనే యున్నది.

స్థితాః క్షణం పక్ష్మసు తాడి తాధరాః
పయోధ రోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేది రే
చిరేణ నాభిం ప్రథ మోద బిందవః — కు. సం.

పక్ష్మ పాలీక్షణ స్థితంబులును దాడి తాధరంబులును పయోధ గోత్సేధ నిపాత చూర్ణితంబులును త్రివళీ వలయ స్ఖలితంబులును నాభీ గహ్వార ప్రవిష్టంబులును నగు జలధర జలబిందు ధారలం దోగియు హార.విలా

శ్రీనాథుడు రచించిన కావ్యములలో పలనాటి వీర చరిత్ర యొకటి. అది ద్విపద కావ్యము. చరిత్రాత్మక మగు స్వతంత్ర గ్రంథము. అట్టి రచనకు దారి చూపించినవాడు పాల్కురికి సోమనాథుడు. కావున శ్రీనాథుడు క్రొత్తగా కావ్యరచనకు దారి చూపిన దేదియు లేదు. వాని రచన లన్నియు సరిగా పరిశీలించి చూచినచో దాదా పన్నియు నాంధ్రీకరణములే యని తోచక తప్పదు. మహా గ్రంథములలోని వై[illegible]క్యతగల కథా భాగములను ప్రత్యేక గ్రంథములుగా తెలిగించుటలో వాని కావ్యత్వ స్థితి యున్నది. కావున పూర్వ కవుల రచనలకంటె నవి భిన్నముగా గోచరించును. అందు మూలమున సారస్వత చరిత్ర కారులు విమర్శకులు భ్రాంతి పడి యుందురు. నిజమునకు మిశ్రమ కావ్య రచనకు మార్గదర్శి నన్నెచోడుడు. అతని కుమార సంభవము పెద్ద నాది మహాకవులకు దారి చూపినది. శ్రీనాథుని పదముల కూర్పు లోను శయ్యా విశేషమునందును ఒక విధమగు వినూతనత్వ మున్నది. పద్యంపు నడకలో జిగియు బిగియు గలదు. వికృతి పదములతోడి సంస్కృతములు కలయ కలిపి పద్యమును నడపుటలో నాతడు సిద్ధ హస్తుడు.

ముత్యాల మొలనూలు మురువు సూపెడు నట్టి
జఘనంబుపై మాంజి సవదరించె
గందుక క్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జములఁ బూనె నక్ష మాల

కస్తూరి కాంగరాగములతో విలసిల్లు
తను వల్లి హత్తించె ధవళ భూతి
బొమ్మ పెండిలి పాటఁ బ్రొద్దు పుచ్చు నెలుంగు
నీలకంఠ స్తోత్ర నియతిఁ గూర్చెఁ

బసిడి కమ్ముల యందంపుఁ బట్టు చేల
కొంగు చాటున వర్ధిల్లు కుచ భరమున
గంతగా వైచెఁ బులి తోలు కళవసంబుఁ
బరమ కళ్యాణి గిరి సార్వభౌమ తనయ.

ఇట్టి రచనకు శ్రీనాథుడు పెట్టినది పేరు. పదముల కొరకు పోకడల కొరకు తడుములాడుకొనుట యుండదు. రస జీవములతో పదములు తమంతట తాము వచ్చి వ్రాలుచుండును. వానికి స్థానాస్థానములు తెలియును. అంద చందములు తెలియును. ఆ కూర్పులో మనోహరత వాటిల్లును. నూతనత్వము నెలకొని యుండును. ఇట్టి రచనకు నన్నెచోడుడాది కర్త. కుమార సంభవమునందు

పవడంపు లత మీఁదఁ బ్రాలేయ పటలంబు
పర్వెనా మెయి నిండ భస్మ మలది
లాలితం బగు కల్ప లత పల్లవించెనాఁ
గమనీయ ధాతు వస్త్రములు గట్టి
మాధవీ లత కళి మాలికల్ ముసరెనా
రమణ రుద్రాక్ష హారములు మెట్టి
వన హేమ లతికపైఁ బురి నమ్మి యూఁగెనా
సన్నుతం బగు నెఱి జడలు పూని

హరుఁడు మాహేశ్వరీ రూప మైన చెలువ
మభినయించెనో యని మును లర్థిఁ జూడ

గురు తపశ్శక్తి మూర్తి సేకొనిన కరణిఁ
దగిలి యుమ దపో వేషంబు దాల్చి పొల్చె

అని వర్ణించెను. పై రెండు పద్యములను సరిపోల్చి చూచినచో పదముల కూర్పునందు శ్రీనాథునకు నన్నెచోడుని పద్య రచనా విధానము మేలుబంతి యని చెప్పక తప్పదు. కాని శ్రీనాథుని పద్యములందున్న యందము రస స్ఫూర్తి నన్నెచోడుని పద్యములందు కనిపించవు. అతని పదములలో మాధుర్య మున్నది. రచనలో ప్రసాద గుణ మున్నది. భావములలో సహజత్వ మున్నది. వ్యర్థ పదము గాలించి చూచినను గానరాదు. శ్రీనాథుని రచన లన్నిటిలో హార విలాసము ప్రశంసింప తగినది. అందు నిండు తేరన కవిత్వ మున్నది. నన్నెచోడుడు కన్నడ దేశీయుడు. ఆయన కవితయందు కన్నడ భాషా పదములు పెక్కు చొరబడినవి. అవి మహా ప్రవాహమునందు పెను పారు గండ శిలలవలె పద్యంపు నడక నరికట్టు చుండును. ఒక్కొక్కప్పుడు కుంటుతనమును కలిగించు చుండును. శ్రీనాథుని పద్యములందుకూడ నచ్చటచ్చట కన్నడ పదములు కలవు. కాని యవి తెనుగు పదములలో నంతర్లీనములయి కవనంపు ధాటి కడ్డుపాటు కలిగింపవు. శ్రీనాథుడు కర్నాట దేశీయుడు. ఆయన కవిత కర్నాట భాషయని చెప్పుకొనెను.

ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాష యందు
రెవ్వ రేమన్న నండ్రు నా కేమి కొఱంత
నా కవిత్వంబు నిజము కర్నాట భాష

కడప కర్నూలు బళ్లారి అనంతపురము చిత్తూరు జిల్లాలు-కర్నాట దేశమని చరిత్రకారులు నుడివిరి. కర్నాట దేశమునందు వ్యవహరింప బడు భాష కర్నాట భాష. అది పలుకుబడిలో తెలుగుకంటె కొంచెము భిన్న

ముగానుండును. కన్నడ దేశమును సమీపించు కొలంది పోను పోను కన్నడ భాషా పదము లెక్కువ చొరబడును. అందు మూలమున నది యొక ప్రత్యేక భాషగా గోచరించును. పై పద్యమును బట్టి శ్రీనాథుని కవిత్వమునందు సంస్కృతంపు పోకడలు గల చోటులందు ప్రౌఢత్వమును తెనుగు పదముల కూర్పు కల పట్టులందు మెత్తందనమును అచ్చటచ్చట కన్నడ పదముల పొందికయు కలిగి యుండు నని తేలుచున్నది. అది సత్యము. శ్రీనాథుని ప్రతి గ్రంథమునం దాయా లక్షణములు పొడగట్టుచుండును. కర్నాట భాష కన్నడమని కొంద రభిప్రాయ పడుచున్నారు. కన్నడము ద్రవిడ భాషా కుటుంబము లోనిది. తెను గార్య భాష. తెనుగునకు కన్నడమునకు నెట్టి సంబంధము లేదు. కన్నడ పదముల సంయోగము కలిగినంత మాత్రమున తెలుగు ద్రవిడము కాజాలదు. కర్నాట భాష యనుటచేత కర్నాట దేశ వ్యవహార సిద్ధంబగు భాష యని శ్రీనాథుని యభిప్రాయము. అందు కొన్ని కన్నడ భాషా పదములు చేరి యుండుట భాషా లక్షణము. సహజముగా ప్రతి భాషయం దిట్టి చేరిక లుండును. అట్లే నన్నెచోడుని కావ్యమునందు కన్నడపదములు పెక్కు దొరలినవి. అది దేశ వ్యవహార సిద్ధము. ఇది భాషా చరిత్రాంశము. దాని నిందు ప్రసంగించుట ప్రస్తుత విషయము కాదు.

శ్రీనాథుడు నన్నెచోడుని కుమార సంభవమును ప్రత్యక్షర పరిశోధనము గావించెను. అందలి రచనా విధానమును హృదయగతము కావించుకొనెను. అది పూర్వ కవుల పోకడలకంటె వినూతన మయినది. సంస్కృతములను వికృతాచ్ఛిక దేశీయ పదములతో కలయ కలిపి పద్యములు రచించుట నన్నెచోడుని పద్ధతి. అందు మనోహరత యున్నది. కవి జనాకర్షణీయ మగు శయ్యా చమత్కారమున్నది. శ్రీనాథు డధిక మగు కవితా పరిశ్రమ కలవాడు. మహా పండితుడు. పండిత కవి. రాజన్యుల చిత్తము నెరింగినవాడు. వానికి

సమయ స్ఫూర్తి యున్నది. నన్నెచోడుని రచనలోని లోటుపాటులు గుర్తించెను. వానిని పరిహరించెను. వినూతనములగు సున్నితంపు నడక దారులు నెలకొల్పెను. శ్రుతి మనోహరంబు లగు వికృతి పదము చిరు గజ్జె యందియల రవళితో కవితా లతాంగిని నాట్య మాడించెను. నన్నెచోడుని కంటె శ్రీనాథుని యందొక విశేష మున్నది. ఎంత భావము కే వృత్తము సరిపడునో వానికి బాగుగా తెలియును.

> వికీర్ణ సప్తర్షి బలి ప్రహాసిభి
> స్తథా న గాంగై స్సలిలై ర్దివ శ్చ్యుతైః
> యథా త్వదీయై శ్చరితై రనావిలై
> ర్మహీధరః పావితః ఏష సాన్వయః

ఇది కాళిదాసు కుమార సంభవములోని శ్లోకము. నన్నెచోడుడు

> పరము కపర్ద సంగమునఁ బావనమైన సురాప గాంబువుల్
> శిరమునఁ దాల్చి ముందఱ ప్రసిద్ధియు సిద్ధియుఁగన్న కంటె నీ
> పరమ తపః ప్రభావమునఁ బర్వత వల్లభుఁ డిప్పు డెంతయున్
> నిరుపమ కీర్తియైఁ దనరి నిర్మలుఁ డయ్యె జగంబులోపలన్.

అని యాభావమును చంపక మాలయందు వెలయించెను. దానినే శ్రీనాథుడు

> అభ్ర వీథీ పరిచ్యుతం బైన యట్టి
> యమర తటినీ జల ప్రవాహమ్ము కంటె
> ధరణీధర రాజు నీ చరిత్రంబు కతనఁ
> బరమ పావనుఁ డయ్యెనో పద్మనయన!

అని గీత పద్యమునం దిమిడ్చెను. అదియే వాని చాకచక్యము. ఎంతటి భావము నైనను బీరు పోనీయకుండ క్లుప్త పరచి చిన్న పద్యములో

నిమిడ్చుట శ్రీనాథుని యందున్న గొప్ప విశేషము. అట్టి నేర్పు మరే యితర కవులకు లేదు. ఇంక వర్ణ నాంశములు వచ్చి నప్పుడు శ్రీ నాథుని నేర్పరితనము మెచ్చుకొన తగినది. ఒక పద్యమును పోలిన యింకొక పద్యము మచ్చున కైనను కాన్పింపదు. నన్నెచోడుడు

పవడంపు లత మీఁదఁ బ్రాలేయ పటలంబు
పర్వెనా మెయి నిండ భస్మ మలది

అని పార్వతిని వర్ణించెను. ఇట్టి పోకడ గల పద్యములు కుమార సంభవమునందు పండ్రెండు కంటె నెక్కువ కలవు. ఇవి యన్నియు పొందు పరచుటకు గ్రంథము చాలదు. ఇంక సంస్కృత సమాస సంఘటనములతో పద్యమును పరిగ్రొత్తించుటయందు ఒకరి కొకరు తీసి పోవువారు కారు. కవితా మాధుర్యమునందు శ్రీనాథుడు నన్నెచోడుని మించినవా డయినను కావచ్చును.

మి శ్ర మ కా వ్య ము

లకు దారి. చూసినవాడు నన్నెచోడు డనుటలో సందేహము లేదు. నన్నెచోడుడు ఒరయూరు కధిపతి. టెంకణాదిత్యు డను బిరుదు కలవాడు. ఒరయూరు పాకనాటిలోనిది. వాని తండ్రి పేరు చోడ బల్లి. అతడు సూర్య వంశములోనివాడు. నన్నెచోడుని తల్లి పేరు శ్రీసతి. ఆమె హైహయాన్వయమందు పుట్టినది.

పాత్రుఁడ ననదృశ కాశ్యప
గోత్రుఁడ సచ్చరిత నుభయ కుల శుద్ధుండన్
మిత్రాన్వయ శేఖరుఁడఁ బ
విత్రీకృత దేహుఁడను వివిధ యజ్ఞములన్.

అని కుమార సంభవమునందు చెప్పుకొనెను. నన్నెచోడుడు పలు యజ్ఞ యాగములను గావించెను. అవబృథ స్నాన మొనరించెను. దేహమును మనస్సును పవిత్రము కావించుకొనెను. ఇతడు వీర శైవ మతస్థుడు. జంగమ మల్లికార్జున దేవునకు శిష్యుడు. షష్ఠ్యంతములందు నుపయోగించిన విశేషణములను బట్టి జంగమ మల్లికార్జునుడు శ్రీకంఠ మూర్తి యని వాని యభిప్రాయము. ఆ బ్రహ్మ ఋషికి మనుజాకార మహేశునకు మల్లికార్జున మునికి తన కుమార సంభవమును అంకితము కావించెను. కృత్యాదియందు షష్ఠ్యంతములను వాడిన మొదటి కవి నన్నెచోడుడు.

## కుమార సంభవము

పండ్రెండాశ్వాసముల గ్రంథము. ఇందు దాదాపు వచనములతో కలిపి రెండు వేల ఐదు పద్యము లున్నవి. ప్రథమ ద్వితీయాశ్వాసము లందు దాక్షాయణీ శివుల కథా కథనము గలదు. తృతీయాశ్వాసము నుండి నవమాశ్వాసము వరకు పార్వతీ పరమేశ్వరుల వృత్తాంత మితి వృత్తము. కుమారోత్పత్తియు సుర సేనాధిపత్యమునకు షణ్ముఖు నభి షేకించుటయు తారకాసురునకు రాయబార మంపుటయు దశమాశ్వా సమునందు కలదు. ఏకాదశ ద్వాదశాశ్వాసములందు దేవ దానవ యుద్ధము వర్ణింప బడినది. కుమార సంభవ మిట్లు మూడు ఖండము లుగా నున్నది. మొదటి తొమ్మి దాశ్వాసములందు ప్రధాన నాయ కుడు శివుడు. ప్రథమ ద్వితీయాశ్వాసములలో నాయకురాలు దాక్షా- యణి. మూడవ యాశ్వాసము నుండి తొమ్మిదవ యాశ్వాసము వరకు నాయకురాలు పార్వతి. ఇందు ప్రధాన రసము శృంగారము. అది వియోగ సంయోగ భేదముల చేత రెండు విధములుగా వర్ణింపబడినది. ఇందు నాయికలు వేరగుటవలన వస్త్వైక్యత లేదని కొందఱు విమర్శిం చిరి. అట్లనుకొన వలసిన పనిలేదు. ఆది శక్తి రూపాంతరములు సతీ పార్వతులు. ఆమెను నాయకురాలుగా గ్రహించినచో, వాదము

దమునకు తావుండదు. అదియే నన్నెచోడుని యభిప్రాయము. కుమార సంభవములోని ప్రథమాశ్వాసము నందలి డెబ్బదవ పద్యమువలన నది స్పష్ట మగును. కావున నిందు శివశక్తులు నాయక నాయికలు. అందు మొదటి రెండాశ్వాసము లందు ఆది శక్తి రూపాంతర మయిన దాక్షాయణి నాయకురాలు. దాక్షాయణీ శివులు కరిణీ కరులుగా రూపొంది రతి క్రీడా వినోదములం దని వొందిరి. వారికి గజాననుడు పుట్టెను. ఇది కవి కల్పితము. దీనికి కారణ మున్నది. విఘ్నేశ్వరుడు గజ ముఖుడు. దానికి వారి యేకాంత కేళీ వినోదము కారణ మని నిరూపించెను. నిజమునకు శివునివలన దాక్షాయణికి కుమారుడు జన్మించిన ట్లెందును లేదు. విఘ్నేశ్వరుడు పార్వతి కుమారు డని పురాణములు నుడువు చున్నవి. విఘ్నేశ్వరుడు దక్షుని పాశముతో గట్టి తెచ్చుట కవి కల్పించినది. ఇందు మూలమున వినాయకునకు కొంత ప్రాధాన్య మాపాదించుట కవి యభిప్రాయము. తరువాతి కథా భాగము కాళిదాస విరచిత మయిన కుమార సంభవములోనిది. అది కథానుసరణమే కాని అనువాదము కాదు. అందును రతీ మన్మథుల సంవాదము స్వయం కల్పితము. అది శైవ ప్రాబల్యమును నిరూపించు టకు వ్రాయ బడినది. సంస్కృత కుమార సంభవమునకును దీనికి నెట్టి సంబంధము లేక పోయినను అచ్చ టచ్చట అందలి భావములను గ్రహించుచు వచ్చినాడు నన్నెచోడుడు. మచ్చునకు

> దివం యది ప్రార్థయసే వృథా శ్రమః
> పితుః ప్రదేశా స్తవ దేవ భూమయః
> అథోపయంతార మలం సమాధినా
> నరత్న మన్విష్యతి మృగ్యతే హి తత్. కుమా.

స్వర్గార్థి యందమే స్వర్గంబు దమ హిమ
గిరి చరులం దొక కెలన నుండు

పురుషార్థి యందమే పురుషులు తనుఁ గోరి
తప మర్థిఁ జేయంగఁ దగిన రూపు

రత్నములఁ గోరి విని జనుల్ రాక జనుల
రత్నములు గోరి పైఁ బడి రాకఁ బోలు

స్వరూప వర్ణనమునందు చక్కని శిల్పమును తీర్చి దిద్దుటలో తిక్కన గారి గంటము మిగుల సునిసితమయినది. పాత్రలను ప్రకృతి రంగములను యథార్థరీతిగా పాఠకుని కనుల యెదుట తెచ్చి నిలుపును. అట్టి వైశద్యమునకు చాతుర్యమునకు ప్రౌఢతనమునకును గ్గుపెట్టినవాడునన్నె చోడుడు. వాని వర్ణనలలో నన్నయాదులందు కానరాని చిత్రరచన యున్నది. పార్వతి స్నాన మాడినది. కుసుమాదులను గొని వచ్చినది. వానిని శివున కర్పించినది. అంతలో మరుడామెపై కుసుమ బాణమును వేసెను. ఆమె చిత్తము చలించినది

ఎలరారు కనుఁగవ వాలయించుఁ గ్రేవల
నెఱిగొని మెఱుఁగులు దుఱఁగలింపఁ
గ్రొవ్విరి చిఱు నవ్వు నవ్వ వాతెఱ కాంతి
రంగిల్లి సితరుచుల్ దొంగలింపఁ
గుదుటఁ గ్రక్కదరిన గదియించు నుదు విల్లు
సుడిసి ముత్తరగలుఁ గడలు కొనఁగ
సోలంబు నెఱ నూరు సొగియు నుంజెమటపై
వదలి మైఁదీఁగ మవ్వంబు మిగుల.

నొత్తిలించుఁ దఱుమ నూకించుఁ దాలిమి
కగ్గలించు నెఱియ నప్పలించు
మదన శర విభిన్న హృదయాబ్జయై మహా
దేవుఁ జూచి గౌరి దేవి తిరుగ.

ఇట్టి శిల్పము గల పద్యములు కుమార సంభవమునందు చాల గలవు. అవి యొకొక్కప్పు డుత్ప్రేక్షా ద్యలంకారములతో కలిసి మరింత కావ్య శోభ నాపాదించు చున్నవి. కుమార సంభవమునందు నాయికా నాయకుల వర్ణన పుర వర్ణన ఋతు వర్ణన మొదలగు వర్ణన లన్నియు గలవు. తరువాతి కవుల కావ్యములకు బీజ ప్రాయములయిన యితర వర్ణనలు చాల కలవు. అవన్నియు ప్రదర్శించుట యిప్పటి పని కాదు. మచ్చునకు

కొప్పు విచ్చి విచ్చి కప్పంగ మఱచి చేఁ
బాదివి పట్టికొనుచుఁ బొలఁతి వచ్చె
నెల్ల సమయములకు నీశుండు వేల్పని
ముడియ కట్టవచ్చు వడువు వోలె.

ముడవ నెత్తిన పూవులు మాడిచి కొనఁగ
మఱచి చేఁ బట్టుకొనుచుఁ దన్నెఱుఁగ కర్థిఁ
బోలి చనుదెంచెఁ ద్రైలోక్య పూజ్యు నచల
భక్తిఁ బూజింపఁ జనుదెంచు భంగి వోలె.

శివుండు హిమవంతుని పురంబునందు పెండ్లి కుమారుడై ప్రవేశించెను. వీథుల వెంట నూరేగు చుండెను. పుర నారులు శివుని చూడ వచ్చిరి. అప్పటి వారి సందడి పై పద్యములందు వర్ణింప బడినది. ఇట్టి పద్యములు కుమార సంభవమునం దీ సందర్భమున నిరువది యైదు కలవు. అవన్నియు చక్కని భావములతో నిమిడి యున్నవి. వానిని చూచి తరువాతి కవు లిట్టి వర్ణనలను సాగించిరి. అవి యొకొక్క కావ్యము నందు విపరీతములయి చదువుట కేవగింపు పుట్టించును. కుమార సంభవము రెండవ యాశ్వాసమునందు దక్షాధ్వర విధ్వంసము వర్ణింప బడినది. పదునొకండు పండ్రెం డాశ్వాసములందు తారకాసురునితోడి యుద్ధము ప్రదర్శింప బడినది. వానియందు వీర రసము వెల్లివిరియు
5]

చుండును. నన్నెచోడుడు రాజు. పెక్కు యుద్ధములు చేసియుండును. విజయములు సాధించి యుండును. ఆ క్రమ మంతయు తు చ తప్పకుండ దేవ దానవ యుద్ధమునందు వర్ణించెను. మొత్తము మీద కుమార సంభవము శృంగార రసము ప్రధానమైన కావ్యము. దానికి వీర మంగము. ఒక్క కుమార స్వామి జన్మ వృత్తాంతము కల దగుట చేత కుమార సంభవమున కా పేరు పెట్టబడ లేదు. వినాయకుని జన్మ వృత్తాంతము కూడ కలదు. కావున కుమార శబ్దము సామాన్య వాచకముగా గ్రహింప బడినది. కుమారుల సంభవ మని యర్థము. కుమార సంభవమునందు నన్నెచోడుడు నాటిన మహా కావ్య బీజములు శ్రీనాథునం దంకురించి అల్లసాని పెద్దన మను చరిత్రమునందు దుబ్బులు కట్టి ముక్కు తిమ్మన పారిజాతాపహరణమునందు ఫలోన్ముఖమునకు వచ్చినవి. తరువాత వెలసిన మిశ్రమ కావ్యములు దాదాపన్నియు నాప చేలు.

నన్నెచోడుడు కుమార సంభవమునందు దేశీయ మయిన తెనుగు కవితను గురించి ప్రసంగించుచు

మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశి కవిత పుట్టించి తెనుం
గు నిలిపి రంధ్ర విషయమున
జన సత్యాశ్రయుని దొట్టి చాళుక్య నృపుల్

అని నుడివెను. ఇందు నుడివిన చాళుక్య నృపుడు రాజరాజ నరేంద్రుడు. ఆ మహారాజు నాస్థాన కవి నన్నయ భట్టు. రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమున నన్నయ భట్టు భారతమును తెనిగించెను. ఆ మహాకవిని దృష్టియం దుంచుకొని నన్నెచోడు డీ పద్యమును వ్రాసెను. ఈ సందర్భమున చాళుక్య నృపులను ప్రసంగించుట రాజ కులాభిమానము. వారి కా గౌరవమును ప్రతిపాదింప వలయు నని నన్నెచోడుని యభి

ప్రాయము. అది సమంజసమే యగును. నిజమునకు రాజరాజు లేనిచో దేశి కవిత పుట్టుకకు నవకాశ ముండెడిది కాదు. కావున వారి కా గౌరవము తగి యున్నది. రాజ కులాభిమాన మెంత యున్నను నన్నె చోడుడు నన్నయ భారతమును చదువకుండ కుమార సంభవము వ్రాయ లేదు. భారతమును ప్రత్యక్షరపరిశోధన కావించెను. నన్నయరచనావిధాన మవగతము గావించు కొనెను. శయ్యను పరిశీలించెను. ఆ దారినే తా నవలంభించెను. నన్నయ పోకడలను బోలిన పోకడలు గల పద్యములు కుమార సంభవమునందు చాల కలవు. సంస్కృత సమాస సంఘటన మున కా మహాకవి పెట్టినదే యొరవడి. ఒకసమాస సంఘటనమునందే కాదు తిక్కనగారి దేశీయంపు తెలుగు కూర్పులకు దారి చూపిన వాడును నన్నయయే. శ్రీనాథునితో నాంధ్రీకరణ యుగ మంతరించిన దని తలంపరాదు. తరువాత కూడ సాగుచునే వచ్చినది.



౨

## విజయనగర రాజ్యము

విజయనగర సామ్రాజ్యమున కంకు రార్పణము గావించినవారు హరిహర రాయలు బుక్కరాయలు. వీరు ఆనెగొంది సంస్థానాధిపతులు. హొయసాల రాజయిన మూడవ వీరభల్లాలునకు సామంతులయి యుండిరి. వాని యనంతరము స్వతంత్రులయి విద్యానగర నిర్మాణమునకు నుపక్రమించిరి. వారి యుద్యమమునకు దోహద మొసంగిన వాడు మాధవ విద్యారణ్యస్వాములవారు. ఆయన భువనేశ్వరి మంత్రోపాసకుడు. విరూపాక్షాలయమునకు ధర్మకర్త. ఉత్తర దేశమును ముంచెత్తి దక్షిణ భారతమును కబళింప పొంగు లారుచు పరవడులు త్రొక్కుకొని వచ్చుచున్న తురుష్క సేనా సముద్రము నరికట్టి ఆర్య ధర్మమును సంస్కృతిని రక్షించుట వారి ప్రధానాశయము. దానికి నడుము కట్టుకొనినవారు హరిహర బుక్కరాయలులు. వీరు సంగమ నాయకుని కుమారులు. వీరి వంశము సంగమ వంశ మయినది. హరిహర రాయలు హైందవ వీరుల నందరిని కూడ కలుపు కొనెను. పరాక్రమించి తన యుద్యమము సాగించెను. తురక సేనలకు నిరోధమయి నిలిచెను. కృత కృత్యు డయ్యెను. అతడు విజయనగర రాజ్యమునకు మొదటి యధినేత. వాని జీవిత మంతయు తురకల నరికట్టి తన రాజ్యమును చక్కబెట్టు కొనుటయందనే సరిపోయినది. వాని తరువాత బుక్క రాయలు రాజ్యమునకు వచ్చెను. హరిహర రాయల కాలము నందు కొండవీటి రాజ్యమును కోమరగిరి వసంత రాయలు పరిపాలించు చుండెను. అతడు లలిత కళా ప్రియుడు. నాట్య మాతని కభిమాన విద్య. వాని రాజ్య కాలమున శ్రీనాథుడు కొండవీటి యందుండెను. అప్పటి కాతడు మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, శృంగార నైషధము, హర విలాసము వ్రాసెను.

చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్న యౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్ష నైషధ కావ్య మాంధ్రభాష

అని శ్రీనాథుడు వ్రాసికొనెను. ఆ యా గ్రంథము లంకితములను బట్టి శ్రీనాథుడు యౌవనము కొంత యంతరించునంత వరకు కొండవీటి యందుండెనని తెలుచున్నది. కుమారగిరి వసంత నరపతి క్రీ. శ. 1382 మొదలు 1399 వరకు కొండవీటిని పరిపాలించెను. విజయనగరమును బుక్కరాయల తరువాత రెండవ హరిహర రాయలు రాజయ్యెను. అతడు పరాక్రమశాలి. కన్నడ మైసూరు తిరుచునాపల్లి, కంచి చెగల్పట్టులను జయించెను. మహారాజ బిరుదము దాల్చెను. ఈతడు క్రీ. శ. 1379 మొదలు 1401 వరకు రాజ్య మేలెను. అప్పటికి కొండవీటి రాజ్య వైభవము అంతరించినది. శ్రీనాథుడు పాదు కదలిన తీగ వలె నిట్టట్టు సంచారము గావించెను. అనేక మంది రాజుల యాస్థానములందు ప్రవేశించెను. వారిని తన కవితచేత మెప్పించెను. గౌరవములను పొందెను. ఈ కాలమున నా మహాకవి వ్రాసిన గ్రంథము లంతగా కనిపించవు. పలనాటి వీర చరిత్ర యీ కాలమునందు రచించి యుండ వచ్చును. ఈ సంచారము పాతికేండ్లు సాగినది. క్రీ. శ. 1426 మొదలు 1450వ సంవత్సరము వరకు రాజమహేంద్రవరమున వేమారెడ్డి వీరభద్రారెడ్ల యాస్థా

నమునందు కవియై కుదురు కొనెను. ఆ కాలమునందు రెండవ దేవ రాయలు విజయ నగరమును పరిపాలించు చుండెను. అప్పుడు శ్రీనాథునకు అరువది యైదేండ్లుండ వచ్చును. ముదిమి తల చూపినది. అలవాటు పడిన కాలూర కుండ లేదు. అంత వరకు శ్రీనాథుడు కాలు మోపనిది విజయ నగరము. శ్రీనాథుడు రెండవ దేవరాయలను దర్శించెను. వానికి ప్రౌఢ దేవ రాయలను నామాంతరము కలదు. వాని యాస్థానమున గౌడ డిండిమ భట్టు అను పండిత కవి గలడు. వానిది గౌడ దేశము. కంచు డిండిమము, ఢక్కా కల పండితుడు గావున డిండిమ భట్టని పేరు వచ్చెను. భట్టు అనునది బిరుదము. వాని యసలు పేరు అరుణగిరి నాథుడు. అతడు బౌద్ధుడగు తార్కిక పండితు డని వదంతి. అతడు కవి సార్వభౌముడు. వానికవిత సంస్కృతమును సంబంధించినది. డిండిమ భట్టుతో శ్రీనాథుడు తార్కిక వాదమునకు పూనుకొనెను. ఓడించెను. వాని కంచు ఢక్కా పగుల గొట్టించెను. తన కవితా శక్తిని ప్రదర్శించెను. తెనుగులోని తియ్యదనమును రుచిచూపించెను. ప్రౌఢ దేవరాయలను మెప్పించెను. ఆ మహారాజు పండిత సమక్షమున దీనార టంకాలతో శ్రీనాథుని తీర్థమాడించెను. కర్నాట కటక పద్మవన హేళి యని పించుకొనెను. కవి సార్వభౌమ బిరుద మప్పించు కొనెను. ఈ సందర్భమున శ్రీనాథుడు తన 'సంస్కృత కవితా పాటవమును గూడ కొంత ప్రదర్శించి యుండ వచ్చును. వాని కాలచట నిలువ లేదు. తిరిగి రాజమహేంద్రవరమునకు బయలు దేరెను. దారిలో రావు సింగ భూపాలుని కొలువు చొచ్చెను. క్రొత్త మోజు

దీనార టంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాల శాలఁ
బగులఁ గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
గౌడ డిండిమ భట్టు కంచు ఢక్క

యని రాజు ముందు తన ప్రతిభను చాటుకొనెను. సంగమ వంశీయులు క్రీ. శ. 1486 వరకు విజయ నగరమును పరిపాలించిరి. వారిలో కడపటి రా జసమర్థుడు. ఇంత వరకు గల సంగమ వంశీయులగు రాజులు సంస్కృతము నాదరించిరి. పేరుగల తెనుగు కవులను చేరదీసి పోషించి నటుల గాని కావ్యముల వ్రాయించి నటుల గాని కృతుల నందుకొని నటుల గాని యగుపించదు. క్రీ. శ. 1486 ప్రాంతమున నుత్తరము నుండి బహామిని సుల్తానును ఒరస్సా నుండి పురుషోత్తమ గజపతియు విజయ నగరము మీదికి దండెత్తి వచ్చిరి. చంద్రగిరి రాజులు విజయ నగర రాజులకు సామంతులు. సర్వ సేనాధి పతులు. ఆ కాలమున చంద్రగిరికి నరసింహ నాయకు డేలికయై యుండెను. అతడు సాళువ వంశీయుడు. వీరాధి వీరుడు. వైరి లోక భీకర మూర్తి. బహామనీ సుల్తాను నెదిరించి సమర రంగమునందు పరాభూతుని గావించెను. పురుషోత్తమ గజపతి నోడించి పారదోలెను. రాజ్యము వీర భోజ్యము. నరసింహ నాయకుడు కడపటి సంగమ రాజును తొలగించెను. విజయ నగరమున కేలిక యయ్యెను.

తిగుళ భూములు తెంకులుగఁ జరించిన ద్రోహ
　　　　చెవుల పోతుల నెల్లఁ జెండి వైచి
ఘన మైన కండ క్రొవ్వునఁ బాఱు తెంచిన
　　　　యొడ్డీని పెను లావు లూడఁ దన్ని
పటు తెంచి చక్కఁగఁ బాల దుర్గము మెట్టి
　　　　సుడివడ్డ చాపలఁ జుట్టు ముట్టి
పెనుఁగొండ కడ ప్రాలి పిక్కిళ్లు మొదలైన
　　　　ప్రతి పక్షులను హతాహతము చేసి

సత్కవుల త్రుప్తు తుల్చు వసంత వేళ
రాయ మిస్సర గండ ధరా వరాహ
విజయ విఖ్యాత గండ భూవిభు నృసింహ
సార్వ భౌముని బిరుదైన సాళువళంబు.

సాళువ నరసింహ నాయకుడు బహామనీ సుల్తాను గజపతిరాజు లాక్రమించు కొనిన రాజ్య భాగములను కలుపు కొనెను. విజయ నగర రాజ్యమును నలు ముఖములను విస్తరింప చేసెను. సార్వభౌమ బిరుదమును వహించెను. తెనుగు కవుల నాదరించెను. వారిలో పిల్లల మఱ్ఱి పిన వీరభద్రుడు పేరెన్నిక గన్నవాడు.

# 3

## పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుఁడు

పిల్లలమఱ్ఱి యింటి పేరు కలవా రందరు వైదికులు. కావున పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు వైదిక బ్రాహ్మణుడు. గద్యయందు గాదయామాత్య పుత్ర యని చెప్పు కొనుట చేత తండ్రి మంత్రి పదవియం దుండె నని యూహింప వలసి యున్నది. అది విపరీతము కాదు. ఇప్ప టికిని కరిణీకము చేయుచున్న వైదికులు గలరు. అమాత్య శబ్దము వృత్తి వాచకము. అది తరువాత రాను రాను నియోగులందు రూఢ మయినది. పిన వీరభద్రుడు నాగమాంబా గాదనలకు పుత్రుడు. పెద వీరభద్రుని తమ్ముడు. శివ భక్తుడు. వీరభద్ర పద పద్మ ధ్యాన శుద్ధాంత రంగుడు. కాశ్యప గోత్రమునందు జన్మించినవాడు. బిట్రగుంట ప్రాంతము లోని సోమరాజు పల్లె వీని నివాసము.

తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువన భాసుర కృతి ని
ర్మాతలు

అని చెప్పుకొనుటచేత సాహిత్య సరస్వతి వాని యింట ముత్తరముల నుండి పుట్టి పెరుగు చుండె నని తలంప వలసి యున్నది. ఈ కవి క్రీ. శ. 1486 ప్రాంతములోని వాడు. శ్రీనాథుడు క్రీ. శ. 1450 ప్రాంతమున మరణించెను. పిన వీరభద్రుడు విజయనగర సామ్రాజ్య మును క్రీ. శ. 1486 మొదలు 1495 వరకు పరిపాలించిన సాళువ గుండ నరసింహ రాయల కాలమునందు నివసించి యుండెను. కావున శ్రీనాథుని కీతడు కొందరు తలంచి నటుల సమకాలికుడు కాడు. శ్రీనాథుని పిన వీరభద్రు డెరుగడు. శ్రీనాథునిమరణ కాలమున నీతడు శైశవమునం దుండిన నుండ వచ్చును. పిన వీరభద్రుడు భారతీ తీర్థుల

శిష్యుడు. ఈ శిష్యత్వము శైవ మంత్రోపదేశము వలన ప్రాప్తించినది. పిన వీరభద్రుని మహిమలను గురించిన కథలు పెక్కు గలవు. అందు

జైమిని భారతము

ను గురించి మిగుల ప్రచారమునందున్న దొక కథ గలదు. సాళువ నరసింహరాయలు కొంత గడు విచ్చి జైమిని భారతమును తెనిగింపుమని పిన వీరభద్రుని శాసించెనట. పిన వీరభద్రుడు సరే యని యంగీకరించెను. ఆ కవి మరల రాజాజ్ఞానతిని తలంచలేదు. మొదటి నుండియు వీరభద్రున కిచ్చ వచ్చినటుల తిరుగుట యలవాటయినది. కలము పట్టలేదు. కాగితము విప్పలేదు. దినములు తరలి పోవుచుండెను. పెద వీరన పలు సారు లుద్బోధించెను. వాని మాట పాటించ లేదు పిన వీరభద్రుడు. గడువు దాపునకు వచ్చినది. అన్నగారు కృతిని గురించి మరల ప్రసంగించెను. తమ్ముడు లక్ష్యము చేయలేదు. ఒక దినము గడువులోనికి వచ్చినది. ఆ రేయి పిన వీరభద్రుడు తన పడక గది నలికించెను. ముగ్గులు పెట్టించెను. అన్నము తిని తలుపులు మూసికొని పక్కమీద పడుకొనెను. గుఱ్ఱు పెట్టి నిద్రపోయెను. నడి జామయినది. పెద వీరనకు కోపము ముంచుకొని వచ్చినది. తమ్ముని పడక గది గొళ్ళకు వచ్చెను. గాఢ నిద్రలోని గురక, చేతి గాజుల ఘలంఘల ధ్వనులు వినిపించినని. వానికి వింత తోచినది. తలుపు కంతలో నుండి గదిలోనికి చూచెను. ఒకయపూర్వ సురూపవతి యగు దివ్యాంగన చేతి రత్నమయ కంకణ ఘులంఘు లారావము లుప్పతిల గంటముతో తాళ పత్రముల మీద వ్రాయుచుండెను. తల యెత్తిన దా యంగన. అంతరంగమున సకలము గ్రహించుకొనినది. చేత గంటము విసరి వేసినది. అది రంధ్రము గుండ పెద వీరన కంటిలో పొడిచికొనినది. కన్ను పోయినది. బాధకు భరింప లేక పెద వీరభద్రుడు గొంతెత్తి విలపించెను. ఆ రోదనమున కింటిలోనివా రందరు లేచిరి. పిన వీరభద్రుడు కూడ మేలుకొనెను. తలుపు తెరచి

బైటికి వచ్చెను. అంతయు నెరింగెను. అన్నగారి యవివేకమునకు లోలోన చింతించెను. ఆమె సరస్వతి. నా రాణి. నీ మూలమున గ్రంథము పూర్తి చేయక యదృశ్యురా లయినది అని నుడివెను. అన్నగారి కన్ను మరల వచ్చు నటుల చేసెను. కొరత పడిన గ్రంథ మును బూరి గావించెను. సకాలమునకు రాజున కర్పించెను. ఈ సంగతి రాజునకు తెలిసెను. రాజు ప్రశ్నింపగా అవును వాణి నా రాణి యని సమాధానము చెప్పెనట. సాక్ష్య మేమి టని ప్రశ్నించినాడు రాజు. వాణి తెర మాటున నుండి కర కంకణ ఘులంఘు లారవము లొలయ సత్యము సత్య మని కర మెత్తి మృదు మనోహర వీణా కల కంఠ రవంబున వచించెను. రా జబ్బుర పోయి వానిని బహు ముఖం బుల నుతించె నట. పిన వీరభద్రుడు బ్రహ్మ యవతార మని లోకము నందు ప్రాకి పోయినది. కథ చక్కగా అల్లబడినది. కాని జైమిని భారతము చదివిన వారెవ్వరు దీనిని నమ్మరు. కొంత వివేకము కలవా రసలు నమ్మరు. పిల్లల మఱ్ఱి పిన వీరభద్రుడు

స్తుత్యముఁ గలి కల్మష రా
హిత్యము నాఖ్యాయికా విహిత బీజ చతు
స్సత్యము శ్రీహరి కథలను
నిత్యంబును నైన జైమినిజ భారతమున్

జంబూ ద్వీపములోన నెంతయుఁ బ్రశస్తం బైన దీని న్నట
ద్దంభూ కుండల జూట కోటర కుటీ ధృత్స్వర్ధునీ వీచికా
లంబి స్విన్న నవేందు కందళ సుధాలంకార వాగ్వైఖరిన్
జంబూ కావ్యము చేసెదన్ బుధ జన శ్లాఘా నిరాఘాటతన్

సాళువ నరసింగ మహీ
పాలుని నత్యంత ఘన కృపాలుని నసుహృ

త్పాలిత నగరీ పశ్య
త్ఫాలుని నా చేయు కృతికిఁ బతిఁ గావింతున్

అని ప్రబంధంబుఁ జెప్ప నుద్యోగించెను. సాళువ గుండ నరసింగ జన విభుండును పురాణేతిహాస కథా ప్రసంగంబుల వినోదించుచు

నా మది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్

ఆ పురాణంబు గనఁ దెనుఁ గయ్యె నేనిఁ
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేనిఁ
గుందనము కమ్మ వలచిన చంద మగును

అని సభాసదుల మొగంబులు చూచెను. వారు పిన వీరభద్రుడు మిగుల సమర్థు డని నుడివిరి. రాజు పిన వీరభద్రు నవలోకించి మామక మనోరథం బెఱింగి నట్లు చెప్ప నుద్యోగించితివి. ఆంధ్ర భాషను జైమినీ భారతమునం దశ్వమేధ పర్వంబు రచియింపు మని యానతిచ్చెను. పిన వీరభద్రుడు వ్రాయ నారంభించెను. ఇందు గడువు సంగతి లేదు. రాజున కంకితముగా దానే మొదట వ్రాయ నుద్యోగించెను. రాజు కోరికయు కవి కోరికయు నొక్కటయ్యెను. పిన వీరన సమర్థు డని సభ్యులు చెప్పగా నెరింగినాడు రాజు. అదివరకు వాని సామర్థ్యము రాజునకు తెలియదు. తెలియు నంత విధముగా శ్రీనాథ పెద్దనాదుల వలె రాజ సమ్ముఖమున కవిత ప్రదర్శించి యుండడు. నా ధనంబు ఋణముగాఁ దినక యుపార్జించె యశో ధన మని రాజు తలంపున కెక్క సభాసదు లెఱిగించిరి. దీనిని బట్టి కొంత కాలము నుండి యింత

వరకు తన ధనమును ఋణముగా పిన వీరన తినుచుండె నని రాజు తలంచిన మాట సత్యము. అసలే ముది మది తప్పిన మొదటి వేల్పును మగనిగా మెడ కట్టుకొని కవుల పరిహాసమునకు లోనయి కుములు చుండిన పలుకుఁ బూఁబోఁడి రాజు కొలువునందు చొరవ లేని పిన వీరభద్రుని వంటి కోడెగానిని వలచి నా మగడని చెప్పుకొనుట కభి మానము సిగ్గు లేనిది కాదు. పిన వీరనయు వాణి నా రాణి యని నుడువు నంతటి యవివేకియుఁగాడు.

ప్రణవ పీఠంబున మంత్ర పరంపరలు గొల్వ
నుండు నే దేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరా పశ్యంతి మధ్యమా
వైఖరు లే దేవి వర్ణ సరణి
జప హార కీర పుస్తక విపంచి సమంచి
తంబు లే దేవి హస్తాంబుజములు
కుందేందు మందార కందళీ బృందంబు
చంద మే దేవి యానంద మూర్తి

కాంచె నే దేవి కాంచన గర్భు చతుర
పూర్వ దంత కవాట విస్ఫుట మనోజ్ఞ
చంద్ర కాంత శిరో గృహ స్థల విహార
మమ్మహా దేవి వాగ్దేవి నభినుతింతు

నని చింతామణీ మంత్ర తత్త్వ రహస్యమును తదధిష్ఠాన దేవతా స్వరూపము నెఱింగిన సరస్వతీ మంత్రోపాసకుడు పిన వీరభద్ర సుకవి. మాతృ దేవతను భార్యగా చెప్పుకొను మూర్ఖుడు కాడు. పై పద్యము నకు పెద్దనగారు రచించిన

చేర్చుక్కగా నిడ్డ చిన్న జాబిల్లి చే
సింధూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబునందున్న యెలఁదేఁటి
రుతి కించిదంచిత శ్రుతుల నీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ
దుంబీ ఫలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళి చ్ఛాయ దంతపు సరకట్లు
లింగిలీకపు వింత రంగులీన

నుపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీ కాసనమునఁ గూర్చుండి మదికి
నించు వేడుక వీణ వాయించు చెలువ
నలువ రాణి మదాత్మలో వెలయుఁ గాత

అను పద్యమునకును చాల తారతమ్య మున్నది. ఇందు మనస్సు రంజింపఁ జేయు కావ్య శిల్ప మున్నది. పై పద్యమునందు నిగూఢమగు మంత్ర శాస్త్ర మున్నది. ఇందు మేనుపొంగఁ జేయు శృంగార మున్నది. అందు చిత్తము పరవశింప జేయు పరమ భక్తి రస మున్నది. ఈ పద్యము నందలి మూర్తి లౌకికము. ఆ పద్యము నందలి రూపము పారలౌకికము. పెద్దన ఆత్మలో వెలయు గాత అనుటకును పిన వీరభద్రుడు అమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు ననుమాటలో కూడ భేద మున్నది. ఇది మాతృ భావన. అది కావ్య భావన. ఇట్లనుటచే పెద్దనకు భక్తి లేదని నా భావము కాదు. భావన లిరువురది యొక్కటే. ఇది మన స్సంకల్ప జన్యము. పిరనది శాస్త్ర నిర్దిష్ట రూపము. అదియు గాక వీరభద్ర కవి

మట్టి మాత్రంబె పిల్లల మట్టి పేరు
పేరు పలెఁ గాదు శారదా పీఠకంబు

అని నుడివెను. సరస్వతికి తన యన్వయము పీఠ మట. తాత తండ్రు లారాధించిన మూల దేవత వాణి. ఆమెను నా రాణి యని వచించె ననుట యవివేకము. కల్పించినను కోట కట్టినట్టు లుండ వలయును. సరస్వతి జైమిని భారతము రచించె ననుట యుట్టి యబద్ధము. 'అల వైకుంఠ పురంబులో' అను పద్యము రాముడు పూరించె ననుటలో గల సత్యము వంటిది. దేవతల కంత కంటె ఘన మయిన పనులు దివిజ లోకమున గలవు. పరతత్త్వ స్వరూపు లయిన దేవతలకు పోతన గారి కొరకు శ్రీనాథునకు విందు భోజనము లమర్చుటయును, పోతన గారికి భాగవతము వ్రాయుటయును కార్యములు గావు. గురువును జేయు బోయి కోతిని చేసి నట్లు కవులందలి యభిమానము కొలంది యిట్టి కథ లను మానవులు కల్పించి వారి ఘనతను కళంకితము గావించు చున్నారు. అందలి సత్యాసత్యముల నూహించుకొన లేక గ్రంథ స్థములు గావించి విమర్శకులు పాఠక లోకమును తబ్బిబ్బుల పాలొ నరించు చున్నారు. పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు సుకవి మంత్ర శాస్త్ర వేత్త శారదోపాసకుడు. వీరభద్ర పాద భక్తుడు. విద్వాం సుడు. నవరస దర్పణము, నారదీయము, మాఘ మాహాత్మ్యము, మాన సోల్లాస సారము మొదలగు గ్రంథములు రచించెను. పండితులకు వినిపించెను. జనులలో కీర్తి సంపాదించెను. సమర్థు డని పేరు వడ సెను. ఆ సంగతి సభలోని వారు రాజున కెఱిగించిరి. రాజు పిన వీర భద్రుని యుద్యమమునకు దోహద మొసంగెను. సాళువ నరసింహ భూపతి కంకితముగా జైమిని భారతములోని యశ్వమేధ పర్వము తెనిగించెను.

వ్యాస భారతములోని యశ్వమేధ పర్వమునందలి కథకును జై మిని భారతాశ్వమేధ పర్వమునందలి కథకును వ్యత్యాస మున్నది. వ్యాస భారతాశ్వమేధ పర్వమును తిక్కన నాల్గాశ్వాసములలో తెని గించెను. మొత్తము తొమ్మిది వందల అరువది నాల్గు పద్యము లున్నవి. పిన వీరభద్రుని జైమిని భారతాశ్వమేధ పర్వము ఎనిమి

దాశ్వాసముల గ్రంథము. మొత్తము పదమూడు వందల తొంబది యేడు పద్యము లున్నవి. వ్యాస భారతములోని శ్రీకృష్ణు డర్జునునకు చేసిన తత్త్వోపదేశము ఉదంకుని కథ మృత జాతుండయిన పరీక్షితుని శ్రీకృష్ణుడు బ్రతికించుట మొదలగునవి జైమిని భారతమునందు లేవు. వీనిని తిక్కన ప్రథమ ద్వితీయ తృతీయాశ్వాసములందు నాలుగు వందల యెనుబది పద్యములలో తెనిగించెను. జైమిని భారతమునందలి ద్వితీయాశ్వాసము లోని భీమాదులు మఖాశ్వముకొఱకు యౌవనాశ్వ మహీపాలునితో పోరుట గాని ఆరవ యాశ్వాసములోని రాము కథ గాని తిక్కన భారతమునందు లేవు. ధర్మజుని కడకు వ్యాసుడు వచ్చుటతో జైమిని భారతమందలి కథ ప్రారంభ మయినది. వ్యాస విరచిత మయిన భారతము వైశంపాయనుఁడు జనమేజయునకు చెప్పినట్లున్నది. జైమిని భారతమును జైమిని జనమేజయనరపాలునకు చెప్పెను. ఇది వీర రసము ప్రధాన మయిన కావ్యము. హాస్య కరుణ భక్తి రౌద్ర బీభత్స రసము లంగములు

గాంగేయుడు మరణించెను. ధర్మజుడు శోకాకుల చిత్తుండయి యుండెను. వాని యొద్దకు వ్యాసుం డరుదెంచెను. ధర్మరాజు వ్యాసుని గాంచి

సత్యవతీతనూభవ! నృశంసత భీష్మునిఁ గుంభజన్ము నా
దిత్య కుమారు నూఱక వధించితి రాజ్య రమా విభూతి కా
ధ్ధత్యముతోడతన్ సమర ధర్మము వీసర పుచ్చి వంచనా
కృత్యజ మైన యీ నిబిడ కిల్బిష మేమిటఁ జక్క నయ్యెడున్

అని ప్రశ్నించెను. అందులకు వ్యాసుఁడు

తురగ మేధంబుఁ జేసి కౌతుకముతోడఁ
గురు కులంబున సత్కీర్తిఁ గుదురు కొల్పు

మని నుడివెను. మఖమునకు గావలయు ధనము సమకూర్చుకొను నుపాయ మెరిగించెను.

పాటీర సీహార వర్ణము
హాటక పుచ్ఛమును నల్ల నగు చెవులు నిరా
ఘాట జవంబును నధ్వర
ఘోటక లక్షణము లివి

ఇట్టి యశ్వము యౌవనాశ్వ విశ్వంభ రాధిపు డేలు భద్రావతి పురమున నున్నది. దానిని దశాక్షౌహిణీ సైన్యంబు లనిశము సంరక్షించు చుండును. అది దక్కినేని నమ్మఖము సాగు నని నుడివెను. భీముడు దానిని తెత్తు నని ఘోర ప్రతిజ్ఞ గావించెను. తిక్కనగారి భారతమునందు

తురగ పరీక్షా విదులగు
పురుషులఁ బిలిపించి యశ్వ పుంగవుఁ గని తెం
డరయుఁడు మన కొదమలలో
నిరుపమ లక్షణముఁ గీర్తనీయంబునుగాన్

అని ధర్మజుండు నియోగించి నటుల గలదు. అట్టి తురగమును వారు తెచ్చి ధర్మజుని యెదుట నిలిపిరి. ఆ సమయమున శ్రీకృష్ణుడు కరిపురమునం దుండెను. జైమిని భారతమునందు వ్యాసుడు మఖవిధాన ముపదేశించి వెడలిపోయిన తరువాత శ్రీకృష్ణుడు వచ్చి నటులున్నది. పాండు తనయాగ్రజుడు శ్రీకృష్ణు నర్చించెను. అర్ఘాసనమున గూర్చుండ నియమించెను. ద్రౌపది

ఈవు మనంబునన్ మరచితే సభలోఁ దన చీర యొల్చుకోఁ
గా విడిపింప నందఱును గల్గియు నిర్దయులై కనుంగొనన్
హా వసుదేవ పుత్త్ర యన నక్షయ వస్త్రము లిచ్చి నన్ను ల
జ్జా వనరాశిలో మునిఁగి చావక యుండఁగ నుద్ధరించుటల్

అని శ్రీకృష్ణుని భక్త జన రక్షా పరతంత్ర మయిన బుద్ధిని దయా మయత్వమును బొగడినది. ఇందు పాండవుల యసమర్థతయు శ్రీకృష్ణుని భగవ దంశయు నిరూపించినది. తన కా దేవదేవుని పయి గల మహాపురాని భక్తి విశ్వాసములను వ్యక్తపరచినది. కాని

> ఆ సభ కేక వస్త్ర యగు నట్టి ననుం గొని వచ్చి నొంచు దు
> శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై తగు చేష్ట లేక నా
> యాసలు మాని చిత్రముల యాకృతి నున్న యెడన్ ముకుంద వి
> శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం బవియుం దలంపవే

యని తిక్కనగారు రచించిన పద్యముల లోని యా గంభీరత పినవీరభద్రుని పద్యమునందు లేదు. ద్రౌపది యభిమానవతి, పతివ్రత. శ్రీకృష్ణు డెంత తన కాప్తు డయినను పరపురుషుడు. అట్టివాని యెదుట సిగ్గు జార విడచి సభలోఁ దన చీర నొల్చుకోఁగా నని చెప్పుకొనుట కిచ్ఛగింపదు. అది యుత్తమ స్త్రీ స్వభావమునకు వ్యతిరేకము. తిక్కన గూఢముగా నా భావమును 'ఆ సభ కేక వస్త్ర యగు నట్టి ననుం గొని వచ్చి నొంచు' నని యనిపించెను. పాత్ర పోషణ కావ్యమునకు ప్రధానము. అందు భారతము సామాన్య మయిన గ్రంథము కాదు. ఆమ్నాయ తుల్యము. ఆర్యుల ప్రమాణ గ్రంథము. ధర్మావబోధక మయిన కావ్యము. ప్రతి పాత్రయు నతి నిపుణతతో నిర్వహింప వలయును. అట్లు కానిచో ధర్మ వ్యతిరిక్తత వాటిల్లును. పాత్రల ఘనత నశించును. కావుననే తిక్కనగారు తూచినట్లు 'నొంచు' నని బహ్వర్థ ద్యోతకముగా వాడెను. ఆ పదములో ద్రౌపది యభిమానము స్త్రీ సహజమగు లజ్జ గంభీర స్వభావము గోచరించును. తిక్కన సమయ స్ఫూర్తి కలవాడు. ఏ పదము నెక్కడ ఎట్లు వాడవలయునో యెరిగిన మహాకవి. నన్నయ తరువాత ఈ విషయమున నాతనినే వచింప వలయును. అతి డనుభవ శాలి. పాత్రల చిత్త వృత్తులు తొంగి చూడ గలవాడు.

కావుననే 'ఈ యేవురు చూడగా సభకు నీడ్చె' నని వ్యంగ్యాత్మకముగా పతుల యసమర్థతను బయట పెట్టినది. అది వారి మనస్సులకు నొవ్వొదవింపని మాట. అయినను అందొక విధముగా కోపము ముప్పిరిగొన్న పరిహాస మున్నది. దెప్పిపొడు పున్నది.

దు

శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై తగు చేష్ట లేక నా
యాసలు మాని చిత్రముల యాకృతి నున్న యెడన్

అన్నది. పిన వీరభద్రుడు వచించి నటుల పాండవులు ద్రౌపది యెడ నిర్దయులు గారు. ఆమెయందు గౌరవాదరములు గలవారు. తిక్కన అసంభ్రములై యని వాడుటలో ద్రౌపది పతుల ధర్మపరత సూచించినది. అసంభ్రములయి అనగా వేగిరపాటు లేని వారయి అని యర్థము. వేగిరపాటు లేక పోవుట ధర్మ బద్ధు లగుటచేతనే యని భావము. వారి పరాక్రమ మాయెమెఱుంగును. ధర్మజు డను ఆలానమునకు కట్టివేయబడినవాడు భీముడు. అతడు విజృంభించిన కౌరవులే కాదు దేవతలైన నెదిరి నిలువ లేరు. ధర్మ బద్ధు లగుటచేతనే తగు చేష్ట లేక పోయిన వారయిరి. ఇందు తగు శబ్దము నిరర్థకము కాదు. నన్ను విడిపించుటకు తగిన పరాక్రమంపు చేష్ట యని యర్థము. నా యాసలు మాని యనుటలో నన్ను విడిపించు నాసలు మాని బొమ్మల వలె దుశ్శాసనుని చూచుచుండి రని భావము. ఇది లోక సహజము. ఒకడు చెడు కార్యమును చేయు చున్నపుడు ఉత్తము డగువాడు ఆ కార్యము వంక చూడడు. నిర్ఘాంత పోయి యా పనిని చేయువాని వంక కోపమున రాపడి చూచు చుండును. వాల్మీకి క్రౌంచము నేసిన కిరాతుని చూచి వాని ఘోర కార్యమునకు శపించెను. క్రౌంచము మరణావస్థ చూడలేక పోయెను. కావున రామాయణమున నిహత మయిన క్రౌంచము స్థితిని వర్ణింపలేదు. అట్లే వలువ లొలుచు దుశ్శాసను వంక పాండవులు చూచుచు కను లప్పగించి యూరకుండిరి. ఇట్టి ద్రౌపది ధర్మ నిరూపణ యందు నంతర్గత మయి దెప్పి పొడుపులేక పోలేదు. నను విడిపించు

టకు ప్రయత్నము లేక నాయం దాసలు విడిచిపెట్టి బొమ్మల వలె కన్ను లప్పగించి దుశ్శాసను చూచుచుండిరి పాండుపుత్రు లని నిందించి నటుల నర్థము వచ్చును. తిక్కన రచనలోను భావ ప్రదర్శనములోను పాత్ర పోషణలోను సిద్ధహస్తుడు. తరువాతి పాదమున విశ్వాసము అనునది ప్రాసకొరకు వాడినది కాదు. తప్పక పరమేశ్వరుడు తన్ను కష్టము నుండి గట్టెక్కించు నను విశ్వాస ముండి సేవించిన వానినే దైవము రక్షించును. గజేంద్రు డట్టి విశ్వాసముతో గొలిచెను. భగవంతుడు వానిని రక్షించెను. అట్లే ద్రౌపది కొలిచినది. ఆమె కక్షయ వస్త్రము లిచ్చినాడు శ్రీకృష్ణుడు. తిక్కనగారు కృష్ణుని ముకుందుడని సంబోధింప చేసినారు. వీరభద్రుడు వసుదేవ పుత్ర యని సంబోధింపజేసినాడు. ఈ సంబోధనలయందు సైతము భేద మున్నది. ముకుందుడు అనుటచేత కృష్ణుడు విష్ణువని నిశ్చితార్థము నిరూపింప బడినది. వసుదేవ పుత్ర యనుటలో ఆ యర్థము రాదు. తిక్కనగారి ప్రతి పదములో బహుళ మగు భావము ఇమిడి యున్నది. ఏంగయా దా నైదుస్ఫూర్తి కానరాదు. అట్లనుటచేత నా కవి తక్కువ వాడని నా అభిప్రాయము కాదు. తిక్కన కవితకు పిన వీరభద్రుని కవితకు గల తారతమ్యము చూపుటయే నా అభిప్రాయము. తిక్కన రచనలో నర్థ గాంభీర్యము మెండు. దానిని దేశీయములగు పదములలో చాల వరకు పొందు పరచుటకు ప్రయత్నించును. అందు పొసగ నప్పుడు తత్సమ పదము లుపయోగించును. అవి యంతము వలె దేశీయములతో పొందుకొని యుండును. కావున వాని కవితయందు దేశీయ అచ్చిక వైకృతముల నడుమ తత్సమ పదములు మిల మిల లాడుచుండును. పిన వీరన కవితలో తత్సమ వైకృతాదులు సమానముగా కలయ కలిసి యుండును. తిక్కన కవిత నిస్తరంగ మయిన పద్మాకరము. అందు పరికించి చూచినచో మానవ ప్రతిబింబము చిత్త స్వభావములతో పరిస్ఫుటముగా గోచరించును. అందులకు ద్రౌపది పాత్ర ప్రమాణము. అందు స్త్రీల సహజాభిమానము తెగువతనము గోచరించును.

పిన వీరన కవిత యతి వేగముగా ప్రవహించు కొనిపోవు సెలయేటి నీటి ధార. ఆ వేగము పాఠకుని స్వాంతము మరపింప జేయును. అందు పదాలంకారము లందము మనోహరముగా కనిపించును. ధర్మరాజు

వ్యాస మునిపుంగవు నానతి నశ్వమేధమున్
దలచితిఁ జేయ నిశ్చయతఁ దత్ఫల కర్తవు నీవ కావునన్

అని శ్రీకృష్ణునితో ననెను. అంతట శ్రీకృష్ణుడు భీముని గాంచి నవ్వుచు

మంద మతియు బహ్వాశియుఁ
దుందిలుఁడును రాక్షసీ రతుఁడు నిష్ఠుర వా
క్సందర్భుఁడు నగు మారుత
నందను సచివతఁ బ్రయోజనములు ఫలించున్

అని సమాధానము చెప్పెను. అది ఛలోక్తి. శ్రీకృష్ణుని మాటలలో నసత్యములేదు. మిగిలిన సంగతు లెట్లున్నను భీముడు నిష్ఠుర వాక్సందర్భుడు. అది వాని స్వభావము. శ్రీకృష్ణుడు రాయబారమునకు బయలుదేరెను. ధర్మరాజు సంధి కైదూళ్ళిచ్చిన చాలు ననెను. భీము డన్న మాటకు సమ్మతించెను. కృష్ణునకు సంధి యిష్టము లేదు. అతడు నీతి విద్యా విశారదుడు. ఘటనాఘటన సమర్థుడు. విన్నాడు భీమ ధర్మరాజుల మాటలు. ఆలోచించినా డుపాయమును. భీముని స్వభావ మతఁ డెరుఁగును. వానిని రెచ్చకొట్ట వలయును. తన తలంపు నెరవేర్చుకొన వలయును.

వెఱ పెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీ యట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్

ఆ నవ్వులో కొంత పరిహాసము కొంత చనువు కొంత వెక్కిరింతయు నున్నది. అసలు భీముడు ముక్కోపి. వానికి నొడలు మండినది. ఉద్రేక మొదవినది.

ఏమిరా పార్థుఁడు నీవు దండి మగలై యీ వచ్చు కౌరవ్య సం
గ్రామ క్షోభము బాహు దర్పమున దీర్పన్ బెద్ద మిష్టాక్కమి
మ్మెల్లన్ వెఱగంది చూచెదముగా శీ సారెకిం బోయిరా
భీముం డిత్తరి రిత్త మాటలకుఁ గోపింపండు సూ పెంపఱన్

అని సమాధానము చెప్పినాడు భీముడు. శ్రీకృష్ణుని మాటలు మండు చున్న అగ్నిలో నాజ్యము పోసి నట్లయినది. భీముని మాటలలో కొంత అసూయ నిర్లక్ష్యము నిష్టురత గోచరించును. ఇట్టి సంభాషణ శ్రీకృష్ణ భీముల కొక పరిపాటి అయినది. భీమునివలన కార్యము సాధింప చేయ తలంచి నపు డెల్ల శ్రీకృష్ణుని పలుకు లీరు లింగ్లుండును. ఆట్లే అశ్వమును గొని తేఁ నరుగు భీమునితో శ్రీకృష్ణుడు పై విధమున బల్కెను. అందులకు భీముడు.

అనఘ నీ వానతిచ్చి నట్లు మిగులఁ
దుందిలుండను బహ్వాశి దుష్టరాత్మ
నీ రతుండను నగుదుఁ జర్చించి చూడ
దేవరకు నట్టి గుణములు లేవు గాన

మొదల నత్యంత కాముకుఁడ వౌటకు గొల్ల
యిల్లాండ్ర గుబ్బ పాలిండ్లు సాక్షి
యతి నీచ రతి శీలి వగుటకుఁ బాకీన
కమఠ సూకర విగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండ కోట్లును
బూరింప లేని నీ బొజ్జ సాక్షి
స్త్రీలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము లెఱుంగ
ధరకుఁ దెచ్చిన వేల్పు తరువు సాక్షి

జడ సముత్సాహి వగుటకు జలధి సాక్షి
వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి

మంద మతి వౌట నది మరపొందెఁ గాక
సరవి పేర్కొనఁ దరమె నీ సటలు కృష్ణ!

అని జవాబు చెప్పెను. ఎంత చక్కని సమాధానము. దానిలో సర సత్వము శ్రీకృష్ణుని పరతత్త్వ నిరూపణము భీముని పరిజ్ఞానము నిమిడి యున్నవి. జైమిని భారత మలభ్యము. అందే విధముగా నున్నదో తెలియదు. జైమిని భారత మంతయు రచించె నని వాడుక యున్నది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కాలమున కది అశ్వమేధ పర్వ మాత్రావ శేషమయినది. ఇప్ప డదియు కానిపించదు. తిక్కన సీసపద్య రచనకు పిన వీరభద్రుని సీసపద్య రచనకు భేద మున్నది. పినవీరన సీసము నాల్గు పాదములు తూకము తప్పక నొక్క రకముగా నడచును. ఇంకొక పద్యము

భేరుండములు ప్రక్కఁ బెట్టి చన్నుల పూరి
పాటించి శరభ డింభముల కిచ్చు
శరభముల్ శయనించి హర్రి కిశోరములను
బొదుగుల పాలిచ్చి నిమర పుచ్చు
నీనిన సింగంబు లేనిక లేఁజూళ్లు
గుడువ మై నాకుచుఁ గు స్తరించుఁ
లేడి పిల్లలకు బాలెంత చివ్వంగులు
పంకంబు లిచ్చుచుఁ బంచితిల్లు

బకములు గప్పి పసిపాప పాములకును
మేపు లొసఁగి రక్షించు నెమిళ్లు పిల్లు
లెలుక బోదలఁ బ్రోలు' జన్నిచ్చి యచటి
జంతు నివహంబు జాతి వైషమ్య ముడిగి

ఇది సౌబరి యాశ్రమ వర్ణనము. ఇట్టి రచన శ్రీనాథుని సీస పద్యములలో కనిపించును. సీస పద్యపు పోకడ చివరి గీతములోనికి కూడ నడిపించుట పిల్లల మఱ్ఱి పిన వీరనయందు కనిపించు చున్నది. శ్రీనాథుని గీతము లిట్లుండవు. తరువాతి కవులు పిన వీరన ననుక

రించిరి. భీముడు తన సమాధానమునందు శ్రీకృష్ణుడు సకల ప్రపంచ ములు తన బొజ్జయందు దిమిడించుకొనిన పరబ్రహ్మ స్వరూపుం డనియు ప్రళయ కాలమున జలధియందు శయనించి యుండు నాది నారాయ ణుం డనియు మత్స్య కూర్మ వరాహ వామన నాద్యవతారము లెత్తిన మహానుభావు డనియు నొక విధముగా నుతించెను. ఒక విధముగా సరస వచన రచనా విధానముచేత పరిహాసము. ఇది స్తుతి గర్భిత మయిన వేళాకోళము. ఇందు భక్తి, చుట్టరికంపు చనవు గోచరించుచు. తిక్కనగారి పద్యములోని దుడుకు తనము నిష్ఠురతయు లేవు. ఇది భీమునియందు కలిగిన విచిత్ర మగు మార్పు అనవలయును. భారత ఘోర యుద్ధమునందు శ్రీకృష్ణుని మహిమ ప్రభావాదికము లను గన్నారగ జూచినాడు భీముడు. కౌరవ సభయందు విశ్వ రూప ప్రదర్శ నాదికము లను గురించి వినినాడు. కృష్ణుని యెడ తొంటి తలంపు మారి పోయినది. దేవదేవుం డాపరమ పురుషుం డను నమ్మకము పొడమినది. పాండవులు కౌరవ సేనా సముద్రమును తరించి విజయము సాధించు టకు శ్రీకృష్ణుని సహాయ సంపద యను భావము దృఢముగా పాదు కొనినది. కావుననే

బహు విచార పిపాసార్త పాండు పుత్ర
చాతకముల కకాల వర్షంబ వైతి
విమత జనులకు నంగార వృష్టి వైతి
నీవు వేంచేసి నీరద నీల వర్ణ

యని సవినయముగా బలికెను. వేంచేసి యను శబ్దమునందే భీముని యనంత మగు భక్తి ద్యోతక మగుచున్నది. పై పద్యమునందు రూప కాలంకారము కలదు. చాతకము పిపాస తీర్చుటకు మేఘు మొక్కటియే సమర్థ మయినది. పాండవుల విచార మెడబాపుటకు నీరద నీల వర్ణుండగు శ్రీకృష్ణుం డొక్కడే సమర్థు డని భీమునకు తెలిసినది. అందు మూలమున

పంక నిర్మగ్న మగు గోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకుని మాడ్కి
ముదము దైవార నుద్ధరింపుదువు గాక
పంక నిర్మగ్ను నన్ను గోపాల తిలక

యని యర్థించెను. తాను పూనినది ఘోర మగు ప్రతిజ్ఞ. చేయబోవు నది అసాధ్య మగు కార్యము. భద్రావతీ విభుండగు యౌవనాశ్వుడు వీరాధివీరుడు. వానిని జయించుట సామాన్యము కాదు. తాను పంక నిర్మగ్న మగు గోవు వలె నుంటి నని భీముడు గ్రహించెను. గోవులను గోపాలు డిక్కటుల నుండి రక్షించును. శ్రీకృష్ణుడు గోపాల తిలకుడు. కావున నన్ను రక్షించుటకు నీవె కలవని భావము. ఇం దుపమాలం కారము కలదు. భీముడు మఖాశ్వమును తెచ్చుటకు కర్ణ నందన మేఘవర్ణులతో బయలు వెడలెను. అంతటితో ప్రథమాశ్వాసము ముగియును. భారత రామాయణములు ఆర్యుల

భారతీయ సంస్కృతి

సాంఘిక ప్రవృత్తులను ప్రతిబింబింప చేయు నద్దములు. రామా యణ మొక మహాకావ్యము. అందు సాంఘిక ప్రవృత్తి పాలలోని జలము వలె కవితా శిల్పము నందు సమ్మిళిత మయి యున్నది. కావున నందు సాంఘి కాచార వ్యవహారములు పాఠకులకు దృగ్గోచరములు గావు. ప్రత్యేకించి విమర్శన దృష్టితో చూచిన గాని హృదయ గత ములు గావు. భారత మట్లు గాదు. అందు భారతీయులగు నార్యుల సాంఘిక రాజకీయ నైతిక ఆర్థిక ప్రవృత్తులు స్పష్టముగా నగుపించును. జైమిని భారతము వ్యాస భారత మడుగు జాడలలో నడచినది. అందందు కొలది మార్పు లుండిన నుండ వచ్చును. కథలో తారతమ్యము లేదు. కవితాశిల్పముతో జతకూర్చి సాంఘిక వ్యాపారములు ప్రదర్శింపబడినవి.

శీముడు భద్రావతీ పురమునుండి అశ్వము తెత్తునని ప్రతిజ్ఞ గావించి నాడు. అట్లు తేకున్నచో

వేద ఘోషణ లేని వీట నున్న యతండుఁ
దల్లి దండ్రులకు రెండు దలఁచు నతఁడు
నూరు వాడని నూత నీరు గ్రోలు నతండు
భూసు రావళితోడ బొంకు నతఁడు
నిటలాక్షు గుడి లేని కొటిక నున్న యతండు
నిల్లరి ధన మిచ్ఛ యేచు నతఁడుఁ
దగిలి విశ్వాస పాతకముఁ జేసి నతండు
శివ చింతఁ జెవి చెంతఁ జేర్ప నతఁడుఁ
బోవు గతికి నవశ్యంబు పోదు ననుచు
శపథములు పల్కి

నాడు. దీనియం దార్యుల దేశ వ్యవహారములు తెలుపబడినవి. వేదము భారతీయుల కనాది యగు మత గ్రంథము. దానిని అధ్యయనము గావించువారు బ్రాహ్మణులు. వారు భారతీయ వాఙ్మయమును సంస్కృతిని రక్షించుచు వచ్చిన యగ్రజన్ములు. వారితో పాటు వేదములు ప్రవర్తిల్లు చుండును. వేదము లనుటచేత వేదములు ఉపనిషత్తులు వేదాంగములు కూడ పరిగ్రహింప వలయును. వేద ఘోష లేని యనుటవలన బ్రాహ్మణులు కాపుర ముండని యని యగము. బ్రాహ్మణులు వేద కర్మాచరణులు. వెద కర్మలు దేవతా ప్రీతికొఱకు లోక హితమును గోరి చేయుదురు. అందుమూలమున వర్షాదికములు కలుగును. సస్య సమృద్ధియు దేశమునందు శాంతి భద్రతలు వాటిల్లును. కావున బ్రాహ్మణులు గ్రామమునందు తప్పక యుండవలయు నని ఆర్య మతము. బ్రాహ్మణులు లేని యూరు మాలవాడతో సమానము. అందుండ రాదు. ఉండుట మహాపాప మని ఆర్యుల నిర్దేశము. కావుననే భద్రావతీ నగరమును జైమిని భారతమునందు

పంబిన వేద ఘోషణల భాషణముల్ వినరాక హోమ ధూ
మంబులు గ్రమ్మి కార్కొనిన ఖమార్గము గానఁగనీక యూప సం
ఘంబుల సందడిన్ నడువఁ గాద్దెరు వైనను లేక సాధు ర
మ్యంబును శత్రు భీషణమునై పుర మెప్పుచు నుండు నెప్పుడున్

అని వర్ణించెను. అట్టి వేద ఘోషగల పట్టణములందు ధర్మము ప్రవర్తిల్లు చుండును. ప్రజలు దయా సత్య శౌచములు గలవారగు దురు. అందు మూలమున సకల దేవతలు వారెని గాపాడు చుందురు. ధర్మో రక్షతి రక్షితః. కావున నట్టి నగరములు శత్రు భయంకరము లయి యుండునని పై పద్యములోని యభిప్రాయము. లంకా పురము దైత్యు లకు నివాసము. అందు నిరంతరము వేద ఘోషలు ప్రవర్తిల్లు చుండెను.

శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షో గృహేషు వై
స్వాధ్యాయ నిరతాం శ్చైవ యాతుధానాన్ దదర్శ సః

అని రామాయణము. విన్నాడు రాముడు హనుమంతునివలన ఈ మాటలు. లంకను జయించుట కష్టసాధ్యమని తలంచెను. నిస్పృహ వహించెను. దీనిని పట్టి ఆర్యులనగరములు బ్రాహ్మణులకు నివాసమయి నిరంతరము వేద ఘోషలతోడను వేద కర్మలతోడను నిబిడములయి యుండెడి వని తెలియుచున్నది. అంగా దంగా త్సంభవసి. తండ్రి ప్రతి అవయవము నుండి కుమారుడు జన్మించును. తన జన్మమునకు కారణ భూతు లయిన తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవములు. మాతృదేవో భవ. పితృదేవో భవ. మాతాపితృ సేవవలన నిహ పర సౌఖ్యములు గలు గును. దివ్య దృష్టియు వాటిల్లును. అందులకు భారతములోని ధర్మ వ్యాధుని కథ తార్కాణము

జన నుత నీరు నా జననియు జనకుండుఁ
జూావె వీరలకు శుశ్రూష సేసి
యిట్టి పరిజ్ఞాన మేను బ్రాపించితి
నమరులఁ బూజింతు రర్థి నెల్ల
వారును నొందు దైవంబుల నెఱుఁగ నీ
వృద్ధులు నాపాలి వేల్పు లనుచుఁ
గమనీయ ఫల పుష్ప గంధ భూషణ వస్త్ర
ముల మనోహార భక్ష్య భోజ్యములను

వీరి కెపుడు నివేదింతు వేడ్కఁ బుత్ర
దార సహితుండనై నియతముగ సేవ
యాచరింతును వేదముల్ యజ్ఞములు వ్ర
తంబులును వీర నాకను తలఁపు దృఢము.

జనని జనకుఁడు సద్గురుఁ డనలుఁ డాత్మ
డనఁగ నివ్వేవురును నే గృహస్థు చేత
సుగతి వాంఛఁ బ్రసాదితు లగుదు రట్టి
వాఁడ చూావె ధర్మాత్ముండు వసుధ మీఁద

అని ధర్మవ్యాధుఁడు తన తలిదండ్రులను జూపి కౌశికునకు బోధించెను. 'నీ యధ్యయనమ్మును సుకృతాయాసము నిష్ఫలములై చను గురుసేవాయుక్తి లేక తక్కన' నని నుడివెను. ఇది ఆర్య ధర్మము. అన్య సంప్రదాయము. పితృ హితం బాచరించి భీష్ముడు స్వచ్ఛంద మరణము పొంద గలిగెను. తల్లిదండ్రులకు ద్రోహము తలంచువారికి రౌరవము తప్పదు. పాడుపడిన నూతియందలి నీరు త్రాగుట పాపము. భూసురావళితో బొంకుట నరక హేతువు. అసత్య మాడరాదు. 'వైవాహికములందుఁ జకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు ప్రాణ విత్త మాన భంగమందు బొంక వచ్చు' నని శుక్ర నీతి. అది బ్రాహ్మణులతోఁడి

కాదు. కావుననే బలి వామనునితో బొంక నిచ్చగింపలేదు. 'నిరయం బైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దుర్మరణంబైనఁ గులాంతమైనఁ దిరుగ న్నేరదు నాదు జిహ్వ' యని శుక్రునకు బలి సమాధానము చెప్పెను. హరి వాని నేమియు చేయ లేక పోయెను. పాతాళ రాజ్యమున కధిపతిని గావించెను. ఆడి బొంక కుండుట ఆర్య ధర్మము. ధర్మరాజు 'అశ్వత్థామ హతః' అని బొంకెను. యమలోకము దర్శింప వలసి వచ్చెను. శివు నాలయము ప్రతి పల్లెయం దుండ వలయును. శివ చింత ప్రతి మానవు డొనరింప వలయును. అది మోక్ష సాధనము. 'శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః' హరి హరుల కభేదము. హగు డనుటచేత హరినిగూడ పరిగ్రహింప వలయును. వారు పరతత్త్వ స్వరూపులు

(శ్రీ)విష్ణు పద భక్తి చిత్తంబులో లేని
వానికి శుభములు లేని పగిది

శంకరునిఁ బూజ సేయని పంక మతికి
గురుత రైశ్వర్య మొదవని సరణి

అని భీముడు వృషకేతునితో ననిన మాటలవలన నీ భావము పరిస్ఫుటమగు చున్నది. అదియే పోతనగారి యీ క్రింది పద్యమునందు గోచరించును.

చేతు లారంగ శివునిఁ బూజింపఁ డేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నొడువఁ డేని

మహామతులకు శివ కేశవుల యెడ భేద బుద్ధి జనింపదు. శివ శబ్దముతోడి కేశవ నామమును కేశవ నామమువలన శివుని రూపము వారి యెడదకు స్ఫురించును. ఇది తత్త్వవేత్త లగు బ్రహ్మ విదుల భావము.

దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ జేని
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు

అని భాగవతము. ఇవి యార్య ధర్మములు. ఆర్య ధర్మములే కావు ప్రపంచ ధర్మములు. వీని నే పాశ్చాత్యుడు కూడ కాదన లేదు. మత భేదములచేత దేవుని నామములు మారవచ్చును. బ్రాహ్మణుల బదులు మత ప్రోక్తలు రావచ్చును. దేవ గృహములు ప్రార్థనా మందిరములు గావచ్చును. ఇవి ప్రపంచ మంతయు నంగీకరించిన సత్యములు. పాశ్చాత్య దేశములలో పల్లె పల్లెయందు శైవ మందిరము లున్నవి. అందు మత బోధకులు గలరు. వారు తమ బైబులు గ్రంథమును చదివి బోధించు చుందురు. విలేజి ప్రీచరు చదివినవారి కది బోధ పడగలదు. దయా సత్య శౌచములు మాతా పితృ భక్తి ప్రతి వారికిని నవశ్య మనుష్ఠేయము లగు ధర్మములు. వానిని ప్రధానముగా దృష్టియం దుంచుకొని భారత రామాయణములు రచింప బడినవి. కావుననే యవి సర్వ మానవుల కాదర్శ గ్రంథము లయినవి. వాని ప్రతీతి ప్రపంచమునం దంతటను వ్యాపించినది. ఖండ ఖండాంతరము లందు ఆర్య సంస్కృతి. వినుతి పాత్రమయినది. బహు భాషలలోని కవి తర్జుమా చేయబడినవి.

ఆర్యుల సాంఘిక ధర్మములు జైమిని భారతమునందు కలవు. అను సాళ్వుడు యాగాశ్వము నపహరించెను. 'అశ్వంబును నేన కొని తెత్తును. అట్లు కొని తేర నైతినేని బ్రాహ్మణీ గమనము సేయ గోరిన జఘన్యజుడున్ ఋతు వేళలం గుల ప్రమదఁ బరిత్యజించెడు దురాత్ముడు వోయెడు త్రోవఁ బోవుదున్' అని వృషకేతుడు ప్రతిజ్ఞ గావించెను. ఋతుమతి యైన భార్యను విడుచుట మహాదోషము. హంస ధ్వజుడు యాగాశ్వమును బట్టెను. అతని కుమారుడు సుధన్వుడు. అతడు యుద్ధమునకు సంసిద్ధుడయి భార్య యగు ప్రభావతిని చూడ

బోయెను. ఆమె నాటికి ఋతుమతియై పదునారు దినము లయినవి. అది కడపటి దినము. సుధన్వుడు ధర్మము తప్పఁ ద్రొక్కనివాడు. ప్రభావతి భర్తతో

తలపఁగ నేటిదాఁక ఋతు ధర్మము దాఁటవు గాన నీకు నేఁ
దెలియఁగ విన్నవించితి మదీయ మనోరథ కల్పవల్లిక
న్ఫలితము చేసి ప్రోమ్ము కదనంబున

కని నుడివెను.

రమణి తావక ఋతు వాసరములు పెక్క
గలవు గాని విరోధి నెక్కటి జయించి
నిలువ మఱి లేదు దివసంబు నేఁడు దక్క
సమర మొనరించి వచ్చి నీ చనవుఁ దీర్తు

నన్నాడు సుధన్వుడు

అనవుడు నేఁటి తోడఁ బదియారు దినంబులు నిండె ముందటన్
దినములు లేవు పైతృక తిథిన్ ఋతు దానము సేయఁ జెల్లు యా
మిని కడజామునన్ విను సమీరాకము చేసెద నంచు నిట్లు పో
వ నుచిత మానె నీ వెఱుఁగవా నిగమార్థ రహస్య ధర్మముల్

కలనికి రాక తక్క నని కాఁగిన నూనియ తొట్టి లోపలన్
దోలఁగక పట్టి శంఖలిఖితుల్ పడఁద్రోయుదు రంచు నాత్మలో
నలికెదు భ్రూణ హత్యకుఁ గృతాంతుని దూతలు చేయు బాధ లీ
కొలఁదులె మీఁద నంచు గిఱికొన్న మనోజ వికార వేదనన్

బలికినది ప్రభావతి. నిజముగా నీ పద్యములందు ఋతు ధర్మము మాటె ట్లున్నను గిఱికొన్న మనోజ వికార వేదన పద పదమునందుఁ దొణికిస లాడు చున్నది. ఈ పద్యములు చదువు నప్పుడు పాఠకునకు ప్రభావతి

ధర్మ పరత్వ బుద్ధియు మనోజ వికారమువలని పడుచున్న పరితాపము చివరి మాట కవి చెప్పక పోయినను స్ఫురించును. అది ఆ పదముల మార్దవములో రచనా విధానములో నున్నది. అదియే కవి ప్రతిభ పినవీరన వీర రసమునందు వలెనే శృంగార రస ప్రదర్శనమునందును నేర్పు కలవాడు ప్రభావతి మనోజ వికారి మామె సాత్వికతో నాగ నీయ లేదు

ఇందు నిభాస్య నాథుఁ జననీయక మంగళ భూషణ ద్యుతుల్
గ్రందుకొనంగ దగ్గఱి యురంబున బింకపు గుబ్బ చన్నులం
టం దమకంబుఁ గాఁకయు ఘనంబుగ మక్కువఁ జేర్చి కౌఁగిటన్
గందపు మ్రాఁకు తావి గొనఁగాఁ బెనఁగొన్న భుజంగి కైవడిన్

చక్కని శృంగార రస ప్రదర్శనము. శైవాల వల్లరుల చేత నా వృతంబ యిన సహస్ర దళ శోభితంబగు తెలిదమ్మి పూవు వలె నీ పద్యము వీర రస ప్రధానమయిన హంసధ్వజుని వీర గాథయందు నవకంపు వెలుగు సిరులను బరపించు చున్నది. ఇట్టి శృంగార రస పోషకము లగు పద్య ములు జైమిని భారతమునం దందందు గలవు. పై పద్యమందు పద పదంబు నను శృంగార రస పోషణము గావించినాడు కవి. ఆమె తాల్చినవి మంగళ భూషణములట. అవును ఇప్పటి వరకు నామె ముత్తైదువ. కావున నవి మంగళ భూషణములు. సుధన్వుడు రణమున మడియును. మంగళ శబ్ద ముచే భావి యమంగళము సూచించినాడు పినవీరన. లేనిచో ఆ మంగళ శబ్దమున కక్కడ స్థానము లేదు. నిరర్థకముగా పినవీరన పద ములను వాడువాడు కాడు. 'తమకంబుఁ గాఁకయు ఘనంబుగ కౌఁగిట చేర్చి' నదట ప్రభావతి భర్తను. ఇది సంసార స్త్రీల లక్షణము. కాఁక వారికి కామోద్రేకమువలన కలుగును. అది సాత్వికము

ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగ

లించిన వరూధిని యందీ వెచ్చతనమును విడిచిపుచ్చినాడు పెద్దన. పిల్లల మఱ్ఱి పిన వీరభద్రుడు మహా రసికుడు. మనోజ వికార వేదనమున పరితపించు యువతి కౌఁగిటిలోని నులి వెచ్చతనమును అనుభవించిన కళా విదుడు. పెద్దనగారికంటె రెండాకు లెక్కువ గ్రహించు కొనినాడు. ఆ కౌఁగిలింత వరూధిని కౌగిలింత వంటిది కాదు. అది సంపూర్ణ స్వాతంత్ర్యములేని పరపురుషుని యాలింగనము. ఆమె వేశ్య. ఆమెయందు ఉద్రేకమే కాని వెచ్చదనము శూన్యము. అందు ప్రవరుడు భిన్న ప్రవృత్తి కలవాడు. కావున దానిలో నదురు బెదురు నున్నది. ప్రభావతి సంగతి యట్లు కాదు. సుధన్వుడు భర్త. వానియందు తనకు సర్వ స్వాతంత్రము మాలిమి చనువు నున్నవి. తాను వచించినది ధర్మము. ఆమె వాదము శ్రుతి విహిత మయినది. ఋతుకాల మతిక్రమించినచో భ్రూణ హత్యా దోషము కలుగును. దాని ఫలితము నరకము. యమ దూతలు మిగుల బాధింతురు. ఇది వేదమునందు చెప్పబడిన సంగతి. అట్టి బాధ తన భర్తకు రారాదు. తన యభిమతము తీర వలయును. మాటలతో మనస్సు తీరదు. విడిచిన భర్త వెడలి పోవును. కావున 'గంధపు మ్రాఁకు తావి గొనఁగాఁ బెనుగొన్న భుజంగి కైవడిన్' మేను మేనితో నిండార కదియఁగ కదలకుండ పెః వేసి కొనినది. ఇంకేమి చేయ గలఁడు. మనోరంజక మగు నుపమానము. అలంకారము నుపయోగించినను తగినటుల సరిపోవలయును. తెచ్చి పెట్టినటుల లుండరాదు. తావి గొనఁగా ననుటలో నా యలంకార వికాస మిమిడి యున్నది. సర్పమునకు మంచి గంధపు వాసన వేయగానె మన స్సుద్రేకించి యొడ లంతయు వ్రేట్టి యినుమడించును. ఆ యుద్రేకమున కాగ లేదు. సర్పము బలము కొలంది యా మ్రాకునకు పెన వేసికొనును. ఇంక కదలదు, మెదలదు, పెరికినను రాదు. ఆ బిగువులో చెట్టు-గంటు పడునేమో యనిపించును. ఆ స్థితిని పొందినది

ప్రభావతి. ఆమె బాహు బంధములలో నడి సుదర్శను డేమి చేయ లేక పోయెను. 'జాతాస్వాదో వివృత జఘనాం కో విహాతుం సమర్థః' అన్నాడు కాళిదాసు. అసాధ్యుడా మహాకవి. రసిక శేఖరుడు

జననాథ సుతుఁడు కామిని
చనవులు చెల్లించి కాని చనరాం దనుచున్
దనిపె రతికేళి సప్తు డ
త్యనురాగముతోడ

కావున ఋతుకాలము నుల్లంఘించుటవలని భ్రూణ హత్యా మహా పాపము వాటిల్లు నని భారతీయుల సమ్మతము. అది శాస్త్ర విదితము. దానిని వృథగా విడిచిపుచ్చ రాదు. భారతీయుల కందరకు ననుల్లం ఘనీయము పైతృకర్మ. భారతీయులకే కాదు. ప్రపంచమునం దందరికి నీ యాచార మున్నది. అది యుద్దాలక మహర్షి కథయందు నిరూపింప బడినది. పితృదిన ముత్కృష్ట మగు దినము. ఆ నాటికి గృహ మలికి ముగ్గులు పెట్టి చక్కగా నలంకరింప వలయును. వెనుకటి రాత్రి యుత్తములు వేద విదులు జీవ పితృలగు బ్రాహ్మణులను భోక్తలుగా జెప్పుకొన వలయును.

విధవా నందనుల ఖలుల వృషలీ పతులన్
బధిరుల నవైష్ణవుల న
న్య ధనాపహరులను

భోక్తలుగా నియమింపరాదు.

ఉలవలు చామలు కోద్రవ
ములు కందులు రాజ మాషములు నిష్పావం
బులు చణకంబులు దర్వెం
దలు జొన్నలు

మొదలగు ధాన్యములు భోజనమున పెట్టరాదు.

ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొరకాయ
పిండికూర నేతి బీరకాయ
చిఱ్ఱి మేడికాయ చెంచలి వంకాయ

ముదలగు కూరలు నిషేధములు. శ్రాద్ధము శ్రద్ధగా సమంత్రకముగా భక్తితో పెట్టవలెను. భోక్తల నర్చించి తుష్టిగా భుజింప నిడవల యును. వారికి వస్త్ర దక్షిణ లీయవలయు. ఇది వేద విహిత మగు నాచారము. ఇవి కాక పెక్కులగు సూక్ష్మ ధర్మములు జైమిని భారతమునందు చెప్పబడినవి.

పాశ్చాత్యుల నాగరికత కంటె గ్రీకుల నాగరికత పురాతన మయి నది. వారు బహు దేవతలను బూజించిరి. దేవతలకు భూత బలు లొసంగిరి. వారి మత గ్రంధములు పురాణ కధలు పరిశీ లించినచో భారతీయ సంస్కృతి కొంత గోచరించును. ఆర్య ధర్మములు కొన్ని అగుపించును. అంతకంటె ననాది సిద్ధ మయినది భారతీయ సంస్కృతి. వీరి వైదిక కర్మలు గ్రీకుల బలి కర్మలను బోలి యుండును. కాని వీనియం దున్న మంత్రతంత్రాదులు వానికి లేవు. వేద విహిత కర్మలలో రాజ సూయాశ్వమేధములు మిగుల విఖ్యాతములు. అవి మహా పాపములను బోగొట్టి యజ్ఞ కర్తకు స్వర్గము ప్రసాదించు నని భారతీయుల నమ్మకము. బ్రహ్మ హత్య మహాపాపము. రాముడు రావణుని సంహరించెను. అతడు బ్రాహ్మణుడు. ఆ పాపమును తొల గించు కొనుటకు రాము డశ్వమేధ యాగ మొనరించెను. బంధు వధ, అందును గురు వధ మరింత పాపావహము. దానిని తొలగించు కొను టకు ధర్మరాజు అశ్వమేధ మొనరించెను. ఈ యాగములు వేద సమ్మతములు.

పాటీర హీర వర్ణము
హాటక పుచ్ఛంబు నల్ల నగు చెవులు నిరా
ఘాట జవంబును నధ్వర
ఘోటక లక్షణములు

అట్టి యశ్వము దొరకనిచో కాయము చిత్ర వర్ణములు గలిగి మనో జవమయిన యశ్వ ముండ వలయును. ఆగమోక్త ప్రకారంబున దాని నర్చింప వలయును. దేశ దేశంబులందు సంచరింప దానిని పోవిడువ వలయును. దాని వెంట చతురంగ బలములు సాగి నడువవలయును.

శూరులు గల్గినఁ బట్టుడు
ధీరత నని హయము నిటల దేశంబున బం
గారపుఁ బట్టముపైఁ బతి
వీరాంకము వ్రాసి కట్టి విడువఁగ వలయున్

మహావీరు లెవరైన నున్న దానిని పట్టుకొందురు. వారితో యుద్ధము చేసి జయింప వలయును. ఆ హయము

విణ్మూత్రములు సక్తి విడిచిన తావుల
నెల్ల హోమంబు సేయించి యచట
గో సహస్రంబు ధాత్రీసుపర్వుల కాగ
మోక్త దక్షిణలతో నొసఁగ వలయు
దీక్షితుండు హయంబు తిరిగి వచ్చెడుదాఁక
నియతి భోగంబు లన్నియును మాని
భార్యతోడుత నసిపత్ర వ్రతముఁ బూని
బ్రహ్మచర్యంబు సల్పంగ వలయు

ను. ఇది హయమేధ యాగ విధానము. ఇట్టి యాగము సకల పాప హరంబని భారతీయుల నమ్మకము. దీనివలన బహుధన వ్యయము శరీర ప్రయాసము కలదు. కావున సామాన్యులు దానిని తలపెట్టరు. ఇట్టి యాగములు మనదే యితర దేశములందు నే సార్వభౌములు చేసినటు లగుపించదు. భారతీయ సంస్కృతియం దిట్టి యాగములకు ప్రత్యేకత కలదు. ఇది పురాణ కాలపు సంగతి. చరిత్ర కాలమునందు రాజులు దిగ్విజయములు గావించి తమ సార్వభౌమత్వము స్థిరపరచు

కొనుటకు అశ్వమేధ యాగము లొనరించిరి. మూడవ శాతకర్ణి రాజు అశ్వమేధ యాగ మొనరించెను. పుష్యమిత్రుడు విదర్భను జయించెను. యవనులను పారఁదోలెను. అతడు శృంగ వంశీయుడు. మగధ చక్రవర్తి. అతడు విజయ సూచకముగా నశ్వమేధము కావించెను. పురాణ కాలములందలి యాగములు పాప పరిహారము కొరకు చేయబడినవి. చరిత్ర కాలమునందు శత్రువిజయ సూచకముగా నొనరింప బడినవి.

భద్రావతీ పుర వర్ణనతో జైమిని భారతము ద్వితీయాశ్వాస మారంభ మగుచున్నది.

స్ఫాటిక మణి శిలా ప్రత్యగ్ర రచనాతి
బంధుర ప్రాకార భాసురంబు
పాతాళ జల ఝరీ పర్యాప్త కల్లోల
సుకుమార పరిఖోప శోభితంబు
కనక సౌధాంచల కలిత ముక్తాఫల
రాజి లీలాగ్ర తారా గణంబు
శక్రనీల శిలా విశాల గోపుర రోచి
రసమయ జనిత మిథ్యాతపంబు

భవన కాసార కల్హార పద్మ కుముద
పుండరీక నీలోత్పల షండ సురభి
విపుల మధుకర కల నాద విజిత పుష్ప
చాప నినదంబు భద్రావతీ పురంబు

కవు లలంకార ప్రియులు. వారి యూహాలు కొండల కెగబ్రాకి నక్షత్ర మండలము నంటుకొను చుండును. అందు అతిశయోక్తులు ఉత్ప్రేక్షలు నల్లిబిల్లిగా నల్లుకొని పాఠకుని మనస్సునకు భ్రమ కలగించును. ఆ యలంకారముల సందు గొందుల నుండి నిశిత మగు చూపును వెల

యించినచో సత్యము పరిస్ఫుటముగా నగుపించును. భద్రావతి యౌవనాశ్వుని రాచనగరు. దాని చుట్టు నెత్తైన ప్రాకారము గలదు. ప్రాకారము నంటి వెలపల పరిఖ కలదు. అది మిగుల లోతైనది. అందు బంగారు వన్నె మెరుగులు దిద్దిన భవనములు గలవు. అవి చాల యెత్తైనవి. వాని చివరలందు నలుపు వన్నెగల విశాల గోపురములు గలవు. ఆ పురమునందు కాసారములు గలవు. వానిలో వికసించిన కమలములు కలువలు గలవు. వానియందు మరంద మాను తుమ్మెదలు ధ్వను లొనరించు చున్నవి. బ్రాహ్మణులు వేదములు చదువు చుండిరి. యజ్ఞములు చేయుచుండిరి. హోమ ధూమము లెల్లెడ వ్యాపించు చుండెను.

నానా పక్వ ఫలాతి నమ్ర తరు సంతానంబులన్ విస్ఫుర
న్నానా పుష్ప లతా ప్రతానముల నానా పక్షి రావంబులన్
నానా వర్ణ మృగ ప్రచారముల నానా కేళి కుంజంబులన్
నానా భంగి నుతింప నొప్పుఁ బురి నానా భోగ సంపన్నతన్

రాజులు జనులు విరామ కాలములందు భోగము లనుభవింతురు. వానికి తగినట్లు పూఁదోటలు నికుంజములు పండ్ల తోటలు నా పురి యందు గలవు. ఏనుగుల క్రీడలకు కాసారములు, హయములు నీరు త్రాగుటకు వేరె చెఱువులు నున్నవి. రాజుల దుర్గ నిర్మాణ క్రమ మిది. ఇట్టి దుర్గములు పురాణ కాలమందే కాక చరిత్ర కాలమునందును భారత దేశమం దెల్లెడల కలవు. అవి శత్రువుల నుండి రాజ్యము రక్షించుకొనుట కేర్పడినవి. అందు చతురంగ బలములతో రాజులు మంత్రులు నివసించి యుందురు.

నేమి నిర్గత ధారుణీ రేణు కల్పిత
తిమిర బృంద స్యందనములతోడఁ
గల్పాంత రుద్ర ఢక్కా రావ ధిక్కారి
సముదగ్ర వాద ఘోషములతోడ

వ్యాలోల మృత్యు జిహ్వా పల్ల వాభీల
సందీప్త బిరుద ధ్వజములతోడ
గ్రీష్మ ఘర్మ త్విష ద్భీష్మ దీప్తి చ్ఛటా
కలితాస్త్ర సుభట సంఘములతోడ

దుర్గములు సందడించు చుండును. జల పానార్థము వచ్చిపోవు చుండు నేన్గుల బృంహితారావములు హయముల హేషా రవములు మెండుకొని యుండును. పిన వీరభద్రుని

శయ్యా – రసము

ను బట్టియు వర్ణనలను బట్టియు భావమును బట్టియు మారు చుండును. అతడు జైమిని భారతమును పురాణ పద్ధతిని వ్రాయ లేదు. కావ్యము వలె రచన సాగించెను. అందు తన పాండిత్యమును ప్రదర్శించెను. కవితా పాటవమును వెలయించెను. అతని సంస్కృత సమాసములు చాల వరకు మృదులములగు పదముల కూర్పుతో నతి కర్కశములు కాక యుండును. అందులకు

స్ఫాటిక మణి శిలా ప్రత్యగ్ర రచనాతి
బంధుర ప్రాకార భాసురంబు

అను పద్యము దృష్టాంతముగా తీసికొన వచ్చును. మరొక మచ్చు తునుక

పద్మరా గోపల ప్రాకార భాసురం
బారసాతల పరిఖా వృతంబు
ప్రోత్తుంగ హేమ గోపుర పరిష్కారంబు
పటు రత్న సౌధ విభ్రాజితంబు
వినుత వర్ణాశ్రమ విశ్రమ స్థానంబు
చతురంగ వాహినీ సంకులంబు
వివిధ వస్తు వ్రాత విరచి తాపణకంబు
బహు తటా కారామ పరిసరంబు

ప్రతి దినోత్సవ దేవతా భవన ఘటిత
లలిత మంగళ వాద్య కోలాహలంబు
బభ్రువాహన భుజ పరిపాలితంబు
మానితైశ్వర్య ధుర్యంబు మణిపురంబు

సంస్కృత సమాస ఘటనమునందు సిద్ధహస్తుడు నన్నయ భట్టు. ఆయన పదములలో పూవుమాలికలలోని మృదుత్వము కలదు. సమాస గణముల పూరింపు కొరకు గాక భావానుగుణముగ పొందిక కొరకేర్పడును. కావున పదము లొకదానితో నొకటి యక్షర సాహచర్యమును పొంది యుండును. గొలుసు వలె నొండొంటితో కలయ గలిసి యేక రూపమును వహించి సాగిపోవును. సహజ సుందర మగు పద విన్యాసమునం దొడుదుడుకులు నేరని గంభీరంపు తెల్గాలి సోకక లోని విలాసంపు పోకడల నలవరించు కొనినది. నన్నయగారి భారతి కవితా లతాంగి ఆ శయ్యా సౌందర్యములో శారదా దేవి వీణా తంతువుల యాలాపములు వినిపించును. కలుముల యిల్లాలి పసిడి యందెల శింజా రావంబుల నెనసి కాంచీ గుణ కింకిణీ గణ కనత్ కంకణ మంజు కల కల స్వనములు శ్రవణ గోచరములగు చుండును. అంత్య అను ప్రాసలు సొంపు నొదవించు చుండును. మచ్చునకు

నర చాప ప్రవిముక్త బాణ బృహన్నారాచ ధారల్ భయం
కర దైతేయ నికాయ కాయముల పైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధుర ధాత్రీ ధర తుంగ శృంగ తట సందోహంబు పైఁ గప్పు దు
ర్ధర ధారాధర ముక్త సంతత పయోధారాళిం బోలుచున్

జలధి విలోల వీచి విలసత్కల కాంచి సమంచితావనీ
తల వహన క్షమం బయిన దక్షిణ హస్తమునం దదున్నమ
ద్గళ దురు ఘర్మ వారి కణ కస్ర కరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విస్రుత కీర్తి యయాతి ప్రీతితోన్

ఇంకను శారద రాత్రు లిత్యాది పద్యము లెన్నేనియు గలవు. నన్నయ నానా రుచిరార్థ సూక్తి నిధి. అర్థ సంపద కక్షర రమ్యత జోడించి మనోహర కవితా సీమంతవతిని భారత కథా నాట్య రంగమున కలగాన ఝురీ తరంగ నినాదములందు తాళ లయా సమన్వితంబు లయిన యనుప్రాసలు పొసంగ పద మంజీర మంజు ఘులం ఘలా రావములతో రస భావానుగుణంబుగ నాట్య మాడించినాడు. అతడు ప్రజ్ఞానిధి. అచేతనం బగు పద జాలమునందు రస పోషణము గావించి కవితకు జీవ కళ సిద్ధింపఁ జేసినాడు. చైతన్యము నాపాదించినాడు. నన్నయకు సమానమయినవాడు పోతన. సరి పోలినవాడు పెద్దన. వీరి సంస్కృత సమాసంపు కూర్పులలో జిగియు బిగియును గలవు. జిగి యనగా పూర్వాపరములందలి పదముల పొందికవలని కలుగు వికాస మని నా తలంపు. శ్రీనాథుని సమాసములందు నన్నయ రచనలోని వికాసంపు జిగి యంతగా నగుపించదు. బిగువునకు లోప ముండదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సంస్కృతంపు పోకడలు శ్రీనాథుని కవిత కందుబాటులో నుండును.

సంతానక ద్రుమ చ్ఛాయా సమాకీర్ణ
　　రాజ వీథీ పరివ్రాజకంబు
ధవళ చీనాంశు కోత్తమ సమాకల్పిత
　　మహనీయ తర కేతు మండనంబు
సమధిక స్తంభ కాంచన తోరణావళీ
　　మేళ నోత్తేజిత మిహిర దీప్తి
ప్రతి గృహ ద్వార పర్యంత సంధానిత
　　సుమ గుచ్ఛ మాలికా సుందరంబు
గరుడ గంధర్వ కిన్నర ఖచర యక్ష
సిద్ధ విద్యాధ రాంగనా శ్రేణి భరిత
మఖిల లోక విలోచన హర్ష కరము
రాజితం బయ్యె నోషధీ ప్రస్థ పురము.

ఇది శ్రీనాథుని పద్యము. సంస్కృత పదములు పొందుపరచి సమాస మును బిగువుగా సంఘటించుటయందు పినవీరన శ్రీనాథున కేమిటను తీసిపోవువాఁడు కాఁడు.

శరధి చర కమఠ కిటి నర
హరి వామన భృగుజ రామ హలభృజ్జిన క
ల్కి రుచిర రూపాయ జగ
ద్భరణాయ నమో నమోస్తు భవతే యనుచున్

మయూరధ్వజుఁడు కృష్ణు నభినుతించెను. ఇందు దశావతారము లొక్క సమాసమునందు సమకూర్చి కంద పద్యములో నిమిడ్చినాఁడు పినవీరన. వాని ప్రతిభ వినుతింప దగినది. ఇట్లు కూర్చిన వారు తెలుగు కవులం దిందొకరు లేరు. ఇట్టి శక్తి సంస్కృత పదములలో నున్నది. పినవీరన తన రచనకు శ్రీనాథుని పోకడలు మేలు బంతు లుగా నొదవించుకొనెను. ఒక్కొక్కప్పుడు శ్రీనాథుని వలెనె తత్సమ ఆచ్ఛిక పదములను కలయ కలిపి పద్యము నతి మనోహరముగా నడుపును.

మాయా విప్ర రూపములతో కృష్ణార్జునులు మణిపురమునందు ప్రవే శించిరి.

కటిఁ గ్రాత ముతుక సిర్కావి దోవతి పంచె
భ్రూమధ్యమున నూర్ధ్వ పుండ్రకంబు
వక్షఃస్థలమునఁ బద్మాక్ష మాలిక కర్ణ
బిలమున నులివాఁడు తొడసి యెన్ను
నంస భాగంబున నాయవారపు సంచి
దోర్మూలమున నిట్టి తోలు సజ్జ
కుడి కరంబున నలుగుడు వేణు దండంబు
గూని వీఁపునఁ జింపి గొడుగుఁ దడక

తనకు నలవడ వృద్ధ విప్రుని విధంబుఁ
దాల్చుటయునుఁ గూర్మి సఖుఁడు సుత్రామ సుతుఁడు
బ్రహ్మచారియై తన వెంటరా మురారి
రత్ననగరంబు సొచ్చి పూర్వత్రియామ

ఇది పినవీరన పద్యము. హార విలాసమునందు

ఫాల పటికయందు భస్మ త్రిపుండ్రంబుఁ
గర్ణంబులను రాగి కమ్మ దోయి
కరమునం దిత్తడి కంబంపుఁ గంకెయు
ఘన కుచంబుల మీఁదఁ గావి గంత
కటి మండలంబునఁ గరకంచుఁ బుట్టంబు
మడిఁచి కట్టిన మేలి నడిమి కట్టు
కేలుఁ దామరయందుఁ గేదార వలయంబు
గడ కుచ్చు మీఁదఁ బచ్చడపుఁ గండ

సంతరించి పదారు వర్షముల వయసుఁ
బచ్చి బాలెంతరాలు తాపస పురంధ్రి
నంబి భామినిఁ దిరువెంగనాంచిఁ జేరి
పాలు వోయింపుఁ డమ్మ పాపని కనియె

శ్రీనాథుని రచన యిది. పాఠకుని మనస్సు రస ప్లావితము గావించి యుప్పొంగ జేయు రచన. అచ్చిక దేశీయములగు పదముల యందము నెట్టి వాని నయిన తన్మయులను గావించును. ఇనుము నయస్కాంతమును వలె మనసు నాకర్షించి యంటి పట్టుకొనును. తలంపులకు పారి నగవు పుట్టించును. కవనంపుఁ బోకడ లిట్టివే యగు బలే యని మురిపించును. రాగి కమ్మ దోయి యట, కావి గంత యట, కర కంచుఁ బుట్టంబడి, అన్నిటి కంకెు మడఁచి కట్టిన మేలి నడిమి కట్టట. కడకుచ్చు మీఁదఁ బచ్చడపు గండ యట, ఇట్టి చక్కని పద

ములు కవితలో సంతరించుట యందు గల చతురత శ్రీనాథ కవి సార్వభౌమునికే చెల్లినది. ఇవి దేశీయంపు తెనుగు పదముల పోకడలు. వాని యందలి చందములు గ్రహించినవాడు పేరన. అతడు శ్రీనాథుని రచనలోని పలుకుబడుల యందమును బుణికి పుచ్చుకొనెను. ప్రాత ముతుక నీర్కావి దోవతి, నులివాడు తొడసి యెన్ను, ఆయవారపు సంచి, ఇత్తి త్రోలు సజ్జ, చింపి గొడుగు దడక ఇత్యాదికములు కవితలో చొనిపించెను. నన్నయ కవితలో దేశీయములు లేక పోలేదు. అవి వేంగినాటి వ్యవహారికములు. అవి దేశవ్యాప్తముగా నందరికు నర్థమగునని. మచ్చునకు

పఱవ నోపక యున్న నైనను నఱచి పోటెం
బెనంగి యున్నను గ్రసియింప మొనసి యున్నఁ
దెవులు గొని యున్న మృగముల దివిరి యేయ
రెఱచి యాహారముగ మును నెఱుకు లైన

తఱియగు నంతకు రిపుఁ దన
యఱకటఁ బెట్టికొని యుండునగి దఱి యగుడుం
జెఱుచునది జాతి నిర్వాదను
వఱలఁగ మృష్టటము నెత్తి వైచిన భంగిన్

ఇట్టి దేశీయంపు నుడికారముల తోడి నడచిన పద్యములు చాల గలవు. వానియందు పాఠకుని తబ్బిబ్బొనరించు పదము లుండవు. తిక్కనగారి పద్యములందలి దేశీయత నెల్లూరు ప్రాంత వ్యావహారికము. అందు మారుమూల తెనుగు పదము లిమిడి యుండును. అవి వేంగి తెలుంగు నాటివారికి వినూతనములుగా గోచరించును. అందు అన్య ప్రాంతీయములుకూడ కలవని నా నమ్మకము. సడి సన్న, యేట్రైన, ఎత్తునఁ గొందు, ఓలము, మంపుడులు, ఉడుగరలు ఇత్యాదు లందియున్నది

తనికెడు నారటంబున నంత కంతకు
వ్రమ్ముచు నునికికి విడుమరయును
గోలు మసంగెడు కోర్కుల వెనువెంటఁ
బాఱుచు నునికికి నూఱటయును
వావిరిఁ బొదివెడు వగల సందడిఁ బడి
యురియుచు నునికికి నుడుకువయును
నందంద కవిరెడు కొందల పాటుచేఁ
దలకుచు నునికికి నిలుకడయును

లేమిఁ దాల్మి గోనఁగ లేక యలందురి
తనువు నింద్రియములు మనము ధృతియుఁ
దన వశంబు గాక తల్లడపడి సింహ
బలుఁడు విషమ బాణు బారిఁ బాఱె

ఇందలి వ్రమ్ముచు, విడుమర, ఉరియుచు, అలందురి, ఇటువంటి పదములు తిక్కనగారి భారతమునందు పెక్కులు గలవు. అవి నెల్లూరు మండలమునందు వాడుకలో నున్న పదములు కావచ్చును. అవి వేగినాటి యాంధ్రులకు వినూతనములుగా నగుపించును. శ్రీనాథుడు కర్ణాటుడు. పాకనాటివాడు. ఆ ప్రాంతమునందలి తెనుగు దేశీయములు వాని కవితలో పొందుకొనినవి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కర్ణాట దేశవాసి. విశేషించి శ్రీనాథు నడుగు జాడల ననుసరించెను. అందుమూలమున వాని కావ్యమునందు శ్రీనాథుని పదములను బోలిన పదములు నెలసినవి. ఆ కాలమునం దాంధ్ర దేశము బహువిస్తీర్ణమయి పలు నాడులుగా విభజింపబడెను. కర్ణాటము తెలుగు నాడులలో నొకటి కావచ్చును. కన్నడము దానికి ప్రాంతీయము. అందలి వారు కన్నడమము వాడుక చేసికొనినను తెనుగు వారి స్వభాష. కావున కవితలో కన్నడ పదములు దొరల వచ్చును. కావుననే శ్రీనాథుడు 'నాదు కవనంబు నిజము కర్ణాట భాష' యని నుడివెను.

అనగా కర్నాట దేశ వ్యవహార సిద్ధంబగు భాష యని వాని యభిప్రాయము. అదియు తెలుగే యగును. అందు ప్రాంతీయ కన్నడ భాషా పదముల సాంకర్యముచేత తెనుగు కంటె విభిన్నముగా నున్నటు లగుపించును. అందు మూలమున శ్రీనాథు డట్లనెను. ఒకప్పుడు కర్నాట దేశము కన్నడ దేశములో నొక భాగమై యుండ వచ్చును. దానిని కన్నడ దేశ మని వ్యవహరింపబడ వచ్చును. కావుననే శ్రీనాథుడు 'కన్నడ రాజ్య లక్ష్మి' యని సంబోధించెను. రాయలు కన్నడ నాయకుడ నని చెప్పుకొనెను. విజయనగర ప్రభువులు కర్నాట రాజ్యాధీశులు. వారిలో సాళువ నరసింహ నాయకుని యాస్థాన కవి పినవీరభద్రుడు. రాయల కాలమున తెనుగు రాజ్యము దక్షిణముగా వ్యాపించినది. కంచి, తంజావూరు, మధుర మండలములు రాయల ఏలుబడిలోనికి వచ్చినవి. తెనుగు భాష కా యా మండలములందు ప్రచారము కలిగినది. అచ్చటి కవు లా ప్రాంతీయపు అరవ పదములు కావ్యములందు చేర్చి వ్రాసిరి. దానికి వైష్ణవము తోడైనది. తిరుమణి తిరుచూర్ణము, తిరుమంత్రము, తిరుమల, సాపడు, సరిపెణలు ఇటువంటి పదము లెన్నో చేరినవి. వైజయంతీ విలాసాది కావ్యములం దిట్టివి పెక్కు గలవు. చివర కరవము, తెలుగు మిశ్రమముచేసి వ్రాసిన యక్షగానములు గూడ నున్నవి. విప్రనారాయణ చరిత్ర యక్షగాన మరయ వచ్చును. ప్రాంతీయ భాషా పదముల సంయోగముచేత తెలుగు కవిత కొంచెము విభిన్న రూపములు కలదైనది. అయ్యవి సంస్కృత వైకృత తాచ్ఛిక పద బాహుళ్యమునందంతర్లీనములయి స్థూల దృష్టికి కానరావు. నిశితముగా పరిశీలించి చూచినచో నాయా రూప విభేదములు గోచరించును. ఆంగ్లేయ పదముల సంయోగముచేత నాధునిక కవుల కావ్యములందు తెనుగు కవిత మరింత మార్పును చెందినది. తిరుపతి కవుల జాతక చర్యాదులు పఠించినవారి కా వికృత స్వరూపము విశదముగా గోచరింప గలదు.

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని కవిత రస భావముల ననుసరించి మరింత మృదులమయి రమణీయత వహించుచు వచ్చినది. జానకి దారియందు దుశ్శకునము లరసినది. మనస్సు నందు విషాదము చేకూరినది. తనలో నామె

దండకా వన జనస్థానమం దెవ్వాఁడు
ఖర దూషణాది రాక్షసులఁ దునిమె
నెలయించుకొని పోవ నెవ్వాఁడు పోనీక
తఱిమి మారీచు మస్తకముఁ ద్రుంచె
నగములు పెకలించి నడవఁగా జలరాశిఁ
గట్టించె నెవ్వాఁడు కపులచేతఁ
గలన రావణ కుంభకర్ణాదుల వధించి
కాచె నెవ్వాఁడు లోక త్రయంబు

నవ్విభీషణు వైర నిర్యాతనుండు
రామ చంద్రుండు శరణార్థి రక్షకుండు
ప్రజలు పొగడ నాచంద్ర తారకముగా న
యోధ్య సుఖ లీలఁ బాలించు చుండుఁ గాత

అని తలంచినది. ఈ పద్యమునందు కరుణా రసము ప్రదర్శింప బడినది. సంస్కృ తాచ్ఛిక పదములు సమానముగా కలయఁ గలిపిరచింప బడిన పద్యమిది. అయినను సంస్కృత పదముల కూర్పునందు ఎలెనె ఇందు సహజ మగు గమన వేగ మెంత మాత్రము మందగింప లేదు. కవిత కుంటుపడ లేదు. పదముల పొందికలో బిగువు సడల లేదు. కావ్యంపుఁ బోకడలు డిందు పడలేదు. పిన వీరన

అనుచుం జానకి కొంత దవ్వరిగి యాహ్లాదంబు రెట్టింపఁగాఁ
గనియెన్ సప్త శత ప్రవాహము జాగ్ర త్తీర భూజాత పు
ష్ప నవామోద సుగంధి శంబరధర ప్రాజ్ఞీరథిన్ లోక పా
వన భాగీరథిఁ జక్ర పత్రజ మరు ద్వాచాల వీచీ రథిన్.

అని గంగను వర్ణించెను. ఇది దీర్ఘ సమాస సంకలితము. ఈ పద్యము నందు గల నడకలోని వేగము పై పద్యమునందును గలదు.

విపుల బాహా శక్తి విఱిచెఁ బురారి కో
  దండంబు నా నిమిత్తంబ కాదె
చలపట్టి వైతేయ శాంబరీ మృగము మ
  స్తముఁ గ్రుంచె నా నిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపి సేన
  దాఁటించె నా నిమిత్తంబ కాదె
కదన రంగమున జగద్ద్రోహిఁ బంక్తి కం
  ధరుఁ గూల్చె నా నిమిత్తంబ కాదె

యట్టి రాముఁడు తాన నన్నడవిలోన
డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచె నట్ల
తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేత పురమునకును

'అట్ల తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయ' అను వాక్యము పై పద్యమునకు జీవము. అందు జానకి చిత్తమునందు వెల్లుబికి వచ్చు శోకము, నిస్పృహా, లక్ష్మణునియందు గల సమయానుకూల ప్రవర్తనములోని పరిణామము నెడ నామె చెప్పిపోడుపు ముప్పిరులు గొని కరణా రసమునకు సుధా రసము పోసినది. తుదవాతి తమ్ముఁడా ! యను సంబోధన నిశిత శర పాతమయి లక్ష్మణుని హృదయ కుహరమును మొదలంట కదలించి వైచు పదము. ఇట్టి రస పోషకములగు పద జాలములు పొసగించిన యీ పద్యంపు నడక ననుసరించి కంకంటి పాపరాజు తన యుత్తర రామ చరిత్రయందు

దర్పించి పరమేశు ధన్వంబు విఱుచుట
నీ నిమిత్తమె కదే నీలవేణి
యెలమితోఁ గపిరాజు చెలిమి పాటించుట
నీ కోసమే కదే నీరజాక్షి
విబుధేంద్ర సుతుఁ బొంచి వ్రేసి నిర్జించుట
నీకొఱకే కదే నిర్మలాంగి
క్రోధించి సాగర క్షోభంబు సేయుట
నీ పనికే కదే యో పురంధ్రి

బ్రహ్మ కులజునిఁ బౌలస్త్య పతి గెలుచుట
నిన్నుఁ గైకొంటకే కదే వన్నెలాడి
యకట యవి యెల్ల నెంచక యొకటి రెండు
తప్పులకు నన్ను నెడఁబాయఁ దగునె నీకు

అని రచించెను. కాని పినవీరభద్రుని రచనలో గల రసస్ఫూర్తి యీ పద్యమునందు లేదు. శయ్య కొక స్థాన మున్నది. పాత్రలను బట్టియు రసమును బట్టియు నది మారుచుండును. సీత నోట వెడలిన యీ శయ్యా సముచితంబగు భావప్రదర్శనము కంట నీరు కురిపించినది పినవీరన పద్యమునందు. ఇది రాముడు సీతా వియోగ శోకమున నను కొనిన మాటలు. వీనియందా హృదయము కరగించి కన్నీరు కాలువలు కట్టింప చేయు శక్తి లేదు. పినవీరన పద్యములోని యీ భావోద్రేకము కనిపించదు. శయ్య రసానుగుణమయి భావోద్రేకమువలని సముచిత పదజాలములను కూడ కలుపుకొని పాత్రానుసారముగా వెడలి వచ్చును. అది పాఠకుని చిత్తము నాకర్షించును. అందు సహజత్వము మూర్తుల గోచరించును. ఆ సహజ స్థితి యనుకరణము లకు తావీయదు. అనుకరణమునందా మనోహారత యుండదు. కావున పాపరాజు పద్యమునందు నైసర్గిక కవితా శిల్పము నుద్రేకతయు లేకపోయినది. ఇట్లనుటచే పాపరాజు కవితను నేను డిందు

పరచితి ననుకొన రాదు. ఈ పద్యము విషయమయి మాత్రమే నేను నుడివినది. పినవీరభద్రుని కైతలో నైసర్గిక మగు జీవకళ యున్నది. ఆ పద సంఘటనలలో తీవ్రమగు గమన మున్నది. రస పోషణములో నిపుణత యున్నది. శయ్యా ప్రదర్శనములో స్థానాస్థాన పాత్రాపాత్రల గుర్తింపగల నిశిత దృష్టి యుండ వలయును. పాఠకుని చిత్తము రస ప్లావిత మొనరింప గల భావముండ వలయును. యే రకపు పదముల కూర్పునం దైనను ధారాపాతము వంటి వేగమగు నడకను కొనసాగింప గల శక్తి కలవాడు పినవీరన. కావుననే జైమిని భారతమునందు కవిత రమణీయతను పొందినది. అతడు స్వతంత్రుడు. వాని యూహాలు స్వతంత్రములు. వాని పదములు తిక్కనాదుల కవితలోని పదములకంటె విభిన్నము లైనవి. పద్యంపు నడకల తీరులు క్రొత్త దారులు తొక్కినవి. ఇట్టి రచనకు దారి తీసినవాడు శ్రీనాథుడు. నన్నయ తిక్కన యెఱ్ఱనాది కవులం దగు పించు పౌరాణిక కవితా లతాంగి కతడు నెర నీటుతనము పొసగించి వినూతన సౌందర్యమును కల్పించినాడు. నవ నాగరికపు కావ్య స్వరూపము నెలకొల్పినాడు. ఆలోచనా తంతువుల మేళవించినాడు. వినూతనంపు దారుల కవనంపు మిటారులను ప్రదర్శించినాడు. కావ్య విపంచి అందంపు తీరుల నాలపించి నది. శ్రుతి మనోహరంబులగు నుడికారంపు సొంపులు పరపించినది. ప్రాత పోకడలు విడిచిపుచ్చినది. క్రొత్త నడకలు సవదరించుకొనినది. కవి లోకము పొగ డ్తల నందినది. హర విలాస మన్నిటిలో నిగ్గు తేరిన కావ్యము. శ్రీనాథునకు తరువాతి వాడు పినవీరభద్రుడు. వాని దారితెన్నులు పినవీరన పరికించి నాడు. ఆ దారుల ననుకరించినాడు. ఒక వీరనయేకాదు అల సాని పెద్దనాదులు కూడ యీ కూటమిలోని వారు. వారి వారి కావ్యములందు శ్రీనాథుని యగుడు చాయ లగుపించును. నాగరకతా ప్రపంచము వలెనే కవితా ప్రపంచము కూడ యెప్పటి కప్పుడు మారు చుండును ప్రాత యొక రోతి క్రొత్త యొక వింత దానిని

గురించి పరిపూర్ణముగా వ్రాయవలయు ననిన మరొక గ్రంథము పట్టును. స్థాలీపులాక న్యాయముగా నేను రచించిన తంజావూరు తెనుగు కవుల గ్రంథమునందు కొంత నుడివితిని. మిగిలిన విమర్శ గ్రంథములం దచ్చ టచ్చట సందర్భములను బట్టి ప్రస్తావించుచు వచ్చితిని.

జడల యల్లిక లూడ్చి సంపంగి నూనియఁ
బిన్న కూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోప్య దేశంబు సంకుమద ద్రవంబున
నయమార నుద్వర్తనంబు సలిపి
గీసి గొజ్జగినీరు పోసి నూరిన క్రొత్త
చిరుబంతి పసుపు లోఁజెవపు సలఁడి
కస్తూరిఁ బొరసిన గంధ సారంబుతో
సీకాయ మెరవున జిడ్డు పఱపి

తేట నులివెచ్చ నీరునఁ దీర్థమాడి
వేణి యాటార్చి సురపొన్న విరుల ముడిచి
మడుఁగుఁ గట్టి కాటుక యిడి తొడివి పూసి
భసిత రేఖా త్రిపుండ్రంబు నొసటఁ దీర్చి

పెరియాళునిఁ గై సేసినారు తిరువెంగనాంచియు చిరుతొండనంబియు.

ఇది హార విలాసములోని శ్రీనాథుని పద్యము

కాడిన విష కంటకములు మెల్లనఁ బుచ్చి
తనువెచ్చ పాద పద్మములు గాఁచి
కలదు లేదను పాటి గారనూనె యొకింత
పంకించి తల చిక్కుఁ బాపి ముడిచి

తఱచుగాఁ జెక్కు టద్దముల నోడికలైన
కన్నీరు తుడిచి మొగంబుఁ గడిగి
పొరలాడఁ బెంధూళి బ్రుంగిన వలు వూడ్చి
పలుచని నూత్న వల్కలముఁ గట్టి

పూఁట పూఁటకు నుపచారములు ఘటింప
ముని వతంసంబు వాల్మీకి యనుదినంబుఁ
గథల కారణమునఁ బ్రొద్దు గడప సతికి
నెలలు తొమ్మిది పరిపాటి నిండుటయును

సీత ప్రసవించినది. ఇది జైమిని భారతములోని పినవీరన పద్యము.

ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మొగము తోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ
గుఱుచ లాతాముతోఁ గూర్చి పట్టి
యైణేయ మైన యొడ్డాణంపు లవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూట చ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగు దేహంబున భస్మ మలది

మిట్ట యురమున నిడు యోగ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరి తద్గేహ మాషధ సిద్ధుఁ డొకఁడు

ఇది మనుచరిత్రలోని అల్లసాని పెద్దనగారి పద్యము. వీనియందె తెలుగు పదజాలమునకును తిక్కన తెలుగు పద జాలమునకు ? భేదము చదువరులు పరిశీలింతురు గాక. సకల కావ్యములందు

సంస్కృత వైకృతము లొక్క తీరున నుండును. నాడు భేదములను బట్టియు ప్రాంతీయతను బట్టి ఆచ్ఛిక పదములు మారు చుండును. అందు మూలమున కవితాంగనలో రూప భేదము పొడుము చుండును. తిక్కనగారి తెలుగు దేశీయములు నెల్లూరు మండలమునందు వాడుకలో నున్నవి. వానియందు కొంత సనాతనత్వము తొంగిచూచు చుండును. శ్రీనాథ తిక్కనల మధ్య దాదాపు రెండు వందల సంవత్సరములు గడచినవి. శ్రీనాథుడు కర్ణాటుడు. వాని తరువాత పినవీరన పెద్దనాదులు కర్నాటులు. విజయనగర ప్రాంతములోనివారు. వారి కావ్యములందు దేశీయంపు తెనుగు పదములలో కొంత నాజూకుతన మున్నది. నవీనత యున్నది. మార్దవ మున్నది. అవి యర్థమునకయి పాఠకుని తడుము లాడింపవు. వానియందు చూచు మాత్రంబుననే మనస్సు నుబికింపచేయు పరిచయ మున్నది.

హయము నీరు ద్రావ వచ్చినది. దాని చుట్టు చతురంగ బలములు కాచుకొని యున్నవి. చూచినారు భీమాదులు. మాయాబలముచేత సేనలను జిరాకు పరచినాడు మేఘవర్ణుడు. హయమును కడ నిడుకొని మింటి కెగసి పోయినాడు. ఆ సంగతి యౌవనాశ్వున కెరిగించినారు భటులు. ఆ విభుడు సేనలను పంపినాడు. వృషకేతనుడు వానిని చెల్లాచెదురు గావించెను. యౌవనాశ్వుడు స్వయముగా యుద్ధమునకు తరలి వచ్చెను. పోరు భయంకరముగ సాగినది.

దంతంబు లిడిసి మూర్ధంబులు వ్రక్కలై
కూలిన భద్ర శుండాలములును
గళములు మలంగి డొక్కలు మీఁది కెత్తుక
చాఁప కట్టుగఁ బడ్డ సైంధవములు
విటతాటనమ్ముగా విఱిగి చక్రములతోఁ
దలక్రిందులైన రథ వ్రజములుఁ
దొడుగులు సడలి కుత్తుక లెండి మిక్కిలి
వెడ రూపులై పడ్డ వీరభటులుఁ

గలనఁ బ్రోవులు గొనుచుండ గజ తురంగ
సుభట విగ్రహ సంజాత శోణితములు
వఱదలై పాఱె భీము దుర్వార జాను
తట సముద్భూత వాతూల తాడనమున

ఇది బీభత్స రసము. పురాణ కాలమునందలి భారత జాతి

యుద్ధ ధర్మములు

ప్రశంసింప దగినవి. సైన్యములకు నాగరిక జనములతో సంబంధము లేదు. వారిని నొంచుట గాని కలంచుట గాని రణ ధర్మములకు విరుద్ధము. ఆ కారణముచేత రణము లన్నియు వివిక్త ప్రదేశమున జరుగు చుండెడివి. భారత ఘోర యుద్ధము కురుక్షేత్రము నందు సాగినది. అది శ్రీకృష్ణుని నిర్ణయము. అట్లే జైమిని భారతమునందును భీమాదులు హయము జల పానార్థము వచ్చిన పుర బాహ్య ప్రదేశమునందు ధర్మోచితముగా రణము సాగించిరి. యౌవనాశ్వుడు దంతావళము నెక్కి వృషకేతునితో రణమునకు తలపడ వచ్చెను.

తపన పౌత్రు నిఁ జూచి
యాది విష్ణువుఁ బోలె నాత్మలోనఁ
దెలియ కున్నాఁడ నీ కుల గోత్ర నామంబు
లని సేయ రా దన్వయం బెఱుఁగ
కెవ్వని తనయుండ వెద్ది నామంబు
నీరాక కిపు డేది కారణంబు
నాకు నెఱిఁగింపుము

అని నాడు యౌవనాశ్వుడు. కుల గోత్ర నామంబులు తెలియక యుత్తమ క్షత్రియ వంశ సంజాతుం డగు రాజు వైరితో యుద్ధమునకు తల పడరాదు. ఇది క్షత్రియ ధర్మము. క్షత్రియుడు క్షత్రియ కులజునితో యుద్ధము చేయవలయును. సుధన్వుడు వృషకేతునితో

అనఘ ! నీ వంశాభి
జాత్యంబు లెఱిఁగింపు సరవి ననినఁ
గశ్యపము ని గోత్ర కర్త నీ వనిలోనఁ
దివిరి యెవ్వాని భేదింపఁ గోరె
దా మహాత్ముఁడు మత్పితా మహుఁ డాతని
తనయులం దధిక ప్రదాత శౌర్య
ఘనుఁడు కర్ణుఁడు మా తండ్రి నా నామంబు
వృషకేతనుం డన విని యతండు

తగు మధుస్యందనుండు మద్వంశమునకు
గురుఁడు హంసధ్వజ క్షమావరుఁడు నాకు
జనకుఁడు సుధన్వుఁ డను పేరఁ దనరువాఁడ

నని యన్యోన్య కుల గోత్ర నామము లెరిగించుకొనిరి. తరువాత యుద్ధమునకుఁ దొడరిరి. క్షత్రియుడు క్షత్రియుడు కానివానితో యుద్ధము చేయరాదు. కుమారాస్త్ర విద్యా ప్రదర్శనము జరుగుచుండెను. అర్జునుడు తన విద్యాపాటవము చూపుచుండెను. ఆ సమయమున కర్ణుడు రంగ మధ్యమున కరుదెంచెను.

నీవ కడు నేర్పుకాఁడవు
గావలవదు వీనిఁ గొన్ని గఱచితి మేమున్
నీ విద్య లెల్లఁ జూపుదు
మే వీరులు సూచి మేలు మేలని పొగడన్

అనినాడు. కృపాచార్యుడు వారి నడుమ నిలిచి

కురు కులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్రుఁడు రాజ ధర్మ బం
ధుర చరితుండు స్త్రీ వితనితోడ రణం బొనరించె దేని వి
స్తరముగ నీదు వంశమును దల్లిని దండ్రిని జెప్పు చెప్పినన్
దొర యగు దేని నీ కెదిరి దోర్బల శక్తి యితండు సూపెడున్

అన్నాడు. యజ్ఞాశ్వమును బట్టినారు కుశలవులు. వారిని

వారలఁ జూచి పల్కె రఘు వర్యుఁడు మీ కిట జాతకర్మ సం
స్కారము లెవ్వ రుక్త విధిఁ జల్పి రొగిన్ ధనురాది శాస్త్ర వి
ద్యా రతులైతి రెవ్వరి కతంబున నే గతి యుద్ధ చాతురి
న్నేరుచుకొంటి రెవ్వ రవనిం దలిదండ్రులు

అని ప్రశ్నించినాడు లక్ష్మణుడు వృషకేతుడు తన పుట్టుపూర్వోత్తరములను దెల్పెను. అంత యౌవనాశ్వుడు వృషకేతునితో

నీవు పదాతివి నే దం
తావళ రాజంబు నెక్కి నాఁడఁ దగవు గా
దో వత్సా! యరద మెక్కుము

అన్నాడు. ఇది యుద్ధ ధర్మము. ఒకడు నేలమీద నింకొకడు వాహనము మీదనుండి యుద్ధము చేయరాదు. భారత యుద్ధమునందు కర్ణుని రథము నేల క్రుంగినది. కృష్ణార్జునులు రథమీద నుండిరి.

అరదంబు చక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన
నెత్తెద నంతకు నేయకుండు
మేను భూమిస్థుఁడ నీవు రథస్థుండ
వియ్యెడఁ దగ వగు నే యమునికి
విరిదలవానిని విరథుని నాయుధం
బిడిన వానిని శూరు లేయ రెందు

అనినాడు కర్ణుడు. అవును అది సత్యము. రథికుడు విరథునితో రణము సేయడు. కావున యౌవనాశ్వుడు రథము పై నెక్కుమని వృషకేతు నర్థించెను. అత డందుల కంగీకరింప లేదు. యౌవనాశ్వుడు మద గజంబు నుండి దిగెను. రథము నెక్కి రణంబునకు డీకొనెను. పోరతి భయంకర మయ్యెను. యౌవనాశ్వుని బాణ పాతములకు వృషకేతుడు మూర్ఛిల్లెను. ఇంక యౌవనాశ్వుడు వానిపై బాణము వేయ

లేదు. మడియింప తలంప లేను. అట్లు చేయుట యధర్మము. మూర్ఛితు డగు వీరుని నిద్రించు వానిని చంపరాదు. ఉత్తరగోగ్రహణంబునందు కౌరవ సేనలపయి సమ్మోహనాస్త్రము ప్రయోగించినాడు అర్జునుడు. అందరు మూర్ఛ మునింగిరి. అర్జునుడు ధర్మపరుడు వారిని చంపుటకు యత్నింప లేదు. కౌరవుల తల కోకలను ఉత్తర బొమ్మ పొత్తికల కయి కత్తిరించుకొని పోయెను. దీనినే ప్రకృత కవి

ఊరక పోయెఁ గాని నరుఁ డుత్తర గోగ్రహణమ్ములోన బే
జారయి మోహ నాస్త్రమునఁ జచ్చు శవమ్ములు వోలె నున్న వీ
వారలఁ జుట్టు ముట్టి తల వస్త్రములం దెగఁ గోసెఁ గాని యి
చ్ఛారతి గుత్తుకల్ తరుగఁ జాలిన యింతలు పుట్టి నేర్చునే

రక్త సంబంధ మేదొ వరలుటఁ జేసి
యంత పని చేయఁ బూనఁ డా యర్జునుండు
పాపమున కిచ్చగింప రా పాండు సుతులు
అదియు వాని హస్తమ్ముల నదిమి పట్టె

మూర్ఛయం దున్నవానిని చంపుట యధర్మము కావున వానికి చేతు లాడలే దని భావము. వృషకేతుడు తేరుకొనెను. మరల యౌవనాశ్వు నితో యుద్ధమునకు తలపడెను. ఈ సారి యౌవనాశ్వుడు మూర్ఛ ల్లెను. అరదంబుపై నొఱఁగి శరీరము మరచి యుండెను. అప్పుడు వృషకేతుడు

ముదుకని మస్తకంబునకు దాపున నూఱు
కాండముల్ దలగడగా నమర్చి
తనువునఁ దూఱఁ గాడిన గంట్లు పరికించి
యధిపతి యుత్తరీయమునఁ బొదిగి
మెఱుఁగు దట్టియుఁ గొంత కుఱుచగా నెఱివట్టి
సురటి లాగున గాలి సోక విసరి

ఒయ్యనఁ బెడ కేల నూర్పులు పరికించి
పలుమారు డెందంబు పట్టి చూచి

అన్యథా దైవ బుద్ధిఁ బ్రత్యహము నేను
హరి పదారాధ నైక తత్పరుఁడ నేని
శూరతముఁడైన యిమ్మహా సుకృత రాశి
బాణ జాల వ్యథలఁ బాసి బ్రదుకుఁ గాత

అని శరీరము నిమిరినాడు. యువనాశ్వుడు మూర్ఛ నుండి తేరు కొనెను. ఇది యా నాటి మహావీరుల యుదార స్వభావము. రణ ధర్మము. భీష్ముడు పార్థుని బాణ పాతములకు రథముపై బడి మూర్ఛ మునింగెను. కౌరవ పాండవ సైన్యంబులందు హాహా రావములు పిక్క టిల్లినవి. ఎవరికి వారస్త్ర శస్త్రములను జార విడిచి భీష్ముని చుట్టు మూగిరి. భీష్ముడు కురు పితామహుడు. మహావీరుడు. ధర్మపరుడు. ఎల్ల వారలు వాని స్థితికి కన్నీరు కార్చిరి. పాండవులు లోలోన నొచ్చు కొనిరి. వానికి సకలోపచారములు గావించిరి.

అది యొక విధమగు వీరపూజ. భరత దేశము వీరభూమి. ఉత్తములగు వీరుల నారాధించుట యుదారులగు మహావీరుల సంప్రదాయము. ప్రపంచ వ్యాప్తముగా నా యాచారము నెలకొని యున్నది. అలె గ్జాండరు మహా వీరాధి వీరుడు. హిందూ దేశముపై దండెత్తి వచ్చెను. పురుషోత్తముని రణమున నోడించెను. పురుషోత్తము డమిత పరాక్రమ శాలి. అభిమాన ధనుడు. వాని శౌర్యసాహసములు కన్నార చూచినా డలెగ్జాండరు. దైవము వ్యతిరేకింప నోటమి నొందెను. విరోధు లాయ నను బంధించిరి. అలెగ్జాండరు ముందునకు తెచ్చిరి. చూచినా డలె గ్జాండరు పురుషోత్తముని వాని భుజ పరాక్రమము లొక్కసారి మదికి పారినవి. "ని న్నెటుల గౌరవింపమందు" వని ప్రశ్నించెను. పురు షోత్తముడు జంకు కొంకు లేక "మహారాజు నట్లు" అని సమాధానము

చెప్పెను. దానిలో నొక రహస్య మిమిడి యున్నది. అలెగ్జాండరు రాత్రి సమయమున పురుషోత్తముని సేనలపై హఠాత్తుగా బడెను. చెల్లాచెదరు గావించెను. అది రణ ధర్మమునకు విరుద్ధము. దానిని గుర్తించినా డలెగ్జాండరు. సరిగా నెదిరించిన పురుషోత్తముని జయింప సాధ్యము కాదు. వాని కా యనుభవ మున్నది. పురుషోత్తముని మహారాజుగా గౌరవించెను. వాని రాజ్యము వాని కిచ్చివైచెను. ఇది వీర పూజ. అట్లే వృషధ్వజుడు తన యౌదార్యమును చూపెను. ప్రాణ దాన మొనరించిన వృషకేతు నెడ విశ్వాసముకలవాడయినాడు యౌవనాశ్వుడు. భీమాదులను తన వెంట పురమునకు గొనిపోయెను. వారిని గౌరవించెను. మఖాశ్వము వారి కొసంగెను. తానును ధర్మజుని యజ్ఞమునకు బంధు జనులతో తరలి హస్తినా పురమునకు వచ్చెను. అంతటితో ద్వితీయాశ్వాసము పూర్తి యైనది. శరణన్న వానిని రక్షించుట యుద్ధ ధర్మము. అనుసాళ్వుడు మఖాశ్వము నపహరించెను. వానిని యుద్ధమున గట్టి మఖాశ్వమును విడిపించెను. అనుసాళ్వుని ధర్మరాజు నెదుట నుంచెను. అనుసాళ్వుడు శ్రీకృష్ణ ధర్మరాజులకు మ్రొక్కెను. శరణార్థి నని దీనముగా వేడుకొనెను. ధర్మరాజు వానిని దండింప లేదు. అపకార మొనరించినను సోదరులతో పాటు వానిని మన్నించెను. ఇది రాజధర్మము. ఇది మూడవ ఆశ్వాసములోని కథ. భారత రామాయణములు భారతీయులకు ఆదర్శ గ్రంథములు. అందు కథ ననుగమించి ధర్మార్థ కామములు ప్రదర్శింప బడు చుండును. మోక్ష సాధనము లయిన కర్మ యోగ భక్తి యోగములు అంతర్లీనము లయి యుండును. జైమిని భారతమునందు కథ పావనం బగు గంగా ప్రవాహము వలె సాగిపోవు చుండును. దానిని నైతిక సాంఘిక ఆర్థిక రాజ ధర్మములు యమునా నది వలె జతకూడి యనుగమించు చుండును. అందు మోక్షదం బగు

## విష్ణు భక్తి

అంతర్వ్యాహిని సరస్వతి వలె స్థూల దృష్టికి నగోచరమయి యుండును. నిశితముగా పరిశీలించిన వారి కది విపులముగా మనోగత మగును. చతుర్విధ పురుషార్థ సాధకములు భారతీయ కవి కావ్యములు. ఐహికాముష్మిక సుఖ సంపాదనమున కవి మార్గ దర్శకములు. ధర్మరాజశ్వమేధ యాగ మొనరింప తలంచెను.

దేవకీసూతి త్రిభువన నాథుఁడు తాన
యెఱిఁగి సాధింప కున్న నీడేరు టెట్లు

అని వచించెను. శ్రీకృష్ణుడు పరతత్త్వము. అది ధర్మరాజునకు తెలియును. కావున చేదోయి ముకుళించి

హా సరోజాక్ష గోత్ర దుఃఖార్ణవమున
మునిఁగి యున్నాఁడఁ జేయూఁతకొనఁగ లేక
నీ కృపా దృష్టి పేర్చోడ గాకయున్న
వెడలఁబడు టెట్లు సుఖము గానిఁచు టెట్లు

కౌరవ సభలో లజ్జా
వారిధి దిగ నుద్ధరింపవా ద్రౌపది న
న్నారీతి నుద్ధరింపుము
నీరజ దళ నేత్ర కలుష నీరధివలనన్

అని ప్రార్థించెను. శ్రీకృష్ణుడు మాయా మానుష విగ్రహుడు. సకల వ్యాప్తుండగు పరబ్రహ్మము. తన భక్తుల మనోభీష్టము లను నెరవేర్చుచుండును. వారిని కష్టముల నుండి యుద్ధరించు చుండును. ద్రౌపది వాని భక్తురాలు. ఆమెకు నక్షయ వస్త్రము లిచ్చెను. అది ధర్మజునకు ననుభవమునం దున్నది. అది కృష్ణునందలి వాని భక్తిని

రెట్టింపు గావించినది. భక్తుని మొర వినినా డా హరి. ద్వారక నుండి హస్తినా పురమునకు తలంపులో నరుదెంచినాడు. శిష్ట రక్షణాయ యుగే యుగే సంభవామి అని గీత బోధించుచున్నది. యుగ యుగమునందు కాదు. ఏ రూపమున నెక్క డెక్క డెవ్వరు తలంతురో ఆ రూపమున నేను సాక్షాత్కరింతు నన్నాడు ఆ పరమాత్మ. అతడు గోవువెంటఁ దగులు క్రోడ భంగి భక్తుల వెన్నంటి యుండును. శ్రీకృష్ణుని సర్వవ్యాపకత్వము ఆర్త సంరక్షణ దీక్షా పరత్వము ద్రౌపదీ ధర్మరాజుల భక్తి ఇందు గోచరించును. శ్రీకృష్ణుని మేనమరదులు పాండవులు. భీమునితో చతురులు సాగించినాడు శ్రీకృష్ణుడు. అందు వేళాకోళము కవ్వింపు కలవు. భీముడు దానికి సమాధాన మొక సీస పద్యమునందు చెప్పెను. ఆ పద్యమునందు పరిహాసములో భీముని భక్తియు శ్రీకృష్ణు డవతార పురుషుడను నుతియు నిశితముగా విమర్శించుకొని చదివినవారికి కానవచ్చును. ఈ సంగతి యదివరకు వ్రాసియుంటిని. వృషకేతుడు యౌవనాశ్వుని మూర్ఛనుండి తేల్చుటకు

హరి పదారాధ నైక తత్పరుఁడ నేని
శూరతముఁడైన యిమ్మహాసుకృత రాశి
బాణ జాత వ్యధల బాసి బ్రతుకుఁ గాత

యని తన హరిభక్తిని చాటుకొనెను. అనుసాళ్వుడు హయమును దొంగిలించుకొని పోయెను. అతఁడు శ్రీకృష్ణుని గురించి తన భటులతో

అవ్యాహతుఁ డచ్ఛేద్యుం
డవ్యయుఁ డాద్యంత రహితుఁ డచ్ఛిద్రుఁడు లో
క వ్యాపకుఁ డక్షరుఁ డశ
రవ్యుఁడు వినుఁ డితని గెల్వరా దెవ్వరికిన్

అని నుడివెను. ఇవి యాద్యంత విరహితుడగు పరమపురుషుని లక్షణ ములు. శ్రీకృష్ణుడు పరమ పురుషు డని వారికి బోధించెను. అజయ్యు డని నిరూపించెను. అంతేకాదు

శుక దాల్భ్య విభీషణ శౌ
నక రుక్మాంగద వసిష్ఠ నారద బలి వా
యు కుమారకులకు వలె నతఁ
డొకరికి లోఁబడఁడు తెలిసి యుండుఁడు మదిలోన్

అనెను. శుకాదులగు పై పద్యమునందలి వారలు హరిభక్తులు. హరి భక్త పరాధీనుడు. భక్తివలన వా రాయనను లోబరచు కొనిరి. వారికి లోబడి నట్టితరులకు శ్రీకృష్ణుడు లోబడడని హెచ్చరించెను. భక్తి చేత తప్ప వేరొంట వానిని బంధింప లేరని భావము. ఆ భక్తివలన అనుసాళ్వుడు కృష్ణు జయించి మూర్ఛ నొందింప గలిగెను.

చైత్ర శుద్ధ పౌర్ణమి దినము వచ్చినది. ఆ నాడు ధర్మజుడు సతీ సమేతుడయి యజ్ఞ దీక్ష వహించెను. మఖాశ్వమును బూజించెను. దేశమం దెల్లెడలం దిరుగ విడిచి పుచ్చెను. అశ్వ రక్షకు డర్జునుడు. చతురంగ బలముతో దాని వెనువెంటఁ దవిలి వచ్చుచుండెను. అశ్వము నర్మదా నదీ తీరంబునం గల మాహిష్మతీ పురమును బ్రవే శించెను. ఆ పురాధీశ్వరుడు నీలధ్వజుడు. వాని సుతుడు ప్రవీ రుడు. వాని భార్య మదనమంజరి. వా రిరువురు నుద్యాన వనమున సంచరించు చుండిరి. మదనమంజరి యశ్వమును జూచెను. ఆమె విభునితో

ఈ హయ రత్నము గన మన
సాహిణమున నున్న నీదు సామ్రాజ్య శ్రీ
కూహించి తెలియఁ బ్రథమో
దాహరణము కాదె యన ముదమున నతండున్

మదనమంజరిని గృహంబున కనిచి యా తురంగమును బట్టు కొనెను. అర్జును డాతనితో తలపడెను. నిశితాస్త్రంబుల నాతనిని బాలి యించెను. నీలధ్వజుడు రణంబునకు డీకొనెను. అతని యల్లు డగ్ని దేవుడు నీలధ్వజు డాగ్నేయాస్త్రము సంధించి యర్జునుని సేనల మీద విడిచెను. అది వాని సైన్యమును బూది గావించెను. అర్జునుడు నారాయణాస్త్రము ప్రయోగించెను. ఆ యస్త్రమున కగ్ని దేవుడు భయపడెను. బ్రాహ్మణ రూపతో నర్జునునకు కానిపించెను.

క్రతువుల్ నూరును వేయి దానములు లక్షల్ తీర్థ సంసేవనల్
వ్రతముల్ కోటులు సేయ నేమిటికి శ్రీవత్సాంక వక్షున్ రమా
పతిఁ గీర్తించిన జాలు నాతఁడు భవత్ప్రాణంబవై యుండఁగా
నితర వ్యాప్తిఁ బ్రయాస మొందఁ బనిలే దెబ్బంగి నూహించినన్

కావున నవ్వన జాక్షుని
సేవింపుదు నీకు నిష్ట సిద్ధిగ హయమున్
రావించు టెంత పని యా
భూవరుఁ గొనివచ్చి నీకుఁ బొందొనరింతున్

అని నుడివెను. దీనివలన విష్ణుభక్తికి మించిన దింకొకటి లేదనియు, ఎల్ల దేవతలు విష్ణుభక్తుని కోరికల నెరవేర్చు చుందు రనియు బోధింప బడినది. అగ్ని మాటల వెంట నీలధ్వజు డశ్వమును గొనివచ్చి యర్జున కొసంగెను. నీలధ్వజుని భార్య జ్వాలాదేవి. ఆమె కది యిష్టము లేదు. భర్తపయి గోపించి కాశి కరిగెను. కాశిరాజు ఉల్ముఖుడు. జ్వాలాదేవి సోదరుడు. వానితో నంతయు చెప్పి కన్నీరు కార్చెను.

ఈ యాపదకు మూలం
బా యింద్రతనూజుఁ డతని నాహవ భూమిం
జేయారఁ జంపి నామది
బాయని వగ పాప్పు

మనినది. వా డామె మాటలు పెడచెవిని బెట్టెను. అలిగి జ్వాల యొక నావ నెక్కి గంగానదిని దాటి పోవుచుండెను. ఆమె పాదమును గంగా జలము సోకెను.

అంటెతి నమ శ్శివాయ పాపాత్మురాలి
నంచు నా ద్వీపవతిని దూషించుటయును
అద్దివ్య తటిని ప్రత్యక్షనై ముందఱ

నిలిచి యిట్లనియె నో నిర్మలాంగి
నాయం బెట్టి యన్యాయంబు పాడగంటి
వెఱఁగింపు మనిన నత్తెరవ నీవు
సుతుల నేద్వురను మ్రింగితివి తొల్లినిల్చెఁ
గడపట నొకఁ డుప్పుఁగల్లు వోలె
నట్టి సత్యవ్రతు నర్జునుండు వధించె
ననిలో శిఖండి ప్రాపునఁ గడంగి

యతని కొలయును నెడప లేవైతి గానఁ
బుత్రహీనవు నిన్నంటఁ బోల దనిన
నలిగి పార్థుని శిర మాఱు నెలల కుర్విఁ
ద్రెళ్ల శపియించి దేవి యదృశ్య యయ్యె

జ్వాలయు నా దివిజ నదీ
కూలంబునఁ జితి యమర్చుకొని చిత్రముగాఁ
గాలి ధనంజయుఁ జంపఁగ
నాలో మృత్యు స్వరూప మగు శర మయ్యెన్

ఇది జైమిని భారతములోని కథ. తిక్కన తెనిగించిన వ్యాస భారత మునం దిట్లు లేదు. వసువులుగంగా తీరమునకు వచ్చిరి. భీష్ము డర్జునుని చేత నన్యాయముగా చంపబడె నని కోపించి శపింప బూనిరి. అందు

లకు గంగయు నంగీకరించెను. స్నానార్థము గంగ కరుదెంచిన యులూచి యా మాటలు వినెను. ఆమె తండ్రి కెఱిగించెను. అతడు వచ్చి వసువులను ప్రార్థింపగా వారు దయ తలచి బభ్రువాహనునిచేత నాహవమున నర్జునుడు కూలె నేని భీష్ముని జంపిన పాపంబు పోవును. మా శాపంబు తీరు నని నుడివిరి. ఇది వ్యాస భారతములోని కథ.

యాగాశ్వము సౌబరి యాశ్రమము సమీపించెను. అచట నొక పెను రాయిని గదియఁ బోయెను. మేని కండూతి వాయ నా శిలను రాచుకొనెను. అశ్వము దాని కంటుకొని పోయెను. ఈ సందర్భమున పిల్లలమర్రి పినవీరభద్రుడు

భేరుండములు ప్రక్కఁ బెట్టి చన్నుల పూరి
పాటించి శరభ డింభముల కిచ్చు

అను పద్యముచే సౌబరి యాశ్రమమును చక్కగా వర్ణించెను. ఇట్టి వర్ణనకు భారతమునందలి నన్నయగారి కణ్వాశ్రమ వర్ణనము మేలుబంతి. పోతనయు నన్నయగారిని అనుకరించెను. సౌబరివలన నుద్దాలకుని కథ విని నాఁడర్జునుడు. ఆ మహర్షి ప్రబోధంబున నర్జునుడు రాతి నంటుకొనెను. చండికి శాప విమోచన మయినది. రాయి చండి యైనది. గుఱ్ఱము విడిపడినది. భరత భూమి సత్య ధర్మములకు నిలయము. అప్పటి రాజులు ధర్మమును నాల్గు పాదముల మీద నడిపించిరి. వారు ధర్మము ననుష్ఠించిరి. ధర్మార్థ కామ మోక్షములకు పరస్పర నిరోధము రానీయకుండ ప్రవర్తించిరి. వర్ణాశ్రమ ధర్మములు కాపాడిరి. వారి శాసనములు కత్తి వాగరలు. సుతు లయినను సతులయినను పరు లయి నను వారి కొకటే. శాసనముల్లంఘించిన రాజ దండనకు తిరుగు లేదు. కావున ప్రజలు ధర్మ పరులయి ప్రవర్తిల్లిరి. మఖాశ్వము చని చని చంపకాపురము చేరెను. దాని నేలు రాజు హంసధ్వజుడు. అతడు విష్ణు

భక్తుడు. విష్ణువు భక్త పరాధీనుడు. వానిని దర్శించి కృతార్థు డగుటకు తలంచినా డా హంసధ్వజుడు. ఉపాయ మాలోచించినాడు.

ఇటు మఖ వాజి వెంట నమరేంద్ర తనూజుఁడు వచ్చుచున్న వాఁ
డఁట చతురంగ సైన్య యుతుఁడై చని యేనును నత్తురంగమున్
దటుకునఁ బట్టెదన్ ఘన రణం బొనరించెద నంత భక్త సం
కట మెడలింప వచ్చు హరిఁ గాంచి కృతార్థుఁడనై సుఖించెదన్

అని నిశ్చయించుకొనినాడు. అవును. భక్తుల యాలోచనము లట్లే యుండును. భక్తుల కోరికలను విష్ణువు తప్పక మన్నించును. గోదాదేవిని తనలో విలీనము గావించుకొనినాడు రంగడు. విష్ణుచిత్తుడు వాని మోసమున కలిగి నిందించినాడు. రంగడు తన యింటికి వచ్చి యథారీతిగా గోదాదేవిని పరిణయము కావలె నని యా భక్తుని కోరిక. అట్లే వాని కోరిక తీర్చినాడు హరి. అర్జునుడు విష్ణుభక్తుడు. వాని మఖాశ్వమును పట్టుకొనినచో భక్త సంరక్షణార్థము శ్రీకృష్ణుడు తప్పక వచ్చును. అది యుపాయము. ప్రహ్లాదుని బాధించి హరిని సందర్శింప గలిగినాడు హిరణ్యకశిపుడు. కాని హిరణ్యకశిప హంసధ్వజుల ప్రకృతులు వేరు. మఖాశ్వము పట్టినాడు హంసధ్వజుడు. విజయ పటాహమును మ్రోయించినాడు. అందరు యుద్ధమునకు సన్నద్ధు లయిరి. ఫౌజులు తీరి బలములు నిలిచినవి. సుధన్వుడు రాలేదు. ఋతుమతి యగు భార్య కోరిక తీర్చి వచ్చెను. ఆలస్య మయ్యెను. రాజు చండశాసనుడు. సుధన్వుని ధర్మశాస్త్ర వేత్తలు తప్త తైల కటాహమునఁ బడవేయ నాజ్ఞాపించిరి. సుధన్వుడు మహాభక్తుడు. పితృవాక్య పరిపాలనా రతుడు.

అలఘు భయంక రాహవ ముఖార్జిత రత్న విభూష ణావళుల్
చెలఁగుచు నూడ్చి మాల్య తులసి ప్రసవాంబుజ బీజ మాలికా
కలిత విశాల వక్షుఁడయి కంజ దళాక్షునిఁ బీత వాసు హృ
జ్జలజ నివాసుఁగా నుపనిష ద్వచనంబులఁ బ్రస్తుతించుచున్

తడయక మండు తైల పరితప్త కటాహము కేలఁ దామరం
దోడికిలి పట్టి రాహువు విధుం గబళించిన రీతిఁ జూపఁ గ్రొ
మ్మడుగున కేఁగు భద్రకరి మాడ్కి సుధన్వుఁడు చొచ్చి బిట్టు గా
నుడికెడి నూనె తొట్టి బలియుక్ హరి దాసులు సత్య సంపదన్

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని

## రచనా వైశిష్ట్యము

ప్రశంసింప తగినది. జాతీయములగు తెనుగు పదములు సంస్కృతములతో పొందు కలసి నిరంతరాయంబున వర్తిలు సహజ సౌందర్యము గల సతీ పతుల వలె వర్తిల్లు చుండును. 'మండు తైల పరితప్త కటాహము కేలఁ దామరం దోడికిలి పట్టి' యను నెడ తెలుగు పదముల మధ్య సంస్కృత సమాసమును 'రాహువు విధుం గబళించిన రీతిఁ జూపఁ గ్రొమ్మడుగున కేగు భద్రకరి' యనుచోట సంస్కృతముల మధ్య తెనుగు రమణీయముగా బొదుగ బడినవి. ఇట్లు ఉభయ భాషా పదములను కలయఁ గలిపి పద్యము నడిపించుట పినవీరభద్రుని యలవాటు. పదునైదు పదునారవ శతాబ్దములందలి కవుల కావ్యములు పరిశీలించి చూచినచో నిట్టి కలయ కలుపు పోకడలు కనిపించును. అట్టి పోకడలకు దారి చూపినవాడు ఎఱ్ఱాప్రగడ

కమనీయ కమలినీ కల్లోల వీథులఁ
గదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరు లతా తతుల సొంపు
మకరంద రస పాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేఁటి గముల యులివుఁ
బరిపక్వ మంజుల ఫల రసోద్ధతములై
పలుకు రాచిలుకల పటు రవంబుఁ

ప్రియుఁడు వేఱువేఱఁ బ్రీతిమైఁ జూపుచుఁ
జెప్పుచును జనంగఁ జిగురుఁబోఁడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపంబు
లార నతని తెలుఁగు నరయు చుండె

ఇందు నన్నయగారి సంస్కృత సమాసంబులలోని మార్దవంపు నూర్పును తిక్కనగారి తెనుగు పదముల పొందికలోని జాలువారు తనము నిమిడి యున్నవి. కాని తిక్కనగారి తెనుగు పదములకు నెఱ్ఱన తెనుగు పదములకు చాల వ్యత్యాసము కలదు. తిక్కనగారి పదములు జాతీయములయిన మాండలికములగు అచ్చికములు. ఎఱ్ఱాప్రగడ పదములు జన వ్యావహారికము లయిన దేశీయ అచ్చికములు. కావున తిక్కనగారి పదములలో సనాతనత్వమును ఎఱ్ఱనగారి పదములలో నాజూకుతనము గోచరించును. ఎఱ్ఱనగారి రచనకు మెరుగు నెక్కించినవాడు శ్రీనాథుడు. వాని తెనుగు పదములు మరింత జన వ్యావహారికములకు దాపులయి హృదయ రంజనముగా నుండును.

మాటుగా వైచిన మాజిన్సు తెర యెత్తి
పంజు మంచము డిగ్గె మంజుఘోష
మొకరి మఱ్ఱెల మ్రోఁత ముద్దు చూపఁగ రంభ
కనకంపు గోడుగు పాగాలు దొడిగె
నొకట వేనలి ముడ్చి యొక్క కేల ఘృతాచి
గాజు చెక్కల తల్పు గడియ పుచ్చె
నలస భావముతోడ నలవోక ప్రమ్లోచ
నిలువుటద్దంబులో నీడ చూచె

హరిణి గీలిచె నలిన పట్టాంశుకంబు
మేనక ధరించెఁ బాలిండ్ల మీఁద అవిక
యప్సరస్త్రీని నికేత నాభ్యంతరములఁ
గొక్కురోకో యటంచును గోళ్లు గూసె

మాటుగా, తెర, మంచము, మట్టెలు, గొడుగు పాగాలు, గాజు చెక్కల తల్పు, గడియ విల్లు టద్దము, ఉవిక, క్రోళ్లు, కొక్కొరొకొ కో, ఇవి సర్వ జన వ్యావహారికములయిన తెనుగు దేశీయ పదములు. వానికి తోడు భావములు కూడ సర్వ సామాన్యములగు స్త్రీజన స్వభావములయి లోకానుభవ సిద్ధము లగుటచేత పై పద్యము పాఠకుల మనస్సు నాకర్షించి రంజింప చేయును. ఇట్టి రచనలకు శ్రీనాథుని కావ్యము లునికి పట్టులు. పద జాలములచేతను భావ ప్రదర్శనములచేతను కవితను మానవుల మనస్సుకు అనుభవమునకు మరింత దరిదాపులకు తెచ్చినవాడు శ్రీనాథుడు. దానిని గయ్యాళితనంబునఁ గరఁగఁ బోసి నిగ్గు తీసినవాడు ముక్కు తిమ్మన. వీరి కావ్యములలో సర్వజనాకర్షణీయ మగు తెనుగు తన మున్నది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు చాలవరకు శ్రీనాథుని పద్ధతుల ననుసరించెను. కాని శ్రీనాథుని పద్యములందున్న తీపితనము వీరన పద్యములందు కనిపించదు. దానికి కారణము శ్రీనాథుని రచనలలోని మానవ జనాకర్షణీయములగు వ్యావహారికములైన పదములు గాని నిత్యానుభవములం దుండు భావములు గాని యుపమానములు గాని యంతగా లేవు. శ్రీనాథుడు స్కాంధ పురాణాంతర్గతముల యిన కాశీఖండము భీమఖండములు తెలిగించెను. నైషధ మాంధ్రీకరించెను. హర విలాస మను పేరట కుమార సంభవ కిరాతార్జునీ యాదులందలి కథా భాగములు తెలుగు చేసెను. వానియందు సందర్భోచితముగా సామాన్యమగు మానవానుభవములను దృష్టియం దుంచుకొని సంస్కృత రచనకు మళ్లింపులు వెలయించెను. ఆ యా పట్టులందు పాఠకుని చిత్తము చూరగొను దేశీయ వ్యావహారికములను పొందుపరచెను. ఒడలుప్పొంగఁజేయు చక్కని భావములను నెలకొల్పెను. అది వాని లోకానుభవము జన పరిచయములవలన నలవరచుకొనిన ప్రజ్ఞ. అది వానియందు విశిష్టముగా నుదూరు కొన్నది. ఆ ప్రజ్ఞ వీరనయందు కొంత డిందుపడి యున్నది. తిమ్మనను వానియందు స్వయంసిద్ధము

యిన కవితా పాటవ మున్నది. శయ్యయందు ప్రవాహ వేగ మున్నది. అది పాఠకుని మనస్సును తనతో బంధించుకొని పరుగు లెత్తించును. మచ్చునకు

అక్షయ పుణ్య శీలు నిగమార్థ రహస్య కథా ప్రవీణు రు
ద్రాక్ష విభూతి వల్కల మృగాజిన శోభిత గాత్రు శ్రీపద
ప్రాక్షర మంత్ర లబ్ధ మహిమాధికు సౌబరిఁ గాంచి యా సనా
స్రాక్ష తనూభవుండు వినయంబునఁ జాఁగిలి మ్రొక్కె యిట్లనున్

పదములకొరకు తడుముకొని నట్లు గాని యతి ప్రాసలకొరకు ముందు వెనుక లాలోచించి నట్లు గాని రచనలో కనిపించదు. పద్యము నెత్తు కొని నంతనే వృత్తానుగతములగు గణముల ననుసరించి పదములు శర వేగమున వచ్చి హత్తుకొని పోవును. అది వాని పాండిత్యములో నున్నది. ఉట్టి పాండిత్యము సాహిత్యమున కుపకారి కానేరదు. అది అనుభవమునం దుండవలయును. దానికి రస సిద్ధి కలిగించి ప్రతిభా స్రోతస్సు మూలమున సాహిత్యములోనికి మళ్లింప వలయును. అప్పుడు కాని యిట్టి శయ్య యలవడదు. పాదాంతమునం దున్న శబ్దమును తరువాతి పాదములోనికి మలుపుటలో నేక ధారగా పద్యము చివరి వరకు నడచును. ఈ చాతుర్యము పైపద్యమునందు కనబడును. దుష్కర ప్రాస సుకర ప్రాస యను తలంపు గాని ప్రాస మార్చవలయునను నూహ గాని పినవీరభద్రునకు లేదు. వాని పాండిత్య ప్రకర్షలోను కవితా ధాటిలోను అవి తృణ ప్రాయములు. కావలసిన యతి ప్రాసలతో శబ్దములు రసనాగ్రము నుండి వెలువడును. మరొకటి

ప్రద్యుమ్నుని వృషకేతు స
మిద్యోధుల ననికిఁ బొండు మీరనినఁ ద్రయీ
వేద్యుఁడగు కృష్ణు ముందటఁ
బ్రద్యోతన పౌత్రుఁ డపుడు ప్రతినలు పలికెన్

పదములకు కొరంత పొసగని భాషా పండితుడు పినవీరభద్రుడు. వానికి శబ్దశాస్త్రము రసనాగ్రమునం దున్నది. ఎటువంటి కఠిన ప్రాస మయినను వానికి భయము లేదు. నిరాఘాటముగా వాడుచుండును. ఆ శక్తి శ్రీనాథునియందు కూడ కలదు. ఇట్టి కఠిన ప్రాసము గల పద్యములు జైమిని భారతమునందు పెక్కు గలవు. పినవీరన కవితా వాహినిలో గంభీరార్థము గల పదములు రత్న శలాకల వలె దొరలి వచ్చుచుండును. వానిని జుణిగి పోనీయకుండ పట్టి పరికింప వలయును. అందు వినుతింపఁదగు సారస్యంపు వెలుగులు పొందుకొని యుండును. 'ఇందు విభాస్య నాథుఁ జననీయుక' అను పద్యమునందు కొంత ప్రసంగించితిని. సుధన్వుడు మండుతైల పరితప్త కటాహమును రాహువు విధుం గబళించెడు రీతి కేలుఁ దామరల తోడ పట్టుకొనినాడు. ఇది యుపమాలంకారము. సుధన్వుడు రాహువు. మండు తైల తప్త కటాహము విధుడు. అనగా చంద్రుడు. కటాహమును చంద్రుని రాహువు వలె చేతులఁ బట్టుకొనెను. ఆ చేతులు కమలముల వలె మిగుల మృదులము లయినవి. అయినను అవి కమల లేదు. దానికి కారణము తప్త కటాహము చంద్రుని వలె చల్లనయి తోఁచినది కేలుఁ దామరలకు. తామరల నుపమానముగా చెప్పుటచేత కటాహమునందు చంద్రుని శీతలత్వము ద్యోతక మగుచున్నది. క్రొమ్మదుగున కేఁగు భద్రకరి మాడ్కి సుధన్వ డా కటాహమునందు చొచ్చెను. కరులకు చెరువులు చూచినచో నానంద మినుమడించును. అందు క్రొత్త మడు గనిన చెప్ప నక్కర లేదు. ఆ సంతోషమున కంత ముండదు. భద్రకరి యని వాడుటచేత నమురు బెమురు లేని యుత్తమజాతి కరి యని విశేషార్థము స్ఫురించును. అందుమూలమున మడుగు క్రొత్తదయినను అమితమగు బలగర్వము కలది కావున లెక్క లేకుండ అపరిచిత మైనను నిర్భయముగా నమితానందముతో నందు ప్రవేశించును. క్రొమ్మడుగు భద్రకరి యను శబ్దములలోని సారస్య మది. సుధన్వుడు భద్రకరికి పోల్చబడినాడు. కటాహము క్రొమ్మ

డుగు. సుధన్వుడు మహావిష్ణు భక్తుడు. అది వాని బలము. కావున నతడు ఉత్తమ మగు భద్రజాతి కరి వంటివాడు. వాని యుత్తమత్వము విష్ణుభక్తివలన కలిగినది. అట్టి వానికి తైలతప్త కటాహ మయినను క్రొమ్మడుగు వలె నోడ లుబికింప చేయు చల్లతనము చేత పరమసంతోష కర మయినది. విష్ణుభక్తి యను బలమువలని నదురు బెదురులు స్ఫురింప లేదు. అందు ప్రవేసించినాడు. పినవీరన యిట్టి సారస్య సహితము లయిన శబ్దములను వాడుచు నుపమా రూప కాలంకారములను వెల యించుటతో సంతృప్తిపడ లేదు. చివర అర్థాంతరన్యా సాలంకార మున్నది. 'బలియుర్ హరి దాసులు సత్య సంపదన్' అని పైని విశేష విషయమును సామాన్య విషయము చేత సమర్థించెను. ఇందు విష్ణువు నకు భక్తునకు గల సంబంధము హరి దాసులు అనుశబ్దమునందు నిరూ పింప బడినది. వైష్ణవ మత సారాంశములోని నికర మగు నిగ్గు వెల యింపఁ బడినది. అద్వైతము కంటె విశిష్టాద్వైతము భిన్నమయినది. అద్వైతమునందు జీవాత్మ పరమాత్మలకు భేదము లేదు. మోక్షార్థియై పర తత్త్వమును ఫలాపేక్ష లేక భజించువాని యాత్మ మరణానంతరము బ్రహ్మమునం దైక్యము నొందును. వానికి మరల జన్మ లేదు. ఇది అద్వైతము. విశిష్టాద్వైతమునందు జీవాత్మ పరమాత్మలకు గల సంబం ధము శేష శేషిత్వము. అనగా సేవ్య సేవక భావము. సేవ్యుడు హరి పరమాత్మ. వానికి రూపము కలదు. అద్వైతుల పర తత్త్వమునకు రూపము లేదు. సేవకుడు భక్తుడు. దాసుడు. హరి భక్తుడు విష్ణువు నకు నిరంతర దాస్య మొనరించి మరణానంతరము వైకుంఠము చేరును. అచట శంఖ చక్రాదులతో విష్ణు రూపము కలవాడయి యుండును. అచటను నిరంతరము భక్తుడు దాసుడయి హరిని సేవించు చుండును. అదే వైష్ణవుల మోక్షము. హరిభక్తుడు విష్ణువునందు సాయుజ్యము నొందడు. దాసత్వమున హరిని సేవించు చుండును. ఈ విశిష్టాద్వైత మత తత్త్వమును విష్ణువునకు భక్తునకు గల శేష శేషిత్వ సంబంధమును హరిదాసు లనుటలో నిరూపించినాడు పినవీరన. మహా ఘటికుడు.

హరిదాసులు బలయుతులట. హరి భక్తి వారికి బలము. సత్యవాక్పరి పాలనము దానికి తోడుండ వలయును. అందుకనే సత్యసంపదన్ అనివా డెను. సుధన్వుడు సత్య సంధుడు. అతని సత్య సంధత పితృవాక్య పరిపాల నము నందున్నది. ధర్మ నిర్వహణమునం దున్నది. పద్యాంతమునందలి సామాన్య విషయమునందు సుధన్వుని చరిత్రమంతయు నిమిడియున్నది. ఇట్టి మహత్తరాలంకార భావములతో నిబిడీకృతము లయిన పద్యములు జైమిని భారతమునందు పెక్కు కలవు. మచ్చున కక్కడక్కడ నొకటి రెండు చూప గలిగితిని. అన్నియు వెలయించుటకు గ్రంథము చాలమి నా విచారము. ఇట్టి పద్య రత్నములకు గని యగు జైమిని భారతమును తన ప్రతిభ వెలయించి రచించిన పినవీరన కర్తృత్వమును శారదా దేవిపై నారోపించుట కవికి ద్రోహము తలపెట్టుట. వాణి నా రాణి యన్నాడు వీరభద్రు డనుట మాత్ర ద్రోహ మా మహాకవి కంట కట్టుట.

కీలిత శిఖోగ్ర దారుణ
తైల కటాహంబు కంత దఘ్నమయిన భూ
పాల సుతు వదన మొప్పెన్
గాళిందీ నదములోని కమలము భంగిన్.

## అలంకారములు

సహజ సుందరమగు కావ్యాంగనకు వెలుగు తళుకుల మిలమిలల నాపా దించును. అవి యతిగా నొడలెల్ల నిండి యుండినచో మనోనయనము నకు మిఱుమిట్లు గొలుపును. సత్య స్వరూపము గోచరింపక దుప్పటి మరుగులోని బీబీల వలె రోత పుట్టించును. అది పాండిత్య ప్రకర్ష యం దుగ్గాక సాహిత్య లక్షణము కాదు. పరిమి తాలంకార భూషిత యగు కావ్యసుందరి పాఠకు నాకర్షించును. తన యంద చందముల వెల యించి మనస్సు నుప్పొంగ చేయును. భావానుభవములను ప్రదర్శించి యొడలు పులకింప చేయును. శయ్యా సౌకుమార్యంబు పొలయించి

మరెంత దాపునకు చేరదీసికొనును. పలుకుల మకరందాస్వాదన నొసంగును. రసానుభవము నొదవించి తనతో నైక్య మొనరించుకొనును. పాఠకుడు బాహ్య ప్రపంచమును మరచి బ్రహ్మానందమును బొందును. ఇది యుత్తమ కావ్య పరిచయమువలన పాఠకుడు పొందు రససిద్ధి. ఆనన్దో రసః. అట్టి యానందానుభవము నొదవించు కావ్యములు తెనుగు సారస్వతమునందు పరిమితముగా నున్నవి. అట్టి కావ్యములు రచించినవారు మహాకవులు. నూరు కావ్యములు రచించి నంత మాత్రముచేత మహాకవి కాజాలడు. మహాకవులు వ్రేళ్ళమీద లెక్కింప గలిగియుందురు. పంచషా మహాకవయః గణ్యన్తే. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు మహాకవి కాక పోయినను కాళిదాసు తరువాత భారవి వలె శ్రీనాథుని తరువాతి స్థానము నాక్రమింప దగినవాడు. ఆలంకారిక దృష్టిని విమర్శించి చూచినచో కాళిదాసు జ్ఞాపకమునకు వచ్చును. ఉపమా కాళిదాసస్య. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు జైమిని భారతమునందు ప్రత్యేకముగా వాడినన్ని యుపమాలంకారము లింకెవరు కావ్య ప్రపంచమున వాడి యుండరు. పినవీరనకు నుపమాలంకార మనిన అతిప్రీతి యని తోచుచున్నది. దానికి కారణము కాళిదాస రచన యయియుండవచ్చును. కాళిదాసు మొదట వ్రాసినది రఘువంశము. అందు వాడినన్ని యుపమలు మరెందును వాడలేదు. అడుగడుగున విసుగు విరామము లేక వాడెను. అందుకనే యా ప్రతీతి వచ్చియుండును. తరువాతి రచనలలో నంత విరివిగా నగుపించవు. పినవీరభద్రుడు కాళిదాసు వలె నతి విరివిగా వాడక పోయినను సమయానుకూలముగా నా యలంకారము నలంకార ప్రాయముగా వాడెను. అది పద్యమునకు రస పోషకమయి యా యా తావులందు నందము నొదవించినది. వెనుక నుదాహరించిన పద్యము లరయ వచ్చును. క్వాచిత్కముగా నక్కడక్కడ అర్థాంతరన్యాసము శ్లేష వాడెను. వైషమ్యమునందు తప్త తైలమును యమునకును ముఖమును కమలమునకును పోల్చబడెను. నూనె బాగుగా కాగి నప్పుడు నలుపు వన్నె తిరుగును. యమునా జలము నల్లగా నుండును. తైలమును

యమునతో పోల్చుట చేత సమాన ధర్మములయిన నీలత్వ శీతలత్వ ములు వ్యంజితములగు చున్నవి. అందు మూలమున తైలము బాగుగా కాగి పొగ లారుచు నల్లనయి యుండె ననియు సుధన్వుని పట్ల ప్రవాహ జలము వలె చల్లనయి యుండె ననియు ద్యోతక మగుచున్నది. కావుననే సుధన్వుని మోము కమలము వలె నున్న దని పోల్చి చెప్పెను. దారుణ యను విశేషణము తైలమునకు సార్థక మయినది. తరువాతి పద్యము

ఆ హేమ కృత కటాహ
స్నేహము దనుజారి దాసునికిఁ జారు శర
న్నీహార కిరణ చంద్రిక
యై హర్ష మొనర్చుచుండె నా సమయమునన్

ఇందు ఉపమా నోపమేయముల కభేదత్వము తెలుపుటవలన రూప కాలంకారము కలదు

ఆగడంబున బ్రహ్మస్వ మపహరించి
తెచ్చి పుణ్యంబు సేయుంగఁ దివురు కొల్లఁ
గుడిచి కూర్చుండి శిలఁ దెప్పకొయ్యఁ జేసి
జలధిలో నీదు లాడంగఁ దలచి నట్లు.

ఇది ధర్మరా జనిన మాట. మునుల ధనము తెచ్చి యశ్వమేధము చేయ మని వ్యాసునిబోధ. అట్లు బ్రహ్మస్వ మపహరించి తెచ్చి యాగము చేయుట శిలఁ దెప్పకొయ్యగాఁ జేసి జలధిలో నీదుట వంటి దని నుడివెను. శిలను దెప్పకొయ్యగా సముద్రము నీదుటవలన తెప్పకొయ్యతో పాటు తానును మునిగి మరణించును. ఇందు బ్రహ్మ స్వము రాతినావకు పోల్చబడినది. జలధి అశ్వమేధమునకు పోల్చబడినది. ఈదు లాడువాడు తెప్పమునిగి తానును మరణించు నట్లు ధన వ్యయము ఆత్మ వినాశము వాటిల్లు నని ఫలితాంశము. ఇట్టి మానవుల ఊహల

కందుకూరీలో నున్న యుపమానములతో పినవీరన జైమిని భాగ
తము రచించెను. సుధన్వుడు వైరి వీరుల నడంచెను. నరుని రణాంబునం
బెదిరించి నిలచెను. వీరిరువురి యుద్ధము పినవీరభద్రు డతి మనోహర
ముగా వర్ణించెను. అందు

వీర రసము

వెల్లిగొని పాఠకుని మనసు నోలలాడించు శయ్యా వైభవమును వచనా
సామర్థ్యమును వెలయించెను.

ఆ యోధాగ్రణిపై నరుండు కినుకన్ హాలాహ లార్చి చ్ఛటా
దాయాదోత్కట కీలలం దిశలు నిర్దగ్ధంబు గావించు నా
గ్నేయాస్త్రం బడరింప వాఁడు విలుచే న్నిర్ఘాంత కల్పాంబుద
చ్ఛాయా విభ్రమ గర్భితం బయిన పర్జన్యాస్త్ర మేసెన్ వడిన్

మెఱపులు దఱచుగఁ బెళపెళ
నుఱుముచు వడగండ్లతోఁ బయో ధారలు పె
న్వఱదలుగా నెల్లెడఁ జి
చ్చఱ పిడుగులతోడ వాన జడిగొని కురియన్

కందపు నడక లఘువులగు నక్షరముల పొందికతోడి పదముల కూర్పు
నిజముగా నురుములు మెరుపులతో జడివాన కురియు చున్నటుల
నున్నది. రచన యనగా నట్లుండ వలయును. ఈ వైదగ్ధ్యము పోతన
గారిలో పరిపక్వ స్థితిని పొందినది. విష్ణువు గజేంద్రుని రక్షింప బయలు
దేరెను. లక్ష్మి

అడిగెద నని కడు వడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁడని నడ యుడుగున్
వెడ వెడ చిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

మహానుభావుడు పోతన. వాని పద్యంపు నడక దారు లితరుల కలవడు నవి కావు. అలవరించు కొన తలంచినను వచ్చునవి కావు. కావుననే భాగవతము తెనుగు సారస్వమునం దగ్రతాంబూల మందుకొనినది. ఇట్టి పద్యముల రచనలోని యందచందములు వెలయించుచు కవుల ప్రతిభను చిత్రించుట సారస్వత చరిత్ర లక్షణము. కవులు కాలములు జీవితములు గ్రంథములో చెదలు తిన్న పుటలు, గద్యములు వ్రాయుట వాఙ్మయ చరిత్ర కాదు. పోతనగారు పై పద్యమునందు మొదటి రెండు పాదములలో లక్ష్మీదేవి మనస్సులోని సందేహమువలని కలిగిన తడ బాటు సూచించెను. చివరి రెండు పాదములలో అడుగులలో పొడమిన తడబాటు చిత్రించెను. అందుకని కడు వడి జనును. అడుగవలయు నని కోరిక. అడిగిన సమాధానము చెప్ప డేమో యని సందేహము. అందు మూలమున పోవక మానును. ఆ పోవుటయు నీ మానుటయు నొక్క కాలమునందు జరిగినవి. ఎట్లందు రేని అడుగుటకు ముందునకు పోవ నెత్తిన పాదము సందేహము వలన వెంటనే వెనుకకు లాగినది. మరల యథా స్థానమునందు చేర్చినది. అదియే చను నడ యుడుగు ననుటలోని భావము. నుడుగు నుడువు 'క్వచిత్తకారో వః' నుడవడని, నుడుగ డని రూపములు. అనుమానమువలన మనస్సులో చిడిముడి పాటు కలిగించినది. ఆ చిడిముడిపాటు అడుగులలో తడబా టొద వించినది. కావున అడగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్ అని పోతన వర్ణించినాడు. అడుగిడు నడుగిడదు అనునవి పరస్పర విరుద్ధార్థ ములు గల పదములు. ఒక్కకాలమునందు జరుగవు. అడుగిడుటకు కదలించిన పాదము ముందున కరుగక కదలించిన చోటుననే మరల నిలిచిన దని భావము. అనగా నిలిచినచోటనే చిందులు త్రొక్కినవి పాద ములని ఫలితార్థము. చివరి పాదమునందు డకారము వృత్త్యను ప్రాస గాగల లఘువులగు నక్షరముల కూర్పు వలన వినువానికి పదము లర్థము కాకపోయినను యడుగుల తడబాటు స్ఫురించును. అది యా పలుకుబడిలో నున్నది. దీనినే 'సౌండు ఎకోయింగ్ సెన్సు' అని

యాంగ్లేయు లందును. ఈ పద్యము మనస్సునకు పాదాది అంగము లకు గల సంబంధమును తెలుపును. మన స్సన్నింటికి ప్రధానము. దానిని బట్టి మాన వావయవములు ప్రవర్తిల్లు నని సూచన. ఇంత యందము పినవీరన పద్యములో లేదు. పినవీరన రెండు భాషలయందును పద్య రచన బిగువుగా నడిపింప గలడు. అందులకు పై రెండు పద్యములు తార్కాణములుగా గైకొన వచ్చును. ఆ యోధాగ్రణి యను పద్యమునందు సంస్కృత పదముల జటిలత చూపిన ప్రౌఢ యగు వాని గంటము రెండవ పద్యమునందు నురుములు మెఱుములతో జడివాన ధారా పాతముగా కురిపించినది. అందు వడగండ్ల వల్లితనము చిచ్చఱ పిడుగుల యుగ్రత పదము నర్థము వలె నొండొంటితో నెడబాయని పొందు కలసి యున్నవి. ఆ రెండు పద్యములు వాని రచనా వైలక్షణ్యమును వెలయించు చున్నవి. మృదులము లగు తెనుగు పదములలో కాలాగ్ని జ్వాలలు పుట్టింప గలవాడు తిక్కన. వాని యుద్ధ పంచక మంతయు నట్లు నడచినది. నుచ్చునకు

అర్జునుం డును పర్జన్యు నస్త్ర వృష్టిఁ
బల్లమును మిట్టు నని యెఱుపఱుప రాక
యుండ నెత్తురు వెల్లున లొండొండ పెరిఁగె
నుబ్బి భూత వేతాళంబు లోలలాడ

జల్లెడలును బక్కెరలును
బల్లంబులు జోళ్లు నాతపత్రాదులు న
వ్వెల్లిఁ బడి కలిసి మిట్టును
బల్లము నొక్కటిగఁ బొరలి పాఱఁగఁ దొడగెన్

ఇది పినవీరన పద్యము. తెనుగున వీరరసము కురిపించుటలో సాహితీ రంగమునం దిరువురు సమరథులు. ఒకరి కొకరు తీసిపోవువారు కారు. సుధన్వార్జునులకు పోరతి ఘోరముగా సాగినది. సుధన్వుడు కొరుకుడు

పడనివాఁడయినాఁ డర్జునునకు. అర్జున సారథిని చంపి రథమును రథ్యము లను స్వాధీనము తప్పునట్లు చేసెను. వేరు దారి తోఁచలేదు నరునకు. పయోరుహ నేత్రు సమస్త వేద వేద్యుండగు కృష్ణుని తలంచినాఁ డర్జునుడు. ఆ హరి భక్త పరాధీనుడు. తలంపు మాత్రముచేతనే యెదుట సాక్షాత్కరించెను. ఇందు మూలమున విష్ణుని సర్వ వ్యాపకత్వము సూచింప బడినది. అర్జునుని ప్రార్థనంబున రథము నడప నంగీకరించి నాఁడు హరి. సుధన్వార్జునులు శబథంబులు పలికికొనిరి. సుధన్వుడు నూరుబాణములు శ్రీకృష్ణుని వక్షంబు గాఁడ నేసినాడు. ఆ బాణ పాత వాతాహతికి

అమ్మాధవార్జునులఁ బెను
దుమ్ముఁ బొదుగ రథము దిరుగఁ ద్రోడఁగెఁ దడవుగా
బొమ్మరము తిరుగు నురవడిఁ
గుమ్మరి సారె గుడి తిరుగుకొనెడు విధమునన్

ఇక్కడ నుండి సుధన్వసురథుల యుద్ధభాగ మతి మనోహరముగా చిత్రింపబడినది. అది చదువు నప్పుడు పాఠకుని మనస్సు కరిగి నీరయి పోవు ననుట్లలో సందేహము లేదు. కథ నా విధముగా నడిపించినాడు పినవీరన. కథ రసవంత మయినను దానిని నడిపించుటలో కూడ చాకచక్య ముండ వలయును. అట్టి నేర్పు పినవీరనయం దున్నది. ఆ భాగమునందలి పద్యములు చదువునపు డొక్కొక్క చోట వీరావేశము, ఆనందము కలుగును. ఆ విధమున పరిభ్రమించు రథంబును రయంబునం గుదియం బట్టి శ్రీకృష్ణుండు

తీవ్ర శర ప్రకాండములఁ దేరు విఘాతముగా నొనర్చె వీఁ
డవ్రణ శౌర్యశాలి యగు టారయ కాడితి వాడినం బ్రతి
జ్ఞా వ్రత హాని కాని కొనసాఁగుట దుస్తర మిప్డు తేఁ డేక ప
త్నీ వ్రతుఁ డౌటఁ జేసె నది నీకును నాకు నశక్య మెమ్మెయిన్

అన్నా డర్జునునితో. ఇందు మూలమున సుధన్వు డేకపత్నీ వ్రతుం డనియు నింద్రియ సంయమనము కలవా డనియు సూచించ బడినది. ఇంద్రియ నిగ్రహము యోగమునకు బలము కల్పించును. యోగము తపస్సునకు ప్రధానా ధారము. అట్టి తపశ్శక్తి చేత సుధన్వు డింత పని చేయ గలిగె నని కృష్ణుని బోధ. అది నీకును నాకు నశక్య మెమ్మెయిన్ అనుటలో కొంత పరిహాసము కొంత సత్యము నున్నది. అర్జునుడు మేనమరంది. దక్షిణ నాయకుడు. కావున పరిహాసము. తాను అష్టమహిషీ విభుడు. ఇరువురియందు నేక పత్నీ వ్రతా భావము, అందుమూలమున మనస్సంయమనము లేదని యంతరార్థము. ఆ కారణమున సుధన్వుడు మనకంటె శక్తివంతు డని నిర్ణయము. మనో నిగ్రహమునకు గల మహత్తర మగు శక్తి యీ పద్యమునందు చూపబడినది. మనుచరిత్ర యం దిట్టి శక్తి చేతనే ప్రవరు డగ్ని సహాయమున నింటికి చేర గలిగెను. ఇంద్రియ సంయమనమును గురించి గీతలు మిగుల ప్రశంసించు చున్నవి. సుధన్వుని జయించుటకు కృష్ణార్జునుల శక్తి చాల లేదు. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తి గోపాలుర సంరక్షించిన పుణ్య ఫలము అర్జునుని బాణమునం దునిచెను. అది వ్యర్థ మయ్యెను. రెండవ బాణమునందు తాను పరశురా మావతారమున సకల క్షత్రియ సంహార మొనరించి కశ్యపునకు నొసంగిన భూదాన పుణ్య ఫలము నారోపించెను

గాండీవ జ్యా రావము
లొండొండ చెలంగ నమ్మహోగ్ర విశిఖము
ప్పాండవ మధ్యముఁ డేసిన
ఖండించె నతండు దివిజ గణము నుతింపన్

పరశురామావతారములోని పుణ్య ఫలము నిరర్థక మయినది. మూడవ బాణమున తన తేజో విశేషంబును రామావతార సంచితం బగు సమంచిత పుణ్య ఫలంబు ప్రతిష్ఠించెను. అంత సుధన్వుడు

అర త్రోవన్ దెగనేసె నేయ వృథగా కయ్యగ్ర ఖండంబు భీ
కర లీలం బరతెంచి బిట్టురవడిన్ ఖండించెఁ దద్దీవమున్

ఇంత పుణ్య ఫలము వ్యయించినాడు హరి సుధన్వుని మడియించుటకు. సంయమనముగల విష్ణు భక్తుల శక్తి దైవమును మించి యుండు నని దీని వలన బోధింపబడెను. విష్ణు భక్తి ప్రభావ మటువంటిది.

శిర మటు తెగి హరి నామ
స్మరణము చేయుచుఁ దన సమక్షమునఁ బడన్
బరికించి చూచె దానవ
హరుఁ డత్తేజంబు గలసె నవ్విభునందున్

ఇది విశిష్టాద్వైత సిద్ధాంతమునకు విరుద్ధము. విష్ణు భక్తుడు మరణించి విష్ణు సారూప్యము పొందు నని వారి సిద్ధాంతము. ఇచట ఐక్యము చెప్పబడినది. వ్యాస భారతమునందు శ్రీకృష్ణుడు శిశుపాలుని మస్తకమును ఛేదించెను.

ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్ర హతాద్రి తుల్యుఁడై
త్రెళ్లుడు వాని దైన పృథు దేహము నెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగ వచ్చి పరమేశ్వరు దేహము సొచ్చె విస్మయో
ద్ఫుల్ల విశాల నేత్రులయి భూపతు లెల్లను జూచు చుండఁగాన్

అని నుడువబడెను. ఈ రెండు పద్యములందు గల భావము చదువరు లరయునది. నన్నయగారి కల్పనా శక్తి సర్వ కవిజనాతీత మయినది. రచనా వైదగ్ధ్యము సారస్వత ప్రపంచమునకు వరవడి పంక్తి. ఆయనకు నాలంకారిక దృష్టి మెండు. అది రస పోషణకు సహాయకారియయి మనస్సును రంజింప చేయును.

శిశుపాలుని తేజము కృష్ణునియం దైక్యము నొందినది. భారతము జీవాత్మ పరమాత్మల కద్వైత స్థితిని బోధించు చున్నది. భాగవతమునందు హరిచేత సంరక్షితు డయిన గజేంద్రుడు

అపుడు శౌరి కేల నంటి నడవ
హస్తి లోక నాథుఁ డజ్ఞాన రహితుఁడై
విష్ణు రూపుఁ డగుచు వెలుఁగు చుండె

ఇందు విష్ణు రూప సిద్ధి గజేంద్రున కొదవినది. ఇది వైష్ణవాద్వైత సిద్ధాంతము. విశిష్టాద్వైత మీ రెండు విధములు నంగీకరించును. సత్యం జానాతి కృష్ణో హరిః. సుధన్వుని తమ్ముఁడు సురథుడు. అతడు అన్నను మించిన పరమ వైష్ణవ భక్తుడు. సత్వస్ఫూర్తి కలవాడు. కృష్ణాజ్ఞలను రణమున నెదిరించి నిలచెను.

కృష్ణ నీ పుణ్య మంతయుఁ గ్రీడి కొసఁగి
పిదప నిల్లు సుధన్వుఁ జంపింపఁ దగునె
పడుచు పని చేసితివి రేఁగుఁ బండ్లకొఱకు
ముత్తియంబులు వెలవోయు ములుచ కలఁడె

యన్నాడు సురథుడు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు లోకానుభవములు కల మహాకవి. వాని

యుపమానములు

లోకోక్తులు అర్థాంతరన్యాసములు వర్ణనలు పాఠకుల యనుభవముగ నుండును. అందువలన వాని కవిత మనస్సును రంజింప చేయుచుం డును. ఇట్టి నిత్య పరిచయము గల యుపమానములు కాళిదాసు కావ్యములకు మెరుగు లాపాదించినవి. జన వినుతికి పాత్రము లయి నవి. కవి కమిత యశము నార్జించినవి

ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః
ఏకో హి దోషో గుణ సన్నిపాతే నిమజ్జ తీందోః కిరణే ష్వివాంకః

పృథివ్యా ఇవ మాన దండః
విదూర భూమి ర్నవమేఘ శబ్దా దుద్భిన్నయా రత్న శలాక యేవ

శరీ మాద్యం ఖలు ధర్మ సాధనం

యాచ్నా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధ కామా

ఇత్యాదు లరయునది. కాళిదాసుని అర్థాంతరన్యాసములు లోకోక్తు లయి జనులచేత పరిపాటిగా వాడబడు చున్నవి. పాఠకు సూక్ష్మాల కందుబాటులో గల యుపమానములు వర్ణనలు కవిత్వమునకు నెనలేని వెలుగుల నొదవించు నలంకారములు. పినవీరన తన జైమిని భారత మునందు చాలవరకు లోకానుభవమునం దున్న యుపమానములనే వాడుచు వచ్చెను. అవి రత్న శలాకల వలె పద్యమున కొక వింత వికా సత్వము నందము నొదవించినవి. వెనుక నుదాహరించిన పద్యము లరయ వచ్చును. సురథుని శిరము తెగినది. అమ్మూర్ధము దారు యంత్ర శిల భాతిన్ బాహు మస్తంబు బిట్టగలం దాకినదట

అపుడు సురథుని శిరము తదంఘ్రి యుగళిఁ
గదిసె నెత్తమ్మి మిత్రుఁది పల్వదముఁ బోలె

ఆ శిరమును ప్రయాగ త్రివేణి సంగమునందు పడవేయు మని శ్రీకృష్ణుడు గరుత్మంతున కాన తిచ్చెను. వాడు కొనిపోవు చుండెను. శివుడు దానిని తెచ్చి తన కిమ్మని భృంగిరిటునితో ననెను

ఆతఁ డచటికిఁ జని త

ద్గరు దని లాహతి సుడివడి
సురగాలిం బడిన చొప్ప చొరుగును బోలెన్

పడినాడట. ఇట్టి చక్కని యుపమానము లనేకములు జైమిని భారత మునందు కలవు. మరొకటి రెండు

నర వృషకేతనుల తలల్
సిరివరుఁ డంగములఁ జేర్చి జీవద మణి పే
రురమున మోపె నదికెఁ ద
చ్ఛిరము లయస్కాంత మినుముఁ జెందిన మాడ్కిన్

సురథునిభక్తి యపార మయినది. వాని శిరమును శివుడు తన కంఠ కపాలికయందు నాయక రత్నముగా ధరించెను. తరువాత మఖాశ్వము స్త్రీమండలము చేరెను. ఆ మండలమునకు ప్రమీల రాణి. అర్జును డామెతో సమర మొనరించెను. ఆకాశవాణి పలుకుల ననుసరించి ప్రమీలను అర్జునుడు పరిణయ మాడెను. యజ్ఞ తురంగము వృక దేశమునందు ప్రవేశించెను. అచట భీషణునితో పోరి అర్జును డాతనిని మడియించెను. మణిపూర పురాధీశుడు బభ్రువాహనుడు. అతడు చిత్రాంగ దార్జునులకు జన్మించిన కుమారుడు. వాని సేనాపతి సుబుద్ధి. ఇంత వరకు గల కథా భాగము లేవియు వ్యాస భారతమునందు కాన రావు. తిక్కన బభ్రువాహ నార్జునుల కథ ముప్పది యారు పద్యము లలో ముగించెను. పినవీరభద్రుడు నూట యెనుబది యారు పద్యము లలో నతి రమణీయముగా చిత్రించెను. రెండు కథలకు చాల తారత మ్యము కలదు. బభ్రువాహనుడు తండ్రి చేత తిరస్కరింప బడెను. తిరిగి పురమునకు మరలు చుండెను. ఉలూచి దారిలో కనిపించినది. అర్జునుని పైకి బభ్రువాహనుని రణమునకు ప్రేరేపించినది. బభ్రువాహనుడు నరుని సమరమున నెదిరించెను. వాని తల ఖండించెను. ఉలూచి సంజీవ మణి వలన వానిని బ్రతికించినది. ఇది తిక్కన భారత కథా విధానము. జైమిని భారతమునందు బభ్రువాహనుని అర్జునుడు అవమానించెను. ఆ కోపమున నతడు తండ్రి మీదికి యుద్ధమున కరిగెను. అందు అర్జునుని సేనలను మారెమసంగి నటుల పీనుగు పెంట గావించెను. అట్టి తెరి

నృకళేబరంబు మింటికి వైచి కందుక
    క్రీడ వర్తించు డాకిని యోర్తు
దంతి దంత మ్మాలాతముగఁ ద్రిప్పుచు నాడుఁ
    జౌపదంబులమఁ బిశాచ మొకటి
యజనంబు చెలఁగుగా నభినయించుచు దేశ
    పాత్రమై యొక ప్రేత పాత్ర లాడు

భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు
దరిబేసి యగుచు బేతాళుఁ డొకఁడు

భూత గణములు కర తాళములు ఘటింపఁ
జిత్ర గతి నొర్తు చకచక ఝుంకృతులకుఁ
గొను దువాళుల నఖిల దిక్కులు చలింపఁ
దాండవం బాడు నట భైరవుండుఁ బోలి

ఇది భయానక రసము. కందుక క్రీడ, చౌపదము, దేశి ఇవి స్త్రీల నాట్య భేదములు. తాండవము పురుషు లొనరించునది. శివుని సాయం కాల చర్య. పినవీరన కొంత నాట్య కళా లక్షణము లెరిగిన దిట్ట యనుట కీ పద్యము ప్రమాణము. యుద్ధమునందు సకల సైన్యములు మడిసెను. బభ్రువాహనుడు విక్రమించి వృషకేతనుని శిరము త్రుంచెను. అర్జునుడు వాని శిరమును కరమున దాల్చి శోకించు చుండెను. చూచినాడు బభ్రువాహనుడు.

వైశ్యజుఁడఁ గాన సంగ్రామ వనధి లోని
వీర కోటీర మణులకు విలువఁ గంటిఁ
గర్ణ సూనుని శిర మనర్ఘంబు దీని
భవున కర్పించి పడయుము పాశుపతము

అన్నాడు బభ్రువాహనుడు. ఇందు నుద్రేకము వీరావేశము రోషము అక్కసు వేళాకోళము తిరస్కారము పరిహాసము జాలు పట్టి పద పదమును రస ప్లావితము గావించినాడు పిన వీరభద్రుడు. వాని ప్రతిభకు నీ పద్య మొరిపిడి రాయి. దీనిని చదువు నప్పు డాయా భావములు మనమునందు చొరబారె రసికుల మనము నుప్పొంగించి నవ్వు తెరలాడించును. వీని రచనాచాతుర్యమును తలపించి యారా యని పించును. పినవీరభద్రుడు కడు మాటకారి. అందు సారస్య జీవమును జొనిపించి పద్యమునకు చైతన్యమును కలిగించు శక్తి వానియం

దున్నది. పాత్రలచేత మాటకు మాట సమాధానము చెప్పింప గలడు. సమయ స్ఫూర్తి వానియందు గూడు కట్టుకొని పద జాలములను ముందునకు వెడల నడిపించు చుండును.

అప్పుడు మహాకిరీటాంజలిఁ బ్రియంబునఁ జేయుచు దేవ నిన్ను నై
తప్పునఁ జేరె నీ హయము తండ్రికి నోర్వక పోదు బిడ్డఁ డే
యొప్పమిఁ జేసె నేనియు ననూన కృపామతి నన్నుఁ జూచి యీ
తప్పు సహింపు మంచు వసుధాస్థలిఁ జాఁగిలి మొక్కెఁ గ్రమ్మఱన్

ఇందు బభ్రువాహనుని వినయము చక్కగా ప్రదర్శింప బడినది. అర్జును డాగ్రహమున వాని శిరమును తన్నెను.

మునుగలఁ బొలితెంచు హయముం గని పట్టి పిఱుంద వచ్చు సే
నం గని ప్రాణ భీతిఁ గదనంబునకుం జొరం వైతి వోరి మా
వంగడ మాట కల్ల మును వైశ్యునకుం గనెఁ బోలు నిన్ను చి
త్రాంగద

అన్నా డర్జునుడు. ఆ మాటకు రోషావేశము ముంచుకొని వచ్చినది బభ్రువాహనునకు. చతురంగ బలములను కూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధుడైనాడు. విజయము సాధించినాడు. వాని కసి తీరినది. తాను ఉత్తమ క్షత్రియ వంశ సంజాతుండ నగు వీరాధివీరుండ నని నిరూపించు కొనినాడు. మా వంగడ మాట కల్ల యనిన యర్జునుని మాటకు కార్య రూపమున సమాధానము చెప్పినాడు. వైశ్యునకుం గనెఁ బోలు నిన్ను చిత్రాంగద యన్న యవమానము మనస్సును వేధించు చున్నది. దానికి మాటలతో సమాధానము చెప్పినాడు బభ్రువాహనుడు. నీ వని నటుల వైశ్యునకు పుట్టినవాడను గావుననే యీ యుద్ధ సముద్రమునందలి ఉత్తమము లైన వీరులనెడు మహావీరుల కిరీటములలోని జాతి రత్నముల విలువ తెలిసికొన గలిగితిని అని చెప్పివేసినాడు

బభ్రువాహనుడు. ఇది రూపకాలంకారము. వీర కోటీర మణు లను చోట కోటీర మణుల వలె నుత్తమాలంకారులైన వీర వరులని రూపకము చెప్పవలెను. సముద్రము రత్నాకర మగుట లోక విదితము. సముద్రము వంటి నీ సేన లోని మహావీరుల శిర ములను గ్రహించినాడను. అందువలని కలుగు నమోఘ మగు కీర్తిని సంపాదించినాడను. కావున నేను నీకంటె మహా వీరాధి వీరుడను. నీ వనినట్లు సేనం గని ప్రాణ భీతిఁ గదనంబునకుం జొరనట్టి పిరికివాడనగు వైశ్యుడను గాను అని అంతరార్థము. అనర్ఘము లగు వీర రత్నములను నా పరాక్రమముచేత నాచికొంటెని. నీవు వానిని కోల్పోయితివి. వీరక్షత్రి యోచిత మగు భుజ బలమును వెలయించి కాచుకొన లేక పోయితివి. దైన్యమున వైశ్యుని వలె విలపించు చుంటివి. ఇరువురము తండ్రి కుమారుల మగుట వైశ్యుల మయితిమి. ఇంక పరాక్రమవంతుడ వయి నిన్ను నీవు రక్షించుకొనుటకు వృషకేతనుని శిరము నొసంగి పాశుపతమును శివునివలన కొనుము. అది అనర్ఘ మయినది. వెలపెట్టి కొనుట దానిని అధిక ధనమున కమ్ముట వైశ్యులకు స్వభావము అని మనస్సు నుచ్చిపోవ నాడెను. కర్ణసూనుని శిర మనర్ఘంబు. దీనిని భవున కర్పింపు మనుట చేత అతడు లోకోత్తర మగు విష్ణుభక్తి కల పరాక్రమవంతు డని ధ్వని. మహాశూరు లగు భక్తుల శిరములు కంఠహారమణులుగా నుపయోగించు కొనుట శివుని యలవాటు.

శూరులు ధర్మ చరిత్రు లు
దారులు విజితేంద్రియులు కృతజ్ఞులు జగ దా
ధారు లని వారి శిరములు
హారమ్ములుగా ధరింతు ననవరతంబున్

ఇది శివుని నోట పలికిన మాట. ఇట్టి ధ్వని యుతములు సారస్య గర్భితము లగు పద్యములు జైమిని భారతమునందు పినవీరన యందందు వెదజల్లెను. అర్జునుని తల రణమున బభ్రువాహనుని శరపాతమున

తెగి పడినది. ఈ ఘట్టమున నులూచిని చిత్రాంగద నిందించి నట్లు వ్యాస భారతమునందు కలదు. జైమిని భారతమునం దట్లుగాక యిరువురు విలపించి నటు లున్నది. ఈ సందర్భమునందు పినవీరన

కరుణ రసము

ను చక్కగా పోషించెను. పదునైదు పద్యములు పాఠకుని చిత్తము కరిగి కన్నుల వెంట నంబు ధారలు జాల్వారు నటుల రచించెను. అందుండి రెండు మూడు పద్యములు

తరువున జనించి వైశ్వా
నరుఁడు తరువుఁ గాల్చు విధమునను బుత్త్రుఁడవై
నరున కుదయించి తండ్రిని
పొరిగొంటివి విధవ కేల భూషణ మింకన్

ఇందునుపమాలంకారము కలదు.

జనకునిఁ జంపిన మాడ్కిని
జనయిత్రుల మన్కి నిపుడ చంపుమ జననీ
జనక వధం బొనరించినఁ
గనియెదు భార్గవుని కన్న ఘనతర కీర్తుల్

భార్గవరాము డొక తల్లిని మాత్రమే వధించెను. ఇంక నీవు మాతా పితృ హంతకుడ వని ఇందు దృష్టాంతాలంకారము. ఒక విధముగా నిందు వ్యతిరేక లక్షణ వలన ఘనత రాపకీర్తి పొందుదువు గాని యని వ్యంగ్యార్థము స్ఫురించును.

ప్రియుఁడు పరలోక గతుఁడైన పిదప సతుల
కనుగమన మెందు నర్హాకృత్యంబు తగిన
తెఱఁగు గావింపఁ బనుపుము తీర్చికొనెద
మగ్ని ముఖమునఁ బతి వియోగాగ్ని

అని ఉలూచీ చిత్రాంగదలు విలపించిరి. ఈ సందర్భమున తిక్కనగారి పద్యముల కంటె పినవీరన పద్యములు మిగుల రసవంతములై యున్నవి. ఇట్లనుటచేత తిక్కనగారికంటె పినవీరభద్రుడు ఘనుడని నా యభిప్రాయము కాదు. తిక్కనగారి యశ్వమేధ పర్వమునందలి ఈ యా ఘట్టములు సరితూచి చూచినచో కొంచెము నీరసించి నటుల తోచక మానదు. పురాణ మిత్యేవ న సాధు సర్వం. తిక్కనగారి విరాటో ద్యోగ పర్వములలోని బిగువు నంద చందములు రాను రాను తరుగుచు వచ్చినవి. యుద్ధ పంచకములోని యా ధాటి యశ్వమేధము నందు కానరాదు.

ఉలూచి సంజీవ మణిని తెమ్మని పుండరీకుని పంపెను. శేషుడు మణి నిచ్చుట కంగీకరింపలేదు. బభ్రువాహనుడు పరాక్రమించి దానిని తెచ్చెను. అంతలో నాగ కుమారు లర్జునుని తల నపహరించిరి. అంతలో కృష్ణు డరుదెంచెను. తన బ్రహ్మచర్య వ్రత ప్రభావమున అర్జునుని తల తెప్పించెను. సంజీవని మణివలన వృషకేతార్జునుల బ్రతికించెను. ఇది జైమిని భారతము కథ. ఉలూచి తలంచి నంతనె సంజీవని మణి వచ్చినది. దానిని బభ్రువాహనుని చేతి కిచ్చెను. అత డర్జునుని వక్షమున దాని నుంచెను. అర్జునుడు బ్రతికెను. ఇది తిక్కన భారతములోని కథ. జైమిని భారతమునం దారవ ఆశ్వాస మున నుత్తర రామ చరిత్ర కలదు. అందుండి యొక పద్యము

ప్రాచీన నీరసారణ్యంబు గాని యో
గ్య తపోవన శ్రేణి గానరాదు
వికటోగ్ర ఖర కంటక కుడుంగములు గాని
కర్మంది మఠవాటి గానరాదు
నెగయు దావాగ్ని క్రొంబొగ వెల్లి గాని యు
ద్గత సామ ధూమంబు గానరాదు
శరభ గండక సింహ శార్దూలములు గాని
మౌని రాట్సంతతి గానరాదు

కఠిన పాషాణ దుర్ధర్ష కాపథంబు
గాని నడయాడు మార్గంబు గానరాదు
దాశరథిఁ బాసినట్టి దుస్తరపుఁ బాప
కర్మరాలికి నవియేల గానవచ్చు

నని చింతించినది సీత. సీసపద్యము నాల్గు పాదములు సమానముగా నడిపించుట నన్నెచోడుని కుమారసంభవమునందు ప్రాచీన కవులలో కనిపించును. దానిని కొంతవఱకు ననుసరించినవాడు తిక్కన. నడకకు క్రొత్త తీరులు కల్పించి మొదటి పాదమువలె మిగిలిన పాదములు సమతూకము తీర్చి దిద్దినవాడు శ్రీనాథుడు. సీసములోని తీరు దుసికిలకుండ గీతములోనికి చొనిపించి సీసమును గీతము నేక విధముగా ప్రసగించినవాడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు. ఈ విధపు నడకను తరువాత కవు లనుసరించిరి. పై పద్యము నితర ప్రాచీన కవుల సీస పద్యములతో సరిపోల్చి చూచుకొనునది. పినవీన శ్రీనాథుని వలె కావ్య లోకమునకు చక్కని

పదములు సమాసములు

ప్రసాదించెను. వీరస పుచ్చి, ఆగడము, దొంతికోల, చెంగిరి, కొటికె, మది చుట్టను, చేయార్చుకొను, దొడ్డ, ములుచ, మారి మసంగు, వారఁబట్టు, చీఁదఱలు గొలుపు, ఉమ్మ, తూకము, కూబరము, అప్పళించు, చౌకళించు, పడుచు కొడుకవు, ఆట పాటలు, జాలెలు, సొన్నాలు, బదరికము, తోటులు, కృతపద్ధ తప్పు, నడగడు, బోలెము, వీపు విఱిగి, ఎచ్చిలు, కండ తుండములు, తెగుఁబెంపు, జగడించు, పచ్చి బండగులు, కత్తెరికలియు, వీపు నెటుకుగను, వెఱవేఁకి దాఁకు, మిడుకు ఇటువంటి వ్యావహారిక దేశీయ పదములు జైమిని భారతము నందు పినవీరన యందందు నుపయోగించెను. పినవీరన కవితలో

దోషములు

గలవను వారు కలరు. తెనుగు దేశభాష సజీవ మయినది. అందలి పద స్వరూపములు అర్థములు సంధి విధానములు కాలమును బట్టియు మండలములను బట్టియు మారుచుండును. ప్రవాహినీ దేశ్యా. దాని నాపగలవారు లేరు. పినవీరన పండితుడు, కవి. దేశమందలి ఆర్య వ్యవహార సిద్ధములగు పదములను వాడును. పూర్వ కవులందిట్టి ప్రయోగములు లేవని తలంప రాదు. కవులు లోక వ్యవహారము లను తమ కావ్యములందు చొనిపింతురు. వానికి సూత్రములు నిర్మిం చుట లాక్షణికుల పని. అవి దుష్టము లనుట సాహసము. తెలుగున వ్యాకరణము చాల చిన్నది. పూర్వ కవుల కావ్యములందు విడిచి పుచ్చిన ప్రయోగములు చాల కలవు. బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకర ణోదు లసంపూర్ణములు. ఒనరిం చెదు రేగుదెంచు, ఎఱిగిట్లు, ఇత్యాది క్త్వార్థక ఇకార సంధులు, వీరమాతట, దారని ఇత్యాది తత్సను స్త్రీవాచక సంధులు, చుట్టుక, కట్టుక, పట్టుక, తోలుక ఇత్యాదులగు కొనుటకు, కవాడుట లోక వ్యవహారమునందు కలవు. అవి తప్పులు గావు.

ధర్మజుని క్రతు హాయము రత్నపురము చేరినది. దానికి రాజు మయూరధ్వజుడు. అత డశ్వమేధ యాగము చేయుచుండెను. అశ్వమును విడిచెను. దానిని సంరక్షించుచు వాని కుమారుడు తామ్రధ్వజుడు వెనువెంట వచ్చుచుండెను. రెండశ్వము లెదురు పడినవి. తామ్ర ధ్వజుడు కృష్ణార్జునుల రణమున నోడించెను. క్రతు తురంగమును గొని పురమున కరిగెను. ఆ సంగతి తండ్రికి నివేదించెను. తండ్రి మయూరధ్వజుడు

క్రతు ఫల దాత యైన హరి గయ్యము నోడ్వకు బరిత్యజించి శూ
రతఁ గొని వచ్చి తీ మఖ తురంగము నెవ్వరిఁ గూర్చి చేయ నీ
క్రతు విఁక నంచుఁ దానుఁ గులకాంతయు

వెతనొందిరి. ఈ పద్యము నందు శ్రీ కృష్ణుడు క్రతు ఫలదాత యని నిర్దేశింప బడినది. ఇందు మయూరధ్వజుని విష్ణుభక్తియు పరతత్వ జ్ఞానము ప్రతిబింబించు చున్నవి. ఆ పురమునందలి ప్రజలు సహితము విష్ణుభక్తి పరతంత్రులు. కృష్ణార్జునులు మాయా విప్రరూపములతో రత్నపురమును ప్రవేశించిరి. పురవీథుల నరుగుచుండిరి.

సురత సుఖంబులన్ మిగులఁ జొక్కుచు నొక్క విటుండు కాంత! నీ
కురులకుఁ గృష్ణ వర్ణమును గుంకుమ గుబ్బల కచ్యుతత్వమున్
దొరకె నన న్ని జేసు కర తోయరుహంబుఁ బెమల్చి నిన్న నీ
కరముల శంఖ చక్రములుగాఁ బురుషోత్తముఁ జేసె

నన్నది ప్రియురాలు. విన్నాడు శ్రీకృష్ణుడు.

సరసిజ లోచనుఁ డిట్లను
హరిహయ సుతుతోడఁ జూడు మాశ్చర్యం బీ
పుర జనము భక్తి సురతపు
సరసతలను మామక ప్రశంసలె యెపుడున్

తలఁపులు హరి చింతనములు
పలుకులు హరికీర్తనానుభవములు పని పా
టలు హరి కృత్యంబులు భూ
తల వైకుంఠంబు పొగడఁ దగు నిది

అని ప్రశంసించెను. జైమిని భారమునందలి కథలు విష్ణుభక్తిని బోధించునవి కావున భక్తి ప్రధానాంగము. వీరము అంగి. మిగిలిన రసము లుపాంగములు. శ్రీకృష్ణుడు కావ్యమునందు నంతటను ప్రధాన పాత్రగా కనిపించును. కావున శ్రీకృష్ణుడు నాయకుడు. అర్జును డుపనాయకుడు. జైమిని భారతము అష్టమాశ్వాసమునందు చంద్రహాస చరిత్ర కలదు. అందుండి రెండు పద్యములు

అలసతఁ జూపు నొయ్యారంపు నడపులు
వన మయూరముల గర్వముఁ గుదింప
సఖుల వేమఱుఁ బిల్చు సరసంపు బలుఁగులు
మత్త కోకిలముల మనసుఁ గలఁప
నిటలంబుల నటించు కుటి లాలకంబులు
షట్పదంబుల విలాసములు గెలువఁ
దరళ లోచనముల ధాళధళ్యంబులు
హరిణిల సౌభాగ్య మవఘళింప

దండడించు మనోహ రోద్ధత విహార
సరణిఁ జంపక మాలినీ తరుణిఁ గూడి
మానినులు గోసి రవ్వన మంజరులను
సరసి సరసిజములఁ బెక్కు చందముల

సచివ పుత్త్రి విషయ శారీర వాసన
వనము గంధసార వనముఁ జేసె
గళిత హార మణులఁ గమలాకరంబు ర
త్నాకరంబుఁ జేసె నలస గతుల

చంద్రహాసుడు సాలగ్రామ మొకటి మ్రింగెను. అందు మూలమున వాఁడెవరిచేతను వధింపబడ డయ్యెను. ఈ సందర్భమున కవి

మొగిఁ జతుర్దశ లోకముల భరించు ఫలంబు
చేరు సాలగ్రామ ధారణమున
ధారుణీ చక్ర మంతయు నిచ్చిన ఫలంబు
దక్కు సాలగ్రామ దానమునను
సకల దేవతల నర్చన చేసిన ఫలంబు
పొందు సాలగ్రామ పూజనమునఁ
పరమ పావన వేద పారాయణ ఫలంబు
వచ్చు సాలగ్రామ వర్ణనమున

యతి యనంగ సాలగ్రాము మనఁగ భోగి
తల్పునకును జరాచర తనువు లనుచు
సంతతము బ్రహ్మ గొనియాడు నంతకంటెఁ
దుర్యమని చెప్పుచుండు శ్రీతులసి మహిమ

అని సాలగ్రామ మహిమ నభినుతించెను. చంద్రహాసుని కథ తరువాత బకదాల్భ్యుని కథ కలదు. చివరకి అశ్వమేధ హయము జయద్రథాత్మజుని రాజ్యంబునందు చొచ్చినది.

చారులచే గాండీవి మ
హారథికులతోడ వచ్చెనని విని గుండెల్
నీరై సైంధవ తనయుఁడు
పేరోలగ ముండి బిట్టు పిఱువడి చచ్చెన్

వాని కుమారుని వెంట నిడుకొని దుస్సల యజ్ఞునుని కడకు విలపించుచు వచ్చినది. కుమారుని మరణ వృత్తాంతము చెప్పి మనుమని రక్షింపు మని వేడినది. శ్రీకృష్ణుడు సైంధవ సుతుని మేను నిమిరెను. వాడు బ్రతికెను. బభ్రువాహనుని కథ తరువాత సైంధవుని కథ వరకు గల మయూరధ్వజాదుల కథలు వ్యాస భారతము నందు లేవు. వ్యాస భారతమందలి కథలు జైమిని భారతమునందు లేవు. ఉన్న కథలు రెంటియందు మిగుల వ్యత్యాసము కనిపించు చున్నవి. మరణించిన సింధురాజు కొడుకును శ్రీకృష్ణుడు మరల బ్రతికించి నటుల వ్యాస భారతమునందు లేదు. ఈ భారతమ్ములను పరిశీలించి చూచినచో వ్యాసుని భారతములోని యశ్వమేధ పర్వమున కిది

## అనుబంధము

గా జైమిని వ్రాసియుండు నేమో యని తోచుచున్నది. జైమిని వ్యాసుని శిష్యుడు. వ్యాసుడు భారతమును రచించెను. దానికి జయ యని పేరు పెట్టెను. దానిని ప్రపంచమున ప్రచారముచేయ శిష్యులను నియమించెను. వ్యాస భారతమును జనమేజయునకు వైశంపాయనుడు వినిపించెను. దానిని శౌనకాది మహామునులకు సూతుడు వచించెను. గురు విరచిత మయిన భారతము మరల జైమిని వ్రాసియుండడు. అశ్వమేధ పర్వములో వ్యాసుడు విడిచి పుచ్చిన కథా భాగములను మాత్రము కావ్య సరణి వ్రాసి యుండును. అందు శ్రీకృష్ణుని పరతత్త్వముగా నిరూపించుచు విష్ణుభక్తి ప్రకటితముగా నీ గ్రంథమును రచించి యుండు నేమో నని నా యూహ. లేనిచో మిగిలిన జైమిని విరచిత భారత మెందును లేక యొక్క యశ్వమేధ పర్వము మాత్రమే మిగిలి యుండుట చేకూరదు. ఇది నా తలంపు. సత్యము కావచ్చును. కాకపో వచ్చును. ఏమయినను జైమిని భారతము పిల్లలమఱ్ఱి పినవీరభద్రునిచేత తెనిగింప బడుట యాంధ్రుల యదృష్టము. శ్రీనాథుని కాశీఖండ భీమఖండములతో పాటు సరి వచ్చు జైమిని భారతము తెనుగు సారస్వత సరస్వతికి నవ రసంబుల మెరుగు లీను రత్న ఖచిత మగు కంఠహార మగుటలో సందేహము లేదు. పినవీరన రచించిన రెండవ గ్రంథము

## శృంగార శాకుంతలము

ఈ కవి పద్య రచనా విధానమునందే కాక గ్రంథముల నామమును నిర్ణయించుటయందును కథా పరిగ్రహణమునందును శ్రీనాథు నడుగు జాడలలో వర్తించెను. శ్రీనాథుడు నైషధమును దమయంతీ పరిణయమువరకు తెనిగించెను. దానికి శృంగార నైషధమని పేరు పెట్టెను. పినవీరన కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమును భారతమునందలి దుష్యం

తోపాఖ్యానమును పురస్కరించుకొని దుష్యంతు డాకాశవాణి పలుకుల నాదరించి శకుంతలను పరిగ్రహించుట వరకు కావ్యముగా రచించెను. శృంగార శాకుంతలమని పేరు పెట్టెను. మొదలు తుదలు భారతములోని కథ యైనను మధ్య కొలది మార్పులతో కాళిదాసుని శాకుంతలమును అనుకరించెను. అది కృతికర్త కోరిక

భారత ప్రోక్త కథ మూల కారణముగఁ
గాళిదాసుని నాటక క్రమము కొంత
తావకోక్తి నభినవ శ్రీ వహింపఁ
గూర్మిఁ గృతి సేయు నాకు శాకుంతలంబు

అట్లే శృంగార శాకుంతలము రచించెను. చిల్లర వెన్నయ మంత్రి కంకిత మొసంగెను. నాటకము కావ్యముగా మార్చి మొదట వ్రాసిన వాడు మంచెన. అతడు విద్ధసాలభంజికను కేయూర బాహు చరిత్ర మను పేర ప్రబంధముగా రచించెను. ఆ పద్ధతి ననుసరించినవాడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు. కాని యితని రచనకు మూలము భారతములోని శకుంతల కథ. దానికి అభిజ్ఞాన శాకుంతలములోని కథను జోడించినాడు పిన వీరభద్రుడు. శృంగార శాకుంతలము నాల్గాశ్వాసముల గ్రంథము. కథ హస్తినాపుర వర్ణనతో ప్రారంభ మయినది.

పద్మరాగోపల ప్రాకార రుచి జాల
గండూషిత వ్యోమ మండలంబు
పాతాళ జల ఝరీ పర్యాప్త కల్లోల
సుకుమార పరిఘోప శోభితంబు
శక్రనీల శిలా విశాల గోపుర రోచి
రసమయ జనిత మిథ్యాతపంబు
కనక గోపానసీ ఖచిత ముక్తాఫల
రాజీవ లగ్న తారా గణంబు

రాజ సదనాగ్ర దేశ విరాజమాన
తోరణాలీన మణి గణ ద్యుతి వితాన
విభవ లక్ష్మి విలంబిత విలస దింద్ర
చాప రుచి చాపలము హస్తినా పురంబు

ఇది కథా ప్రారంభ పద్యము. ఇందతిశయోక్తి యలంకారము కలదు

ఉపమేయ మింత దడవక
యుపమానమె నుడువ నతిశయోక్తి

అని కావ్యాలంకారము. అందు నిది యసంబంధ సంబధాతిశయోక్తి. వ్యోమ మండ లాదులకు ప్రాకారాదులతో సంబంధము లేకపోయినను గండూపాదికములచేత సంబంధము కల్పింప బడినది. పై సీసము నందలి రెండు మూడు నాల్గు పాదములు జైమిని భారతములోని భద్రావతీ పుర వర్ణన సీసమునందు గలవు.

ఆ ,పురి నున్నత స్ఫటిక హర్మ్య విభా పటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నిది దివ్య తరంగిణి యెత్తి వచ్చెఁ దా
నీపయి త్రోవ నంచు బయ లీదుచుఁ గోయఁ దలంతు రగ్ర సం
స్థాపిత హేమ కుంభములు తామర లంచు వియచ్చ రాంగనల్

ఇది రెండవ పద్యము. వియచ్చ రాంగనలు హర్మ్య విభా పటలం బాకాశ గంగ యనియు హేమ కుంభములు బంగారు తామర లనియు భ్రమించి బయ లీదుచుఁ గోయ తలంచుటచేత నిందు భ్రాంతిమంత మలంకారము.

అల యుపమేయము ధన్నత
నలరఁగ నారోప్యమాణ మగు నుపమానం
బిల నెఱుక పడఁగ భ్రాంతి మ
దలంకరణ మయ్యె

ఉపమేయములగు విభా పటలంబు హేమ కుంభములు ఛన్నములయి నవి. దివ్య తరంగిణి తామరలు ద్యోతకము లగుచున్నవి. మహాకావ్య మునం దష్టాదశ వర్ణన లుండవలయునని లక్షణ కర్తల తలంపు. అందు పురవర్ణన మొకటి. పినవీరన పదునేను పద్యములలో హస్తినా పురము వర్ణించెను. తరువాత నాయకా వర్ణనము

విశ్వ సన్నుతి శాశ్వ తైశ్వర్య పర్యాయ
కుటిల కుండలి రాజ కుండలుండు
దిగిభ శుండా కాండ దీర్ఘ బాహా దండ
మాని తాఖిల మహీ మండలుండు
జన సన్ను తానన్య సామ్రాజ్య వైభవ
శ్లాఘా కలిత పాక శాసనుండు
కుల శిలోచ్చయ సాను కోణ స్థల న్యస్త
శస్త్ర విక్రమ జయ శాసనుండు

భాసమాన మనీషాంబుజాసనుండు
సకల దేశావనీపాల మకుట నూత్న
రత్న రారజ్య దంఘ్రి వీర జయగుండు
శంబరారాతి నిభుడు దుష్యంత విభుడు

ఈ పద్యము శృంగార నైషధములోని

తపనీయ దండైక ధవళాత పత్రితో

ద్దండ తేజః కీర్తి మండలుండు

అను పద్యమున కనుకరణము. పై పినవీరన పద్యమునందు రూపకము కలదు. పినవీరన పండితు డనుటలో సందేహము లేదు. శ్రీనాథుని సకల విధముల ననుకరించుటకు విశ్వ ప్రయత్నము గావించెను. శ్రీనాథుడు కావ్య యుగ కర్త. సకల రాజ పూజితుడు. యశో ధని.

కవి సార్వభౌముడు. వానిని బోల చూచుట మంచి యాశయ మగును. కాని తాను వ్రాయుచున్నది తెనుగు కావ్య మనుట మరచిపోయి యిట్టి దీర్ఘ సమాస కలితములగు పద్యములను చొనిపించుట మృదు మనోహర రూప సంగత యగు తెనుగు కవితాంగనకు రూపము కానరానీయకుండ దట్టంపు బంగారు సరిగె దుప్పటము ముసుంగు పరచి బీబీల నొనరించుట వంటిది. శ్రీనాథుడు కాశీఖండ భీమఖండ శృంగార నైషధము లందు గావించినదియును నదియే. కాని వానియందు నచ్చటచ్చట మనసు నుప్పొంగ జేయు తెనుగు రచనలు గల భాగములు వానిని మరపింప చేసినవి. అవి మండు టెండలో గులకరాల మీద నడచి వచ్చిన తరువాత పూలపాన్పుపై పవళింపుల వలె పాఠకునకు మనస్సు చల్లదనము గూర్చును. ఇట్లనుటవలన సంస్కృత ముండ రాదని నా అభిప్రాయము కాదు. సంస్కృత మహాకవులు సైతము తెనుగు కవులు వాడినంత దీర్ఘ సమాసములు వాడలేదు. కాళిదాసు మహాకవి 'బాహ్యోద్యాన స్థిత హర శిర శ్చంద్రికా ధౌత హర్మ్యాః' అని యొక్క పాద మంతయు సమాసముగా నడుపుటకు వెనుక ముందర లాడె ననిపించును. ఆది కవి నన్నయ దీర్ఘ సమాసములు వాడెను. పద్య మంతయు నేక సమాసము వాడిన పట్టులు లేవు. తిక్కనాదు లసలా దారి త్రొక్క లేదు. పోతనయు నంత సాహసమునకు తలపడ లేదు. ఒకటి రెండున్న నంత లెక్కలోనివి కావు. శ్రీనాథు డా దారి త్రొక్కెనే గాని శ్రుతి మించి పోలేదు. ప్రౌఢ కవి ననిపించుకొనుటకు సంస్కృత సమాసముల నెక్కువ వాడెను. కాని వాని వెంబడి నమృత బిందువుల వంటి తెనుగు లందందు పొందుపఱచి వహ్వా యనిపించెను. అత డతి సమర్థుడు. పినవీరన శ్రీనాథుని అనుకరించెనే కాని యందలి మెలకువలు నలవరించుకొన లేదు. సంస్కృతములతో తెనుగులు కలయ కలిపి వెలయబోసి నప్పుడే కవితలో వింత రుచి, పాకములు పొదుపుకొని యుండును. తిక్కన కవితలో రహస్య మది: పోతన పోకడ యది. పెద్దన తిమ్మనలలో తియ్యతన మది. వారియందు స్వతంత్రపు టూహ లున్నవి. అవి యనుభ

వము కలవారికి తెలియును. వీరభద్రుడు తక్కువ వాడని నా యభిప్రాయము కాదు. వారి యనుభవము వీనిలో లేదు. చణుకులకు కొఱంత లేదు. తలంపులలో మెలకువలకు తక్కువ లేదు. కవితకు తెనుగు తనము జొనిపించుటలో కొంత డిందు పడినది. అల్లని అసలు సున్న పెట్ట లేదు.

నిచ్చెనఁ జేసె నోర్నిసి తాసి యే రాజు
దివి కేఁగ సమద పృథ్వీ భుజులకుఁ
గల్పవృక్షముఁ జేసెఁ గర కాండ మే రాజు
భూచక్రమునఁ గల యాచకులకు
గేహాబ్జములఁ జేసెఁ గ్రేఁగన్ను లే రాజు
చెలఁగి సంక్రీడింప సింధు సుతకుఁ
బూట కాపుగఁ జేసె భుజ శక్తి నే రాజు
ఫణిరాజు మోచు భూభరమునకు

నతని వర్ణింపఁ దగదె శీతాంశు వంశ
రాజ హంసంబు దాన ధారా ప్రవాహ
జల పరిక్షాళి తాఖిల కలుష నికరు
నంచి తాక్రాంత కృపుని దుష్యంత నృపుని

ఇందలి సీసపాదములందు పరిణామాలంకారమును గీతమున రూపకమును గలవు.

ధరలో నుపమేయమునను
నరుదుగ నారోపమాణ మగు నుపమానం
బరయఁ బ్రకృతోపయోగా
కరముగఁ బరిణామ మయ్యె

దుష్యంతుని దోర్నిసితాసి యుపమేయము. నిచ్చెన యుపమానము. అది దివి కేగు పృథ్వీభుజు లెక్కిపోవుటకు నుపయోగకర మగు సాధన ముగా చెప్పుటచేత పరిణామ మయినది. ఇట్లే ఇతర పాదము లెరుంగు నది. కలుష నికరు డనుటచేత కలుష మనెడు పంక సముదాయము కలవా డని యర్థము. క్షాళన శబ్దముచేత నుపమాన మగు పంకము వ్యంజిత మగు చున్నది. దుష్యంతుఁడు నాయకుడు. పై పద్యములను బట్టి అతడు ధీరోదాత్తుడు, చంద్ర వంశీయుడు, క్షత్రియుడు, పరాక్రమ శాలి, దాన రతుడు, బలశాలి, అనఘుడు, కీర్తియుతుడు, సుందరుడు.

ధీరాత్ముం డవికత్థనుండు గను గంభీరుండు సత్వాఢ్యుఁ డా
ధీరోదాత్తుఁడు

దుష్యంతు డొక నాడు నిండు కొలువుండెను. వానిని దర్శింప నాటవి కులు వచ్చిరి. కానుక లర్పించిరి.

దేవర వేఁటాడ వలచితే విచ్చేయం
గా వలయును యమునా తటి
నీ వర సీమంతి కావని వనమ్మునకున్

రోమము వెఱికిన నెత్తురు
నామము లే దొడలు చమురునం జేసిన య
ట్లామము గవిసి యుండును నా
నా మృగ యూథంబు లవ్వనంబునఁ గలయన్

అని మనవి చేసికొనిరి.

బంగారు మొగవడి పల్లవంబులతోడఁ
గెంబట్టు కీలు పక్కెరలతోడ
ముఖ సమర్పిత హాటక ఖలీనములతోడఁ
గాంచన గ్రైవేయకములతోడ

సమకట్టి ముడిచిన చామరంబులతోడఁ
దాపఁ బెట్టిన యడిదములతోడఁ
గనక ఘంటల యురు గజ్జె పేరులతోడఁ
గర్ణ కీలిత దీర్ఘ కళలతోడఁ

జిత్రమున వ్రాయఁగా రాని చెలువుతోడ
నొప్పి యుచ్చైశ్రవముతోడి యుద్దు లనఁగ
వాహకులు దెఅ వచ్చె దుర్వార లీల
వసుమతీ నాయకుని పూజ వారువములు

ఇది దుష్యంతుని రథమునకు బూన్పఁ దెచ్చిన గుఱ్ఱముల వర్ణన. మను చరిత్రయందు

పచ్చని హురుమంజి పని వాగె పక్కెర
పారసీ పల్లంబు పట్టమయము
రాణ నొప్పారు పైఠాణంబు సింగిణి
తళుకు లక్కోరుల తరకసంబు
మిహి పసిండి పరుంజు మొహదా కెలంకుల
తావు గుజ్జరి సేత కేవడంబు
డాకెలంకుల సిరాజీ కరాచుర కత్తి
కుఱుఁగటఁ గ్రొవ్వాడి గొరకల పొది

పీలి కుచ్చుల తలాటంబు బేరజంబు
మణుల మొగముట్టు వన్ని సాహిణి యొకండు
కర్త యెదుటికిఁ గొని వచ్చె గంధవాహ
బాంధవం బగు నొక మహాసైంధవంబు

అని పెద్దన స్వారోచి యెక్కుటకు తెచ్చిన గుఱ్ఱమును వర్ణించెను. పైది రథ తురంగముల వర్ణన. ఇది స్వారి గుఱ్ఱము. దీనికి యలంకారము లతో పాటు ఆయుధ సామగ్రులు పెక్కుమర్చ బడినవి. పినవీరన

పెద్దనలు ఒక శతాబ్దిలోనివారు. ఆ కాలమునందు రాజులకు తమ గుఱ్ఱములను చక్కగా నలంకరించు కొనుట యొక వినోదము. బంగారు మెరవడి పల్లనము దాని మీద కెంబట్టు కీలు పక్కెర, హాటక ఖలీనము, పచ్చని హురుమంజి ముత్యాల పనితనము గల వాగె, బంగారు కంఠ హారములు, చామరములు, గజ్జెల పేరులు, తలమీద పీలి కుచ్చుల తలాటము, మణుల మొగముట్టు మొదలగునవి. పైఠాణంబు, సింగిణి, లకోరులు, వానికి తరకసములు, వాడి కోరకలు, అడిదము, మొహదా కరాచుర కత్తి, డాలు ఆనాటి యాయుధములు. బాణభట్టు కాదంబరి రచించెను. అందు చంద్రాపీడునికొరకు తేబడిన తురంగమును రమణీయముగా వర్ణించెను. ఇట్టి కావ్యములు

భారతీయుల సంస్కృతి

కి సంప్రదాయములకు నిదర్శనములు. పురాణ కాలము నుండి రాయల వరకు తరువాతయును గూడ విలు విద్య కత్తి యుద్ధము గజారోహణము అశ్వారోహణము మొదలగు విద్యలందు నారితేరిన నిపుణు లగు వీరులు భారతీయులు. అందుల కేర్పడిన సాధనములు పెక్కులు గలవు. వాని నందముగా నలంకరించి యుంచుకొనుట వారి రాజసము, ఠీవి, గర్వము, మురిపెము వేనోళ్ల చాటుచుండును. విరామ కాలములందు వేటకు పోవుట రాజుల యలవాటు. అట్లే దుష్యంతుడు వేటకు బయలుదేరెను. పినవీరన పై పద్యమునందు వాడిన శబ్దములు ఆచ్ఛికములు సాంస్కృతికములు. పెద్దన శబ్దములు దేశీయములు. అందు తరకసము, హురుంజు, మొహదా, ఘూర్జర శబ్దభవము గుజ్జరి, సిరాజీ, మొదలగునవి పెద్దన కాలమునందు బాగుగా వాడుకలోనికి వచ్చిన పదములని నా తలంపు. పెద్దనగారి కొన్ని కొన్ని భావములకు తల్లివేరు పినవీరన పద్యములం దున్నది. పినవీరన సీసములోని చిత్రమున వ్రాయగా రాని చెలువుతోడ అనునది పెద్దనగారి ప్రవరునియందు అలేఖ్య తనూ విలాసముగా మారినది. పినవీరన

జననీ స్తన్యముఁ గ్రోలుచుం జరణ కంజాతంబునం గింకిణీ
స్వన మింపారఁగఁ దల్లి మేన మృదుల స్పర్శంబుగాఁ దొండ మ
ల్లన యాడించుచు

అను మూల కందమునుండి మొల కెత్తిన స్వాంతంత్ర్య భావ వల్లిక అల్లి బిల్లి గొని మనోహర కుసుమ వాసనలతో మనుచరిత్రయందు

అంకముఁ జేరి శైల తనయా స్తన దుగ్ధము లాను వేళ బా
ల్యాంక విచేష్టఁ దొండమున నవ్వలి చన్గబళింపఁ బోయి యా
వంకఁ గుచంబుఁ గాన కహి వల్లభ హారముఁ గాంచి వే మృణా
ళాంకుర శంక నంటెడు గజాస్యుని

గా చిత్రింప బడినది. రెంటియందు స్వభావోక్తి కలదు.

పెద్దన ప్రతిభాశాలి, నిపుణుడు. పరాయి సొమ్ములకు పనివాడి తనము కల్పించి స్వంతములుగా నిరూపించుకొన గలడు. దుష్యంతుడు వేటకు బయలుదేరెను. వాని వెంట రవుతులు, అంగ రక్షకులు, బోయలు, మూల భృత్య బలంబులు, సామంత కుమార వర్గము సముచిత సాధనముతో నేగిరి.

ఉరులు జిగురు గండె దెరలు బోనులు
వారువారెనలు వసులు గసులు
మిళ్లు వలలు పేట్లు గోళ్లు దీమంబులు
నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు

రాజుతో మాండవ్యుం డను సచివుడు నరుదెంచెను. ఇది రాజులు వేటల కరుగు విధానము. రాజు పరివారముతో నడవియందు ప్రవేశించెను. ఆరేయి ఆభీరు లొసగు నాతిథ్య మంగీకరించెను. పట కుటీరమున నిద్రించెను. ఇంత వరకు పినవీరన భారతము ననుసరించి కథ కల్పనలతో పెంచి కావ్య గుణముల పొందికతో రచించెను.

ఆటవికుల రాక గొల్లల విందు స్వయం కల్పితములు. భారతమునందు గాని అభిజ్ఞాన శాకుంతలమునందు గాని లేవు. ఇది ప్రథమాశ్వాసము. ద్వితీయాశ్వాసము వేటతో ప్రారంభ మయినది.

ఛాయా మృగంబుల ప్రేయ గర్జిల్లఁ బ్ర
చండమై పొడము భేరుండ రవము
భేరుండ నినద కంపితములై పాఱెడు
శరభ సంతతి సాధ్వస స్వనంబు
శరభ నినాద విస్రస్తంబులై గను
నించు కంఠీరవ నిక్వణనంబుఁ
గంఠీర వారవ స్ఖలితంబులై చను
భీతి వన్య కరీంద్ర బృంహితంబు

మక్కడింపఁ దదీయ కల్మాష భీష
ణోగ్ర ఘోషణమున సత్వ యూధ వివిధ
సత్వర ధ్వానములు బహుజాత పక్షి
కలకలంబులు వినవచ్చెఁ గర్ణములకు

ఇందలి ముక్త పదగ్రస్తముచేత

కలయఁగ నార్పుల బొబ్బల
యులివుల నవ్విపిన మను మహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంత మహా
బల మందర నగము సత్వ భయ జననంబై

యని నన్నయ రచించిన పద్యములోని కోలాహలము పినవీరన పాఠకులకు శ్రవణ గతము గావించెను. పెద్దన

చకితైణాహంతి దావ మావళిత పుచ్ఛ స్వల్ప గచ్ఛత్తర
క్షుక మద్రి గ్రహయాళు భల్లుకము వక్షోభాగ నిక్షిప్త డిం
భక వల్గత్ ప్లవగీ కదంబము ప్రదాంభః పోత్రిత క్రోడనా
యక మాభీల ముఖ ద్విపి స్ఫుటితం బయ్యె వనం బయ్యెడన్

నెల వెడలియు నిదుర సడలియుఁ
జల ముడిగియు నిసుఁ జెడియు జంట లెడసియున్
గలహము లడఁగియుఁ బఱచెన్
బులి, కిరి, కరి మున్ను దున్న మొదలగు మెకముల్

ఈ పై పద్యములందలి సరభసత్వము పినవీరన పద్యమునందు లేదు. పెద్దన యే పద్యము నెట్లు నడిపించ వలయునో బాగుగా నెరుగును. పై మత్తేభ వృత్తము సంస్కృత పద సంఘటనము, జంతు సముదాయముల యలజడి యర్థము తెలియరాక పోయినను చదువు నపుడు పాఠకునకు నా శబ్దముల పలుకుబడిలో భావము గోచరింప చేయును. అది నన్నయ పెద్దనల రచనలోని విశిష్ట గుణము. ఈ విశిష్టత నన్నయగారి పై పద్యమునందు గనిపించును. ఆ మృగములు పాఱు నెడ పొడమిన పదముల తడబాటు రెండవ పద్యమునందు లఘువు లగు నక్షరముల నెనసి పొందు గొనిన వృత్త్యనుప్రాసలతోడి నడకయందు పాఠకునకు విదిత మగును. ఈ యద్వితీయ మగు శక్తి కావ్య కవులలో నింకెవరికిని లేదన వచ్చును. మొదటి పద్యమునందు స్వభావోక్తి యలంకారము కలదు. పెద్దన రాయలవారికి ప్రాణము. ఆ మహారాజు వేట కరుగుచుండెడివాడు. పెద్దనగారు లేని దాయనకు కాలము గడవదు. ఆ కవితా పితామహుడు రాయలవారిని వెన్నంటి రావలయును. రాయలు వేటాడును. పెద్దన వినోదముగా నా యా జంతువుల స్వభావములు స్థితి గతులు నరయుచుండును. రాయలవారి మృగయా వినోద చాతుర్యమును కన్నార చూచుచుండును. ఆ యను

భవమునే మనుచరిత్రయందు మొత్తము నలుబది నాల్గు పద్యము లలో చిత్రించెను. అట్లు కానిచో

కండూతికై రాయుఁ గర్కశం బగు తుంటిఁ
బీఁట వెట్టిన ప్రాను పెల్లగిల్లఁ
జెవిఁ దార్చి విని చీమ చిటు కన్న నొకసారి
నెలవి వెంపరలాడు జిట్టలెల్లఁ
జప్పరించు వెదుళ్ళ సల లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగ పైఁబడి చుంయి చుంయి మనఁగఁ
జంద్ర నిప్పులు వోలెఁ దీండ్రించు కను మించు
లెసఁగ నొండొంటిపై నెక్కఁ బాఱు

నెట్ట దినముల మడుఁగుల మట్టి గలఁప
బుడ బుడ ధ్వని వెడలు బుద్బుదములందుఁ
జిలుప చిలుపని నేతుల జిడ్డు దేఱు
నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు

ఇటు వంటి పద్యము వ్రాయలేదు. ఇందు ఏకలముల చర్యలు, వెంపర లాటలు, వెదుళ్లు చప్పరించుటలు, తీండ్రించి చూచుటలు నింత విపు లముగా వర్ణించెను. ఇట్టి జంతు స్వభావములను వర్ణించిన పద్యము వంటి పద్యము శృంగార శాకుంతలమునం దొక్కటియు లేదు. పెద్దనగారి పద్యములు అనుభవ జన్యములు. అందు శిల్పములు స్వభావోక్తులు మెండు. పినవీరన పద్యము లూహా కల్పితములు కావుననే పయిపయి పూత లయినవి. వానియందు శిల్పము కళా ప్రదర్శనము లేదు. పెద్దనగారి పద్యము లంత ఆకర్షణీయత వాని యందు కాన్పించదు. మచ్చున కింకొకటి

ఎగుచు కూఁతలు మూట్లు యెత్తి బిట్టాలించి
గమికిఁ గన్నాకయి గాలి యరయు
వడిఁ గుక్క లంటంగ వచ్చిన మెడఁ దిప్పి
ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముఁ జిమ్ముఁ
దారసించిన చోట దారునఁ జొరఁబాటి
యొకటి రెంటిని ద్రొబ్బ లురల నడుచుఁ
బాల చేరులు వట్టి తూలింపఁ బలిమి నీ
డ్చుకొని డొంకలఁ దూటి చుట్టఁబెట్టు

నేఁటు పోటులఁ బడి ప్రేవు లీదులాడఁ
బోయి పోలేక దగ ద్రొట్టి పాదలు సాచ్చి
బెండు వడియును జొరనీదు పీఁట వెట్టి
చూపులనె యేర్చుఁ బ్రజ నొక్క సూకరంబు

ఇట్టి స్వభావోక్తి వర్ణన చూచి యనుభవమునకు తెచ్చుకొని వ్రాసినవి కావన గల కవిత్వ తత్త్వ విదు డుండడు. పెద్దన కవితా శక్తికి సమాన మయినది పరిశీలనా శక్తి. చూచిన దానిని చూచి నట్లు వర్ణింప గలు గుటకు సముచిత పద జాల మున్నది. అది రాజులతోడి సన్నిహిత సంబంధము మృగయులతోడి రాజోద్యోగులతోడి నిరంతర పరిచయ మువలన లభించినది. తారసించు, బాలచేరులు, చుట్టఁబెట్టు, ఈదులాడు, పీఁటవెట్టు, తుంటి, చీమ చిటుకన్న, సెలవి, వెంపరలాడు, సటలు, చొంగ, చిలుప చిలుపని, ఇటువంటి పదములు వందల కొలంది కలవు. కవికి శాస్త్ర పరిజ్ఞానముతో పాటు

సకల కళా వేతృత్వము

నుండ వలయును. అది లోకములోని వివిధ తెగలు జాతులవారి తోడి సన్నిహిత పరిచయములవలన లభించును. అట్టి పరిచయము పెద్దన కున్నది. కావుననే వేట వర్ణన అంత రమణీయముగా వ్రాయగలిగెను.

గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱమంగాఁ గాంచి రా జేసె నే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పైకల్లేచిరా నేసె రెం
డవ కాండంబుఁ దదస్త్రముం గొనక డాయన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నంబయి నేలఁ గూలెఁ బవి ధారా భిన్న శైలాకృతిన్

ఇది రాయలవారి చర్య యైయుండ వచ్చును. ఆయన మహావీరుడు. విలు విద్యా నిపుణుడు. కత్తి సామునందు నేర్పరి. వేటాడు నెడ నిట్టి సంఘటనము జరిగి యుండును. దానిని పెద్దన వర్ణించి యుండును. ఇట్టి సావకాశములు పినవీరనకు లేవు. కావున వేట వర్ణనమునందు కృతార్థుడు కాలేదు. పెద్దన పినవీరనను వేటను వర్ణించుటలో ననుకరించె నని కొంద రందురు. అవి వర్ణనాంశములలోని సామాన్య విషయములు. కావున పోలిక లుండవచ్చును. అవి యనుకరణలు గావు. ఈ సందర్భము నందు పినవీరన పెద్దన కవితలు సరిపోల్చి చూచినచో పెద్దనగారిలో గల ప్రతిభ కళా వేతృత్వము లోక పరిచయము పినవీరనయం దగుపిం చవు. ఆ శిల్పము, పాఠకు నోడ లుబికింప చేయు రస స్ఫురితి, పినవీరన కవితలో లేవు. స్వారోచి వేటాడు నెడ నా కోలాహలమునకు భయమున కారుచిచ్చునం బడిన లేళ్లు, తోకలు ముడుచుకొని పరుగెత్తు సివంగులు, కొండల కెగబ్రాకు నెలుంగులు, అన్నిటికంటె పిల్లలను పొట్టలక్రింద నుంచుకొని గంతులిడు కోతులు, బురదలలోనుండి వెడల బారు పందులు, నోరు తెరచుకొని నిటునటు తిరుగాడు పులులు కలిగి వన మల్లకల్లోల మయినది. దానికి తగినట్లా పదముల కూర్పున్నది. ఇట్టి రచనా సంవిధానము నన్నయగారి

సరభస పరిచలిత మహా
శరభ ద్విపరిపు వరాహ శార్దూల మద
ద్విర దాది ప్రకర భయం
కర వన మధ్యమున నృపతి కడు కడిమి మెయిన్

అను పద్యమున గోచరించును. ఈ విచిత్రపు పోకడ పినవీరన సీస ములో వచ్చిన కయిన కనిపించదు. కాని సంపూర్ణముగా శూన్య మని చెప్పుటకు వీలులేదు. పెద్దన నన్నయల రచనలలోని పాఠ కుని మనస్సు నరికట్టింప గల పోకడ పినవీరన పద్యమునందు గోచ రించదు. ఈ సంగతి కవిత్వ రసానుభవము కలవారికి తెలియును.

దుష్యంతు డొక యిఱ్ఱిని చూచెను. దాని నేయుటకు శర మును వింట తొడిగెను. అది భయమున పరువెత్త నారంభించినది. యజ్ఞ మృగము వెంబడి నరుగు పినాకపాణి వలె

విలు గొని వెంట వెంటఁ బ్రతిపిపతిరా శరపాత భీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచు
న్నిలుచుచుఁ గొంత కొంత గమనించుచు నర్థము మేసి మేసి ద
ర్భలు వివృతాస్య పార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్

చటుల గతి పరుగెత్తి నదట. ఇది కాళిదాసు రచించిన

గ్రీవా భంగాభిరామం ముహు రనుపతతి స్యన్దనే బద్ధ దృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్ట శ్శర పతన భియా భూయసా పూర్వ కాయం
దర్భై రర్థావలీ ఢైః శ్రమ వివృత ముఖ భ్రంశిభిః కీర్ణ వర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి.

అను శ్లోకమున కనువాదము. అనువాదము కాకపోయినను దీనిని మనస్సునం దుంచుకొని వ్రాసినది. కాళిదాసు లోకోత్తరుడగు మహా కవి. సకల ప్రపంచమున కబ్బురపా టొదవించిన కవితావేశము కల వాడు. వాని పాండిత్య మనన్య సామాన్యము. శిల్ప మసాదృశ్యము. పదములు గంభీరార్థ గుంభితములు. అనుభవము మహత్తరము. వాని రచనలందు శాకుంతల సర్వ విధముల తీర్పులు తీరిన కావ్యము. దానిని తెలిగించినవారు కందుకూరి వీరేశలింగంగారు, కాంచనపల్లి

కనకమ్మగారు ఇత్యాదులు కలరు. ఎవరు తెనిగించినను కాళిదాసు రచనలోని యందము రాలేదు. ఏదో కొరత కలుగుచునే వచ్చినది. అసలు భాషాంతరీకరణము కష్టమగు పని. కాళిదాసతి ప్రౌఢుడు. వాని కల్పన విచిత్రమయినది. ఈ శ్లోకమునందు ప్రౌఢమగు చిత్రకల్పన యున్నది. కృతియంతయు తెలిగించుట యొక యెత్తు, ఈ శ్లోక మొక్కటి తెలిగించుట యొక యెత్తు. అందలి సారస్యము తెలిసిన వారు గ్రహించుకొన గలరు. అట్టి దానిని తెనిగింప యత్నించి శ్రమ వివృత ముఖులు నర్ధావలీఢులు నయినారు చాల మంది కవులు. పినవీరన యర్థావలీఢ మటుండ స్వభావ విరుద్ధమగు వికృత భావము గూడ కల్పించినాడు. మార్గము క్రేవకు నడ్డగించుచుఁ గొంత కొంత గమనించుచు నేగినదట హరిణము. ఇది ప్రాణ భయముచేత పారిపోవు మృగములందసంభవము. మిగిలిన సంగతి చెప్ప నక్కరలేదు. మేసి మేసి యను నామ్రేడితము మరింత వికృతము. పినవీరన ఈ పద్యము నిక్కడ వ్రాయ కున్నచో ఘట్టము బాగుండెడిది. కాళిదాసు నిపుణుడైన కవి. భావములను బట్టియు రసములను బట్టియు వృత్తములను నియమించుకొనును. ఆయన స్రగ్ధరయందా శ్లోకము రచించెను. అందలి భావము ఉత్పలమాల చంపకమాల శార్దూలములలో నిమిడించ వలయునని యత్నించుట మొదటి లోపము. స్రగ్ధర నడక వేరు. వీని నడకలు వేరు. సంస్కృత శబ్దములు గంభీరార్థ ప్రతిపాదకములు. తెనుగు పదములందాశక్తి తక్కువ. ఆ కారణముచేతనే శ్రీనాథుడు నైషధాది కావ్యములలోని శ్లోకములు తెనిగించు నపుడు మూలములోని యా పదములనే వాడుచు 'గమి కర్మీకృత నైక నీవృతుఁడనై' యిత్యాది పద్యములు రచించెను. సంస్కృత భాషలోని గొప్పతనము తెనుగు భాష కున్న లోపము వానికి బాగుగా తెలియును. అత డెవరిని లెక్కపెట్టువాడు కాడు. డు ము వు లు గాడని వానిని వెక్కిరించిన వారిని గురించియే

ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాష యందు
పలుకు నుడికారమున నాంధ్ర భాషయందు
రెవ్వ రేమనుకొన్న నాకేమి కొదవ

యన్నాడు. సంస్కృత భాషా ప్రౌఢిమ తెనుగునకు లేదు. శ్రీనాథుని తెలివి పినవీరనకు లేదు. కావుననే యెంత యత్నించినను కాళిదాసు శ్లోకములోని గంభీరార్థము పినవీరన పద్యములో తేలేక పోయినాడు సరికదా కాళిదాసు కవిత్వము కొంత నా పైత్యము కొంత యన్నటు లయిన దా తెలిగింపు. దుష్యంతుడు గుఱ్ఱముల పగ్గములను విడువ పనిచినాడు సూతుని. రథ మతివేగముగాఁ బోవుచున్నది. ఆ గమనమును నిరూపించుచు

యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
య దర్థే విచ్ఛిన్నం భవతి కృత సంధాన మివ తత్
ప్రకృత్యా య ద్వక్రం త దపి సమ రేఖం నయనయో
ర్న మే దూరే కించి త్క్షణ మపి న పార్శ్వే రథ జవాత్

అను దుష్యంతుని పలుకులు

ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వ కాయాః
నిష్కంప చామర శిఖా నిభృ తోర్ధ్వ కర్ణాః
ఆత్మోత్థితై రపి రజోభి రలంఘనీయాః
ధావం త్యమీ మృగ జవాక్షమ యేవ రథ్యాః

అను సూతుని మాటలు కలయ కలుపు చేసి పినవీరన సీసమునందు

కను దృష్టి నెయ్యది మిను మినక్కను చుండు
ఘనత వ్రేల్మిడి నది గానఁబడఁగ
నెడ తెవ్వి యుండు నెయ్యోది యేని నది కూడ
నడికిన చందాన నన్వయింప

నెయ్యోది విలు వంకయై యుండుఁ బదమున
నది సమరేకతో నంద మంద
దూరాన నెయ్యోది తోఁచు నాలోకింప
నది పార్శ్వమున లేక యవులఁ జనఁగ

శ్రవణములు నిక్క నిక్కించి చామ రాగ్ర
ముగ నిడాయత పూర్వాంగములఁ దనర్చి
ఘన ఖురోద్ధూత రేణువు గడవఁ బాఱి
నిగిడె భువి తేరి హయములు మృగ జయములు

అని తెనిగించెను. మూలములోని భావములు దుసికిలి పోసియ లేదు. చాల వరకు కూడ కలుపుకొని వచ్చెను. యదాలోకే సూక్ష్మం అను దానికి సీసపాదములు నాలుగు తెనిగింపు. ముక్తేషు రశ్మిషు అను దానికి తుది గీత మాంధ్రీకరణము. శ్రీనాథు డాంధ్రీకరణమునందు అందె వేసిన చేయి. ఏశ్లోకమును తెనింగించుటకే వృత్తము సరిపోవునో వానికి తెలిసిన ట్లితరులకు తెలియదు. పెద్దన గారు కూడ యీ విషయమున శ్రీనాథునకు తీసిపోవు ననుటలో సందేహాము లేదు. ఈ సంగతి పెద్దనగారి మనుచరిత్రలోని చక్రవాకి వర్ణనమునందు తెలిపితిని. పినవీరన పెద్దనగారికి ముందువాడు. ఒక చిన్న శ్లోకమునకు అంత పెద్ద వృత్తము నుపయోగించెను. అది శిల్ప లక్షణము కాదు. రచనలో బిగువు నందము సడలి పోవును. నడకలో దిట్టతనము తరిగి పోవును. ఈ లోపములు పినవీరన సీస పాదములం దగుపించు చున్నవి. గణముల పూరణకు విలువంక, అంద మంద, అవులఁ జనఁగ ఇటువంటి పదములు వాడవలసి వచ్చినవి. గీతమునందు మృగ జయములు అనునది మృగ జవాక్షమ యేవ అను దాని కాంధ్రీకరణము. అది ముక్తేషు రశ్మిషు అను శ్లోకమునకు తలకట్టు. దానికి 'త్వరిత గమనే కారణ మాహ మృగ జవాక్షమ యేతి మృగస్య జవో వేగః తస్మి న్నక్షమా ఈర్ష్యా తయే వేతి

హేతూత్ప్రేక్షా' అని వ్యాఖ్యానము. మృగ జయము లనుటచేత హేతువు లేని యుత్ప్రేక్ష యైనది. కావున మూలములోని భావము పూర్తిగా ప్రదర్శింప లేక పోయినాడు పినవీరన. దుష్యంతుడు

ఏ తెరువున నరిగె మృగం
బా తెరువున నదులు వనము లద్రు లనక ధా
త్రీతల పతి సైన్య సమా
న్వితుండై యరిగె మాలినీ నది దాఁకన్

మృగము మిగుల నలసినది. ముందునకు బోలేక నిలిచినది. ధరణీ పతికి హారిణము మీాద కరుణ పొడమినది. అది యా స్థల మహాత్మ్యము. అంతలో నొక వృద్ధ తాపసుం డచటి కరుదెంచెను.

దీని నాశ్రమ మృగ మని తెలియ కీవు
వచ్చి తెఱుఁగుదు మవనీశ వలదు భయము

ఇది కణ్వ మహాముని తపోవనము

మునులు నిత్య స్నానములు దీర్చి యెడలక
కాసారముల కంచ గదియ వెఱచు
మౌని జనం బనుష్ఠానంబుఁ దీర్పక
మృగ శాబకము దర్భ మేయ వెఱచు
సంయ మీాంద్రులు శివార్చనలు చెల్లింపక
ప్రసవంబునకుఁ దేటి ముసర వెఱచుఁ
బారికాంక్షులు ఫలాహార తృప్తులుగాక
కీరంబు పంటికిఁ జేర వెఱచుఁ

దపసి జనములు నుతి మంత్ర జపము లుడిగి
వచ్చి యుండక పిక శిఖావళము లాది
గా వనంబునఁ గల విహంగ కులమ్ము
లుత్తరము నొంది నోరు వాయెత్త వెఱచు.

అని యీ తపోవన మాహాత్మ్యమును వర్ణించి చెప్పెను. నన్నయ పోతనలు కణ్వాశ్రమమును వర్ణించిరి. వారి వర్ణనలో నిట్టి భావములు గల పద్యము లేదు. ఇందు విహంగముల నియమ వర్తనము. మునుల యెడఁ గల భయ భక్తులు సూచింప బడినవి. ఈ పద్య మిష్టా ఘట్టము నకు జీవము పోయు సుధా ధార. వెలుగు లీను రత్న శలాకము.

నిచ్చెనఁ జేసె దోర్నిసి తాసి యే రాజు
దివికేగు సమద పృథ్వీభుజులకు

అను పద్యము తరువాత పాఠకుని చిత్త మాకట్టి యానంద మొదవించెడు పద్య మిది. పినవీరన స్వతంత్ర కల్పనా శక్తికి నూహకు రచనా విధానమునకు పోకడలకు నీ పద్యములు వ్రేలిడి చూపఁ దగిన మచ్చు తునుకలు. తరువాతి

వృద్ధ సింహమునకు విహరింపఁ దొండంబు
కైదండగా నిచ్చు గంధగజము

ఇత్యాది సీసములలోని భావములు సామాన్యములు. చర్విత చర్వణములు. వాని నంతగాఁ బాటించు వారుండరు. కవి ప్రతిభ భావ కల్పనలో నున్నది. అది స్వతంత్రము కావలయును. అందు వినూతనత్వ ముండ వలయును. పాఠకుని భావనా శక్తికి మించి పోకూడదు. రచనలో లాలిత్య ముండ వలయును. పదముల కూర్పులో బిగువు సడలరాదు. ఇట్టి గుణములు పై రెండు పద్యములం దున్నవి. రాజు శర శరాసనంబులు సారథి కొసగెను. ఒంటరిగా ముందున కరిగెను.

శుక గర్భకోటర చ్యుతములై నివ్వరి
ప్రాల్క్రిందఁ జెదరిన పాదపములుఁ
దలలకు గారకాయలు నూఱ నందులఁ
జము రంటి మెఱయు పాషాణ తతులు

నిబిడ వల్కల శిఖా నిష్యంద రేఖల
జాలులు గల జలాశయ పథములుఁ
దమ మేను లొరసి కొంచు మనుష్యు లరిగిన
భయమునఁ జంచలింపని మృగములుఁ

గలిగి యన్యోన్య మైత్రి నక్కడఁ జరించు
పులుల కూనలు జింక పిల్లలు మృగేంద్ర
పోతకమ్ములు నాల క్రేపులును గదుపుఁ
గట్టికొని కూడి యాడ నక్కజముఁ జెంది

నాఁడు దుష్యంతుఁడు. ఈ పద్యము

నీవారాః శుక గర్భకోటర ముఖ భ్రష్టా స్తరూణా మధః
ప్రస్నిగ్ధాః క్వచి దిఙ్గుదీ ఫలభిదః సూచ్యన్త ఏవోపలాః
విశ్వా సోపగమా దభిన్న గతయః శబ్దం సహంతే మృగాః
తోయాధార పథాశ్చ వల్కల శిఖా నిష్యంద రేఖాంకితాః

అను శ్లోకమున కాంధ్రీకరణము. పై సీసపద్యమునకు 'మునులు నిత్య స్నానము' అను సీసపద్యమునకు గల రచనలోని తారతమ్యము పాఠకులు గ్రహించుకొన గలరు. చివరి గీతపద్యము స్వకల్పితము. జైమిని భారత మాంధ్రీకరణము. అందలి కవితకు శృంగార శాకుంతలములోని కవితకు హస్తి మశకాంతర మున్నది. అందలి కవిత్వము నిగ్గుదేరి చవులూర పాఠకుని తనిపించు విరితేనె. ఒడ్డ నొరసికొని పరుగులు వారు సెలయేటి గమనము గమకము దానియం దున్నది. చదువు నప్పుడు చిత్తమును కవితా వాహినిలో నంతర్లీన మొనరించి-దొరలించు కొని పోవు రసవంతములగు ఘట్టము లున్నవి. పదముల పొందికలో జిగియు బిగియు నెనసి మెఱుఁగులు వారు కావ్యంపు సరళి యున్నది. శృంగార

శాకుంతలమునం దా గుణము లంతగా గోచరింపవు. సంస్కృత సమాస సంఘటనము నందు జైమిని భారతములోని పద్యముల బిగు విందును గనిపించును. మచ్చునకు

చంచత్పల్లవ కోమలాంగుళి కర న్సంపూర్ణ చంద్రాననన్
న్యంచ చ్చందన గంధి గంధ గజ యానం జక్రవాక స్తనిన్
గించిన్మధ్యఁ దటిల్లతా విలసి తాంగిన్ బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మధుకర శ్రేణీ లస త్కుంతలన్

ఇది శకుంతల వర్ణన. ఇట్టి రచనకు తొలిదారి చూపినవాడు నన్నయ. ఈ పద్యము

వలయు సమాత్యులం దగిన వారల నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజ దళాయతాక్షి సం
కుల మిళితాళి నీల పరికుంచిత కోమల కుంతలన్ శకుం
తల యను కన్యకం గనియె నమ్ముని వల్లభు మందిరంబునన్

అను నన్నయగారి పద్యమున కనుకరణము. నన్నయగారి పద్యమునం దలి యా సమాసములోని లాలిత్యము పినవీరన పద్యమునందు లేదు. నన్నయను మొదట ననుకరించినవాడు శ్రీనాథుడు.

గమికర్మీకృత నైకనీవృతుఁడనై గంటి న్నీదర్భంబునన్
రమణిన్ బల్లవపాణి నబ్జనయనన్ రాకేందు బింబాననన

దీనికంటె మెఱుగు తీర్చినవాడు పెద్దన

అతఁ డా వాత పరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణ చంచరీక చికురం జంద్రాస్యఁ జక్ర స్తనిన్
నతనాభి న్నవలా నొకానొక మరు న్నారీ శిరోరత్నమున్

ఈ మూడు పద్యములను సరిపోల్చి చూచినచో నన్నయ పద్య రచన లోని యంద చందములును సంస్కృత పదముల పొందికలోని జిలుగుం దనమును పెద్దనయం దధికముగా నగుపించును. సంస్కృత సమాస సంఘటనమునందు నన్నయ పెద్దనలు సమానులు. ఆ కారణముననే నన్నయ పెద్దనలో నిమిడిన కవిపుంగవు డని నుడివితిని. ఆ రచనా వైద గ్ధ్యము మఱెవ్వరి కలవడలేదు. దానికి ప్రధాన కారణ మిరువురు సంగీత కళా సమాహిత చిత్తులు. రాజాధిరాజుల యాస్థాన విద్వాంసులు. కవిత్వము కవి చిత్త ప్రవృత్తికి ప్రతిబింబము. నన్నయ పెద్దన లతి కోమల స్వభావులు. కావున వారి కవితలో పలుకు మెత్తం దన మమరినది. తాళ గతులు వెలసినవి. ఆ నడక రెండయారం బింకెవరి కలవడ లేదు. పినవీరనలో నది యమరలేదు. నన్నయ భారతము సంస్కృతమున కనువాద మయినను భావమును ప్రధా నముగా గైకొని తెనిగించెను. కావున వాని పద్యములలో మాధుర్య మమరినది. స్వతంత్ర రచనగా రూపొందినది. పోతన యా రహస్యము గ్రహించినవాడు. తిక్కన కథ ప్రధానముగా తీసి కొని భారతము ననువదించెను. విరాట పర్వమునం దది చక్కగా గోచరించును. ఆయన నిర్వచనోత్తర రామాయణము కూడ నా దారి ననుసరించినది. శ్రీనాథు డతిచతురుడు. అతీతములను విడిచి పుచ్చెను. సారస్యము గల చోటులందు మెరుగులు దిద్ది తన దారికి తెచ్చుకొనెను. శృంగార నైషధములోని హంస దూత్యము నల దౌత్యము నటువంటివి. వీని నన్నిటిని విప్పి చెప్పుటకు గ్రంథము చాలదు. ఇందలి సత్యాసత్యములు మూలములను తెనుగులతో సరిపోల్చి చూచుకొందురు గాక. పినవీరన శృంగార శాకుంతలములో మూల శ్లోకములను పదాను సరణముగా దెలిగింప తలంచి కృతా ర్థుడు కాలేక పోయెను. కావున సమవృత్తములగు శార్దూలాదులకు సీస మంతటి పద్యము వాడి గీతమునకు తడుములాడుకొన వలసి వచ్చినది. మూలమందలి యే వృత్తము తెనుగున నే వృత్తమునం దిమిడించ నగునో

పినవీరనకు తెలియ లేదు. ఆ విషయమున శ్రీనాథుడు మిగుల దిట్ట. ఆ సంగతి ప్రసంగించి యుంటిని. పదానుగతముగా తెనిగించి పినవీరన పద్యమును పేలవము గావించెను. తన రచనా శక్తి కొక లోపము కలిగించుకొనెను. పురాణ మిత్యేవ న సాధు సర్వం. సత్యము పరిశీలించినవారి కా లోపము తప్పక గోచరించును. పద్య రచనా విధానమునందు కూడ జైమిని భారతమునకు శృంగార శాకుంతలమునకు చాల భేద మున్నది. నిశితముగా పరిశీలించి చూచి నచో శృంగార శాకుంతలమును కవిత్వమునందు పరిపక్వ స్థితిని పొందక పూర్వము పినవీరన వ్రాసి యుండును. అప్పటి కాతడు సాళువ నరసింహ నాయకుని యాస్థానమునందు చేరి యుండడు. అప్పటికి కొన్ని రచనలు చేసి యుండును. కొంత పేరు సంపాదించి యుండును. తరువాత పరిచయములను బట్టి నరసింహ నాయకుని కొలువు సంపాదించి యుండును. జైమిని భారతము రచించు నాటికి పరిపూర్ణ కవితా పాటవమును పొంది యుండును. పండితులలో దిట్ట యనిపించుకొని యుండును. కొంత గౌరవాదరములు నార్జించి యుండును. రాజున కాతని ప్రతిభ తెలియలేదు. కావుననే సాళువ నరసింహ నాయకుడు

నా మది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణింపన్.

ఆ పురాణంబు గన దెనుఁ గయ్యె నేనిఁ
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేని
గుందనము కమ్మ వలచిన చంద మగును.

అని సభాసదుల మొగంబులు చూడ వలసి వచ్చినది. తెలిసినచో కర్పూర తాంబూల జాంబూనద దాదు లర్పించి పినవీరనను తెనిగింప మని యడిగెడివాడు. కొలువులోని పండితులు

తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువన భాసుర కృతి ని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరనఁ బోల గలరే సుకవుల్.

అని విన్నపంబు చేసిరి. నిజమునకు పినవీరనచేత బడి జైమిని భారతము కుందనమునకు కమ్మవలపు వలచి వచ్చి నట్లయినది. భారతముతో పాటు పేరు పెంపును గణించుకొనినది. ఆ తీరుగడ యా ప్రౌఢతనము శాకుంతలమువందు లేదు. పినవీరనలోని నిసర్గ కవితా ధాటి శాకుంతలములో అస లుండక పోలేదు.

చలదిందీవర చారు నేత్ర సముదంచ చ్చంచరీ కాలకన్
జలజా తాననఁ గంబు కంఠి బిస హా స్తన్ జక్రవాక స్తనిన్
బులిన శ్రోణి మరాళ రాజ గమన న్భూజాని గాంచె న్నట
జ్జల కల్లోల పరంపరా నినద వాచాశాలినిన్ మాలినిన్.

ఇటు వంటి పద్యము లందందు గలవు. దీనియందు మాలినీ నది నొక యువతిగా వర్ణించినాడు కవి. ఆమెకు నల్ల కలువలవంటి యంద మగు కన్నులు గలవు. తుమ్మెదల వంటి యలకలు గలవు. కమలము వంటి ముఖము కలదు. శంఖమువంటి కంఠము కలదు. తామర తూడుల వంటి బాహువులు గలవు. చక్రవాకములను బోలిన స్తనములు, ఇసుక తిన్నెలవంటి పిరుదులు గలవు. మరాళ గమనమువంటి గమనము కలదు. జల తరంగ నినదముల వంటి పలుకులు కలవు. అట్టి మాలినిని గాంచినాడు దుష్యంతుఁడు. ఇది యర్థాంతరము.

ప్రతి సమాసము రూపకముగా నర్థము చెప్పినచో నిందీవరము లనెడు కనులు చంచరీకము లనెడు అలకలు కమల మనెడు ముఖము శంఖ మనెడు కంఠము చక్రవాకము లనెడు స్తనములు నిసుక తిన్నె లనెడు పిరుదులు రాయంచల గమనములు చంచత్తరంగ నినదము లనెడు మాటలు కలదైన మాలిని యని యర్థము వచ్చును. అప్పుడు రూపకాలంకార మగును. ఇది నది పరమయిన యర్థము. మాలినిన్ అనుటచే స్త్రీ పరముగా నర్థము చెప్పినచో సమాసము లన్నియు నుపమాన పూర్వపద కర్మధారయ సమాసము లగును. అందు మూలమున మాలిని యను పేరుగల స్త్రీ వర్ణన మగును. అప్పుడు రూపకాలంకారక్లృప్తోపమాలంకార ధ్వని వచ్చును. ఇట్టి సారస్యము 'మాలినీ నదిన్' అనకుండ కవి 'మాలినిన్' అనుటలో నున్నది. ఈ వర్ణన యందు వినూతనత్వ మేమియు లేదు. తెనుగు సంస్కృతి సారస్వతములం దిట్టి పద్యములు చాల కలవు. వినూతన భావములు సారస్య గర్భితాలంకారములు ప్రదర్శించి నప్పుడే కవి ప్రతిభాదులు గోచరించును. కృతి వినుతి పాత్ర మగును. అట్టి రచనలు జైమిని భారతమునం దున్నవి. శకుంతలను చూచినాడు దుష్యంతుడు. ఆమె నాయకురాలు కృతికి. ఆమె యందమును నాలుగైదు పద్యములలో వర్ణించినాడు కవి. అందుండి మచ్చునకు

సురకన్య కాఁబోలు సురకన్య యయ్యెనే
    తీవిమై తెప్ప లాడించు టెట్లు
పుత్తడి కాఁబోలుఁ బుత్తడి యయ్యెనే
    హంసీ గతుల నడయాడు టెట్లు
వనలక్ష్మి కాఁబోలు వనలక్ష్మి యయ్యెనేఁ
    గటి వల్కలంబులు గట్టు టెట్లు
రతి దేవి కాఁబోలు రతి దేవి యయ్యెనే
    వలరాజుఁ బెడఁబాసి వచ్చు టెట్లు

శకుంతల సురకన్యయో పుత్తడియో వనలక్ష్మియో రతిదేవియో యని దుష్యంతునకు సందేహము కలిగినది. ఆ సందేహము రెప్ప లాడించుట నడయాడుట వల్కలములు గట్టుట వలరాజు నెడబాసి యుండుటవలన నివృత్తి నొందినది. కావున నిది నిశ్చయ గర్భ సందేహాలంకారము.

విషయి విషయంబుఁ గవి యతి విహిత సామ్య
దీప్త సందేహ మొందు సందేహ మదియు
గరిమ శుద్ధంబు నిశ్చయ గర్భితంబు
నిశ్చయాంతంబు నగు

నని కావ్యాలంకారము. చివర గీతమునందు మరల

కన్నుఁ గవ యార్చుటను సురకన్య కాదు
నడచి యాడెడుఁ గానఁ బుత్తడియుఁ గాదు
లలిఁ దపశ్చిహ్నమున వనలక్ష్మి కాదు
ప్రసవ శర ముక్త యైనది రతియుఁ గాదు

అని క్రమముగా నీసపాదములలోని నిశ్చయ గర్భమును నిశ్చయాంత ముగా నుడివెను. గీతి పద్యమునందు క్రమాలంకారమునకు కవి పాటుపడెను గాని పునరుక్తి దోషము మాట తలంపలేదు. ఇది కవికి సంపూర్ణానుభవము లేకపోవుటవలన కలిగిన ప్రమాదము. ఇట్టి ప్రమాదములు కావ్యమునకు కళంకములు. మిగిలిన నాయికా వర్ణన పద్యములలో నందములు గాని చందములుగాని లేవు. శిల్ప మంత కంటె శూన్యము. భావములు చర్విత చర్వణములు. తరువాత దుష్యంతుడు

సందియ మేల యీ వికచ సారస లోచన రాజపుత్త్రి నా
డెందము మాని కన్యల బడిం జన నేరదు నిక్కువంబు యే
చందమునందు సంశయ విచార పదంబగు నట్టి వస్తు సీ
మం దమ చిత్త వృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్

అని తలంచెను.

> అసంశయం క్షత్ర పరిగ్రహ క్షమా
> యదార్య మస్యా మభిలాషి మే మనః
> సతాం హి సందేహ పదేషు వస్తుషు
> ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః

ఈ శ్లోకమున కనువాదము పైపద్యము. 'యదార్య మస్యా మభిలాషి మే మనః' అని మూలము. నా డెందము ఏరాని కన్యల బడిం జననేరదు నిక్కువంబ యను నది అనువాదము. మూలానువాదములకు సంబంధ మేమియు లేదు. రాజపుత్రి యనునది క్షత్ర పరిగ్రహ క్షమా యనుదానికి తెనుగు కాదు. కాళిదాసు శబ్దములను ప్రాస్త్రోచితముగా తూచి వాడుచుండును. అందు గంభీర మగు భావ మిమిడి యుండును. క్షత్ర పరిగ్రహ క్షమా యనుటలో 'క్షత్ర జాతీయ పరిగ్రహ క్షమా శాక్తా కళత్రత్వ యోగ్యే త్యర్థః అథవా పరిగ్రహణం పరిగ్రహః కళత్రత్వేన స్వీకార ఇత్యర్థః పరిగ్రహ క్షమత్వే హేతు మాహ ఆర్యం మే మనః అస్యా మభిలాషి యద్యస్మాత్ మే క్షత్రస్య మమేత్యర్థః ఆర్యం నిర్దోషం అత్ర ఆర్య శబ్దేన శాస్త్రార్థానుష్ఠాన నియతి ర్మనస ఉచ్యతే అత్ర మనసః ఆర్యత్వ విశేషేణ మనస్వారసికతయా న కదాప్యకార్యే ప్రవర్తత ఇతి ద్యోత్యతే అని వ్యాఖ్యానము. శ్లోకములోని ప్రతి పదమునం దొక విశేషార్థ మున్నది. వానిలో నేది మార్చినను భావము చెడిపోవును. పినవీరన పద్యమునందు మూలములోని సారస్యము గాని యర్థముగాని లేదు. మీదు మిక్కిలి విపరీతార్థము స్ఫురించు నేమో యని నా తలంపు. ఏ చందమునందు ప్రాసకొరకు వాడిన పదము సీమ నిరర్థకము. మూలమునందు వలెనె పద్యమునందు అర్థాంతర న్యాసాలంకార మున్నది. అంతమాత్రముచేత వీరన పద్యములో మూలములోని యందము రాలేదు. కాళిదాసు శ్లోకము

మిగుల చిన్నది. దానిని ఉత్పలమాలలోని కనువదించినాడు వీరన. అది పెద్ద వృత్తము. వృత్త నిర్ణయమునందు పినవీరన యధిక నిపుణుడు కాడు. యతి ప్రాసలకొరకు గణములకొఱకు ననవసర పదములు వాడ వలసి వచ్చినది.

నృప పరిగ్రహ యోగ్య యీ నెలంత నిజము
కాక నా మది నిర్దోష మ్మౌనె నెట్లు
దవులు? నెందు సందేహ వస్తువులందు
నాత్మ గతులె ప్రమాణంబు లార్యులకు

ఇది కందుకూరి వీరేశలింగం పంతులుగారి యాంధ్రీకరణము. నృప శబ్దమునకు క్షత్ర శబ్దమునకు చాల సారస్యమునందు భేదము కలదు. నిజము కాక అనునది అసంశయం అనుదానికి తెనుగు కాదు. ఒకప్పుడు నాకు అభిజ్ఞాన శాకుంతలము పాఠము చెప్పుచు మా గురు దేవులగు శిష్టా నరసింహ శాస్త్రి గారు కొన్ని శ్లోకములను తెనిగించిరి. అందు

ఆర్య మగు నా మనం బీమె నభిలషించె
క్షత్రియ పరిగ్రహార్హ యసంశయంబు
సందియము లైన వస్తువులందు మాన
స ప్రవృత్తి ప్రమాణంబు సజ్జనులకు

అని పైశ్లోకము ననువదించిరి. ఈ యాపద్యములలోని తారతమ్యము చదువరులు గ్రహింతురు గాక. శృంగార నైషధమును చూచి కవి శృంగార శాకుంతల మని పేరు పెట్ట గలిగెనే గాని శ్రీనాథుని ప్రతిభ యలవడ లేదు. అతడు జన్మతః కవి. శ్రీనాథుని కవిత్వమునం దిట్టి వెనుపోటు లుండవు. మచ్చునకు

కయాఽపి కామిన్ సురతా పరాధా
త్పాదానతః కోపనయాఽవధూతః

తస్యాః కరిష్యామి దృఢానుతాపం
ప్రవాళ శయ్యా శరణం శరీరం

ఈ శ్లోకము కుమార సంభవములోనిది. దీనికి హార విలాసమునందు

ప్రణయ కోప ప్రశాంతికై పాద పతితు
నిన్ను నే పువ్వుఁబోఁడి మన్నింప దయ్యె
నా లతాంగిఁ బ్రవాళ శయ్యా శరణ్య
దేహఁ గావింతు విడువు సందేహ మింద్ర

అని యనువాదము

మహార్హ శయ్యా పరివర్తన చ్యుతైః
స్వ కేశ పుష్పై రపి యా స్మదూయతే
అశేత సా బాహు లతోపధాయినీ
నిషేదుషీ స్థండిల ఏవ కేవలే

అని మూలము

హంస తూలిక పాన్పుపై నలరు మొగ్గ
యొత్తు నును మేను గల్గు నీలోత్పలాక్షి
బాహు వల్లి తలాఁడగాఁ బవ్వళించె
శైల పాషాణ పట్టికా స్థండిలమున

ఇది తెలిగింపు. ఈ రచనా చాతుర్యము పినవీరనకు శృంగార శాకుం తలము రచించు నాటి కలవడ లేదు. జైమిని భారతములోని కవితా ప్రాగల్భ్యమును పరిశీలించి శృంగార శాకుంతలము చదివిన పండితు లగు వారు పినవీరన మీఁది యభిమానము కొలంది జైమిని భారతము సరస్వతి వ్రాసిన దని అతిశయముగా నుడివి యుందురు. దానిపై కథా కల్పనలు జరిగినవి. శృంగార శాకుంతలము శ్రమ పడి ప్రయత్న పూర్వకముగా వ్రాసిన కావ్యము. సామాన్యముగా ప్రతి పద్యమునందు

నా పరిశ్రమ గోచరించును. పలుకు తియ్యదనము గాని శయ్యా గమణీయత గాని వినుతింపఁ దగినంతగా నగుపించవు. స్వతంత్రము లగు భావములు కొన్ని ప్రశంసింప దగినవి కలవు. శకుంతల దుష్యం తునిఁ గాంచినది.

ఆ కాంతా తిలకంబు చన్నుఁ గవపై నందంద రోమాంచ మ
స్తోకంబై

పొడకట్టినది. ఇది రోమాంచ మను సాత్విక భావము.

భావభవ పుష్ప చాప
జ్యా వల్లీ రవము తన్మయత్వముఁగా దెలుపం
దేవేంద్ర తనయ సన్నిభు
నా విభుఁ గనుఁగొనుచు నుండె ననిమిష దృష్టిన్

ఇది స్తంభము అను సాత్విక భావము. శకుంతల శృంగార నాయిక. ఇందు చక్షు ప్రీతి యను శృంగార చేష్ట యిమిడి యున్నది. శృంగార శాకుంతలము శృంగార రస ప్రధానమగు కావ్యము. శకుంతలా దుష్యంతులు ఆలంబన విభావములు. వారు కలిసినది యాశ్ర మోద్యా నము నందు. అది యుద్దీపన విభావము.

కాముకుఁ డను వేఁటకాఁ డేయుచును రాఁగ
నువిద చేత మనెడు నోదమునను
వసుమతీశ చిత్త వన్య కరీంద్రంబు
పడియెఁ గాని మగుడి వెడల దయ్యె

ఇందు ఉపమా నోపమేయముల కభేదత్వము కల్పించుట వలన రూప కాలంకారము కలదు. శకుంతల

విరుల శరంబునుం జెఱకు విల్లును బూనఁడు గాని వీఁడుగో
మరుఁడు మరాళ యానలకు, మానవతీ వచనంబు పల్లవా
ధరలకుఁ జెల్ల దింక విదితంబుగ నీతనిఁ జూచి రేని నే
తరుణి కితండు గూర్చునది దర్పకు నేలదె యింటి బంటుగన్

ఈ చివరి పాదములోని భావమును 'ఏలని బంటుగా మరుం డక్కఁకొ నంగ రాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్' అని మనుచరిత్రయం దలసాని పెద్దన వాడెను. భారతమునందు శకుంతల తన జన్మ వృత్తాంతమును చెప్పినటులున్నది. నన్నయ యామెను అతిప్రౌఢ యగు నాశ్రమ వాసినిగా చిత్రించెను. కాళిదాసు అనసూయచేత శకుంతల జన్మ వృత్తాంతమును చెప్పించెను. అందు మూలమున శకుంతలా దుష్యంతులకు సన్నిహితత్వము కల్పించినవా డయ్యెను. అన్యోన్యము మనస్సులను గ్రహించు కొనుటకు సావకాశము కలిగించెను. రస భావములను పెంపొందించెను. వారి సంభాషణ శృంగార రస పోషక మయినది. పినవీరన రెండు దారులను విడిచి పుచ్చెను. మూడవ దారిని త్రొక్కెను. రాజున కాతిథ్య మొనగూర్చుటకు శకుంతల సఖులతో నాశ్రమమున కరిగెను. ఒక ముని కుమారుని దుష్యంతుని గాని తేర పంపించెను. వానిని శకుంతల కణ్వుని కూతు రెట్లయ్యె నని దుష్యంతు డడిగెను. అతడు శకుంతల జన్మ వృత్తాంతమును చెప్పెను. ఈ మార్పు పానకములో పుల్లవలె పాఠకుని రసాను భవమునకు ఘాతము కలిగించినది. అట్లు కవి చెప్పించుటకు కారణము లేక పోలేదు. కవి శకుంతల జన్మ కథను సముచిత వర్ణనలతో ప్రౌఢ ముగా రచింప తలంచెను. అట్టి ప్రౌఢతనమును ప్రదర్శింప గలశక్తి యువతులయం దుండదు. అందును ఆశ్రమ వాసినుల కస లుండదు. కావున మునికుమారునిచేత చెప్పించెను. ఇందు మూలమున కవి పాత్రలనుగురించిన సముచిత పరిజ్ఞానము కలవాడని యొప్పుకొనక తప్పదు. కాళిదాసు అనసూయచేత రెండు మూడు వాక్యములలో

కథ చెప్పించినాడు. చివరికి మేనకా విశ్వామిత్రుల ప్రణయమును గురించి చెప్పుటకు సిగ్గిలినది అనసూయ. అది అభిమానవతి యగు స్త్రీకి సహజము. అందు మూలమున నాటకము రసవంతముగా నడచి నది. శృంగార శాకుంతలములో శకుంతల జన్మకథ హిమత్పర్వత వర్ణనతో ప్రారంభ మయినది. ఏడు పద్యములలో కవి హిమగిరిని వర్ణించెను.

ముని మనో మోహన ముక్తి నటీ నాట్య
రంగంబులగు హేమ శృంగములును
గనకాబ్జ కైరవ కల్హార సౌరభో
ద్గారంబు లగు జలాధారములును
క్రీడా రతి శ్రాంత కిన్నరీ పరిచిత
స్నేహంబులగు గుహా గేహములును
గుంజ న్మదాలినీ మంజుల మంజరీ
పుంజంబులగు లతా కుంజములును

నలరి పెంపొందుఁ బూర్వాప రాంబునిధుల
నడుమ ధరణికి మాన దండంబు వోలె
దేవతాత్మ ధరాధీశ దిగ్విభూష
పుణ్య నిలయంబు నీహార భూధరంబు

ఎంచి నుతింప శక్యమె మహేశ్వరు నంతటి వానికైన ర
త్నాంచిత రోచి రుద్గమ నిర స్త సమ స్త రవీందు జాలముం
గాంచన కందరా యవనికాయిత వారిధ రాంతరాళ ని
ర్వంచిత దేవతా మిథున వాంఛిత మూలము శీత శైలమున్

పైరెండు పద్యములు కాళిదాసు కుమారసంభవములోని హిమశైల వర్ణన శ్లోకములు మనసునం దుంచుకొని వ్రాయబడినవి. ఇవే కావు. తరువాతి పద్యములును కాళిదాసు శ్లోకముల కనుసరణములే. పై సీసాంతమునందలి గీతము

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధి రాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః

అనుదానికి అను సరణము.

భూధరము లెల్లఁ దను వత్సముగ నొనర్పఁ
బృథు నృపా లోపదిష్టయై ప్రియము మీఱ
నిఖిల రత్నౌషధులను జన్నవిసి పిదికె
నమర శైలంబు దోగ్ధగా నవని సురభి

యం సర్వ శైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహ దక్షే
భాస్వంతి రత్నాని మహౌషధీ శ్చ
పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీం

అను శ్లోకమునకు పైపద్య మాంధ్రీకరణము.

వారని మంచు పైఁ బొదివి వచ్చినఁ బోయిన చొప్పు మాసిన
న్వారి నఖాగ్ర ముక్తమయి పొల్పగు ముత్తెపుఁ జాలు వెంట నా
చారుణు లేగి కాంతురు హత ద్విప కేసరి వాద వేళలం
దా రొక వాసికాండ్రు వలెఁ దక్కఁగ నూల్కొనఁ జేయు తానముల్

ఈ పద్యము

పదం తుషార స్రుతి ధౌత రక్తం
యస్మి న్నదృష్ట్వాపి హత ద్విపానాం
విందంతి మార్గం నఖ రంధ్ర ముక్తై
ర్ముక్తా ఫలైః కేసరిణాం కిరాతాః

అను శ్లోకమున కనువాదము. పై పద్యములందు నిరర్థకము లగు పదములు పెక్కు గలవు. కవిత మిగుల పేలవముగా నున్నది.

ధరణీధర సాను తటములు
పరిమళవంతములు సేయుఁ బాయక యెపుడున్
గరి కండూయన విస్సృతి
సరళ క్షీర ప్రసూత సౌరభ సౌంభ లహరుల్

ఈ పద్యము

కపోల కండూః కరిభి ర్వినేతుం
విఘట్టితానాం సరళ ద్రుమాణాం
యత్ర స్రుత క్షీరతయా ప్రసూత
స్సానూని గంధ స్సురభీ కరోతి

అను శ్లోకమునకు నాంధ్రీకరణము

బింగపు జాలుగా హిమము పేరిన యగ్గిరి ద్రోవ దుర్వహో
త్తుంగ కటీ కుచాలసవతు ల్తురగాస్యలు సంచరించు చో
నంగుళి పార్శ్వ భాగముల కార్తి యొనర్చినఁ గాని యయ్యెడ
న్జంగలు చాఁచి మంద గమనంబున కొందఁగ నీరపాయముల్

ఉద్వేజయ త్యంగుళి పార్ష్ణి బాగాన్
మార్గే శిలీభూత హిమేఽపి యత్ర
న దుర్వహా శ్రోణి పయోధ రార్తాః
భిందంతి మందాం గతి మశ్వముఖ్యః

అను కుమార సంభవ శ్లోకమునకు పై పద్య మనువాదము. అల్లసాని పెద్దన హిమాలయమును మనుచరిత్రయందు వర్ణించెను. అతడు కుమార సంభవము చదువనివాడు కాడు. ఆ శ్లోకములలోని యర్థ గాంభీర్య మెరుగనివాడును కాడు. అతడా దారిని చాలవరకు పరిహరించి 'అటఁ జని కాంచె' నిత్యాది పద్యములతో నా పర్వతము నందలి ప్రకృతి సౌందర్యమును వర్ణించెను.

పసుపు నిగ్గులఁ దేరు పాఁప జన్నిద మొప్పఁ
బ్రమథాధిపతి యింటి పట్టెఁడెంగె
శచి కీఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలు వెఱెంగె
సదనుతోఁ జేపి చన్నవిసి యోషధుల మ
న్నోదవు కొండల కెల్లఁ బిడుక నెఱిఁగె
వేల్పు టింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్న రచనల రవణ మెఱిఁగెఁ

బరిపరి విధంపు జన్నంపుఁ బరికరంపు
సొంపు సంపద నిఖిల నిలింప సభయు
నప్పటప్పటికిని జిహ్వా తృప్తు దుల్ల
నామెత లెఱెంగె నీ తుషారాద్రి కతన

ఇది పెద్దనగారి వర్ణన. ఇందు ఉదాత్తాలంకారము గలదు.

విశ్వోన్నతమై చెలఁగెడు
నైశ్వర్యము గలుగు వస్తు వభినుతి చేయన్
శాశ్వత మగుచు నుదాత్తము
విశ్వంభరలోనఁ బొల్చు

ఇట్టి యుదాత్తాలంకారముచేత లోకమాత యగు పార్వతి కూతురయి శివుని పరిణయ మగుటయు, మందాకినిని శృంగములందు దాల్చుటయు, తాను వత్సమయి యోషధులను బితుకుటయు, రత్నములకు జన్మ స్థాన మగుటయు, యజ్ఞభూమి యగుటయు మొదలగు నుదాత్త గుణములు హిమవంతునియందు నిర్దేశింప బడినవి. పెద్దన స్వతంత్ర భావములు కలవాడు. అతని యూహ మిగుల ప్రశంసింప తగినది. అట్టి స్వతంత్రము లగు నూహలు కల్పనలు పినవీరనయందు చాల తక్కువ. అతనిలో శిల్పము లేదు. ఇతరుల భావములు స్వంత రచనలుగా మార్చుకొని పాఠకునికి మూలము

మీఁద దృష్టి పడకుండ చేసికొను ప్రతిభ లేదు. పై సీసము నందలి మూఁడవ పాదములోని భావము కుమార సంభవములోని శ్లోకమును తలంపునకు తెచ్చును. కాని యది యనువాద మని కాని యను కరణ మని గాని యెవరు ననలేరు. పెద్దన రచన యట్టిది. కథ పురాణ ప్రసిద్ధము. ఒకరి సొమ్ము కాదు. అట్లు స్వంత మనిపించు కొను నట్లు మార్చుకొను ప్రజ్ఞ వీరనయందు లేదు. మూలము లోని భావమును పూర్తిగా ననువాదమునం దమరించు చతురతయు చాల తక్కువ. కాళిదాసు రచనలను సవ్యాఖ్యానముగా చదివి బాగా అర్థము చేసికొనిన కవిత్వానుభవము గలవారు వీరన పద్య ములను ప్రశంసించరు. మూలము నెరుగక పోయినను సారస్వత గుణముల నెరిగినవారు పై పద్యములను నిరసింతు రనుటలో సందేహము లేదు. ఒక విధముగా నాంధ్రీకరణములకంటె వీరన స్వతంత్ర ముగా వ్రాసిన పద్యముల పోకడలు బాగుండు నని చెప్ప వచ్చును. మచ్చునకు

ఏ దేవి నఖ రోచు లిందు రేఖల భంగిఁ
బ్రవహించు నోంకార పాద పీఠిఁ
గోమ రొందు నే దేవి కుడి వంక నర్ధ ప
ల్లవిత శంకర రూప లలిత ముద్ర
యే దేవి బ్రహ్మాదు లీడఁబోవని నతా
వృత్తిఁ దాల్తురు కల్ప విరమ వేళ
జనియించు నే దేవి శాంభవీ విలసన
శ్రీ శతాంశమున వైరించ దృష్టి

కన్ను సన్నల నే దేవి కడఁ జరింతు
రఖిల దిక్పాల శుద్ధాంత హరిణ నయన
లా మహాదేవి పుత్త్రిక యయ్యెఁ గూర్మి
నెట్టి తప మాచరించెనో హిమ నగంబు

ఇందు ఆది మహాశక్తి యగు పార్వతీదేవి మహిమ వర్ణింప బడినది. ఆమెకు ప్రణవము పాద పీఠము. కుడివైపునందు శంకర రూప ముద్ర యుండును. కల్పాంతమునందు బ్రహ్మాదు లామెను నతావృత్తి దాల్తురు. ఆమె వైరించ దృష్టితో శాంభవీ విలసనమున జనించును. దిక్పాలుర యంతఃపుర స్త్రీ లామె కన్ను సన్నల మెలంగుదురు. దీనికి మంత్ర శాస్త్రము దేవీ భాగవ తాదులు ప్రమాణము. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శ్రీ విద్యోపాసకుడు. కావుననే యిట్టి పద్యము వ్రాయ గలిగెను. ఇతరుల కిట్టి వర్ణన సాధ్యము కాదు. అతడు మంత్ర శాస్త్ర వేత్త. పాదు కాంత దీక్ష వహించినవాడయి యుండ వచ్చును. పినవీరన సీసమును చక్కగా నడప గలడు. వెనుకటి సీసము లరయునది. మచ్చునకు మరొకటి

పంచాక్షరీ మంత్ర పర మోపనిష దర్థ
వాసనా సురభి యెవ్వాని బుద్ధి
శ్రుతి పార పూత వాక్పతి ముఖ స్తుతులచే
వదలె నెవ్వాఁడు నవ స్వర్గ సృష్టి
బాహుజుం డయ్యుఁ దప శ్శక్తి నెవ్వాఁడు
బ్రహ్మర్షియై యెక్కె బ్రహ్మ రథముఁ
బందె మోడి దివంబు పంచి యిప్పించె ని
శ్శంక నెవ్వాఁడు హరిశ్చంద్రునకును

నమ్మహాత్ముండు సకల లోకైక వనుతుఁ
డార్వసేయునితోడి మండ్రాటకాఁడు
నిష్ట తోడుత నాశ్చర్య నియమ వృత్తిఁ
దపమునకు నుండె నంబికా ధవునిగూర్చి

సీసపద్యమును రచించుటలో శ్రీనాథు డారితేరిన దిట్ట. అతని సీసములందు బిగువు కలదు. భావములు వింత గొలుపు చుండును.

పరమర్షి పావన పాణి పల్లవములు
ఫాల భాగంబునఁ బవ్వళింపఁ
బౌలోమి పెంచిన బాల కోక ద్వయం
బలఁతి యీరెండకు నట్టు సాప
గగన కల్లోలినీ కనక పద్మములపైఁ
దుమ్మెద లెగసి ఝంఝుమ్మ రనఁగ
నాక విద్యాధరీ నాట్య శాలలయందుఁ
దూర్య త్రయంబులు దురఁగలింపఁ

బ్రమద దిక్కాంత కెంగేలఁ బట్టి యాడు
క్రొత్త గురివెంద పూసల సుత్తి వోలె
దివస కామిని ముఖ లక్ష్మి తెలివి నొందఁ
బూర్వ దిశయందుఁ గంకరఁ బ్రొద్దు వొడిచె

ఇట్టి పదముల పొందిక రచనా పాండిత్యము నడకలోని యందము కూర్పులోని బిగువు పినవీరన సీసములందు కనబడదు. శ్రీనాథుని కల్పనలు భావములు నెవరి కలవడ లేదు. పై పద్యమునందు గల కల్పనలు లోక సామాన్యములే కావచ్చును. కాని వాని ప్రదర్శించు టలో పాఠకుని మన స్సాకర్షించు పినూతనత్వ మున్నది. ఋషులు చేతుల నెత్తి నుదుట చేర్చి నమస్కరించుట సామాన్య విషయము. ఫాల భాగంబునఁ బవ్వళించె నని నుడువుటలో విశేష మున్నది. ఋషుల ప్రగాఢ మగు భక్తి సహిత మయిన చిత్తముతో నుదయించు సూర్యుని వంక మోమెత్తి కర పుటంబులు ఫాలమునందు గీలించు టయు చిత్తైకాగ్రత కలిగి యుండుటయు సూచింప బడినది. రెండవ పాదమునందు పౌలోమి పెంచి కోక ద్వయ మనుటచేత తూర్పు దిక్కు సూచింప బడినది. పౌలోమి వల్లభు డింద్రుడు. ఇంద్రుడు తూర్పు దిశాధిపతి. సూర్యుడు తూర్పున నుదయించును. మొదట యెండ తూర్పున పొడమును కావున ఆ యలతి యెండలో నట్టు

లెత్తి చలి వాపుకొనినవి శ్లోకములు. ఇట్టి వింత కల్పనలు శ్రీనాథుని పద్యములం దుండును. అవి యనుభవమునకు తెచ్చుకొని నప్పుడు పాఠకుని చిత్త మానంద డోలికల నూగాడును. శ్రీనాథుడే విషయమును సూటిగా చెప్పడు. పై పద్యమున నమస్కరించిరి, తూర్పు, అనిన సరిపోవును. అతి డట్లు నుడువడు. దానికేదో వింత కల్పన గావించును. వాని యాలోచనలు అసదృశములు. పాఠకుల నుఱ్ఱూత లూగించు నూహాలు వానియం దుండును. వాని పద జాలము వేరు. కరకర, తురగలించు, ఝంఝుమ్మ రనగ ఇటు వంటి పదము లరయునది. ఏ పదము నెట్లు ఎచ్చట వాడిన పాఠకుని మన స్సుబికింప చేయు రస స్ఫూర్తి కలుగునో శ్రీనాథునకు బాగుగా తెలియును. వానికి కవితానుభవము చాల యెక్కువ. మానవ హృదయమును చక్కగా గ్రహించు కొనగలడు. దానిని రంజింప చేయు రచన చేయ గలడు. ఇట్టి వింత పోకడలు పెద్దనయం దున్నవి. పినవీరనయందు లేవు. ఆ బిగువు అంత కంటె కనిపించదు. పై పద్యములు పోల్చి చూచుకొనునది. శృంగార శాకుంతలమునందు కంటె జైమిని భారమునందు పద్యములు బిగువు గలిగి యున్నవి. ఊహాలు వినూతనములు గాని వింతలు గాని కావు. పినవీరన కవితలో పాండిత్యము ప్రతిభకంటె మిక్కుటముగా కనిపించును. జైమిని భారతములోని పద్యముల నడకయందు సరళత వేగము కలవు. యారితేరిన యా కవనంపు దిట్టతనము శాకుంతలములలోని పద్య రచనయందు లేదు. వ్యర్థ పదములు మిక్కుటముగా నగుపించును.

మానసాంబుజ కర్ణికా మధ్యమునను  
గొన్ని దినములు శశిమౌళిఁ గుదురుకొల్పి  
మిన్నాది గాడ్పుఁ గ్రిఁగాడ్పుతో మేళవించి  
భాను శశి మార్గములు గట్టువఱపి తగను

ఇత్యాది విశ్వామిత్రుని తప శ్చర్యను వర్ణించు పద్యములు పినవీరనకు యోగాభ్యాసముతోడి కొంత పరిచయము కల దని తోపించును. పరి

చయము లేకపోయినను పరిజ్ఞాన మయిన నుండి తీరవలయును. వీరన భారతీ తీర్థుల శిష్యుడు. భారతీ తీర్థులు శృంగేరీ పీఠాధిపతుల శిష్య కోటిలోనివాడు. ఆయన మహా విద్వాంసుడని ప్రతీతి. యోగవిద్య యలవరచుకొనిన వాడు. కావున పినవీరన కా విద్యతో పరిచయ ముండిన నుండవచ్చును. ఇంద్రుడు మేనకను విశ్వామిత్రుని తపో భంగము చేయుమని పంపెను. ఆమె వచ్చినది. ఆమెతో వసంత మన్మథాదులు వచ్చిరి. ఈ సందర్భమున వీరన పదునొకొండు పద్యములలో వసంత ఋతువును వర్ణించెను. అందుండి యొక పద్యము

సమవర్తి రాణివాసాల పాలిండ్లపై
 మృగమ దామోదంబు మేఁత వట్టి
దర్వీకర స్త్రీలు తన్ను వాచవి చూడ
 గందంపుఁ గొండ చెంగట సుఖించి
దర్దర శైల మధ్యమునఁ గర్పూరంపుఁ
 దరు వాటికలలోనఁ దెరువు దప్పి
తామ్రపర్ణ ఖ్యాతిఁ దనరారు ముత్యాల
 యేటి యంబువులలో నీఁదు లాడి

విరహి జనముల హృదయ కోటరములందు
రాఁజు మద నానలము మించ రవులు కొలిపి
గాధి పుత్రుండు దపమున్న కాననమున
నల్ల నల్లన వీతెంచె మందానిలుండు

ఈ పద్యము శ్రీనాథుని 'కాలాంతఃపుర కామినీ కుచ తటీ కస్తూరికా' యను శార్దూల పద్య భావమును తలంపులకు తెచ్చును. ఈ కథా భాగ మంతయు భారతము ననుసరించి వ్రాయబడినది. కాని నన్నయ గారి యుద్రేక పూరిత మయి కారణ కార్య సంగత మయిన భావముల వంటి భావము లిందు కానరావు.

అలసత నొప్పఁగాఁ దరుణి యమ్ముని వల్లభు మ్రోల నున్న స
మ్మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి జాల పై
వలు వెడలన్ బయల్పడియె వల్ద కుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళ త్రివళీ యుత రోమ రాజియున్

అందుఁ దన దృష్టి నాటుడుఁ
గందర్పు నిశాత సాయకంబులు వెలుచన్
డెందముఁ గాడిన ధృతి సెడి
కంది మునీంద్రుండు దాని గవయం దివిరెన్.

ఇవి నన్నయగారి పద్యములు. పద్యములు రెండయినను రసభావములు వీనియందు నిండార విచ్చిన పూవు నండకోశములోని మకరందమువలె గర్భితములయి రసజ్ఞులగు సారస్వత ప్రియుల చిత్త మిళిందమునకు నాస్వాదన యోగ్యములయి తొణికిస లాడుచున్నవి. మేనకయు మునియు నాయికా నాయకులు. ఆలంబన విభావములు, సమీరము సుగంధ బంధుర మనుటచేత కుసుమ వనము సమీరము ఉద్దీపన విభావములు. సమీరము వీచుటచేత పైవలువ తూలినది. ఆ కారణముచేత కామోద్రేక మొదవించు వలుద కుచములు, కక్ష యుగ్మము, కృశోదరము, వళిత్రయము, నూగారు బయల్పడినవి. వానిని చూచి నాడు ముని. వానియం దతని దృష్టి నాటినది. వెంట వచ్చిన మరుడు నిశాత సాయకములు ముని మీద నిగిడించినాడు. అవి డెందము నాటినవి. ముని ధైర్యము కోలుపోయినాడు. కందువారినాడు. మేనకను గలిసినాడు. ఇచట స్తనాదు లుద్దీపన విభావములు. శృంగార రసోల్బణ కారణములు. అవి మునియందు మానసి వోద్రేకమును పుట్టించినవి. అందు మూలమున రోమాంచ కంపన వైవర్ణ్యాది సాత్త్విక భావములు పొడమినవి. దైన్యము చాంచల్యము కలిగినవి. వీనిని ధృతి సెడి కంది అను శబ్దముల చేత నన్నయ సూచించెను. మేనకను విశ్వామిత్రుడు కదిసెను. మేనకను వెంబడించి వచ్చిన వసంత మంద మలయానిల మన్మథులు

గావించిన పని చక్కగా నిర్దేశింపబడినది. మేనక వచ్చిన పని తీరినది. ఇది నన్నయగారి ప్రతిభ. ఇట్లు కొలదిలో నధిక రస భావములు నిమిడించ గలడు. పిసవీరన మేనక నీలాలకములు, కెంపు హాసములు, చన్ను దోయి, ముద్దు మోము, బింబాధరము, కక్షు వైభవము, పాదములు చూచి ముని గిలి గింతలుగొనె నని యొక సీసము రచించెను. మిగిలిన సంగతుల కేమిగాని కక్షయు స్తనములు పై వలువ తూలక బయట పడ జాలవు. కావున నన్నయ 'సమీరార వశంబున' అని వాడెను. అట్లు వాడుటలో కామోద్రేక కారణము లయిన ప్రధానావయవములు బయలు పడుటయు సమీరుని సహకారమును రెండు నొనకూడినవి. సీసములో నా చమత్కారము లేదు.

దుష్యంతుడు ముని కుమారునితో నరుగు చుండెను. దారిలో నొక పులి మాండవ్యుని పై బడ వచ్చినది. దుష్యంతు డా పులిని వేటగాండ్ర కప్పగించి మాండవ్యుని భయము తీర్చెను. దుష్యంతుడు శకుంతలను దలంచుచు నాడు గడపెను. ఆ సందర్భమున నొక పద్యము

కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్ర సూచి రా
యని రతినంబు జిహ్వ చవి యూనని తేనియ గోరు మోపి గి
ల్లని చిగురాకు లాలిత విలాస కేతన మా లతాంగి దా
ననుభవ కర్తయే ఘనుఁడొ యా విధి యత్న మెఱుంగ నయ్యెడున్.

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదిత రసం
అఖండం పుణ్యానాం ఫల మివ చ త ద్రూప మనఘం
న జానే భోక్తారం క మిహ సముపస్థాస్యతి విధిః

ద్వితీయాంకములోని యీ శ్లోకమునకు పైపద్యము తెనిగింపు. దీనిని కందుకూరి వీరేశలింగం పంతులుగారు

వాసన చూడ నట్టి ప్రసవంబు నఖంబులఁ ద్రుంప నట్టి నూ
త్నాసవ పల్లవంబుఁ బరు లానని క్రొవ్విరి తేనె సూచి వి
న్యాసము లేని రత్నము మహోతత పుణ్య ఫలంబుఁ బోలు నా
భాసుర గాత్రి సోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో.

అని తెనిగించెను. నిష్పాక్షిక బుద్ధితో విమర్శించి చూచినచో పినవీరన యాంధ్రీకరణముకంటె కాళిదాసు సంస్కృత శ్లోకములకు కందుకూరు వీరేశలింగం పంతులుగారి యాంధ్రీకరణము సర్వ విధముల వేయి రెట్లు బాగున్న దని నుడువక తప్పదు. పినవీరన పద్యములలోని నిరర్థక పదములు నవకతవకలు కందుకూరివారి పద్యములం దంతగా కనిపించవు. పై రెండు తెనిగింపులు నరిసిన వారికి నిజము తెలియక మానదు. ఇంతటితో ద్వితీయాశ్వాసము పూర్తి యగు చున్నది.

మరునాడు దుష్యంతుడు చతురంగ బలంబులను హస్తినాపురమునకు పంపించెను. కతిప యాప్త జనంబులను దనతో నుండ నియమించెను. ఇరువురు మునులు దుష్యంతుని జూడ వచ్చిరి. 'కణ్వాశ్రమ వాసులగు మునులు యజ్ఞము చేయ నెంచిరి. దానిని రక్కసులు భంగ మొనరింప యత్నించు చున్నవారు'

బాణ బాణాసన తను
త్రాణ కృపాణములతో రథస్థుఁడవై నీ
వేణాంక కులజ రాఁదగుఁ
గౌణప దుర్జనులు గలరు క్రతు విఘ్న కరుల్.

అని నుడివిరి. రాజు మునుల మాటలు శిరసా వహించెను. యజ్ఞ సంరక్షణ భారము వహించెను. రాజు శకుంతలను చూడ గోరెను. తొల్లింటి యుద్యానమునకు వచ్చెను. అచ్చట నొక పూపు టీరమున దుష్యంతుడు దాగి యుండెను. శకుంతల దుష్యంతుని మీఁది యను

రాగమున మనోజ తాపము నొందిన దయ్యెను. ఆమెకు ప్రియంవదా అనసూయ లచట శిశి రోపచారము లొనరించు చుండిరి.

అనసూయయును బ్రియంవద
యును గెందలిరాకు సురటి గొయ్యాన వ్రేళ్లం
బెనచిన చామరములు గొని
యనువారంగ విసరం దాప మగ్గల మైనన్.

ఇది వియోగ శృంగారము. శకుంతల మనస్సును దుష్యంతుడు పరిస్ఫుటముగా తెలిసికొనుటకు కాళిదాసు ఈరంగమును సృజించెను. అంతే కాదు శకుంతలా దుష్యంతుల సమాగమము ఈ రంగ మునందు కలదు. ఇది అభిజ్ఞాన శాకుంతలములోని తృతీయాంకము నందలి కథ. ఇందు కాళిదా సవిచ్ఛిన్నముగా శృంగార రసమును స్థాయిభావము వరకు నీ యంకమునందు పోషించెను. ఆ మహాకవికి రస పోషణ విధానము తెలియును. కథ రమణీయముగా నడపినాడు. పిన వీరభద్రుడు కాళిదా సంత నేర్పరి కాడు. శకుంతలా దుష్యంతులకు గాంధర్వ విధిని పరిణయము గావించినారు ప్రియంవదా అనసూయలు. అంతలో సమర భేరీ ధ్వనులు వినిపించినవి. రాక్షసులతోడి దుష్యం తునకు యుద్ధము వాటిల్లినది. ఈ యుద్ధము నలుబది పద్యములలో నతి దీర్ఘముగా వర్ణింపబడెను. అందుండి రెండు పద్యములు

క్రవ్యాదుం బరిమూర్ఛి యెంతయును నుగ్రంపశ్యోర్ధ్వై నిల్చి వా
యవ్యాస్త్రం బరివోసి యేయుటయు వాత్యావేగ విస్ఫూర్తి నా
ర్తి వ్యాహారము లుప్పతిల్లి నుడుపీథిం గొండ్లి యాడించె దై
త్య వ్యాఘు త్తెరబొమ్మ లట్ల నిగుడం దా నాట కాడుం బలెన్.

అక్షుద్ర శిత శరంబులం
బ్రక్షుభితుం డగుచు నేసి ప్రథన క్రీడ
న్వీక్షింపు మనుచు రాక్షసు
వక్షము జయ లక్ష్మికిని గవాక్షము సేసెన్.

పినవీరన శృంగార రసముకంటె వీర రసమును చక్కగా ప్రదర్శింప గలడు. దాని కిందలి యుద్ధ వర్ణనము దృష్టాంతము. జైమిని భారతము ఇందలి సత్యమును మరింత బాగుగా నిరూపింప గలదు. వాని సంస్కృత పద గుంభనలలో శయ్య నిరాఘాట మగు సెలయేటి నీటి ప్రవాహము వలె వొరలి పోవును. పదములు తడుముకొన కుండ శరవేగముతో నొండొంటి నొరసుకొని పుంఖాను పుంఖ ములుగా వచ్చి వ్రాలును. ఆ తీవ్రత పద్యము నడకలో చక్కగా గుర్తింప వచ్చును. అట్టి పోకడ పై రెండవ పద్యమునందు కనుపిం చును. జైమిని భారతమున కందము తెచ్చినది యీ ధారా శుద్ధియే యన వలయును. ఆచ్చిక తద్భవాదుల కూర్పులో నా యందము శృంగార శాకుంతలమునందు డిందుపడినది. దానికి కారణ మను వాదము. జైమిని భారతము నం దట్లు కనిపించదు. ఈ సంగతి జైమిని భారత కవితా విమర్శనలో ప్రస్తావించితిని. ఇందలి వీర రసము శృంగార రసమున కంగముగా చేర్ప బడినది. అంగములగు రసములు అంగికి పోషకములుగా నుండ వలయును. వ్యాఘాతము కలిగింప రాదు. జైమిని భారతమునందు వీర రసము ప్రధానమయిన సుధన్వుని కథయందు భార్యతోడి సమాగమ శృంగారము అంగమయి అంగి యగు వీరమున కుపస్కారముగా నందము కల్పించినది. శృంగార శాకుంతలమునందు ప్రధాన రస మగు శృంగారమున కీ యతి దీర్ఘమగు యుద్ధ వర్ణన మంతరాయమును కలిగించినది. అందు మూలమున రస భంగ మొదవినది. కావ్య శోభ తరిగినది. ఈ యుద్ధము మొదట రాక్షసులు యజ్ఞమున కంతరాయము కలిగింప వచ్చి నప్పుడు వర్ణించినచో బాగుండెడిది. అంగము లగు రసముల కుచిత స్థానము లున్నవి. వానిని పరిగణింపనిచో ప్రధాన కథ పాడగును. రసము పలపల యగును. అసలు నీరసించి యున్న యీ కథా ఘట్టములోని యందమును యుద్ధ వర్ణన మరింత యడు గంట చేసినది. అది వీరన యాలోచింప లేదు. ఈ యుద్ధ వర్ణన కథ

షించుటకును కావ్యము లావవుటకును వ్రాసిన ట్లగుపించు చున్నది. కాళిదాసు దూరదృష్టి కలవాఁడు. కావుననే శకుంతల జన్మవృత్తాంతము రాక్షసుల సంగతి సూచించి విడిచెను. అందు మూలమున కథకు గాని రసమునకు గాని భంగము కలుగలేదు. వానిని పెంచి అసలు కథను నీరసము గావించినాఁడు వీరన. కవికి స్థానాస్థాన వివేక ముండ నలయును. ఉచితా నుచిత దృష్టి యలవడ వలయును. శృంగార శాకుంతలము రచించు నాటికి గుణములు పినవీరభద్రుని యందు కొంత తరుగు పడిన వనక తప్పదు. ఇట్లనుటచేత పినవీరన ప్రజ్ఞావంతుడు కాడని నా యభిప్రాయము కాదు. అనుభవము తక్కువ యని నా తలంపు. సాయంకాల మయినది. చీకటులు గవిసినవి

పాటిగ మిఱు పల్లం బే
ర్పా టేమియు లేక కానఁబడి నీల శిలా
పేటిక నిండంగా నిడు
కాటుకయుం బోలెనై జగంబులఁ దమమున్

వ్యాపించినదట. ఇది పినవీరభద్రుని పద్యము. దీనికి మూలము

పెను మిట్టిది పల్లం బిది
యన కుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ
గను విచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్.

అని తిక్కనగారి పద్యమునం దున్నది. ఇందుండి మొలకెత్తి యలము కొని నీల శిలా పేటిక నిండంగా నిడుకాటుక వంటి చీకటి మ్రాకు విస్తరించినది. చంద్రు డుదయించెను. వెన్నెలలు కాయించెను.

కలయం జంద్రిక సోఁకఁ గర్ణికలు బొంకం బెక్కి యంతంతకుం
గలి కాగ్రంబులు పట్టు వాసె నెరయంగా విచ్చి తోరంపు టు
గ్గులు వీడం బెడవీఁక వీడి వలితేకు ల్నాళము ల్దాయలో
దళము ల్బింకము చూపఁగాఁ గలువ యందం బొందెఁ గ్రొత్తావులన్.

ఈ పద్యమునందు వెన్నెల సోకగానె కలువ పొందు వికాస క్రమము మనోహరముగా వర్ణింప బడినది. పినవీరనలో కల్పనా శక్తి యున్నది. ఊహాయు రచనా వైశద్యము నున్నవి. అవి యందందు మినుకు లాడు చుండును. వరుస నీ వర్ణన లన్నియు పండ్రెండు పద్యములలో చేయబడినవి. అందుండి

ఎఱకలు దిద్ది కంధరము లెత్తి మొగిం జరలాట మున్నగాఁ
బఱచుచు లేఁత వెన్నెలలు పారణ సేయుచు మించి చంచుల
న్నఱకినఁ దోనఁ బుట్టు కిరణంపుఁ గొన ల్గొని మోముతో
నిఱియుచుఁ బేర్చి ప్రేయసుల కిచ్చుచు నాడె దివిం జకోరముల్.

ఇందు స్వభావోక్తి యలంకారము కలదు. చకోరముల యాటలు నానందానుభవములు చక్కగా సహజ రీతిని వర్ణింప బడినవి. తరువాత శకుంతలా దుష్యంతుల విరహము. ఆమీఁద చంద్ర దూషణ. మన్మథ మలయానిల దూషణములు. కవి లాక్షణికుల యనుశాసనములను బీరు పోనీయకుండ పట్టుకొని బెనుగు లాడినాడు. కావ్యమునం దష్టాదశ వర్ణన లుండ వలయును. ఇది లక్షణ వేత్తల మతము. కాని వానిని సందర్భాసందర్భము లరసి యుపయోగించుట కవి పని. అట్లు గాక వానికొరకు కథా వాహిని కడ్డుపాటు కలిగించుట కవి యవివేకము. అదియు గాక నీ వర్ణన లన్నియు కావ్యమునందు తప్పక పొందుకొని యుండ వలయునని తలంచుట యంతకంటె నవివేకము. శివుడు మన్మథుని దహించినాఁడు. తారగిరి కరిగినాడు. పార్వతి విషాదము నొందినది. ఆమెకు శివునియం దనురాగము కలదు. కాళిదాసు కుమార సంభవమునందుగాని, శ్రీనాథుడు హరవిలాసమునందుగాని పార్వతి మన్మథ మలయానిలాదుల నిందింప లేదు. తపశ్చర్యకు పూను కొనినది. అభిజ్ఞాన శాకుంతలమునం దా పిచ్చి దారులు త్రొక్క లేదు కాళిదాసు. సంస్కృత కవుల కుచితా నుచిత పరిజ్ఞాన మున్నది. వారు లక్షణ ప్రదర్శకులు. లాక్షణికులకు

దాసులు కారు. ఆ మాట యెఱుగరు తెలుగు కవులు. లక్షణములను పట్టుకొని పెనుగు లాడుచుందురు. మహాకవులు వానిని పరిగణింపరు. పరిగణించు నెడల రసమునకు కథకు భంగము కలుగ నీయరు. అలసాని పెద్దన కవితా పితామహుడు. ప్రవరుడు వెడలిపోయిన తరువాత సావకాశముగా వరూథినిచేత చలరాజును జాబిల్లిని ఇష్టము వచ్చినట్లు తిట్టించినాడు. ఆ సందర్భము కథకు రసమునకు శోభయు రమణీయతయు నాపాదించినది. తిక్కన కవి బ్రహ్మ. భారతమునందు

దివము కాని యింక భువనంబునం దిట
వట్టి రాత్రి లేని యట్టిగాఁగఁ
జేసె నొక్కొ విధి విశేషించి నాకకా
నేఁడ దివము సాఁగి నిలిచె నొక్కొ

యని కీచకుడు పలు బాధల విలపించెనే గాని చంద్రుని నిందింప లేదు. గాలిని శపింప లేదు. నన్నయ ఆదికవి. వాగనుశాసనుడు. కవి కుల గురు ముఖ్యుడు. బకాసురుని కొఱకు తెచ్చిన యాహారమును భుజించు చుండెను భీముడు. బకు డది కాంచి యలుక పేరిమిఁ బిడికట వాని వీపు చదియఁ బొడిచినాడు. భీముడు బెదర లేదు. అసుర

వలను సూడ కొండు వగవక యెప్పటి
యట్ల కుడుచు చున్న నలిగి బకుఁడు
వీని బాగు సూడ వేఱంచు డాసిన
తరువుఁ బెఱికి కొనుచుఁ దాఁకుదెంచె.

అంతకు ముందర భీమసేనుం డంత కూడునుం గుడిచి యనంత బల సమేతుండై యంతకా కారంబున మల్ల సఱచుకొని యార్చుచు, యుద్ధమున కరుదెంచినాడు. ఇందు హాస్య రసము చివరి వరకు పోషింప బడినది. పద్యము చదువుచు నవ్వకొననివా రుండరు భీముని

చెల్లుమునకు. నన్నయ లోకోత్తరుడు. పైపద్యమునందు పద పదమున హాస్యరస ముబుకులాడించెను. అంత కూడునుం గుడుచు నంత వరకు మాటాడలేదట. పని పూర్తి యైనది. తరువాత వీరరస ప్రదర్శనమునకు పూనుకొనినాఁడు. యుద్ధానంతరము వచ్చి తిన వచ్చునని భీముడు యుద్ధమునకు పోలేదు. హాస్యరస భంగమునకు తలపడ లేదు నన్నయ. అది మహాకవుల రసపోషణ విధానము. రస భంగమునకు ఫారి చిత్తములు సహింపవు. పరాక్రమము ధీరోదాత్తుని గుణము. దానిని పురస్కరించుకొని వీరభద్రుడు దుష్యంతుని రక్కసులతో యుద్ధము చేయించెను. శకుంతలా దుష్యంతులకు గాంధర్వవిధిని వివాహమయినది. శకుంతలను అలరుల శయ్యను గొని పోవుచుండి రనసూయా ప్రియంవదలు. సరిగా ఆ సమయమున రక్కసులు ముని పల్లెపైఁ బడిరి. దుష్యంతుడు యుద్ధమునకు వెడలెను. రాక్షసులను సంహారించెను. ఇట్టి సంఘటన రసభంగమునకు కారణ మయినది. కవి వీర రసమును పొందుకొలిపితి నని యానందించెను గాని విఘాతమును తలంప లేదు.తరునాత చంద్ర దూషణాదులు కల్పించుటకీపాటు పడెను. అందు మూలమున కథ కౌచిత్య భంగము కలిగినది. కాళిదాసు మూడవ యంకమునందు రసవంతముగా నడిపిన కథ కంతరాయము కల్పించి రసభంగము కావించినాడు పినవీరన. మరల వియోగము. పాడినదే పాట. శకుంతలా దుష్యంతుల సంభోగ శృంగారము యథాతథముగా వర్ణింప బడినది.

తరువాత హస్తినాపురమునుండి సేనలతో నమాత్యులు దుష్యంతునకు సహాయార్థము వచ్చిరి. దుష్యంతుని సేన రగడ చ్ఛందమున నలుబదియారు పంక్తులలో వర్ణింప బడినది. దీని ప్రయోజన మనూహ్యము. దుష్యంతుడు శకుంతలను కలిసికొనెను. ఆమెతో తన ప్రయాణమునుగురించి చెప్పలేక పోయెను. తలిరు టాకున వాలిక నఖమున లిఖించి చూపినాడట. ఇది సమ్ముఖమున రాయబారము

వంటిది. శకుంతల మూర్ఛిల్లినది. తెప్పరిల్లినది. చెలుల బోధచేత శాంతిల్లినది. ఇదంతయు స్వకల్పితము. కావ్యమునందు కథా కల్పన కొక ప్రయోజన ముండ వలయును. అట్టి ప్రయోజన మిందేమియు కనిపించదు. కాళిదాసు దుర్వాసుని శాపకథ కల్పించెను. అది దుష్యంతుడు శకుంతలను తిరస్కరించుటకు కారణ మయినది. మిళింద వృత్తాంతమును కల్పించెను. అందుమూలమున శకుంతల దానిని పారతోలుటలో దుష్యంతున కామె వివిధాంగ సౌందర్యములను గోచరింప చేసి మనస్సునకు రసోద్రేకము కలిగింప నెంచెను. ఆమె యంగముల యందను దుష్యంతున కుద్దీపన విభావములు కావలయునని కాళిదాసు తలంపు. అది సిద్ధించినది. కావుననే దుష్యంతునిచేత

సాధబాధన మపి రమణీయ మస్యాః

యతో యతః షట్చర ణోఽభివర్తతే
తత స్తతః ప్రేరిత లోలలోచనా
వివర్తిత భ్రూ రియ మద్య శిక్షతే
భయా దకామాపి హి దృష్టి విభ్రమం.

చలాపాఙ్గం దృష్టః స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యా యీవ స్వనసి మృదు కర్ణాంతిక చరః
కరం వ్యాధూన్వత్యాః పిబసి రతి సర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషా న్మధుకర హతా స్త్వం ఖలు కృతీ.

అని అనిపించెను. గాళిదాసు రసికుడు. మిగుల కొంటెవాడు. ఆడదాని నాడించి నాయకునకు మత్తెక్కించుటలో వానిని మొదట చెప్ప వలయును. మాళవికాగ్నిమిత్రమునందు మాళవికచేత కైశికి వృత్తిని నాట్య మాడించిన ఆ రహస్యము గుర్తింప లేదు పినవీరభద్రుడు. చెలికత్తియచేత

వీరవాదికి నీరు వోయఁగా
నామెడ నుండి వచ్చె భవదానన గంధము నాస్వాదింపఁగాన్.

శ్రవణేందీవరముం భజించె నదియుం బ్రస్థాన ము కంబుగా
భవ దక్షిన్ వసియించె నక్షి ముకుళింపం దేఁటి నెమ్మోముపైఁ
దవిలెన్ దానిఁ దొరంగఁ జోపుటకు హ స్తం బె త్తి వారించె దా
నవు నంభోరుహ సామ్య దోషము వయస్యా లేదె నీచేతికిన్.

కమల రుచి నీ ముఖాక్షి హ సములు చూచి
పద్మినీ భ్రాంతి నీ యళి పాసి పోవ

దని యనిపించెను. ఇందు మూలమున కాళిదా సభిప్రాయము సగము నిరర్థక మయినది. దుష్యంతుడు

వనితం జంచ దపాంగఁ జేసి కనుఁ గేవన్ ముట్టుచుఁ జేరి మం
తనముం జెప్పెడుభంగి నొయ్యఁ జెవిచెంతన్ మ్రోయుచున్ మెల్లమె
ల్లన మోవిన్ రతి సౌఖ్య సంపదలు గొల్లం గొంటి ధన్యుండ వీ
వనఘా తుమ్మెద! నేను వెల్వడితిఁ దత్త్వాన్వేషముం జేయుచున్.

అని తలంచెను. ఈ యాంధ్రీకరణము మూలానుగతమయి రమణీయముగా నున్నది. పినవీరన కథా సరళిలో గొల్లల యాతిథ్యము బెబ్బులి వృత్తాంతము కూడ నిరర్థకము లనియే చెప్ప వచ్చును. ఆయాభాగము లతుకు పెట్టిన ట్లున్నవి. దుష్యంతు డంగుళీయకము శకుంతల వేలఁ దొడిగించెను. కరినగరికి ప్రయాణ మయ్యెను. ఇంతటితో తృతీయాశ్వాసము పూర్తి యగును. కణ్వ మహాముని సోమ తీర్థము నుండి తిరిగి వచ్చుటతో చతుర్థాశ్వాస మారంభ మగుచున్నది. శృంగార శాకుంతలమ్ము రచించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ఆరాధితామర వీరభద్రుడు. కృతి నందుకొనిన చిల్లర వెన్నమంత్రి శైవ మంత్రోపాసకుడు శంభు పూజా తత్పరుడు. అయ్యొరువుర

శివ భక్తి

అనన్య సామాన్య మయినది. ఆ భక్తి తత్పరత కథా విధానము నందు నవకాశమునుబట్టి పినవీరన ప్రదర్శించుచు వచ్చెను. మాలినీ తటమున దుష్యంతునకు

ఫాల బాహూదర పార్శ్వ దేశంబులఁ
గొమరారు భూతి పుండ్రములతోడ

నొక వృద్ధముని యెదురు వచ్చినాడట. ఇది శైవ సంప్రదాయము. శివుడు చితాభస్మ ధారి. శివ భక్తులు భస్మము తాల్తురు. విశ్వామిత్రుడు

పంచాక్షరీ మంత్ర పరమోపనిషదర్థ
వాసనా సురభి యెవ్వాని బుద్ధి

యట. అతడు అంబికా ధవునిగూర్చి నిష్ఠతోడుత తపమొనరించు చుండెనట. విశ్వామిత్రుడు ఎవరినిగురించి తపమాచరించినదియు పురాణములు నుడువలేదు. పినవీరన కాలమునందు శైవము తెలుగు దేశమునందు ప్రబలముగా వ్యాపించి యుండెను. అందు బ్రాహ్మణులలో నీ మతము పునాదులతో గట్టిపడినది. దానిని భేదింప నెవరికి సాధ్యము కాలేదు. ఆనాటి కవులందరు శైవులు. శ్రీనాథుడు, పోతన మొదలగువారు శైవ మతావలంబకులు. వీరన శైవుడు. కావున గ్రంథము శైవమయినది. దుష్యంతుడు రథము డిగ్గ నరిగి

హరిదశ్వాధిక తేజుల న్విమల భస్మాపాండు సర్వాంగుల
న్నవ రుద్రాక్ష విభూషి తావయవుల న్వ్యాఘ్రాజి నాసీనులం
గరుణామూర్తులఁ బుణ్యవంతుల జహాత్కందర్పుల న్శాంతులం
బరమ బ్రహ్మ శిఖా మహోపనిష దభ్యాస స్థిత స్వాంతులన్.

యజ్ఞ దీక్షితులయిన మునులను గాంచినాడట. ఇందలి కవి వాడిన విశేషణము లన్నియు శైవ చిహ్నములు. మరియు వారు

పంచాక్షరీ మంత్ర పారాయణులను
నిశ్చల శివ నిర్మల ధ్యాన రతులు

ట. పినవీరన మనస్సునందలి శైవ మతావేశ మంతటితో నూరకుండ నీయలేదు. మరొక సీస రచనకు పురికొల్పినది.

అంధకాసుర వైరి యపరావతారుల
యక్షేశ సఖుని పర్యాయ తనుల
సాక్షాత్కరించిన శశిమౌళి మూర్తుల
నంబికేశ ప్రతిబింబములను
భావజారాతి లీలా విగ్రహంబుల
నిటల లోచనుని మాఱట యొడళ్ల
నగరాజ కోదండు నామాంతరంబులఁ
బ్రమథాధిపతి బహిః ప్రాణములను
ఫణి కులాధిప ధరు ననుప్రాసములను
దనుజ పట్టణ భేదను వినిమయములఁ
బంచబాణారి పట్టము భద్ర కరులఁ
గార్శ్యపుని యాశ్రమ స్థానకమున మునుల

నందరిని శివ మూర్తులుగా నిరూపించినది. పైపద్యమునందు శివుని వర్ణన యిమిడి యున్నది. పినవీగన శ్రీనాథుని వలె శైవ మతావేశము కలవాడు. వీర శైవుడు. శివుని పేరు తలంచినంతన మేను పొంగి పరవశించు మనస్సు కలవాడు. ఆ గుణము చతుర్థాశ్వాసమునం దగుపించును. కణ్వ మహాముని శంకరునిగురించి

పాలితాఖిల హరిత్పాల కాది సుపర్వ
మండలుం డురగేంద్ర కుండలుండు
సురదైత్య మకుట భాసుర రత్న ఘటిత సిం
హాసనుండు మనోజ శాసనుండు

కలికాల కల్మష కల్మాష భవ బంధ
మోచనుండు కృపానులోచనుండు
కఠిన హుంకార ఝూంకార నిర్గత ప్రాణ
సమవర్తి దేవతా చక్రవర్తి
యంబికా భర్త యఖిల లోకైక కర్త
శంకరుఁడు భక్తలోక వశంకరుండు

అని వినుతించెను. ఆ పరవశత్వ మంత్యప్రాసలతో కవితను పరవడింప చేసినది. పద్యమును రమణీయముగా దీర్చినది. కవికి రసావేశ ముండవలయును. అది యంద చందములను పొందు కలుపుకొని వింత వింత రచనలతో శరవేగమున కవితను పరుగు లెత్తించును. పాఠకుని మనస్సును తనతో లాగుకొని పోవును. తృతీయాశ్వాసము వరకు నట్టట్టు నడచిన శృంగార శాకుంతలము చతుర్థాశ్వాసమున రసము పుంజుకొని సజీవమయి కవిత కళకళ లాడి లలిత కళల యనిపించుకొనినది. దానికి కారణ మాతని రసావేశము. శకుంతల నత్తవారింటికి పంపు ఘట్టము పాఠకుని మనస్సును కరగించి కంటి వెంట ధారలయి కన్నీరు జాలువారు ననుట అతిశయోక్తి కాజాలదు. పినవీరన రసవంతమగు కవిత నా ఘట్టమునందు వెలయించెను. కణ్వ మహాముని శివుని మరి యెనిమిది పద్యములలో వినుతించెను. అవి యన్నియు పినవీరన వీరశైవ మతావేశ ప్రాగల్భ్యములను చాటుచున్నవి.

గిరిజా విభుండు ముంగిటి పెన్నిధానంబు
కృత్తి వాసుండు తంగేటి జున్ను
గోరాజ గమనుండు గుజ్జు మామిడి పండు
కుసుమాస్త్ర హరుఁడు ముంగొంగు పసిఁడి
శీతాంశు ధరుఁ డఱచేతి మాణిక్యంబు
కద్రూజ కటకుండు గాదె కొలుచు

కరటి దానవ వైరి పెరటి కల్పద్రుమం
బసమ నేత్రుఁడు సిద్ధ రసము చెలమ

విష గళుఁడు గాడిఁ గట్టిన వేల్పు టావు
హాట కాచల ధ్వని సిద్ధాంజనంబు
పుర హరుఁడు పెట్టెలో నున్న పరసువేది
ప్రమథ భక్త చింతామణి భక్త తతికి.

రసావేశ మొకటి యుండవలయును గాని పండితుడగు కవికి శబ్దముల కొరత యుండదు. పెన్నిధానమట, తంగేటి జున్నట, గుజ్జు మామిడి పండట, ముంగొంగు పసిఁడి యట, గాదె కొలుచట, సిద్ధ రసము చెలమ యట ఇంకెన్ని యైన పుట్టుకొని వచ్చును. తల్లి కుమారుని తొడమీఁద కూర్చుండ బెట్టుకొనును. నిండార కౌగలించు కొనును. ప్రేమ కొలంది ముద్దులాడును. అప్పు డామె హృదయము నుండి వెల్లిగొని లక్షలాదిగ ననురా గాలాపములు వెడలివచ్చును. వాని కంతు పొంతు లుండవు. ఆ వాత్సల్య మటువంటిది. పై పద్యము కూడ నా తెగకు చేరినది. అందలి పదములు శివునియందు గల భక్తి యుప్పొంగి పొరలిన యనుభవ శకలములు. ఆవేశ జనితములు. అందును జున్ను, గుజ్జు, చెలమ, కొలుచు ట ప్రశంసింప తగినవి. ఈ పద్యమును చూచి పెద్దన

కెలఁకుల నున్న తంగెటి జున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థ పేటి

పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డి పెట్టిన వేల్పు గిడ్డి కాఁపు

కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధ మేరు నగంబు భవన భర్త

మరుదేశ పథ మధ్యమ ప్రప కులపతి
యాకటి కొదవు సస్యము కుటుంబి
బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూర్త కాపాలి కాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె.

అను పద్యమును రచించెను. రెండు పద్యములందు రూపకోల్లేఖ నాలంకారము కలదు. కాని పినవీరన పద్యమునం దగుపించు నా యావేశము పెద్దన పద్యమునందు లేదు. పెద్దన పద్య మొక జాబితా వలె నున్నది. అది హృదయోద్గతము. ఇది రసనోద్గతము. ఆ భేదము రెంటిని దగ్గర నుంచుకొని చదివి నపుడు కనిపించును.

అహాహా యభ్యాస వేళ బాల్యంబునందు
వ్రాసి చదివిన యాయక్షరముల చేత
వశ్యునిగఁ జేయ వచ్చు భావజ విరోధి
నేల యెఱుఁగరో యీ మర్మ మితర జనులు.

అక్షరాభ్యాస సమయమున 'ఓం నమః శివాయ' అని వ్రాయింతురు. అది తరువాత ఓ. న. మః శి. వా. యః. అని దిద్దింతురు. పై పద్యము నందు అహాహా అనునది వీరన పరవశత్వమును ద్యోతకము చేయును. ఇతర జను లనుటలో శైవేతరములగు వైష్ణవాది మతములు సూచింప బడినవి. వైష్ణములకు శివుని యెడ గల విరోధము తెలుప బడినది.

త్రిణయనుని గూర్ప వచ్చును
బ్రణవంబునఁ గూర్చినట్టి పంచాక్షరిచే
వణిమాది గుణస్థితిఁ దృణ
కణములుగా నొసఁగు మంత్ర గతి యెట్టిదయో.

అన్నాడు వీరభద్రుడు. నమః శివాయ అనునది అసలు పంచాక్షరి మంత్రము. దానికి మొదట ఓంకారము లేదు. అష్టాక్షరికి ఓంకార మున్నది. ఓం అనునది ప్రణవము. ప్రణవ రహిత మగు మంత్రము నిరర్థకము. ఓంకార చాపమును రాముడు విరిచినాడు. శివుడు ఓంకార రహితు డయినాడు. మంత్రము ప్రణవ రహిత మయినది. అది నిరుప యోగ మని వైష్ణవుల వాదము. ఓం అను ప్రణవముతో నమః శివాయ చేర్చి జపించినచో సకల సిద్ధు లొనకూడు నని పినవీరన పై పద్యమునందు నుడివెను. అత డనుభవము కలవాడు. పంచాక్షరి మంత్రమునం దా కవికి దృఢ మగు నమ్మకము కలదు.

ఆజ్ఞా సిద్ధి కరంబు ముక్తిదము చిత్తానంద సంధాయి శై
వ జ్ఞానాంకుర సిద్ధ బీజము ప్రభావ ప్రౌఢ సవిత్కళా
జిజ్ఞాసా విభవ ప్రదాయకము లక్ష్మీ కారణం బూర్జిత
ప్రజ్ఞా మూలము భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్.

అని భేరీ మ్రోయించినాడు పినవీరన. అతని యచంచల మగు శివ భక్తియు పంచాక్షరి మంత్రమునందలి యప్రతిహత మగు దృఢ విశ్వాసము నీ పద్యము చాటు చున్నది. ఇది యొక విధముగా శివ మంత్రోపాసనవలన ముక్తి లభించ దను వైష్ణవ వాదమునకు సమా ధానము. ముక్తిదము అని వీరన యనుటలో నా భావము పొందుపడి యున్నది. పంచాక్షరి చిత్తానంద మొదవించు ననియు, అచంచల మగు చిత్తానందమే పరబ్రహ్మ మనియు సూచించెను. ఆనందో బ్రహ్మ యని వేదము. లక్ష్మీకారణ మనుటచేత సకల సంప త్కారణ మని యర్థము. పాండిత్యాదికములకు ప్రధాన కారణ మయిన ప్రజ్ఞ పంచాక్షరి ప్రసాదించు నని ప్రజ్ఞా మూల మను సమా సము తెలుపు చున్నది. వీరన వీరభద్రోపాసకుడు. తత్ప్రసాదమున కావ్య రచనా ప్రాగల్భ్యాదికములు సంపాదింప గలుగుట యిందు మూలమున వ్యక్తమగు చున్నది. పినవీరన యచంచలమగు వీరశైవ

మంత్ర సముపాసనా దృఢ విశ్వాసావేశము ఈ పద్యమును మహోత్తుంగ హిమాచల శృంగాగ్రము నుండి పొంగి పరతెంచు గంగా తరంగిణి వలె ప్రబల భావ వీచీ ఘుమం ఘుమారావములతో వెల్లివిరియింప చేసినది. రసావేశము కవిత్వ శయ్యా వాహినికి తీవ్రత కల్పించును. అది ఝంఝూ మారుతము వలె భావ వీచికలను మిన్నంట నుప్పొంగ చేయును. పాండిత్య ప్రకర్ష భావమునకు సముచిత స్వరూపమును కల్పించు పద జాలము లందిచ్చును. ఆ రెండును గలవాడు పినవీరన. కణ్వ మహాముని యాశ్రమ వాసుల కందరకు చంద్ర వంశపు రాజుల కథను దుష్యంతుని వరకు పదునేడు పద్యములలో వర్ణించి చెప్పెను. ఈ కథా ఘట్టమునకు ప్రధాన కథతో సంబంధము లేదు. అతుకు పెట్టిన ట్లున్నది. కణ్వుడు స్నానార్థ మేటి కరిగెను.

వాసుకి హారముం బెదరు వన్నెల కౌనును గమ్మవిల్తుని
న్మోసిన కన్ను రెంటి కిరు మిక్కిలి కేల్వయున్ హాలాహాల
గ్రాసక శంక కంఠమును గల్గిన యా కటికంతు మూర్తి దు
ర్వాసుఁడు వచ్చెఁ గణ్వ ముని వల్లభు పర్ణగృహాంతరంబునన్

కమ్మవిల్తుని న్మోసిన కన్నట చక్కని యచ్చ తెలుగు నుడికారము. పినవీరన శృంగార శాకుంతలమునందు సంస్కృతి తత్సమ పదముల కంటె అచ్చిక దేశీయ తద్భవములు మెండుగా వాడెను. పద్యములు జైమిని భారతమునందు వలె సంస్కృత తత్సమములతో గాక తద్భ వాచ్చిక పదములతో నడచినది. అభిజ్ఞాన శాకుంతల మెఱుగని వారికి శృంగార శాకుంతలములోని పద్యములు మనోరంజకముగా నుండు ననుటలో సందేహము లేదు. విమర్శన దృష్టికల పండిత కవులకు రచనలోని లోటు పాటులు వెంట వెంటనే యగుపించును. మొదటి మూడాశ్వాసములందలి కవిత కొంత నీరసించినది. వ్యర్థ పదములు వాడబడినవి. ఆ సంగతి యందందు చర్చించితిని. దానికి కారణ మనువాదములో ననుభవము కొరతబడి యుండుట. చతుర్థాశ్వాస

మంతయు స్వతంత్ర రచన. అందు మూలమున వెనుకటి లోపములు కనిపించవు. పద్యములు చక్కని సరళమగు శయ్య కలవయినవి. పోను పోను శకుంతల్ల న త్తగారింటి కనుపుట నుండి చివరి వరకు మిక్కిలి రసవంతమయి కావ్యమున కందము తెచ్చినది. చాలమంది పండితకవు లా భాగమును ప్రశంసించు చుందురు. శకుంతల విభుని తలంచు కొనుచు పరధ్యానమునం దున్నది. దుర్వాసుని వంక చూడ లేదు. వానికి కోపము వచ్చినది. శపించినాడు. అనసూయా ప్రియంవదలు దుర్వాసుని శాపము విన్నారు. దుర్వాసుని డాసి

కాస్యపుఁడు తండ్రి గాఁగ నిక్కన్నియకును
బుత్రి యిది మీకు బుద్ధి చెప్పుదురు గాని
యింత యలుక వహింపంగ నేమి కలదు
అనఁటి పండొల్వ నేటికి నినుప గోరు

అర్థాంతరన్యాసము ఈ పద్యమునకు జీవము పోసినది. ముని కరుణిం చెను. శాప నివృత్తి నుడివెను. శకుంతలకు తెలియ దీ సంగతి. శకుంతల ప్రసవించినది. కుమారుని గన్నది. ఇచ్చటి నుండి శృంగార శాకుంతలమునందు భారతీయ

స్త్రీ సంప్రదాయములు

ఆచారములు ప్రదర్శింప బడినవి.

తల యంటి రతిపుణ్య తాపసాంగనలు నెం
తయు నింగుదీ ఫల తైలమునను
నుట జాంగణమునఁ గాపునిచిరి తవుటితో
వెల్లుల్లి పొగ యిచ్చి వీరిసఁ గోత్రుఁ
జాగించి రంచి తోత్సవము ముప్పరుటాలి
వైభవంబు తృతీయ వాసరమున

నారవ దివసంబునం దా చరించిరి
బహుల యోగినీ గణ ప్రార్థనములు
కొలను గుడి పేరి దినముల కొలఁది యెఱిఁగి
యఖిల ముని ధర్మ పత్నుల నామతించి
విన్నఁబోకుండఁ గ్రియ లెల్ల విస్తరిల్లఁ
దగ నొనర్చిరి పురటాలి తగవు లెల్ల

ఇవి బాలెంతరాండ్ర కొదవించు సంప్రదాయ సిద్ధము లగు నాచారములు. నగర వాసములం దివి ఈ కాలమునం దంతగా కనిపించక పోయినను పల్లె పట్టులం దివి యథా క్రమముగా జరుగుచునే యున్నవి. ముద్దు ప్ళాని రాధికా సాంత్వనమునందు రజస్వలల కొదవించు నాచారములు చక్కగా వర్ణించినది. కావ్యములం దిట్టి సాంఘి కాచారములు పలు చోటులం దగుపించును. కణ్వుడు శకుంతలతో

జీవితేశ్వరుఁ బాసి చిరకాల వసతిగాఁ
బుట్టి నింటనె యున్కి బుద్ధి గాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ బ్రొద్దు వోకలకైనఁ
బలుమారు నరుగుట పాటికాదు
దాసీ జనులతోడఁ దఱచుగాఁ గూడి త్ర
స్తర మాట లాడుట తగవు కాదు
తన కెంత యాప్తు లైనను నన్య పురుష సం
సర్గంబుఁ జేయుట జాడ గాదు

జనక గృహమున నైనను మనసు వఱపి
కూర నారకుఁ బంపుట గుణము కాదు
హాస్య కథలందు గీత వాద్యములయందుఁ
బ్రీతి నెఱపుట మగనాలి రీతిగాదు

అని యిట్లు కులస్త్రీ ధర్మముల నెనిమిది పద్యములలో కణ్వుడు శకుంతలకు బోధించెను. అవి యన్నియు భారతీయ కులకాంతల వర్తనలను సంప్రదాయములను బోధించునవి. ఆర్య జాతి యిట్టి యాచార వ్యవహారముల చేత నాది కాలము నుండియు ప్రసిద్ధి కెక్కినది. అందు స్త్రీల శీల రక్షణము ప్రధాన సూత్రము. దానికై యార్యులు మిగుల పాటు పడిరి. పాతివ్రత్యమునకు భారత జాతి యిట్టి నియమానుసరణము చేత పేరు పొందినది. పరదేశీయుల పరిపాలనమునందా కట్టుదిట్టములు సడలి పోయినను సమూలముగా వినాశము పొందలేదు. అందలి మంచి చెడ్డలను గ్రహించుకొననేరక కొందరు స్త్రీ స్వాతంత్ర్య మను పేరిట స్వార్థపరులయి బలు పోకలు పోవుచున్నారు. అందు మూలమున జాతికి ముప్పు వాటిల్లు నని యెఱుంగరు.

ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁ డైన తపస్వి కూర్మిగా
వించి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహ పాశముల్
త్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తము గాసి పెట్టె శీ
లించిన నెవ్వఁ డింక వదలింపఁగ నోపెడు మోహ బంధముల్

ఇది యర్థాంతర న్యాసాలంకారము. ఇట్టి హృదయ రంజకములగు అర్థాంతర న్యాసములు వీరన తన కావ్యములు రెంటియందు సమయానుకూలముగా వాడెను. ఈతని తరువాత చేమకూర వెంకట కవి యీ యలంకారమును విరళముగా వాడెను.

క్రకచ ధారా కఠోరంబైన కక్కుల
క్రొవ్వాడి కొడవంటఁ గోయరాదు
కూలాయ సోద్దామ కుద్దాలములఁ ద్రవ్వి
వ్రేళ్లతోఁ బెకలించి వేయరాదు
సమిధాజ్యముల నగ్ని సమకొల్పి దారుణ
శిఖలఁ గాలిచి నీఱు సేయరాదు

ఘన ముష్టిఁ గబళించి కవట లుదతిఁ బట్టి
తెగఁ జేతితోడ రాఁదీయరాదు

హృదయ మను పాదులోపల నుదయమంది
తల్లి దండ్రుల మీఁద సోదరుల మీఁదఁ
దనయ బంధు కళత్ర మిత్రముల మీఁద
మూరి వోవంగఁ బ్రాకిన మోహ లతను.

ఆ మోహ లత గట్టితన మెటువంటిదో యెరుగని యెట్టి మానవున కైన నీ పద్యము చదువగానే యనుభవమునకు రాక మానదు. అర్థము గ్రహించుకొనిన వారు పినవీరన పలుకులలోని సత్యము హృదయ గతమయి పలు తెరంగులఁ దలంపులు బయులఁ బ్రాకి కడకు తలపంకింపక పోరు. వాడిన యా యూతము లగు పదములను తెరిచి విమర్శించు కొనగల వారికి పిల్లలమఱ్ఱి పినవీరన దిట్టంపు పోకడల గట్టి తనంపు టూహలతో నెట్టయెదుట నిలువ 'పటిష్ఠతకల కవివయ్యా' యని యగ్గింపక పోరు. ఆ బిగువగు పదములు ఆ హృదయమును కద లించు భావములు నా రచనలోని పాటవ మటు లున్నవి. ఈ వరుస నున్న పద్యము లన్నియు శృంగార శాకుంతల మను మందిరంబున కెత్తిన మణి దీపికలు. వీని వెలుగున మొదటి మూడాశ్వాసములు పరిశో ధించి చూచినచో నింకను మరుగు పడియున్న లోపాలోపములు నయన గతము లగును. వానిని గ్రంథ పాఠకులు గ్రహించుకొనగలరు.

అత్త మామలకు సీయపనేమి వెట్టుచుఁ
గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి
పాణ మిత్రములుగా భావించి యే ప్రొద్దు
సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్త యొక్కొక వేళ బహుమాన మొనరింపఁ
గడియ రానీకుమీ గర్వ రేఖ

పతి చిత్త మెఱిఁగి తత్పరిజనముల మీఁదఁ
జేయుమీ మిగుల దాక్షిణ్య గరిమ
కలఁక నొందకుమీ ధవుఁ డలిగి నపుడు
పలుకులను జేర నీకుమీ పరుస దనము
వీని వెలిగాఁగఁ దిరుగు నే వెలఁది యైనఁ
గులమునకు నాధి యగుఁ జుమీ కూఁతుఁ గుఱ్ఱ.

అని శకుంతల యత్తవారింట మెలఁగ వలసిన విధానమును కణ్వ మహాముని బోధించును. ఇది తల్లి దండ్రు లందరు తమ కుమార్తెలకు బోధించునది. భారతీయ సాంఘిక మానసిక ప్రవృత్తులు ప్రతిబింబించు పద్య మిది. ఒక భారతీయ యువతులకే కాదు ఈ ప్రవృత్తి ప్రపంచమునం దున్న ప్రతి యువతికిని ఆచరణీయము. ఇట్టి యువతీ జన సామాన్యమునకు విజ్ఞానమును బోధించునది కావుననే శాకుంత లమునకు ప్రపంచమునందు మిగుల ప్రతీతి కలిగినది. ఈ పద్యము

శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియ సఖీ వృత్తిం సపత్నీ జనే
భర్తృ ర్విప్ర కృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీ పదం యువతయో వామాః కుల స్యాధయః

అను శ్లోకమునకు అనువాదము. ఈ యనువాదమునకు తొల్లింటి యనువాదములకు భేద మున్నది. మూలములోని భావములను మాత్రము గ్రహించి స్వతంత్రముగా వ్రాయబడిన పద్యము పై సీసము. కావున రమణీయముగా నున్నది. ఇట్టి రచన శ్రీనాథుని నైషధాదులందు కనిపించును.

నాపయిఁ గూర్మి తద్గురు జనంబులపై నిడి మాని కన్యకా
స్థాపిత వృత్తి బంధు వనితా తతియందు ఘటించి యిష్ట స
ల్లాపములందు నిచ్చటుఁ దలంపక నిచ్చలుఁ బ్రాణనాథ సే
వా పరతంత్రవై యెటుల వన్నియఁ దెచ్చెదొ నాకుఁ బుత్రికా

ఎన్నడు నా మది న్మఱతు నే నిటఁ బుత్రిక పూఁట పూఁట నా
సన్న సరోవరంబునను సంస్మరణం బొనరింప సంతత
స్విన్న మరంద సిక్త సరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నులు నీటితోడఁ గుళికం బగుచున్న భవ న్ముఖాబ్జమున్

కొంత సుఖంబునుం గలదు కోమలి వాకిటఁ బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం బనువొందిన మాలతీ లతా
క్రాంత మనోజ్ఞ మైన సహకారముఁ గన్గొని నప్పు డెల్ల దు
ష్యంతుఁడు మా శకుంతలయు సంగడి నుండుటగాఁ దలంపఁగన్

అల పెఱుంగక తావ కాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరు వోసి
క్రమ వృద్ధిఁ బొందు మార్గంబు లారసి వచ్చి
పూఁట పూఁటకుఁ జాల బ్రోది చేసి
ప్రేమాతిరేకత ప్రియ మండనమునకుఁ
జిగురాకుఁ గొసగొరఁ జిదుమ వెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమం బైన
సఖులు దానును మహోత్సవ మొనర్చి

తల్లి యై పెంచె మిమ్ము దలిరుఁబోఁడి
యుత్తవారింటి కరిగెడు నా లతాంగి
క్షితరుహములార పుష్పిత లతికలార
యనుమతింతురుగాక కళ్యాణ యాత్ర.

ఇది నిజమునకు కళ్యాణ యాత్ర. ఈ పద్యములు చదివినవారి కనుల వెంట నీరు స్రవింపక పోదు. పురాణ కాలమునందలి యాశ్రమ వాసినుల జీవ యాత్రయు తరు లతా గుల్మముల నీవాద వారి యను రాగము అహింసా తత్వము పై పద్యమునందు ద్యోతక మగు చున్నది. ఆశ్రమాంగనలు ప్రకృతి సౌందర్యోపాసినులు. వారి కాశ్ర మోపాంతము నందలి తరు లతాదులకు నీరు పోయుట నిత్య కృత్యము. వానిని పెంచి పెద్ద చేయుట వారి కానందము. వాని చిగురాకు లయినను గోయ నిచ్ఛగింపరు. అవి మొగ్గ తొడిగి నప్పుడు వారికి మహోత్సవము. నోరు వాయి లేని యా తరు లతలకు వారు తల్లులు. అవి బిడ్డలు. వారికి వానియందు వాత్సల్య మనన్య సామాన్యము. ఇది వారి నిత్య జీవితము. ఇందు మూలమున నాశ్ర మాంగనల యనురాగ యుత మయిన కోమల మానసిక ప్రవృత్తియు నహింసా తత్త్వము ప్రకటితము లగుచున్నవి. మానవులకు వలెనె తరు లతలకు ప్రాణము కలదనియు చిగురాకు త్రుంచినను వానికి బాధ కలుగు ననియు మన యిప్పటి ప్రకృతి శాస్త్రజ్ఞులు కనిపెట్టిన సంగతి. పురాణ కాలము నుండియు భారతీయుల కా విషయము తెలియును. కావుననే మునులు పండ్లు కోయుట, పూలు చిదుముట, చిగురులు గిల్లుట మొదలగు తరు బాధా కరములగు పనులు చేసెడివారు కారు. రాలిన పండ్లు భుజించెడివారు. ఈ పద్యము

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నా దత్తే ప్రియ మండనాపి భవతాం స్నేహేన యా పల్లవం
ఆద్యే వః కుసుమ ప్రసూతి సమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతి గృహం సర్వై రనుజ్ఞాయతాం

అను శ్లోకమునకు తెనుగు. పూర్వ సీస పద్యము వలెనె యీ శ్లోకమునకు పినవీరన అనువాదము సీసమునం దొనరించెను. మూల శ్లోకము నెఱుంగనివారి కిది రమణీయముగా నుండు ననుటలో

సందేహము లేదు. శాకుంతలములోని శ్లోకము బాగుగా నర్థము చేసికొనినవారికి అనువాదము సరిగా లేదని తోచును. వెనుకటి శ్లోకమునకు నీ శ్లోకమునకు చాల భేద మున్నది. దీనియందు విశేషార్థములు వ్యంగ్యములు గలవు. వానిని పినవీరన సరిగా ననువదింపలేక పోయినాడు. కొన్ని విశేషములు వ్యాఖ్యాతలు విడిచి పుచ్చిరి. కణ్వుడు

"అహో సన్నిహిత దేవతా స్తపోవన తరవః"

అని మొదట సంబోధించెను. ఇచట వ్యాఖ్యాత శ్రీనివాసాచార్యుల వారు సన్నిహిత దేవతాః మిళిత దేవతాః అని అర్థము వ్రాసిరి. పిమ్మట సన్నిహిత దేవతాత్వ కథనేన బహువచనేన చాశ్రమస్య సార్వకాలిక వసంతాది సర్వర్తు సాన్నిధ్యం గమ్యతే యని వ్యాఖ్యానించిరి. అది యట్లు కాదు. తపోవన తరవః అను దానికి సన్నిహిత దేవతాః విశేషణము. సన్నిహితాశ్చ తే దేవతాశ్చ సన్నిహిత దేవతాః. సన్నిహిత దేవతాస్తే తపోవన తరవః తపోవన తరవః సన్నిహిత దేవతాః తస్మాత్ తపోవన తరుషు దేవతాత్వ మారోపితం. తపోవన తరువులు సన్నిహిత దేవతలు. కావుననే శకుంతలను వస్త్రాదులొసంగినవి. తరువులందు దేవతాత్వ మారోపింప బడినది. అవి సమీపమందున్న దేవతలు. ఇది యీ సంబోధనయందలి భావము. అది కాళిదాసు అభిప్రాయము. వ్యాఖ్యాత సరిగా గ్రహించ లేదు. శకుంతలకు తరువులందు దేవతా భావము కలదు. కావున వానికి నీరు పోయనిది తాను నీరైన త్రాగెడిది కాదు. పల్లవము తన కలంకారము లయినను వానియందలి స్నేహముచేత చిదిమెడిది కాదని శ్లోకము మొదటి రెండు పాదముల భావము. ఇందు మూలమున శకుంతలకు తరువులం దున్న ప్రేమ భావము వెల్లడియగు చున్నది. ఈ యభిప్రాయము పినవీరన పద్యమునందు లేదు. మూడవ పాదమునందు కుసుమ ప్రసూతి సమయే అనుచోట రెండర్థము లున్నవి. ప్రసవోద్గమం బయిన అనుటయం దా రెండర్థములు రావు. వః యుష్మాకం

ఆద్యే ప్రాథమికే కుసుమ ప్రసూతి సమయే యస్యా ఉత్సవో భవతి. పుష్పోద్గమ సాఫల్య దర్శనాద్ధర్ష ప్రకాశ కాభ్యుదయిక కర్మ ప్రవృత్తం భవతీతి అని వ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యాన మొక పక్షము. కాళిదాసు కుసుమ ప్రసూతి సమయే యనుటయం దంతర్భాగ మింకొకటి యున్నది. కుసుమ సమయే చ ప్రసూతి సమయే చ అని. అనగా పుష్పించి నపుడు ప్రసవించి నపుడు. పుష్పించుట యనగా రజస్వల యగుట. లతాదులందు స్త్రీత్వారోపణము. మొదటి రజస్వల యయి నపుడు ప్రసవించి నపుడు నుత్సవ మగుట లోక విదితము. దీనిని దృష్టియం దుంచుకొని కాళిదాసు కుసుమ ప్రసూతి సమయే యని వాడినాడు. అది వ్యాఖ్యాత నుడువ లేదు. ఈ భావము పినవీరన పద్యము నందు రాదు

జనకుఁ డుండెడు ననుష్ఠాన వేదికఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁ బోయి చూడ వచ్చుఁ
స్నానార్థ నియమిత జలజాకరముఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁ బోయి జూడ వచ్చుఁ
నిజ హస్త పోషిత కుజ వల్లికలుఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁ జూడ వచ్చుఁ
గుంజ కోటర కుటీ క్రోడ వీథులుఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁ జూడ వచ్చుఁ

దండ్రిఁ బాయంగ లేని సంతాప జలము
నత్త వారింటి కేగెడు హర్ష జలము
గోరు వెచ్చన పాలిండ్ల కొనలు దడుప
నెడపఁ దడపనఁ బయ్యెదఁ దుడిచి కొనుచు

శకుంతల పడిన సంతాపము దైవ మెరుగును గాని ఈ పద్యము చదువు నపుడు పాఠకుని హృదయము దుఃఖమున ఖేదిల్లి కన్నుల నీరు నిగుడక మానదు.

కదలు నాలుగు మూఁడుఁ బదములు క్రమ్మఱి
తండ్రి పాదంబు లౌదల ఘటించుఁ
గొంత దవ్వేగు నేగుచు వచ్చి కణ్వుని
కడుపులో తల మోపి కౌఁగలించు
నరుగు కొండొక వేగఁ దిరిగి మౌనులకు మా
యయ్య సుడీ యని యప్పగించు
గనునించుఁ బెడ మర్లి కాశ్యపు దెసఁ జూచి
నేఁ బోదు నంచుఁ గన్నీరు నించు

జనకుఁ డుపలాలనము సేయ సంయమీంద్ర
భామ లదలింప ననసూయ పట్టి తిగువ
నిగిడి యడుగిడె నొక భంగి మగిడి మిగిడి
చూచుకొంచు శకుంతలా సూనగంధి

కవిత్వ మనిన నిట్లుండ వలయును. ఎట్టి కఠిన శిలా కర్కశ మయినను పాఠకుని మనసు కరిగించి స్రవింప చేయు పద్యము లివి. ఆంధ్ర సారస్వతమునందు నిట్టి కడుపు చుమ్మలు చుట్టించు పద్యములు రచించిన కవులు నభూతో నభవిష్యతి. పినవీరన తన కవితా శిల్పము నంతయు ననుభవ పాత్రయందు బోరలి పోవగా గొలిచి గొలుక పోసినాడు. శకుంతల పడిన పరితాపము నక్షర మక్షరమునందు చిత్రించి పాఠకుని కనుల యెదుట నిలిపినాడు. ఇంతకంటె మించి గాని సమానముగా గాని వ్రాయగల కవి యింకొక డుండెడు. కరుణా రసంపు వెల్లిని కవితలో తుది వంకు ముంచెత్తినా డా రస సిద్ధుడు. కరుణ రసము వాని సొమ్ము. జైమిని భారతములోని యుత్తర రామ కథయందలి సీత వియోగ పరితాపమును కూడ మించి పోయిన దీ ఘట్టము. ఈ పద్యములందు స్వభావోక్తి యలంకారము కలదు. అలంకారమున కలంకారము లీ పద్యములు రెండును. వీరన వీః కరుణ రస పోషణమునందు సిద్ధ హస్తుడు. వినుతి పాత్రుడు. చిః సంస్మరణీయుడు.

ముని భామలు నలు వంకలఁ
జను దేరఁగ నిర్మ లోర్మి సంగత యగు న
య్యనిమిష నది రత్నాకర
మున కేగెడు భంగిఁ గదలి

పోయినదట శకుంతల. ఉపమాలంకారము. అనిమిష నది రత్నాకర మున కేగెడు భంగి ననుట చేత శకుంతల దుఃఖము దిగనాడి ప్రమో దము పొంగు లార దుష్యంతుని కూడ నరిగె నని సూచింప బడినది. శకుంతల దుష్యంతుని దర్శించినది. దుష్యంతు డామె యెవరో యెరుంగ నని తిరస్కరించినాడు. అది దుర్వాసుని శాప ప్రభావము. శకుంతల కన్నీరు కార్చినది. వెంట నున్న యనసూయా ప్రియంవదలకు కోపము వచ్చినది. అనసూయ దేవతలను నిర్దేశించి సంబోధించినది. ఆకాశ వాణి నిజము వినిపించినది. ఇది నన్నయగారి కథా విధానము: ఆకాశవాణి పలుకు లాలించి శకుంతలను పరిగ్రహించినచో దుర్వాసుని శాపము శాప నిర్వృతి ప్రకారము నిరర్థకము లగును. దుర్వాసుని శాపము, కాళిదాసు కథా సరళి, రెంటిని కలయ కలిపి పంచకూళ్ల కషాయము చేసినాడు పిన వీరభద్రుడు. అనసూయ ముద్రాంగుళీయక మూడ్చి దుష్యంతుని మీదికి విసరి వైచినది. రాజు చూచినా డా యుంగరమును. వానికి సర్వము జ్ఞాపకము వచ్చినది. దుర్వాసుని శాపము విరిసి పోయినది. ఈ సందర్భమున ఆకాశవాణి పలుకులు నిరుపయోగములు. ఇచ్చట పినవీరన తబ్బిబ్బు పడినాడు. ముందు కథ నాలోచించ కుండ దుర్వాసుని శాప వృత్తాంతము వ్రాసినాడు. దానిని సమర్థించు కొనుటకు కథ నడ్డము త్రిప్పినాడు. నన్నయ భారత కథా విధానమును విడిచి పెట్టలేక పోయినాడు. రెంటిని జోడించి తన దారి త్రొక్కినాడు. ఇది మూడవ దారి. ఆకాశవాణి మాట తేకున్న కథ బాగుండెడిది. ఆకాశవాణి సంగతి తెచ్చి కథ పాడుచేసి నాడు పినవీరన. అంతటితో నయిన కథ ముగించిన బాగుండును. అట్లు చేయలేదు. త్రిమూర్తులను నారదుని పిలిపించి నాడు. వారిచేత

శాప వృత్తాంతము చెప్పించినాడు. ప్రత్యక్ష సాక్ష్యు లనసూయాదు లుండగా త్రిమూర్తుల రాక కథకు కవచము వేసి నట్లయినది. ఇది యనవసరము. దుష్యంతుడు కుమారునకు యౌవరాజ్యాభిషేకము చేసెను. కణ్వమునిచేత భరతునకు రాజనీతి చెప్పించెను. ఈ కథ కావ్యము పెంచుట కతుకు పెట్టినదిగా కనిపించును. వ్రాసినది శృంగార శాకుంతలము. ఈ కథ కిందు ప్రమేయము లేదు. పినవీరనకు కథ యల్లుటలో ననుభవము చాల తక్కువ. శాకుంతల కావ్యమునకు సంబంధింపని గోపాలుర యాతిథ్యము, పులి వృత్తాంతము, రాక్షసుల తోడి పోరాటము, దుష్యంతుడు తన ప్రయాణము సంగతి వ్రాసి చూపుట, త్రిమూర్తుల రాక మొదలగునవి చేర్చి కవి కథను రసమును పాడుచేసినాడు. ఇందు విదూషకుని పాత్ర శకుంతల జన్మ కథ చెప్పిన ముని పాత్ర నిరర్థకములు. ఇవికాక యనవసర వర్ణనలు ప్రసంగములు గలవు. వానిని తొలగించినచో కావ్యము మొకింత బాగుండెడిది.

## కవిత్వము

జైమిని భారతమునందలి కవిత వలె గాక వైకృతాచ్ఛిక, పదముల మేళవింపు బహుళ మయి మృదు రీతి నడచినది. కాని యనుభవము తక్కువ కావున మొదటి మూడాశ్వాసములందు వ్యర్థ పదములు దొరలినవి. అందును ఆంధ్రీకరణము లయిన పద్యములందు గణ పూరణకొరకు యతి ప్రాసలకొరకు తడుము లాడిన చోటులు చాల కలవు. అందు మూలమున కవిత నీరసించి పేలవ మయినది. స్వతంత్ర రచనలందు పద్యములు బిగువు కలిగి రసవంతముగా నడచినవి. కావ్య మంతయు అభిజ్ఞాన శాకుంతలము మనసునం దుంచుకొని స్వంతముగా రచించినచో చాల బాగుండెడిది. సంస్కృత పద సంఘటితము లయిన పద్యములు శర వేగమున నడచినవి. కవి శృంగారమ్మునకంటె వీర కరుణ రసములు బాగుగా పోషింప గలడు.

---

౪

## నంది తిమ్మన

శ్రీకృష్ణరాయల యాస్థానమునందలి తెలుగు కవులలో నంది తిమ్మన యొకడు. ఇతడు కౌశిక గోత్రుడు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు. సింగామాత్య తిమ్మాంబల పుత్రుడు. మలయ మారుత కవీంద్రు డని విఖ్యాతి గాంచిన ఘంట సింగయకు మేనల్లుడు. ఉమా మహేశ్వర పాద పూజా నిరతుడు. అఘోర శివునకు శిష్యుడు. వీరశైవ మతావ లంబి. శ్రీకృష్ణరాయలవారి మహాకవిని చతురంతయాన మహాగ్రహార ముల నొసంగి గౌరవించెను. ఈ కవికి ముక్కు తిమ్మన యను నామాంతరము కలదు.

నానా సూన వితాన వాసనల నానందించు సారంగమే
లా నన్నొల్ల దటంచు

అని ముక్కును వర్ణించి చెప్పిన పద్యమువలన నీ పేరు వచ్చినదని కొందరి తలంపు. పై పద్యము రామరాజ భూషణుని వసుచరిత్ర లోనిది. తిమ్మన దానిని చెప్పలే దనుట స్పష్టము. తిమ్మనకు గల ముక్కుయొక్క ప్రత్యేకాధిక్యతవలన నీ పేరు వచ్చి యుండ వచ్చును. లోకమునం దిట్టి పేరులు మానవుల కొదవు చుండుట సహజము. నంది తిమ్మన

పారిజాతాపహరణము

అను కావ్యమును రచించెను. రాయల వారికి తిరుమలదేవి యను భార్య కలదు. ఆమె యేకాంతమునందు రాయలవారితో వినోదించు చుండ పాదము శిరమునకు తగిలెను. రాయలవారికి కోపము వచ్చినది. తిరుమలదేవియందు విముఖుడై యుండెను. ఆ సంగతి

తిమ్మనకు తెలియ వచ్చినది. రాయలవారికి నీతి నేర్పి సతీ పతులకు నెయ్యము నొదవింప తలంచెను. పారిజాతాపహరణ కావ్యమును రచించె నని కొందరు వచింతురు. రాయలు మహారసికుడు. కావ్య కర్త. సతుల చిత్త ప్రవృత్తు లెరిగిన వివేకి. కేళీ వినోదములందు సాధారణము లయిన యిట్టి యలఁతి ప్రమాదములకు సతిపైన కినుక వహించె ననుట నమ్మఁదగినది కాదు. అంతఃపురమునం దేకాంతమున సహజముగా నతి గంభీర స్వభావు లగు మహారాజ దంపతుల మధ్య జరిగిన సంగతి యంత బట్టబయ లగుట యసంభవము. అయినను దానిని కావ్యమునందు స్ఫురించు నటుల వ్రాసి రాయలవారికి నిండు సభయందు వినిపించుట కవి మర్యాదను దేవేరి మర్యాదను మరింత కోప కారణ మగును గాని ఫలకారి కాజాలదు. తిమ్మన మూలమునందు కానరాని విషయములు రసాభివృద్ధికొరకు కల్పించెను. వానిలో సత్యభామ శ్రీకృష్ణుని శిరమును వామ పాదమున తొలగం ద్రోచుట యొకటి. దాని నాధారముగా చేసికొని తరువాత కాలమునందలివారు పై కథను కల్పించి యుందురు. అది యా నోట నా నోట బడి వ్యాప్తికి వచ్చినది. కావ్య స్వరూపము తెలియనివారు దానిని నమ్ముచున్నారు. పారిజాతాపహరణములోని ప్రథమాశ్వాసమునందు ప్రణయ కలహము ప్రధానముగా గల శృంగారము వర్ణింప బడినది. ఇది క్రొత్త విషయము. పూర్వ కావ్యములందు కాన రానిది. పొలయలు కాని యున్న పువు బోడులను నాయకు డనునయించుట కావ్యములందు సర్వ సాధారణ మగు విషయము. కోప భరంబు తీర్ప నేపాటున సాధ్యము కానపుడు నాయకుడు నాయకురాలి పదద్వయిఁ దల మోవ మ్రొక్కుట కావ్య క్రమానుగత మయిన మర్యాద. అట్లే శ్రీకృష్ణుడు సత్యభామ పాదములకు మ్రొక్కినాడు. ఆమెకు భర్తయం దమితానురాగము కలదు. భర్త తన పాదములకు మ్రొక్కుట యామె సహించలేక పోయినది. ఏ భార్య యట్టి చర్యమున కోర్వ గలదు. ఆమె మానవతి. కావున వామ పాదమున వాని శిరము తొలగ ద్రోచినది. ఆమె తన్నలేదు.

ఇదియు లాక్షణిక మయిన కావ్య మర్యాద. నాయికా నాయకుల యేకాంత వినోదములలో నొకటి. ఇట్టి మర్యాదలు రాయ లెఱుంగనివి కావు. అతడు రసిక శేఖరుడు.

ప్రతి వర్ష వసం తోత్సవ
కుతు కాగత సుకవి నికర గుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాదన రసికుం

డు. తిరుమలదేవీ హృదయేశుడు.

తిరుమలదేవీ చరణో
దర లాక్షా కల్ప కల్పిత స్థల కమల
స్ఫుర దిందీవర బంధుర
హరిహయ మణి వలయ కూట హర్మ్య విహారీ !

అని పొగడ్త గాంచినవాడు. తిరుమలదేవి మీద నలిగె ననుట జరుగని సంగతి. ఈ పద్యము పై కథను ధృఢపరచు చున్నదని సురభి వ్యాఖ్యానమునందు వ్రాయ బడినది. పై పద్యము రాయల రసికతయు దేవేరులయందు అనుకూలతయు బోధించు చున్నది. ప్రచారమునందున్న కథ యబద్ధ మని తేల్చి చెప్పు చున్నది. ప్రసాదన రసికత్వము అనుకూలు డగు నాయకుని లక్షణము. అట్టివా డలుగుట కలుగదు. పారిజాతాపహరణము నందలి శ్రీకృష్ణుని కథయే దానికి తార్కాణము. రాయలయం దట్టి కథ లంట కట్టుట యవివేకము. పారిజాతాపహరణ కావ్య

రచనా కాలము

ను గురించి కొంత వివాదము కలదు. రాయలవారి దండయాత్రలు మూడు విధములుగా నున్నవి. మొదటిది దక్షిణ దిగ్విజయ యాత్ర. నరపతుల మీదికి. రెండవది తూర్పు ఉత్తరముల దిగ్విజయ యాత్రలు.

గజపతులను సంబంధించినది. మూడవది పశ్చిమ దిగ్విజయ యాత్ర. అశ్వపతుల మీఁదికి. దక్షిణ దిగ్విజయ యాత్రను గురించి పారిజాతాప హారణము నందు

శ్రీరంగేశ్వరు నాభి పంకజ రజ శ్రీఁ గంటెఁ జోళేంద్ర త
న్వీ రాజ త్కుచ పాళి మంజరులకంటెన్ సహ్య భూభృ త్తటీ
సీరంధ్రీ కృత గైరిక ద్రవముకంటెన్ వన్నె గావించెఁ గా
వేరీ తోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథ ర క్త ప్రభన్

అని వర్ణించెను. ఈ యాత్రయందు శ్రీరంగము శివసముద్రము చోళ మండలము జయించి రాయలు కావేరి వరకు తన రాజ్యమును విస్తరింపఁ జేసెను. ఈ దండయాత్ర విషయము పెద్దన యేమియు నుడువ లేదు. ఆ కాలమున పెద్దన రాయలవారి కొలువున కుదురుకొని యుండక పోవచ్చును. రెండవది తూర్పు దిగ్విజయ యాత్ర. దీనిని గురించి

ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
    వినుకొండ మాట మాత్రనె హరించెఁ
గూటముల్ సెదరంగ కొండవీ డగలించె
    బెల్లముకొండ యచ్చెల్లఁ జేతిచె
దేవరకొండ యుద్వృత్తి భంగము సేసె
    జల్లిపల్లి సమగ్ర శక్తి డులిచెఁ
గినుక మీఁాఱ ననంతగిరి క్రిందుఁ బడఁ జేసెఁ
    గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె

బల నికాయము కాలి మట్టులనె యడఁచుఁ
గటకమును నింక ననుచు నుత్కలు మహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజ మాత్రుండె శ్రీకృష్ణ రాయ విభుఁడు.

అని పారిజాతాపహరణమునందు నుడివెను. దీనిని పెద్దన

తొలుతొల్త నుదయాద్రి శిలఁ దాకి తీండ్రించు
    నసి లోహమున వెచ్చనై జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలి మైన
    యల కసవా పాత్రు నంటి రాజె
నట సాగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ
    గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరి స్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె
    నవల పొట్నూరు రవులు కొనియె

మాడెములు వ్రేల్చె నొడ్డాది మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు కలఁగి పఱవఁ
దోఁక చిచ్చన నౌర! యుద్ధరతఁ గృష్ణ
రాయ బాహు ప్రతాప జాగ్ర న్మహాగ్ని

యని పెద్దన ప్రసంగించెను. పారిజాతాపహరణమునందు

బల నికాయము కాలి మట్టులనె యడంచు
కటకమును నింక

అని యుండుటచేత రాయలు కృతినొందు నాటికి కటకము జయింప లేదని తోచును కాని

భువన విజయాఖ్య సంస
న్నవ రత్న విభా ప్రభాత నలినాప్త! రమా
ధవ చరణ కమల సేవా
ప్రవణ మతీ! వీరరుద్ర పర్వత వజ్రీ!

అని పంచమాశ్వా సాంతమునందును

చండతర మూరు రాయర
గండ మహా బిరుద ! ధాటికా రయ విచల
త్కోండపలి కొండవీటీ
మండల ! కటకేశ సింధు మందర కుధరా !

అని చతుర్థాశ్వాసాంతమునందు నుడువుట వలన కటకాధిపతి యగు వీరరుద్ర గజపతిని జయించి బహామనీ సుల్తానులను గెలిచిన తరువాత పారిజాతాపహరణ కావ్యకృతి సమర్పణము జరిగి యుండ వలయును. కటక రాజును జయించిన తరువాత భువన విజయ మను సభ నిర్మించె నని చరిత్ర కారులు నుడివిరి. అశ్వపతులను జయించిన తరువాత మూరు రాయర గండ బిరుదము రాయల కొదవినది. ఈ పై పద్య భావములను ప్రధానముగా మనుచరిత్ర కృత్యాదియందు పెద్దన

మూరు రాయర గండ పెండార మణి మ
రీచి రింఛోళి గలయ నావృతము లగుచు
నంక పాళి నట త్కుకూలాంచలములు
చిత్ర మాంజిష్ఠ విభ్రమ శ్రీ వహింప

భువన విజయాఖ్య సంస
ద్భవన స్థిత భద్ర పీఠి( బ్రాజ్ఞుల గోష్ఠిన్
గవితా మధురిమ డెందము
దవులన్ గొలు వుండి

అని నుడివెను. ఇందు మూలమున మనుచరిత్రయును పారిజాతాప హరణమును దండయాత్ర లన్నియు ముగిసిన తరువాత రాయలు ప్రశాంతముగా నున్న సమయమునందు కృతి యొసంగ బడినవి. మను చరిత్రయందు ప్రళయ ఘనాఘన ఘోష జయానక భాంకృతి భీమ చపేట లుర త్కలబరిగీ కటక క్షితి రక్షక యని ద్వితీయాశ్వాసాంత పద్యమునందు కలదు. కలబరిగిని గురించి పారిజాతాపహరణమునందు

కానబడదు. రాయలవారు చిట్టచివర జయించిన దుర్గము కలబరిగి క్రీ. శ. 1525 ప్రాంత మని చరిత్రలు చెప్పు చున్నవి. కావున పారిజాతాపహరణమును క్రీ. శ. 1524 ప్రాంతమునందు కలబరిగి దుర్గ పతనమునకు పూర్వము రాయలవారికి వసంతోత్సవ సమయమున తిమ్మన కృతి యొసంగె ననుట నిశ్చయము. మనుచరిత్రమును కలబరిగి విజయానంతరము క్రీ. శ. 1525 ప్రాంతమున రాయల యభిమతము ననుసరించి పెద్దన రచించెను. తరువాత కృతి నొసంగెను. అదియు గాక యా యా కృత్యాదులందలి రాయలవారి విజయములను వర్ణించిన పద్యములను సరిచూచినచో దక్షిణ తూర్పు దిగ్విజయములు ప్రధానముగా గల పారిజాతాపహరణ కావ్యము ఉత్తర పశ్చిమ దిగ్విజయములు ప్రధానముగా వర్ణింప బడిన మనుచరిత్రకంటె ముందు కృతి యీయ బడినదని స్పష్టముగా తోచును. రాయలు కళింగ రాజగు వీరరుద్ర గజపతి మీద క్రీ. శ. 1520 ప్రాంతమున దండయాత్రకు బయలుదేరెను. విజయవాటికయందు దండును విడియించి శ్రీకాకులమున కరిగెను. అచట నాంధ్ర విష్ణువును దర్శించెను. ఆంధ్ర విష్ణువు స్వప్నమునం దగుపించి ఆముక్త మాల్యదను రచింపు మని రాయల కానతిచ్చెను. రాయలు విష్ణుచిత్తీయము వీరరుద్ర గజపతిని జయించిన తరువాత వ్రాయఁ దలచుకొనెను. మనుచరిత్ర విష్ణుచిత్తీయములందలి వర్ణనల పోలికలను బట్టి మనుచరిత్ర కృతి నొందిన తరువాత రాయలు తన కృతి నారంభించెనన వలయును. రెండు మూడు సంవత్సరములలో దానిని పూర్తి చేసి యుండ వచ్చును. కావున పారిజాతాపహరణము క్రీ. శ. 1524 ప్రాంతమునను, మనుచరిత్ర క్రీ. శ. 1525 ప్రాంతమునను రాయలవారు కృతుల నందుకొని యుందురు. విష్ణుచిత్తీయమును క్రీ. శ. 1528 ప్రాంతమున రాయలవారు పూర్తి చేసి యుందురు. తరువాత గృహ కల్లోలములకు లోనయి 1530 వ సంవత్సరమున మరణించెను. అప్పటికి రాయలకు నలుబది యేండ్లు పైబడి యుండ వచ్చును.

నంది తిమ్మన వీర శైవ మతావలంబి. రాయలు విశిష్టాద్వైత మతస్థుడు. తిరుపతి వేంకటేశ్వర పాద పయోరుహ సేవా ధురంధరుడు. పదునారవ శతాబ్దమునందు రాజాదరణమును పొంది వైష్ణవము మిగుల వ్యాప్తిలో నుండెను. రాయల పరిపాలనమున శైవ వైష్ణవ ములు పరస్పర విరోధము లేక పొత్తు కుదిరి యుండెను. రాజు ప్రజా రంజకుడు. రెండు మతములవారిని సమాన దృష్టితో నరసెను. రాజ్యము మత కల్లోలములు లేక పెను పొందెను. కవిరాజులు రాజుల తోడివారు. వారి హృదయములు మిగుల విశాలము లయినవి. తమ కిష్ట దైవ మెవ రైనను పెర దైవములను దూషింపరు. వారి యందును సమదృష్టి కలవారయి యుందురు. ఎఱ్ఱన శివపూజా ధురంధరుడు. ఉత్తర హరివంశము, నృసింహ పురాణము తెనిగించెను. పోతన శివారాధన తత్పరుడు. భాగవతము నాంధ్రీకరించెను. మహా కవుల స్వభావములు వేరు. వారి దృష్టి విశ్వ శ్రేయము కొరకు నరయు చుండును. వారి కృతులు విశ్వ శ్రేయములు. దేవతలు విశ్వ శ్రేయో దాయకులు. కావున కవుల కే దేవతయైన నొక్కటియే. రాజులు కవులు దేవతలు నొక్క కోవలోనివారు. శివోపాసకుండగు నంది తిమ్మన విష్ణుభక్తుండగు రాయలవారి చిత్త ప్రవృత్తి కనుగుణముగా వేదవ్యాస విరచిత మగు నుత్తర హరివంశములోని విష్ణు నవతార మగు శ్రీకృష్ణుని కథయందలి పారిజాతాపహరణ ఘట్టమును

## ఇతివృత్తము

గా గ్రహించి కావ్యమును రచించెను. ఇట్లు పురాణాంతర్గత కథా భాగములను స్వంత కల్పనలు చేర్చియు మార్పు లొనరించియు మిశ్రమ ప్రబంధ రూపమున మొదట విరచించినవాడు నన్నెచోడుడు. అతడు కుమార సంభవమును రచించెను. సంస్కృత కుమార సంభవము లోని కథను శివ పురాణాంతర్గత కథా భాగముతో మేళవించి తన కల్పనలు చేర్చి ప్రబంధముగా వ్రాసెను. వాని యడుగు జాడలలో

కథ నడిపించినవాడు పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు. వ్యాస భారతము లోని శకుంతలోపాఖ్యానమునకు కాళిదాసు నభిజ్ఞాన శాకుంతలము లోని కథ కొంత వరకు చేర్చి శృంగార శాకుంతలము వ్రాసెను. పుర వర్ణనతో కథను ప్రారంభించుట వాని ప్రబంధములోని క్రొత్త విశేషము. శ్రీనాథుడు స్కాంధ పురాణములోని కథా ఖండములను యథాతథ ముగా గాక స్వంత పోకడలు వర్ణనములు చేర్చి పురాణ ప్రబంధము లుగా విరచించెను. ఆ దారిని త్రొక్కినవాడు ముక్కు తిమ్మన. వీని కథా సరళియందు వస్త్వైక్యత యున్నది. భీమ కాశీ ఖండములు కావ్య దృష్టికంటె పురాణ దృష్టితోడనే శ్రీనాథుడు రచించెను. ముక్కు తిమ్మన కావ్య దృష్టితో పారిజాతాపహరణము వ్రాసెను. తరువాత అలసాని పెద్దన శృంగార శాకుంతలమునందు వలె కథ పుర వర్ణనతో ప్రారంభించెను. అందు నాల్గు వర్ణములవారిని వర్ణించెను. మూడవ ఆశ్వాసాంతము వరకు వస్త్వైక్యత గల సలక్షణ మగు కావ్యముగా ప్రబంధించెను. ఈ విషయమున అలసాని పెద్దన శృంగార శాకుంతల మును మనసునం దుంచుకొని ప్రబంధమును నడిపించె ననుట నిర్వివా దాంశము. కాని పద్య రచనా విధానమునందు నన్నయ శ్రీనాథుల చణుకులను పుణికి పుచ్చుకొనెను. కథ చిన్న దయినది. కావున తరు వాత కథలను కూడ దీసి కావ్యమును పూర్తి చేసెను. ఆ సంగతి చివరి యాశ్వాసముల రచనా విధానమునందు స్పష్టముగా నగుపిం చును. కావున వస్త్వైక్యత లేక పోయినది. కథలు వేరైనవి. ఇది మనుచరిత్రలోని లోపము. ఐనను ప్రబంధంపుఁ బోకడలకు లోపము రానీయ లేదు పెద్దన. ఇట్టి వస్త్వైక్యత లేని ప్రబంధములు రఘువంశా దులు సంస్కృతమునందు కలవు. వానిని ప్రబంధములుగా బరిగణించు చుండిరి. కావున మనుచరిత్ర ప్రబంధము యనుటలో సందేహము లేదు. పాశ్చాత్య మహాకవుల కావ్యములందు సైతము వస్తువునకు ప్రధాన స్థాన మున్నది. షేక్స్పియరు ప్రతి నాటకమును వస్త్వైక్యత కల వానినిగా నిర్మించెను. ఆ విధానము పాశ్చాత్య ప్రబంధములందు

కూడ నగుపించును. మిల్టన్ రచించిన పేరడైజు లాస్టు, పేరడైజ్ రిగైయిన్, ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన లైట్ ఆఫ్ ఏషియా, టెనిసన్ విరచించిన నైట్స్ ఆఫ్ ది రౌండ్ టేబిల్ మొదలగు ప్రబంధము లరయ వచ్చును. హోమరు గ్రీసు దేశీయుడు. ఆయన ఇలియడ్, ఒడిసి యను కావ్యములు రచించెను. వానియందు వస్త్వైక్యత పాటింప బడినది. వస్త్వైక్యత ప్రబంధమునకు ప్రధాన లక్షణముగా ప్రపంచ మందలి కవు లందరు నంగీకరించిన విషయము. అది లేకుండుట లోప మనక తప్పదు. రస నాయికా నాయ కేతివృత్త భేదములచేత ప్రబంధములు బహు రకములుగా నుండును. శకుంతలా పరిణయము నందు ప్రధాన రసము శృంగారము. అందు వియోగ సంభోగ శృంగా రములు పోషింప బడినవి. మనుచరిత్ర యందు ప్రధాన రసము శృం గారము. అది ఆభాసాంత మయినది. కథా విధానమునందును మను చరిత్ర శృంగార శాకుంతలముకంటె వేరయి ప్రబంధము విభిన్న రూపమున గోచరించును. పారిజాతాపహరణము నందును శృంగా రము ప్రధాన రసము. అసూయా ఈర్ష్యాదులచే జనించిన ప్రణయ కోపము ఇందు వర్ణింప బడినది. ఇది ఒక విధముగా వియోగ శృం గార మని చెప్ప వచ్చును. శకుంతలా పరిణయమందు నాయకుడు ధీరోదాత్తుడు. నాయిక ముగ్ధ. మనుచరిత్ర యందు నాయకుడు ధీర శాంతుడు. నాయకురాలు సామాన్య. పారిజా తాపహరణమునందు నాయకుడు దక్షిణుడు. నాయిక ఖండిత. ధీరాధీర. కథా విధానము వేరు. కావున పారిజాతాపహరణము రసనాయికా నాయ కేతివృత్తముల చేత మిగిలిన ప్రబంధములకంటె విభిన్న రూపము కల దయి పాఠకులను మిగుల నాకర్షించును. దానికి వస్త్వైక్యత మెరుగు పెట్టినది. మనుచరిత్రకంటె స్వరూపము చేత నందము కలదయినది. దీనిని తిమ్మన రాయల కంకిత మొసంగెను. మొదటి పద్యమును రాయలవారి ఆరాధ్య దైవముగు 'వేంకట స్వామి కృతార్థుం జేయు నరస క్షితినాథుని కృష్ణరాయునిన్' అని

యాశీర్వాదము. ఆశీ ర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖం. కవులు ఋషులు. నానృషిః కురుతే కావ్యం. ఋషులగువారి కాశీర్వదించు నధికార మున్నది. కావున తిమ్మన రాయల నాశీర్వదించెను. తెనుగు కవు లందరు దాదాపు తమ కావ్యముల నెవరికో యొకరి కంకితము నొసంగుచు వచ్చిరి. ప్రబంధములను ఆశీర్వాదములతో ప్రారంభించిరి. పారిజాతాపహరణమునందు

ప్రధాన కథ

మ

హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రుని యింట నున్న య
చ్చరల కొలంబువారి నెఱ జవ్వనముం బొలివోని వారిఁ ద
న్వరునిఁగఁ గోరువారి లలనామణులం బదియారు వేవురం
బరిణయ మయ్యె నారదుని పంపున సౌఖ్య రసైక లోలుఁడై

అని వస్తు నిర్దేముతో నారంభించెను. ఇదిసంస్కృతకవుల సంప్రదాయము

అస్త్యుత్తరస్యాం దిశి దేవ తాత్మా
హిమాలయో నామ నగాధిరాజః

అని కాళిదాసు కుమార సంభవము నారంభించెను.

నిపీయ యస్య క్షితి రక్షిణః కథా
స్తథాద్రియంతేన బుధా స్సుధా మపి
నల స్స భూజాని రభూత్ గుణాత్భుతః

అని శ్రీహర్షుడు నైషధము నారంభించెను.

నాయ కాభివర్ణనముతో తిమ్మన పారిజాతాపహరణము నారంభించెను. ఇది సంస్కృత కావ్యముల యనుకరణము. తెలుగు కవులు చాల వరకు పురవర్ణనతో కథ నారంభించుచు వచ్చిరి. హరి శ్రీకృష్ణుడు. పారిజాతాపహరణ కావ్యమునందు నాయకుడు. నరకాసురునిం గెలి చినా డనుట పరాక్రమము సూచింప బడినది. నారదుని పంపునన్

అనుటచేత అవికత్థనత్వము ద్యోతక మగు చున్నది. తన్వరునిగఁ గోరు వారి ననుటవలన కరుణ వెలయింప బడినది. అందు ధీరత్వమును కలదు. ఇట్టి లక్షణములుగల నాయకుడు ధీరోదాత్తుడు.

ధీరాత్ముం డవికత్థనుండు గరుణోద్వేలుండు సత్వాఢ్యుఁ డా
ధీరోదాత్తుఁడు

శ్రీకృష్ణుడు లలనా మణులం పదియారు వేవురం బరిణయ మయ్యెను. వీరికితోడు మహిషు లెనమం డ్రంతకు పూర్వము కలరు. వీరందరి తోడం గూడి

ఏ యే వేళల నే సరోజముఖ యే యే లీలలం గోరుఁ దా
నా యా వేళల నా సరోజముఖ నా యా లీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుండయి పెక్కు రూపముల మాయా కల్పనా చాతురిన్

అని వర్ణించుటచేత శ్రీకృష్ణుడు దక్షిణుడను శృంగార నాయకు డగు చున్నాడు. బహు ప్రియాసదృశ శీలుడు దక్షిణుడు. ఒక్క డింత మంది యిల్లాండ్రతో భోగాయత్తుండయి సౌఖ్యాబ్ధి నోలలాడుట సంభవ మగునా యను సందేహము కలుగ వచ్చును. తన్నివృత్తి కొరకు కవి ఏ చాయం జూచినఁ దానయై పెక్కు రూపముల మాయా కల్పనా చాతురిన్ మెలగు చుండు నని నుడివెను. అందు మూాల మున శ్రీకృష్ణునియందు సర్వ వ్యాపకత్వము, బహు రూపకత్వము, మాయా మయత్వము నారోపింప బడినవి. ఆ కారణముచేత శ్రీకృష్ణుడు పరమాత్ముం డనియు కావున నందరితో నట్లు నన్నిరూపముల భోగింప గలిగె ననియు నది యంతయు మాయా నాటక మనియు సూచింప బడినది. ఈసంగతి భాగవతము దశమస్కంధము పూర్వ భాగ మునందు గోపికలతోడ శ్రీకృష్ణుండు క్రీడించు సందర్భమున స్పష్ట ముగా చెప్పబడెను.

గోప జనములందు గోపిక లందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వ మయుఁడు లీల సలిపెఁ గాక

అది లీల. మాయా కల్పితము. కావున తిమ్మన మాయా కల్పనా చాతురిన్ అని వాడెను.

హరి యిల్లు సతుల నందఱి
సరిగాఁ జూచియును భోజ జనపాల సుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్

ఈ పద్యము పారిజాతాపహరణ కావ్యమునకు బీజము. నాటకము నందు వలెనె కావ్యమునందును బీజము బిందువు పతాకా దులు మహాకవుల రచనలలో గోచరించును. మనుచరిత్రయందు 'వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి' యను గీతమునందు బీజ ప్రాయముగా కథ సూచింప బడినది. పై పద్యమునందు భోజరా జాత్మజా సాత్రాజితులను శ్రీకృష్ణుఁడు మిగుల మన్నించి చనవుల నొసంగు ననుటలో భావి కథ బీజ రూపమున ద్యోతక మగు చున్నది. రుక్మిణి భోజ జనపాల సుత. సత్యభామ సాత్రాజితి. ఇరువురు మహారాజ పుత్రికలు. కుల గౌరవము గలవారు. ఇది వారి గర్వమునకు కారణము. విశేషించి సత్యభామ తరుణీమణి యట. ఆమె తారుణ్య మామెను మరింత గర్వితనుగా చేసినది. తారుణ్య మనగా యౌవనము. యౌవనము చక్కదనమునకు కారణము. కావున తరుణి యనుట వలన అందము యౌవనము కలదని భావము. అట్టి వారియందు మణి శ్రేష్ఠురా లగుటచేత సత్యభామ లోకమునందు పేరు పొందెను.

అందు మూలమున నామెకు నిక్కు టెక్కువ. ఆ యౌవన సౌందర్యములను చూచుకొని యామె విఱ్ఱవీగు చుండును. కావుననే నారదుడు

చక్కని దాన నంచు నెల జవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కిన దాన నంచు

నిక్కుచు విఱ్ఱవీఁగుచు సత్యభామ కాంతల గణింప కుండె నని నుడివెను. ఈభావము మనస్సునం దుంచుకొని తరుణీమణి సాత్రాజితి యని తిమ్మన పై పద్యమునందు వాడెను. అందలి నిగూఢ భావమును నారదుని నోట చెప్పించెను. రుక్మిణీ సత్యభామలు మగని మన్ననయు చనవును గలవారు. ఒకరి కొకరు తీసిపోవు వారుకారు. అందును సపత్నులు. ఇంక రవరవల కేమి కొరత

కులమును రూపము న్మగని కూరిమియుం గలదాన నంచు నీ
వల నిల రుక్మిణీ రమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగని కూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా రవరవ ల్వొడమె న్మది వారి కెంతయున్

అని తిమ్మన పై కందపద్యములోని భావమునకు రవరవలకు కారణములుగా వ్యాఖ్యానించినాడు. కులమును రూపము న్మగని కూరిమియుం గలదాన నంచు నని రుక్మిణీ సత్యభామల కొక్కటే విధమగు పదములను విశేషణ గతములుగా వాడుటలో నొకరి కొకరు రవరవలయందు తగ్గిపోవువారు కారు. ఇరువురు సమాను లని తోపింప చేసినాడు కవి. వియ్యమున కైనను కయ్యమున కైనను సమానులుండ వలయును. అప్పుడె యందముండును. లేనిచో నసమర్ధులయి

అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గానఁ బూవు నో
విందుఁడు దాని కిచ్చెఁ దగవే యని లక్షణ యోర్చెనైనఁ జేఁ గా

ళింది శమించె భద్ర యవు లెమ్మని యూరడిలెన్ సుదంత లోఁ
గుందుట మానె జాంబవతి కోప మడంచెను మిత్రవిందయున్

వలె నూరకుందురు. మహాకవులు పూర్వాపర సందర్భములను ముందుగా నాలోచించి పరస్పర విరుద్ధములు గాకుండ నొండొంటిని భావములు కలుపుకొనుచు పద్య రచన గావింతురు. అది కథా సరణికి బిగువు నొదవించును. అందము నాపాదించును. వానిని సమన్వయము చేసి చూచుకొను నప్పుడు కవి ప్రతిభ యోచనా శక్తి కల్పనా సామర్థ్యము గోచరించును. ఒక్కొక్కప్పు డొక పద్య మింకొక పద్యమునకు వ్యాఖ్యాన రూపమున నుండును. అందు మూలమున రస స్ఫూర్తి కలుగును. ఇట్టి రచనా విధానము కావ్య కవులలో నంది తిమ్మన యలసాని పెద్దనలయం దున్నది. పిల్లలమర్రి పినవీరన శృంగార శాకుంతలమునందు లేదు. కావున కథ పలపల నైనది. ఈ విషయము లా యా సందర్భములందు విమర్శింప బడినవి. మరల వానిని వివరించుట చర్విత చర్వణ మగును. ఒకనాడు

స రి గ మ ప ద ని స సంజ్ఞ స్వరంబుల
మహతి నభో వాయు నిహతి మొరయ
భాగీరథీ పయః పరిపూర్ణ మణి కమం
డలువు హస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవ మంత్రావృత్తి పావన స్ఫటి కాక్ష
వలయంబు కర్ణ శష్కులిక వ్రేల
సమర నృత్యోచిత చమర వాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ

దేహ కాంతు లకాల చంద్రికల నీన
జడలు మోక్షద్రు పల్లవ శంక సేయ
గగనమున నుండి వచ్చె నాకస్మికముగ
నారివేరంపుఁ దపసి దైత్యారి కడకు.

ఈ పద్యము నందు తిమ్మ నార్యుని కవితలోని శిల్పకళా నిరూపణమునకు నిదర్శనము. నారదుని పెక్కుమంది కవులు తమ కావ్యములందు వర్ణించిరి. ఆ వర్ణనలు వారి వారి మతానుగతములయి విభూతి రుద్రాక్ష తులసి మాలాదులతో నొలసి శివ కేశవులయందలి ప్రత్యేక భక్తి చ్ఛాయలు సూచించు చుండును. తిమ్మన నారదుని సాత్త్విక భక్తి స్వరూపునిగా నిందు నిరూపించెను. కావుననే

ప్రణవ మంత్రావృత్తి పావన స్ఫటి కాక్ష
వలయంబు కర్ణ శష్కులిక ప్రేల

నని వర్ణించెను. అక్షమాల తులసి పూసల దండ కాదు. పద్మాక్ష మాలయు గాదు. స్ఫటి కాక్షవలయము. స్ఫటిక మాల మోక్షా ద్యుత్తమ ఫలముల నొసంగును. అది సత్త్వ గుణమునకు తార్కా ణము. నారదుడు నారాయణ మంత్రము జపించువాడు గాడు. పంచాక్షరీ మంత్రము నుపాసింపడు. త్రిమూర్తులకు మూల తత్త్వమగు పరబ్రహ్మమును సేవించును. అది సత్త్వము. అందు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లిమిడి యుందురు. దానిని ప్రదర్శించు మంత్రము ప్రణవ మగు ఓంకారము. అది అ ఉ మ్ ల సంపుటీ కరణము. అకారము విష్ణువు. ఉకారము శివుడు. మకారము ఆది శక్తి ప్రకృతి. అ+ఉ+మ్= ఓం అగును. ఆ మంత్రమును పలు నావృత్తులుగా జపించుటచేత పావన మయిన దా స్ఫటి కాక్షవలయము. దానిని కరమందు ధరింప లేదు. పవిత్ర మగు దక్షిణ కర్ణమున తాల్చెను. దక్షిణ కర్ణము పూతమయిన దని శాస్త్రము. చేత దాల్చిన మణి కమండలువు భాగీరథీ పయః పరిపూర్ణము. భాగీరథి యను శబ్దము గంగకు పర్యాయ పదముగా వాడబడినది. ఒకప్పుడు గంగ విష్ణువు భార్య. శివపత్ని. హరి హరులందు సమాన ప్రతిపత్తి కలది. ఆ కారణముచేత గంగా జలమును కమండలువునందు

నింపుకొనె నని కవి వర్ణించెను. ఆ జలము స్ఫటికము వలెనె తెల్లని వర్ణము కలది. నారదుని శరీరము తెల్లనిదయి అకాల చంద్రికల నీను చున్నదట. సత్వ గుణము తెలుపు. నారదుడు ముముక్షువు. మోక్షార్థి. అతడు వైకుంఠము గాని కైలాసము గాని కోరువాడు కాడు. అవి వానికి నిత్య సంచారములు. అతడు కోరునది పునరావృత్తి జన్మ విరహిత మయిన కైవల్యము. అది యా మహాని యాశించు మోక్షము. పరబ్రహ్మతో నైక్యము. కావున కవి నారదుని మోక్ష ద్రుమముతో పోల్చెను. వాని జడ లెఱ్ఱనయి మోక్షద్రు పల్లవ ముల శంకను కలిగించు చున్న వని కవి వర్ణించెను. ఇందువలన నార దుడు సత్త్వ మయిన పరబ్రహ్మము నుపాసించి వానియందు కైవల్య మును బొంద నభిలషించు సాత్త్విక భక్తి యుతుడగు తపస్విగా తిమ్మన వర్ణించెను. అతడు ఆరివేరంపుఁ దపసియట. పుల్లింగాలు పెట్టి పోట్లా టల పెంచు ముని యతడు. అది వాని నిత్య కృత్యము. ఇందు రాబోవు సత్యా రుక్మిణుల పోరాటము సూచింప బడినది. సీస పాద ములందు స్వభావోక్తి గీతమునందు అతిశయోక్తి ఉత్ప్రేక్షలు గలవు.

నారదుడు

ప్రామిన్నుకుల దొంగఁ బాతాళ కుహరంబుఁ
 జొరఁ బాఱి చీఱిన చోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి
 చవిఁ దేల్చి నట్టి కచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేల చేడియఁ గొమ్ము
 కొన నుబ్బ నెత్తిన ఘోణి వీవ
మునిమాపు బలు గంబమునఁ బుట్టి బంటు న
 క్కఱఁ గాచినట్టి సింగంబ వీవ

దితిజు మెట్టిన యా పొట్టి దిట్ట వీవ
పుడమి ఱేఁడుల నడఁచిన ప్రోడ వీవ

కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బి వీవ!
యిపుడు ద్వారక వసించు నీవు నీవ

అని శ్రీకృష్ణుని యవతారములను వర్ణించి పొగడెను. పారిజాతాప హరణము తృతీయాశ్వాసమునందు అదితి శ్రీకృష్ణుని దశావతారముల వర్ణనతో నభినుతించినది. అందు

సట లిక మాను రోరి! హరి సర్వ మయుండటె యంచుఁ బట్టితోఁ
జిటచిట లాడి యిందుఁ గనఁ జేయుము నీ వని దైత్యుఁ డాడినం
బటపట దాఁటి కంబ మిరు వాయలుగా నరసింహ మూర్తివై
కుటిల నఖాగ్ర కుంచికల గ్రువ్వవె వాని యురః కవాటమున్

ఇది నరసింహావతార వర్ణనము. ఈ పద్యమునందు రూపకాలంకారము కలదు. దేశీయ పద జాలములలో వీర రసమును పొంగి పొరలింప చేసినాడు తిమ్మన. ఈ రచనా విధానము తిక్కనలో నున్నది. ఆ మహాకవి యుద్ధ ఘట్టములందు క్రొన్ననలలోని మొత్తం దన మిముడ్చుకొనిన తెనుగు దేశీయంపు పద జాలములలో ప్రచండ విల యానలము ప్రజ్వలింప చేయగల సమర్థుడు. సముద్ర మతి శీతల జల సమాహితం బయ్యును నందు నౌర్వాగ్ని డాగి యున్నది. అది కాలానుగతముగా కీలాభీలమై ప్రలయ మొదవించును. అట్టిది తెనుగు భాష. సంస్కృత పద సంఘటిత మగు సమాసముల వలన నిప్పులు కురిపించు వీర రసము ప్రదర్శింప వీలగు నని వాదించుపండితు లీపద్యము నరసినచో నింక నోరెత్తరు. రస ప్రస్రుతి రచనయందు దున్నది గాని భాష యందును వృత్తమునందును లేదు. ఏవృత్త మయిన నొకటియే. శార్దూలము వీర రస ప్రదర్శనమునకు తగిన వృత్త మనుకొనుట యవివేకము. తిమ్మన వాడినది చంపకమాల. అందుండి సటలలో రగిలిన వీర రసానలమును చిటచిట లాడించి పటపట మండించినాడు. కుటిల నఖాగ్ర కుంచికలలో శిఖలు మిన్నంట రేపి దానవు నాహుతులు గావింపించినాడు.

ఆ పదముల పొందికలో వీర రసము కురిసి ప్రజ్వలించినది. పద్యము చదువు నప్పు డా యనుకరణ ధ్వనులలో నరసిం హావతారములోని సంరంభము హృదయమునకు పొడకట్టును. అది యీ రచనలోని యందము. తిమ్మన కే తెనుగు పద మెచట నెట్లు వాడిన రాణించి రస స్రుతి కలిగించునో బాగుగా తెలియును. రసము ననుసరించి భావము, భావము ననుసరించి పదము, వాడుటలో నాతని కాతడే సమానుడు. తిక్కన రచనలో భావము ప్రధానము. తిమ్మన రచనలో భావమునకు పదమునకు ప్రాధాన్యము కలదు. అందుకు పై పద్యము వెనుకటి పద్యములు తార్కాణములు. ఏ రసమునం దైనను తిమ్మన తన సహజ శయ్యా మార్దవమును విడువ లేదు. అది యాతని సొత్తు

> నను నా కశ్యప కామినీ మణులలోన న్ధన్యఁగాఁ జేయ మ
> త్తనయ వ్యాజము దాల్చి వామనుని చందాన న్బలి న్మట్టవే
> ఘన మార్గోన్నమి తాంఘ్రి పద్మమునకుం గంజాప్తుఁ డంశు వ్రజం
> బను కింజల్క పరంపరల్ మెఱయ నుద్య త్కర్ణికం బోలఁగన్

ఈ పద్యమున రూపకాలంకారమును పొసగించి వామనుడు ఆకాశ మున కెత్తిన పాద కమలమును వర్ణించినాడు తిమ్మన. ఇందలి సహజ స్వరూపము ప్రసంగింప తగినది. వామనుడు తన పాదము నాకాశమున కెత్తెను. అది కమలము వలె నున్నది. దానికి సూర్యుడు కర్ణిక. వాని కిరణములు కింజల్కములు. మానవ హృదయమున కందుబాటులో నున్న కల్పన. ఈ యందచందములు పెద్దన రాయల వారలయందు లేవు. పెద్దన మనుచరిత్రమునందును రాయలు విష్ణు చిత్తీయమునందును దశావతారములు వర్ణించిరి. వాని నీ పద్యము లతో సరిపోల్చి చూచినచో నీ పద్యములలోని తియ్యందనము వానియందు కానరాదు. దానికి కారణము తిమ్మన తెనుగు నుడి

కారములోని మార్దవము, భావములలోని కల్పనా వైశద్యము. మనుచరిత్రయందు

కరుణించున్ మము నట్టి నీదు భుజ యుగ్మం బెద్ది పూనెన్ నభోం
తర సీమన్ దితజాంత్ర సక్త నఖ సంతానంబుతో నో నృకే
సరి రాత్రించర భీతికై త్రిభువన స్థానీయ వీథిన్ విక
స్వర శోణ స్రగలంకృత క్రకచ భాస్వత్తోరణ స్తంభతన్

ఇది నృసింహావతార వర్ణనము

దనుజ కులేంద్ర దత్త కరతామరస స్థిత దాన ధారచే
ననిమిష దైన్య దుఃఖిత మహాముని మండల దృశ్య కశ్య పాం
గన నయ నాంబువుల్ కడిగి కంజభవాండము మోవ లీలమైఁ
బెనిచిన దంభ వామను నుపేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్

ఇది వామ నావతారము. పెద్దన సంస్కృత దీర్ఘ సమాసములు వాడినను పదములు తేలికగా నర్థ మగును. భావము నవగత మగును. రచనలో కొంత మార్దవము మాధుర్యము కలదు. విష్ణుచిత్తీయము నందు

అసురేంద్రాశయ కుండి కాచ్ఛ రుధిర వ్యాప్త స్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతి సింహ మత్సర మిళ చ్చేష్టన్ దదుద్దామ దీ
ర్ఘ సటా ఝూటముఁ బెల్లగించు గతి నాంత్ర శ్రేణిఁ గిన్కన్ వెరం
జు సిత క్రూర భవ న్నఖావళులు ప్రోచున్ మర్త్య పంచాననా

ఇది నరసింహావతార వర్ణనము.

బలి దైతేయ భయాంధకార భరిత బ్రహ్మాండ గేహంబులో
పలఁ బై మండెడు త్వత్ప్రతాప మయ దీప జ్వాల డింద న్గడున్
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్యత్తన్మహా చ్ఛాయ నాఁ
గల నీలాంగము శింశుమార మొరయంగాఁ బెంచవే వామనా !

అని వామనావతారమును వర్ణించెను. ఈ రచన పెద్దనగారి రచన వలె గాక మిగుల కరకయినది. సమాసములు కఠినములు. పెద్దనగారి సమాసములలోని సరళత వీనియందు లేదు. పదములు గులక రాళ్లు. భావము ప్రౌఢము. రూపకా ద్యలంకారములతో పొందుకొని యది మరింత ప్రౌఢ మయినది. ఇది తిమ్మన పెద్దన రాయల వారల రచనల లోని తారతమ్యము.

ముక్కు తిమ్మ నార్యు ముద్దు పలుకు

అను ప్రథ నుడికారంపు సొంపు వలననే కలిగినది. ఆ ముద్దుతనము తెచ్చినది వ్యావహారికములు దేశీయములగు తెలుగు పదముల సంపుటీ కరణము. ఈ రచనా విధానము పూర్వ కవులలో తిక్కనయందున్నది.

రక్కెస మాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి వైనఁ గాదనక యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొన నైనను బోయెదువో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా!

రక్కెస మాటలు, ఊఁకొనుచుండు ఇత్యాది వ్యావహారిక పదముల పొందిక తిక్కన పద్యముల కందము తెచ్చినవి. ఇట్టి రచన చదువరుల నూట లూరించును. నన్నయ సంస్కృత సమాస కలిత మయిన భారత భాగమును చదివిన తరువాత తిక్కన దేశీయంపు నుడికారముల మెత్తందనము గల విరాటోద్యోగ పర్వములను చదువు నపుడు పాఠకుని హృదయము మహాప్రవాహము నీది వెలుపడి ప్రకృతి యందమును సందర్శించుచున్న ట్లుండును. ప్రాణమున కమిత మగు హాయిని కల్పించును. దానిని చూచియే లోకులు తిక్కనగా రనిన మురిసి పోవుదురు. తెనుగు సారస్వతమునం దంత కవి లేడని పొగడుదురు. వాని

రచనలోని రహస్యమని. కాని వాని పదములలో కొన్ని మాండలికము లుండును. అవి మారుమూల పదము లనిపించును. భావములలో దూరాన్వయములు, క్లిష్టములు కలవు. అవి వాని రచనకు ఒక్కొక్కప్పుడు కరకుతనమును కల్పించును. శయ్యలో పోను పోను బిగువు సడలి చివరి పర్వములందలి పద్యములు పేలవము లనిపించును. తిక్కనను సర్వ విధముల ననుసరించి కృతకృత్యు డయినవాడు తిమ్మన. పైన చూపిన తిక్కనగారి రచనలోని లోపములు ముక్కు తిమ్మన యందు కానరావు. పదములు చాల వరకు జనుల వాడుకలోని వయి యుండును. వానియందు విరి తేనెల తీపి వెన్నలోని మార్దవ మమరి యుండును. అందు మూలమున పాఠకుని చిత్తము నాకర్షించును. చదువు నప్పుడూట లూరించును. సమ్మోద మొదవించును. అదియె తిమ్మన రచనలోని ముద్దు తనము. అన్వయముకొరకు తడుముకొన వలసిన పని లేదు. ఆ కారణముచేత పద్య మాహ్లాద కరముగా నుండును. రస పిపాసువుల మనస్సును నచ్చగొలుపు శయ్య తిమ్మన రచనలో నున్నది.

చక్కనిదాన నంచు నెల జవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కక యున్నె నీ మహిమ సూచిన బోఁటులు విన్నవించినన్

నిక్కు, విఱ్ఱవీఁగు, ఇటువంటి పదములు నంది తిమ్మన పద్యములలో మెండుకొని యుండును. అవి యన్నియు లోక వ్యాప్తముగా జనులు వాడుకొను పదములు. ఇంక భావము లందుమా సామాన్య మానవ సంభాషణలయందు వినవచ్చునవి. వానిలో తలచుట్టు నన్వయము లుండవు.

ఎంతకు లేఁడు నారద మునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లే రని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతుకు వచ్చు సత్య గరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ !

ఎంతకు లేఁడు, వంతుకు వచ్చు ఇత్యాది పదము లరయునది. అలంకార ములు వాడినను తిమ్మన మానవ పరిచయమునకు దూరముగా నరుగడు.

కలకాల మొక్క గతిఁ బూ
సలలో దారంబు మాడ్కి సతి మదిలోనన్
మెలఁగెడు పురుషుఁడు గలుగుట
తొలు జన్మము నోముల ఫలము తోయజనేత్రా

ఇందు నుపమాలంకారము కలదు. పూసలో దారము సంగతి లోకమునం దందరికి తెలిసినదే. పద్యము లన్నియు నీ విధముగా నుండును. ఇట్టి తెలుగు తనంపు సొంపు పూర్వ కవులలో తిక్కనయందు తప్ప మరేయితర కవులం దంతగా గనుపించదు. పెద్దన శ్రీనాథులందలి తెనుగు నుడికార మాచ్ఛికము వైకృతము. తిమ్మనయందు తెనుగు నుడికారంపు సొంపుఁదనమే కాక సంస్కృతసమాస సంఘటనమునందును నీయంద మున్నది. నన్నయ పెద్దనలు సంస్కృత పదముల యల్లికలకు పేరు మోసినవారు. తిక్కనలో నా యందము లేదు.

పాదప నూతనాంబుధర పంక్తి విముక్త మరంద వర్ష సం
పాదిత శక్రగోపముల భావము నందుచు నో యదృష్ట సిం
హోదర సన్నివేశ ! కడు నొప్పెడు దాడిమ బీజము ల్మదో
న్మాదిత రాజకీర వదన త్రుటి తోరు ఫల చ్యుతంబులై

సమాసములోని పదము లన్నియు వాడుకలోనివి. అర్థముకొరకు కోశములందు తడుముకొన వలసిన పని లేదు. నన్నయ పెద్దనల రచనలలోని రహస్యమే యది. ఎంత దీర్ఘ సమాసము వాడినను పదము

లన్నియు తేలికగా నర్థమగు చుండును. వెంబడినే భావ మవగత మగు చుండును. కావున చదువుట కుత్సాహ మొదవించును. దానికి తోడు వానిలో లయాత్తాళ గతు లిమిడి యుండును. కావున శ్రవః పుటములందు మరంద ధారల వలె చొరంబారును. మనస్సు వాని రుచి మరిగి మరింత రుచులకు నాలుక లల్లార్చును. అది ద్రాక్షాపా కము. కోరనివా రెవ రుందురు. తిమ్మన అంత కందుకొన లేక పోయి నను సమాసములలో సరళత మృదుత్వము నున్నవి. రాయల సం స్కృత రచనలో నివి యేమియు లేవు. అది నారికేళము పెచ్చు తీసి పగలంగొట్టి పై టెంకె నూడతీసి లోని కొబ్బరి రుచి చూడ వలయును. అంత సహనము ఆధునికులకు లేదు. ఆ పాండిత్య ప్రకర్ష అతీత మయి నది. కావున విష్ణుచిత్తీయ మడుగున పడినది. ఒక్క విష్ణుచిత్తీయమే కాదు అన్ని ప్రబంధము లడుగంటినవి. కొంత కాలమునకు సాహి త్యము పాండిత్యముతో పాటు అంతరించును. దానికి ప్రథమ రంగమా ధునిక రచయితల వాదము. 'దేశ మంటే మట్టికాదోయి' అన్నా రిప్పుడు 'సాహిత్య మంటె వుట్టిదోయి' అంటారు తరువాత.

ఆరివేరంపుఁ దపసి

యట నారదుడు. ఇది నారదుని పాత్ర పోషణకు మూలాంకురము. తిమ్మన ముందుగా పాత్రలందలి ప్రధాన గుణము నంకు రార్పణగా సూచించును. వాని కనుగుణముగా పాత్రల నా యా సముచిత సన్నివేశ ముల చేతను సంభాషణల చేతను పోషించుచు ప్రబంధమును మనో హరముగా నడిపించును. పాత్ర పోషణయందు తిక్కన మహాఘటికుం డని చాలమంది వ్యాస కర్తలు పత్రికలందు ప్రచురింపగా చదివి యుంటిని. అందలి సత్యాసత్యములు ప్రకటించుట కిది తావు కాదు. అయినను స్థాలీ పులాక న్యాయముగా నుడువుదును. కోరాడ రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధ విమర్శకులలో నగ్ర గణ్యులు. తిక్కన గారి భారతము నక్షరాక్షరము గాలించి సారస్యములు వెలయించిన

వ్యక్తి. తిక్కనగారి కొన్ని పద్య భావములను తరువాత వారు శ్లోక ములలోని కనువదించి వ్యాస భారతమునందు చేర్చి రని నిర్ణయించిరి. సుధేష్ణ పాత్ర తిక్కనగా రతిమనోహరముగాను నిపుణముగాను పోషించె నని మరొక వ్యాస కర్త విరచించెను. ద్రౌపది పాత్ర పోషణ మూలమునకు వన్నె పెట్టుచున్న దని మరొకరు విమర్శించిరి. తిక్కన మూలమునకు మెరుగు పెట్టినది లేదు. వాని భావములు వ్యాస భారతములో చొనిపించిన మాట యబద్ధము. సుధేష్ణను సిగ్గు లేని నీచ పాత్రగా తయారుచేసినాడు తిక్కన. అసలు మూలమే యట్లు న్నది. ఆయన చేసినది లేదు. ద్రౌపది నతి గయ్యాళిగా నిరూపించి నాడు. తిక్కనయం దభిమానము వారి నట్లు వ్రాయించినది. తిమ్మన ప్రబంధములోని యొక్కొక్క పాత్రను వాని గుణములను స్థానములను ముందు చక్కగా నాలోచించి మానసిక ప్రవృత్తి కనుగుణముగా రచన సాగించెను. నారదుని పాత్ర పారిజాతాపహరణమునందు విచిత్ర మయినది. దానికి కావ్యమునం దొక ప్రత్యేక మగు స్థానము గలదు. తిమ్మన శ్రీకృష్ణుని ధీరోదాత్తుం డగు లోక సామాన్య నాయ కునిగా తీర్చి దిద్దెను. అందును దక్షిణ నాయకుడు. భార్యల కనుగుణ మగు వర్తన కలవాడు శ్రీకృష్ణుడు. వాని నవతార పురుషునిగా గాని అతీత మగు దేవతా శక్తులు గలవానినిగా గాని సృజింప లేదు. మూల మునం దున్న పౌరాణిక లక్షణము లన్నియు తొలగించి కథను సర్వ సామాన్య మగు లౌకిక ప్రవృత్తి కలదానినిగా మార్పు గావించెను. దానికి తగిన సన్నివేశములను కల్పించెను. మానవుల యూహాను నను భవములకు దరిదాపులలోని దానినిగా చేసెను. అందు మూల మున కావ్యము పౌరాణిక ప్రబంధముల వలె గాక వినూతన రూపమును దాల్చి పాఠకులను మిగుల నాకర్షించు చున్నది. నన్నెచోడుని కుమార సంభవము, శ్రీనాథుని కాశిఖం డాదులందు దేవతా ప్రవృత్తి అడు గడుగున గోచరించును. అవి పౌరాణిక దృష్టితో వ్రాయబడినవి. పారిజాతాపహరణము నందలి ప్రధాన కథ లౌకిక దృష్టితో వ్రాయబడినది.

కావున కావ్య మతి రమణీయ మయినది. ఈ యందమును గుర్తించి అలసాని పెద్దన మనుచరిత్రయందలి పాత్రలను సన్నివేశములను లోక సంబంధ మయినవానినిగా తీర్చి యందచందములను వెలయించెను. కావుననే ఈ రెండు కావ్యముల కంత ప్రశస్తి కలిగినది. మూలముల ననుసరించి కావ్యములను సృజించినచో ఉత్తర హరివంశాదుల వలె పౌరాణికము లయి యింత గణనీయము లయ్యేడివి కావు. తిమ్మన పెద్దనలు తమ కావ్యములందు చూపించిన మానవ ప్రవృత్తి వానికి వినూతనత్వము ఘనతయు నాపాదించినవి. శ్రీకృష్ణుడు విష్ణువు నవతారము. దైవత మూర్తి, పరతత్త్వము. అతడు పురాణ పురుషుడు. ఈ లక్షణములను తొలగించి కావ్యము విరచించినచో కథ పేలవ మగును. లోకమునందు కావ్యము ప్రచారములోనికి రాదు. కవి కృషి నిరర్థక మవును. శ్రీకృష్ణరాయ విజయాది కావ్యముల వలె చదువు వారుండరు. వెనుక పడిపోవును. ఆ కాలము ఇప్పటి కాలము వంటిది కాదు. దైవభక్తి పురాణములందలి గౌరవము కల కాలము. నాస్తికత్వము ప్రబల లేదు. ఆస్తికత్వము మానవ హృదయములం దలముకొని యున్నది. కావున పౌరాణిక దృష్టి కావ్యమునందు పూర్తిగా తుడిచిపెట్ట రాదు. విశేషించి యది పాశ్చాత్య దేశములందు వలె గాక మన దేశమునందు ప్రబంధము నకు నధిక గౌరవము నాపాదించును. అది తిమ్మనకు బాగుగా తెలి యును. కావున శ్రీకృష్ణునియందు గల దేవతా ప్రవృత్తిని నారదుని మూలమున ప్రదర్శించెను. విశ్వ శ్రేయః కావ్యం. నారదునివలన సత్యభామకు కృష్ణునియందు సాత్త్విక భక్తి కలుగు నటుల చేసెను. రుక్మిణి లక్ష్మి యని లోకమునకు విదితము గావించెను. భక్త పరాధీనుడు శ్రీకృష్ణుం డని వెల్లడించెను. అందు మూలమున కవి మానవుల చిత్తములందు కృష్ణభక్తిని నెలకొల్ప గలిగెను. కావ్యమును విశ్వ శ్రేయముగా రూపొందింప గలిగెను. ఇట్టి పౌరాణిక ప్రవృత్తులను ప్రత్యేకముగా ప్రదర్శించుటకు నారద పాత్రను సృజించినాడు తిమ్మన.

కథా విధానమున కాతని నొక సాధనముగా గ్రహించెను. అందుకని నారదుని పాత్ర కావ్యమునందు ప్రముఖ మయినది. నారదుడు శ్రీకృష్ణుని దశావతార పురుషునిగా తన వినుతియందు నిరూపించెను. అంతే కాదు

ద్వారక వైకుంఠ పురం
బీ రుక్మిణి లక్ష్మి మీర లిచట నునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును.

అని విస్పష్టముగా నుడివెను. ఇందు మూలమున రుక్మిణీ కృష్ణులు లక్ష్మీ నారాయణు లని లోకమునకు వెల్లడించెను. ఇది రుక్మిణీ కృష్ణులయందలి దైవత ప్రవృత్తిని చాటుచున్నది. నారాయణుండగు శ్రీకృష్ణుని దర్శింప వచ్చెను. ఉట్టి చేతులతో రారాదు. ఫలం పుష్పం తోయం అన్నారు పెద్దలు. తన వెంట పారిజాత పుష్పమును తెచ్చినాడు నారదుడు. తాను తెచ్చిన పారిజాతంపుఁ గొన్నన మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురు టాకునం బొదివి నూడిద యిచ్చినాడు శ్రీకృష్ణునకు. ఈ నారదుని పాత్ర మనుచరిత్రలోని సిద్ధుని పాత్ర వంటిది. పారిజాతము పాద లేపము వలె తరువాతి కథా వ్యాప్తికి నాధార మగుచున్నది. దీని మీద సత్యభామ కోపము, శ్రీకృష్ణుడు పారిజాత వృక్షము కొని వచ్చుట, మొదలగు కథ యమరి యున్నది. మాధవుఁ డా క్రొన్ననను గైకొనినాడు. భీష్మక నందనను గనుఁగొనినాడు. సత్యభామ తలంపున నిలిచినదట

వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డా క్రొ
న్ననఁ గయికొని భీష్మక నం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలువన్

29)

ఎవరి కీయవలయు నను సందేహము కలిగినది. వినయ విస్మయములు శ్రీకృష్ణుని యందలి మానవ సహజములగు గుణములను వెలయించు పదములు. అతడు మాధవుడు. లక్ష్మికి భర్త. భీష్మక నందన లక్ష్మి. లక్ష్మీధవుడు గావున మొదట భీష్మక నందనను గాంచినాడు. దాని కను గుణముగా నామె యర్హురా లనియు నా కుసుమ మామె కొసంగు ననియు మాధవ శబ్దము చేత తిమ్మన సూచించినాడు. అట్లే జరిగినది. కనుఁగవఁ జిన్న నవ్వు దొలఁక న్మునినాథుని కన్ను సన్న నిచ్చినా డా విరిని భోజ నందనకు. మునినాథుని కను సన్నలో నున్నది యీ కొంటెతనము. శ్రీకృష్ణుడు మాయానాటక సూత్రధారి. ఏమియు నెఱుఁగ నట్లుండును. నారదు డారివేరంపు తపసి. గిల్లి జగడములు పెట్టువాడు. వాని మూలమున కడుపు నింపుకొనుట వాని గుణము. కావున కను సన్న చేసినాడు రుక్మిణి కిమ్మని. తా నేమియు నెరుగ నట్లు రుక్మిణి కిచ్చినాడు శ్రీకృష్ణుడు. ఇద్దరు నిద్దరే తోడు దొంగలు. ఇప్పించినవా డిప్పించిన ట్లూరకుండ లేదు. ఆవ్విరిని తా నొక పెద్ద చేసి ప్రభావములను వర్ణింప మొదలు పెట్టినాడు. ఇది యంతయు సత్యభామ చెలికత్తెలు వినవలయును. వారు పోయి సత్యభామకు చెప్ప వలెను. అప్పుడు కాని రుక్మిణీ సత్యలకు పోట్లాట రగులదు. తన కోరిక నెరవేరదు.

పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగ భర భరితంబై
నిరతము జగదేక మనో
హర మగు నీ కుసుమ రాజ మంబుజ వదనా

అనెను. అంతటితో నూరకుండిన బాగుండును. ఇంక కయ్యపు టగ్గి రగులు కొనుట కొక్కొక్క సమిధ తగిలింప మొదలు పెట్టినాడు నారదుడు. నీ కిపు డిది యిచ్చెఁగాన హరి బహిః ప్రాణంబ వగుట నేఁ డెఱుగంగ వచ్చె ననుట మొదటిది.

వెలదులు పదియారు వేవురలో నెన్న
సరి లేదు సౌభాగ్య గరిమ నీకు

ఇది రెండవది

కువలయ పత్ర నేత్ర! నెఱి గొప్పున నీ కుసుమంబు దాల్చుటన్
సవతులు వచ్చి నీ చరణ సారస యుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డఖిలేని కూర్మి జవదాఁటక నీ పలు కాదరింపఁగా
నవిరళ భోగ భాగ్య మహిమాన్వితవై విహరింతు

వని యనెను. ఇది తరువాతిది. అభిమానము గల యే సపత్ని యివి విని సహింప గలదు? ఒకటి వెంట నొకటిగా నివన్నియు సత్యభామను మనస్సునం దుంచుకొని యనిన మాటలు. ఇంత వరకు పేరెత్తి యన లేదు. అంతటితో నారదుని మనస్సు తీరలేదు. నిగూఢముగా నంతర్గత మయి యున్న సత్యభామయందలి యక్కస్సు తీర్చుకొన తలంచెను. ఇంక నోటికి వచ్చిన ట్లెల్ల నాడిపోసికొన మొదలు పెట్టినాడు నారదుడు.

ఇన్ని దినంబులున్ సవతు లిందఱిలో నల సత్యభామ కన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన వింటఁ గాని యో
కన్నియ! నీ యెడం గలుగు గారవ మెయ్యెడఁ జూచి కాన, లే
కున్న ననర్ఘ్య దివ్య కుసుమోత్తమ మేరికి నైన నిచ్చునే

అని సత్యభామ ఘనతను క్రిందు గావించెను. రుక్మిణి గౌరవము ననన్య సాధారణము చేసెను. అంతటితో పోనీయ లేదు

చక్కనిదాన నంచు నెల జవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కక యున్నె నీ మహిమ సూచిన బోటులు విన్నవించినన్

అని మరింత నిందించినాడు నారద మహాముని. ఈ మాట లన్నియు నచ్చట నున్న సత్యభామ చెలికత్తెలు వినవలయును. పోయి యామెకు చెప్ప వలయును. అది వాని తలంపు. కావుననే బోటులు విన్నవించినన్ అని యొక మాట విసరినాడు. అందు సత్యాభామకు పోయి చెప్పుడను భావము నిగూఢముగా నిమిడి యున్నది. ఇది చెలికత్తెలకు పుత్రేపులు పెట్టుట. ఇది నారదుని యారివేరంపుతనము కా కేమగును. అస లొండొ రులకు కయ్యములు పెట్టి యానందించుట స్త్రీల స్వభావము. అందు దాసీల సంగతి చెప్పవలసిన పని లేదు. అవకాశము లభింప వలయు నుగాని యధికారిణి ముఖ ప్రీతి కొఱ కున్నవి లేనివి కల్పించి చెప్పుదురు.

పలు తెఱఁగుల ముళ్ల మాటలు
కలహామె కల్యాణ మని జగంబుల వెంటన్
మెలఁగెడు వాని

నారదుడు. ఈ ముళ్ల మాటలు విని యూరకుండురా

అతుల మహానుభావ మని యవ్వరిఁ దా నొక పెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చుకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁ గాక తా
నతఁడు ప్రియంబు గల్గు నెడ నర్పణ సేసినఁ జేసెఁ గాక యా
మతకరి వేలుపుం దపసి

సత్య నేల తలంప వలయును. ఇవి ముళ్ల మాటలు కాక మరేమగును. అతనికి కలహామె కళ్యాణము. కావున సాత్రాజితి మాట నెత్తి పలు విధ ముల నాడిపోసి కొనినాడు నారదుడు. అభిమానము గల యే యాడుది తన్ను నిందించిన నూరకుండ గలదు. అందును సవతి యెదుట. కావున సత్యభామ ప్రేటు పడ్డ యురగాంగన యైనది. ఆమె కోపాగ్ని నేయి పోయ భగ్గని దరికొన్న భీషణ హుతాశనకీల యైనది. సత్యభామ యుద్యాన వన మున గూర్చుండెను. సత్యభామ నిట్లాడిపోసి కొనుటకు కారణము లేక

పోలేదు. శ్రీకృష్ణుఁడు విష్ణు నవతారము. పరమ ముని మాన సాలాన బంధనమునఁ గుదురు పడని యాదవ కుంజరు డాతడు. నారదుడు మహా తపస్వి. వానికి కూడ నందనివాడు శౌరి. అట్టి వానిని తన ప్రేమ పాశము లచే బంధించినది సత్యభామ. అత డామెకు వశంవదు డయినాడు. ఆమె కను సన్నల మెలంగు చుండును. మెలంగుటయ కాదు. శౌరికి పతి తానై విహరించు చున్నది సత్యభామ. అది నారదున కసూయా జనక మయినది. నారదుడు సత్యభామతో

పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధు సం
తతి నిన్నుం గొనియాడఁగా సవతి కాంత ల్చూచి లజ్జింపఁ గా
నతుల ప్రాభ వోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నీ
కితర స్త్రీజన బుద్ధి దీవనలు నే నే మిచ్చెద న్మానినీ

అని యనెను. ఆ మాటలో నొక విధమగు నసూయ దెప్పిపొడుపు, హాగర్తయు నిమిడి యున్నవి. ఆ యసూయ నారదుని ప్రేరేపించినది సత్యభామ నాడిపోసి కొనుటకు. యాచకో యాచక శ్శత్రుః. నారద సత్యభామలు విష్ణు వగు శ్రీకృష్ణుని యనన్య సామాన్య మగు కటా క్షము నభిలషించిరి. నారదుడు శ్రీకృష్ణుని విష్ణువుగా నెరుంగును. వానిని భక్తితో భజించు చుండెను. అతడు ముముక్షువు. కోరునది మోక్షము. దానికొరకు తపము గావించెను. ఇంత గావించినను వాని నిజ తత్త్వ మెరుగలేక పోవుచుండెను. ఆ హరి తనకు వశంవ దుడు కాలేదు. సత్యభామ శ్రీకృష్ణుని భర్తగా సేవించు చుండెను. ఆమె చూపునది యకలంక మగు ప్రణయము. భర్త తను నిరంతరము నెడబాయక యుండ వలయును. తన్ను తప్ప మరెవరిని ప్రేమింప కూడదు. తన చెప్పు చేతలలో మెలంగ వలయును. అది యామె కోరిక. ఇది కామము. దానికి కట్టుబడినాడు శ్రీకృష్ణుడు. ధర్మార్థ కామ మోక్షములు నాల్గు పురుషార్థములు. నారదుడు ధర్మ మాచ రించు మోక్షార్థి. సత్యభామ తన ధర్మము నాచరించుచు శౌరి యెడ

కామ బుద్ధికల ప్రణయిని. ఇద్దరు శౌరిని తమ యధీన మొనరించు కొన యత్నించు వ్యక్తులు. నారదునిది పరమార్థము. సత్యది ఐహికము. నారదుడు తన కృత్యమునందు తీర్ణుడు కాలేదు. సత్య తనకు దాసునిగా చేసికొన గలిగినది శ్రీహరిని. అది నారదుని యెడ నసూయగా పరిణమించినది. కావుననే దీవనల నే నే మిచ్చెదన్ మానినీ అన్నాడు నారదుడు. ఈ యసూయా భావము సత్యభామయందు వైరమును ప్రేరేపించినది. దానికితో డామెకు నిక్కు డధికము. బిఱ్ఱబీఁగుతనము మెండు. వానిని ఆధారము చేసికొని నాటక మాడ తలంచినాడు నారదుడు. నంది తిమ్మన మానవుల మనః ప్రవృత్తి బాగుగా నెరిగినవాడు. దానికి తగినటుల సందర్భములకు సరిగా సరితగులు లోక వ్యావహారిక పదములను వాడును. అవి విరితేనెల వలె తియ్యదనము కలవయి పద్యమునకు రస జీవము పోసి వికాసము కల్పించును. పై పద్యములలోని ముళ్లమాటలు, కలహామె కళ్యాణము, పెద్దచేసి, ఇచ్చకము, సూడిద, మొదలగు పదములు ఆ యా సందర్భములకు తగి యున్నవి. ఇటువంటి పదములు వందల కొలంది పారిజాత కావ్యమునందు కలవు. ఆ పదముల పొందికయే పద్యములకు శోభ తెచ్చినది. అవియే ముక్కు తిమ్మన రచనలో ముద్దు లొలికించినవి. ఈ రచనా విధానము మరే యితర కవికి నలవడ లేదు. అది యాతని రచవా విశిష్టత. దానికితోడు తిమ్మన వివిధ పాత్రల మానస ప్రవృత్తి ప్రదర్శనము ప్రశంసింప తగినది. అతడు పారిజాతాపహరణములోని పాత్రలయందు వెలయించిన మానస ప్రకృతి మరే కవియు తన కావ్యమునందు ప్రదర్శింప లేదు. తిమ్మన రచన యంతయు సన్నివేశానుగత మగు పాత్రల మానసిక ప్రవృత్తిని బోధించును. ప్రతి పద్యములో నా ప్రవృత్తి గోచరించు చుండును. నారదుడు కలహాశనుడు. వాని కలహాశనత కనుసన్నన చేత పారిజాత ప్రసూనమును శౌరి చేత రుక్మిణి కిప్పించుటతో ప్రారంభించినది. ముద్ద వెంబడి ముద్ద మాటలతో మెసవినాడు. సత్యను నిందించుటతో కడుపు నిండినది. చెలికత్తె మాట

ఆజ్య ధార యయినది. ఆ ధారా పాతము 'ఎంతకు లేదు నారద మునీంద్రుఁ' డను నాశ్చర్య ద్యోతక మయిన వాక్యముతో నారంభించినది. 'శౌరి వినంగ, రుక్మిణీ కాంత వినంగ, నేను వినఁగా' నని అంత కంతకు రెట్టింపు రెండు రెట్లు మూడు రెట్లుగా నొదవి సత్యభామ హృదయ గత మగు కోపాగ్నిని మండింప చేసినది. ఆ వాక్యముల వరుసలో నొక దానిని మించి మఱొక దానియందు నుత్కర్ష యున్నది. అది తిమ్మన రచనా చాతుర్యమును వెలయించు పద్యము

అలి నీలాలక ! నీవు నీ పతి రహస్య క్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధ సంగరంబునకు నుల్లాసంబు కల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతి శ్రమ తనూ సంజాత ధారాళ ఘ
ర్మ లవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్

అని నారదుడు పారిజాత కుసుమ ప్రభావమును లక్ష్మీ స్వరూపురాల యిన రుక్మిణితో నామె భర్త యెదుట నుడువుట అనుచిత మని చాల మంది యభిప్రాయము. అంతే కాదు. కువలయ పత్ర నేత్ర, జలజాక్షి, అలినీలాలక యిత్యాదు లగు రుక్మిణికి వాడిన సంబోధన లన్నియు సౌందర్య ద్యోతకములు. వానిని నారదు డుపయోగించుట అనుచిత మని కొందరి అభిప్రాయము. అవయు వార్థములను పరిశీలించినచో నవి నారదుడు వాడుట యనుచిత మనక తప్పదు. కాని వానిని సామాన్య స్త్రీ వాచక పదములుగా నంగీకరించినచో నా దోష ముండదు. కవి యా యభిప్రాయముతోడనే వాడెను. వానియందు విశేష భావము గాని సారస్యము గాని ప్రదర్శించుట వాని అభిప్రాయము కాదు. పై పద్యమునందు లతాంతాయుధ సంగరము, రతి ఇటు వంటి పదములు భర్త సమక్షమున స్త్రీలతో ననుట నారదుని పాత్ర కనుచిత మనక తప్పదు. అందలి భావము జుగుప్సాకర మనుటయు నిర్వివాదాంశము. రుక్మిణీ కృష్ణుల కేవగింపు కలిగించు ననుటలో సందేహము లేదు.

నారదుని వంటి విష్ణు భక్తుడు విరాగియు నగు ముని నోట రా తగిన మాటలు కావు. అయినను కవి ఈ పద్యము వ్రాయుటలో నొక యభిప్రాయ మున్నది. దంపతులకు పరస్పర ప్రణయానురాగములను పెంచునది రతి సుఖము. దానివలన భర్త భార్యకు వశంవదుడయి వర్తించును. భార్య భర్తకు వశంవదురాలయి యుండును. సత్యభామ పతి యెంతయు తన కనురక్తు డంచు విఱ్ఱవీగుచుండును. ఆ యనురక్తికి ప్రధాన కారణ మయినది లతాంతాయుధ సంగర క్రీడ. దానికుత్సాహము కల్పించి శ్రమను కలుగనీయక పారిజాత సుమము దీపము సురటియునయి యుపకారియు నానంద కారియునగు నని చెప్పక తప్పనిదయినది నారదునకు. మగని కూరిమి గలవారమని లోలోన రుక్మిణి సత్యలకు అన్యోన్యము రవ రవలు కలిగి యుండెను. పారిజాత కుసుమము తన ప్రభావముచేత మగని కూరిమిని పెంచి రతి సుఖ మొసంగు ననియు, సత్యకు సూనము లభింపక పోవుటవలన ఆమె కావాసి కలుగ దనియు, భావము. ఈ పద్యమును సత్యభామకు మరింత యీసు పుట్టించుటకు కారణమయి వైరమును పెంచ కలదు. కావున పై పద్యమును కవి యిందు పొందు పరచె నని తెలిసికొన వలయును.ఇట్టి సంభాషణ వృద్ధులగు మానవులందు మనము వినుచుందుము. అది దోషము కాదు. నారదుడు కలహ ప్రియుడు. కలహము పెంచుటకీ పద్యము ప్రధాన దోహదము. నారదునికి కలహమె కళ్యాణ మట. నిజము. వాని కలహ ప్రియత్వము లోక కళ్యాణముకొరకని వేరె చెప్ప నవసరము లేదు. మహాత్ముల పను లన్నియు నట్లే యుండును. మొదట విరుద్ధములుగా మానవులకు గోచరించినను శుభాంతములు సుఖాంతములుగా పరిణమించును. అవి విశ్వ కళ్యాణమును కలిగించును. మహాత్ముల కార్యములు కవుల కృతులు నొక్కటే ఫలము గలవి. పారిజాతము భూలోకమునకు తేబడినది. సత్యభామ యుద్యాన వనమున నాటబడినది. మరల నొక్కనాడు సత్యభామా కృష్ణులను సందర్శింప వచ్చినాడు నారదుడు.

## పుణ్యక వ్రతము

ను గురించి సత్యభామకు బోధించినాడు. ఈ వ్రతము కావ్యమునందు ప్రయోజనము లేనిది. ఈ కథా భాగము కావ్యమును పెంచుటకు అంటించి నటు లున్నదని కొందరు మిత్రులు నాతో వాదించిరి. తిమ్మన వంటి మహాకవి యనాలోచితముగా కథను పెంచడు. విశ్వ శ్రేయః కావ్యం. ఆ శ్రేయస్సు లోకోపకారి కావలయును. అది కావ్యము నందలి పాత్రల మూలమున వెలయింపబడును. సత్యభామ గర్వాతిశయము గలది. అందు మూలమున నిక్కుచు విఱ్ఱవీఁగుచు కాంతలను గణింప కుండెను. ఆ గర్వము నణచ వలయును. అది నారదుని యభిలాష. కవి సత్యభామలో గల యీ లోపమును నారదుని ముఖమున మొదటనే వెలువరించెను. దానిని తొలగించ వలయును. భక్త పరాధీనుండగు శ్రీకృష్ణునియందు సాత్విక భక్తి యామెయందు నెలకొల్ప వలయును. ఇంత వరకు సత్యభామ కృష్ణునియందు ప్రణయము కలది. వాని మహిమ మెరుగదు. అందు మూలమున శ్రీకృష్ణుని మహిమ నామె కెరుక పరచ వలయును. లోకమును విష్ణుపద భక్తులుగా చేయవలయును. అది పుణ్యక వ్రతమువలన నెరవేరినది.

తెలతెలవార మౌన నియతి న్నదికిం జని తీర్థమాడి ని
ర్మల వసనంబుఁ గట్టి నవ రత్న విభూషణములు ధరించి మైఁ
గలప మలంది క్రొమ్ముడిని గమ్మ విరు ల్సవరించి యుత్తమా
మలకును నాత్మ భర్తకు నమస్కృతి సేసి తదీయ సమ్మతిన్.

కువలయనేత్ర! తొంటి తన కోపము గర్వము మత్సరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్సవతుల యిండ్ల కెల్లఁ దొలునాఁడు క్రమంబున నేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతి సంభ్రమ లీలలఁ దోడితేఁ దగున్.

అని నారదుడు బోధించినాడు. సత్యభామ యహంకారము గలది. అహంకార మమకారములు విడనాడిన కాని సాత్త్విక భక్తి కుదు రదు. అహంకారమే సత్యభామను వామ పాదమున జలజాతాసన వాసవాది సుర పూజా భాజనంబయిన శ్రీకృష్ణుని శిరమును తొలగం ద్రోయ చేసినది. అది నిర్మూలము కావలయును. ఆ కారణముచేత అత్తమామలకును నాత్మ భర్తకు నమస్కార మనుదినము చేయ వలయునని నియమించెను. సత్యభామ మగని కూరిమి కలదాన నని విఱ్ఱవీఁగుచు కాంతల గణింప కుండెను. అందుకని తొంటి తన కోపము గర్వము మత్సరంబు మాని వినయమున సవతుల యిండ్ల కెల్ల నేగ వలయును. వారిని వ్రతోత్సవమున కామంత్రింప వలయును. ఆమంత్రించుటయు కాదు. వెంట నిడుకొని వారిని తోడితే వలయునని నియమించెను. ఇది ఒక విధముగా సత్యభామకు పూర్తి యగు శృంగ భంగము. ఇంకొక విధముగా శ్రీకృష్ణునియందు సాత్త్విక భక్తి నెలకొల్పుటకు పునాది. సత్యభామకు గర్వాదులు రజోగుణము వలన కలిగినవి. శ్రీకృష్ణునియందలి యామె ప్రణ యము రజోగుణ సంగతము. ఇప్పుడు దానిని సాత్వికముగా మార్చ వలయును. సాత్విక భక్తి కహంకా రాదు లుండరాదు. అందుల కని యీ నియమములు. సత్యభామ యహంకారమున్ను విడిచి నార దుని బోధన లక్షరము తప్పకుండ నెరవేర్చినది. ఆమె గర్వము నశించినది. ఇంక మమకార మున్నది. అది వ్రతమునందు భర్తను దానము చేయుటవలన వదల గలదు. నారదుడు

> వికచాబ్జనేత్ర ! యీ పు
> ణ్యక వ్రత విధానమునకు నాథుని ధారో
> దక పూర్వ మీవలయు ని
> య్యకొలుపుమా యిపుడు యాద వాన్వయ తిలకు

అనినాడు. యాదవాన్వయ తిలకు నియ్యకొలుప వలయునట. ఇందలి

రహస్య మిది. శ్రీకృష్ణుడు విష్ణువు. పరతత్త్వము. అతడు ఒకరి సొమ్ము కాడు. భక్తుల పాలిటి సొమ్ము. ఆ సంగతి సత్యభామ కేమియు తెలియదు. ఆమెకు శ్రీకృష్ణునియందు ప్రేమ యొక్కటియే తెలియును. ఆతడు తన ప్రేమకు నిబద్ధుడు కావలయును. తన చెప్పు చేతల మెలంగ వలయును. పరులకు లోను కారాదు. తనకే యప శకునములు తోచినను విభు డొండొక చపలాక్షిఁ గూడి తన కిచ్చగింపని చెయ్దము లేమి చేసెనో యని తలంచును. ఇది యామె తత్త్వము. కవి ప్రతి పదమునందు నా యా పాత్రల మానసిక తత్త్వమును వెలయించుచునే వచ్చెను. సత్యభామ

హృదయంబున లజ్జయు సమ్మదంబునుం
బెనుఁగొనఁ బ్రాణ వల్లభునిఁ బ్రేమ రసాలస వీక్షణంబునం
గనుఁగొని

నదట. ఇట్లు భర్తను దాన మొసంగుట కని విని యెరుంగనిది. కావున సిగ్గు పొడమినది. అది మానవ సహజము. అది స్త్రీకి స్వభావము. ఇట్టి దానమువలన తానుం బతియున్ మనమున నఱగొఱ లెఱుఁగక యనితర సులభైక సుఖము లంద గలనని సమ్మదము. దానికొరకు భర్తను దాన మొనరింప నిశ్చయించుకొనెను. శ్రీకృష్ణుని యనుమతి కొరకు ప్రేమ రసాలస వీక్షణముల నరసినది. ఆ ప్రేమయే ఆమె యెరిగినది. ప్రేమ భక్తియొక్క యపర రూపము. దానిని భజించు నది సత్య. అది రజోగుణ సహితమయినది. కావున సత్యభామ కృష్ణుని యందు రజోగుణ సంగతమయిన భక్తి కలది. కాని భక్తి తత్త్వ మామెకు తెలియదు. ఆ సంగతి నిరూపించుటకు కవి ప్రేమ రసాలస వీక్షణము లని వాడెను. సత్య

మోము వాంచి మధుకైటభ మర్దన! చిత్తగించితే
మునిపతి మాట

యనిరది. కవి పాత్ర పోషణమునందె కాదు రస పోషణమునందును నారితేరిన దిట్ట. 'చిత్తగించితే మునిపతి మాట' యనుటలో సత్యభామ యాందోళితమయిన మానస తత్త్వము వ్యక్తమగుచున్నది. 'ఒక విధమగు పరితాపము, ప్రేమ, ఆవేదన, సిగ్గు, చనవు వాని మధ్య నలుగుడు పడుచున్న మానసిక ప్రవృత్తి ఆ వాక్యమునందు స్ఫురించును. కొంత ధైర్యమును కూడతీసికొని యనిన మాట యది. తానట్లు పలుకు నపుడు సత్యకు కన్నుల నీరు తిరిగి యుండును. అపును ఆమె సాధ్వి. పతిని మనసార ప్రేమించినది. వానిని పరులకు దాన మిచ్చుట యొకపాటి పనికాదు. నలువురిలో తలవంపు లగుపని. అది భర్త సమ్మతి మీాద జరుగ వలయును. అందుకని మోము వాంచి చిత్తగించితే మునిపతి మాట యన్నది సత్య. తల యెత్తలేక పోయినది తా నొనరించు పనికి. శ్రీకృష్ణుడు మాయా నటుడు. మోవి పయింజఱున వ్వెగుర్పగ

> నవచంద్రాలిక ! నీకు నేల యనుమానం బాగ మోక్షంబుగా
> న విచారింపక ధారవోయుము

అనినాడు శ్రీకృష్ణుడు. ఆ యిగిరించిన చిరునవ్వులోనె యున్నది మాయా నాటక మంతయు. కృష్ణుని మించిన పలుకు మాధుర్యము కలవాడు ముక్కు తిమ్మన. 'నవచంద్రాలిక' యని ముద్దు కొలంది సంబోధింప చేసినాడు కృష్ణునిచేత సత్యభామ యందమును తన యనురాగమును కనుపరచుచు. అనుమాన మెందులకు. వేదోక్తంబుగాన విచారింపక ధారపోయుము అనిపించినాడు తిమ్మన. తిమ్మన పదములలో విరితేలియల తియ్యందన మొక్కటే కాదు సారస్యంపుఁ గమ్మ తావులు పొందుకొని యుండును. ఆ మహాకవి తన ముద్దు పదములను రసములో నాన్చి సారస్యంపు నుబుకుతనం బాదవ పద్యమునం దుపయోగించును. వానిలో నొక్క పదమయిన నిరర్థక మయిన దుండదు. పేలవ మంతకంటె నుండదు. వేదమయుండు శ్రీకృష్ణ

భగవానుడు. వేదము లాతనిని నుతించును. వేదముల కర్తను డా పరమాత్మ. వ్రత దానము వేదోక్తంబు గాన విచారింపక ధారవోయు మనినాడు. అందు మూలమున తన పరంధామతయు వేదాధీనతయు వేదమయత్వము సూచింప బడినది. ఇది యా పలుకుల సారస్యము. వేదోక్త కర్మ నాచరించుటకు విచారింప వలసిన పని లేదని గుంజాటన పడుచున్న సత్యభామకు ప్రోత్సాహ మొసంగెను. ఆమె చకిత ముగ్ధ మృగీ తరళాక్షియట. ఎవరేది చెప్పిన నమ్మును. అట్లు చేయును. ముని మాటలు నమ్మి వ్రతము సల్పినది. భర్త మాటలు నమ్మి వేద విహితమని యెరింగినది. ఆ యమాయకత్వము తిమ్మనగారి సమాసములోని ముగ్ధ యను పదమునం దున్నది. కనులలోని చకితత్వ తరళత్వము లెవ రేమను కొందురో యను సందేహమువలన కలిగినవి. తొల్లింటి గరువతన మిప్పుడు లేదు. నమ్రత నెలకొనినది. కావున కువలయ పత్ర నేత్రములలో చకిత మృగీ తరళత్వము నెలకొనినది. అది ఆ సమాసములో నిమిడి యున్న సారస్యము. మునిపతి యానతిం జకిత ముగ్ధ మృగీ తరలాక్షి ప్రాణ నాథునిఁ గనకాంబ రాంచలముతో క్రొవ్విరుల దండఁ దగులొ్కనఁ జుట్టినది కల్పనగమునకు. దుభ్య మహాం సంప్రదదే నమో నమః అనుచు నద్దేవి భర్తను ధారపోసినది నారద మహామునికి. ఇప్పుడు భర్త తనవాడు కాడు. మహాభక్తు డగు నారదుని దాసుడు. ఇంక నాటక మారంభించినాడు చివ్వల యోగిరంపుఁ దపసియగు నారద మునీంద్రుడు. అతడు చెట్టును గూడం బువ్వుల సరులం జుట్టిన యవ్విభుని చెఱంగు విడిపించినాడు. నవ్వుచు

సత్యముగ నిన్ను నిప్పుడు
సత్యాసతి మాకు నిచ్చె సకలామ్నాయ
స్తుత్య ! యింక 'మా యభీప్సిత
కృత్యంబులు సలుపు మనుచు కేళి పరుండై

నాడు నారద మహాముని. ఆ నగవు భావి నాటకమునకు ప్రస్తావన. పరతత్త్వ స్వరూపుడు శ్రీకృష్ణ భగవానుడు. పరమముని మానస సాలాన బంధనమున కుదురు పడకుండు యాదవ కుంజగమా సకలామ్నాయ స్తుత్యుడు. అంతటి వాడు తనకు లభించెను. వాని చేత నభీప్సిత కృత్యములు సలిపించు కొనుట వానికి కేళి యైనది. కాకేమి అది వాని సుకృతము. అదియే వాని నవ్వునకు కారణము

మేళవించినవి సుమ్మీ దీని మెట్లని
మాంస లాంసంబున మహతి చేర్చి
మిన్నేటి జలము సుమ్మీ తొలంకెడు నని
డాచేత మణి కమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్ష వలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూల చర్మంబుఁ జంక పొదివి

పొమ్ము పొమ్మని యొక కొంత పోవఁ బోవ
రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపట నటనా పరుండైన కంసవైరిఁ
బరమ ముని నవ్వుటాలకుఁ బనులు గొనియె

నిగమాంత ప్రతిపాద్యుఁడు, అనాద్యుఁడు, అభవుడు, నిత్యుడు, గుణాతీతుడు, విశ్వగురుఁడు, చిన్మయుఁడు, అవ్యయుఁడు నగు నా యదు వంశ విభూషణుని పలు విధముల నాడించెను. భక్త పరాధీనుడు శ్రీకృష్ణుడు. నారదుడు మహాభక్తుడు. వాని చెప్పి నటు లెల్ల చేసినాడు శ్రీకృష్ణుడు. ఇందువలన సత్యభామకు శ్రీకృష్ణుని భక్త పరాధీనత కనిపింప చేసినాడు. సత్యభామకే కాదు సకల లోకముల కనవలయును. ఇదియే లోక కళ్యాణము. దానికొరకు నారదుడు

సత్యభామకు వ్రతమును బోధించెను. మనము నందలి ఈర్ష్యాదులను సమూలముగా తొలగించెను. రాజసమును నశింప చేసెను. సాత్త్వికభక్తిని నెలకొల్పెను. శ్రీకృష్ణుడు భగవంతుడని చివరి వినుతులచేత నిరూపించెను. సత్యభామ గర్వ మడిగినది. సవతుల నందరిని గౌరవించినది. శ్రీకృష్ణునియందు సాత్త్విక భక్తి కలదయినది. కావుననే మున్నెవరిని లక్ష్యపెట్టని సత్య

తనుతర మధ్య యాగమ విధానము తప్పక యుండ మౌనిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱి నామతించి క
ల్ప నగము క్రొవ్విరు ల్కనక పాత్రమునం దగ నించి యిచ్చె వా
యనములు రుక్మిణీ ప్రభృతులౌ సవతు ల్పదియారు వేలకున్.

తొల్లింటి నారదుని నిందించిన మాటలు పోయినవి. వానికి మ్రొక్కినది. అనుమతి గైకొనినది. కల్ప ప్రసూనములు సవతులు పదియారు వేలకు వాయనము వినయంబున నిచ్చినది. రుక్మిణీ ప్రభృతు లనుటచేత రుక్మిణియందలి కూడ యీసు నశించిన దని కవి భావము. నారదుని పాత్ర పారిజాతాపహరణమునందు శ్రీకృష్ణుని భగవంతునిగా నిరూపించుటకు సాధన మయినది. వాని నారివేరంపుతనము సత్యను సాత్త్విక భక్తురాలిని గావించుటకు నుపయోగింప బడినది. అందు మూలమున శ్రీకృష్ణుని భక్తపరాధీనత వ్యక్తమయినది

అదియే లోక కళ్యాణము. శ్రీకృష్ణుడు

మాయలాడు విట్లపీఁగునిక్కులాడి

సత్యభామ. వీరిరువురను నాయికా నాయకులుగా నొనరించి ప్రబంధమునకు వినూతన రూపమును శోభను కల్పించినవాడు తిమ్మన. విజయనగ రాంధ్ర కవులు మిగుల ప్రతిభావంతులు. ఆ ప్రతిభ తరువాతి కవులం దెవరిలోను గనిపించదు. ఒకరు పోయిన దారి నింకొకరు పోలేదు. ఎవరికి వారు స్వతంత్రులు. ప్రబంధములకు వినూతన స్వరూ

పముల నెవరికి వారు కల్పించిరి. సారస్వత చరిత్రమునందు విశిష్టత సంపాదించిరి. తరువాతి వారందరు వారి యడుగు జాడల ననుసరించిరి. పెద్దనగారి మనుచరిత్రను రామరాజ భూషణు డనుసరించి వసుచరిత్ర రచించెను. ముక్కు తిమ్మన పారిజాతాప హరణము నందలి కథలోని పోకడతో ప్రభావతీ ప్రద్యుమ్నము వ్రాసినాడు పింగళి సూరన. ఆయన కళాపూర్ణోదయము కథా కల్పనమునందు పేరు మోసినది. మిగిలిన వారి సంగతి చెప్ప నక్కరలేదు. తరువాతి కవుల కావ్యములలో క్రొత్తదారి త్రొక్కినది తారాశశాంక విజయ మొకటి. అందు నాయిక పరకీయ. రసము శృంగార మయినను నాయికా భేదముచేత నితివృత్తము విభిన్నాకృతి వహించినది. ఐనను ఒండొంటిలో పోలి కలు లేక పోలేదు. దానికి కారణము లక్షణ గ్రంథములు. లాక్షణికుల నియమావళిని త్రోసిపుచ్చ లేని కవులు ఋతు వర్ణన, చంద్రోదయ వర్ణన, మన్మథాది దూషణములు, వేట, జలక్రీడాదులు తమ కావ్యము లందు జొనిపించిరి. కావ్యములకు వికృతత్వమును కలిగించిరి. అట్టి వానికి తావీయనివారు శృంగార కావ్య కర్తలందు నన్నెచోడు శ్రీనాథుడు, నంది తిమ్మన, రాయలవారు. వీరి కవనంపు పోకడలు వేరు. కథా విధానములు వేరు. ఊహాలు వేరు. పెద్దన వేట, మన్మథ దూషణాదికములు మనుచరిత్రయందు నెలకొల్పెను. రాయలవారు ఋతువర్ణనాదులు విష్ణుచిత్తీయమునందు పొందు పరచెను. ఐనను వానికి ప్రత్యేక స్థానము లా కావ్యములం దున్నవి. వీరందరియందు తిమ్మన యతి స్వతంత్రుడు. గడసరి. ప్రజ్ఞావంతుడు. స్త్రీల యంతరంగ మును చక్కగా నూహించుకొన గలిగినవాడు. సత్యభామ పౌరాణి కాంగన. కాని యామెయందు సీతాదుల వలె పౌరాణిక లక్ష ణములను నెలకొలుప లేదు. సహజమగు మానవ వ్యక్తిగా నిరూపించెను. ఆమెను సపత్నులయందు గోచరించు సహజ ములగు నసూయాది గుణములను గల నాయకురాలినిగా దీర్చి దిద్దెను. ఆమె రాజకుమారి. సౌందర్యవతి. మగని మన్నన కలది.

అది యామె గర్వమునకు కారణము. అందు మూలమున మిగిలిన సవతులను గణింప కుండెను. ఇది లోకమునందలి స్త్రీల కందరకు నుండు సహజ గుణము. సత్యభామ కెందును తీసిపోవునది కాదు రుక్మిణి. కావున వారిరువురకు రవరవలు పొడమినవి. ఐనను రుక్మిణి కయ్యమునకు కాలు దూగునది కాదు. సత్యయం దా గుణ మున్నది. అందు మూలమున నామె గయ్యాళి యనక తప్పదు. ఆమెకే దుశ్శకునములు తోచినను మగం డన్య కాంతలం గూడి తన చిత్తమున కొల్లగాని చెయ్దము లేమి యొనరించు చుండెనో యని శంకించును. ఈ సందేహ మామె గయ్యాళి తనమును మరింత రెచ్చ కొట్టును. అప్పు డామె సర్వమును మరచి పోవును. కొండెములు చెప్పు వారుండ వలయును గాని యా గయ్యాళితనమున కంతు పొంతు లుండవు. ఆ పనికి చెలికత్తెలు గలరు. వా రామె ముఖప్రీతికొరకు గోరంతలు కొండంతలు చేసి కొండెములు చెప్పుదురు. అది దాసీ జనముల స్వభావము. ఆ యా ప్రకృతులు తెలిసినవాడు తిమ్మన. వానిని బీరు వోనీయ కుండ తన కావ్యమునందు చక్కగా ప్రదర్శించెను. రుక్మిణి యింటి నుండి చెలికత్తె వచ్చినది. పారిజాత కుసుమ వృత్తాంతము సత్యభామకు వినిపించినది. అంతటితో నూర కుండ లేదు. అసలే దక్షిణాంస చూచుక నయన ప్రకంప నాది యపశకునములవలన ప్రాణనాథు డొండొక చపలాక్షిం గూడి తను నొల్లని చెయ్దము లేమి చేసెనో యని తలంచుచున్న సత్యభామతో 'ఎంతకు లేడు నారద మునీంద్రుం' డని యొక్క మాట విసరినది మొట్టమొదట. అందు నారదుని సంగతి యెట్టున్నను చెలికత్తె మనస్సునందు మెండుకొని యున్న కలహాంతరిత మగు నీర్ష్యా భావము నిముడ్చుకొన సాధ్యము కాక కట్టు త్రాళ్ళను త్రెంచుకొని బయటికి వెడల గ్రక్కున యుచ్చెరుపా టిమిడి యున్నది. పరపూర్ణ భావ గర్భిత మీగు వాక్య మది. సత్యభామ తహతహకు కారణము. తరువాత 'శౌరి వినంగ రుక్మిణీ కాంత వినంగ నేను వినగా' నన్నది.

ఇంత చెప్పినను అసలు సంగతి బైటికి రాలేదు. దీనినే సస్పెన్స్ అని ఆంగ్లమునం దందురు. ఆ వాక్యములం దొక దానియందు కంటె నింకొక దానియం దుత్కంఠాతిశయమునకు కారణ భూతము లయిన భావము లిమిడి యున్నవి. పతి యెంతయుం దన కనురక్తు డనియు, తన్ను గారవంబున సవతు లందరిలోఁ గన్నులఁ గప్పుకొనంగ నుంటి ననియు సత్యభామ యిన్ని దినంబులు గర్వించు చుండెను. అట్టి తనకు మిగుల ప్రియమైనవా డగు భర్త శౌరి. అట్టి శౌరి విను చుండగా నని మొదటిది. లోకమునందు సవతుల కొండొరులకు అసలే పడదు. రుక్మిణీ సత్యభామలు కులమును రూపమును మగని కూరిమియుం గల వార మని మిగుల గర్వము కలవారు. కావున వారిలో వారికి రవరవలు పొడమినవి. అట్టి రుక్మిణి వినుచుండగా నని రెండవది. ఇది అభిమానవతి యగు సత్యభామకు సహింప రానిది. నారదుడు తన్ను గురించి యగౌరవముగా నేమి పలికెనో యని మరింత తహతహ కలిగించినది. చివరకు నేను వినఁగా నన్నది. ఆమె సత్యభామ చెలికత్తె. తాను పోయి సత్యభామకు చెప్పునను భయ మైనను లేకుండ నిర్భయముగా నని భావము. ఇది అన్నిటికంటె నగౌరవము. చెలికత్తెకు సత్యభామకు భేదము లేదు. ముఖ మెదుటనే పరాభవించి నటు లయినది. ఇంకేమి కావలయును. సత్యభామకు ఆందోళనము తలకెక్కినది. సెగలు రేగినవి. అసూయంపు పడగలు పిప్పారినవి. అసలు సంగతి బైటపడలే దింత వరకు. రెచ్చగొట్టి రాజపెట్టినది చెలికత్తె. అసలే యగ్ని సత్యభామ. ఇప్పు డాజ్య ధార పోసి నట్లయినది. తిమ్మనకు వైరమును రగిలింపగల సమిధల వంటి మాటలే కాదు. మనిషిని రెచ్చగొట్టగల యుపాయములు కూడ బాగుగ తెలియును. లేనిచో నీ పద్యము నిట్లు వ్రాయలేడు. అసలు ఎత్తుగడలోనే యానేర్పు గోచరించును. రసోచిత మగు భావ పుష్టి గల వాక్యముతో పద్యము ప్రారంభించుటలో కవి నైపుణ్య మున్నది. అందు బీజప్రాయముగా సకలాభిప్రాయములు నిమిడి యుండ వలెను. పద్య మొం

విరి వంటిది. ఎత్తుగడ మొగ్గ. క్రమ క్రమముగా విచ్చి వికాసము నొందవలయును. భావంపు నెత్తావులు ప్రసరింప వలయును. పాఠకుని హృదయ మిళిందము రసానుభవము పొంద వలయును. ఆ మహా త్తర క్రమ వికాస వైభవ మీ పద్యమునం దున్నది. ఎంతకు లేడు నారద మునీంద్రు డను వాక్యములోనే చెలికత్తె రగిలింప నున్న ఆ వైర బీజ మిమిడి యున్నది. ఆ వాక్య మొక ముకుళము. ఆ మాటలోనే చెలి కత్తె రేపెట్ట నున్న వైరంపు మకరంద మంతర్గతమయి దాగి యున్నది. దానిని 'శౌరి వినఁగా రుక్మిణీకాంత వినంగ నేను వినగా' నను భావ గర్భితము లయిన నెత్తావు లిమురుకొన్న విరి రేకు లావరించి యున్నవి. అవి క్రమ క్రమముగా నా వాక్యముల వెంట విప్పారి పద్య మునకు వికాసము కల్పించినవి. అది పలికెన్ అను పదముతో విరియ విచ్చినది.

పతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతుకు వచ్చు సత్య గరువంబిఁకఁ జెల్ల దటంచు మానినీ

యని కొండెంపు విరితేనె నొలికించినది చెలికత్తె. అంతే కాదు మానినీ యని సంబోధించినది కూడ. సత్యభామ మానిని యట. అభిమానము కలదని భావము. అభిమానవతి వగు నీ విట్టి యగౌరవమగు మాట యెట్లు భరింప గలవని మరొక పుత్రేపు. ఇది అన్నిటికంటె గొప్పది. కయ్యానికో కోపానికో సత్యభామకు దోహదము. చెలికత్తె మహానిపు ణురాలు. నారదుడు ఎంత కలహాశను డయినను నాని మాటలలో కుట్ర లేదు గుట్టు లేదు. అతడు బోళా శంకరుడు. ఉన్నది ఉన్నటుల నుడివెను. చెలికత్తె అట్లు కాదు. తనలోని కొండెములమారితన మంతయు అక్షరాక్షరమునందు పిండి పోసి నాన్చి యుబుకు లెత్తించి యొకటి వెంట నొకటి జార విడిచినది. సంబోధనతో నది పూర్తి యైనది. ఇట్లు పద్యమును రసపుష్టిగల వాక్యముతో నెత్తుకొని పోను

పోను భావాధిక్యత వలన వికాసాతిశయమును కల్పించుచు నున్నత స్థాయిని పొందించి క్రమ క్రమముగా భావ పరిణామ మొనరించుచు చివరకు మనోహరముగా నంత మొనరించుట తిమ్మన రచనలోని విశిష్టత. ఇట్టి రచన కాంగ్ల కవులు క్రమాధిరోహ ణావరోహణ లని యందురు. గ్రాడ్యుయల్ రైజ్ అండ్ ఫాల్. ఇట్టి రచనా వైశిష్ట్యము తరువాత పద్యమందును నరయ వచ్చును.

ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యా మాట ల్చెవి సోగ్గి తా వినియెనా యా గోపికా వల్లభుం
డే మే మాడెను రుక్మిణీ సతియు నీ వింకేటికిన్ దాచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ నిక్కం బెఱింగింపవే

యన్నది సత్యభామ. అసలామె యురగాంగన. ఉరగాంగనకు కోప మెక్కువ. ఎట్టి పరాభవమును సహింపదు. సత్యభామ నురగాంగనతో పోల్చుట చేత కోప స్వభావము కలదని కవి యభిప్రాయము. చెలి కత్తె మాటలు వ్రేటు లయినవి సత్యభామకు. ఆ యవమాన మామె సహించలేక పోయినది. ఆమె హుతాశన కీల. చెలికత్తె మాట లాజ్య ధార లయినవి. ఈ రెండు ఉపమానము లామె కోప స్వభావ మును తెలుపునవి. ఆజ్యము పడగానె అగ్ని కీల భగ్గున మండి నిలు వెత్తున లేచును. వేడి సెగలను వెలారించును. భుజగాంగన వ్రేటు పడగానే పడగ విప్పి నిట్టనిలువున లేచును. కోపాతిరేకమున భయంకరముగా బుసలు కొట్టును. అట్లే సత్యభామ కోపాతిశయ మున నిలువున లేచినది. ఏమి ఏమిటి యను బుసలతో ప్రారంభించినది. ఆ యాశ్చర్యార్థకమునం దామె కోపము ఈర్ష్య అసూ యాదికము లన్నియు నొక్కసారి వెడల గ్రక్కినది. ఆ యెత్తుగడలోనే యా పద్యములోని రసస్ఫూర్తి యిమిడి యున్నది. సత్యభామ మనః ప్రవృత్తి ద్యోతక మగుచున్నది. రోషావేశ మామె యెడ లామెకు తెలియ నీయలేదు. ఆత్మాభిమాన మొక్కటే గోచరించినది. దానికి

భంగము కలిగినది. ఆ స్థితిలో నామెకు దేవముని యగు నారదు డని గాని, శ్రీకృష్ణుడు దైవ సదృశుడగు భర్తయని గాని యని పించ లేదు. ఆ రోషావేశ మెవరిని లక్ష్యము చేయ నీయలేదు. నారదుని కలహాశనుడని నిందించినది. శ్రీకృష్ణుని గోపికా వల్లభుడని తూలనాడినది. గోపికలు పసుల కాపరులు. సరిగా చెప్పినచో గొడ్లను కాచుకొనువా రని భావము. వారు మూర్ఖులు. వారికి వల్లభుడు శ్రీకృష్ణుడు. కావున నాతడు నట్టివా డని అంతరార్థము. ఈ భావము తరువాత 'ఎఱుంగునే పసుల కాపరి భావజ మర్మ కర్మముల్' అని మొగమెదుటనే 'పసుల కాపరి' అన్నది సత్యభామ కృష్ణుని. గోపికా వల్లభు డనుట లెక్క కాదు. ఆమె కోప పరవశత్వము కన్ను మిన్ను కాననీయ లేదు. మొదట నార దుని తరువాత అంతకంటె శ్రీకృష్ణుని ఆ తరువాత రుక్మిణిని. ఇట్లు ఒకరి మీదకంటె నింకొకరిమీద నలుక క్రమ క్రమాభివృద్ధి నొంది నది. నోటికి వచ్చి నట్లు తెగనాడినది. ఇది అభిమానవతుల స్వభా వము. వారు అవమానము సహింప లేరు. వారి కోపావేశము ప్రపంచ మును దైవమును కూడ లక్ష్యపెట్ట నీయదు. ద్రౌపది కీచకునిచేత నవమానింప బడినది. ఆమె అభిమానవతి యగు రాచ కూతురు. విరటుని కొలువు చొచ్చినది. కీచకుని దుర్నయమును గురించి విర టున కెరిగించినది. కంకుభట్టు ధర్మరాజు. అత డచటనే యుండెను. ఊరకుండ లేక హితముకొరకు పొరపాటున భార్యకదా యనియు, తన మాట పాటింప కుండునా యనియు తలంచినాడు కంకుభట్టు. ఆమె కోపావేశము వాని కర్థము కాలేదు. నోరు జారి

పలు పోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గుల సతుల గఱువ చందము
దొలఁగఁగ నిట్లునికి తగునె తోయజ వదనా.

యని యేదో గద్దించినాడు. దాని కామె దండ తాడిత భుజంగంబు వలె లేచినది. అరికాలి మంట నెత్తి కెక్కినది. కోపమున మండి పడుచు

నాదు వల్లభుండు నటుఁ డింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారు
గానఁ బతుల విధము కాక యే శైలూషి
గా ననంగ రాదు కంక భట్ట

'అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ. మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరి యాలికి గలువతనం బెక్కుడి యది' అని ముఖము మీఁద నాలుగు దులబరించినది ద్రౌపది. భారతమునం దీ భాగము చదువు నప్పుడు రసగ్రహణ పారీణుల చిత్తములకు లాడి నగవు పుట్టించును. వహావ్వా యనిపించును. ద్రౌపది మాటకారి తనమునకు సమయ స్ఫూర్తికి అభిమాన పరతకు కోపావేశమునకు నోడ లుప్పొంగించును. ఆమె బ్రాహ్మణి కాదు. 'ఏ కీడైన సరింపగాన్' రాచ బిడ్డ. ఆ రాజసము అభిమానమును దోహద మొనరించి తన యెడ నపరాధ మొనరించిన వారిని నిర్లక్ష్యము చేయించును. వారెవ రైన నప్పుడు తృణముకంటె తేలికగా నామె దృష్టిలో నగుపింతురు. శ్రీకృష్ణునితో ద్రౌపది తన పడిన భంగపాటులను చెప్పికొనినది. ఆమె కడుపు మండినది. కోపము వెళ్ళుకొని వచ్చినది. ఆవేశము రోషము కట్టుత్రాళ్ళు పెటపెట త్రెంపుకొని హృదయ కుహరము నుండి వెడలి వచ్చినవి. ఆమె నిలువలేక పోయినది. భర్తల నెత్తి చూపి 'ఒకండు వేణిపట్టి యీ యేవురుఁ జూడగా సభకు నీడ్చె' 'అసంభ్రములై తగు చేష్టలేక నా యాసలు మాని చిత్రముల యాకృతి నున్నవా'రని నోటికి వచ్చి నట్లెల్ల తెగ నాడినది. అవును. అభిమానవతి యగు కులాంగన యావేశమున

కంతుండదు. తిక్కన ఒక్కొక్క పదము నొక్కొక్క వజ్రపు తునక వలె జార విడిచినాడు. అంతే కాదు

అరయమిఁజేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా

యని ప్రశ్నించినది. వలవల యేడ్చినది. ఆమెకె కాదు ఎవరికి మాత్రము పై పద్యము చదువు నపుడు బాష్పములు గ్రమ్మవు? దిగ్గన లేచినది ద్రౌపది

ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింత లింతలు తునియలై చెదరి యా
పతి యున్నఁ గని యుడుకాఱుఁ గాక

యని తన యుడు కంతయు వెడలఁ గ్రక్కినది.

యలుపాలఁ బొనుపడు నట్టి చిచ్చే యిది
పెను గద వట్టిన భీమసేను
బాహు బలంబును బాటించి గాండివ
మను నొక విల్లెప్పుడును వహించు

కట్టి విక్రమంబు కాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయ మైతి మేని కృష్ణా !

యని నలువురను చుట్టు పెట్టినది. భర్తలని మామ యని మరదులని చీరికిఁ గొనలేదు ద్రౌపది. ఆ యభిమాన మటువంటిది. ద్రౌపది పాత్రను పరమ గయ్యాళి యైన బజారు పడతిగా చిత్రించినాడు అని

తిక్కనను నిందించినవారు గలరు. ద్రౌపది పాత్రను పోషించుటలో మూలమునకు మెరుగు పెట్టినాడు తిక్కన యనినవారును గలరు. అసలు భారతము తెనిగించుట తిక్కనకు చేతకాలే దనిన సంస్కృత పండితులు గలరు. వీరి ముగ్వురి వాదములు యదార్థములు గావు. ద్రౌపది పాత్రలోని వాచాలతను తిక్కన 'అల్కమై వీటడి యైన మానినికి వెండి వివేకము గల్గనేర్చునే' యని సమర్థించెను. ద్రౌపది పాత్ర పోషణ యంతయు నా యర్థాంతర న్యాసము మీద నాధారపడి యున్నది. కావు ననే 'మాటలు నోరి దాననయి మాటలు చిత్తమునందు నిల్పకే గాటులు ప్రేలెదన్' అని ముందుగా నుడివిన దా యిల్లాలు. దీనిని విపులీక రించుట యిప్పటి పనికాదు. వ్యాసుడు తన భారతమునందు ద్రౌపది పాత్ర నిట్లే చిత్రించెను. తిక్కన మెరుగు పెట్టిన దేమియు లేదు. వ్యాస భారతములోని యలౌకిక ప్రవృత్తిని తొలగించి లౌకిక ప్రవృత్తిని ప్రదర్శించినాడు తిక్కన. ఆ మహాకవి నన్నయభట్టు వలె వేద దృష్టితో తెలిగింప లేదు. శ్రీనాథుని వలె సంస్కృ తములకు డు, ము, వు, లు ప్రత్యయములు చేర్చి యాంధ్రీకరించ లేదు. సందర్భ శుద్ధి కల రస పోషకములగు నాచ్ఛిక పదములను సరిగా తూచి సంస్కృత భారతమును దేశీయంపు తెనుగు భారత ముగా వెలయించెను. అది తిక్కన తెచ్చిన మెరుగు. ఆ మెరుగు తనము తెనుగు తనములో నున్నది. ఆయన క్రొత్తలు ప్రదర్శించిన వేవియు లేవు. కీచక వధాదులం దేమేని కల వనినచో నవి యతి యనిపించు ననుటలో సందేహము లేదు. సంస్కృత భారతమును సరిగా తెలిగించ లేకపోయినాడు తిక్కన యనుటకు కారణము భారత రచనా విధానము తెలిసి కొనలేక పోవుట. నన్నయ ఆంధ్రీకరణ విధానమునె తిక్కన యెట్టిన లనుసరించిరి. తిక్కనగారి

ద్రౌపది పాత్ర సత్యభామ పాత్ర

పోషణకు మేలుబంతి. పేరలుకం జెందిన యట్టి కాంత లుచిత

వ్యాపారముల్ నేర్తురే' అను తిమ్మనగారి యర్థాంతర న్యాసాలం కారములోని సమర్థింపు నుడులకు తిక్కనగారి 'అల్కమై వీఱిడి యైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే' యనునది మేలుబంతి. ఇవి యా యా పాత్రల పోషణలకు మూల సూత్రములు. దీనికి ద్రౌపది మాఱట నోరి దానయి మాటలు చిత్తమునందు నిల్పకేం గాఱులు ప్రేలెదన్ అని తన వీఱిడి తనమునకు కారణము తెల్పినది. సత్యభామ పేరలుకకు నాథుల్ నేరముల్ సేయుట కారముగా నుడివి నాడు తిమ్మన. ఇద్దరు మహాపతివ్రతలు. అభిమానవతులు. రాచ బిడ్డలు. అభిమానము వారికి ప్రాణాధికము. దానికి భంగము వాటిల్లినది. కోపము మిన్ను ముట్టినది. ఆవేశము వివేకమును చెరిచినది.

పతి ప్రాణ సదృశ బంధువు
పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు

అను భావము నశించినది. శ్రీకృష్ణుడు సత్యభామ దృష్టియందు గోపికా వల్లభు డయినాడు. ఆల కాపరి యైనాడు. నారదుడు దేవముని. ఆతడు కలహాశనుడు. మతకరి వేలుపుం దపసి, పలుతెఱఁగుల ముళ్ళ మాటలు కలహమె కళ్యాణ మని జగముల వెంటన్ మెలగెడు మాని యైనాడు. తన యెడ నపరాధ మొనరించిన వారందరు నామె దృష్టియందు తనకు విరోధు లా రోషమున్నంతవరకు.

అతుల మహానుభావ మని యిర్వురిఁ దానొక పెద్దచేసి య
చ్యుతునకు నిచ్చకం బాదవ సూడిద యిచ్చిన నిచ్చెఁ గాక తా
నతఁడు ప్రియంబు గల్గు నెడ కర్పణ సేసినఁ జేసెఁ గాక యా
మతకరి వేలుపుం దపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్

అది యామె రోష కారణము. అందు సత్య మున్నది. నిజమునకు నారదుడు సత్యభామను తలంచుట యపరాధము. కావున సత్యభామ

నారదుని తన నోటి కసితీర నిందించుటంగో తప్పులేదు. నోటి చేటు గాని నారదుని నామె యేమియు చేయ లేదు. కావున

పలుదెఱఁగుల ముళ్ల మాటలు
కలహామె కళ్యాణ మని జగంబుల వెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వల దని వారింప వలదె వల్లభుఁ డతనిన్

అని యామె మండిపడినది. సత్య చేతిలోని కీలుబొమ్మ శౌరి. కావున ఆమె కోప మంతయు నాతని పయి మళ్లినది. అందుకని

ముని యేమి సేయు రుక్మిణిఁ
గొనఁ గారణ మేమి ధూర్త గోపాలుఁడు సే
సిన చెయ్ది మేమి చెప్పుదు
మన మెరియదె ప్రాణ మైన మగఁ డిట్లయినన్

అని నుడివినది. ఇంత వరకు సవతు లందరిలోఁ గడు గారవంబున తన్ను వల్లభుండు కన్నులఁ గప్పికొనంగ సత్యభామ చక్కనిదాన నంచు నెఱ జవ్వనముం గలదాన నంచు జగంబులోన పేరెక్కినదాన నంచుఁ బతి యెంతయు తన కనురక్తుడంచు నిక్కుచు విఱ్ఱవీఁగుచు కాంతలను గణింప కుండెను. ఇప్పుడు వారందరిలో తనకు వన్నెయు వాసియు తరిగినది. ఇది యే మానవతి సహించ గలదు. కావున ఆమెకు కోప మినుమడించినది. మగని మీాద కసి పుట్టినది. ఆ కసి తీర్చుకొన వలయును. అతడు తనకు వశంవదుడు. ఆమె కను సన్నల మెలంగు చుండును. ఇట్లు వర్తించు చుండినను మగని మీాద నను మానము మెండు. అది బహు సపత్నులు గల యాడుదానికి సహజము. అందు సత్యభామకు చెప్ప నక్కర లేదు. సురముని ఇచ్చిన పారిజాత కుసుమము శౌరి రుక్మిణి కిచ్చుట మహాపరాధ మయినది. దానికి తోడు తన్ను నిందించు నారదుని వారింప కుండుట రెండవ యపరా

ధము. ఈ రెండు నామెను వేధించినవి. తొల్లింటి శౌరి వర్తన లన్నియు నటనలు మాయలని తోచినవి.

కలలోన నైన నవ్వుల కైన నా మాట
జవదాఁటి వెఱచు నో చంద్ర వదన
యే పదార్థంబు నా యెదుటఁ బెట్టక మున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుఁ బోఁడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నో చంచలాక్షి
తోడి చేడియలు నాతోడి వంతులకు రా
సయిరింపఁ జాలఁడో సన్నుతాంగి

యరమరలు లేని కూరిమి నన‌ఁగి పెనఁగి
కొదలు దీఱని కోర్కెలఁ గూడి మాడి
కపట మెఱుఁగని మమతలఁ గలసి మెలసి
యున్న విభుఁ డిట్లు సేయునే యో లతాంగి

యని చెలికత్తెతో వాపోయినది సత్యభామ. ఆమె నుడులం దసత్య మేమియు లేదు. నారదుడు పారిజాత కుసుమమును శౌరి కొసంగెను. దానిని గైకొనినాడు శ్రీకృష్ణుడు. భీష్మక నందనం గను గొనినాడు. వెంటనే మొదట సత్యభామ తలంపున నిలిచినది. ఇది యే పదార్థంబు నా యెదుట పెట్టకమున్న యెవ్వారి కొసంగ డను టకు సాక్ష్యము. అది వాని యలవాటు.

ముని నా కిచ్చిన పూవు చందమును నే మున్నాడి యీ భోజనం
దన కర్పించిన జాడయుం దెలియఁ జెంతం బొంచి వీక్షించి పో
యిన సాత్రాజితి బోటి నావలన నే మేమి కల్పించెనో
యని

తహతహ పడినాడు శౌరి. ఇది చెలులు నాతో నేమి చెప్పుదురో

యని లంచంబు లిచ్చుటకు తార్కాణము. అట్టివా డగు భర్త నారదుని నిందాలాపములు చెవి యొగ్గి వినెను. పారిజాత కుసుమము తన కీయలేదు. రుక్మిణి కొసంగెను. అది యామె కోపమునకు అక్కసునకు కారణ మయినది.

నా మొగమోటకై వలని నాటకముల్ గటియించి రుక్మిణీ
కామిని మీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గాననీక యిటు లిన్ని దినంబులు నన్నుఁ దేల్చె

నని తలంచినది. అందలి నిజము తేల్చుకో వలయును. రుక్మిణి మీఁద తన కసి తీర్చుకో వలయును. తాను రుక్మిణికంటె నధికురాల నని యనిపించుకో వలయును. దాని కుపాయ మాలోచించినది

మాసిన చీర గట్టికొని మానముతోడ నిరస్త భూషయై
వాసెన కట్టు గట్టి నిడువాలిక కస్తురి పట్టు వెట్టి లో
గాసిలి చీక టింటి కడ కంకటిపై జలదాంత చంద్ర రే
ఖా సదృశాంగియై పొరలె గాఢ మనోజ విషాద వేదనన్

ఇది ప్రణయ కోపము. కావున సత్యభామ మనోజ విషాద వేదన కలదైనది. ద్రౌపదిది ప్రళయ కోపము. కావున రాజరాజు పీనుంగు కన్నారఁ గానంగబడ వలయు నన్నది. ఇరువురు భర్తృ కృతాపరాధలు. కోపనలు. ద్రౌపది కోపము రాజరాజు మీఁదకును దుశ్శాసనుని మీఁదికిని మళ్ళినది. సత్యభామ కోపము రుక్మిణి మీఁదికి మళ్ళినది. తమ కోరికలు తీర్చుకొనుటకు భర్తలను నోటి కసితీర నిందించిరి. అట్లయిన గాని కార్యము ఫలించదు. సత్యభామది విప్రలంభ శృంగారము. కావున కంపము స్వేదము వైవర్ణ్యము మొదలగు సాత్త్విక భావములు కల దయ్యెను. ఆమెకు రుక్మిణి యెడ మచ్చరము హెచ్చుమినది. మసకపు పాము కాటువలన విషము వలె నది యగ్గల మైనది. శ్రీకృష్ణుని యెడ మోహము కలది సత్యభామ.

కావున మనోజు బాధలం బడుచుండెను. మద హస్తి హస్త గత పద్మిని వలె సొంపు పెంపులు గోల్పోయెను. శ్రీకృష్ణుడు రావల యును. తన్ను బ్రతిమాల వలయును. వానివలన తనకు రుక్మిణి యెడ గల వైరము తీర వలయును. అది యామె తలంపు. దాని కయి కోప గృహము చేరినది. కృష్ణు రాకకు తల్లడిల్ల మొదలు పెట్టినది. తలంపు వెంబడి శ్రీకృష్ణు డరుదెంచినాడు. అంతయు గ్రహించుకొనినాడు. అతడు మాయలాడు. అచటి చెలికత్తెల నందరి నవలి కంపించినాడు.

ఈ లలితాంగి చంద మొక యించుక చూచెద నంచు ధూర్త గో
పాలుఁడు తాలవృంత మొక భామిని సత్య పిఱుంద నుండి మం
దాలస లీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలిత పంచసాయక శిఖం దరికొల్పుచు నున్న కైవడిన్

అతడు ధూర్త గోపాలుడు. ధూర్తు డనగా మోసగా డని యర్థము. ఏ పదార్థంబు సత్య యెదుట పెట్టక మున్న యెవ్వారి కొసంగనివాడు నారదుని కను సన్నన పారిజాత కుసుమము రుక్మిణి కిచ్చెను. రిక్త హస్తములతో సత్యభామ యొద్దకు వచ్చెను. ఊరక రాలేదు. పారి జాత కుసుమ వాసనలు వింతలు సేయ వచ్చినాడు. అది యామెను మరింత కష్టించుటకు. రుక్మిణి యెడ గల రవరవ మరింత రెచ్చ కొట్టుటకు. వచ్చినవాడు వచ్చినటు లూరకుండ లేదు. తాళవృంత మొక భామిని సత్య పిఱుందున నుండి వీచుచుండగా గైకొని వీవ నారంభించెను. ఈ చాటు పని యొక దొంగతనము. ఇది శ్రీకృష్ణుని ధూర్తత్వమును వెలయించు చున్నది. ధూర్త శబ్దమునం దింత యభి ప్రాయ మిమిడి యున్నది. అది సార్థక విశేషణము. తిమ్మన ముద్దు మాటల పొందికతో పద్య మతి మనోహరముగాను హృదయంగమము గాను నడిపించుటయే కాదు వాడిన ప్రతి పదమునం దొక వింత సార స్యమును పొదిగించి యా ముద్దుం దనమునకు వికాసము కల్పించు

చుండును. ఒకొక్కప్పుడు పద్యములో సందర్భమున కుచిత మగు నలంకారమును కూర్చి యా వికాసములో పాఠకుని మనస్సున కమితాహ్లాదమును కలిగించు చుండును. వినుతి పాత్ర మొనరించును. శ్రీకృష్ణుడు ధూర్తుడు. కావున సత్యభామా వపుః కీలిత పంచసాయక శిఖం దరికొల్పుచు నున్న కైవడి తాల వృంతముతో మందాలస లీలమై వీవ నారంభించెను. ఇదంతయు ధూర్తత్వము. తాను చేసిన పనిని కప్పిపుచ్చి సత్యను రెచ్చకొట్టుటకు చేసిన చెయ్దము. కావున కవి ధూర్త గోపాలు డని వాడినాడు. కోప వేగమున నగ్గలమైన మనోజ బాధలం బడుచున్నది సత్యభామ. తద్వపుః కీలిత పంచసాయక వ్యధను దరి కొల్పు చున్నాడు తాళవృం తానిలముచేత శ్రీకృష్ణుడు. సత్యభామకు శౌరి యెడ మోహము కలదు. అది యిప్పుడు కోపముతో జతకూడి యున్నది. కృష్ణుడు పంచసాయక శిఖిని మాత్రము దరికొల్పు చుండెను. ఇది స్త్రీస్వభావమును సంపూర్ణముగా గుర్తెరిగిన రసికులకు హృదయైక గోచరము. కోపము నొందిన ప్రణయినికి వల్లభుడు దరి చేరగానే మోహ మతిశయించును. అది యనుభవైక వేద్యము. ఊహ కందనిది. తిమ్మన మహారసికుడు. స్త్రీ స్వభావము చక్కగా గుర్తించి యీ పద్యమును రచించెను.

> అంతట పారిజాత కుసు మాగత నూతన దివ్య వాసనల్
> వింతలు సేయఁ దావి యిది విస్మయ మంచు మునుంగుఁ ద్రోచి యే
> కాంత గృహంబు నల్గడల నారసి సంభృత తాళవృంతునిం
> గాంతునిఁ జూచి

నదట. పారిజాతము దివ్య కుసుమము. దాని వాసనలు వినూతనములు, దివ్యములు. అట్టి వాసనలు భూలోక పుష్పముల కుండవు. అట్టి సుగంధము శ్రీకృష్ణుని రాకవలన బొడమినది. అసలు నిజ మొట్లున్నను కవి భావ కల్పనా చాతుర్యము, అందు మూలమున రసమును జాల్వారించు నేర్పు, మిక్కుట మయినది. ఇది సత్యభామ యసూయా

దులు రెచ్చకొట్టి పద్యమును రసవంత మొనరించి కథ చమత్కార ముగా నడుపుటకు నాధార మయినది. కావుననే సత్యభామ

నీ విట వచ్చుట పారిజాత వా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె

యన్నది. నిజము చక్కగా గ్రహించినది సత్య. ఇన్నేండ్లు కాపు రము చేసిన యిల్లాలు భర్త స్వభావము తెలిసికొనక యుండునా. ఆ దివ్య వాసనను వెంటఁగొని వచ్చి సత్యభామ రోషమును మరింత రెచ్చకొట్ట వలయునని శ్రీకృష్ణుని యూహ. అతడు దిట్ట తనము గల మాయగాడు. మాయగాడె కాదు ధూర్తుడు. ఆ లక్షణము లన్నియు శ్రీకృష్ణుని ప్రవర్తనలో నంతర్లీన మయి యున్నవి. ఆ చమత్కార మంతయు పద్యములలో వెలయించిన తిమ్మనలో మరింత దిట్టతన మున్నది. పూర్వాపర సందర్భములకు విరుద్ధము రానీయకుండ ఒండొంటెని భావములతో కలుపుకొని కథకు మరింత బిగువును కల్పించినాడు తిమ్మన. ఈ బిగువు కావ్యములందు మను చరిత్రయందు మాత్రము గోచరించును. ఈ రచనా విశిష్టత గుర్తె రుంగక కొందరు విమర్శకులు వ్రాసిన దానినే మరల మరల వ్రాసి నాడు తిమ్మన యని నాతో వాదించిరి. ఆ యా పద్యములను సూచించుచు కారణములు తెల్పితిని. అవి యన్నియు కథను కూడ కలుపుకొని వచ్చుటకును పాత్రలకు పరస్పర సంబంధములను కూర్చి కారణ కార్య భావమువల్ల గుణ పోషణ కావించుటకు నేర్పడి నవి. శ్రీకృష్ణుడు తన వెంట పారిజాత వాసనలు గొని తెచ్చుటకు కారణము సత్య ముఖమున నెకసక్కె మొనర్చుట కని నిరూపించినాడు తిమ్మన. ఆ వాసనలు వింత చేసినవి. అందు మూలమున విస్మ యము నొందినది సత్య. ఏమా యని ముసుంగు తొలంగ ద్రోచి నది. నలు వలంకలు చూచినది. శ్రీ కృష్ణుని గాంచినది. అది యేకాంత గృహమట. రాబోవు సంఘటనకు పునాది రాయి

తిమ్మన 'ఏకాంత గృహము'నందు నెలకొల్పినాడు. శ్రీకృష్ణు డర్మిలి మ్రొక్కుటకును సత్యభామ వామ పాదమున శిరము తొలంగఁ ద్రోయుటకు తగిన తావని సూచింప బడినది. ఇట్లే మను చరిత్రమునందు ఏకాంతమునందు నున్న జవరాండ్ర నను నెడ రత్యాదుల కే యాటంకము కలుగ దని పెద్దన భావ గర్భితముగా వాడెను. శ్రీకృష్ణుని చూడగానే సత్యభామ కనుల నీరు తిరిగినది. చెక్కులఁ దిగజారినవి.

తల వాంచి మగుడ మూసుఁ గిడెఁ
గొలుకుల డిగ జాఱి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళ పతిత మరంద బిందు తతిఁ బురుడింపన్

ఇందు ఉపమాలంకారము కలదు.

ఓర్పొక యింత లేని విక చోత్పల లోచన చిత్త వీథిఁ జ
ల్లార్పఁగ నీల నీరద శుభాంగుఁడు వేచను దెంచె నంచుఁ గం
దర్ప హుతాశను న్వొలికిఁ దార్చు సఖుండును బోలె వేఁడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమి తావర ణాంశు కాంతమై

ఇది యుత్ప్రేక్షాలంకారము. అలంకార కల్పనమునందును తిమ్మన స్వాభావికతను మరువ లేదు. నిట్టూర్పువలన మూసు గిడిన వస్త్రాంతము పై కెగురు చుండెనట. శ్రీకృష్ణుడు సత్యభామను పలు విధముల ననునయించెను. కాని యామె కోపము చల్లార లేదు. వేరొండుపాయ మేమియు వానికి తోచ లేదు.

పాటల గంధి చిత్తమునఁ బాటిలు కోప భరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మ్మృదు పల్లవ కోమల తత్పద ద్వయీ
పాటల కాంతి మాళి మణి పంక్తికి వన్నియ వెట్ట నా జగ
న్నాటక సూత్ర ధారి యదు నందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్

నాయికకు కోపము వచ్చుటయు, నాయకుడు నాయకురాలిని అనున యించుటయు, నంతకును కోపము చల్లారకున్న పాదములకు నమ స్కరించుటయు లౌకికము. ఏకాంత కేళీ వినోదములలో నిది యొకటి. అట్లే శ్రీకృష్ణుడు సత్యభామ పాదములకు మరాళి మోవ మ్రొక్కినాడు. అతడు జగన్నాటక సూత్రధారుడు. అంతటివాడు సత్యభామకు మ్రొక్కుట యొక మాయా నాటకము. అంత సత్యభామ

జలజాతాసన వాస వాది సుర పూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిర మచ్చో వామ పాదంబునం
దొలగం ద్రోచె లతాంగి యట్ల యగు నాథుల్నేరముల్సేయఁ బే
రలుకం జెందిన కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే.

అన్నాడు కవి. అతడు లతాంతాయుధుని కన్న తండ్రి విష్ణువు. వాని శిరము జలజాతాసన వాసవాది సుర పూజా భాజనంబై తనర్చును. తిమ్మన తెనుగు పదముల కూర్పునందు వలెనె సంస్కృత పదముల కూర్పునందును సిద్ధహస్తుడు. పై సమాసము నల్లికయందు మార్ధ వము కలదు. అట్టి శిరమును వామ పాదమున తొలగం ద్రోచినది సత్యభామ. శ్రీకృష్ణుడు మహావిష్ణువు కావచ్చును. సుర పూజితుడు కావచ్చును. అత డెంతవా డయిన నేమి. సత్యభామకు భర్త. అందు అది యేకాంతము. ఏకాంతమునందలి సతిపతుల వినోద ములు బహు విధములుగా నుండును. రసికు డగు భర్త యా వినో దములలోని తప్పులను పాటింపడు. అది కామదేవత ప్రభావము. శ్రీకృష్ణుని శిరమును సత్యభామ వామ పాదమున తొలగం ద్రోచినదట. తిమ్మన సందర్భమునకు తగిన సారస్యముగల పదములను వాడుట యందు చాల నిపుణుడు. తొలగం ద్రోచె నను పదమునందు మహత్తర మయిన భావ మిమిడి యున్నది. సత్యభామ మహాపతివ్రత. పతిని దైవముగాను ఏడుగడగాను ప్రాణ సదృశ బంధువుగాను భజించునది. అట్టి భర్త తన పాదములకు శిర మంటు నటుల మ్రొక్కెను. అది

యామె సహింపలేక పోయినది. ఆమెయే కాదు. ఏ యిల్లాలు సహింప గలదు. సత్యభామ కుడి వైపున కొత్తిగిలి పరుండెను. శ్రీకృష్ణు డామె పాదములకు మొక్కెను. అది యామెకు సహింప రాని దయినది. ఆమె కోపము చల్లారలేదు. వలదని వారించు టకు వేరొండు దారిలేదు. మాట్లాడుట కిష్టము లేదు. కావున పై వైపున నున్న వామ పాదముతో కృష్ణుని శిరమును తొలగ ద్రోచి నది. కవి మిగుల దిట్టతనము కలవాడు. కావున నీ భావ మంతయు మనసునం దుంచుకొని భావగర్భితముగా నా పదమును వాడెను. తిమ్మన తూచి వాడిన పద మది. పారిజాత కుసుమమును రుక్మిణి కిచ్చు టతో ప్రారంభించిన విప్రలంభ శృంగారము కథానుగతికముగా క్రమ క్రమమున వృద్ధిగాంచి యీ పద్యముతో నున్నత స్థాయిని చేరుకొన్నది. కథయు నంత కంతకు క్రమముగా నధిరోహణమును బొంది శృంగ మును చేరినది. దీనినే యాంగ్లమునందు హైయ్యెస్టు పిచ్ అందురు. ఇచట నుండి యవరోహణ మారంభించును. 'అట్ల యగు' అన్నాడు తిమ్మన. అట్లు తొలగ త్రోయుట స్త్రీ సహజ మగును అని భావము. కాని యదియు ననుచితమే యనుటలో సందేహములేదు. నాథులు నేర ములు చేసి నప్పుడు కోపము చెందిన కాంతల కుచితానుచిత వివేక ముండ దని తిమ్మన యర్థాంతరముచేత సత్య యకార్యమును సమర్థిం చెను. అలసాని పెద్దన మనుచరిత్రమునందు చూచి ఝుణం ఝుణ త్కటక సూచిత వేగ పదారవిందయై యను పద్యముతో ప్రారంభించిన శృంగా రమును రస భావాదుల పొందికచేత కథను క్రమ క్రమముగా వృద్ధి గావించి.

ప్రాంచ ద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగలించి యధరం బాసింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీయాంస ద్వయం బంటి పొ
మ్మంచున్

ద్రోయుటతో నాభాస మున్నత స్థాయిని చెందినది. అట్లు త్రోయుటను పెద్దన కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్ అను నర్థాంత ముతో సమర్థించెను. అచ్చట నుండి కథ యవరోహణ స్థితి నొందినది ప్రవరుని విషయమున. కథా విధానమునందు అధిరోహ ణావరోహణల క్రమము పారిజాతాపహరణ మనుచరిత్రలందు చక్కగా కనిపించును. విప్రలంభ శృంగారము ప్రధానముగా నడిపిన కావ్యములలో పారిజాతా పహరణము మొదటిది. తరువాత చెప్పతగినది విష్ణుచిత్తీయములోని గోదాదేవి కథ. అది భక్తి సమ్మిళితము. పౌరాణికము. పారిజాతాపహర ణము ప్రణయ సమ్మిళితము. లౌకికము. సత్యభామ నొక లోక సామాన్య యగు నాయికగా చిత్రించినాడు తిమ్మన. వాని పోకడలు వేరు. రాయల పోకడలు వేరు. తిమ్మన మానసిక ప్రవృత్తి బాగుగా గుర్తించినవాడు. వాని రచనయందు హృదయాకర్షణీయ మగు నంద మున్నది. సత్య భామను మానవతిగా రూపొందించినాడు. అందు రుక్మిణియం దసూయ కృష్ణునియం దమితానురాగము చనువు నిమిడి యున్నవి. అవి యామెను మిగుల గయ్యాళిగా చేసినవి. కావున ఆమె ప్రణయ కోపము భర్తను సయితము లక్ష్యపెట్ట నీయలేదు. కసి కొలంది కృష్ణుడు చేసిన యపరాధమునకు నోరార నిందించినది. ఇది లోక ప్రవృత్తి. భాగవతమునందు సైతము సత్యభామ నొక గడసరి గయ్యా ళిగా చిత్రించినాడు పోతన. ఆమెయందు మిగిలిన సవతులకంటె నొక విశిష్ట గుణ మున్నది. అదియే రాజసము. అది యామెను ప్రతి విష యమునందు సపత్నులను మించిన వ్యక్తిగా చేసినది. శ్రీకృష్ణుని దాసునిగా నొనరించినది. నారదుడు

అనిశైనం బతి నిన్నుఁ బాసి చనెనో ప్రాణంబు ప్రాణంబుగా
నిను మన్నింపఁడొ నీ మనోరథముల న్నెయ్యంబుతోఁ జేయఁడో
చనవు ల్నీవలె నెవ్వరేఁ గనిరొ నీ సౌభాగ్య మింతింతయే
నిను బోలం గల రబ్జగంధులు లన వింకే యెందు సాత్రాజితీ !

అని పారిజాతాపహరణమునందు సత్యభామతో ననెను. ఇది భాగవతములోని నరకాసుర వధ వృత్తాంతమును స్ఫురింప జేయు చున్నది. అది యొక విధముగా తన కథా క్రమమునకు నూతగా తిమ్మన గ్రహించెను. శ్రీకృష్ణుడు సత్య గీచిన గీటు తప్పరాదు. ఆమె కోరిక లన్నియు నెరవేర్ప వలయును శ్రీకృష్ణుం డట్లే సలుపు చుండెను. అయిన నామె కనుమానము. అతని ప్రేమకొర కామె విశ్వ ప్రయత్నములు గావించు చుండును. ఒకసారి ద్రౌపదిని

నగు మొగంబులఁ గాని నాతి నీ దెస నెప్డుఁ
బతులకుఁ గింకిరి పాటు లేదు

వ్రతము పెంపో మంత్ర ఔషధ వైభవంబో
సరస నైపథ్య కర్మ కౌశలమొ చతుర
విభ్ర మోల్లాస రేఖయో వెలఁది నీ వి
శేష సౌభాగ్య హేతువు సెపుమ నాకు

అని అడిగినది. చివాట్లు తిన్నది సత్యభామ. ఆ యనురాగము కొఱకు పుణ్యక వ్రతము చేసినది. సత్యభామ స్వభావము శ్రీకృష్ణు డెఱుగును. ఆమె ప్రేమకు తగినంత చనవొసంగెను. ఆ చనవు తీసికొని యామె కృష్ణుని శిరమును వామ పాదమున తొలంగఁ ద్రోచినది. శ్రీకృష్ణుడు అదియు మన్ననగానే గ్రహించెను.

నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తా
చిన యది నాకు మన్ననయ చెల్వగు నీ పద పల్లవంబు మ
త్తను పుల కాగ్ర కంటక వితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁక నైన నరాళ కుంతలా!

అన్నాడు శ్రీకృష్ణుడు. రసికాగ్రేసర చక్రవర్తి. ఆ రసికత సర సత్వము పై పద్యమునందు వెన్నెల వెలుంగు లీను చున్నది. తాను సత్యభామకు దాసుడట. ఆ మాట నిజము. సత్యభామా విధేయుడు

శ్రీకృష్ణు డని ప్రతీతి. నారదుడు దానికి సాక్ష్య మిచ్చినాడు. 'పతి నీవై విహరింపగా' నని. దానిని శ్రీకృష్ణు డంగీకరించినాడు. సత్యభామ యధిపతి. శ్రీకృష్ణుడు దాసుడు. దాసుడు తప్పొనరించి నపుడు అధికారి దండించుట మన్నన చేయుట యగును. శిక్షవలన తన తప్పు నెరింగి మంచి దారి నవలంబించును. కావున ఉత్తము డగు వాడు దానిని మన్ననగా గ్రహించును. కావున నీవు తాచి నది నాకు మన్నన యని యంగీకరించినాడు కృష్ణుడు. సత్యభామ శిరము తొలంగఁ ద్రోచినది కాని తన్న లేదు. తాచిన యది యనుట చలోక్తి. సత్యభామ పాదము పల్లవము వలె మిగుల మృదుల మయి నదట. ఆమె తన్ను తనకు మన్ననగా గ్రహించటమే కాదు. తరువాత కూడ ఆమె పదము పల్లవము వంటి దని వర్ణించుటలో శ్రీకృష్ణుని రసికత సత్యభామయందలి ప్రేమ కొంటెతనము వెల్లడి యగుచున్నది. అది మత్తను పుల కాగ్ర కంటక వితాన మనుటలో నున్నది. మేను పులకించుట గగుర్పాటను సాత్త్విక భావము. ప్రేమ వలన కలుగునది. అందు నవి కంటకముల వంటి యగ్రములు కలవిగా నిక్కపొడుచు కొనిన వనుటలో శ్రీకృష్ణుని కామోద్రేకము సూచింప బడినది. అది యమిత ప్రేమవలన కలుగును. అట్టి యధిక మగు ప్రేమ స్త్రీయందు కల వాడ నను భావమా సమాసమునం దున్నది. అట్టి ముళ్ళ వంటి యగ్రములు గల నాతనువునందలి రోమములు నీ పల్లవముల వంటి పాదములను తగిలిన చాల నొచ్చెడిది. అని నొచ్చున్ అను తద్ధర్మార్థక క్రియవలన తెలుప బడినది. దైవ వశమున నట్లు జరుగ లేదు. శిరమును తన్నితివి. ఆపద నుండి తప్పించు కొంటివి అని యొక వింత పరిహాసము. తిమ్మన యీ పద్యముచేత సత్యభామ యందు శ్రీకృష్ణుని విధేయత, అనురాగము, మాలిమి, సరసత, చలోక్తి వెలయించెను. ఈ పద్యము

దాసే కృతాగసి భవ త్యుచితః ప్రభూణాం
పాద ప్రహార ఇతి సుందరి నాస్మి దూయే

> ఉద్యత్కోర పుల కాంకుర కంట కాగ్రై
> ర్యద్భిద్యతే మృదు పదం నను సావ్యధామే

అను సాహిత్య దర్పణమునందలి శ్లోకమున కనువాదము. తిమ్మన లక్షణ గ్రంథముల ననుసరించి శ్రీకృష్ణుడు సత్య పాదములకు మొక్కుటయు నామె వామ పాదమున శిరము తొలగ ద్రోయుటయు శ్రీకృష్ణుడు పై విధముగా బ్రతిమాలుటయు గల ఘట్టమును మూలమునందు లేని దానిని కల్పించెను. అంతే కాని జన శ్రుతిగా వచ్చుచున్న తిరుమల దేవి రాయల కథ అబద్ధము.

> అన విని మానినీ తిలక మప్పుడు మే యఱ దోప నిక్కి వీ
> డిన కచ పంక్తిఁ బల్మఱు ముడి న్వడ దోపుచుఁ బై చెఱంగు గ్ర
> క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జం
> కెన నెఱి చూపు చూచి పలికెం జలి తాధర పల్ల వాగ్రయై

సత్యభామ యభిమానవతులం దగ్ర గణ్యురాలు. మేను సగము కని పించు నటుల పైకి లేచినది. మొదట సంభృత తాలవృంతునిం గాంతుని జూచినది సత్య. తలవాంచి మగుడ ముసుఁగిడినది మేను కానరాకుండ. అప్పు డామె కోపము పట్టరానిదై యుండెను. కృష్ణుడు నిర్లోభిమిం బైచెఱం గొడిసినాడు. దాని కామె సహింప లేదు. చేవిరి దమ్మి వ్రేయుటకునై యుంకించి జంకించినది. ఇవి యన్నియు నామె ప్రణయకోపమును సూచించు చున్నవి. కాలి తాపుతో నా యుద్రేకము సగము తగ్గినది. కావున 'మే యఱ దోప' అన్నాడు తిమ్మన. అఱ భాగము కోపము తగ్గిన దని వాని సూచన. తనంతట తాను పైకి లేచిన దనుట 'మే యఱ దోప' లోని యభిప్రాయము బలపఱచు చున్నది. ప్రతి పదమును బాగుగా నాలోచించి చక్కని భావము నిమిడ్చి పూర్వ భావములతో సరిగా పొందు కలిపి వాడు చుండుట తిమ్మన రచనలోని యాధిక్యత. నిరర్థకముగా నే పదము వాడడు. పారిజాతాపహరణములోని ప్రతి పద్యము వెనుకటి సందర్భములతో సంబం

ధము కలిగి యుండును. అది కథకు బిగువును కలిగించును. ఇట్టి రచన మనుచరిత్రయందు చూడ వచ్చును. దీనిని బట్టి చూడగా తిమ్మనార్యుని కథా కల్పన విధానము పూర్వాపర సందర్భ శుద్ధి పెద్దన హృదయము నాకర్షించి యుండును. దానిని అనుభవమునకు తెచ్చుకొని మనుచరిత్ర కథను నడిపియుండు నేమో నని నా తలంపు. ఈ తలంపు సత్య మనుట కింకను చాల యాధారములు గలవు. వాని నా యా తావులందు ప్రసంగించితిని. సత్యభామ వీడిన కచ పంక్తిఁ బల్మఱు ముడి న్వెడ దోపుచు, పైచెఱంగు గ్రక్కునఁ జను దోయిఁ జేర్చుచు జంకెన నెఱి చూపు చూచి పలికినదట. ఇందు కుపితు రాండ్రయిన స్త్రీల స్వభావ సిద్ధము లగు చర్యలు జరిగినవి జరిగినట్లు వర్ణించినాడు కవి. రవి గాననివి కవి గాంచునట. ఇట్టి చెయ్దులు ఊహా జన్యములు కావు. అనుభ వైక వేద్యములు. కవికి తాను వర్ణించు ప్రతి విషయమునందు ననుభవ ముండ వలయును. అప్పుడు కాని వర్ణనలందు నైసర్గిక ప్రవృత్తి యలవడదు. అది పాఠకుని మనస్సు నాకర్షించును. పురుషు నెదుట మాటి మాటికి తల సవరించు కొనుట పయ్యెద దిద్దికొనుట స్త్రీల స్వభావము. మోహావేశమున నిటు నటు పొరలినది సత్య. అందు మూలమున చెదరిన కుంతలములు పయ్యెద మాటి మాటికి సరిచేసి కొనుచు పలికినదట. తిమ్మనకు స్త్రీల స్వభావము బహు బాగుగా తెలి యును. అందును కాముకురాండ్ర కిట్టి చెయ్దులు పలు మరు గావించుట స్వభావము. కావున పల్మఱు అని వాడినాడు కవి. అట్లు పల్మఱు సవరించుటకు కారణము వెడ దోపుకొనుట. వెడ యనగా నించుక యని యర్థము. కోపావేశము ఆమెను గట్టిగా ముడియందు మరల రాకుండ చెదరిన కచములను దోపుకొన నీయలేదు. కావున మరల మరల దిగజారినవి. మరల మరల దోపుకొనుచు వచ్చినది పలు మారు లని కవి యభిప్రాయము. ఆ రెండు పదములు పద్యమునకు

జీవములు. దోపుచు చేర్చుచు నను శత్రధ్రకము లామె విరామము లేని చెయ్దములను చెల్పుచున్నవి.

ధూర్జటి

వడికొల్పి యొక కేల ముడిచిన క్రొమ్ముడి
గొబ్బునఁ గటిఁ జుట్టుకొన్న చేల

ముత్తోడ యాదవ రాజు ముందర వేశ్య నిలిచె నని వర్ణించెను. స్త్రీలు వేగిర పాటున నొనరించు కృత్యము లిట్లే యుండును. విజయ విలాస కర్త యిట్టివి పెక్కులు వర్ణించెను.

మేలి పసిండి గాజుల సమేలపు పచ్చల కీల్కడెంపు డా
కేలు మెఱుంగు గుబ్బ చనుఁ గ్రేవకు దార్చుచు సోగ కన్నులం
దేలఁగఁ జూచి

నదట యులూచి యర్జునుని. ఇట్టివి విజయ విలాసమునందును సారంగ ధర చరిత్రమునందును చేమకూర వెంకట కవి స్త్రీలోక స్వాభావికము లయిన చెయ్దముల నందందు సందర్భముల ననుసరించి వర్ణించెను. తరువాత సత్యభామ మగని మీఁద గల కోపము అక్కసున నోటి కసి తీర మాటలతో వెడల గ్రక్కినది.

ఈ నయగారపుం బ్రియము లీ పస లీ మొగ మిచ్చు మాట లే
లా నిను నమ్మి యుండిన ఫలం బిదె తోడన కల్గె నాకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఁజడి పెట్టిన నవ్వు వారలం
గాన వెఱుంగునే పసుల కాపరి భావజ మర్మ కర్మముల్

అని యారంభించినది. ఎక్కడ నుండి యూరుకొని వచ్చినవో యీ నయగారపుం బ్రియము లీ పస లీ మొగమిచ్చు మాట లారంభము లోనే వరుస తెగకుండ వెడలినవి. అవి వల్లన వేసినవి కావు.

పరుల నుండి యంది పుచ్చుకొనినవి కావు. ప్రణయ కోపము కొలంది హృదయంపు గని నుండి నేను నేనని ముందునకు తడుముకొన నీయ కుండ బయల్పడినవి సత్యా నోటినుండి. ఆ మాటలలోనే యంద మున్నది. విన్నవారి మనస్సు నూట లూరించి యుప్పొంగించు పదములవి. సత్య కొంత నాట్య సరణిని చేతులు త్రిప్పుచు నీ మాట లభినయ పూర్వకముగా ననినదేమో యనిపించును. కయ్య ములందు, గయ్యాళి తనము గల యాడువారి కది స్వభావము. తెనుగు భాషలో విన నింపగు నంద చందములు గల దేశీయంపు నుడికారములకు మూల భాండాగారము తిమ్మన. అతడు పరులకు బీరు పోనీయ కుండ ముద్దులు మూటగట్టు పదముల నన్నిటిని గుత్త కొనిన మహాకవి. అవసరమును బట్టి యా పద జాలము లొకటి వెంట నొకటి తలంపులను కూడ తీసికొని వెడలి వచ్చును. నీ యాన సుమ్మీ ననుం జెనకి యాఅడి పెట్టిన నన్నది సత్య. ఆమె గయ్యా ళితనము మగని మీద యానలు పెట్టు నంత వరకు వచ్చినది. తరువాతిది నవ్వు వారలం గానవు. నన్ను పరిహసించువారిని నీవు చూచుట లేదు. అనగా నెఱుంగవని భావము. ఇది రుక్మిణి మన స్సునం దుంచుకొని యనిన మాట. రుక్మిణికి పారిజాత కుసుమము నిచ్చితివి. అందు మూలమున నన్నవమానించితివి. ఆమె నాయందు రవరవలు కలది. నన్నామె పరిహసించును. అది నీవు చూడలేదని యభిప్రాయము. అవును నీ వెట్లు చూడగలవు. నీవు పసుల కాపరివి. నీకు భావజ మర్మ కర్మ లేమి తెలియును అని నిందించినది. శ్రీకృ ష్ణుడు పసుల కాపరియట. పసుల కాపరులు గ్రామీణులు. వారికి రసి కత శూన్యము. సరసత్వ మంతకంటె సున్న. పర హృదయము గుర్తింప లేరు. నీవు నట్టివాడవని నింద. తాను రాజకుమారి. నాగరి కత కలది. అని పొగడ్త దానియందే యిమిడి యున్నది.

ఇంకిటు నిన్ను నమ్మి నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకము కాని నీవలని బొంకులు మా చవి కావు రుక్మిణీ
పంకజ పత్ర నేత్రకును బ్రాణ పదంబులు గాని వల్లవీ
కింకర చాలుఁ జాలు నుడికింపకు నింపకు లేని కూరుముల్

అని ఎత్తి పోసింది సత్య. పై పద్యమునందు గూఢాగూఢముగా పేరు పెట్టక నవ్వు వారలం గానవు అనుటలో నున్న రుక్మిణిని ఈ పద్యము నందు బైట పెట్టినది. వల్లవీ కింకర యని నిందించినది. వల్లవులు గోపికలు. వారు పసుల కాపరులు. వారు నీ వలె నరసికలు. వారికి నీవు దాసుడవు. వారికి నీకు తగినది అని నింద. రుక్మిణీ పంకజ పత్ర నేత్రకును బ్రాణపదంబులు అన్నది. రుక్మిణియు గోపికల వలెనే యర సికురాలు. కావున ఆమెకుఁ గూడ నీ బొంకులు చవి యగును. పంకజ పత్ర నేత్రకును అను సముచ్చయముచేత రుక్మిణిని గూడ అరసిక లగు వల్లవుల పట్టికలో చేర్చినది సత్య. మా చవి యను టలోని బహువచనము సత్య రాజసమును ప్రకటించును. ఇందు మూలమున తన ఘనతయు రుక్మిణి యరసికతయు వెల్లడించినది. తిట్టుటలో కూడ నేర్పున్నది. తెలివి యున్నది. అంద మున్నది. దానిని బాగుగా నేర్చుకొనినాడు తిమ్మన. అంతటితో పోనీయ లేదు. ఆమె కసి యింకను తీరలేదు.

గట్టివ చేతలుం బసలు గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేని పలు పోకల మాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వో కుటంగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గొల్పడి పోయితి నేమి సేయుదున్

దీనికి పారిజాతాపహరణ వ్యాఖ్యాతలు పై మూడు పద్యములందు భగవానుని త్రిగుణాత్ముని బాగడి తద్భక్త వాత్సల్యాతిశయమును నిపుణముగాఁ బ్రకటించి కవి వైష్ణవ మతాశ్రయుండగు కృతిపతి కింపు

పుట్టించి తన యభేద భావమును వెల్లడించె నని సరస హృదయులు తలంతు రని నుడివిరి. అందలి సత్యాసత్యములు కొంత విద్వల్లోక మాలోచింప వలసి యున్నది. అది సత్య మగుచో సత్యభామ పాత్ర మూలముట్టుగా చెడిన దగును. రాయల కింపు పుట్టించుట కింత వరకు సత్యపాత్ర ననన్య సామాన్యముగా పోషించుకొని వచ్చిన తిమ్మన పాడుచేయడు. సత్య మానవతి ప్రణయ స్వరూపిణి. అహంకారం మమకారములు కలది. ఆమె యభిమానము రాజసముతో కూడుకొనినది. అందుమూలమున నహంకారము కలదైనది. కృష్ణుని యందు మమకారము కలది. అది ప్రణయము. దానికొర కామె పెనుగు లాడినది. అది భక్తి కాదు. కామము. అందులకే యామె పుణ్యక వ్రత మొనరించినది. ఏరీతి నయినను శ్రీకృష్ణుని తనవాని నిగా చేసికొన వలయు నని యామె తలంపు. అది నెరవేరని నా డామె జీవితము నిరర్థక మని యామె యూహ.

మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిల స
న్మానములకు మూలం బగు
మాన రహిత మయిన బ్రదుకు మానిని కేలా

యని యామె జీవితమునకు మూల సూత్రము. అది భ[illegible] [illegible]యినది. ఆవేశము నొందినది. భర్తను పసుల కాపరి యనియు వల్లవీ కింకరు డని తూలనాడినది. అది వానియందు ప్రేమ లేక కాదు. చనవుచేత. ఆ చనవు అనురాగ సహితము.

పతి ప్రాణ సదృశ బంధువు
పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు

నని యామె యెరుంగును. అట్లే యామె శ్రీకృష్ణుని యెడ నమ్మకము కలిగి వర్తించినది. ఈ రెండు సత్యభామ పాత్ర పోషణకు నాధారము

లుగా గొని కవి కావ్యమును రచించెను. శ్రీకృష్ణుడు విష్ణువనియామె యెరుగును. సత్యభామది కృష్ణుని యెడ భర్తృ ప్రేమ కాని దైవ భక్తి కాదు. భక్తిని ప్రధానముగా గొని ప్రదర్శించినచో తిమ్మన కావ్య మింత రమణీయముగా నుండెడిది కాదు. అది పౌరాణిక మయి జనాహ్లాదము కలిగించెడిది కాదు. శ్రీకృష్ణుడు రుక్మిణికి కుసుమము నిచ్చినాడు. అది సత్య దృష్టిలో పతి మేర తప్పుట. అందుకని

పతియ కడు మేర దప్పిన
గతి కుల కాంతలకు వేఱు గలదే చెపుమా

యన్నది. ఆ తప్పిన మేర దక్కించు కొనుటకు అపరాధి యగు భర్తను నిందించినది. మరల మేరలోనికి తెచ్చుకొనినది. పారిజాతా వృక్షమును తెప్పించుకొని మానము గాపాడు కొన్నది. ఇది యా పాత్ర తత్త్వము.

గట్టి + వాయి = గట్టి వాయుగును అనగా గట్టి నోరు కలవాడు గయ్యాళి యని భావము. గట్టివ చేత లనగా గయ్యాళివాని పను లని యర్థము. ఇచట ధూర్త కృత్యము లని వ్యాఖ్యానించుట చెల్లదు. ధూర్త కృత్యము లనగా మోసపు పను లని యర్థము. కుసుమము రుక్మిణి కిచ్చుట గయ్యాళి తనము పోట్లాటలమారి పని. ఇది సమంజస మగు నర్థము. కథకు సముచిత మయినది. అట్టి పనివలన పోట్లాట పొడమినది. కావున నది గట్టివచేత యని కవి యభిప్రాయము. పసలు అనగా చాతుర్యము. పోట్లాటపని చేసి సత్యను బ్రతిమాలుట కృష్ణుని చాతుర్యమును దెల్పును. ఇవి పసలని సత్య భావము. కల్లతనంబు లనగా చెడ్డచేతలని వ్యాఖ్యానించుట తగదు. కల్లతనంబు లనగా నబద్ధములని యర్థము. ప్రేమ కొలంది కుసుమము రుక్మిణి కిచ్చి సత్య యందు ప్రేమ నటించి బ్రతిమాలుట కల్లతనము. కావుననే 'నింపకు లేని కూరిములు' అన్నది సత్య. ఇవి శ్రీకృష్ణుడు పుట్టగాఁ బుట్టిన వట.

చక్కని వ్యావహారిక దేశీయము. ఎందు లేని పలు పోకలు కృష్ణునకు వెన్నతో పెట్టినవట. ఇట్టి చక్కని వ్యావహారికములు చొనిపించి పద్యమునం దమృత జీవము పోసినాడు తిమ్మన. తెనుగు సాహిత్యమునం దిట్టివి పొందు పరచి తెనుగుతనము పోషించినవాడు తిమ్మన. స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధ దియః. తిమ్మన దేశ భాషాభిమాన మాతని తెనుగుతనములో నున్నది. శ్రీకృష్ణుని యిట్టి గుణంబు లెఱింగియును బేలతనంబున నమ్మినదట సత్య. అట్లు నమ్ముటకు బేలతనము కారణము. అందు మూాల మున తన గుట్టును తేజమును గోల్పడి పోయినదట. గుట్టు అనగా మర్మము. ఇది స్త్రీసహజ మగు మనస్సునందలి రహస్యము. మాన మనుట చెల్లదు. తేజ మనగా ప్రభావ మని యర్థము వ్రాసిరి. కాంతి యని యర్థము. నా రహస్యము కాంతి గోల్పడితిని అన్నది సత్య. ఇవి భార్యాభర్తల యనురాగ సంబంధ మయినవి. భార్య భర్తకు తన యంతరంగమునందలి రహస్యము లన్నియు ప్రేమ కొలంది విప్పి చెప్పును. ఒక్కటియు దాచదు. తేజము అనగా కాంతి. అది యౌవనమువలన కలుగునది. తేజము గోల్పడితి ననగా యౌవనము వ్యయించితి నని భావము. మనస్సునందు గుప్త మొనరించుకొనిన రహస్యములు, వయస్సు నీకు సమర్పించుటచేత గోల్పడినదాన నయి తిని. ఇప్పు డేమి చేయుదును అన్నది.

మునిపతి వచ్చి పూవొసఁగి మోదముతోడ భవ త్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినిన వీనుల మా చవి గాని మాటల
న్విన వలసెం గదా యిప్పుడు నీ విట వచ్చుట పారిజాత వా
సన ప్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె చెప్పుమా

అని కొంత దీనత ప్రకటించినది సత్యభామ. 'సేయన కాదె చెప్పుమా' అనుటలో నా దైన్యకము ద్యోతక మగుచున్నది. ఇచ్చట నుండి కోపము దీనతగా మారినది. తరువాత విషాదయయి కన్నీరు కార్చి

నది. ఇది కావ్య కథకు అవరోహ ణారంభము. సత్య గయ్యాళి తనము ఒక్క భర్త విషయుననే కాదు. సర్వత్ర ప్రకటించుట యామె స్వభావ మయినది. నంద నోద్యాన పాలకులతో

విను డు సురేశ్వరు వన పాలకులు! వార్ధిఁ
బొడమిన యీ దివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వండు
తోడి యిందిరయును గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిది యేమి యొకరి సొమ్మె
యిదె నాదు విభునిచే నీ వదాన్య నగంబు
నొడియించుకొని యేగు చున్నదానఁ

బలుకు లేటికిఁ దాన వీర పత్ని యేని
వి్హా శచీదేవి తనదు ప్రాణేశుఁ డైన
మఘవు నిటఁ బంపి సత్యభామా విధేయు
వలన మరలంగఁ గొనుటపో వాసితనము

ఇంత గయ్యాళితనము మరే యితర కాంతలయందు కనిపించదు. తోడి కోడలు శచీదేవి. ఇంద్రుడు బావగారు. పెద్దవాడు. త్రిలోకాధిపతి. ఆమె గయ్యాళితనము వారినైనఁ జీరికిఁ గొననీయలేదు. ఇంద్రాణి యెవ్వతె యింద్రుఁ డెవ్వఁడట. తాన వీర పత్నియేని శచీదేవి తనదు ప్రాణేశుఁడైన మఘవు నిటఁ బంపి సత్యభామా విధేయువలన మరలంగ గొనుట వాసి యని సవాలు చేసినది శ్రీకృష్ణుని గట్టివ యని నిందించినది సత్య. కాని యింత కంటె గట్టివాయి ప్రపంచమునందింకొకతె యుండదు. సత్యభామా విధేయుఁడట శ్రీకృష్ణుడు. అది యామె గర్వము. గర్వము కాకేమి. తోడి యిందిరయును గౌస్తుభమును నెవ్వఁ డధిపుఁడై ధరియించె నాతఁడే శ్రీకృష్ణుడు.

అతడు మహావిష్ణువు. అవతార పురుషుడు. పరతత్త్వము, జగదేక వీరుడు, మహామునులకు సయితము పట్టుపడనివాడు. అంతటివాడు తన భర్త. భర్తయే కాదు పరమ విధేయుడు. ఇంక నామె గర్వము నకు పట్టపగ్గము లెక్కడివి. ఆ గర్వ మామెను గయ్యాళిగా చేసి నది. ఆ గయ్యాళితన మామెను భర్తనే కాదు. నారదునే కాదు. ఇంద్రాదులను సైతము లక్ష్యపెట్ట నీయలేదు. అందరి నొక్కవరుస నిందింప చేసినది. తన యెడ నేర మొనరించినవారి నాడిపోసికొన పురికొల్పినది. భారతమునందు ద్రౌపది పాత్రయు నిటువంటిదే. ద్రౌపది సత్య పాత్రలు కావ్య ముఖమున చక్కగా పోషించి కృత కృత్యు లయినారు తిక్కన తిమ్మనలు. ఆవేశము పొందిన యాడ దానిచేత మాటలాడింప వలయుననిన తిక్కనయే మాటలాడింప వలయును. అలిగిన యాడదానిచేత పలికింప వలయు ననిన తిమ్మన యే పలికింప వలయును. ద్రౌపదీ సత్య లభిమానవతులు, పతి వ్రతలు, వీరపత్నులు, గర్వితమతులు. వారిని తీర్చి దిద్దిన తిక్కన తిమ్మ నలు తెనుగుతనము గల మహాకవులు. ఆ తెనుగుతనము వారిని సార స్వతమునందు విశిష్ట స్థానము కల్పించినది. ఆ రచనా మాధుర్యము ఇంకొకరియందు లేదు. తిక్కనయందు కంటె తిమ్మన పలుకులలో ముద్దుతన మున్నది. దానికి కారణము విప్రలంభ శృంగారము. తిక్క నయు తిమ్మనయు వారి వారి ప్రధాన సూత్రముల నాదర్శముగా గొని యా యా పాత్రలను చిత్రించిరి. సిద్ధ సంకల్పు లయిరి. ద్రౌపదీ సత్య లిరువురు భర్తృ కృతాపరాధలు. ద్రౌపది మాఅట నోటిది. సత్య పేరలుకం జెందిన ప్రణయిని. ఈ విషయ మది వరకే నుడివితిని. వలపు గల ప్రౌఢచేత పలికించుటలో పెద్దన పెద్దరికము గల మహాకవి. తిమ్మన పెద్దనలు స్వతంత్ర భావములు గల ప్రబంధ కవులు.

నిందాలాపములతో సత్య కోప మంతయు చల్లారినది. ఎకస క్కెము చేయన కాదె చెప్పుమా యని పద్యము నంతము చేయుటలో

కోపము డిందుపడి దైన్యము తోచుచున్నది. ఆమె యధీర రాలయి నది. కాని యభిమానము వీడలేదు

> నన్ను నాతోడి సవతులు నగక మున్న
> పంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాక

యని బెదిరించినది. ఇట్టి బెదరింపులు స్త్రీలకు సహజము. ఆ దైన్యము

> ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే
> గాసిలి యేడ్చెఁ బ్రాణ విభు కట్టెదుటన్ లతాంగి పంకజ
> శ్రీ సఖమైన మోము పయిఁ జేల చెఱం గిడి బాల పల్లవ
> గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూ కల కాకలీ ధ్వనిన్

తిమ్మన లోకోత్తర కవితా మాధుర్యము కలవాడు. స్త్రీజనుల ప్రవృత్తి చెయ్దములు ననుభవమునం దున్నవాడు. చెయ్దములే కాదు మాటలు కూడ పుణికి హృదయ గతము గావించు కొనినవాడు. రుక్మిణి యందలి యీసునఁ బుట్టిన కోపము ఆధిక్యతవలన శోకముగా పరిణ మించినది. ఆమె ఆడది. యేమిచేయ గలదు. కన్నీరు కార్చినది. స్త్రీల కార్య సాధనకు తిరుగు లేని సాధనము కన్నీరు. దానిచేత నెట్టి కార్య మయిన సాధింతురు. అది వజ్ర హృదయములను మూాల ముట్టుగా కరిగించును. కావున పంకజ శ్రీసఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి యేడ్చినది. ఆ యేడ్పులోని సంకులత చివరి పాదమునందలి సమాసములోని వృత్త్యనుప్రాసవలన కవి రమ్యముగా ప్రదర్శించినాడు. అందు చెవి కింపగు కల కలత కలదు. గుండెను కరిగించి జాలి కొలిపించు రసత్త్వము కలదు. పదముల పొందికలో నిమిడి యేడ్పులోని కంఠ ధ్వని వినిపింప చేయు రచనలో ముద్దు కలదు. కావుననే ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా నేడ్చినా డన్నాడు తెనాలి రామకృష్ణుడు. ఆ ముద్దుతనము పదముల కూర్పులో నున్నది. దానిని చదువు నపుడు

తిమ్మన రచన కొక విధమగు నవ్వు వచ్చును. సత్య యేడ్పు విన వచ్చును. అలసాని పెద్దన యీ స్థితియందే

పాటున కింతు లోర్తురె కృపా రహితాత్మక నీవు త్రోయ ని
చ్చోటభవ న్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచు న
ప్పాటల గంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గల స్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బ చను మిట్టల నశ్రులు చిందు వారఁగన్

అని వర్ణించినాడు. ఇది కుములం బారి తన యత్నము నిష్ఫల మగుట చేత నేడ్చిన యేడ్పు. ఇందు కన్నీటికి ప్రాధాన్యము. తిమ్మన రచనలో నేడ్పు ధ్వనికి ప్రాధాన్యము. ఈ తారతమ్య మెరుగక తెనాలి రామకృష్ణుడు అల్లసాని పెద్దన ఆవురు మని యేడ్చె నన్నాడు. అకారము యతికొరక కన్నమాట. వరూథిని ఆవురు మని యేడ్వ లేదు. కావుననే కన్నీటి ధారలు చను మిట్టలందు జాలువార నేడ్చిన దని నాడు పెద్దన. అతడు రసికుడు. ఈ పద్యములను చూచి భట్టుమూర్తి

తరువాత చాలమంది కవు లేడ్పులు సాగించినవారు కలరు. సత్య విలాపమునకు శ్రీకృష్ణుని హృదయము కరిగినది. జాలి పొడమినది.

ఆ రమణీ లలామ మది నంటిన కోప భరంబు నిల్వఁగా
నేరక నెవ్వగం బొగుల నీరజ నాభుఁడు నిండుఁ గౌఁగిటం
జేరిచి బుజ్జగించి నునుఁ జెక్కు-లఁ జాలుకొనంగ జాఱు క
న్నీరు కరంబునం దుడిచి నెయ్యముఁ దియ్యముఁ దోప

నీకు దేవతా కేలి వనంబు సొచ్చి తెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్

అనినాడు. సత్యకు కావలసినదే యది. తిట్లతో నేడ్పుతో తన పని సాధించు కొన్నది. రుక్మిణి యాదిలక్ష్మి. అది సత్యభామకు తెలియును. ఆమెకంటె ఘనత సంపాదింప వలయునని సత్యభామ తలంపు. అది నెరవేరినది. కృష్ణుడు తనకు విధేయు డని లోకమున

కెరుక పరచినది. శ్రీకృష్ణుడు మాయగాడు. ఎవరె ట్లాడించిన నట్లా డును. అది నటన

ఏ యే వేళల నే సరోజముఖి యే యే లీలలం గోరుఁ దా
నా యా వేళల నా సరోజముఖి నా యా లీలలం దే

ల్చుచుండును. అంతటితో ప్రథమ రంగము ముగిసినది. తిమ్మన సత్యభామ పాత్రను పురాణాంగనగా చిత్రింప లేదు. మానవ సామాన్య లక్షణములు గల యువతిగా రూపొందించెను. ఆ కారణముచేత కావ్యమునకు శోభ కలిగినది. అసలు సత్య పాత్ర పోతనయు నట్లే తీర్చి దిద్దెను. భాగవతములోని భ్రమర గీతములు తిమ్మన నాకర్షించి యుండును. తిమ్మనను మించినవాడు పోతన. వాని భ్రమర గీతములలోని భావముల పోలికలు సూక్ష్మ ప్రాయముగా నందందు సత్య పలుకులలో కనిపించును. కాని గోపిలకు సత్య పాత్రకు చాల భేద మున్నది. ఆ భేదము వారి రచనలోను నగుపించును.

నంది తిమ్మన మూలమునందలి కథను చాల మార్పులు చేసెను. తనకు ననుచితము లని తోచినవి విడిచి పుచ్చెను. కావ్య లక్షణముల కుచితము లని తోచినవి పరిగ్రహించెను. కొన్నిటిని కథా విధానమునకు తగి నటుల మార్చెను. తిమ్మన దృష్టి సంప్రదాయ సిద్ధములైన కావ్య లక్షణములపైన ప్రసరించినది. పాత్ర పోషణ వాని ప్రధాన కర్తవ్యము. శ్రీకృష్ణుడు పారిజాత తరువునకై పరమేశ్వరుని గురించి తపము గావించె నని మూలమునందు కలదు. దానిని మార్చెను. అది పౌరాణికము. శ్రీకృష్ణుడు ధీరోదాత్తుడు. ధీరోదాత్తుడు శౌర్యము ప్రదర్శించుట లాక్షణికము. అందు మూలమున సత్యభామతో స్వర్గమున కరిగి యింద్రునితో రణ మొనరించెను. పారిజాత మపహరించి తెచ్చెను. ఇట్లు తిమ్మన మూలమును కొంత సవరించి తన కావ్య కథను నడిపించెను. మార్గ మధ్యమున మేరువు,

కైలాసము మొదలగువాని నెల్ల శ్రీకృష్ణుడు సత్యభామకు వివరించి చెప్పుచు మార్గ శ్రమంబు కలుగ నీయకుండ పయనము తూగించెను. వర్ణనలు పాఠకునకు విసుగు పుట్టింప కుండుటకయి నాటక పద్ధతి నవలంబించి నాడు కవి. ఇది కావ్యమునందు వినూతన విధానము. వీనిని హృదయమునం దుంచుకొని పింగళి సూరన ద్వారకా పుర వర్ణన మాతలి యింద్రుల సంభాషణలో నిమిడించెను. దానిని గమ నింపక విమర్శకులు కొందరు పింగళి సూరనను గగనమున కెత్తి ప్రభావతీ ప్రద్యుమ్నము వంటి కావ్యము తెనుగున లేదనియు శుచి ముఖి పాత్ర లోకోత్తరమైన దనియు వ్రాసిరి. వారి యనుయాయులు నాశ్రయులు ఆ విమర్శ వంటిది ప్రపంచమున నింకొకటి లేదని కైవా రము చేసిరి. సరిగా తెనుగు సారస్వత పరిశీలన చేసినవారు శుచి ముఖి పాత్రకు మూలము నైషధ రాధామాధవ కావ్యములందు కలదని యూహించు కొన లేక పోరు. ప్రభావతీ ప్రద్యుమ్నమున సూరన చూపిన గొప్పతన మేమియు లేదు. కళాపూర్ణోదయ కథా కల్పనయందు మాత్ర మాతని ప్రతిభ చెప్పుకొన తగినది. అది పద్య రూపమున నున్న నవల. కవితలో ఘనత లేదు. శ్రీకృష్ణుడు సత్య భామకు వర్ణించి చెప్పిన పద్యముల నుండి మచ్చుకు

కిన్నరకంఠి! చూచితివె కిన్నరులం గలధౌత భూధరా
భ్యున్నత శృంగ భాగముల నుత్పల గంధులుఁ దాముఁ గల్పకో
త్పన్న మధు ప్రసంగతులఁ బాడెదర రింద్రుని మీఁది గీతముల్
కిన్నర లొయ్య నొయ్యఁ బలికించుచుఁ దారతర స్వనంబులన్

పారిజాత వర్ణనము నుండి

తరుణీ ! యీతరు శాఖాం
తర లోల దుకూల మారుతము లింద్రాణీ
పరివార వార సతులకుఁ
బరువపు విరికోఁత బాడము బడలిక నడంచున్

వారణరాజయాన ! సురవల్లభుఁ డాశచి నంక పీఠముం
జేరిచి సోగ వెండ్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీ నవాం
భోరుహ నాళ సూత్రములఁ బొందుగ దీని లతాంతము ల్సరు
ల్గా రచియించి నించుఁ గుతుకంబున వీఁగు మెఱుంగు క్రొవ్వెదన్

నంది తిమ్మన సర్వ స్వతంత్రు డయిన తెనుగు కవి. అతని తెనుగు తన ములో మృదుత్వ మున్నది. మాధుర్య మున్నది. రచనలో పాఠకుని మనము నాకర్షించు లాలిత్య మున్నది. తిమ్మన వ్యావహారికములగు తెనుగు పదముల పొందికలో అంద చందము లున్నవి. ఈ అంద చందములు అల్లసాని పెద్దనయందును కనిపించవు.



శ్రీ

# అల్లసాని పెద్దన

తెలుగు సారస్వత చరిత్రమునందు కావ్య యుగము రెండవది. దాని కాది కవి యలసాని పెద్దన. ఆయన నందవరీక బ్రాహ్మణుడు. నియోగి. బళ్ళారి ప్రాంతమునందలి దోపాడు పరగణాలోని దోరాల వాని నివాసము. మనుచరిత్ర పెద్దనగారి గుణ శీలములను స్వభావ పాండిత్యములును ప్రతిబింబించు నిగ్గుటద్దము. అందలి యితివృత్తమును బట్టి ఆయన హరి హరులందు భేద భావము లేని విశిష్టాద్వైతి యని తోచును. నాయకు డగు ప్రవరునకు వాడిన వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడు ఇత్యాది విశేషణములను బట్టియు పాత్రను దిద్దిన తీరులను బట్టియు పెద్దనకు పూర్వమీమాంస యనిన మిగుల నభిమాన మని యూహింప వలసి యున్నది. అతడు వేద విదుడు. ఉపనిషద్వేది. శఠకోప యతికి శిష్యుడయి వైష్ణవమును స్వీకరించెను.

కొలుతున్ మద్గురు విద్యా
నిలయున్ గరుణా కటాక్ష నిబిడ జ్యోత్స్నా
దళి తాశ్రిత జన దురిత
చ్ఛల గాఢ ధ్వాంత సమితి శఠకోప యతిన్

శఠకోప యతి విద్యా నిలయుడు, మఠాధిపతి. పెక్కు వైష్ణవ మత సిద్ధాంత గ్రంథములను సంస్కృతమునందు రచించిన మహాపండితుడు. వానియొద్ద రామానుజ భాష్యాది వైష్ణవ మత గ్రంథములు పెద్దనగారు చదివి యుందురు. అంత మాత్రముచేత వైష్ణవము గురుత్వమున కంగీకరింపదు. వానివలన శంఖ చక్రాంకితుడు కావలయును. అది వైష్ణవ గురు శిష్య సంప్రదాయము. పెద్దన శఠకోప యతివలన విద్య నభ్యసించుటయే కాక చక్ర ధారణము కూడ నొందెను. దురిత ధ్వాంతము నుండి బైట పడెను. ఆ కారణముచేతనే పై పద్యమునందు విద్యా

నిలయు డని కరుణా కటాక్ష జ్యోత్స్నా దళితా శ్రిత జన దురిత ధ్వాంతుడని శఠకోపయతికి రెండుసార్థకము లగు విశేషణములు వాడెను. దానికి ప్రతిఫలముగా రాయలవారు తన కిచ్చిన కోకటాగ్రహారమునకు శఠకోప పుర మను పేరు పెట్టి గురువునందుగల కృతజ్ఞతను వెల్లడించెను. పెద్దనార్యుని వైష్ణవ మత స్వీకారము రాయలవారి కొలువునందు చేరక మునుపు జరిగి యుండును. వాని విద్వత్కవితా వైదగ్ధ్యమునకు తోడి వైష్ణవము రాయలవారి యభిమానమును మరింత పెంచినది. పెద్దన యెంత వైష్ణవాభిమానము కలవాడైనను తరువాతి వైష్ణవ కవుల వంటివాడు కాడు. తరువాతి వైష్ణవ కవులు విష్ణు సంబంధ మగు నితివృత్తములను మాత్రమే సేకరించిరి. కృత్యాదియందు విష్ణువును, విష్ణునాయుధములను, గరుడుని, విష్వక్సేనుని, పన్నిద్ద రాళ్వారులను వినుతించిరి. వారందరు వీరవైష్ణవులు. పెద్దన యట్లు కాడు. తొల్లింటి కవుల వలె త్రిమూర్తులను వినుతించి యూరకుండెను దానికి కారణమాయన సర్వ మత సామరస్యము. అదియే మను చరిత్రయందు కానిపించును. రాయలవారు పెద్దన కవితా పాటవమునకు మెచ్చుకొని కోకటాద్యనేకాగ్రహారము లొసంగెను. మడీ మాన్యములిచ్చెను. అవి పెక్కు చందాలం బందు చుండును. వాని యింటియందు పాడి పంటలకు తరుగు లేదు. ఆ మహాకవి ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామన స్తుతి పరత్వమున లేచును. అది వైష్ణవ సంప్రదాయము. తుంగభద్రా నదియందు నఘమర్షణ స్నాన మాచరించును. సంధ్యావంద నాది క్రియా కలాపములు నిర్వర్తించుకొనును. ఇంటి కరుదెంచి యగ్ని కార్యములు ముగించుకొనును. ఇది వాని దిన చర్య. ఇంక నతిథి అభ్యాగతుల పూజను గురించి చెప్ప వలసిన పని లేదు. అది యా రోజులలో నిత్యకృత్యము. దీనినే ప్రవరుని పాత్రయం దారోపించి ద్వాపర యుగమునందలి పురాణ పురుషుని కలియుగమందలి యొక విశిష్ట పురుషునిగా రూపించినాడు మహాకవి పెద్దన. ఇట్టి నవీన సంప్రదాయములను

పురాణ సంప్రదాయములతో పొందు పరచి మనుచరిత్ర కథా రచన సాగించెను. ఇది క్రొత్త పద్ధతి. పూర్వ కవు లెవరు చేసినది కాదు. మనుచరిత్ర రాయలవారి మెప్పు పొందుట కిది యొక కారణము. పెద్దన కావ్య కర్తయే కాదు. ఆశు కవిత్వమునందు గడితేరిన మహా కవి. రాయలవారు సాహితీ సమరాంగణ సార్వభౌముడు. కత్తి పట్టి రణంబునం దరాతి వీరుల కుత్తుక లుత్తరించిన యా చేతితోడనే పసిడి గంటము పట్టి నవరసములు వెల్లి విరియ విష్ణుచిత్తీయమును ప్రబంధించెను. విరామ కాలమునందు కవితా గోష్ఠి ఆయన వినోదము. యుద్ధ మా మహారాజున కొక యాట. దండెత్తి పోవు నప్పుడు సైతము వెంట కవులను గొనిపోవు చుండును. యుద్ధ క్రీడ ముగియ గానే కవితా గోష్ఠి యారంభ మగును. తన మెప్పు వడసినవారికి బహుమానము లొదవించు చుండును. కవిత్వమునం దాయనకు ప్రత్యేకాభిమానము కలదు. ఆ నాడు రాయలవారు సింహాసనాధిష్ఠితులయి యుండిరి. మంత్రులు సామంతులు దండ నాథులు రాయబారులు గాయకులు పండితులతో సభ క్రిక్కిరిసి యుండెను. సభా లాంఛనము లన్నియు ముగిసి పోయినవి. వందిమాగధులు కైవార మొనర్చిరి. కవులు కీర్తించిరి. రాజ నర్తకి నాట్యమాడినది. కొలువు నిశ్శబ్దముగా నుండెను. రాజ భటుడొకడు కొలువు కూటమునందు ప్రవేశించెను. వాని చేతిలో నొక బంగారు పళ్లెర మున్నది. దాని మీద పసిండి జీనిపనితనము గల బుకమల్ రుమాలు కప్పబడి యుండెను. రాజ భటుడు సరాసరి సభాసదుల మధ్యాయం దుండి పోయి మహారాజును సమీపించెను. పళ్లెరమును రాయల యెదుట నుంచెను. అందరి దృష్టులు దాని మీద పడినవి. మహారాజు కను సన్నన రాజ భటుడు రుమాలును తొలగించెను. కొలువులోని వారల కనులు మిరుమిట్లు గొలుపుచు పెనుగారు జాతి రత్నముల కాంతులు నలు దెసల వ్యాపించినవి. అది యొక గండ పెండెరము. అందు నవ రత్నము లతి మనోహరముగా పొదగ

బడినవి. రాయలు మంద హాసము గావించెను. ఒకసారి గండపెండెరము వంక చూచెను. కను మలపి కవుల వంక పరికించెను. నేడు మహాకవుల పంట పండిన దని యందరు తలంచిరి. ఇట్టి మనసు లూరించు బహుమాన ప్రదానము రాయలవారికి నిత్య వినోదములలో నొకటి. సంస్కృ తాంధ్రములందు సమానముగా కవిత్వము చెప్పగలవారికీ గండపెండెరము అని రాయలవారు నుడివి యూరకుండిరి. తెనుగు కవుల మనస్సు లూట లూరినవి. ఊహాలు కొండలు ప్రాకినవి. ఆశలు మిన్నంటినవి. ఎవరికి వారు స్వప్న లోకమునందు విహరింప నారంభించిరి. రాయలవారి యభిప్రాయమును గుర్తించినవారెవరు లేరు. క్షణ మయినది. రెండు క్షణములు గడచినవి. ఎవ్వరు నోరు మెదలింప లేదు. నా కొసంగు డని ధైర్యము చేసి యడుగ లేదు. తమ ప్రతిభను వెల్లడించుటకు చొరవ చేయ లేదు. రాయలు ముఖము ముఖము తెనుగు కవులను పరిశీలించెను. నిస్పృహ చెందెను. శ్రీవారికి తెనుగనిన మహాప్రీతి. తెనుగు వాణిని నవరత్న ఖచిత మంజీరముతో స్వయముగా నలంకరింప వలయు నని యుబ్బూత లూగుచుండెను. దేశ భాషలందు తెలుగు లెస్స యని యకలంక మగు చిత్త వృత్తితో నుడివిన మహారాజకవి శ్రీకృష్ణరాయలు. తన యుబలాటము నిరర్థకము కారాదు. అనర్హులను సత్కరింపరాదు. తన కార్యము సర్వ జన సన్నుతమై యుండ వలయును .అది యా మహారాజు పట్టుదల. సభా మధ్యమునం దుభయ భాషా వాణి మంజీర కాంచన కాంచీ గుణ కింకిణీ కంకణ ఘులం ఘులారాములతో నాట్యమాడ వలయును. అది సభికులకు తనకు శ్రవణ రసాయనము కావలయును. హృదయాహ్లాద మొనరింప వలయును. వహవ్వా యనిపించ వలయును. ఆ కవి పాదమునకు గండపెండేరము తొడగ వలయును. తన కోర్కె తీర వలయును. అది యా మహారాజకవి తలంపు.

ముద్దుగ గండపెండియరముం గొనుఁ డంచు బహూకరింపఁగా
నొద్దిక నా కొసంగు మని యొక్కరుఁ గోరఁగలేరు లేరొకో

అని మరొక సారి హెచ్చరించినాడు శ్రీరాయలవారు. మొదట మాటలతో. ఈ తడవ కవనముతో. రాయలు సాహితీ సార్వభౌముడు. ఆశు కవనమున కాయన రసన రంగస్థలము. తన యభిప్రాయ ముత్యాల మాలికలో ఐాదివి వెలయించినాడు. అందు ఒక రకముగా నాశ్చర్యము సంప్రశ్నము నిమిడి యున్నవి. అది పరీక్ష. దానికి నిలువగలవారసమాన ప్రతిభావంతులైన యాశు ప్రబంధ రచనా ధురంధరులు కావలయును. ధైర్య సాహసము లుండ వలయును. పాండిత్య ప్రకర్షయు సమయ స్ఫూర్తియు నుండ వలయును. పదములు పద్య రూపములో నొకటి వెంట నొకటి శర వేగముతో వచ్చి వాల వలయును. అవి రసవంతములు కావలయును. వీనియం దేది లోపించినను పరాభవము తప్పదు. తిమ్మన తికమక లయ్యెను. ధూర్జటి నిర్జీవి యయ్యెను. వీరు ప్రబంధ కవులు. మిగిలిన వారు మేను ముడుచుకొని కూర్చుండిరి. రాయల సంప్రశ్నము ముల్లుకట్ట పోటయినది పెద్దనగారికి. నిద్ర నుండి లేచిన కొదమ సింగము వలె సభా మధ్యమున నిల్చెను. ముఖము కొంచెము యెఱ్ఱబడిన దేమొ కూడ.

> పెద్దనఁ బోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
> పెద్దన కీఁ దలంచినను బేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా !

అని సగర్వముగా గర్జించినాడు. రాయలవారి ప్రాసను చక్కగా వినియోగించు కొనినాడు పెద్దన. అందును పాదాది పద యమకముతో. సమయస్ఫూర్తియు పాండిత్యము నట్లుండ వలయును. అందుకనే పెద్దనఁ బోలు పండితులు పృథ్విని లేరని సంపూర్ణ విశ్వాసముతో చెప్పుకొన గలిగెను. ఆ మాటయం దబద్ధము లేదు. సంస్కృత ప్రాకృ తాంధ్ర భాషలందు మహాపండితుడు పెద్దన. కన్నడ మాయనకు మాతృభాష వంటిది. అందలి సాహిత్య గ్రంథములు పుక్కిలి పట్టియుంచెను. అతడు వైష్ణవుడు. వైష్ణవులకు ద్రవిడ ప్రబంధములు వేదముల వలె పవిత్రములు. వానిని దేవతార్చనావసరమున నిత్యము

పఠించు చుందురు. దేవాలయములందు పాశురములు చదువు చుందురు. అవి యన్నియు నరవభాషయం దున్నవి. వానిని చదివి యర్థము చేసికొనుటకు వైష్ణవులు తమిళము నభ్యసింతురు. అదియు గాక తమిళము వైష్ణవుల భాష. అది రానిచో వైష్ణవులు గౌరవింపబడరు. కావున పెద్దన తమిళము నభ్యసించి యుండును. అందు పాండిత్యము సంపాదించి యుండును. శాస్త్ర పాండిత్యమును గురించి యదివరకే ముచ్చటించితిని. ఇన్ని భాషలయం దిట్టి పాండిత్యము కలవాడు కావు ననే యంత గర్వముగా చెప్పకొన గలిగెను. చెప్పకొనుటయే కాదు రాజును ముఖ మెదుట 'నెఱుంగవా?' యని ప్రశ్నించెను. అది యొక విధముగా గద్దింపు. రాయల ప్రశ్నకు తగిన సమాధానము. పెద్దన మిగుల గడసరి. గౌరవమునకు విఘాతము కలిగి నప్పుడు అధికార మును పరిగణింపడు. అది పండితుల లక్షణము. అంతటితో నూర కుండ లేదు పెద్దనగారు. తన పెద్దరికము లోకమునకు ప్రదర్శింప వల యును. సభ్యుల నానంద పరచ వలయును. రాజును మెప్పించ వలయును.

> పూత మెఱుంగులుం బసరు పూప బెడంగులు చూపు నట్టివా
> కైతలు

అని కుకవితా నిరసనముతో తన యాశు కవితా ప్రబంధ కల్పనమును ప్రారంభించినాడు. పైఁ బై మెఱుంగులును పసరు పూప కాయల యందమును ప్రదర్శించు నట్టివి కవిత్వము లనిపించు కొనవు. వానిని నోట పట్టి చవి చూచినచో వగరుగా నుండును. తియ్యనగు రస మే మూలను కనిపించదు. అట్టి కైతలు వాచవి కానేరవు. వానిని లోకము ప్రశంసింపదు. అని దాని యభిప్రాయము. అది యొక వేళ తన తోడి కవులను గురించిన విమర్శన మైన గావచ్చును. అందు నంది తిమ్మ నాదులు గూడ నిమిడి యుండ వచ్చును.

ఏ
గతి రచియింపఁ గొన్న సమకాలపు వారలు మెచ్చరే కదా!

అన్నాడు చేమకూరి వేంకట కవిరాజు. అట్లు కానిచో పెద్దన తన యాశు కవిత నా విధముగా ప్రారంభించి యుండడు. తరువాత కవిత యన నెట్లుండ వలయునో యిరువది తొమ్మిది పాదములలో వర్ణించెను. అందు పదునైదు పంక్తు లచ్చ తెనుగు. మిగిలినవి సంస్కృతము.

జగ్గు నిగ్గు నెనగా వలె గమ్మన గమ్మన న్వాలెన్
రాతిరియున్ బవల్ మఱపు రాని హొయల్ చెలి యారజంపు ని
ద్దా తరితీపులం బలెను దారసిల న్వాలె లోఁ దలంచినన్
బాఁతిగఁ గైకొన న్వాలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁతలన న్వాలెన్ సొగసు కోర్కులు రావలె నాలకించినన్
జేతి కొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే
ల్మూఁతల చన్ను దోయి వలె ముచ్చటగా వలెఁ బట్టి చూచినన్
డాతొడ నున్న మిన్నుల మిటారపు ముద్దుల గుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండు వలె వా చవి గావలెఁ బంట నూదినన్
గాతల తమ్మిచూలి దొర కైవసపుం జవరాలి సిబ్బెపు
న్మే తెలి యుబ్బరంపు జిగి నిబ్బర పుబ్బగు గబ్బి గుబ్బ పొం
బూఁతల నున్న కాయ సరి పోడిమి కిన్నెర మెట్ల బంతి సం
గాతపు సన్న బంతి బయకారపుఁ గన్నడ గౌళ పంతు కా
సా తత తాన తానల పసం దివు టూడెడు గోట మీటు బల్
మ్రోఁతలునుం బలెన్ హరువు మొల్లము గావలె నచ్చ తెన్గు లీ
రీతిగ

అని యచ్చ తెనుగు కవనంపు పోకడల యంద చందములు నిరూపించుచు మొదటి భాగమును ప్రకటించెను. నన్నయ మొదలు పెద్దన వరకు పెక్కుమంది కవులు జన్మించిరి. వారి వారి శక్తి సామ

ర్థ్యములను బట్టియు ప్రతిభలను బట్టియు కవితలను వెలయించిరి. ఈ విధముగా నొక్క బిగువున నచ్చ తెలుగు పదముల పొందికతో నాశువుగా కవిత నల్లినవారు లేరు. రాయల వలె ఇట్టి కఠిన పరీక్ష కావించిన రాజులును లేరు. దానికి దిట్టలై యెదురు నిలిచిన కవులును లేరు. ఒక్క యలసాని పెద్దన మాత్రమే తెనుగు సారస్వత చరిత్రమునందు వీరాధివీరుడై కనిపించు చున్నాడు. ఆశు కవితా రచనకు వేములవాడ భీమకవి మొదటివాడు. రెండవవాడు శ్రీనాథుడు. భీమకవి కంటె శ్రీనాథుడు ఘటికుడు. ఆ మహాకవియు నేక ధాటిగా నొక్క వృత్తమునం దిన్ని పంక్తు లాశువుగా నచ్చ తెలుంగు పదముల కూర్పుతో కవనము చెప్పినటుల కనిపించదు. సర్వజ్ఞసింగ భూపతి కొలువు కూటమునందు

దీనార టంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణా ధీశు ముత్యాల శాల

ఈ మాదిరి పద్యములు ఒకటి రెండు చెప్పి యుండ వచ్చును. చాటు పద్యము లనేకములు నుడివి యుండ వచ్చును. అ వన్నియు నాశువు లనుటకు వీలు లేదు. సావకాశమును బట్టి యాలోచించి చెప్పిన పద్యములు కావచ్చును. వానియందైన నీ జిగియు బిగియు కానిపించదు. ఇట్టి కైత ప్రదర్శించుటకు హృదయ పూరిత మయిన కవితావేశ ముండ వలయును. భాషా పాండిత్య మలవడ వలయును. సమయ స్ఫూర్తి దానికి తోడు కావలయును. పలుకు చాతుర్య ముండ వల యును. వినూతన భావాంకురములు మొలక లెత్తి రావలయును. వ్యంగ్య స్ఫూర్తి దాగుడు మూత లాడుచుండ వలయును. అట్టి ప్రతిభా విశేషములు అల్లసాని పెద్దనగారియం దున్నవి. అందుకనే యాలవా రా మహాకవిని

ఎదు రైనచోఁ దన మద కరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించు కొనియె

ను. ఇంత యాదరాభిమానము లే రాజున కే కవియందు కలుగ లేదు. శ్రీనాథు నకు పైడి పళ్లెరములందు పంక్తి భోజనములు లభించినవి. దిన వెచ్చములు చేకూరినవి. కస్తూరి లోటు లేకుండ చేపడినది. ఆ గౌరవములు దీనికి తుల కావు. అంతే కాదు. రాయలు పెద్దనగారికి

కోకట గ్రామా ద్యనే కాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె

నట. ఇది యింక నుదాత్త మయిన సంగతి. రాజు లగ్రహారము లిచ్చుట ఇచ్చిన చోట పరిగృహీత పుచ్చుకొనుట లోకములోని సంగతి. నోరు మెదలించుటకు వీలు లేదు. పెద్దనగారికి రాయలవా రడిగిన చోట నగ్రహారము లొసంగినాడట. ఎంత స్వాతంత్ర్యము, ఎంత అభిమానము! విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం. రాజు కవి. కవితా ప్రియుడు. పెద్దన కవితా పితామహుడు. వా రిరువురకే యా మర్యాదలు తగిపోయినవి.

కవిత్వ మొక యంగన. నిండు ప్రాయంపు బిగువునం దన రారు నంగంబుల పొంకంబు గలది. అది జగ్గు నిగ్గు నెనగా వలెనట. జగ్గు నిగ్గు అనునవి మంచి యూత పదములు. ఉచ్చారణ మాత్రము చేతనే వాని యర్థములోని గట్టితనము వెల్లడి యగుచున్నది. పెద్దన భావానుగుణము లయిన పదముల నేర్చి కూర్చుటలో నతి సమర్థుడు. జగ్గు నిగ్గు అను నది ద్వంద్వ సమాసము కాదు. సమాహార ద్వంద్వ మును గాదు. రెండును రెండు వ్యస్త పదములు. జగ్గున్ నిగ్గున్ అని జిగి బిగి వంటివి. వానిని వ్యస్త పదములుగా నంగీకరించి నపుడే యుదాత్తత యున్నది. జగ్గు అనగా తళతళ యని యర్థము. ఆ తళతళ పుష్టివలన లభించును. కవిత్వమునందలి పదము లర్థ పుష్టి కలవయి యుండ వలయును. అందు మూలమున కావ్యాంగన ప్రాయంపు జవరాలి వలె తళ తళలు కలదయి మెరయు చుండును. అర్థ పుష్టి కల శబ్దములు పెక్కు లుండ వచ్చును. ... నియందు

సందర్భమునకు తగిన వగు నిగ్గు గల పదముల నేర్చి కవనమునందు వాడుచుండ వలయును. నిగ్గు అనగా సార మని యర్థము. అర్థ పుష్టికితోడు శబ్దములు సారవంతములయి యుండ వలయు నని భావము. అనగా శబ్దము లర్థ పుష్టియు సారస్యము గలవయి యుండ వలయు నని ఫలితార్థము. అప్పుడు కవిత జగ్గు నిగ్గు నెన సిన దగును. జగ్గు అనునది పదముల కూర్పునకు కూడ సమన్వ యించుకొన వలయును. అర్థ పుష్టికల పదము లొండొంటితో నెనసి కూర్పునందు బిగువు కలిగి యుండవలయును. అప్పుడు కవిత వికాసము కలిగి నిగ్గులు తేర్చు చుండును. దీనికి దృష్టాంతముగా మను చరిత్రయందలి

ఆ మందిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీ క్షాపేక్షన్

అను పద్యమును గ్రహింప వచ్చును. ఇందలి పదము లన్నియు నర్థ పుష్టి గలవి. వానియందు చక్కని సారస్య మిమిడి యున్నది. వాని కూర్పులో బిగువు పొందుకొని యున్నది. ఇట్టి పద్యములు జగ్గు నిగ్గు కల వగును. ఇది కావ్యాంగన బాహ్య స్వరూప మగు శయ్యను గురించిన సంగతి. అది యామె శరీరము. దాని నుండి మనస్సున కబ్బురపా టొదవించు భావములు గుప్పున బయ ల్వెడలు చుండ వల యును. గమ్మున గమ్మనన్ వలయునట. పద్మిని జాతి యువతుల మొదలి నుండియు నూర్పులయం దుండియు పద్మ గంధము వెడలు చుండు నని కామ శాస్త్రము. కావున నంగనకు పద్మగంధి యని పుష్పగంధి యని కవులు వాడుచుందురు. అట్టి సువాసనలు కవనంపు విరిబోడి శరీర మగు శబ్దార్థముల నుండి వెలువడు చుండవలయును. భావములకు సువాసనలకు నుపమే యోపమానములు. ఉపమేయము

ధ్వనితము. గమ్మ్ము అనునది సుగంధము ప్రసరించుట యందలి యనుకరణము. ఇందు మూలమున సుగంధమును దాని బట్టి భావమును వ్యంజనా వృత్తివలన ధ్వనితములు. భావంపు సువాసనలు గమ్మ్మున పొడమ వలయునట. గమ్మ్మనన్ అనునది అన్వయ క్రమమునందలి వేగిరపాటు తెలుపు పదము. గమ్మ్మన వీతెంచు నెత్తావుల వలె భావములు పాఠకుని హృదయమునకు క్లిష్టత లేకుండ వెంబడినే పొడకట్ట వలయును. అవి హృద యాహ్లాద కరముగా నుండ వలయు నని పెద్దనగారి యభిప్రాయము. అట్టి కవిత ద్రాక్షాపాకమునం దుండును.

ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ గాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమి మాట లేటికిన్

ఇందలి శబ్దార్థముల నుండి చక్కని సారస్యము గల భావములు గమ్యమానములయి కావ్యాంగన నెమ్మేనఁ బొడము నెత్తావులనఁ బాఠకుని చిత్తమును రంజింప చేయును. కావ్యమునందు వర్ణింపబడు నాయిక హావ భావ కటాక్ష లీలా విలాసాదు లయిన శృంగార చేష్టలు కావ్యాంగన హొయలు. అవి యెంత మనోహరముగా వర్ణింపబడిన పాఠకుని మనస్సంత యాకర్షించు చుండును. అవి ప్రియురాలి మనోహరము లగు నిద్దంపు తరితీపులం బలె రేయిం బవళ్ళు మరపునకు రానీయక పాఠకుని తలంపునకు బారు చుండును. ఆనందము నొదవించు చుండును.

చూచి ఝుళం ఝుళ త్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులుం దురుము లేనడు మల్లల నాడ నచ్చటం
బూచిన యొక్క పోక నును బోదియఁ జేరి విలోకన ప్రభా
వీచికలం దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్

మనుచరిత్ర చదివిన యే మానవు డిందలి వరూధిని శృంగారంపు చెయ్దిమును మరచి పోగలడు. పద మంజీరంబులు ఝుళం ఝుళ లీన లేచి కుచంబులుం దురుము లేనడు మల్లల నాడ పోక నును బోదియం జేర నరిగి విలోకన ప్రభా వీచికలు వెల్లిగొన ప్రవరు నరయు వరూథిని కనుల యెదుట నిరంతరము కనిపించును. ఇట్టి మనోహార సంఘటనము మరచి పోవుద మన్నను మరపునకు రాదు. రేయిం బవళ్ళు కనుల యెదుట తారసిల్లు చుండును. కవి కావ్యమునందు వర్ణించు నిట్టి శృంగార భావములను తలంచు నపుడు నిజముగా నా సంఘటనము జరుగు చున్నటుల భ్రాంతిని కలిగింప వలయును. అదియే కవితా శిల్పము. అట్టి శిల్పము పై పద్యమునం దున్నది. ఆ పద్యమును చక్కగా విమర్శించుకొని చదివిన వానికి వరూధిని చరణ నూపుర ఝుళం ఝుళ ధ్వనులతో నరుగు చున్నటుల కనిపించును. ఝుళం ఝుళారవములు పైదలి కుత్తుకలో ని పల్లటీ కూతల వలె చెవులకు పండువుగా వినిపించును. వాని నాలకించు నపుడు పాఠకుని చిత్తమునందు వింత వింత లగు కోరిక లుప్పతిల్లును. ఈ సంగతి శృంగార రసాను భవముగల రసికులకు తెలియును. చెలి యను శబ్దమునకు ప్రియురా లని యర్థము. చెలి యారజంపు నిద్దా తరితీపులం బలె రాతిరియుం బవల్ మరపు రాని హాయాయాలు తారసిల న్వలె ననుటచేత పెద్దన యీ యాసు కవితా ప్రబంధమునందు కావ్యాంగనను నాయకురాలిగాను పాఠకుని నాయకునిగాను చేసి నుడివె నని యెరుంగ వలయును. కావ్యాంగనను పాఠకుడు పట్టి చూచినచోఁ జేతి కొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మేల్మాగతల చన్నుదోయి వలె ముచ్చటగా నుండ వలయునట. ఎంత చక్కని యభిప్రాయము? అలంకార శాస్త్ర మంతయు నిండిమిడి యున్నది. నాయకుడు నాయకురాలిని నిండు కౌగిట చేర్చి స్తనములను పట్టి చూచును. అట్లే కావ్యాంగనను పాఠకుడు హృదయ గతము గావించుకొని పట్టి చూచును. కావ్య

పరమునందు పట్టి చూచుట యనగా గట్టిగా విమర్శించి చూచుట అని అర్థము. అప్పుడు కవిత కన్నియ చిన్ని పొన్ని మేల్మొత్తల చన్ను దోయి వలె ముచ్చటగా నుండ వలయునట. వయసు మీరిన యువతి చనులు దిగజారి పలపలనై బిగువు లేక చూడ ముచ్చటగా నుండవు. కావున కన్నియ చిన్ని పొన్ని చన్నుదోయి అని వాడినాడు కవి. అవి నాతి కఠినములయి బిగువు కలిగి నిక్కి యుండును. అట్లే వర్ణితము లయిన విషయములు నీరసములు గాక సారస్యంపు బిగువు కలిగి మిగుల రసవంతములై యుండవలయు నని కవి భావము. ఇందొక వింత విశేష మున్నది. కన్నియల చనుదోయి చేపట్టి పుణికినచో కామో ద్రేకము వలని మరింత యుబికి బిగు వెక్కు చుండును. ఈ సంగతి రసి కుల యనుభవమునం దుండును. అట్లే పాఠకుడు విమర్శించి చూచిన కొలంది రస పుష్టి కలదియై వినూతన భావములు పొడము చుండ వలయును. అవి యౌత్తరాహి స్తనముల వలె నిగూఢముగా నుండ రాదు. ద్రావిడీ స్తన యుగము వలె నిగూఢముగా నుండకూడదు. ఆంధ్రి యురోజముల వలె గూఢాగూఢముగా నుండ వలయును. కావునే పెద్దన మేల్మొత్తల చన్నుదోయి అన్నాడు. ఇటు వంటి రస వంతమును భావ గర్భితము నగు కవిత్వము ఆశువుగా చెప్పుట చాల కష్ట సాధ్యము. లోకోత్తరమగు ననుభవ ముండ వలయును. సన్నని పైట చెరంగు మేల్మొత్తలలో నుండి స్తనములు పైడి మిసమిసలు వెలువరించు చుండును. ఉబుకులను ప్రదర్శించు చుండును. చూచువారి కువ్విళు లూరించు చుండును. తళుకు బెళుకులం బట్టి యా చందోయి యంద చందము లూహించుకొన వచ్చును. అట్లే శబ్దార్థముల మూల మున లక్షణ వ్యంజనా వృత్తుల నాశ్రయించి మరుగు పడి గమ్యా గమ్యము లయి యుండు వ్యంగ్య భావములు మేల్మొత్తల చన్ను దోయి వలె నవగతము లగుచుండ వలయును. మనుచరిత్ర యందలి ఇంతలు కన్ను లుండ, భూసుర కైతవ కుసుమశరాసన, కుందనము వంటి మేను ఇత్యాది పద్యములు అట్టి వ్యంగ్య రస భావములకు

తాత్పర్యాణములు. వానిని పంట నూదినచో అనగా నోరార పఠించు నప్పుడు డాతోడ నున్న మిన్నుల మిటారపు ముద్దుల గుమ్మ కమ్మనౌ వాతెర దొండపండు వలె తియ్యని రస మాధుర్యము కలవయి పాఠకున కానందము కలిగించును. అట్టి వ్యంగ్య రస భావములు గల పద్యము లాలకించు నపుడు శారదా దేవి కొన గోటి మీటుల విపంచి నాలపించు కన్నడ గౌళ రాగముల వలె చెవుల కింపయి యుండ వలయునట. కవితలో మాధుర్య గుణ ముండ వలయు నని పెద్దన యిందు మూలమున నిరూపించెను. మాధుర్య గుణము పద లాలిత్యమువలన గలుగును. ఇట్టి యుత్తమ గుణములు గల కవిత్వము వలన కావ్యము మిగుల శోభించును. దానిని చదివి పాఠకుడు తన్మయము నొందును. అదియే రసానుభవము. ఆనందము దానికి పరిణామము. అదియే రసము. ఆనందో రసః. అట్టి యానందము వలన పాఠకుడు ముగ్ధ డగును. అదియే కావ్య ప్రయోజనము. మను చరిత్ర యటువంటిది. కావుననే అది కావ్య ప్రపంచమునందు అగ్ర స్థానము నందు కొనినది. ఈ కాలమునందు మాధుర్య గుణము గలిగి మనోజ్ఞము లగు రస భావములతో వ్యంగ్యార్థ ప్రతిపాదకము లయిన పద్యములను ద్రాక్షా పాకమున రచించినవారు తిరుపతి కవులు. సారస్వత చరిత్రమునందు వారు యుగ పురుషులు. వారి రచనలలో పాండవ విజయము అన్ని విధముల నుత్తమ కావ్యము. అందలి

ఆఱని లోతు నీటి కొల నక్కట పూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలి పోయినవి రేకులు తొంబది తొమ్మి దిప్పు డా
నీరజమందుఁ దా మిగులునే యొక రేకటు లుండెఁబో యలం
కారము తానె యా కొలను గాని సరోజము గాని భూమికిన్

అను పద్యమునందు అప్రస్తుత మగు తొంబది తొమ్మిది రేకులు రాలి పోయి యొక్క రేకు మిగిలి యున్న తమ్మిని ప్రశంసించుటచేత ప్రస్తుత విషయ మగు భారత ఘోర రణంబునందు తొంబది తొమ్మిది మంది మనుజులను గోల్పోయి తా నొక్కడు మిగిలి యున్న రాజరాజు

సంగతి గమ్యమాన మగు చున్నది. ఇట్టి మనోహరము లగు పద్యములు పాండవ విజయమునందు చాల కలవు. అది ప్రథమ శ్రేణికి చెందిన కావ్యము. ప్రస్తుత గ్రంథ కర్త తన వీర విహార మను కావ్యమునందు

గ్రీష్మ కాలాని లాహతి వృంత మెడల
రాలి వాడు వారిన సుమ రాజ మెలమిఁ
దేనె లానంగ నిచ్చునో తేటి గమికిఁ
దావి నించునో మాళి కందమ్ము గాఁగ

అను పద్యముచేత అప్రస్తుత మగు వృంత మెడల రాలి వాడువారిన సుమ రాజము ను వర్ణించెను. ప్రకరణమును బట్టి యనవేమా రెడ్డి తోడి యుద్ధమునందు భర్తను పుత్రుని గోల్పోయి కడ ప్రాణముతో నున్న బాల దేవి దీన స్థితి వ్యంగ్య రూపమున ధ్వనింప చేసినాడు కవి. ఇవి యలంకార కృత వస్తు ధ్వనులు. ఇట్టి పద్యములు మహాకవుల కావ్యములందు జాతి రత్నము లయి మనోహరము లగు భావంపు వెలుగులను ప్రదర్శించు చున్నవి.

అలసాని పెద్దన మృదులము లగు పదముల పొందికతో సమాసములను సాగదీసి పెంపొందించుటలో చాల నేర్పరి. యాదోనాథ సుతా కళత్రుడు, చతురాస్య వంశ కలశోదధి పూర్ణ శశాంకుడు. ఇత్యాదు లరయ వచ్చును. ఆశు ప్రబంధమునందు మొదటి భాగము చివరి నాలుగు పంక్తు లొకటే యచ్చ తెనుగు సమాసమును వాడెను. అది పెద్దన ప్రతిభ యను కమ్మచ్చునం దుండి సాగ తీసిన బంగారు తీగ. అందు కనులను మిఱుమిట్లు గొలుపు నబ్బురంపుఁ గ్రొమ్మెరుగులు పొడము చుండును. ఇట్టి రచనా వైదగ్ధ్యము ఒక యలసాని పెద్దన యందు మాత్రమే కనిపించును. ఆ సమాసము కూర్పునందు జిగియు బిగియు గలవు. తెనుంగు వాణి వాలారు కొన గోటి మీటుల నాలపించు విపంచి మీది కన్నడ గౌడ రాగములు వినినతరువాత ఎడ తెగని మృదంగ నినాదములు వోలె సంస్కృత కవిత్వ తత్వ నిరూపణమును గావించినాడు పెద్దన. సంస్కృతం బుపచరించు పట్టున

భారతీ వధూ
టీ తపనీయ గర్భ నికటీ భవ దానన పర్య సాహితీ
భాతిక నాటక ప్రకర భారత భారత సమ్మత ప్రభా
శీత నగాత్మజా గిరిశ శేఖర శీత మయూఖ రేఖికా
పాత సుధా ప్రపూర బహు భంగ ఘుమం ఘుమ ఘుంఘు మార్భటీ
జాతక తాళ యుగ్మ లయ సంగతి చుంచు విపంచికా మృదం
గాతత తేహి తత్తహి తహోధిత దందణు ధాణు దిం ధిమి
వ్రాత నయానుకూల పద వార కుహూ ద్యహ హారి కింకిణీ
నూతన ఘల్లలా చరణ నూపుర ఝూళ ఝళీ మరంర సం
ఘాత వియద్ధునీ చక చక ద్వక చోత్పల సార సంగ్రహో
యాత కుమార గంధవహ హారి సుగంధ విలాస యుక్తమై
చేతము చల్ల చేయ వలె జిల్లునఁ జల్ల వలె న్మనోహర
ద్యోతక గోస్తనీ ఫల మధు ద్రవ గోఘృత పాయస ప్రసా
రాతి రస ప్రసార రుచిర ప్రసరంబుగ సారె సారెకున్

అని వచించినాడు పెద్దన మహాకవి. సంస్కృతము దేవ భాష. అందు పెద్దన యుపయోగించిన యుపమానములు అన్నియు దైవతములు. అందు వినిపించినవి పార్వతీ పరమేశ్వరుల శిరోలంకార మగు చంద్ర రేఖ నుండి జారి పడు సుధా పూర తరంగముల ఘుమం ఘుమార్భటులు మృదంగముల ధిమిం ధిమి రావములు తాళ లయానుసంగతములు. ఇందులకు మనుచరిత్రలోని

అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిర స్సర ఝ్ఝరీ
పటల ముహు ర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నట నానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలముం
గటక చర త్కరేణు కర కంపిత సాలము శీత శైలమున్

అను పద్యమునందలి అభంగ తరంగ మృదంగ నిస్వనములు లక్ష్యములు. చరణ నూపుర ఝూళ ఝళులు "చూచి ఝళం ఝళ త్కటక సూచిత వేగ పదారవిందయై" అను పద్యమును తలంపు నకు

తెచ్చును. వియద్ధునీ వికచోత్పల సార సంగ్రహాయాత కుమార గంధవహా హారి సుగంధి విలాసము

ఉల్లల దలకా జల కణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద బంభర
మల్ల ధ్వను లెసఁగ విసరె మరు దంకురముల్

అను పద్యమునందు కలవు. ఆశు కవితయందు సూచించిన లక్షణముల కన్నిటికి మనుచరిత్రలోని పద్యములు లక్ష్యములుగా నున్నవి. కావున నీ యాశు కవిక అల్లసాని పెద్దన మనుచరిత్రను దృష్టియం దుంచుకొని చెప్పెను. దీనిని బట్టి ఈ యాశు కవితా పరీక్ష మనుచరిత్ర రచనానంతరము జరిగిన దని యూహించుకొన వచ్చును. మనుచరిత్రయందు అతి దీర్ఘము లగు సంస్కృత సమాసములు వాడి నను పదములు గోఘృత పాయసము వలె మృదు మధురములయి గోస్తనీ ఫల పాకమున పద్యము లుండును. సంస్కృత మతి గంభీర మగు భాష. తెనుగతి సున్నిత మగు భాష. కల్పనలు భావములు నూహలయందు కూడ చాల తారతమ్య ముండును. రెండు భాషల తత్త్వ రహస్యము లెరిగినవాడు పెద్దన. ఆ యా సంగతులను విశేష ములను పెద్దన ఆశు కవితయందు శబ్దముల మూలముననుభావముల మూలముననుఉపమానముల మూలముననునిరూపించెను. వాని నన్నిటిని తెల్పుటకు చాల గ్రంథము పట్టును.

నేను కనకాభిషేక సమయమందు నన్నయ పోతనల దీర్ఘములగు సంస్కృత సమాసంపు బోకడలను గురించి చెప్పుచు వానియందు బంగారు చిరు గజ్జెల కల రవంబులకును మువ్వ గజ్జెల ఘలం ఘలారవ ములకు గల తారతమ్య ముండునని యంటిని. ఇది యా భాష తత్త్వము. పెద్దనయు నంగీకరించిన విషయము. శ్రీనాథుడు 'ప్రౌఢిఁబరికింప సంస్కృత భాష యండ్రు' అని సమ్మతించిన సత్యము. ఊటుకూరి లక్ష్మీకాం

తమ్మగారొక విదుషి మణియట. వేదిక మీదికి వచ్చి యుపన్య సించుచు పోతన్నగారిని గురించి యట్లు ప్రస్తుత గ్రంథ కర్తలు విమర్శిం చినందులకు నాకు చాల కష్టముగా నున్నదని మిక్కిలి యావేశముతో నుడివిరి. 'మందార మకరంద' యను సీస పద్యము నా యావేశాతి శయముననో మరేకారణముననో మధ్య మధ్య మరచిపోయి సభ లోనివా రందియగా నట్టు నట్టులతో రెండు పాదములు చదివి పద్య మెంత కోమలముగా నున్నదో చూడండి అని ముగించిరి. ఆ పాద ములలో దీర్ఘ సమాసములు లేవని అందరికి తెలిసిన విషయము. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు విఖ్యాత కవులు, విమర్శకులు. పోతన గారి యంత్య ప్రాసలలో మృదం గారావముల ముగ్ధాయింపులు వినిపించు నని వ్రాసిరి. దానికి శ్రీమతిగారే మందురో కదా. విమర్శనకు సారస్వ తానుభవము పాండిత్యము నుండవలయును. కవి చిత్త మును గుర్తింప గలిగిన శక్తి యలవడ వలయును.

'కమ్మని జాళువా నొరయ గల్గిన చెక్కుల డెక్కువాఁడు

అని చేమకూర వెంకటకవి యర్జునుని వర్ణించినాడు. నాటి సభ యందు బొడ్డు బాపిరాజుగారు "విజయ విలాసమునందలి పద్య ములు కొన్నిటికి భావములు ఇంకను కుదరనివి చాల కలవు. వానిని వ్యాఖ్యాతలు సరిగా గ్రహించుకొన లేక తప్పులు వ్రాసిరి. చూడండి. అర్జునుడు నల్లనివాడు. వాని చెక్కులు నల్లగా నుండి తీర వలయును. వ్యాఖ్యాతలు బంగారముతో సమానముగా నొరి పిడి పెట్ట తగిన వని వ్రాసిరి. వాని కెక్కడి నుండి పసిమి చెక్కులు వచ్చును. అదికాదు. బంగారము వన్నె చూచు టకు గీటు పెట్టు రాల్లు నల్లగ నున్నగా నిగనిగ లాడు చుండును. అటువంటి బుగ్గలు కలవా డని కవి భావము. అది వ్యాఖ్యాతలకు తెలియ లేదు" అన్నారు. శ్రీమతి ఊటికూరు లక్ష్మీకాంతమ్మగారు మా అన్నగారి అభిప్రాయముతో నేను ఏకీభవించు చున్నాను అన్నారు. శ్రీ బాపిరాజుగారి యాన్వయ మా పాదమునందు కుద

రదు. అర్జున శబ్దమునకు తెల్ల బంగారము, బంగారము అని యర్థములు. అర్జునుడు అను శబ్దమునకు తెల్ల బంగారము వంటి ముఖ తేజస్సు కలవాడని వ్యుత్పత్త్యర్థము. అది వారు మరచి పోయి నారు. ఆ సంగతి గ్రహించిన వారు జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు. వారాసంగతి సూచించి యుపన్యాసాంతమునందు నా వంక చూచి 'శాస్త్రిగారూ! మీరు విజయ విలాసానికి వ్యాఖ్యా నము తప్పక వ్రాయాలి' అని నన్ను హెచ్చరించారు. రుక్మిణీనాథ శాస్త్రిగారు విద్వాంసులు. ఉభయ భాషాకవులు. వైయ్యాకరుణులు. మంచి నిగ్గుదేరిన విమర్శకులు.

అలసాని పెద్దనగారి యాశు కవితా ప్రబంధములోని ప్రధాన సారాం శము నింత వరకు కొంత నుడివితిని. ఇంకను తరిచి చెప్పవలయు నన్నచో గ్రంథము చాల పెరుగును. మిగిలిన విషయములు పాఠకులు గ్రహించుకొన గలరు. నాటను నేటను ఆశు కవిత చెప్పినవారు పెక్కుమంది కలరు. గంటకు నూరు పద్యములు నాల్గు వందల పద్య ములు చెప్పినవారును కలరు. ఆశువునందు యిట్టి మృదు మధు రమై భావ గర్భితమయిన కయిత చెప్పినవా రొక్కరును లేరు. పెద్దన గారి పద జాలమే వేరు. ఈ యాశు ప్రబంధము నాశువుగా విర చించి చదివె నని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పొరపాటు పడి నారు. వ్రాయుట చదువుట యీ పరిషా సమయమునందు పొసగ నేరదు. అంత సావకాశము లేదు. అందును వ్రాయుట పెద్దనగారికి గిట్టని పని. ఆయన మహామేధావి. ధారణ పట్టి చెప్పియుండ వచ్చు నేమొ. అదియు సందేహమే. ఈ మాలిక ఆశువుగా నప్పు డప్పుడు కల్పించి చెప్పె ననుటలో సందేహము లేదు. పద జాల మట్లున్నవి. శృంగార రస కల్పిత మయిన యీ యాసు ప్రబంధమును విన్నారు కొలువులోని వారలు. అబ్బుర పోయి యొడ లెరుంగని వారయినారు. మహా రాజు చెవులయందు కిన్నెర వీణె మ్రోతలు వినిపించినవి. తరంగముల ఘుమంఘుమలు మృదంగముల ధిమింధిమి రావములు శ్రవ

ణముకు విందొనరించినవి. మనస్సుబ్బి పోయినది. మేను పులకించి నది. పరవశత్వమును పొంది తన్ను తాను మరచిపోయినాడు రాయల వారు. సంస్కృ తాంధ్ర వాణుల నాట్య మా రాజకవి కన్నుల యెదుట కనిపించినది. తటాలున సింహాసనము మీద నుండి లేచినాడు.

బిరుదైన కవి గండపెండేరమున కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగె

ను. రాయలు సామంత నరపాల శిరః కిరీట మణి మరీచి సంలగ్న పద పంకజ యుగళుండు. కర యుగంబున పాదము లంటి గండ పెండేరమును తొడిగినాడు. ఇంతకంటె ఘనతి మహాకవుల కింకేమి కావలయును. ఇట్టి మహత్తర గౌర మే కవి కింత వరకు జరుగ లేదు. ఉత్తమ మగు రసవత్కవితా ప్రభావ మటువంటిది. పరులకు తల యొగ్గని సామ్రాజ్య సార్వభౌములను సైతము పద దాసులను గావించు కొనును. వారివలన పనులను చేయించు కొనును. సుక వితా యద్యస్తి రాజ్యేన కిం.

రుచి మరిగిన ప్రాణి (శ్రీ)కృష్ణరాయలవారు పెద్దనగారి కవనంపు పాయసములోని తియ్యందనమును చవి చూచినాడు. దానితో ఆయన తృప్తిపడ లేదు. ఇంకను ప్రాశింప వలయు నని బుద్ధి పుట్టినది. మరొక్క కావ్యమును రచించి తనకు కృతి యిమ్మని యర్థించెను. పెద్దన గడసరి. ఈయ నన లేదు. అడిగినదే చాలు కదా యని యంగీకరింప లేదు.

నిరుపహతి స్థలంబు రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియం గల లేఖక పాఠ కోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే

యని సమాధానము చెప్పెను. ఈ పద్యము అలసాని పెద్దనగారి జీవితము నందలి సుఖ లాల సత్వమును వెల్లడించు చున్నది. కవితా

రచనకు కావలసిన పరికరములను బోధించు చున్నది. నిరుపద్రవమైన స్థల ముండ వలయును. అనగా అలజడులు లేని ప్రశాంత మగు ప్రదేశ మని భావము. రమణీ యనుటచేత తన మనస్సునందు రమించు చుండు నట్టి యందకత్తె యగు యువతి యని యభిప్రాయము. ఆమె యిల్లాలు కావచ్చును. మరెవ్వరైన ప్రియురాలు కావచ్చును. రమణి యను శబ్దములో నా యర్థ మున్నది. ఆమెకు ప్రియురాలగు దూతిక తెచ్చి యిచ్చు కర్పూరపు తాంబూలము చర్వణము చేయుచుండ వలయును. తాంబూలము సంగతి చెప్పిన తరువాత భోజనమును ప్రసంగించినాడు కవి. ఇందు మూలమున పెద్దనగారికి భోజనమునకు పూర్వమునందు కూడ తాంబూలము వేసికొను నలవాటు కలదని యూహింప వలసి యున్నది. ద్రావిడుల కది యలవాటు. కర్నాటు డలసాని పెద్దనగారు. ద్రావిడ సంపర్కమువలన ఆ యలవా టలవడి యుండ వచ్చును. వారికి తాంబూలము ప్రధానము. భోజనము తరు వాతి విషయము. తాంబూల కరండము చంకన మోసికొని పోవు చుందురు. రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పురపు వీడె మనుటలో నొక విశేష భావము నిగూఢమై యున్నది. పెద్దనగా రమిత రసికులు. కావుననే వరూథినీ ప్రవరుల సంభాషణ అంత రసవంతముగా లోక సహజ మగు వినూతన మార్గమున నడిపింప గలిగినాడు. సౌందర్యవతి యగు యువతి శృంగార రసాధి దేవత. ఆమె దగ్గర నున్న ప్పుడు పొడము శృంగార భావములు మిగుల మనోరంజకముగా నుండును. మనసు రసోల్బణము కల దగును. జయదేవుడు సంస్కృత కవి. కృష్ణ భక్తుడు. అష్టపదులు గీత గోవిందము అను పేరుతో రచించెను. అవి శృంగార రస కల్పితములు. అందలి భావము లతి మనోహరములు. కవిత్వము కుసుమ పేశలము. లీలాశు కాదు లగు కృష్ణ భక్తు లనేకులు గలరు. వారి కవితలో ఆ మార్దవము లేదు. ఆ భావోద్రేకము లేదు. జయదేవుడు పద్మావతీ చరణ చారణ చక్రవర్తి. పద్మావతి జయదేవుని భార్య. ఆమెను దగ్గర

నుంచుకొని యష్టపదులను వ్రాసెను. కావుననే అంతటి చక్కని కవిత వెలయింప గలిగె నని రసజ్ఞు లయిన విద్వత్కవులు పెక్కుమంది నుడువు చుందురు. అందు సత్య మున్నది. మాడభూషి వేంకటాచార్యులవారు మహాకవి. ఆయన విద్వత్తును గురించియు ప్రతిభను గూర్చియు నేను రచించిన తిరుపతి కవుల సాహిత్య సమీక్షు, తంజావూరు తెలుగు కవు లను గ్రంథములందు ముచ్చటించితిని. ఆయన కొక యుంపుడుకత్తె వేశ్య కలదు. ఆమెను తన వద్దర నుంచుకొని భరతాభ్యుదయ మను కావ్యము నాశువుగా చెప్పె ననియు ఆ కారణముచేత చక్కని కవితయు రసవంతము లయిన భావములు నందు వెల్లిగొనిన వనియు మా తండ్రిగారు నుడువు చుండెడివారు. రెండు మూడు పద్యము లా కావ్యమునుండి అప్పు డప్పుడు చదివి వినిపించు చుండెడివారు. ఇట్టి కథలు పెక్కులు గలవు. వినూతనము లగు శృంగార రస భావములను పుట్టింప చేయగల శక్తి సౌందర్యవతి యగు స్త్రీ సాన్నిధ్యమునం దున్నది. మృదులము లగు పద జాలములు తదనుగుణముగా పొడసూపు చుండును. ఆ సంగతి పెద్దనగారి కనుభవమున నున్నది. కావుననే రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెము అన్నాడా కవి తల్లజుడు. అంతే కాదు ఉయ్యాల మంచము. ఒప్పు తప్పరయు రసజ్ఞు లుండ వలయునట. ఊహ తెలియం గల లేఖకులు పాఠకు లుండవలయును. పెద్దనగారు సుఖ భోగి. వ్రాత పని విసుగు కలిగించును. అది ఆయనకు గిట్టదు. పద్యముల నాలోచించి మనసులో సరిచూచు కొనును. వానిని ధారణ పట్టి మరునాడు చెప్పు చుండును. లేఖకుడు వ్రాయు చుండును. అంతటితో వాని పని ముగియును. సావకాశముగా కూర్చుండి వ్రాసిన పద్యములను చదివి వినిపించు కొనును. సందర్భమును పట్టి దిద్దుపాటు లున్నచో కావించును. లేఖకుడు దానిని సాఫు వ్రాయును. ఇది ఆయన యలవాటు. ఆయనకే కాదు పూర్వ కవు లందరకు నా యలవాటు కలదు. తిక్కనగారికి గురునాథు డను లేఖకు డుండె ననియు నాతడు

భారతమును తిక్కనగారు చెప్పుచుండగా వ్రాయు చుండెడివా డనియు వదంతి. రాజ కవు లందరు నిట్టి యలవాటునకు మరిగిన వారే. ఇన్ని సౌకర్యము లున్న గాని కావ్య రచన సాధ్యము కాదని అలసాని పెద్దన సమాధానము చెప్పెను. ఆ సమాధానములో రాజసము చతురత, నిర్భయము, కొంటెతనము తొణికిస లాడు చున్నవి. మహా రాజని మొగమోటము పోలేదు. వెనుక ముం దాలోచించ లేదు. అట్టి పరిచయము మహారాజుతో సంపాదించుకొన గలిగినాడు పెద్దన. దానికి కారణము ఆయన యసమాన రసవ త్కవితా వైదుష్యము. శ్రీకృష్ణరాయలవారి కవితా లాలసత్వము. రెండు నేక మయినవి. రాయలవారు పెద్దనగారి నొక ప్రాణ మిత్రుని వలె పరిగణించు కొనెను. కావున నే

హితుఁడవు చతుర వచో నిధి
వతుల పురాణాగ మేతిహాస కథార్థ
స్మృతి యుతుఁడ వాంధ్ర కవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్

అని మనుచరిత్ర కృతి నర్థించు కాలమునందు నుడివెను. అప్పటికే పెద్దనగారి కాంధ్ర కవితా పితామహు డను బిరుదు లభించినది. ఆ కాలమునకే రాయలవారి యాద రాభిమానములు చూరకొనినాడు పెద్దనగారు.

శ్రీకృష్ణరాయలు క్రీ. శ. 1509వ సంవత్సరమున పట్టాభిషిక్తు డయ్యెను. ఆంధ్ర సామ్రాజ్యము నేకచ్ఛత్రాధిపతిగా పరిపాలించెను. తురుష్క రాజులకు ప్రక్కలోని బల్లె మయి ప్రవర్తించెను. తెనుగు దేశ మేలిన రాజులం దంతవాడు లేడనిపించుకొనెను. వీరాధివీరుడయి రాజులను శాసించెను. కవి సార్వభౌముడయి కావ్యములను రచించెను. కవితా ప్రియుడయి సంస్కృతాంధ్ర తమిళ కన్నడ కవులను

పోషించెను. విశేషించి యలసాని పెద్దనగారియందు మిగుల గౌరవాద రాభిమానములు కలవా డయ్యెను. క్రీ. శ. 1530వ సంవత్సరమున దివంగతు డయ్యెను. పెద్దనగారి సగము ప్రాణము లెగసి పోయినవి.

ఆంధ్ర కవితా పితామహా! యల్లసాని
పెద్దన కవీంద్ర! యని నన్నుఁ బిలుచు నట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబ నగుచు

అని శోకించినా డా మహాకవి. అందబద్ధ మేమియు లేదు. వారిరువురకు గల ప్రేమ బంధ మంత ప్రగాఢ మయినది. పెద్దనగారు జీవచ్ఛవ మైనను గావచ్చు. ఆయన కవితలో పుష్టి మాత్రము తగ్గలేదు. అది సజీవమయి పర రాజులకు బుద్ధి గరపు నంతటి తీవ్రత కలదయి యుండెను. రాయలు మరణించినాడు. ఆ యదను చూచుకొని గజపతిరాజు విజయనగర రాజ్యము మీదికి దండెత్తి వచ్చెను. ఆ మాట చెవుల పడినది పెద్దనగారికి. రాయలవారి మీది యభిమాన మొక్క సారి పొంగుకొని వచ్చినది. క్రోధము పెల్లుబికినది. విద్వేషంపు మంటలు రేగినవి. నెత్తురుడుకెత్తినది. రోషము కట్టుత్రాళ్ళు తెంచుకొని వచ్చినది. తాళ పత్రము చేత నందుకొనినాడు. గంటము పట్టినాడు. గడచిన సంగతులు జ్ఞాపకమునకు తెచ్చుకొనినాడు. మనస్సునకంటు భావములు ముందు నడచినవి. వానితో పాటు కవితా వాణి ఘులం ఘుల ఘులారావము లుప్పతిల్ల పరుగు లెత్తినది

రాయరావుతు గండ రాచ యేనుఁగు వచ్చి
యారట్ల కోట గోరాడు నాడు
సంపెట నరపాల సార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాడు
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులు కరుల డీకొల్పు నాఁడు

ఘనతర నిర్భర గండ పెండెర మిచ్చి
　　కూఁతు రాయల కొనకూర్చు నాఁడు
నోడ లెఱుంగవో చచ్చితో యుర్వి లేవో
చేరఁ జాలక తల చెడి జీర్ణమైతో
కన్నడం బెట్లు సొచ్చెదు గజప తీంద్ర
తెఱచి నిలు కుక్క సొచ్చిన తెఱఁగు దోఁప

అని యొక పద్యమును వ్రాసి పంపెను. అందలి ప్రత్యక్షరము పెద్దన గారి యావేశమును వేయి ముఖముల బహిర్గతము గావించు చున్నది. రాయల వారికి వాడిన ప్రతి విశేషణము ఆ మహారాజు నందు తనకు గల గౌరవమును చాటు చున్నది. రాయరాహుతు గండ రాచ యేనుఁగట, సంపెట నరపాల సార్వభౌముడట, రాయల యింటి పేరు సంపెటవారు. సెలగోలు సింహంబట. ఎంత చక్కటి పదముల కూర్పు. ఆ పద సముదాయములు రాయలవారి యసమాన బాహు పరాక్రమమును కనుల యెదుట నిలిపి చూపించు చున్నవి. వానిని చదువు నప్పుడు పాఠకుని మనస్సు పొంగులారి కన్నీటి తరగలు కురియు ననుటలో సందేహము లేదు. పెద్దనగా రీ పద్యమును వ్రాయుచు రాయలవారిని తలంచుకొని ధారాపాతముగా నశ్రువులను దిగ జార్చుచు నెంతని విలపించి యుందురో తెలియదు. సీసములోని నాల్గవ పాదము గజపతిరాజు న్యూనతను వెల్లడించు చున్నది. కూఁతు రాయల కొనకూర్చు నాఁడట. గజపతిరాజు నింతకంటె నవమానముగా పలుక గల మాట మరేదియు నుండదు. కూర్చు శబ్దమునం దొక విధ మగు నీచ భావ మిమిడి యున్నది. తరువాత గీత పద్యమును గూర్చి చెప్ప వలసిన పని లేదు. తల చెడిన వాడుట. గజపతిరాజును కుక్కకు పోల్చినాడు. ఎంత సాహసము. ఎంత ధైర్యము. ఎంత ఈసడింపు. ఆ నిందలకు గజపతిరాజు పెద్దనను తెప్పించి యే శిక్షయైనను చేయ వచ్చును. ఆయన యట్లు చేయ లేదు. అతడు ధార్మికుడు తన్న

యవివేకమునకు అవినీతికి లోలోన సిగ్గిలెను. సేనల మరలించుకొని తిరుగు దారి పట్టెను. కవితా లతాంగి యెంత కోమల స్వభావము కలదో యంత కర్కశ హృదయము కలది. అమృతము జాలువారు నామె సుపేశలములగు మాటల నుండి యొక్కొక్కప్పుడు ప్రళయాగ్ని జ్వాలలు రేగు చుండును. వెన్నెలలు వెదజల్లు నామె కడ కంటి చూపుల నుండి హాలాహల విషానల కీలలు వెలువడు చుండును. అవి చతురంగ బలముల కంటె నతి భయంకరములయినవి. పరాక్రమవంతము లయినవి. వజ్రపాతము కంటె దృఢతమము లయినవి. మహారాజులనే కాదు. దేవతల నైన నామూలాగ్రముగా వినాశము చేయగల శక్తి వానియం దున్నది. కావుననే కవులకు వీరాధి వీరులగు సార్వభౌములు సైతము భయపడు చుందురు. గజపతిరాజున కా సంగతి తెలియును. వేములవాడ భీమకవి కోప మూని క్షణములో మహారాజును భిక్షుకుని గావించినాడు. దయ తలంచి మరల భిక్షుకుని మహారాజును చేసినాడు. కవితా శక్తి యటువంటిది.

> పెద్దాపురపు కోట పెద్దమ్మ కిల్లాట
> కవి వరేణ్యుల కోప కలనఁ గాదె

అన్నారు తిరుపతి వేంకట కవులు. కవులు శ్రేయోభిలాషులు. తామాశ్రయించిన రాజుల కపకారము వాటిల్లినచో చూచుచు నూరకుండ లేరు. తమ కవితా శక్తిని బరపించి వారి నపాయము నుండి తప్పింతురు. తిక్కన సోమయాజి మనుమ సిద్ధికి మంత్రి, ఆస్థాన కవి. మనుమ సిద్ధి నెల్లూరు మండ లాధిపతి. అక్కన బయ్యనలు మనుమ సిద్ధి దాయాదులు. వారు సిద్ధిరాజుపై దండెత్తి వచ్చిరి. యుద్ధమునం దోడించి పద చ్యుతుని గావించిరి. నెల్లూరు మండలము నాక్రమించిరి. ఆ కాలమున నోరుగంటి రాజ్యమును గణపతిదేవ చక్రవర్తి పరిపాలించు చుండెను. తిక్కన గణపతి దేవుని దర్శించెను. సంస్కృత భారతము పురాణముగా వినిపించెను. చక్రవర్తి మన్నన

లను పొందెను. మనుమసిద్ధి దురవస్థను గణపతి చక్రవర్తికి నివేదించెను. వాని సహాయమును బొంది అక్కన బయ్యనల నోడించెను. మరల మనుమసిద్ధిని నెల్లూరు మండలాధిపతిగా ప్రతిష్ఠించెను. మనుమసిద్ధి రాజు ప్రతాపరుద్రునకుఁ దన రాజ్యము నోడిపోఁగాఁ దిక్కనామాత్యుఁడు తన కవితచేఁ బ్రతాపరుద్రుని మెప్పించి మరల నా రాజ్య మాతని కిప్పించెనట. అని మనుచరిత్ర పీఠికయందు వేటూరు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిరి. అది పొరపాటు. మనుమసిద్ధి తిక్కభూపాలుని కుమారుడు. అతడు క్రీ. శ. 1220 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. క్రీ. శ. 1265 ప్రాంతమున మరణించెను. ఆ కాలమున ఓరుగల్లును గణపతిదేవ చక్రవర్తి పరిపాలించు చుండెను. ఆతడు క్రీ. శ. 1260లో మరణించెను. ఆయన యనంతరము రుద్రమదేవి రాజ్యమునకు వచ్చినది. ముప్పది యేండ్లు పరిపాలనము గావించినది. అప్పటి నుండి క్రీ. శ. 1323 వరకు ప్రతాపరుద్ర చక్రవర్తి యోరుగంటిని పరిపాలించెను. అప్పటికి తిక్కన గాని మనుమసిద్ధి గాని లేడు. కావున వారు వ్రాసినది సమంజసముగా లేదు. కాటమరాజు మనుమసిద్ధి నోడించెనను కొందరి విమర్శకుల మాట సత్య దూరము.

తిక్కనయే కాదు. శ్రీనాథుడును నిట్టి మహత్తర కార్యము గావించెను. వెలుగోటిరాజు మాదయ లింగమనీడు. అల్లయ వేముని మీద వైరము వహించి దండెత్తి పోయెను. ఆతనితో యుద్ధ మొనరించి వాని తల నరికెను. అల్లయ వేముని పక్షమువారు సంధి కర్థించిరి. పోతరాజను పేరుగల వేముని కత్తిని లింగమనీడు కోరెను. దానిని గైకొని సేనలను మరలించుకొని పోయెను. శ్రీనాథుడు అల్లయ వేముని యాశ్రితుడు. ఈ వృత్తాంతము నాలించెను. కత్తిని గైకొనుట రాజ్యమును గొనుట కంటె నవమాన కర మయిన సంగతి. అల్లయ వేముని తనయులు దానిని సహింప లేకుండిరి. శ్రీనాథుడు లింగమనీని దర్శించెను. వానిని తన కవితచే మెప్పించెను. కరవా

లమును తెచ్చి అల్లయ వేముని కుమారున కొసంగెను. కవులు తమ జీవితమును విశ్వ శాంతికొర కంకిత మొనరింతురు. తమ కవితను విశ్వ శ్రేయము కొరకు వినియోగింతురు. విశ్వశ్రేయః కావ్యం. పెద్దన

హరికథా సారము

అను కావ్యమును మొదట రచించెను. గ్రంథ నామమును బట్టియు ఛందో గ్రంథములందు కానంబడు

అంబరము పగుల నార్చి ప్ర
లంబాసురుఁ డాగ్రహము వెలయఁ గదిసిన వే
శం బలరాముఁడు చే ముస
లంబున వాని తలఁ ద్రుంచె లావు మెఱయఁగన్

ఆ దేవోత్తముఁడు సుధాం
భోధి నవైకాగ్రిమ దళమున బాలుండై
చేదోయిచేత దక్షిణ
పాదము గొని నోటఁ బెట్టెఁ బకపక నగుచున్

ఇట్టి పద్యములను బట్టియు విష్ణువు దశావతార కథ యందలి యితి వృత్తమై యుండ వచ్చునని తోచు చున్నది. సంపూర్ణ మగు గ్రంథ మింత వరకు దొరక లేదు.

శఠకోప యతికి ఘన తరు
కుఠార కోపమ మతికిని గురుతమ హృత్క
ర్మఠ నిరతికిఁ జతు రాగమ
పఠ నాయత నియతికి నజపా సంభృతికిన్

అను పద్యము పై పద్యములతో పాటు రంగరాట్ చందమునం దుండుటచేత పెద్దన హరికథా సారమును తన గురు వగు శఠకోప యతి కంకిత మొనర్చి యుండును. కావున హరికథా సారము శఠకోప

యతికి శిష్యుడయి వైష్ణవమును స్వీకరించిన తరువాత మనుచరిత్రకు పూర్వము రచించి యుండును. కాని యీ గ్రంథమును గురించిన ప్రస్తావము మనుచరిత్రయం దేమియు లేదు. రంగరాట్ఛందో గ్రంథ కర్త కాలము వరకు నీ ప్రబంధమున కక్క డక్కడ కొంత ప్రచార ముండి యుండును. తరువాత అసలు దానిని తలంచిన వారుండి యుండరు. కావున నది మారుమూల పడెను. మనుచరిత్ర కున్న ప్రచారము హరికథా సారమునకు లేకపోవుటయే దానికి కారణము. పెద్దన వ్రాసిన రెండవ కావ్యము

## మను చరిత్ర

దీనికి స్వారోచిష మను సంభవ మను నామాంతరము కలదు. 'అభ్యుదయ పరంప రాభివృద్ధిగా నా యొనర్పం బూనిన స్వారోచిష మను సంభవం బను మహాప్రబంధమునకు కథా క్రమం బెట్టి దనిన' అని పెద్దన కావ్య కథారంభ మొనరించెను. స్వారోచిషుం డను మనువు పుట్టుకను గురించిన కథ కలదు కావున ఆ నామము కావ్యము నకు సార్థక మయినది. కావ్య కథా క్రమమును బట్టి చూచినచో వరూథినీ ప్రవరుల వృత్తాంతమున కిచ్చిన ప్రాధాన్యము కవి స్వారోచిష సంభవమున కొసంగ లేదు. వనదేవతా స్వరోచులకు మనువు జన్మించిన వృత్తాంతము చివర పది పద్యములలో తేల్చి వేసెను. ఐనను పాత్రయొక్క యౌన్నత్యమును బట్టి యా పేరు పెట్ట బడినది. 'మను చరిత్రం బందుకొను వేళ' నని పెద్దనగారు వాడిరి. నిజమునకు మనువు జన్మించుటయు హరినిగురించి తపం బొనరించుటయు హరి ప్రత్యక్షుంబయి స్వారోచిషుని మనుత్వంబునకు పట్టంబు కట్టి యదృశ్యుం డగుటయు గల యితివృత్త మిరువది పద్యములలో పెద్దన వర్ణించెను. అట్టి యెడ మనుచరిత్రం బని యీ కావ్యమునకు వాడుట యసమం జసము. పలుకుబడి సౌలభ్యముకొరకును గణములలో నిమిడిక కొరకును మనుచరిత్ర మని వాడెను. 'మనుసంభవం బందుకొను

వేళ' యనినచో గణములు ప్రాస యతి సరిపోవును. మనుచరిత్ర మను నామములో గల తేలికతనము దానియం దుండదు. కావున పెద్దన యట్లు వాడె నని తలంప నగును. ఆ పేరు అప్పటికే జనులలో పరిపాటి యైనది. మనుచరిత్ర ఆరాశ్వాసముల గ్రంథము. మొత్తము మీఁద ఆరు వందల యరువది మూడు పద్యము లున్నవి. అందు మొదటి రెండువందల యరువది పద్యములలో వరూథిని వృత్తాంతము కలదు. తరువాతి మూడు వందల యరువది యేడు పద్యములలో స్వరోచి కథ యున్నది. చివరి యిరువది యెనిమిది పద్యములలో స్వారోచిష మనువు చరిత్ర చెప్పబడినది. అప్రధాన మయిన స్వారోచిష మనువు చరిత్రమునకు ప్రాధాన్య మొసంగినాడు పెద్దనగారు. స్వారోచిష మను సంభవమని, మను చరిత్ర మని నామకరణము గావించినాఁడు కావ్యమునకు. ఇది యొక వింత విషయము. మను చరిత్రలోని మూఁడు కథా భాగములకు ముగ్గురు నాయకులు. నాయకురాండ్రు వేరు. కథయందు సమైక్యత లేదని పండితులు వాదింతురు. అది సత్యము. ప్రధాన పాత్ర లయిన నాయికా నాయకులు ఒక్కరే యుండుట మహాకావ్య లక్షణము. అయినను 'రఘూణా మన్వయం వక్ష్యే' యని కాళిదాసు ప్రారంభించిన రఘు వంశమునందు ననేక మంది రాజుల కథ లున్నవి. అది మహాకావ్య మని పండితు లందరు నేకగ్రీవముగా నంగీకరించు చున్నారు. శ్రీనాథుని హర విలాసము నాల్గు కథల సంపుటీ కరణము. దానిని మహాకావ్య మని కవులు పండితులు లాక్షణికులు నొప్పుకొనిరి. కావున మనుచరిత్ర యందు వస్త్వైక్యత లేనంత మాత్రమున మహాకావ్యత్వ సిద్ధికి లోపము రాదు. శ్రీనాథుడు కాశీ ఖండము భీమ ఖండములను రచించెను. వాని దారి ననుసరించి పెద్దన మార్కండేయ పురాణములోని వరూథిని వృత్తాంతము మొదలుకొని స్వారోచిషుడు మనుత్వమున కభిషిక్తుం డగు వరకు గల కథా ఖండ

మును అనుసరించి మనుచరిత్రమును ప్రబంధించెను. మూలములోని రసవంతములగు శ్లోకములను కొలది మార్పులతో యథా తథముగా తెనిగించెను.

ఆయాతి యాతి పున రేవ జలం ప్రయాతి
పక్షాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ
ఉన్మత్తవ ద్భ్రమతి కూజతి మంద మందం
కాంతా వియోగ విధురో నిశి చక్రవాకః

రేయి తన ప్రియురాలిని గానక వెత నొందు చక్రవాకము చర్య లీ శ్లోకమునం దతి మనోహరముగా వర్ణింప బడినవి. చిన్న చిన్న పదముల కూర్పుతో అంత్యప్రాసల యొరపుతో రచన మృదు మధురముగా సాగినది. ప్రియా వియోగము నొందిన చక్రవాకమున కట్టి వర్తనము స్వభావ సిద్ధము. ఇందు స్వభావోక్తి యలంకార మున్నది. దీనిని మనస్సునం దుంచుకొని పెద్దనగారు

ఏ విహంగముఁ గన్న నెలు గిచ్చుచును సారె
కును సైకతంబులఁ గూడఁ దారుఁ
దారి, కన్గొని యది తన జోడు గాకున్న
మెడ యెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి
వదన మెండఁగ సరో వారి నద్దు
నద్ది త్రావఁగ సైఁప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ వీక్షించి భ్రమసి యుఱుకు

నుఱికి యొఱకలు దడియ వేఱొక్క తమ్మి
కరుగు నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదుక
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి.

అని నూతన భావములను చేర్చియు నున్న భావములను పెంచియు సీస పద్యముగా వ్రాసెను. ఇందు ముక్తపద గ్రస్త మను శబ్దాలంకారము స్వభావోక్తి భ్రాంతిమంత మను నర్థాలంకారములు గలవు. మూలమునందలి చక్రవాకః అను పుంలింగము చక్రవాకి యని స్త్రీలింగముగా మార్చెను. కాని శ్లోకమునం దున్న యందము బిగువు సీసమునందు లేదు. ప్రత్యేకముగా సీసమును చదివినచో రసవంతముగా నుండును. ఇట్లె పెద్దన మూల గ్రంథమును దగ్గర నుంచుకొని తడవ తడవకు పరిశీలించుచు మనుచరిత్రమును వ్రాసెను. అంతే కాదు. మారన యాంధ్రీకరించిన మార్కండేయ పురాణము లోని యీ కథా ఘట్టమును కూడ నరయుచు వచ్చెను. కావుననే అందందు వాని పోకడలు మనుచరిత్రయందు కాన్పించు చున్నవి. ఇతివృత్త మొక టైనప్పుడా యా కవుల పోకడ లరయుచు తన దారిని కావ్యమును విరచించుట దోషము కాదు. శ్రీకృష్ణరాయలు

మనువులలో స్వారోచిష
మను సంభవ మరియు రస సముంచిత కథలన్
విన నింపు కలి ధ్వంసక
మనఘు భవ చ్చతుర రచన కనుకూలంబున్

కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పు మని కర్పూర తాంబూలంబు వెట్టినాడు. పెద్దన ప్రబంధ రచనకు పూను కొనివాడు. 'రస సముంచిత కథలన్ విన నింపగు నను టచేత మను చరిత్ర ఒక కథ కాదు పలు కథలు కలది అని పెద్దనయే యంగీకరించెను. రాయలవారికిని దెలియును. ఆ కథలు పెద్దనగారి చతుర రచనల కనుకూలంబులట. అవును కవి తన చతురత కనుకూల మగు కథను స్వీకరించ వలయును. రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడె మనుటలోనె పెద్దనగారి శృంగార ప్రబంధ రచనా చాతుర్యము వెల్లడి యగు చున్నది. దానికి వరూథినీ ప్రవరుల

సంభాషణము నిరుపురి పాత్రపోషణలు తారాకాణములు. పెద్దన తన చతురత గురించి మనుచరిత్ర కథను గ్రహించెను. అది తన మనో భావముల కనుగుణముగా నున్నది. దానిని కావ్యముగా రచించెను. ఉత్తీర్ణు డయ్యెను. స్వశక్తిని గుర్తించుట కవి లక్షణము. నన్నయ భారతమును తెనిగింప నారంభించెను. ఆది సభా అరణ్య పర్వ సగ భాగము వ్రాసెను. మరణించెను. తిక్కనకు నన్నయకు మధ్య రెండు వందల సంవత్సరములు గడచినవి. పెక్కుమంది కవులు పుట్టిరి, గిట్టిరి. ఎవరు భారతము జోలికి పోలేదు. ఎవరి సమర్థత వారికి తెలియును. భారతమునకు నమస్కరించి యూరకుండిరి. అట్లే అరణ్య పర్వ శేషము. రామాయణము రచింప గల సమర్థులు పుట్ట లేదు. వాల్మీకి కున్న శక్తి తెనిగించిన వారికి లేదు. కావున నది లోటుపడి యున్నది. వాల్మీకి రామాయణమున కున్న కీర్తి తెలుగు రామాయణాలకు రాలేదు. స్వశక్తి కనువగు నితివృత్తము కవి గైకొన వలయును. లేనిచో కావ్యము పరిహాసముల పాలగును. పెద్దన మనుచరిత్రమును రాయలవారి కంకిత మొసంగెను. రాయలు వైష్ణవ మతావలంబి. విశేషించి తిరుపతి వేంకటేశ్వరుల పాదభక్తుడు.

కరుణాకర వేంకట విభు
చరణ•స్మరణ ప్రశంస సంగత మతికిన్
శ్రీ వేంకటేశ పద ప
ద్మావేశిత సదయ హృదయ

ఇత్యాదు లరయునది. అల్లసాని పెద్దన వైష్ణవుడు. విష్ణు భక్తుడు. వైష్ణవ కవులలో మొదటివాడు. కావున మనుచరిత్రమును

శ్రీవక్షోజ కురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలా సమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారు సనందనాది నిజ భక్త శ్రేణికిం దోచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభ దృష్టిం గృష్ణరా యాధిపున్

అని ప్రారంభించినాడు. ఇది మంగళా చరణము. మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని చ కావ్యాని ప్రథంతే. అందు 'ఆశీ ర్నమ స్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖం అని' యుండుటచేత 'రాజీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరా యాధిపున్' అని యాశీర్వాదము. శ్రవ్య ప్రబంధము లాశీర్వాదముతో ప్రారంభించుట తెనుగు భాషయందు మాత్రమే కాన్పించు చున్నది. సంస్కృతము కావ్యములు

వాగర్థా వివ సంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే
పార్వతీ పరమేశ్వరౌ

అని నమస్కారముతో గాని

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః

అని వస్తు నిర్దేశముతో గాని ప్రారంభించుట యిలవాటు. నన్నయ తిక్కనలు భారతమును నమస్కారముతో ప్రారంభించిరి. పోతన భాగవతమును శ్రీకైవల్య పదంబు చేరుటకునై మహానందాంగనా డింభకుని చింతింతు నని యారంభించెను. మో భూమి స్త్రీ గురు శ్రియం వితనుతే యనియు

ఫడఫడి శ్రీకారము కృతి
మొదల నిలిచి దోష పుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుప మినుమును
గదిసి సువర్ణంబు సేయు కరణిన్ ధరణిన్

అనియు నుండుటచేత (శ్రీ)కార మాదియందు గల మగణముతో పద్యమును పెద్దన ప్రారంభించెను. ఈ యాచారము సంస్కృత కవులందంతగా నగుపించదు. కాళిదాసు 'వాగర్థావివ' యని మగణముతో రఘువంశ మారంభించెను. భారవి 'శ్రియః కురూణా మధిపస్య పాలినీం' అని (శ్రీ)కారముతో కిరాతార్జునీయము మొదలు పెట్టెను. కావ్యమునకు మొదటి పద్యము నాంది వంటిది. అందు కావ్యార్థ సూచన కావించుట మహాకవుల లక్షణము. హరి యురమున గల కురంగనాభమును విశ్వంభరా దేవిగా సనంద నాది భక్తులు తలంచి రనుటవలన వరూథిని గంధర్వుని ప్రవరునిగా భ్రమించుట సూచింప బడినది. ఈ పద్యమునందు భ్రాంతిమ దలంకారము ఉత్ప్రేక్ష కలవు. ఇట్లు అల్లసాని పెద్దన శివుని బ్రహ్మను విఘ్నేశ్వరుని వేరు వేరు పద్యములందు వినుతించెను.

చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లి చే
    సిందూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబునం దున్న యెల దేఁటి
    రుతి కించి దంచిత శ్రుతుల నీన
ఘన మైన రారాపుఁ జనుదోయి రాయిడిఁ
    దుంబీ ఫలంబు తుందుడుకుఁ జెంద
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరకట్టు
    లింగిలీకపుఁ వింత రంగు లీన

నుపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీ కాసనమునఁ గూర్చుండి మదికి
నించు వేడుక వీణ వాయించు చెలువ
నలువ రాణి మదాత్మలో వెలయుఁ గాత

ఇది సరస్వతీదేవి రూప వర్ణనము. ఈ పద్యమును చదవగానె చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లి, అందుండి జారు నమృతముచేత

చెమ్మగిల్లిన నుదుటి సిందూర తిలకము, చెవియం దలంకరించు కొనిన కుసుమంబు, అందు శ్రుతుల నీను చున్న మెలదేటి, బోటు లయి యోలగించుచున్న ఉపనిషత్తులు, పుండరీ కాసనమున కూర్చుండి యంగుళుల కెంజాయవలన దంతపు సరకట్టుల కింగిలీకపు వింత రంగులొదవ వీణ వాయించు చున్న సరస్వతీదేవి కనుల యెదుట సాక్షాత్కరించును. ఆ మాతృ దేవతా మూర్తికి పాఠకుడు ఇరు చేతులు జోడించి అరవిందాసన సుందరీ ముపాస్మహే యని యర మోడ్పు కనుదోయితో నమస్కరించును. పెద్దనగారి పరిపూర్ణ రూప శిల్ప రచనా చాతుర్యమునకు లోలోన మెచ్చుకొనును. ఒక్క చిరు నగవు చిలికించును. పెద్దన మృదు మనోహర మగు పద జాల మను కుంచెను భక్తి రసమునందు ముంచి సరస్వతీ దేవిని నిండారు మనంబుతో నిరుపహతి స్థలంబునఁ దలంచుట కు యోగ్యమైన నయన గోచరము కాగా తీర్చి దిద్దిన ప్రతిచ్ఛంద మీ పద్యము. అందు దేవతాత్వము మూర్తుల గోచరించును. ఆ పదములలో ముద్దులు మూట కట్టుచు పాఠకు నోడలు పులకింప చేయు సామర్థ్య మున్నది. చిన్ని జాబిల్లి యట. చిన్ని శబ్దములో నెంత మాధుర్య మున్నది. ఎంత యర్థ గాంభీర్య మున్నది. అది చిన్న కాదు. చిన్ని, ముద్దు లొలికించు పదము. చేర్చుక్కకు సరిపోయినదా జాబిల్లి రూపము. రారాపు చనుదోయి రాయిడికిఁ దుంబీ ఫలంబు తుందుకు జెందు చున్నదట. స్తనముల కాఠిన్యము వ్యంగ్య రూపమున ప్రకటింప బడినది. కాళిదాసు 'పయోధ రోత్సేద నిపాద చూర్ణితాః' వంటిది. పయోధరములు కఠినము లైనవి కావుననే తుంబీఫలము వంటిది కూడ మిక్కిలి కదల బారుచున్నది. ఉపనిషత్తులు బోటులై యోలగింప ననుటవలన నుపనిష ద్వాఙ్మయ సామ్రాజ్యాధిపత్యము అందు మూలమున వేద వాఙ్మ యాధినేతృత్వము సకల విద్యాధిపత్యము శారదయం దారోపింప బడినవి. ఇంత రమణీయముగా సరస్వతీ

రూపము కల్పించిన కవి యింకొకడు లేడు. వీణ వాయించుచున్న సరస్వతియం దిట్టి దైవత మూర్తిని ముద్రించిన పెద్దనగారి గంటము

తత నితం బాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన
శశికాంత మణి పీఠి జాజువారఁగఁ గాయ
లుత్తుంగ కుచ పాళి న త్తమిల్లఁ
దరు ణాంగుళీ ధూత తంత్రీ స్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
నాలాప గతిఁ జొక్కి యర మోడ్పుఁ గనుదోయి
రతి పారవశ్య విభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకుఁ
గమ్ర కర పంకరుహ రత్న కటక ఝణ ఝ
ణ ధ్వని స్ఫూర్తి తాళ మానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి

అని వీణ వాయించుచున్న వరూథిని చిత్రమును కల్పించినది. వారి వారి ప్రకృతుల వలెనె రెండు రెండు విభిన్న మూర్తులు. ఒకటి దేవతా ప్రకృతి. రెండవది వేశ్యా ప్రకృతి. విరివియైన నితంబుల మీఁది నిండైన తెల్ల యుల్లి పొర వంటి సన్నని వలిపములోని కావి వన్నె యంగదట్టపు రంగువలన శశికాంతి మణిపీఠి జాజువారుచుండె నని ప్రారంభించిన యీ వర్ణనలోనె యామె జాతి స్వభావము గోచరించు చున్నది. ఆ వస్త్రధారణము ఆ విరివి నితంబము లట్టివి. శశికాంత మణి పీఠి వరూథిని భోగలాలసత్వమును వెలయించు చున్నది. సరస్వతి పుండరీ కాసనము దేవతాత్వమును నిరూపించు చున్నది. మరియు వాణీ వరూథినుల ప్రవృత్తి భేదములు వీణా వాదనమునందు గూడ పెద్దన గోచరింప చేసెను. వా రిరువురివి తరుణాంగుళులు. అవి వారి లావణ్యమును నిరూపించును. వాణి యంగుళి చ్ఛాయలు దంతపు

సరకట్టులపయి నింగిలీకపు వింత రంగు లీనుచున్నవి. అందు మూలమున సరస్వతికి వీణా వాదనమునందు కల యసాధారణ సహజ సాధన సంపత్తియు ప్రసన్నతయు స్ఫురించును. వరూథిని తరుణాంగుళుల చేత వీణ తంతువులను ఘాతమొనరించినది. ఘాత శబ్ద మామె యెంత తీవ్రముగా తీవెల నెగ మీటినదో ప్రకటించు చున్నది. అందు మూలమున కర పంకరుహ రత్న కంకణములు ఝణఝణ నాదములు కావించినవి. ఈ యనుకరణము వ్యర్థముగా కవి ధ్వని నిరూపణకొర కుపయోగించ లేదు. పలికించు గీత ప్రబంధములకు ఆ ఝణ ఝణ ధ్వనులు తాళ మానములు గొలుపు చున్నవట. అట్లు వర్ణించుటచేత వరూథిని వీణ వాయించుటలో గల తుందుడుకు తనము నిరూపింప బడినది. అందు మూలమున నామె వేశ్యా కుల సహజ మయిన యొయ్యారము హావభావ బహిర్గతము గావింప బడినది. ఈ వర్ణన భావియందు వరూధిని పాత్రపోషణకు ప్రాతిపదిక. ఈ వేగిర పాటు వరూధిని పాత్రయందు చివరివరకు గోచరించును. చూచి ఝళం ఝళ త్కటక సూచిత వేగ పదారవిందయై' ఇత్యాది పద్యములు చక్కగా నర్థము చేసికొని చదివినచో వరూధిని ప్రకృతి పరిస్ఫుట ముగా స్ఫురించును. ఈ పద్యములోని ఝళం ఝళలకు సీసములోని ఝణ ఝణాలకు సన్నిహిత సంబంధ మున్నది. ఆ రెండు అనుకరణ ములు ధ్వని రూపమున నామె వేగిర పాటును హృదయ గతము గావించు చున్నవి. అది యామె కుల లక్షణము. సరస్వతి వీణా వాదనము సహజ సుకుమారము కావున కర కంకణములు ఝణ ఝణ ధ్వనులు గావింపలేదు. వరూధిని వీణా వాదనము దుడుకు తనము కల దని పెద్దనగా రా యా వర్ణనలచేత వ్యక్తము గావించిరి. అది సహజముగా స్వభావములో నున్నది. వీణ సంగమేశ్వరశాస్త్రిగారు లోకోత్తర వైణిక విద్వాంసుడు. అసలు ఆయన యింటి పేరు ప్రయాగవారు. వీణ అనునది బిరుద నామము. ఆయన యొద్ద బాలసరస్వతి యను విపంచి కలదు. అది మిగుల పొడు గైనది. దానికి

తగినట్లు దండె లావుగా నుండెడిది. ఆయన ఆజానుబాహువు. పలుచ నగు పచ్చని శరీరము కలవాడు. చెవులకు రత్న కుండలములు తాంబూల చర్వణముచేత నెఱ్ఱ నయిన పెదిమెల మీాద మంద హాసము తొణికిస లాడుచుండ ప్రసన్న వదన మండల ముతో సభయందు కూర్చుండి వీణ నందుకొని మీాటు నప్పుడు వ్రేళులు కదలు చున్నటులనే యుండెడివి కావు. వీణె మీాటు చున్నటుల నుండెడిది కాదు. చెవుల పండువుగా పాట ప్రత్యక్ష రము విన వచ్చు చుండెడిది. వీణెలో గాని మనిషిలో గాని కదలిక లుండెడివి కావు. ఆలాప గతిలో పరవశము కలిగి నపుడు అర మోడ్పు కనులతో నొక్క చిరునవ్వు చిలికించెడివాడు. ఆ వాద్య మటువంటిది. ఆయన వలె వీణ వాయించినవారి నింత వరకు చూడ లేదు. పాటలో అంత మాధుర్యము మెలకువ యున్నది. ఆదిభొట్ల నారాయణ దాసుగారు వీణ వాయించు నపుడు తీగెలు తెగిపోవు నేమో యనిపించెడిది. వీణతో పాటు ముఖము మూతి మెడకూడ వేయి వంకరలు తిరిగేవి. తీగెలు లాగటంతో రెక్కలు నొప్పి పుట్టేవి. ద్వారం వేంకటస్వామి నాయుడుగారి పేరు విననివా రుండరు. ఆయన ఫిడేలు వాయించు నపుడు కమాను కదలుచున్న ట్లుండదు. వ్రేళ్లు ఆడుచున్నటు లుండవు. మనిషిలో చలన ముండదు. హరి నాగభూషణముగారు వాగ్గేయ కారకులు. సంగీత మహా విద్వాం సులు. ఆయన ఫిడేలు వాయించు నపుడు గంటకు రెండు కమా నులు విరుగ వలసినదే. తీగెలు తెగి ఫిడేలు అష్ట వంకరలు తిరు గును. అది యొక కసంతు. చెమటలు దిగ జారును. అట్లు వాయిం చిన గాని ఆయనకు తృప్తి లేదు. అది ఆయన ప్రకృతి. ప్రకృతిని బట్టి సాధన. ఆ సాధన శ్రుతులు మేళవించుటలో నున్నది. దానిలోని ఘనత పింగళి సూరనగారికి తెలియును. నారదుడు తుంబురు నింటి కరిగెను. వాకిట శ్రుతి పెట్టిన వీణెను చూచెను. దానిపై వ్రేలి డెను. దాని రావమున కబ్బుర పోయినాడు నారదుడు. తాను

నంతవాడు కావలయు నని శ్రీకృష్ణు నాశ్రయించినాడు. ఇది కళా పూర్ణోదయములోని కథ. అలసాని పెద్దనగారు వీణా వాదన పాండిత్యమునం దొక మెట్టు ఘనుడు. ఏ రాగమున కెట్లు శ్రుతి పెట్టవల యునో బాగుగా తెలియును. ఏ కాలమునం దే రాగము అభిహిత మయి మనస్సును రంజించునో పెద్దన యెరుగును. అతడు నైణిక విద్వాంసుడు.

> వాలారుం గొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్
> మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా
> యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా
> లోల తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్

అన్నది చెలికత్తె వరూథినితో మనుచరిత్రయందు. ఆ మహాకవి సంగీత సాహిత్యములందలి పాండిత్య మపారము. శాస్త్ర విజ్ఞాన మనల్పము సకల శాస్త్ర సమ్మేళనము మనుచరిత్ర. అందలి

## శిల్పము

అభినుత పాత్రము. తిక్కన శిల్ప నిర్మాణమునందు అందె వేసిన చేయి. అతని బుద్ధి సునిశిత మయినది. రూపమును సక్రమముగా నూహించును. మనో నయనముచేత ప్రత్యంగమును సూక్ష్మాతి సూక్ష్మముగా పరిశీలించును. పరిశీలించిన దానిని రస జీవములతో చిత్రించును. వాని లోకానుభవము పాండిత్యము తగిన పద జాలము నందించును. తలంపునకు సరియైన ఛాయా చిత్రము తయారగును. దానిని చదువు నపుడు పాఠకుని యెదుట నా రూపము వచ్చి నిలుచును. విరాట పర్వమునందు ఒక్క యేడాది వ్యత్యాసము గల యుత్తర రూపములను రెంటిని చిత్రించినాడు తిక్కన. వానిని తిన్నగా చదివి యర్థముచేసి కొనినవారికి తిక్కనగారి వర్ణనలలోని నైశిత్యము పరిస్ఫుటముగా గోచరించును. తిక్కనకు పరితూగువాడు

పెద్దన. వీణా వాదన మొనరించుచున్న రెండు విభిన్న ప్రకృతులు గల వాణీ వరూధినుల రూప చిత్రముల నచ్చొత్తినట్లు చక్కగా చిత్రింప గలిగినాడు. తిక్కనగారు మొదట వర్ణించిన ఉత్తర రూపము నందు ముగ్ధత్వము కనిపించును. రెండవ వర్ణనమునందు ప్రౌఢత్వము స్ఫురించును. పెద్దనగారి సరస్వతి విగ్రహమునందు దేవతాత్వము మూర్తీభవించినది. వరూధినియందు వేశ్యాత్వము ప్రకటిత మగుచున్నది. ఇంకొక విశేషము వరూధిని కరములందు రత్న కటకము లున్నవి. స్వరానుసరణముగా సరకట్టుల నొత్తుచు వ్రేళులను కదలించు నపుడు రత్న కటకములు చేతి కదలింపునకు కుదిలింపు నొంది ఝణ ఝణ ధ్వనులు గావించినవి. ఆ ధ్వని గీత ప్రబంధములకు తగినట్లు తాళమానమును గొలిపినవి. ఈ వర్ణన స్వభావ సిద్ధముగా నున్నది. అది సక్రమ మయినది. పద్యము చదువు నపుడు కరముల కదలింపు కనుల కగుపించును. కటకముల ఝణ ఝణ ధ్వని వీనులకు వినిపించును. పెద్దనగారు పదములను భావమున కనుగుణముగా పొందు పరుప గల నేర్పరి. ఇంకను పరిశీలించినచో ఆయన శయ్య శిల్పమునకు భావమునకు ననుగుణముగా మారు చుండును.

ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మెగము తోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ
గుటుచ లాతాముతోఁ గూర్చి పట్ట
యైణేయ మైన యొడ్డాణంబు లవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూట చ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగు దేహంబున భస్మ మలఁది

మిట్ట యురమున నిడు యోగ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధ సిద్ధుఁ డొకఁడు.

ఇది ప్రవరు నింటి కరుదెంచిన సిద్ధుని వర్ణన. కవి కల్పిత రూపము. ముడిచిన యొంటి కెంజడ, కకపాల, కేదారకటకము, కురుచ లాతాము, యొడ్డాణము, దేహమున భస్మము, రుద్రాక్ష పోగులు, కావి కుబుసము, జల కుండిక యివి యన్నియు బైరాగుల వస్తు సామగ్రులు. అష్ట సిద్ధులకు నధిపతి శివుడు. సిద్ధులు పాశుపత దీక్ష కలవారు. కావున మువ్వన్నె మొగము తోలు కిరీటము ఏణేయ మైన యొడ్డాణము, భస్మ మలందిన మేను వానికి కలయ కూర్చినాడు పెద్దనగారు. హటాది యోగములు సిద్ధుల కలవాటు కావున నిడు యోగ పట్టె యొకటి మిట్ట యురమున మెరయించినాడు. సిద్ధుని యాకారము తయారు చేసినాడు. పై పద్యము చదివిన ప్రతివానికి పుర వీధులందు భిక్షాటనమునకై తిరుగాడు బైరాగి రూపము కనుల ముందర నిలుచును. యోగ పట్టె నరసి పాఠకుడు సిద్ధు డని తలంచును. ఇది పెద్దనగా రూహించిన సిద్ధుని యాకారము. ఇందు చక్కని శిల్పమున్నది. దానికి తగినట్లు మృదులము లగు పదముల కూర్పు పద్యమును మరింత రమణీయము గావించు చున్నది. మువ్వన్నె మొగము తోలు, కకపాల, కేదార కటకము, లాతాము, అక్కళించిన పొట్ట మక్కళించి ఇటువంటి ఆచ్ఛిక, వైకృత పదము లా వర్ణనకు మరింత మెరుగు తెచ్చినవి. మనోరమ

విసమానములుగాఁగ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు
బండి కందెన చాయ బైసిమాలిన మేన
మెదడు గందపు రొంపి మెత్తినాఁడు

కునఖంపు డాచేతి పునుక కప్పెర నిండఁ
బ్రాణి కోటుల నల్లఁ బట్టినాఁడు
కొకిబికి వేసంపు గూని మూపుల మీఁద
మూఁడు పంగల యీఁటె మోపినాఁడు
నిట్టితాడనఁ బొడవుచే నిక్కినాఁడు
నిడుద కోఱల మిడిగ్రుడ్ల నెగడినాఁడు
నరవ రోత్తమ నేఁడు మూన్నాళ్ల నుండి
యుసుఱు గొన వెంటఁ దిరిగెడు నసుర యొకఁడు

అని స్వారోచికి చెప్పినది. కళా సృష్టియు రస పోషణము వానికి ననువగు పద్యంపు పోకడయు తదనుగత మగు పదముల కూర్పు పెద్దనగారి సొమ్ము. పై పద్యమునందలి శిల్పమును గురించి చెప్ప వలసిన పని లేదు. అది యసురుని వర్ణన. దానికి తగినట్లు జుగుప్సా కర మగు బీభత్సము చక్కగా పోషింప బడినది. భారత రామాయ ణాది గ్రంథములందు పెక్కుమంది రాక్షసులు వర్ణింప బడిరి. కాని యిట్టి వర్ణన యెందును గానరాదు. ఆంగ్లేయమునందు సైక్లాప్సిస్ అను ఒంటి కంటి రాక్షసుని యాకారము అతి భయంకరముగా వర్ణింప బడినది. దానిని చదువునప్పు డొడలు జలదరించును. అయినను పెద్దనగారి యాసుర వర్ణనమునం దున్న జుగుప్స దానియందు కనిపించదు. మనము రాక్షసుని గాని వాని చర్యలు గాని చూచి యుండ లేదు. పై పద్యమును చదివి నంతనే వసతో పెనవెట్టి ప్రేవు లెగుడు దిగుడుగా చుట్టిన తలపాగ, మెదడు గంధమును మెత్తిన బండి కందెన వంటి నల్లని మేను, డాచేతియందు ప్రాణి కోటుల నెత్తుటితో నింప బడిన పునుక కప్పెర, గూని మూపున తాల్చిన మూడు పంగల యీటెతో తాడి యంత పొడవున రాక్షసు డెదుట వచ్చి నిలుచును. ఆ రూప వేషములు చూచి నంతనే పాఠకుడు ఒడలు జలదరింప నేవగింపున గనులు మూసి కొనును. ఈ పద్యము నందు వాడిన పదము లన్నియు నాచ్ఛికములు. అవి — వర్ణనకు

సరిగా తగిపోయినవి. శిల్ప నిర్మాణమునకు చిత్ర రచనకు అచ్చ తెనుగు పదములు సరిపడి నట్లు సంస్కృత తత్సమములు సరిపోలవు. అందుకనే మహాకవు లగు తిక్కన పెద్దనాదులు శిల్ప ప్రదర్శనమునకు ఆచ్ఛిక వైకృత పదముల నుపయోగింతురు. అవి రస పోషకము లయి పద్యమునకు అందము తెచ్చును. పెద్దనగారు ప్రతి పాదము చివర 'నాఁడు' అని వాడుచు వచ్చుటవలన మనోరమ హృదయ గత మయిన కలతయు సేవగింపు విద్వేషము ప్రకటితము లగు చున్నవి. అందు వాడిన పదము లన్నియు రస పోషకములు. పద్యంపు నడకకు తీరులు దిద్దు చున్నవి. మూడు పంగల యీఁటె, బండి కందెన చాయ, బైసి మాలిన మేను, రొంపి, మెత్తినాఁడు ఇత్యాదు లరయునది. ఇటు వంటి స్వాభావ సిద్ధము లయిన చక్కని వర్ణనలకు సందర్భములను బట్టి యంగముల కుదిలింపులు కదలింపులు చేర్చి పెద్దనగారు వహావ్వా యనిపించును.

చూచి ఝళం ఝళ త్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులుం దురము లేనడు మల్లల నాడ నచ్చటం
బూచిన యొక్క పోక నును బోదియ చేరి విలోకన ప్రభా
వీచికలం దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్

నిలిచినదట వరూథిని. ఈ పద్యమునందు లేచి, చేరి, కొల్పుచున్ అను మూడు అసమాపక క్రియ లుపయోగించినాడు పెద్దనగారు. మూటికి మూడు నాట్య భంగిమలను సమకూర్చినాడు. అవి స్త్రీలకు సహజ మగు చాపల్యము, వేగిరపాటు, అబ్బురపాటులను ప్రదర్శించును. చూచినది ప్రవరుని వరూథిని. ఎవరా యను తలంపు పొడమినది. ఆ తలంపు మనస్సునకు తెలిసికొన వలయునను కుతూహలము కూర్చినది. అది చాపల్యము. మన స్సాగలేక పోయినది. ఒక్క సారిగా ముందునకు త్రోసినది కాబోలు త్వర త్వరగా రెండు పాదములు రెండు తడవలుగా వెంట

మోపినది పాదమునందలి యందెలు ఝళం ఝళం అని రెండు తడవలు ధ్వనించినవి. ఆ ధ్వని పాదములు నేల నాన్చిన వేగిర పాటును సూచించినవి. తత నితంబాభోగ యను సీసపద్యమునందు క్రమ కర పంకరుహ రత్న కటక ఝణ ఝణ ధ్వని యని వాడినాడు పెద్దనగారు. అది గాజుల మ్రోత. అందు తాళ గతి యున్నది కావున సున్నితము కొరకు ణకారము వాడినాడు ఝణ ఝణ యని. ఇది యందెల మ్రోత. ఇందు వాడిన ళకారము వేగముగా పాదమును నేల మీద పెట్టుటయందు పొడమిన ధ్వనిలోని బిగ్గర తనమును సూచించును. అక్షరము మార్పుచేత ధ్వనులలోని విభేదమును పాఠకునకు చక్కగా నిరూపించినాడు పెద్దనగారు. దానితో పాటు వాని ప్రయోజనమును సూచించినాడు. ఒకటి తాళ మానము. రెండవది వేగ మానము. అనుకరణములను వాడుటయందు కొంత లోకానుభవ ముండవలయును. నన్నయగారి కా యనుభవము చాల యున్నది. ఏ స్థితియం దే యలంకార మే ధ్వనిచేయునో ఆయనకు బాగా తెలియును.

> క్వణ దణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాపమున్ రణ
> న్మణి గణ నూపురంబులు సమ ధ్వని నొప్పఁగ భక్తిఁ బాద దా
> రిణి యయి కన్యకా జన పరీత సుభద్ర తదద్రి పూజన
> ప్రణతులు సేసె

నట. ఎంత చక్కని సమాసములు. ఆ సమాసముల కూర్పులో అణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాప క్వణనము మణి గణ నూపుర రణనము వినిపించు చున్నవి. ఇట్టి సమాస ఘటనము ఒక్క నన్నయ గారికే సాధ్య మయినది. పూజన ప్రణతులందు పాదము లెంత కదిలినవో నడు మంతే కదలినది. కావున కాంచి నూపురములు సమముగా ధ్వనించినవి. అది క్వణనము ఇది రణనము. ఉపయోగించిన శబ్దములు కూడ నట్టివే. అది చిరుత గజ్జెలమ్రోత. అది యా సమాసములో వినిపించును. సమాసముల మొదట వాడిన

క్వణత్, రణత్ శబ్దములు రెండు మృదులము లగు ధ్వనులను దెలుపు శబ్దములు. ఝణం ఝణలవంటివి కావు. ఆ శబ్దముల యుచ్చారణయందా మార్దవము స్ఫురించును. ఆమె మహారాజ పుత్రి. కాలు కదలించుటయే ఘనము. ఆ రాజసము ఆ ఘనతయా ధ్వనులలో వినిపించును. చేయునది పూజన ప్రణతులు. తొందర పాటు తగనివి. కొంచెము కాలు కదలించిన నించుక నడుము కదలును. కావున కాంచీ కలాప నూపురములు సమానముగా ధ్వనించినవి. ఆ ధ్వనుల సమానత్వము 'క్వణ దణు కింకిణీ' యనుటలో వాడిన మూడు ణకారములు 'రణ న్మణి గణ' యనుటలో వాడిన మూడు ణకారముల చేత సూచించినాడు. చదువు నపుడా కింకిణీ నూపుర నినాదములు చెవుల కింపుగా వినిపించును. ఆ సమాసములోని పదముల కూర్పటు వంటిది. దీనిని అక్షర రమ్యత యని నన్నయగారు నుడివిరి. ఆ రమణీయత యా భావము నా సమాసములో నిమిడి యున్నది. నన్నయ మహాకవి. ఆయన రచనలో వివిధ భావములు శబ్దార్థ శక్తుల మూలమున ధ్వనించును. తరువాత చెప్పకొన తగినవాడు పెద్దన. అయన రచనయందు భావము లొకొక్కప్పుడు గుణీ భూతము లగు చుండును. వరూథిని లేచినది. ఆమె కుతూహల మామెను మరింత ముందునకు త్రోసినది. కుచంబులుం దురుము లేనడు మల్లల నాడ నచ్చటం బూచిన యొక్క పోక నును బోదియ చేరినది. అట్లు చేరు నప్పుడు సైత మామెను వేగిరపాటు ముందునకు నెట్టుట మాన లేదు. కావున ఆ పోక నప్పుడు కుచంబులుం దురుము లేనడు మల్లల నాడినవి. తిక్కనగారు 'అసదుఁ గాఁదీగె యల్లాడు చుండ నుత్తర నర్తన శాల కరిగె నని వర్ణించినాడు. ఆమె గమనమునందును రయ మున్నది. కాని యది

అందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందముఁ

నున్నదట. అది యొయ్యారంపు నడక. పై సీసపాదము లందలి వర్ణన యంతయు దాని కనుగుణముగా నున్నది. అందు మూలమున అసదుఁ గొఁదీఁగె యల్లాడినది. పెద్దనగారు 'అల్లల నాడ' అని యుపయోగించినాడు. అందువలన కుచంబులుం దురుము లేనడుము మిక్కిలి యూగిస లాడిన వని వ్యక్తమగు చున్నది. అది మరింత వేగిర పాటును సూచించు పదము. అల్లల నాడినది యొక్క నడుమే కాదు. కుచంబులుం దురుము కూడను. ఈ పదముల క్రమము వరూథిని గమన వేగమును మరింత వ్యక్తపరచు చున్నది. ఆమె యెంత వేగముగా లేచినదో అంత వేగముగా గమనించినది. ఆ కారణము చేతనే మూడు నొక్క సారి యల్లల నాడినవి. తిక్కనగారి యల్లాడు చుండు ననుటలో నొయ్యారముతో కూడుకొనిన వేగిరపా టున్నది. ఆ పద్యపు నడకలో నా యొయ్యారము గోచరించును. పెద్దనగారి రచనలో నొక్క వేగిర పాటు మాత్రము గోచరించును. దాని కా మత్తేభము సరిపోయినది. అంతకంటె పై మెట్టు

మట్టెల్ మ్రోయఁగ గబ్బి చన్నుఁగవ కంపం బంద వేణీ భరం
బట్టిట్టై కటిఁ జిమ్మఁ జీఁకటులుగా

మనోరమ యసురచేత వెండింప బడి పరుగు పరుగున వచ్చినది. గబ్బి చన్నుఁగవ కంపం బందినదట. అందలి కంపనము తీవ్రమగు ప్రయాసముతో గూడిన రయాతిశయమును ప్రకటించు చున్నది. దానికి వేణీ భరం బట్టిట్టై యనునది తోడయినది. మహాకవులు నన్నయ తిక్కన పెద్దనలు. ఏ పదమునం దెంత భావ మిమిడి యున్నదో వారికి తెలియును. అందు పెద్దన మహానిపుణుడు. ఏ పదము నే సందర్భమునందు వాడ వలయునో ఆయనకు బాగా యనుభవ మున్నది. ఆయన కవనంపు టల్లికలో జిగి బిగు లున్నవి. కావుననే యల్ల సానివారి

## యల్లిక జిగిబిగి

యను మాట ప్రథిత మైనది. జిగి బిగి యనునది సమాసము కాదు. జిగియును బిగియును అని రెండును రెండు వేరు వేరు పదములు. జగ్గు నిగ్గు వలెనే యిది వ్యావహారికము. ఇట్టివి తెనుగునందు పెక్కులు వాడుకలో నున్నవి. జిగి యను శబ్దమునకు అర్థము కాంతి. అది యర్థ గతము. రసవంతము లగు భావములం దిమిడి యుండును. అది కావ్యాంగనకు జీవము. దానివలన కవిత తేజము కలది యగును. బిగి శబ్ద గతము. పదముల కూర్పునం దమరి యుండును. అది కావ్యమునకు పుష్టి కలిగించును. దానివలన రచన అందము కల దగును. ఈ రెంటిలో నేది లేక పోయినను కావ్యము శోభించదు. ఆ రెంటి పొందిక యల్లసానివారి యల్లికలో నున్నది. అల్లిక కవనమునకే కాదు. కథకు కూడ వర్తించు నని కొందరు విమర్శకుల యభిప్రాయము. అవును. పెద్దనగారి కథ కూర్పునందు కూడ జిగియు బిగియు నున్న వనుటలో సందేహము లేదు. ప్రవరుడు సిద్ధుని 'నను మిాశిష్యుని దీర్ఘయాత్ర వల నన్ ధన్యాత్ముఁగాఁ జేయరే' యని ప్రార్థించినాడు. సిద్ధుడు దంతపు బరణిన్ నినిచిన యొక పస రిది యది యని చెప్పక తత్పాదాంబుజ యుగళిం బూసినాడు. ఈ సందర్భమున మనుచరిత్ర వ్యాఖ్యాతలు 'ఇది యది యని చెప్పక' అను దానికి 'ఎట్టి దనియు చెప్పక' అని యర్థము వ్రాసిరి. అది కాదు. ఆ పస రెట్టిదో దాని ప్రభావ మెటువంటిదో 'పరమం బైన రహస్యమౌ' నను పద్యమునం దుపన్యసించినాడు సిద్ధుడు. మరల చెప్ప వలసిన పని లేదు. ప్రవరుడు కూడ ఆ పస రెట్టి ప్రభావము కలదో యెరుగును. కావుననే దరీ ఝరీ నిరీక్షాపేక్ష నరిగినాడు. ఆ కారణముచేత వ్యాఖ్యాత అర్థ మిచ్చుట పొసగదు. ఇది యది యనునది వ్యావహారిక మయిన జాతీయము. ఆ పస రే యాకులవలన వచ్చునో యా వివరము లేమియు చెప్పక యని యర్థము. అట్లు చెప్పినచో కథకు విఘాతము కలుగును.

పాదలేపము కరిగి పోవగానే మరల నా యాకు పసరు సంపాదించు కొన వచ్చును. ఇంటికి తిరిగి రా వచ్చును. జరుగ వలసిన కథ జరుగదు. భావి కథా విధానమును ముందుగా మనసునందు విమర్శించు కొని పెద్దనగా రా పదమును వాడిరి.

ఆ మందిడి యతఁ డరిగిన
భూమిసురుఁ డరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీ క్షాపేక్షన్

అను పద్యముతో ప్రథమాశ్వాసము పూర్తి యగు చున్నది. ఆ మందెప్పు డిచ్చెనో అప్పటి కెంత కాల మైనదో కవి వివరింపలేదు. 'అటఁ జని కాంచె' నను పద్యముతో ద్వితీయాశ్వాసము ప్రారంభించెను. ప్రవరు డెగిరి పోయినది నడచి పోయినది వివరింప లేదు. నడుమ సంగతు లన్నియు విడిచి పుచ్చెను. అట్లు విడిచి పుచ్చుట కథ బిగువుకొరకే. కాని యీ సందేహములు పాఠకుని చిత్తమునందు పోడసూపక మానవు. దానికి సమాధానము కావ్యమునందు లేకుండుట కథకు లోప మగును. ఆ సంగతి పెద్దనగారికి బాగుగా తెలియును. కావ్యమును చదువు నప్పుడు ప్రతి పద్యమును జాగ్రత్తగా చదువ వలయును. ప్రతి పదము సవిమర్శకముగా పరిశీలింప వలయును. లేనిచో నన్నియు ననుమాన ములే యగును.

సిద్ధుడు ప్రవరు నింటికి కుతుప కాలమునందు వచ్చెను. కుతుపకాల మనగా మధ్యాహ్నము దాటిన తరువాత రెండు గడియల కాలము. భోజన సంభాష ణాదులు ముగియు నప్పటికి కొంత కాలము గతించి యుండును. అప్పుడు పాదములకు పసరు పూసినాడు సిద్ధుఁడు. ప్రవరుడు హిమాలయమున కరిగి యందలి వింతలు పరిశీలించు నప్పటికి

నలినీ బాంధవ భాను తప్త రవికాంత స్యంది నీహార కం
దళ చూత్కార పరంపరల్ పయి పయిన్ మధ్యాహ్నమున్ దెల్పెడిన్

అని పెద్దనగారు వ్రాసిరి. మరల ఆ నాడు మధ్యాహ్న మెక్కడ నుండి వచ్చును. అది పెద్దనగారి పొరపాటు అని కొందరు విమర్శించిరి. మరి కొందరు "పాదలేపము రాచినది నా పైనను ప్రవరుడు ఆ రే యెల్ల పయనించి మరునాడు హిమగిరి చేరె నని సరిపెట్టిరి. హిమగిరి చేరి అందలి వింతలు చూచు నప్పటికి మధ్యాహ్న కాల మయ్యెను. పలుమంది పలు విధముల నూహించిరి. వేటూరి ప్రభాకర శాస్త్రి గారు విద్వాంసులు. విమర్శకులలో నగ్ర గణ్యులు. మనుచరిత్రకు పీఠిక వ్రాసిరి. అందు పై విషయమును సూచించిరి. విమర్శకుల సమర్థ నలను ప్రస్తావించిరి. ఈ సమర్థనము మార్కండేయ పురాణాను రోధియే కాని పెద్దన మాత్ర మట్టి వ్యవధి నించుక యేని సూచించిన వాడు కాడు అని నుడివిరి. వారంత వా రిట్లు వ్రాయుట చాల విచిత్రముగా నున్నది. విశ్వనాథ సత్యనారాయణగారు విఖ్యాత విమర్శకులు, కవులు. వరూథిని యను వ్యాసము రచించిరి. అందీ విషయమును సుదీర్ఘముగా చర్చించిరి. "ప్రవరుడు వేలిమియున్ సురార్చనయు విప్ర సపర్యయుఁ జిక్కె భుక్తికిన్ వేళ యతిక్రమించె ననుట చేతను ప్రవరు డా మరునాటి యుదయమున బయలుదేరె ననుట స్పష్టము. ప్రొద్దుననే లేచి యగ్ని హోత్ర కార్యము చేసికొని ప్రవరుడు బయలుదేరెను అని కాల నిర్ణయము చేసిరి. ఊహ కొంత వరకు సమంజసముగానే యున్నది. కాని రెండు వాక్యములకు పరస్పర సమన్వయము కుదురలేదు. వేలిమియున్ సురార్చనయు నను పద్యమునందలి పెద్దగారి యభిప్రాయమును పూర్తిగా వివరింపబడ లేదు. పెద్దనగారు మహాకవి. కథకు గాని కథాంశములకు గాని లోపము కలుగ నీయడు. నీరస మగు కథా భాగములను సంభాషణలయందు నిమిడ్చి రస పుష్టి కల్పించును.

పాఠకుడు దానిని సమన్వయము చేసికొన వలయును. ఊహలకు తావు వాని కావ్యమునం దుండదు. వరూధిని ప్రవరునితో మా యింట విందవైతివి. ఆతిథ్యమును గైకొమ్ము. అస్మద్గృహము పావనము చేయుము. బడలికలు వాసి చను మన్నది. అందులకు ప్రవరుడు భక్తియ చాలు సత్క్రియా కాండ దీర్ప వేగ చనఁగా వల యును అన్నాడు. సత్క్రియా కాండ మనగా నుత్తమములైన కార్య కలాపము లని యర్థము. కావున ప్రవరుడు బయలు దేరు నప్పటికి సత్క్రియా కాండము ముగించుకొన లేదు. ఆ సత్క్రియ లేవి యను ననుమానము తోచ వచ్చును. వరూధిని తన వల పెరి గించినది. నను చిత్తజు బారికి నప్పగించెదో పాటలు వాఁడు తేంట్ల సొం పెక్కిన యట్టి పూవుఁ బోద రిండ్లను గౌఁగిట గారవించెదో యని నది. ప్రవరుడు వ్రతులై దినములు గడపెడు విప్రులం గా మింపఁ జనదు.

వేలిమియున్ సురార్చనయు విప్ర సపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె

నని నుడివెను. ఇందు మూలమున ప్రవరుడు బయలుదేరిన కాలము వరూధినితో మాట్లాడునప్పటి కయిన వేళ పెద్దనగారు విశద పరచిరి. ఇట్టి నీరస మయిన కథాంశమును సంభాషణలో నిమిడ్చి ప్రవరుని వైదిక కార్య కలాపములందలి పట్టుదలను వ్యక్తము గావించినాడు పెద్దన. అందు మూలమున పాత్ర పోషణయు శాంత రస పోషణయు కథాంశమునకు రస పుష్టియు కల్పించినాడు. ఇదే కథ యల్లికలోని జిగి బిగి. స్నానము సంధ్యావందనము జపము అగ్ని కార్యము దేవతార్చన అతిథి సేవయు నాహితాగ్నుల ప్రాతఃకాల కార్య క్రమ ములు. అందు వేలిమియున్ సురార్చనయు విప్ర సపర్యయుఁ జిక్కె నని ప్రవరుడు నుడివెను. వేలిమి యనగా హోమము. అదియే అగ్ని కార్యము. సురార్చన యనగా దేవతా పూజ. విప్ర సపర్య

యనగా బ్రాహ్మణ సేవ. అదియే అతిథి పూజనము. ఈ మూడును చిక్కన్ మిగిలి పోయినవి యని భావము. ప్రవరుడు ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామన స్తుతి పరత్వమున లేచినాడు. వరుణా నదియందు నఘమర్షణ స్నాన మాచరించినాడు. సాంధ్య కృత్యము తీర్చినాడు. సావిత్రి జపియించి సైకతస్థలి కర్మసాక్షి కెరగినాడు. అనంతరము దరీ ఝరీ నిరీక్షా పేక్ష నరిగినాడు. అప్పటికి గడియ ప్రొద్దెక్కి యుండును. అరుగు నప్పుడు తల్లిదండ్రులకు భార్యకు నెరిగించెను.

> నను నియమసంబు గానక యున్న నూరెల్ల
>
> నరయు మజ్జనకుఁడెం తడలు నొక్కొ

అని తండ్రి స్వభావమును గురించి తలంచిన ప్రవరుడు జననీ జనకుల్ కడు వృద్ధు లాకటన్ సోలుచుఁ జింతతో నెదురు చూచుచు నుందు రని వరూథినితో ననెను. ఎదురు చూచుట ప్రవరుని రాకకొరకు. పోకడ తెలియును గావున రాక కెదురు చూచు చుందు రని భావ మం దిమిడి యున్నది. తెలుపక వచ్చినచో తనకొరకు నూరెల్ల వెదకు చుందు రని తెలియును కావున స్నాన సంధ్యలు ముగిసిన తరువాత తల్లిదండ్రులతో చెప్పి బయలుదేరినాడు ప్రవరుడు. నళినీ బాంధవ భాను తప్త రవికాంత స్యంది నీహార కందళ చూత్కారం పరంపరలు మధ్యాహ్నమును దెల్పు నంత వరకు హిమవంతము నందలి వింతలను పరికించినాడు. అప్పటికి రెండు జాము లయినది. నీహార వారిం బెరసి పాదలేపము కరిగినది. విషాదముతో లతల యవలంబ నంబున కాలువల వెంట దిగి లోయలో వరూథినిని చూడ వచ్చు నప్పటికి భుక్తికి వేళ యతిక్రమించినది. ఆహితాగ్నుల భోజనవేళ కుతుపకాలము. అది అతిక్రమించినది. అనగా అప్పటికి కపరాహ్ణ మయిపోయినది. ఇట్లు పెద్దనగారు క్షణములు గడియలు లెక్క వేసి ప్రవరుని హిమాలయ యాత్రను వర్ణింపగా వేటూరి ప్రభాకర శాస్త్రి

గారు పెద్దన మాత్ర మట్టి వ్యవధి నించుక యేని సూచించినవాడు కాడనుట అతి సాహసము. మిగిలిన విమర్శకులకు మనుచరిత్ర అర్థము కాకపోవచ్చును. తలంపునకు వచ్చిన యవక తవకలు వ్రాయ వచ్చును. వారిని గుర్తించువా రుండరు. ప్రభాకర శాస్త్రిగారు కూడ ఆ పట్టికలో నొక రగుట చాల విచిత్ర విషయము. పేరు కల వారేది వ్రాసినను చెల్లుబడి యగు నని వారూహించిరి. కాని కావ్య పాఠకులకు వారి పలుకు హాలాహల మని వారు తలంచ లేదు. ఊహా గానములకు మనుచరిత్ర కారుడు సావకాశ మీయ లేదు. మనుచరిత్ర మహాకావ్యము. పెద్దన సామాన్యుడు కాడు. ఇష్టము వచ్చి నటుల వ్యాఖ్యానించుటకు వీలుండదు. చిక్కెన్ అను శబ్దమునకు మిగిలి పోయె నని యర్థము. లభించె నని యర్థము కాదు. వేలిమియున్ సురార్చ నయు విప్ర సపర్యము నెరవేరెన నని యర్థము చెప్పినచో విప్ర సపర్య కాలము నడి జాము వరకు నుండును. అప్పుడు బయలుదేరె ననుట అసమంజసము. ఆహితాగ్నులు నడి జాము వరకు నతిథుల కొర కెదురు చూచు చుందురు. ప్రవరుడు పాదలేపము కలిగిన తరువాత

అతిథి సంతర్పణంబు లేమయ్యె నొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబు లైన
కృత్యముల బాసి దైవంబ కినుక నిట్లు
పారవైచితె మిన్నులు పడ్డ చోట

అని చింతించెను. దీనిని బట్టి అగ్ని కార్యము నిత్య కృత్యము లైన సురార్చ నాదులు ముగియ లేదని తేలుచున్నది. కావున శ్రీసత్య నారాయణగారి యూహ సమంజసము కాదు.

ప్రవరు డెగిరి పోయెనా లేక నడచి పోయెనా యను సందేహ మొకటి. విశ్వనాథ సత్యనారాయణగారు పాదలేప మెంత తొంద రగా నడిపించినను ఒక యామములో వరుణా తీరము నుండి హిమవ

త్పర్వతములోని అచ్చరములు నివసించు నిగూఢ ప్రదేశమునకుఁ బోఁజాలినది కాఁజాలదు.

హిమవత్పర్వతారోహణము కాలి నడకకు సాధ్య మయినది కాదు. ప్రవరు డెగిరి పోయి యుండవలయును. ఆ ఎగురుటకు పాదలేపము పట్టి సహాయ్యకారి. అత డెరిగెనో నడచెనో తెలిసి కొనుటకు నీ కావ్యమున నాధారములు లేవు. పాదలేపము కరిగిపోయిన తరువాత సపది స్ఫుటార్తిన్ఁ జరణ ద్వంద్వంబు రాకుండినన్ అని యొక్క మాటతోఁ దద్గమన వైభవము వర్ణింప బడెను. కాని ఈ గమన వైభవము ప్రథమాశ్వాసాంత ద్వితీయాశ్వాసాది పద్యములలో పెద్దన వ్యంగ్యముగా వర్ణించెను.

భూమీసురుఁ డరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షా పేక్షన్

అను పద్యమునందలి శ్లేష జని తోత్పతన లక్షణము శ్రీరాయలవారి సభలోఁ బెద్దనగారు బహుధా ప్రపంచించి యుండ వలయును. భూధర శృంగ తరువాత సంయుక్తాక్షరముచేత గకారము గురువై గణము సరిపోయినను శృంగ యని యాపుటచేతను దాని వెనుక భూధర యను చాపైన మాట యుండుట చేతను తత్పర్వతముయొక్క విస్తారమును నిడివిగా నేటవాలుగా నున్న యకొండ కొమ్ములయు స్వరూపము ధ్వనించి శ్యామల కోమల కానన ఈ దీర్ఘాక్షర సహిత భగణములచేత ప్రవరుని సవేగమయిన రెక్కలు చాచి ఎగురు నట్లుగా నెగురుటను సూచించి దరీ ఝరీ నిరీక్షాపేక్షన్ అనుటలో పర్వతాగ్రము నుండి క్రిందికి దిగుటను ధ్వనించెను. అతడు కొండ మీద దిగె నని చెప్పబడ లేదు. తరుషండ మండ లాంతర సరణిన్ ధరణీ సురుండు చనఁ జన నను తరువాతి పద్యమునందలి నడకచేతనే యతని దిగుట సూచితము. అని వరూథిని యను వ్యాసమునందు బహు విధములుగా చర్చించిరి. నేనా వ్యాసమును పలు సారులు

మోజు కొలంది చదివితిని. ఒక నాడు మా మిత్ర మండలి గోష్ఠిలో చదివి వినిపించితిని. ప్రత్యేకించి పై వ్యాస భాగము రెండు సారులు చదివితిని. పూర్తి యైనది. మాలో నొకరు సత్యనారాయణగారు మహా విద్వాంసులు. వారి యూహ లోకాతీతము. పండితులకైన నందుబాటులో నుండు నది కాదు. వారు మనుచరిత్రను ప్రత్యక్షర పరిశీలన చేసి యుందురు. లేనిచో వారిట్లు వ్రాసి యుండరు. విద్వాన్ సర్వత్ర పూజితః. అందుకనే ఆయన కంత పూజ్యత లభించినది. ఎవ రెంత తన్నుకొనినను ఆయనతో సమానులు కాలేరు. అని అతి గంభీరముగా నన్నారు.

'అవును' అన్నాను నేను.

ఏమిటి ఔనంటారు. శబ్దార్థ శక్తులవలన ధ్వనులు కలుగును గాని గణముల శక్తివలన ధ్వని కలుగునా? ఏ యలంకార శాస్త్రము చెప్పినది. కొండ కొమ్ముల స్వరూపము, ఱెక్కలు చాచి ఎగరటము పర్వతాగ్రము నుండి క్రిందికి దిగటము ధ్వనించు చున్నదట. పండితు లెవరైన వినిన ఘక్కు మని నవ్వుదురు. ఱెక్కలు చాచి ఎగిరెనట. ఆ ఱెక్కలు మొలుచుకొని వచ్చినవా? పొడుచుకొని వచ్చినవా? అన్నారు నా మిత్రులలో నొకరు. ఆయన తాతారాయుడు శాస్త్రి గారి యొద్ద అలంకార శాస్త్ర మామూలాగ్రము చదువుకొనిన విద్వాంసుడు, తార్కికుడు.

అయ్యా! కోపపడకండి. సత్యనారాయణగా రంటె సామాన్యులు కారు. ధ్వన్యాలోకాది గ్రంథములు వారు చదివి యుందురు. ఏ మూలనో వారి వ్రాత కాధార ముండె యుండును. మన మాలోచించి గాని యే మనుటకు వీలులేదు. ఱెక్కలు మొలుచుకొని రాలేదు పొడుచుకొని రాలేదు. ఱెక్క లనగా భుజములు బాహువు లని వారి భావము అన్నాను. నాకు సత్యనారాయణగా రనిన చాల గౌరవ ముంది. ఆయన బాగా ఆలోచించని దే యేవి యు వ్రాయరు అని నా

నమ్మకము. నిగూఢములగు భావములను వెలువరించుటలో ఆయనను బోలినవా డాయనయే గాని మఱెవ్వరు లేరు.

శాస్త్రిగారు చాల పక్షపాత బుద్ధితో మాట్లాడు చున్నారు. ప్రవరుని పక్ష పాతము సంగతి అబద్ధ మయినను వీరి విషయంలో సత్యముగా కనబడు చున్నది. అసలు సత్యనారాయణగారు మనుచరిత్ర గట్టిగా చదివి వ్రాసినది కాదు. నాకు వారియం దభిమాన మున్నది. అచ్చరలు నివసించు నిగూఢ ప్రదేశమునకు పోజాలినది కాఁజాలదు. ప్రవరు డెగిరి పోయి యుండ వలయునని వ్రాసిరి. సపది స్ఫుటార్తి చరణ ద్వంద్వంబు రాకుండిన తరువాతనే ప్రవరుడు గంధర్వ యక్ష గాన ఘూర్ణిత మయిన కోనను గాంచినాడు.

నికట మహీధ్ర రాగ్ర తట నిర్గత నిర్ఝర ధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగు కాలువ వెంటఁ బూచు మ
ల్లిక లవలంబనంబుగ నలి ప్రకర ధ్వని చిమ్మ రేఁగ లో
నికి మణి పట్టభంగ సరణిన్ ధరణీసురుఁ డేఁగి చెంగటన్

అని పెద్దనగారు వ్రాసిరి. అప్పుడు సత్యనారాయణగారి మొగురు డే మయినది. వారు మనుచరిత్రలోని పద్యాలు చదివినారు గాని మనుచరిత్ర చదవ లేదు. నా మాట కడ్డుండునా యని యేదో వ్రాసినారు. గుడ్డి దర్బారుగా పఠనగ్రంథములో వేసినారు. వేసిన వారికి మాత్రము తెలియునా? భావి కాలము విద్యార్థులను తప్పు దారిని పట్టించు వ్యాసా లిటువంటివి చాలా కలవు అన్నారు మఱొకరు. నే నేమియు మాటాడ లేదు. నాకు గూడా నిజ మేమో యని పించింది. అంతలో నా కాప్త మిత్రులు కోరుకొండ వెంకట కృష్ణమాచార్యులవారు దయచేసిరి. వారు మహాపండితులు నేను వారికీ విషయము నివేదించితిని. వారంతయు నాలకించి యాలకించక మునుపే నేను వరూధిని వ్యాసము చదివినాను. చదవటమే కాదు.

పాఠము కూడా చెప్పినాను. మనుచరిత్ర మహాకావ్యము. ఇతర కావ్యముల వంటిది కాదు. పెద్దనగారు చాల ఘటికుడు. కథ యల్లికలోను కవిత కూర్పులోను జిగి బిగువు లున్నవి. ప్రతి పద్యము పూర్వాపర కథా సందర్భాలు సమన్వయము చేసికొనిన గాని పెద్దన గారి పోకడ తెలియదు. అట్లు సమన్వయము చేసికొనిన వారింత వరకు లేరు. పేరుకు పెద్దవార మని చంకలు కొట్టుకొనుటయే కాని ప్రభాకర శాస్త్రిగారు పీఠికలో నేమి వ్రాసిరి. అసలు మనుచరిత్ర సరిగా చదివినవా రెవ రున్నారు. చదివితే ఆ వ్యాస మట్లా వ్రాయుదురా. ఎందుకు వాదము. కాల వ్యయము, ప్రయాసము తప్ప ఈ యర్థములేని వ్యాసమును గురించిన విచారము మన కెందు కన్నారు.

అప్పటి కా దినము గడచినది. ఆ రేయి మరల మరల మను చరిత్ర తిరుగవేసితిని. వరూథిని వ్యాసము చదివితిని. నా భావము మారలేదు. ప్రవరుడు సిద్ధునితో

వెఱవక మీ కొనర్తు నొక విన్నప మిట్టివి యెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జఱుత తనంబు మీ మొగము సెప్పక చెప్పెడు

వనినాడు. సిద్ధుడు సందియము తెలియ నడుగుట తప్పా

పాదలేప మను పేరం గల్గు దివ్యౌషధఁ
పు రసం బీశ్వర సత్కృపన్ గలిగెఁ దద్భూరి ప్రభావంబునన్
జరియింతున్ బవమాన మానస తిరస్కారి త్వరాహంకృతిన్

అని సమాధానము చెప్పెను. అంతటితో నూరకుండలేదు. చరియింతున్ అనుటచేత ఆకాశ మార్గమునందా భూమి మార్గము నందా చరించునది యను సందేహాము పాఠకునకు వలెనే ప్రవరునకు గలుగ వచ్చును. కావున దానిని వ్యాఖ్యానించుచు

దివి బిసరుహ బాంధవ సైం
ధవ సంఘం బెంత దవ్వు దగలే కరుగున్
భువి నంత దవ్వు నేమును
తవతవలే కరుగుదుము హుటాహుటి నడలన్

అని నుడివినాడు. భువిన్, భూమి మీద, తవతవ లేక ఆయాసము లేక, హుటాహుటి వేగమయిన లేక చకచక యైన, నడలన్ నడకలతో; ఏగుదుము పోవుదుము అని యర్థము. భూమి మీద వేగమగు నడకలతో పోవుదుము అని స్పష్టముగా నుడివెను. ఈ పద్యము లను సత్యనారాయణగారు చూచి యుండరు. చూచినచో నెగిరి పోయె నని వ్రాసి యుండరు. తుహిన భూధర శృంగ శ్యామల కోమల కానన యను దానికి లేని విపరీతపు టర్థములను ధ్వనులను కల్పిం పరు. వారు వ్రాసిన దంతయు పండితు లంగీకరింపనిది. తెలియని వారు ప్రశంసింప వచ్చును. అలంకార శాస్త్రవేత్త లంగీక రింపరు. గణములవలని వ్యంగ్యము జనింపదు. వాని కా శక్తి లేదు. కావున పర్వతముయొక్క విస్తారమును కొండ కొమ్ముల స్వరూపమును ధ్వనించి రెక్కలు సాచి ఎగురు నట్లుగా నెగురుటను సూచించి పర్వ తాగ్రము నుండి క్రిందికి దిగుటను ధ్వనించె నన్నది సత్య దూర మనుటలో సందేహము లేదు. పెద్దనగారు రాయలవారి సభలో తుహిన భూధర శృంగ ఇత్యాది సమాసమును సత్యనారాయణగారు వ్యాఖ్యానించి నటుల ప్రపంచించి యుండడు. రాయలవా రుభయ భాషా కావ్య రచనా ధురంధరుడు. సాహితీ సార్వభౌముడు లక్షణ విదుడు. వాని సభయం దున్న తిమ్మ నాదులు గట్టి సాహిత్య వేత్తలు విద్వాంసులు. పెద్దన సత్యనారాయణగారు ప్రపంచించి నటులు బహుధా ప్రపంచించినచో పరిహాసము చేసి పంపెడివారు. రాయలవారు పల్లకి తన కేల పట్టి యెత్తెడివాడు కాడు.

పాదలేపము కరిగిపోయిన తరువాత సపది స్ఫూర్తిం జరణ

ద్వంద్వంబు రాకుండినన్ అని యొక్క మాటతో తద్గమన వైభవము వర్ణింపబడె నని (శ్రీ) సత్యనారాయణగారు వ్రాసిరి. అది యెట్లో సూచించ లేదు. ప్రవరుడు శీత శైలమును గాంచెను. నరనారాయణ చరణాంబురుహా ద్వయ భద్ర చిహ్నిత మయిన బదరికా వనమును మొదట ప్రవేశించెను. బదరీ తరు షండ మండ లాంతర సరణిన్ ధరణీసురుండు చవి చని యని యుండుటచేత కాలి నడకనే ప్రవరుడు శీత నగము నెక్కుట ప్రారంభించె ననుట విదితము. తరువాత నా యా తావులం బరిశీలించుచు గిరి కటకమున కరుదెంచినాడు ప్రవరుడు. నిరంతర తరు గహన గుహా విహార తత్పర మతియై నగరు మున్మనుమండు తపము గైకొనిన చోటు మొదలగు నవి చూచినాడు. ఇంత వరకు కాలి నడకనే పోయి నట్లు నిరంతర తరు గహన గుహా విహార తత్పర మతియై యను సమాసము స్పష్ట పరచు చున్నది. తలమే బ్రహ్మకు నైన నీ నగ మహాత్వం బెన్న నే నియ్యెడన్ గల చోద్యంబులు జేపు కన్గొనియెదం గాక అని తలంచినాడు. అంతలో నీహార వారిం బెరసి తత్పాద లేపంబు కరిగి పోయినది. ఆ సంగతి ప్రవరు డెరుగడు. బదరి కాశ్రమము నుండి కాలి నడక వేల్పు బడవాలుం గనుపపులు కన్న చోటు వరకు పర్వ తారోహరణము గావించెను. హిమవత్పర్వతా రోహణము కాలి నడకకు సాధ్య మైనది కా దనుట అసత్యము.

అతం డట్లాపధ హీనుండై నిజ పురీ యాత్రా మిళ త్కౌతుకో
ద్ధతిం బోవన్ సపది స్ఫుటార్తిం జరణ ద్వంద్వంబు రాకుండినన్

మిగుల చింతించినాడు ప్రవరుడు. పాదలేపము కరిగి పోయిన సంగతి యెరింగినాడు. ఇందు పోవన్ అను దానికి ఎగిరి పోవుటకు అని వ్యాఖ్యాత అర్థము వ్రాసెను. హుటాహుటి నడలన్ అను చోట చకచక గల నడకలతో నని యర్థము వ్రాసి యిచ్చుట ఎగిరి పోవుటకు అని వ్రాయుట విరుద్ధము. పోవన్ = వెడలి పోవుట కని యర్థము ఎగిరి పోవుట కని పూర్వాపరము లాలోచింపక వ్యాఖ్యాత వ్రాసెను

అది తప్పు. తన్ను నిలు సేర్చు నుపాయం బొనరించు సుకృతి యొకం డొదవు నేమో యని అందందు తిరిగినాడు. గంధర్వ యక్ష గాన ఘూర్ణిత మగు నొక కోనను గాంచినాడు. కాలువ వెంబడిని మల్లిక లవలంబనంబుగా గొని మణి పట్టభంగ సరణిన్ లోయలోనికి దిగినాడు ప్రవరుడు. ఆ సంగతి 'నికట మహీ ధరాగ్ర తట నిర్గత' అను పద్యముచేత పెద్దనగారు నిరూపించిరి. ఇట్లు పరిస్ఫుటముగా పెద్దనగారు నుడువగా ఎంత తొందరగా నడిపించినను ఒక యామ ములో వరుణా తీరమునుండి హిమవత్పర్వతములోని యచ్చరలు నివ సించు నిగూఢ ప్రదేశమునకుఁ బోఁజాలినది కాజాల దని వ్రాయుట సాహసము. పాదలేపము పోయిన తరువాత కోనలలోనికి ప్రవరుడు దిగె నను మాట వారికి స్ఫురింప లేదు. నికట మహీధరాగ్ర అను పద్యము వారు గమనించి యుండరు. మనుచరిత్ర సరిగా పరిశీలించి యుండ రని నా మిత్రు లనిన మాట సత్యమేమో యనిపించు చున్నది. అటఁ జని కాంచె భూమిసురు డను పద్యము పైనుండి పర్వత మంతయు నొక్క సారిగాఁ జూచిన కథ కాదు. ప్రవరుడు శీత శైలమును గాంచెను. అది యెట్టిదో పెద్దన యా పద్యమునందు వర్ణించెను. శిరము నుండి పాదములకు వర్ణించుట మహాకవుల లక్షణము. తుహిన భూధర శృంగ అను సమాసము నరయ వచ్చును. అటఁ జని కాంచె నను పద్యము తరువాతి వర్ణనలకు ప్రాతిపదిక. పెద్దనగారి యందలి గౌరవము కొలంది వరూథిని వ్యాసములో సత్యనారాయణగారు విప రీతములు రచించిరి. అంత పేరు ప్రతిష్ఠలు పొందినవారు ఇట్టి వ్యాస ములు వ్రాసి పాఠకులను తప్పు దారికి మరల్చుట విచారణీయము. ప్రవరుడు భూమి మీద హుటాహుటి నడల నరిగినా డనుట స్పష్టము. అత డెగిరెనో నడచెనో తెలిసికొనుటకు కావ్యమున నాధారములు లేవని వ్రాయుట అతి సాహసము. పాదలేప మెప్పుడు పూసె నను నను మాన మొకటి యున్నదే. సిద్ధుడు వచ్చు నప్పటికి కుతుపకాల మయినది. వాని కెదురేగ ప్రణతుఁ డగుచ

నర్ఘ్య పాద్యాది పూజనం బాచరించి
యిష్ట మృష్టాన్న కలన సంతుష్టుఁ జేసి

కుశలాదికము లడిగి తీర్థముల సంభాషణము ముగియు నప్పటికి దాదాపు సాయంకాల మైయుండును. ఆ రేయి సిద్ధుఁడు ప్రవరుని యింటియం దుండెను. అతడు తీర్థ సేవా చణ శీలి. మరునా డుదయ మునసె వరుణానదియందు ప్రవరుని తోపాటు స్నానాదికములను తీర్చుకొనెను. ఇంటికి వచ్చి పాదలేపమును ప్రవరుని పాదములను పూసెను. అకలం కౌషధ సత్యముం దెలియ నెంచి ప్రవరుడు మంచు కొండ కరిగెను. ఇట్లు పరిస్ఫుట ముగా పెద్దనగారు రచియించి యుండగా నర్థము చేసికొనలేక సమన్వయించుకొన జాలక విపరీత విమర్శనలకు బూనుకొనుట శోచనీయము. పెద్దనగారు నీరసములగు విషయములకు రసపుష్టి కల్పించి సంభాషణాదులలో కలుపుటచేత జిగి కలదయి నీరసాంశముల వర్ణన పరిహరించి రసవంతములగు భాగముల కొండొంటికి సమన్వయము కుదిర్చి నిబంధించుటచేత అల్లిక బిగువు కలదయి కథ అందముగా నడచినది. ఇదియే కథలోని యల్లిక జిగి బిగి. ఆ యా విషయములను సమన్వయము చేసికొని చదివి నప్పుడే మనుచరిత్రలోని కథా సారస్య మవగత మగును. ఊరక చదివినంత మాత్రముచేత అర్థము కాదు. అట్లు సమన్వయము చేసికొని అర్థమును గ్రహించి చదివినవా రీ విమర్శకులలో నొక్కరు లేరు. కావుననే సందేహాలు అనుమానాలు విపరీత వ్యాఖ్యానాలు బయలుదేరినవి. నేను వ్రాసినది కాదన గలవారు లేరు. కాదని సమర్థించుకొన లేరు.

పెద్దన మార్కండేయ పురాణములోని కథ ననుసరించినను రచనా సంవిధానమును ముందుగా నాలోచించెను. సక్రమ మయిన పద్ధతిని పుర వర్ణనతో మనుచరిత్ర కథను ప్రారంభించెను. నన్నె చోడుడు శ్రీనాథులు కావ్య రచనకు దారి చూపిన వారయ్యును ఈ

విషయమున పెద్దనార్యుడు పినవీరన ననుసరించెను.

వరణా ద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబి తాం
బరమై సౌధ సుధా ప్రభా ధవళిత ప్రాలేయరు గ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్త దేశంబునం
బుర మొప్పున్ మహి కంఠహార తరళ స్ఫూర్తిన్ విడంబించుచున్

అను పద్యముతో కథను ప్రారంభించెను. ఇది యరుణాస్పద పురము వర్ణన. ఈ పద్యము చదువగానే తుంగభద్రా నదీ తీరమునం దున్న విజయనగరము జ్ఞాపకమునకు వచ్చును. అది విజయనగర రాజులకు ముఖ్యపట్టణము. శ్రీకృష్ణరాయలవా రందుండి రాజ్య పాలనము గావించిరి. అది పెద్దనగారికి నివాసము. విజయనగరమునకు చుట్టు రాతి గోడ కలదు. అది కొండలను నిట్టనిలువుగా చెక్కి వాని మీద కట్టబడినది. ఇప్పు డది శిథిల మయ్యును మిగుల నున్నతముగా నుండును. ఒకప్పు డది మిన్నంటి యుండెడిదని తోచును. దానిని దృష్టియం దుంచుకొని పెద్దనగారు అరుణాస్పద పురమును పై విధమున వర్ణించి యుందురు. మహాకావ్యమునందు పదునెనిమిది వర్ణన లుండ వలయు నని లక్షణ కర్తల మతము. అందు పుర వర్ణన మొద టిది. దాని ననుసరించి పెద్దనగా రీ పద్యము వ్రాసిరి. ఆ పురమునందలి నాల్గు వర్ణములవారిని తరువాత సీసపద్యములో వర్ణించిరి. పెద్దనగారు కడు రసికుడు. రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పురపు విడెము సేవించుచు కావ్యములను చెప్పును. కావున శృంగార రసాశ్రయలైన వేశ్యలను మరచి పోలేదు. తాను వ్రాయునది శృంగార కావ్యము నాయకురాలు వేశ్య ఎట్లు మరచి పోగలడు.

అచటి వెలయాండ్రు రంభాదు లైన నొరయఁ
గాసె కొంగున వారించి కడపఁ గలరు
నాట్య రేఖా కళా ధురంధర నిరూఢి

నట. ఇందు కాసె కొంగునన్। వెన్కకు దోఁపుకొను చీర చెంగు చేతి నవి వ్యాఖ్యాత అర్థమును వ్రాసెను. చీరకు కట్టు కొంగని పైట కొంగని రెండు కొంగు లుండును. వ్యాఖ్యాత అభిప్రాయమును బట్టి కాసెపోసి కట్టుకొనుట వస్త్రధారణ విశేషము. అప్పుడును కట్టు కొంగునకు కాసె కొంగనరు. అనినను కొంగు వెనుకకు దోపుకొనుట యుండదు. కుచ్చెలలో ముందున కుండును. కావున ఆ యర్థము చెల్లదు. వారాంగనలు కాసెపోసి కట్టరు. వారి వస్త్రధారణములో కాసె కొంగుండదు. వారు గూడకట్టు కట్టుదురు. అప్పుడు కట్టుకొంగు లోపల నుండును. దానితో వారించుట కలుగదు. పెద్దన మను చరిత్రయందు తన కాలములోని యాచార వ్యవహారములు ప్రతి బింబింప చేసెను. రాజుల కొలువునందు ప్రవేసించు స్త్రీ పురుషులు కాసె కోకలు నడుము నకు కట్టు కొందురు. స్త్రీలు వెలయాంద్రు నుత్తరీయము వంటి సన్నని పట్టు దువ్వలువ నడుమునకు చుట్టి ప్రక్కకు చెంగులు జార విడిచి దూముడి వేయుదురు. అది ఆచారము. రాయల సభలో వెలయాం డ్రటులనే ధరించిరి. ఆ వస్త్రమునకు కాసె కోక యందురు. దాని కొంగులకు కాసెకొంగు లందురు. ఈ పదము రఘునాథ నాయకుడు రఘునాథ రామాయణమునందు పలు చోట్లుల్ల వాడెను. తంజావూరు తెనుగు కవులలో ఆ సంగతి విశద పరచితిని. కావున కాసెకొంగునన్ అనగా కాసెవలువ చివరి చెంగులచేత నని యర్థము. అచటఁ బుట్టిన చిగురు కొమ్మైన్మనఁ జేవ యను పాదముతో పెద్దనగారు సీస పద్యమును ముగించిరి. అది చక్కని యభిప్రాయ గర్భిత మయిన పాదము. చిగురు కొమ్మ లలో చేవ యుండదు. తేలికగా త్రుంప వచ్చును. అరుణాస్పదము నందు పుట్టిన చిగురులు గల లేత కొమ్మైనను చేవ గలది. అనగా గట్టితనము కలది యని యర్థము. చిగురు కొమ్మలే గట్టితనము గల వగుచుండ నితర కొమ్మల మాట చెప్ప వలసిన పని లేదు. కడుంగడు గట్టితనము గల వను భావ మందు నిమిడి యున్నది. అందు మూల

మున ఆ నగరమునందు జనించిన ప్రవరుని మనస్సు గట్టితనము సూచింప బడినది. వరూధిని వలపులకు లొంగని ప్రవరుని చిత్త దార్ఢ్యమును మనస్సునం దుంచుకొని పెద్దనగారీ పాదమును రచించిరి. తరువాత నాయకుని వర్ణన. పెద్దనగారు దేనిని అతిగా వర్ణింపడు. వర్ణించిన దానిలో విసూతనత్వ ముండును. రెండు మూడు పద్యములతో విషయము మార్చి వేయును. అందు మూలమున వాని వర్ణనలు పాఠకునకు విసుగు పుట్టింపవు. తరువాతి కవుల కావ్యములకు మనుచరిత్రకు గల తారతమ్యములలో నిది యొకటి. పెద్దన రెండు పద్యములలో తేల్చిన పుర వర్ణన యిరువది పద్యముల వరకు పెంచిన కావ్యములు గలవు. వానిని చదువుటకు విసుగు పుట్టును పెద్దన ఒకొక్కప్పుడు వర్ణనాంశములను కథలో నిమిడ్చి వేయును. నాయకురా లయిన వరూథిని వర్ణన యట్లు గావించెను.

అరుణాస్పదమునందు ప్రవరు డనువాడు కలడు అని సక్రమ మయిన పద్ధతిని కథ నడిపించెను. అతడు అంబురుహాగర్భ కులాభరణంబు. మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి, భాషాపరశేష భోగి, వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడు, అనార తాధ్యాపన తత్పరుండు, అలేఖ్య తనూ విలాసుడు, అని వర్ణించినాడు పెద్దన. ఈ యారు విశేషణముల మీదనే వరూథినీ ప్రవరుల కథ, యాధారపడి యున్నది. పెద్దనగారు పూర్వాపర సందర్భములను పరిశీలించి ఒక దానితో నొకటి అనుసంధించి పరస్పర వైరుధ్యము పొసగ నీయక కథకు బిగువు కూర్చెను. మనుచరిత్రలో నే పద్యము చూచిన నొక దానితో నింకొక దానికి సంబంధ ముండును. ఒకొక్కప్పు డొక పద్య మింకొక పద్యములో సూచించ బడిన విషయమునకు వ్యాఖ్యానముగా నుండును. ఎంత వరకు దేని నెచ్చట వర్ణింప వలయునో ఆ విషయము నెక్కడ పెంచి చెప్ప వలయునో ముందుగా నాలోచించి పెద్దనగారు మనుచరిత్రను వ్రాసిరి. ఈ విధాన మితర కావ్యములందుండదు. ప్రవరు డంబురుహాగర్భ కులాభరణం డగుటచేత ధీరశాంతు

డను నాయకుడు. 'ఆరూఢ యౌవన ధీప్రసన్నుఁడు ద్విజుండౌ ధీరశాంతు' డని కావ్యాలంకారము. అతడు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి యట. ఆ మనోజ్ఞత

ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంతి వసంత కంతులన్
జక్కఁదనంబునన్ గెలువఁ జాలినవాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీ తనూ విభవ మెక్కడ యేలని బంటుగా మరున్
డక్కఁ గొనంగ రాదె యకటా! నను వీఁడు పరిగ్రహించినన్

అని విపులముగా వరూథిని నోట వర్ణింపఁ జేసినాడు పెద్దన. ఆ తనూ విభవమును

వదన ప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబు లన వీని కన్ను లమరు
నిక్కి వీనులతోడ నెక్కసక్కెము లాడు
కరణి నున్నవి వీని ఘన భుజములు
సంకల్పసంభ వాస్థాన పీఠిక వోలె
వెడదయై కనుపట్టు వీని యురము
ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్ఱ వాఱిన
రీతి నున్నవి వీని మృదు పదములు

అని ప్రవరుని వివిధావయవముల యందము వివరించినది వరూథిని. చివరకు

నెరుకటేటి యసల్ తెచ్చి నీరజాప్తు
సానఁ బట్టిన రాఁపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేని కాంతి

యనినది. ఇందు నుడిలిన మూడు వస్తువులు దివ్యములు. వానిని

మేళవించినచో కలుగు కాంతి యెవరు నూహింప లేరు. చిత్రింప లేరు. కావున ప్రవరు డలేఖ్య తనూ విలాసు డని పెద్దన యొక్క మాటతో నుడివెను. ఆ తనూ విలాస మెట్టిదో గీతములో వివరించెను. ప్రవరుడు అనార తాధ్యాపన తత్పరుండు. అధ్యాపన మనగా శిష్యులచేత వేదములను చదివించుట. కోనసీమ వేధాధ్యయన పరులైన బ్రాహ్మణులకు నిలయము. ఒకొక్కరికి పెక్కు మంది శిష్యు లుందురు. గురువు లెక్కడికి పోయిన శిష్యులు వాని వెంట నరుగు చుందురు. గురువు పాఠము చెప్పు చుండును. శిష్యులు సంతన చెప్పుచుందురు. ఒకొక్కప్పుడు శిష్యులు సంత చెప్పుచు వెంట వచ్చు చుందురు. గురువు వినుచుండును. తప్పు లున్న దిద్దు చుండును. ఇది యలవాటు. ఇట్టి యలవాటు పల్లె పట్టులం దచ్చటచ్చట ఇప్పటికిని గలదు. భరద్వాజుడు వాల్మీకి శిష్యుడు. అతడు వల్కలములను గొని వెంబడింప వాల్మీకి తమసా నదికి వచ్చి స్నానాదికములను నిర్వర్తించు కొనె నని శ్రీమద్రామాయణమునం దున్నది. ఇది యనాది గతమైన ఆచారము. పరంప రాగతము. ప్రవరుడు అనార తధ్యాపన తత్పరుండు కావున

సచ్ఛాత్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట
నఘ మర్షణ స్నాన మాచరించి
సాంధ్య కృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి
సైకత స్థలిఁ గర్మసాక్షి కెఱఁగి

ఫల సమి త్కుశ కుసు మాది బహు పదార్థ
తతియు నుదికిన మడుఁగు దోవతులుఁ గొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ

ఇట్లు పెద్దన్నగారు ఒక పద్యముతో నింకొక పద్యమునకు ఒక విష

యముతో నింకొక విషయమునకు ఒక భావముతో నింకొక భావము నకు సంబం ధానుబంధములు కూర్చి కథను నడిపించినాడు. ఆ కారణముచేత మనుచరిత్రలోని యితివృత్తము బిగువు కల దయినది. ప్రవరుడు చక్కనివాడు. కాని విరాగి. చక్కదనము జార స్త్రీల నాకర్షించునది. వైరాగ్యము వారిని నిరాకరించునది. ఆ రెంటి సమ్మేళనము ప్రవరుని పాత్ర. ఇట్టి పరస్పర విరుద్ధ లక్షణములు గల నాయకునితో కథ మరింత మనోహర మయినది.

వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జార కామినులకు
భోగ బాహ్య మయ్యెఁ జూచిన సంపెంగ
పొలుపు మధుక రాంగనలకుఁ బోలె

ఈ పద్యము వరూథినీ ప్రవరుల కథకు బీజము. దీని నుండి తరువాతి కథ పెరిగి విస్తరించినది. దృశ్య ప్రబంధములందు వలెనే మహాకవులు రచించు శ్రవ్య కావ్యములందును బీజము బిందువు ప్రకరీ పతాకాదు లుండును.

చర న్వనాంతే నవ మంజరీషు
న షట్పదో గంధఫలీం న జిఘ్రతి
సా కిం న రమ్యా స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వ రాజ్ఞా

నానా సూన వితాన వాసనల నానందించు సారంగము సంపెంగ జోలికి పోనొల్లదు. సంపెంగ అంద మయినదే. షట్పదము రమింపఁ గలదే. అయిన నింకనేమి యందురా. అట్లు పోకుండుట ఈశ్వరాజ్ఞ. ఈ భావమును మనసునం దుంచుకొని పెద్దనగారు పై పద్యము వ్రాసిరి. మధుకర మనగా తేనెను చేయునది తుమ్మెద. అది ప్రతి పుష్పము నందు వ్రాలి మధువును పరిగ్రహించును. మధుక రాంగన అన్నాడు

పెద్దనగారు. అనగా ఆడు తుమ్మెద యని యర్థము. ఇది జార స్త్రీకి నుపమానము. ఆడు తుమ్మెదకు సంపెంగ పొలుపు అనగా అందము వలె నని భావము. సంపెంగ ప్రవరునకు నుపమానము. ప్రవరుని చక్కదనము భోగ బాహ్య మయినది. భోగ బాహ్య మగుట సాధర్మ్యము. ఇది పూర్ణోపమాలంకారము. ప్రవరుడు ముదుసలియా భోగ బాహ్య మగుటకు ననినచో ముదుసలి కాడు. అందుకనే పూచిన సంపెంగ యనినాడు పెద్దన. పూచిన యనగా వికసించిన యని యర్థము. పూచిన సంపెంగ వంటివాడు ప్రవరుడు. సంపెంగకు వాడిన విశేషణముచేత యౌవన వికాసము కలవాడు ప్రవరు డని యర్థము. మరేల జార స్త్రీలకు భోగ భాహ్యు డయినాడందురా? వైరాగ్యము కారణము. అదే ప్రవరుని విషయమునం దీశ్వ రాజ్ఞ. ప్రవరుని యీ గుణము మీదనే కథ యాధార పడి యున్నది. కావున నిది బీజము. పద్యమునందలి యలంకారము కారణముచేత వరూథిని ప్రవరుని అందమును చూచి వలచుటయు నామె వలపు నిరర్థక మగుటయు వ్యంగముగా సూచింప బడినది. ఇది యలంకార కృత వస్తు ధ్వని. అందము బైటికి కాన్పించునది. వైరాగ్యము ఆంతరంగికము. అది కనిపించునది కాదు. వరూథిని జారస్త్రీ. ప్రవరుని యందము చూచినది. చేలు పోయినది. వలచినది. పెద్దనగా రా సందర్భమున నాలు గైదు ప్రవరుని సౌందర్యమును అభివర్ణించు పద్యములను వరూథిని నోట పలికించెను. అందము దేహాది అవయవముల నాశ్రయించి యుండును. కుందనము వంటి మేను ఇత్యాది పద్యములలోని భావము లన్నియు అందమున కాధార మయిన దేహమునకు సంబంధించిన వాదనలు. అవి సుఖానుభవ యోగ్యములు. వైరాగ్యమున కాధారము మనస్సు. అది ఆత్మను సంబంధించినది. ఆత్మ పరతత్త్వాను సంధానము కోరును. తుచ్ఛ సుఖముల్ వ్రాసాలపైఁ దేనియల్ ఇత్యాది పద్యములలోని భావము లన్నియు మోక్ష లక్ష్మ్య పధ్యాగమ సూత్ర పంక్తుల ననుస

రించిన వాదనలు. అవి యాముష్మికములు. ఇట్లు పరస్పర విరుద్ధములయిన ఐహికాముష్మిక సుఖ సాధనములగు రాగ విరాగములకు నిలయము లయిన వరూథినీ ప్రవర పాత్రల వివాదములను కథయందు మనోరంజకముగా విస్తరింప చేసినాడు పెద్దన. కావున మనుచరిత్ర యొక వేదాంత గ్రంథము. అర్థము చేసికొన వలయును గాని అందు మహారత్నము లున్నవి.

యౌవనమందు యజ్వయు నను పద్యమునందు ప్రవరుని సంసారమును వర్ణించినాడు పెద్దన. కమనీయ కౌతుక శ్రీవిధిఁ గూటముల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌఖ్యావహయై భజింప ననుటచేత స్వీయ సోమిదమ్మ. ప్రవరు డనుకూల నాయకుడు. కావున

అనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందు నొక్కొ

యని చింతించినాడు. ఇట్లు చక్కగా ప్రవరుని పాత్ర పోషణ గావించినాడు పెద్దన. ప్రవరుడు వైరాగ్యము కలవా డయినను శుకాదుల వలె సంసారేచ్ఛ లేనివాడు కాడు. వసిష్ఠ అగస్త్యుల వంటివాడు. వారికి సంసారము లున్నవి. ఆ సంగతి విశదీకరించుటకే యీ పద్యము. కాని వారికంటె ప్రవరుడు భిన్నుడు. ఇతడు నగరవాసి. అరుణాస్పద పురమునం దాతడు స్థాయిక నివసించి యుండును. వానికి అరుణోదయ మాది కుతుప కాలము వరకు స్నాన సంధ్యావందన సురార్చ నాతిథి సేవలతో నూపిరి పీల్చుకొనుట కయిన సావకాశ ముండదు. సాయంకాలము మరల కర్మ కలాపములు. నడికి రేయి యైన నతిథి అభ్యాగతుల సేవ జరుపు చుండును. ఎచ్చటకు కదులుటకు వీలులేదు. అందువలననే మానినాథ కుటుంబ జంబాల పటల మగ్న మాదృశ గృహమేధి మండలంబు అను పద్యము ప్రవరు నోటఁ బలికించినాడు పెద్దన.

## కాలమునకు ప్రతిబింబము కావ్యము

కవి తన కాలమునందలి సాంఘిక వ్యవస్థలు కావ్యమునందు చిత్రించును. ప్రఖ్యాతము మిశ్రమము ప్రతిపాద్యము లని కావ్యములు మూడు విధములు. ప్రఖ్యాతములు పౌరాణికములు. తెనుగు నందు భారత భాగవత రామాయణాది యాంధ్రీకృత కావ్యములు పౌరాణికములు. వానియందు కవి కాలమునందలి సాంఘిక వ్యవస్థలు ప్రతిబింబింప చేయుటకు సావకాశము లేదు. అవి దైవతములు. వాని కొక ప్రత్యేకత యున్నది. మిశ్రమ కావ్యములలో కవి కల్పనలకు సావకాశ మున్నది. అందు కవి కాలము నాటి యాచార వ్యవహారములు జొనిపింప వచ్చును. కుమార సంభవము పౌరాణికము, ప్రఖ్యాతము. అందు కాళిదాసునకు కథలో తీర్పులు దిద్దుటకు సావకాశము లేక పోయినది. శాకుంతలము మిశ్రమ కావ్యము. కణ్వుడు శకుంతల న త్తవారింటికి పంపుట రంగమును నిర్మాణము కావించెను. అందు సంఘాచారములను జొనిపించినాడు. మేఘ సందేశము ఋతు సంహారము నుత్పాద్యములు. అందనేక సాంఘిక వ్యవస్థలు ప్రతిబింబింప జేసినాడు కాళిదాసు. మనుచరిత్రలోని కథ మార్కండేయ పురాణములోనిది. ప్రవరుని కథ కడు ప్రాచీన మయినది. అట్టి ప్రాచీన కథకు నవీనత కల్పించినాడు పెద్దన. పురాణ పురుషు డయిన ప్రవరుని పెద్దనగారి కాలములోని సాంఘిక పురుషునిగా మార్చినాడు. పాఠకుల యూహా కందుబాటులోనికి తెచ్చినాడు. అందుకనే మనుచరిత్ర కంత ఘనత వచ్చినది. అది పూర్వ కవు లెవ్వరు చేయలేదు. ఆ రహస్యము నూహించ లేదు. గ్రహించ లేదు. వసుచరిత్ర మనుచరిత్ర వలె వ్రాయ వలయు నని బహు ప్రయత్నము చేసినాడు భట్టుమూర్తి. అసలు రహస్య మవగాహన చేసికొన లేదు. వసుచరిత్ర యుపరిచర మహారాజు కథ. కోలాహల పర్వతమునకు శుక్తిమతి యను నది వెలందికి పుట్టిన గిరిజ వృత్తాంతము. అంతయు పౌరాణికము. కావున అది రాణింప

లేదు. పింగళి సూరనగారి కళాపూర్ణోదయ మత్యద్భుత మయిన కల్పిత ప్రబంధము. అట్లు కథ నుత్పాదించినవారు తెనుగులో నింకొకరు లేరు. అయిన నేమి. అది యంతయు దైవత రాక్షస ప్రవృత్తులతో నిండినది. సాంఘిక ప్రవృత్తి శూన్యము. ఆయన ప్రభావతీ ప్రద్యుమ్న మభూత కల్పనలు కలది. మానవుల యూహా కలితము. ఇట్లే యితర కావ్యములు, పెద్దన సమకాలికులలో ముక్కు తిమ్మనార్యు డొకడు. అతడు పారిజాతాపహరణము రచించెను. అందలి కథ పౌరాణికము. శ్రీకృష్ణుడు నాయకుడు. సత్యభామ నాయకురాలు. వారు పురాణ పురుషులు. వారియందు మానవ ప్రవృత్తి నారోపించి తిమ్మన సాంఘికముగా మలిచెను. కావున అది మనుచరిత్ర తరువాత వినుతింపc దగిన దైనది. శ్రీరాయలవారి విష్ణుచిత్తీయములో దైవము వెనుకనుండి నాటక మాడినను కావ్య మంతయు సాంఘిక ప్రవృత్తికి ప్రతిబింబము. తరువాతి కావ్యములలో వైజయంతీ విలాసము ఆ కాలమునందలి దురాచారములను మూఢ నమ్మకములను ప్రదర్శించు గ్రంథము.

పెద్దన ప్రవరుని శుకుడు ఋశ్యశృంగుని వలె జటాజిన వల్కల ధారిగా నిర్మింప లేదు. నాగరికుడయి సంఘమునందు నివసించు నొక యాహితాగ్నిగా సృష్టించెను. అదియే పెద్దనగారు చేసిన గొప్పతనము. అందు మూలమున తన కాలమునందలి యాహితాగ్ని కుటుంబములలోని యాచారములను బ్రాహ్మణుల ప్రవృత్తిని మనుచరిత్రయందు చిత్రింప గలిగెను. ప్రవరుడు యావనమందు యజ్ఞములు గావించెను. అతడు ధనాఢ్యుడు. దేవియుం దేవర వోలె నుండి తలి దండ్రులు ఇంటి పనులు చక్కపెట్టు చుండిరి. కూరిమి సోమిదమ్మ సౌఖ్యావహమై తన్ను భజించు చుండెను. చీకును చింతయు లేక వానికి కాపురము సాగి పోవు చుండెను. ఇది పెద్దనగారి కాలమునందలి యాహితాగ్ని కుటుంబముల లక్షణము. ఆ కాలమునం దాహితాగ్నులు ధనాఢ్యులయి యజ్ఞ యాగాదు లొన

రించిరి. దానికి మహాప్రభువు కారణము. అప్పటి రాజు శ్రీకృష్ణ రాయలు. బ్రాహ్మణులను కవులను పండితులను అగ్రహారములు మడి మాన్యము లిచ్చి పోషించెను. పెద్దన తిమ్మ నాదులకు కోకటా ద్యనేకాగ్రహారము లడిగిన చోటులం దిచ్చెను. పెద్దన కోకటము నకు శరకోపాగ్రహార మను పేరు పెట్టి బ్రాహ్మణులకు దానము చేసెను. యథా రాజా తథా ప్రజా. రాయలవారి కాలమున బ్రాహ్మణులు ధనవంతులయి పాడియు పంటయు గలిగి యే లోటు లేక సుఖంచిరి. కావున వారు సాలగ్రామ దాన మయిన పరిగ్రహించెడి వారు కారు. దాన పరిగ్రహముకూడ పాపావహము. పాప కార్య ములు వారు చేసెడివారు కారు. వారికి మాన్య క్షేత్రములు గలవు. అవి పెక్కు చందాలం బండును. ఆ కాలమునందలి బ్రాహ్మణులు అధ్యయన పరులు. అధ్యాపనము వారి పని. శిష్యులచేత వేద పాఠములను వల్లె వేయించు చుండెడివారు. శిష్యులు గురు సేవా రతులు. విజయనగరము తుంగభద్రా నది యొడ్డున నున్నది. ప్రత్యూష పవ నాంకురములు పైకొను వేళ వారు వామన స్తుతి పరత్వమున లేతురు. శిష్యులు వెంబడింప తుంగభద్రా నది కరుగుదురు. అఘ మర్షణ స్నానాదు లొనరింతురు. ఇంటికి వచ్చి యగ్ని కార్యాదు లొనరించు కొందురు. ఈ గుణముల నన్నిటిని ప్రవరునియం దారో పించి శీలంబున్ గులమున్ శమంబు, వరుణా తరంగిణీ దర వికస్వర అను రెండు పద్యములు రచించినాడు పెద్దన. వానియందు భారతీయ ఆహితాగ్ని బ్రాహ్మణ కుటుంబముల యాచారములను చక్కగా చిత్రించినాడు. అంతే కాదు. వారి యతిథి సేవ తరువాతి పద్యములలో వివరించెను.

వండ నలయదు వేవురు వచ్చి రేని
నన్నపూర్ణకు నుద్దియా నతని గృహిణి
యతిథు లేతెర నడికి రే యైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ

ఇది ప్రవరుని భార్య గుణ వర్ణనము. పురుషుల వర్తన మట్టిది. ఈ పద్యమునందు స్త్రీల గుణమును వర్ణించినాడు పెద్దన. వారు స్వాధీన పతికలు. సహధర్మ చారిణులు. అతిథులకు వండి పెట్టుట యందు వారికి నడిరాత్రి యైనను విసుగు విరామ ముండదు. అన్న పూర్ణకు వారు సమానులు. ఆతిథ్య మనాది నుండియు భారతీయ సంప్రదాయము. దాని నిందు పొందు పరచినాడు పెద్దన. ఈ యాతిథ్యమును గురించి బహుధా వర్ణించినాడు విష్ణుచిత్తీయమునందు రాయలవారు. అది విజయనగర సామ్రాజ్యములో నొక నిత్య కృత్యము. ఒక్క బ్రాహ్మణులయందే కాదు. అన్ని జాతుల యందును కలదు. కావుననే

అచటి నాలవ జాతి హాల ముఖాత్త విభూతి
నాది భిక్షువు భైక్ష మైన మాన్చు

నట. వారి యాతిథ్య మటువంటిది. వారి ధన ధాన్య సంపద లటు వంటివి. విస్తృత రాజ్యము, ఫర్‌గాటెన్ అంపైర్ చదివినవారికి విజయనగర సామ్రాజ్య వైభవము తెలియును. నికోలోకంటి, అబ్దుల్ రజాక్, బార్బోసా మొదలగువారు విదేశ యాత్రికులు. బహుముఖ ములగా విజయనగర రాజ్య సంపదలను వర్ణించిరి. పెద్దనగారు దానినే మనుచరిత్రయందు వర్ణించెను. ఆ వర్ణనలో నతిశయోక్తులు లేవు. అన్నియు స్వభావోక్తులు, సత్యములు. విజయనగరమునందలి విప్రులనార తాధ్యాపన తత్పరు లయిన శాస్త్రపండితులు. విద్యా ప్రౌఢి యందు ముది మది తప్పిన మొదటవేల్పును మెచ్చరు. దీనికి పెద్దనాదు లైన మహా విద్వాంసులు ప్రత్యక్ష ప్రమాణము. రాయల వారు మూరురాయరగండ సమరాంగణ సార్వభౌముడు. ఆయన విజయ పరంపర లాయన పరాక్రమమునకు ప్రబల సాక్ష్యములు. వాని కత్తికి తిరుగు లేదు. తురకలు సైతము పరాభూతులయి తలలు వంచుకొనిరి. వాని సేనా నాయకులు సైనికులు గూడ నంతటివారు.

బంటు నంపి భార్గవులైన రాయలవా రంకమునకు బిలిపించు కొనగల మహావీరుడు. అచటి కిరాటుల సంగతి చెప్ప వలసిన పనిలేదు. విజయనగరమందు వర్తకులు నవ రత్నములను రాసులుగా నంగడిలో పోసి యమ్ము చుండెడివారట. వార లలకాధిపతి నైన మునుసంచి మొదలిచ్చి మనుప దక్షులు. ఇట్లు పెద్దన తాను చూచిన దానినే తన కావ్యమునందు వర్ణించెను. విజయనగర మహావైభవము నరుణాస్పద వైభవముగా రూపొందించెను. అందుచేతనే మనుచరిత్ర మూన వానుభవములలోని దయినది.

తీర్థ సంవాసు లేతెంచినా రని విన్న
 యెదురుగా నేగు దవ్వైంత యైన

అను పద్యము తరువాతది. ఈ పద్యము మనుచరిత్ర ప్రథమాశ్వాసము లోని కథకు పునాది. ప్రవరుడు అభ్యాగత సేవా పరతంత్రుడు. తీర్థ సందర్శ నాభిలాషి. అత డనుదినము తీర్థ సందర్శ నాభిలాష మాత్మ నుప్పొంగ జూడ బోవలయు నని యూర్పులు నిగుడ్చు చుండును. ఒకనాటి కుతుప కాలమునం దౌషధ సిద్ధు డాతని యింటికి వచ్చెను. వానికి అర్ఘ్య పాద్యాది పూజనం బాచరించెను. ఇష్ట మృష్టాన్న కలన సంతుష్టుని గావించెను. ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ వామన స్తుతి పరత్వమున లేచుట ప్రవరుని యలవా టని పెద్దనగారు నుడివిరి. వామనుడు విష్ణువు. ప్రవరుడు విష్ణుభక్తు డని చెప్పక తప్పదు. ప్రవరు నింటికి వచ్చిన సిద్ధుఁడు మువ్వన్నె మొగము తోలు కిరీటముగా ధరించెను. బడుగు దేహంబున భస్మ మలదెను. చెవుల రుద్రాక్షు పోగులు తాల్చెను. ఇట్టి లక్షణములు శివ భక్తులందు కనిపించును. శివు డష్ట సిద్ధులకు మూలము. వాని భక్తుల కా సిద్ధులు లభించును. కావున ఔషధ సిద్ధుడు శివభక్తు డనక తప్పదు. అదియు గాక పాద లేప మను దివ్యౌషధంపు రసం బీశ్వర సత్కృపం గలిగె నని సిద్ధుడు

పలికెను. ఈశ్వర వాచ్యుడు శివుడు. అందు మూలమున ఔషధ సిద్ధుడు శివారాధనపరు డనుటలో సందేహము లేదు. విష్ణు భక్తులు శివ పరాఙ్ముఖులు. శైవులు విష్ణు భక్తుల యాతిథ్య మంగీకరింపరు. ఇట్టి పరస్పర విరుద్ధ మనో వృత్తులు గల భిన్న పాత్రలకు సమైక్యత కల్పించినాడు పెద్దన. ఇది విచిత్ర సంఘటనము. ఇది యా కాలము నందలి మతముల సమైక్యతను సూచించును. శైవులకు వైష్ణవులకు పరస్పర విరోధము కలదు. రాయల వారి కాలమున విజయనగర రాజ్యమునందు మత కల్లోలములు మచ్చునకైన లేవు. శ్రీకృష్ణ రాయలు విష్ణు భక్తుడు, వైష్ణవుడు. ఆ మహారాజు పెద్దనవంటి వైష్ణవునకు ధూర్జటి వంటి వీర శైవునకు గూడ తన కొలువునందు స్థాన మొసంగెను. శైవ వైష్ణవములను సమ దృష్టితో చూచెను. ప్రజలు మత విరోధములు లేక పరస్పర సహకార సౌహార్దములు కలిగి యుండిరి. దాని ప్రతిబింబము ప్రవరుడు సిద్ధున కాతిథ్య మిడుట. ఆ నాటి సాంఘిక వ్యవస్థను చూచించు చున్నది. ఇట్లు పద పదము నందు పెద్దన యా కాలమందలి సాంఘిక మత రాజకీయ పరిస్థితులను తన కావ్యమునందు ప్రతిబింబింప చేయుచు పౌరాణిక మగు కథను సాంఘికము గావించి పాఠకుల యూహల కందుబాటులో నుండు నటుల చేసెను. కథనే కాదు పాత్రలను గూడ నా విధముగానే సృష్టించెను. అందు మూలమున మనుచరిత్ర కావ్య లోకమునందు ప్రథమస్థాన మలంకరించినది. ప్రవరుడు

ఏ యే దేశములం జరించితిరి మీ రే యే గిరుల్ చూచినా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రే యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్య వనాళిఁ గ్రుమ్మరితి రే యే తోయధుల్ డాసినా-
రా యా చోటులఁ గల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపరే

యని యడిగెను.

ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణ శశాంక తీర్థ యా
త్రా చణ శీలినై జనపదంబులు పుణ్య నదీ నదంబులుం
జూచితి నందు నందుఁ గల చోద్యములం గనుగొంటి నా పటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్

కేదారేశు భజించితిన్ శిరమునం గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగ నిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథ సుతా కళత్రు బదరీ నారాయణుం గంటి నీ
యా దేశంబన నేల చూచితి సమస్తా శావకాశంబులన్

అని తాను చూచిన సకల ప్రదేశంబులను వర్ణించి చెప్పినాడు సిద్ధుడు. సమాసముల కూర్పునం దలసాని పెద్దన సిద్ధ హస్తుడు. సాధ్య మగు నంత వరకు ఒత్తక్షరములను సంయుక్తాక్షరములను పరిహరించును. చిన్న చిన్న పదముల నేర్చి కూర్చును. అందు మూలమున పలుకు బడికి కఠినముగా నుండక పరుష సరళముల పొందిక చేత మృదులము లయి చదువు నప్పుడు నట్టుపడ నీయవు. పదములలో మెత్తందన ముండును. తేనె వలె రసనకు ప్రీతి కలిగించును. పై పద్యములందలి సమాసము లరయునది. యాదోనాథ సుతా కళత్రుడట బదరీ నారా యణుడు. సముద్రుని కూతురు భార్యగా కలవాడు. అన్వయము చుట్టయ్యును సమాసములోని యందము దానిని మ్రింగి వేసినది. సమాస కల్పనమునందు ఇట్టి రచన పంట నూదినను ముద్దుల గుమ్మ కమ్మనా వాతెర దొండ పండు వలె వాచవి గలిగి యుండును.

## పెద్దనలో నన్నయ

పోకడలు కనిపించును. నన్నయ సమాసము లన్నియు నట్లే యుండును. ఆ పదముల కూర్పునకు అనుప్రాసలు మరింత యందము తెచ్చి పెట్టును. ఆ యనుప్రాసము రెండు మూడు పదములకు మించి యుండదు. సమాసము దీర్ఘ మయిన కొలంది అనుప్రాస మారిపోవు

చుండును. అందు మూలమున ఎంత దీర్ఘ మయినను సమాసము పాఠకునకు విసుగు పుట్టింపదు. ఆ సమాసములు స్థానాస్థానములను పరిశీలించి వాడుట నన్నయ పెద్దనల యలవాటు. మచ్చునకు

సాగర సార వారిరుహ శౌక్తిక మౌక్తిక విద్రుమ ద్రుమై
లాగురు చందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణ యుక్తిమైఁ బరగు సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగత రాజ పుత్రులు మహాగుణశాలి కజాత వైరికిన్.

నన్నయ ఒక్కొక్కప్పుడు పద్యమును సమాసముతో ప్రారంభించును. మధ్య వేరు వేరు పదముల కూర్పు నొదవించును. చివరకు మరల నొక దీర్ఘ సమాసమును వేయును. పద్యాంతమునందు అంత్య ప్రాస గల రెండు వేరు వేరు పదములనో లేక వృత్యను ప్రాసగల చిన్న సమాసమునో వాడును. పెద్దన పద్యములయొక్క యెత్తుగడయు దింపుగడయు నన్నయ పద్యములను పోలి యుండును. ఈ క్రింది పద్యములు పరిశీలింప వచ్చును.

ఆ నారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యామల జ్యోత్స్నఁ జి
త్తానందం బొనరించుచున్ జనుల కర్థాంశు ప్రకాశంబుతో
మానై సాత్యవతేయ ధీ వనధి జన్మ శ్రీమహా భారతా
ఖ్యా నాఖ్యామృత సూతి యొప్పు నిఖిలాఘ ధ్వాంత విధ్వంసియై

ఇది నన్నయగారి పద్యము.

బహు రత్న ద్యుతి మేదు రోదర దరీ భాగంబులన్ బొల్చు ని
మ్నగహా కాహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహ ణేందిందిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్.

ఇది పెద్దనగారి పద్యము.

ఇంకొకప్పుడు నన్నయ సమాసంపు పొందికలో భావమును స్ఫురింప చేయును. అందు తాళ మాన గతులు చొనిపించును. నన్నయ సంగీత విద్వాంసుడు. ఆ వైదుష్యత పద్యపు నడకయందు పదముల కూర్పునందు గోచరించును. మచ్చునకు.

వివి ధోత్తుంగ తరంగ ఘట్టన చల ద్వేలా వనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం ద తీర దేశంబునం
దవదా తాంబుజ ఫేన పుంజ నిభు నయ్యశ్వో త్తమున్ దవ్వులన్

ఈ పద్యమునందు వివిదోత్తుంగ తరంగ ఘట్టన చలత్ వరకు గల సమాసమునందలి పదముల కూర్పుచేత పొంగి ముందునకు తూగి వచ్చు సముద్ర తరంగముల ఘట్టనమును స్ఫురింప చేసెను. లకార మనుప్రాసగా వాడి లతా లాస్యములను స్ఫురింప చేసెను. దాని కనుగుణముగ లుంగ లవంగ సంగతమునందు తాళ గతిని చొని పించెను. ఇట్లు పదములను పొందించుట నన్నయకే చెల్లి పోయినది. ఆ పద్యము సరిగా చదువ గల వారుండ వలయును గాని వినువారి కా తాళ గతియు లతా లాస్యముల పద విన్యాసములు తప్పక స్ఫురించును. మృదంగ ధ్వనులు లేని తాళ గతులతో లాస్యమునం దంద మే మున్న దని గాబోలు పెద్దనగా రింకొక మెట్టు పైకి పోయి మృదంగ రవములో తాళ గతులు పొందు పరచి నెమళ్ళచేత నాట్య మాడించినాడు.

అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిర స్సర జ్ఝరీ
పటల ముహు ర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నట నానుకూల పరిపుల్ల కలాప కలాపి జాలమున్
గటక చర త్కరేణు కర కంపిత సాలము శీత శైలమున్

ఇందు శిర స్సర జ్ఝరీ, ముహు ర్ముహు ర్లుఠత్ అను సమాస భాగ

ములు చదువు నపుడు అందలి పదముల కూర్పువలన మాటి మాటికి పై కుబికి పొరలి వచ్చు నీటి తరంగముల ధ్వనిని పొసగించు చున్నవి. అభంగ తరంగ మృదంగ యనుటలో తాళానుగత మగు మృదంగ నాదములు విన వచ్చును. వాని కనుకూలముగా నాట్య మాడు చున్న నెమళ్ళ యడుగుల విన్యాసమునకు నిటు నటు నూగు లాడు పింఛముల యూపు కలాపి కలాప యను పదములలో నున్నది. హిమగిరి కటకములం దేనుగులు సంచరించు చున్నవి. అవి సాల వృక్షములకు తొండములను చుట్టి బలమంతయు నుపయోగించి వానిని యూపు చున్నవి. పరుషాక్షర మగు కకారము వృత్త్యనుప్రాసగా వాడిన యా సమాసములోని పదముల కూర్పులవలన ఆ యూపులో బిగువు తనము స్ఫురింప చేయ బడినది. ఇట్లే

ఉల్లల దలకా జల కణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద బంభర
మల్ల ధ్వను లెసఁగ విసరె మరు దంకురముల్

ఎసఁగ విసరె ననుటలో సకార మనుప్రాస వలన మరు దంకురముల విసురుడు ముద్దాయింపుతో వినిపించును. పెద్దన సమాస ఘటనము నందును పదముల కూర్పునందును పద్య రచనా విధానమునందున నే గాక భావములందునను నన్నయ ననుకరించిన తావులు గలవు. దీర్ఘతముం డను మునిని బలి

ఎందుండి వచ్చి తిందుల
కెందుల కేఁగుదు మహాము నీశ్వర విద్వ
ద్వందిత నా పుణ్యంబున
జెందితి ని న్నిష్ట ఫలముఁ జెందిన పాటన్

అని ప్రశ్నించెను. ఇది నన్నయ పద్యము. ప్రవరుడు సిద్ధుని

ఎందుండి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచినార లిప్పుడు విద్వ
ద్వందిత నేడు గదా మ
న్మందిరము పవిత్ర మయ్యె మాన్యుఁడ నైతిన్

అని యడిగెను. ఇది పెద్దనగారి పద్యము. భావ మొక్కటయినను నన్నయగారి పద్యము నందు కంటె పెద్దనగారి కంద పద్యములో బిగు వెక్కువ కలదు.

భుజ శక్తి జయించె మహీశులం బ్రవ
ర్ధిత యశుఁడై ప్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యుల దాక్షిణాత్యులన్

అని నన్నయ.

ఆ పటీ

రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్

అని పెద్దన.

నన్నయ విశేషణ విశేష్యములను అగు, అయిన, అట్టి అను పదములతో కలపక విశేష్య మే విభక్తియం దుండునో విశేషణమునకు గూడ నా విభక్తి ప్రత్యయమునే వాడును. అందు మూలమున పద్యము బిగు వగు నడక గల దగును.

స్థిర పౌరుషుండు లోకో
త్తరుఁ డుత్తర ఫల్గునీ ప్రథమ పాదమునన్
సురరాజు నంశమున భా
సుర తేజుఁడు వంశ కరుఁడు సుతుఁ డుదయించెన్

అని నన్నయ. సుతుడు విశేష్యము. అది ప్రథమాంతము. దానికి వాడిన విశేషణము లన్నియు ప్రథమాంతములు. ఇట్టి రచన సంస్కృత సంప్రదాయము

ఆ పురిఁ బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి భా
షాపర శేష భోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీ
క్షా పరతంత్రుఁ డంబురుహ గర్భ కులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్య తనూ విలాసుఁడై

ఇది పెద్దనగారి పద్యము. ఇందు ప్రవరాఖ్యుఁడు ప్రథమా విభక్తియం దున్నది. దాని విశేషణము లన్నియు ప్రథమా విభక్తియం దున్నవి. పెద్దనగారి సంస్కృత సమాస కల్పితములగు పద్యములు నన్నయగారి రచనను బోలి యుండును. పెద్దన నన్నయగారి భారతమును సంపూర్ణముగా హృదయ గతము గావించుకొనెను. పద్య రచనా విధానము నవగాహనము చేసికొనెను. అనుభవమునకు తెచ్చుకొనెను. ఆ దారులను మనుచరిత్రయం దనుగమించెను. పెద్దనగారికి నన్నయగా రనిన నధిక గౌరవము కలదు. ఆ గౌరవము పద్య రచనలో పరిస్ఫుటముగా నగుపించును.

ప్రవరునకు తీర్థ సందర్శనమునందు కుతూహలము ఇనుమడించినది. దాని నాపుకొన లేక పోయినాడు.

విప్రవరుండు కౌతుక భర వ్యగ్రాంతరంగుండు భ
క్తి నిబద్ధాంజలి బంధురుండు నయి మీ దివ్య ప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి ముని లోక గ్రామణీ సత్కృపన్
నను మీ శిష్యుని దీర్ఘ యాత్ర వలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే

అని ప్రార్థించినాడు. ఇందు ప్రవరుని విధేయత, మనసును ఆకర్షించు పలుకు చతురత, ప్రశంసింప తగినది. నను మీ శిష్యుని దీర్ఘ యాత్ర వలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే యనినాడు. క్షణములో గురు శిష్యుల సంబంధము కలిపినాడు ప్రవరుడు. తమ కార్యములు నెరవేర్చుకొన తలంచువా రిట్లే మాట్లాడుదురు. అందు మూలముననే భాషాపర శేష భోగి ప్రవరు డని నుడివినాడు పెద్దన. భక్తి నిబద్ధాంజలి బంధురుండును,

కౌతుక భర వ్యగ్రాంతరంగుండును నయి ప్రార్థించు శిష్యుని కోర్కె తీర్పని గురు వుండడు. సిద్ధుడు

రస లింగము నిడు

తన వట్రువ ప్రేప సజ్జ దంతపు బరణిన్
నినిచిన నొక పస రిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజ యుగళిన్

ఆ మందిడి యతఁ డరిగిన
భూమిస్రాసురుఁ డరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీ క్షాపేక్షన్

అను పద్యములతో ప్రథమాశ్వాస మంత మయినది. నన్నయగారి సమాసముల కూర్పులో ఒక్కొక్కప్పుడు కొంచెము కరుకుఁదన ముండును

పాతాళైక నికేత నాంతరమునం బర్వెం దదశ్వాఖిల
శ్రోత్రో మార్గ వినిర్గ తోగ్ర దహ నార్చుల్ పన్నగ వ్రాతముల్
భీతిల్లెన్ భుజ గాధినాథు మనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాత ప్రోద్ధత బాడ బానల శిఖా శంకాధి కాతంకమై

ఇది నన్నయగారి పద్యము. ఇందలి సమాసములు నడకలో కొంచెము కదను ద్రొక్కిన ట్లున్నవి. దానికి కారణము సంయుక్తాక్షర బాహుళ్యము పలుకుబడిలో కరకుఁ దనము కూడ కలదు. అట్టి పారుష్యము పెద్దనగారి సమాసములో నెందును గనిపించదు. పెద్దన తాను గూర్చిన ప్రతి సమాసమును పద్యమును మరల మరల పరిశీలించి సాపు తేల్చి వన్నె చిన్నెలు సమకూర్చి వ్రాసిన వని తోచును. వాని రచనలో మిగుల మార్దవము గోచరించును. ప్రవరుడు పవమాన

మానసములను తిరస్కరించు వేగము గల హుటాహుటి నడకలతో హిమగిరిని చేరుకొనెను.

పెద్దన అటఁ జని కాంచె నను పద్యముతో ద్వితీయాశ్వాసమును ప్రారంభించెను. అది పెద్దనగారి రచనా చాతుర్యమును ప్రదర్శించు చక్కని పద్యము. ఆయన గాన విద్యా కోవిదుడు. సంగీత సాహిత్యములను మేళవించి యీ పద్యమును వ్రాసెను. అందు తాళ గతులు జొనిపించెను. మృదంగ నాదములు వినిపించును. ప్రవరుడు నర నారాయణ చరణాంబురుహ ద్వయ భద్ర చిహ్న ముద్రితం బయిన బదరికా వనమును మొదట గాంచెను. అందలి తరు షండ మండ లాంతర సరణిల్ ,ముందునకు జనెను. అచట అలకా నదిని చూచెను. ఆ నదీ తీరమునందు కదంబ వృక్షములు గలవు. ఆ యేటి నీటి తుంపురులవలన నవి మొగ్గలను తొడిగినవి. ఆ మొగ్గల వాసనకు తుమ్మెదలు మూగినవి. వాని ధ్వనులతో గూడి చల్లని గాలి వీచినది. ఈ సంగతిని ఉల్లల దలకా జల కణ అను పద్యమునందు వర్ణించెను. అచటి భయంకరము లగు నడవులను పెద్దన ఈ క్రింది పద్యములో చిత్రించెను.

తొండముల్ సాఁచి యందుగుఁ జిగుళ్ళను నిక్క
కరుల దంత చ్ఛాయ గడలు కొనఁగ
సెలవుల వన దంశములు మూఁగి నెఱ వెట్టఁ
గ్రోల్పులుల్ పొదరిండ్ల గుఱక లిడఁగ
సెలయేటి యిసుక లంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నాఁబడ్డల గతి మనుఁ
బిల్లు డొంకల నుండి క్రేళ్లు దాఁటఁ

బ్రబల భల్లుక నఖ భల్ల భయద మథన
శిథిల మధుకోశ విసర విశీర్ణ మక్షి

కాంత రాంతర దంతురి తాతపమునఁ
బుడమి తిలతండుల న్యాయమున వెలుంగ

పెద్దనగారు కృష్ణరాయలవారికి మిగుల నాప్తుడు. అడవికి వేట కరుగు నప్పుడు తన వెంట వానిని గొని పోవు చుండెడివాడు. రాయలవారు వేటాడు చుండ పెద్దనగా రడవియం దా యా తావులను పరిశీలించు చుండెడివాడు. అందు సత్త్వముల చర్యలను జూచు చుండెడివాడు. వాని స్వభావములను గుర్తించు చుండెడివాడు. ఆ యనుభవమును ఈ పద్యమునందు వర్ణించెను. దక్షిణ దేశమునందు పులులు, అడవి పందులు, ఎనుబోతులు, ఎలుగు బంట్లు మాత్రమే కనిపించును. ఏన్గులు కనిపింపవు. వాని సంగతి కాళిదాసు

కపోల కండూః కరిభి ర్వినేతుం
విఘట్టితానాం సరళ ద్రుమాణాం

అని హిమాలయమునం దున్నటుల వర్ణించెను. వానికి

సీతాదేవ్యా స్స కర కలితై స్సల్లకీ పల్లవాగ్రై
రగ్రే లోలః కరి కలభకో యః పురా పోషితోఽభూత్

అని భవభూతి నుడివెను. సల్లకీ పల్లవము లనిన అందుగు చిగుళ్లని యర్థము. అవి ఏనుగులకు ప్రీతి యైనవి. తొండము లెత్తి అందుగు చెట్ల చిగుళ్లందుకొను చున్నవి యేనుగులు. అందు మూలమున రెండు దంతముల తెల్లని కాంతులు దిక్కుల వ్యాపించు చున్నవి. అని మొదటి పాదమునందు వర్ణించెను. రాయలవారి కేనుగు బల మున్నది. ఆ యేనుగులు చెట్ల చివురు కొమ్మలను తొండము లెత్తి యందుకొను దృశ్యమును పెద్దన పరికించి యుండును. దాని నిందు వర్ణించెను. బదరీనారాయణము హిమగిరి పాదమున కెగువ భాగము నం

దున్నది. ఆ చుట్టు పట్టులందలి ప్రకృతి వైభవమును బరిశీలించినాడు ప్రవరుడు. అనంతరము

డెందంబునఁ
బురికొను కౌతుకముతోడ భూమీసురుఁ డ
గ్గిరి కటక తట నిరంతర
తరు గహన గుహా విహార తత్పర మతియై

పై కెక్కినాడు. పై నుండి చూచి క్రిందికి సత్యనారాయణగా రూహించి నటుల వాలలేదు. అల్లు వాలినచో ముందు కటక తటము నందు వాలి అచటి ప్రదేశములను చూచి క్రిందికి దిగి వచ్చెడివాడు. అట్లు రాలేదు. క్రింది నుండి యెగువ కెక్కినాడు. గిరి కటక తటమున

నిడుద పెన్నెఱి గుంపు జడ గట్ట సగరు ము
మ్మనుమండు తపము సైకొనిన చోటు
జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేరు దిగిన చోటు
పుచ్ఛడీక తనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁ గొల్వ నాయాస పడిన చోటు
వలరాచ రాచవాఁ డలికాక్షు కను వెచ్చఁ
గరగిన యల కనికరపుఁ జోటు

తపసి యిల్లాండ్ర చెలువంబుఁ దలఁచి తలఁచి
మున్ను మున్నుచ్చును విరాళి గొన్న చోటు
కనుపపులు నేల్పు బడువాలుఁ గన్న చోటు

ప్రవరుడు హర్షమున చూచినాడు. పెద్దన కాళిదాసువలె ప్రకృతి సౌందర్యోపాసకుడు. దానిని బాగుగా ననుభవించి మనుచరిత్రయందు ప్రకృతిని చక్కగా చిత్రించెను. ఆ చిత్రకళా ప్రదర్శనములు కావ్యమునకలంకార కారణము లయినవి. ప్రవరుడు నే నియ్యెడం గల చోద్యం

బులు రేపు కర్గోనియెదఁ గాక నే డేగెదను అని తలంచెను. అప్పటికి నళినీ బాంధవ భాను తప్త రవికాంత స్యంది నీహార కందళ చూత్కార పరంపరలు మధ్యాహ్నమును దెల్పెను. అతడు క్రమ్మరు వేళ నీహార వారిని బెరసి పాదలేపము కరిగి పోయెను. పురమున కరగుటకు పాదములు రాలేదు. కారణ మాలోచించినాడు. పాద లేపము కరిగి పోయిన దని తెలిసి కొనినాడు. అతనికి దుఃఖము పెల్లొదవినది. హా! దైవంబ! నన్నిట్లు తెచ్చితె! యీ ఘోర వన ప్రదేశంబునకు సిద్ధాపదేశంబునన్ అని యెుక్క పెట్టిన విహ్వ లించినాడు.

> అకలంకౌషధ సత్త్వముం దెలియ మాయా ద్వార కావంతి కా
> శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
> డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచు కొం
> డకు రాఁజెల్లునె బుద్ధి జాడ్య జని తోన్మాదుల్ గదా శ్రోత్రియుల్

అని ప్రవరుడు తన్ను తాను నిందించు కొనినాడు. పై పద్యము నందు అర్థాంత రన్యాసాలంకారము కలదు. శ్రుతి యనగా వేదము. శ్రుతి సంబంధ మైన ఆచారములు గలవారు శ్రోత్రియులు. వారికి బుద్ధి వికాస ముండదు. అందు మూలమున వారు వెఱ్ఱివారు. ఇది పెద్దనగారి అభిప్రాయము. వేదాభ్యాస జడః అన్నాడు కాళిదాసు. వేదాభ్యాసము కలవారు వేదాచారములు పాటింతురు. కావున శ్రోత్రియు లని పెద్దనగారు వాడినారు. శ్రోత్రియులకు బుద్ధి జడము. గావున వారికి నాలోచించు శక్తి యుండదు. అనాది నుండియు కవులకు పండితులకు గల వివాద మిది.

## పెద్దనలో శ్రీనాథ కవి

పోకడలు పెక్కు కలవు. అవి సీస పద్యములం దద్దములోని ప్రతి బింబముల వలె నగుపించును.

నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁ డెం తడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్లనీక న
న్నోమెడు తల్లి యెం తొరలు నొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందు నొక్కొ
కెడఁ దోడు నీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతు రొక్కొ

యతిథి సంతర్పణంబు లేమయ్యె నొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబు లైన
కృత్యములఁ బాపి దైవంబ! కినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు వడ్డ చోట

అని ప్రవరుడు విలపించెను. ఇందు తలిదండ్రులకు తనయందు గల ప్రేమయు, ఇల్లాలియందు తనకు గల యనురాగమును, శిష్యుల భక్తి, నిత్య కృత్యములందు తనకు గల ప్రీతి ప్రకటితము లగు చున్నవి. నల మహారాజు అల్ల నల్లనఁ బోయి రాయంచను పట్టుకొనెను. అతడు తన్ను చంపు నని రాయంచ తలంచినది. నలునితో

తల్లి మదేక పుత్రక పెద్ద కన్నులు
గాన దిప్పుడు మూఁడు కాళ్ల ముసలి
యిల్లాలు గడు సాధ్వి యేమియు నెఱుఁగదు
పరమ పాతివ్రత్య భవ్య చరిత
వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్న సంతానంబు శిశువులు
జీవన స్థితి కేన తావలంబు

కృప దలంపఁ గదయ్యా యో నృప వరేణ్య
యభయ మీవయ్యా యో తుహినాంశు వంశ
కావ గదవయ్యా యర్థార్థి కల్ప శాఖి
నిగ్రహింపకు మయ్యా యో నిషధ రాజ

అని విలపించినది. పెద్దనగారి పద్యము కంటె శ్రీనాథుని పద్యము మిగుల రసవంత మయినది. మానవ హృదయమును విదారింప గల భావము లందున్నవి. శూలముల వలె హృదయము నడుగంట నుచ్చిపో జేయు పదముల సముదాయము లిమిడి యున్నవి. తల్లి మూడుకాళ్ల ముసలి. ఆమెకు తానొక్కడే కుమారుడు. భార్య అమాయకురాలు. పిల్లలకు తాను జీవితాధారము. ఇత్యాది భావములు మనస్సునకు జాలి కలిగించును. రాయంచ స్థితిని తలంపునకు తెచ్చి అయ్యో! పాప మనిపించును. కరుణా రసము వెల్లిగొలిపించును. దానికి తగి నట్లు వాక్యములు చిన్న చిన్నవి. అవి మరింత రసమున కుపస్కారకము లయినవి. ఆ మాటలలోని అందము, భావములలోని రసవత్తత నలుని మనస్సును కరిగించినవి. రాయంచ మీద జాలి కలిగించినవి. దానిని విడిచి పుచ్చెను. కావ్యములం దిద్దరు మహాకవు లొక్క సంగతిని గురించి వర్ణించు నప్పుడు భావములు కలియు ననుటలో సందేహము లేదు. ఒక్కొక్కప్పుడు పోకడలయందు పద్యపు నడకలయందు పోలిక లుండ వచ్చును. అంత మాత్రముచేత ఒకరి నొక రనుకరించి రనుటకు వీలు లేదు. చాల మంది విమర్శకులు పెద్దన శ్రీనాథు ననుకరించె నని పై రెండు పద్యములు చూపుదురు. పరిస్థితులు రెండు ఒకటే యనుటలో సందేహము లేదు. ఇద్దరు సీస పద్యములనే వ్రాసిరి. కాని యెందును భావము లొకటి కావు. పోకడలు నొకటి కావు. శ్రీనాథుని పద్యము చిన్న చిన్న వాక్యములతో నిమిడి యున్నది. ప్రతి పాదమందు ఒక వాక్యముకంటె నింకొక వాక్యమునందు హృదయ మును కరగించి జాలిని పుట్టించు రసోత్కర్షత గల భావ మున్నది.

పెద్దన పద్యమునం దట్లు కాదు. ఒక్కొక్క పాదమునం దొక్కొక్క భావ మిమిడి యున్నది. భావములు రసవంతము లనుటలో సందేహము లేదు. కాని శ్రీనాథుని పద్యము పాఠకుని మనసు కరగించును. అట్లు పెద్దన పద్యము కరగింప జాలదు. తన దీన స్థితిని గురించి నల మహారాజునకు తెల్పినది రాజహంస. తల్లిదం డ్రాదుల యాతురతను గురించి తలంచినాడు ప్రవరుడు. కావున శ్రీనాథుని పద్య మంత రసవంతము కాలేదు పెద్దన పద్యము. వరూథిని ప్రవరునితో

చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధి
పొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహి పుట్టు జంత్ర గాత్రముల క్రాల్ గరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁ డఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకుఁ

గనక ఘగ సీమఁ గల్ప వృక్షముల నీడఁ
బచ్చరా చట్టు గమి రచ్చ పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాము గరడీలు మాకు గోత్రామరేంద్ర!

అని తన ఘనతను గురించి చెప్పుకొనినది. శృంగార నైషధమునందు హంస దౌత్యము, నల దౌత్యము మిగుల రసవత్తరము లయిన భాగములు. దమయంతి రాయంచను పట్టుకొన యత్నించినది. రాజహంస దయయంతి నొక లతా గృహంబులోనికి గొనిపోయినది. ఆమెతో

నలిన సంభవు సాహినము వారువంబులు
కులము సాములు మాకు గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బూవుఁబోడి
సత్య లోకము దాక సకల లోకంబులు
నాట పట్టులు మాకు నబ్జ వదన
మధు రాక్షరము లైన మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లయిపమాంగి
భారతీదేవి ముంజేతి పలుకుఁ జిలుక
సమద గజ యాన సబ్రహ్మచారి మాకు
వేద శాస్త్ర పురా ణాది విద్య లెల్లఁ
దరుణి నీ యాన ఘంటాపథంబు మాకు

అని నుడివినది. శ్రీనాథుని పద్యమునందలి కువలయాక్షి మొదలగు పాదాంతములందలి సంబోధనలను తొలగించినచో పెద్దనగారి పద్యంపు పోకడ యగును. అవి స్త్రీ సంబోధనలు. కావున పాద పాదమున కందము తెచ్చినవి. పురుష సంబోధనలలో నా యందమ ముండదు. కావున పెద్దన పరిహరించెను. గీతాంతమునందు గోత్రా నరేంద్ర యను నొక్క సంబోధనతో ముగించినాడు. రెండు పద్యముల తీరు లొక్క విధముగా నున్నవి. శ్రీనాథుని కావ్యము లన్నియు సునిశిత మగు విమర్శనా దృష్టితో పరిశీలించి చూచిన పక్షమున వాని పద్య రచన రెండు రకములుగా కనిపించును. సంస్కృత పద సమాస సంఘటిత మయిన కూర్పు మొదటిది. అట్టి పద్యములు నూటికి ఏబది కంటె ఎక్కువ యుండును. అచ్చిక వైకృత పదములను తత్సమ పదములతో కలయ కలిపి పద్యములను నడిపించుట రెండవ రకము. ఇట్టి రచన కావ్యమునకు మిగుల శోభను కలిగించును. ఆ పోకడలో అందమున్నది. చదువు నప్పుడు మనసు నాకట్టి యానంద

మొదవించును. ఇట్టి రచనకు మొదట దారి చూపినవాడు నన్నె చోడుడు. వాని రచనలో కొంచెము వెలుసు దనము కలదు. శ్రీనాథుని పద్యములలో మిగుల మార్దవ మున్నది. శ్రీనాథుని రెండవ రకపు పోకడలను పుణికి పుచ్చుకొనినవాడు అలసాని పెద్దన.

కలశ పాథోరాశి గర్భ వీచి మతల్లి
కడుపార నెవ్వాని కన్న తల్లి
యనలాక్షు ఘన జటా వనవాటి కెవ్వాడు
వన్నె వెట్టు ననార్తవంపుఁ బువ్వు
సకల దైవత బుభుక్షా పూర్తి కెవ్వాడు
పుట్టు గానని మేని మెట్ట పంట
కటిక చీకటి తిండి కరముల గిలిగింత
నెవ్వాడు తొగ కన్నె నవ్వఁ జేయు
నతఁడు వొగ డొందు మధుకైట భారాతి మఱఁది
కళల నెల వగు వాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమి పర సీమ వలరాజు మేనమామ
వేవెలుంగుల దొర జోడు రేవెలుంగు

ఈ పద్యమును నలినసంభవు సాహిణాము మొదలగు పద్యములతో సరిపోల్చు కొని చూచునది. పద్యము పోకడ మా టటుండ నిండు. పదముల కూర్పు మిగుల మనోహర మయినది. అనార్తవంపుఁ బువ్వట, కటిక చీకటి తిండియట, వేవెలుంగులదొర జోడట. ఎంత చక్కని పదముల పొందిక. నూతన పదములను సృష్టించుట మహా విద్వాంసు లగు కవులకే చెల్లుబడి యైనది. పెద్దన మహా విద్వత్కవి. ప్రజ్ఞావంతుడు. వాడి మయూఖముల్ కలుగువాడు అన్నాడు నన్నయ. తొండముల్ గల జంతువులు అన్నారు ఏనుగులకు తిరుపతి కవులు. పదినూరు చెంగుల పాగ యని నాడు రఘునాథ నాయకుడు వాసుకికి. సృష్టికి ప్రతిసృష్టి చేయ గలవారు కవులు. శబ్ద

సృష్టి వింతలోనిది కాదు. తిక్కనగారి పదముల కూర్పునకు పెద్దన శ్రీనాథుల పదముల కూర్పునకు భేదము కలదు. తిక్కన దేశీయములగు పదములను వైకృతములతో మేళవించి తత్సమములు పొందు పరుచును. అడుగుల నును కాంతి మొదలగు పద్యములు చూచునది. తిక్కనగారి సీసపద్యములోని నాల్గు పాదము లొక్కతూకముగా నడువవు. భావమునకు ప్రాధాన్య ముండును. శ్రీనాథ పెద్దన్నల సీసపాదములు భావముతో పాటు నడకయు సరి తూకము కలవయి సమాన మగు పోకడలు కలిగి యుండును. పైపద్య ములు చూచునది.

నను నిలు సేర్చు నుపాయం
బొనరింపఁగఁ జాలు సుకృతి యొకఁ డొదవఁడొకో

యనుచు నందందు తిరిగినాడు ప్రవరుఁడు.

కులిశ ధారా హతి పొలుపునఁ బైనుండి
　　యడుగు మోవఁగ జేగు రైన తటులఁ
గనుపట్టు లోయ గంగా నిర్ఝరము వాఱఁ
　　జిలువయూ నయ్యేటి కెలఁకులందు
నిసుక నెట్టిన నేల నేచి యర్కాంశులఁ
　　జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగ నారంగ రంభా నాళి
　　కే రాది విటపి కాంతార వీథిఁ

గెరలు పిక శారికా కీర కేకి భృంగ
సారస ధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వ యక్ష
గాన ఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె.

తెనుగు భాషయందు కానలు కోనలు కొండలు వర్ణించిన కవులు పెక్కుమంది కలరు. అందు ప్రత్యేకించి శీత శైలమును వర్ణించినవారు గలరు. ఎవరెన్ని పద్యములు వ్రాసినను అటఁ జని కాంచె నను పద్యము వంటి పద్య మెందును లేదు. దానిని కంఠస్థము గావింపని సారస్వత ప్రియుడు లేడు. సంస్కృతమున కాళిదాసు హిమవత్పర్వతమును పదారు శ్లోకములలో వర్ణించెను. పెద్దనగారి పద్యమందలి రచనా సౌందర్య మొక్కదానియందైనను కానిపించదు. వసుచరిత్ర రచించిన భట్టుమూర్తి పెద్దనగారి కులిశ ధారా హతి యను పద్యమును చూచి

రేలెల్ల నమృత మరీచి నంటున నంటఁ
  గరఁగి నిర్మల పయో ఝరులఁ దొరఁగి
బలువిడిఁ బెను లోయఁ బడిన క్రొన్నెల జాల
  చఱులలో నిరు గడఁ దఱుచు మెఱచు
పటికంపుఁ బణకుల పజ్జఁ గొజ్జగి నీటి
  యేటి క్రేవలఁ జలి యిసుక వెట్టు
నేడాకు టనఁటుల నెలమావి గుమురుల
  సురపొన్న కూటాలఁ జుట్టుకొనిన

బండి గురువింద తీఁగెల చప్పరము లెనసి
ముడి గొనిన ద్రాక్ష పందిళ్ల నడుమఁ గిన్న
రీ వినాదానుకారి శారీ శుకాది
ఘోష ఘుమ ఘుమితంబైన కోనఁ గనియె

అని వర్ణించెను. పెద్దనగారి పద్యములోని అందచందములు దీని యందు లేవు. హిమాలయము దేవభూమి. ఉత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః అని. అందు గంధర్వ యక్షాది దేవత లుందు రని పెద్దన వర్ణించుట సమంజసము. వారు గాన మొనరించు చుందు రనుట వరూథిని వీణ వాయించు చుండె

ననుటకు సూచన. భృంగ ధ్వనులు గల వనుటచేత పూవులు విచ్చి మకరందమును కురియు చున్న వని యెరుగ వలయును. కాలువ వెంటఁ బూచు మల్లిక లవలంబనంబుగ నలి ప్రకర ధ్వని చిమ్మిరేఁగ నని తరువాత పెద్దన వర్ణించెను. పిక సారసములను పేర్కొనుటచేత చిగిరించిన చెట్లు కాసారములు కలవని సూచన. అట్టిది కోన. దానిని చూచినాడు ప్రవరుడు,

ఇది ముని యాశ్రమ

మను తహతహ వొడమి యిచటి కరిగిన నాకున్

గన నగు నొక తెఱువ యని

తలంచెను. ఎంత అమాయకత్వము. గంధర్వ యక్ష గాన ఘూర్ణిత మగు కోన. ముని యాశ్రమ మెట్లగు ననియెడు తలంపు లేదు. అతడు శ్రోత్రియుడు. వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పర తంత్రుడు. ఎన్నడు అరుణాస్పదమును విడిచి పోయినవాడు కాడు. నిముసంబు గానక యున్న తండ్రి వానికొర కూరెల్ల నరయును. సంధ్యల యందైన నిలు వెడల నీయదు తల్లి. అసలే శ్రోత్రియులు జడ బుద్ధులు. దానికి తల్లిదండ్రుల నిబంధనము తోడయినది. కావున వానికి లోక జ్ఞానము శూన్య మయినది. ఆ కారణముచేత గంధర్వ యక్ష గాన ఘూర్ణిత మయిన కోన ముని యాశ్రమ మని భ్రమించి నాడు. పై పద్య భాగము ప్రవరుని యమాయకత్వము సూచించును. అతడు తలక్రిందులై దిగు కాలువ వెంటఁ బూచు మల్లిక లవలంబ నంబుగ మణి పట్టభంగ సరణిని లోయలోనికి దిగెను. ఇంత వరకు శాంత రసము ప్రధానముగా నడచిన కథతో

శృంగార రసము

ను మేళవించి కావ్యమున కొక యపూర్వ రూపమును కల్పించినాడు పెద్దన. అతడు మహాశిల్పి. తన శిల్ప విద్యా నైపుణ్యమువలన నా లోయయందు

తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొను కాంతారంబునం దైందవ
గ్రావా కల్పిత కాయమాన జటిల ద్రాక్షా గుళుచ్ఛంబులన్
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబున్ గారు డోత్కీర్ణమున్

సృష్టించెను. అది ముందు జరుగ బోవు నాటకమునకు రంగ స్థలము. గరుడ పచ్చలతో కట్టబడిన మేడ. దాని ముందు చంద్రకాంతపు రాలచేత నిర్మింప బడిన పందిరి. ఆ పందిరి మీాది కెగబ్రాకి పండ్ల గుత్తులు వ్రేలాడుచున్న ద్రాక్ష తీగెలు, పూవుఁదీగెలు. భవనమునకు ముందొక తరుణ సహకారము. దాని మూలమున నొక శశికాంత మణి వితర్ధి. చుట్టు మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొనిన కాంతారము. దాని ప్రక్కన సువాసనల నించు నెత్తి కలువల తోడి కేదారంపు మడులు. ఎంత మనోహర మగు దృశ్యము. ఒక్క క్షణ కాలము కనులు మూసికొని యా రంగమును తలంపునకు తెచ్చు కొనినచో మనస్సు పొంగి పోవును. దాని విచిత్రోదంచిత సౌభాగ్యమునకు పాఠకుడు మహానందమును పొందును. అది పెద్దనగారి మహిమ. అది సజీవ మగు శిల్పము. మానవ హృదయము నాకర్షించు చిత్ర రచనము. ఆ పదజాల మా శిల్పమునకు సరిపోయినది. అట్టి రంగము నది వరకు నిర్మించినవారు లేరు. కణ్వాశ్రమ శిల్ప నిర్మాణమునందు నన్నయ సిద్ధ హస్తుడైనాడు. ఆ విధముగా నాశ్రమమును నిర్మించినవారింకొరు లేరు. మనుచరిత్రయందు లోయలోని శృంగార రంగ నిర్మాణమునందు పెద్దనగారు ప్రదర్శించిన శిల్ప కళా వైశద్య మింకొకరు చూప లేదు. ఆయన ప్రకృతి ప్రియుడు. ఆయన మహారాజుల భవనము లనేకములు దర్శించెను. వాని వైభవము మనస్సునం దుంచు కొనెను. దానికి తన కల్పనా శక్తిని జత పరచెను. గారు డోత్కీర్ణ మగు భవనమును నిర్మించెను. దాని యంగణమునందు ద్రాక్షా గుళుచ్ఛంబులం బూవుం దీవెల నొప్పు ఐందవ గ్రావా కల్పిత

మయిన పందిరిని కల్పించెను. శృంగార రసోద్దీపకములయి పలు దృశ్యములను నెలకొల్పెను. ఆయన యూహ చక్కని రంగ స్థలమును నిర్మించినది. దాని దృష్టియం దుంచుకొని మెఱుగులు దిద్దినాడు పెద్దన. ప్రవరు డా యంద చందముల కబ్బుర పాటు నొందెను. అటు వైపు కాలు మరలించెను. అంతలో

మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగి తేతర పరిమళమై
మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్

దైవగతి కిల నసాధ్యంబు గలదె అన్నాడు అల్లసాని పెద్దనగారు. అవును. ఆ మాట సత్యము. ఆ దైవగతియే సిద్ధాపదేశంబున ప్రవరుని హిమాలయమునకు తెచ్చినది. పాదలేపము కరిగిపోవు నట్లు చేసినది. లోయలోనికి ప్రవేశ పెట్టినది. ఆ దైవగతిచేతనే మారుతము వీచినది. అది సామాన్య మగు మారుతము కాదు. వీటీ గంధ స్థగి తేతర పరిమళ మయిన మారుతము. ఆ కోనలో చుట్టు పట్టులం దెల్లెడల విచ్చి సుగంధము లీను మల్లికాది కుసుమములు గలవు. వాని మీఁదుగా మారుతము వీచినది. ఆ కుసుమముల పరిమళ మును దాల్చినది. కాని యీ పరిమళము వీటీ గంధ స్థగిత మయినది. ఆ వీటీ గంధము మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర మయినది. ఎంత చక్కని నిగూఢ మగు భావము కల దా మారుతము. మారుతమే కాదు మారుతమును వర్ణించిన యీ పద్యము నట్టిదే. ఇంత రమణీయముగా మారుతమును వర్ణించినవారు తెలుగు సారస్వతమునం దింకొకరు కాన రారు. ఇట్టి పద్యములే పెద్దనగారి కొక ప్రత్యేక స్థానమును తెనుగు సాహిత్య ప్రపంచమునందు సంపాదించి పెట్టినవి. మనుచరిత్ర కొక యగ్ర స్థానము కల్పించినవి. కంద పద్య రచన యందు తిక్కన చాల గొప్పవా డని వాడుక. పెద్దనగారి కందములు

చదివి వానితో సరిపోల్చి చూచినవారు నిజానిజములు గ్రహించుకొనగలరు. ఆ నడకలోని యందము, భావమున కనుగుణ మగు పదముల కూర్పు, పలుకుబడియందు నాలుకకు కరకుదన మొదవ నీయని మృదుత్వము, పెద్దన కందములలో కనబడి నట్లు మరే యితర కవుల కందములం దగుపింపవు. ఒకొక్క పద్యమునం దొకొక్క వింత యగు నడక కనుపించును. వాని యన్నిటి యందు పదముల పొందిక లయానుగుణముగా నుండును. అదియే పెద్దనగారి కంద పద్యములలోని ప్రత్యేకత. ఉల్లల దలకా జల కణ, ఆ మందిడి యత డరిగిన, మృగమద సౌరభ విభవ ఇత్యాది పద్యము లరయ నగును.

ఆ వీటీ గంధము మగువ పొలుపు దెలుపు చున్నదట. తాంబూలములోని ఘుమాయింపు వైష్ణవుల కనుభవములో నున్నటుల మరెవ్వరికి నుండదు. వారు నిత్య భోగులు. షడ్రసోపేత మగు భోజనము నారగించి కస్తూరి పునుగు జవాది మేళవించిన మంచి గంధము మేన నలందుకొని కర్పూర తాంబూలము సేవింతురు. రాయలవారి కాలమునందు వైష్ణవుల వైభవము తుది మెట్టధిరోహించినది.

పరిపక్వ సురభి రంభా ఫలంబులతోడ
దల మెక్క పనస పెందొలలతోడ
ఘృత పిండ నిభ కర్కరీ ఖండములతోడఁ
బలు తెఱంగుల మావి పండ్లతోడ
గోస్తనీ మృదు గుళుచ్ఛ స్తోమములతోడఁ
గప్పు లేటిన వడ ప్రప్పుతోడ
సుమధుర స్థూల దాడిమ బీజములతోడఁ
దనుపారు రసదాడి గనెలతోడఁ

బానకం బతిథుల కిడఁ దానుఁ గ్రోలి
యర్చనా దత్త చందన చర్చఁ దేలి
విరులు సిగఁ దాల్చి కర్పూర వీటి జబురు
గొట్టుచు

సుఖ జీవనము సాగించిరి. పెద్దన వైష్ణవుడు. విశేషించి రాయలవారికి ప్రాణ పదము. ఆ మహారాజుతో పాటు సకల భోగము లనుభవించిన వాడు. ఆయనకు

సద్యో వినిర్భిన్న సారంగ నాభికా
హ్యాతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీఱెండఁ గరఁగి కట్టల నంటి
గమగమ వలచు చొక్కపు జవాజి
పొర లెత్తి ఘనసార తరువులఁ దనుఁ దాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగిపూఁ బాదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండిన యట్టి తుహిన జలము

వివిధ కుసుమ కదంబంబు

లు నిత్యానుభవములు. ఘనసార సాంద్ర వీటీ చర్వణ మనిన ఆయనకు బహు ప్రీతి కరము. కావున ఘనసార తాంబూలములోని తత్త్వము పెద్దన బాగుగా నెరుంగును. స్వానుభవము మీద నా పద్యమును రచించెను. స్త్రీ పురుషులు ప్రత్యేకముగా తాంబూలమునందు నుపయోగించు సుగంధ ద్రవ్యము లాయనకు తెలియును. ఆ కారణముచేతనే మగువ పొలుపు తెలుపు మారుత మని వచించెను. స్త్రీలు మృగమదమును తాంబూలమునం దుపయోగింతురు. పురుషు లుపయోగింపరు. వా రుపయోగించునది కర్పూర తాంబూలము.

కావున పెద్దన ఘనసార సాంద్ర వీటి గంధమునకు మృగమద సౌరభ విభవమును చేర్చి

మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ

మని నుడివెను. ఆ వీటీ గంధమును దాల్చిన దగుటచేత గాలి మగువ పొలుపు తెలిపినది. వీటీ గంధము గావున మగువ పొలుపు తెలియు చున్నదని వ్యాఖ్యాత రచించెను. పురుషులు సహితము తాంబూలమును సేవింతురు. పురుషుల పొలు పేల తెలుప రాదు? అది కాదు. పురుషులు సేవించునది కర్పూర తాంబూలము. అందు స్త్రీలు కస్తురి ప్రత్యేకముగా వాడుదురు. అది మృగమద ఘనసార వీటి. కావున మగువ పొలుపు తెలిపినది. ప్రవరుడు శుద్ధ శ్రోత్రియుడు. వీటీ గంధ పరిజ్ఞాన మాతనికి లేదు. కావున ఆ ప్రదేశము జనాన్వితమని తలంచెను. స్త్రీ జనాన్వితమని తలంచ లేదు. మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్ అని పైపద్యము నందు నుడివి జనాన్వితమిచ్చో టని చేరఁ బోయె నని తరువాతి పద్యమునందు చెప్పుటచేత పెద్దనగారు ప్రవరుని యలౌకిక ప్రవృత్తిని చక్కగా తెల్పిపెను.

అతఁ డా వాత పరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చో టని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణ చంచరీక చికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకా నొకమరున్నారీ శిరోరత్నమున్

ఆ మారుతంపు సువాసన ననుసరించి యరిగినాడు ప్రవరుడు. ఇట్లు వీటీ గంధమును దాల్చిన మారుతమును దూతగా చేసి కావ్యమునందు నాయకుని నాయకురాలి యొద్దకు చేర్చిన కవి యింకొకడు కానరాడు. ఇది వినూతన మార్గము. ఇట్టి వినూతన సంవిధానములు మనుచరి

త్రయం బుండుటచేత కావ్య లోకమున కది యపూ ర్వాలంకార మయి భాసించినది. కాళిదాసు శకుంతలా దుష్యంతుల సమాగమం బునకు మిళిందమును సృష్టించెను. పెద్దన వరూధినీ ప్రవరుల సమా గమమునకు వీటీ గంధమును కల్పించెను. ఈ కల్పనా విశేష మా పరిసర వాతావరణమునకు తగినటు లున్నది. కొందరు విమర్శకులు పెద్దనగా రీ పద్యమును శ్రీనాథుని శృంగార నైషధములోని

కమ లేందీవర షండ మండిత లుస త్కాసా ర సేవా రతిన్
గమి కర్మి కృత నైక నీవృతుడనై కంటిన్ విద ర్భంబునన్
రమణిన్ బల్లవ పాణిఁ బద్మ నయనన్ రాకేందు బింబాననన్
సమ పీన స్తని నస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్

అను పద్యమును చూచి వ్రాసె నని యందురు. అట్లనుట కంటె వా రిరువురు కవి కుల గురు వగు నన్నయ ననుకరించి రనుట యుత్త మము. వా రిరువురు కవనంపుఁ బోకడలందు నన్నయగారి అను యాయులు

వలయు నమాత్యులం దగిన వారల నుండఁగఁ బంచి ధారుణీ
తల విభుఁ డొక్కరుండ చని తన్వఁ బయోజ దళాయ తాక్షి సం
కుల మిళి తాళి నీల పరికుంచిత కోమల కుంతలన్ శకుం
తల యను కన్యకం గనియెఁ దన్ముని వల్లభు మందిరంబునన్

ఇట్టి పద్యములు నన్నయ భారతమునందు చాల గలవు. వరూధిని యొక గంధర్వాంగన. నిజ మందిరాంగణ స్థ తరుణ సహకార మూల వితర్ది మీఁద శీత లానిల మొలయ నాసీనయై నది. ఆ వియచ్చరాంగ నను తత నితం బాభోగ యను పద్యముచేత పెద్దన వర్ణించెను. ఆమె కావి రంగు గల లంగా ధరించెను. దానిపై విరివి యైన నితం బములు నిండార మూయ తెల్లని సున్నిత మగు వస్త్రమును వల్లెవాటు వేచు కొనెను. అంగదటపు కావి రంగు తెల్లని యంశుకమును

దాటి శశికాంత మణి పీఠిపై ప్రసరించు చుండెను. ఆమె చేతి యందు వీణ కలదు. వీణె కమర్చ బడిన సొరకాయలు చనుగవయం దత్తమిల్లి నవి. తరుణాంగుళీ ఘాత తంత్రీ స్వనం బుతో కంఠమును కలయ కూర్చి పాడుచుండెను. ఆలాప గతికి పరవశత్వము నొంది కన్ను లర మోడ్పు వహించు చుండెను. ఆమె పలికించు గీత ప్రబంధములకు ముంజేతి రత్న కటక ఝుణం ఝుణ ధ్వని తాళ గతులు నెరపు చుండెను. చక్కని శిల్పము, సహజ మగు వర్ణన. కాయ లుత్తుంగ కుచ పాళి నత్తమిల్ల నన్న చోట కాయలు = వీణె కమర్చ బడిన సొరకాయలు అని బహువచనమును వాడెను. వీణె యొక్క సొరకాయలు కుచముల జంట మీద అత్తమిల్లినవి. ఇది యొక రకమగు వీణె. ఇట్టి వీణెలకు రెండు వైపుల రెండు సొరకాయ లుండును. దానిని ఒడియం దడ్డముగా నుంచుకొని మీటు నప్పుడు రెండు సొరకాయలు రెండు స్తనముల మీద నానుకొనును. సరస్వతీ ప్రార్థనమునందు ఘన మైన రారాపు చనుదోయి రాయిడిఁ దుంబీ ఫలంబు దుందుడుకు చెంద నని యేక వచనమును వాడెను. ఆ వీణె కొక్కటియే దుంబీ ఫల ముండును. ఇది దక్షిణ దేశమునందు వాడుకలో నున్న వీణె. అది యుత్తర దేశమునందు వాడుకలో నున్న వీణె. శారద వీణె నిలువుగా నొరగించి మీటు చుండుటచేత చనుదోయి రాయిడిచేత దుంబీ ఫలంబు దుందుడుకు జెందినది. పెద్దనగారి తత నితం బాభోగ యను పద్యమును చూచి

వలుద గుబ్బల ప్రసేవక వృత్తి తగు గుబ్బ
కాయల కపరంజి చాయ లొసఁగ
లలి తాంగుళీ దళంబులు సమేళము లైన
సారెల పై రాగ సంపద లిడఁ

బాణి కంకణ రుతుల్ ప్రాణాను బంధంబు
కల తాళ గతి కనుగ్రహము లీన
నాలాప భంగి యత్వ్యక్త సంవాది స
మ స్వరంబులకు గ్రామంబు లునుపఁ

బ్రచుర తానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతన రీతిఁ దనరఁ
జేతనంబు లచేతన భాతి నొనర
వీణ వాయించు నొక యలివేణిఁ గనియె

నని భట్టుమూర్తి గిరిజను వర్ణించెను. పెద్దనగారి పద్యములోని నాజూకు తనము దీనియందు లేదు. పెద్దనగారి పద్యమునం దున్న రూప కల్పనలోని శిల్పము దీనియందు లేదు. సంగీత శాస్త్ర మంతయు రాశిగా పోసి శిల్పము సంగతి మరచి పోయినాడు భట్టు మూర్తి. తన కున్న పాండిత్య మంతయు నయిన చోటను కాని చోటను కవి యతిగా ప్రదర్శింపరాదు. అతి సర్వత్ర వర్జయేత్. ఎంత వరకు సముచితమో యంత వరకే వెలయించుటలో పద్యమునకు కావ్యమునకు నందము తెచ్చును. మించి పోయినచో మోయ రాని బరు వగును. కావ్యాంగనను గ్రుంగ తీయును. నాజూకు తనమును పాడు చేయును. తాంబూలములో సున్నము చాల యవసరము. అది యధిక మయినచో నాలుక పొక్కి మంట పుట్టించును. అట్టిది వసు చరిత్ర. గిరిజ వర్ణనయు నట్లున్నది. ఎంత వరకు నెచ్చట నెట్లు తన పాండిత్యము ప్రదర్శింప వలయునో పెద్దనకు తెలియును. కావుననే తత నితంబాభోగ యను పద్యములో నాజూకు తనము సహజత్వము మనోహరత నమరినది. భట్టుమూర్తి పెద్దనకంటె పండితుడను కవి ననిపించుకొన నెంచెను. ఆ వరుస పద్యము లన్నియు పెద్దన మను చరిత్రను మనసునం దుంచుకొని వ్రాసెను. అవి యన్నియు 'వడ్డి

యసలును మించి నట్లయినవి. అవే కావు వసుచరిత్ర పద్యము లన్నియు నంతే యన వలయును. పెద్దనగారి

### వర్ణనలు

ఏవియు సహజ మగు మానవ ప్రకృతి నతిక్రమింపవు. పాఠకునకు నిత్యానుభవములోని వయి యుండును. భావమ్ము లూహా కందు బాటులో కుదురు కొనును. సిద్ధులు మానవాతీత మగు ప్రకృతి కలవారు. మానవులకు వా రగమ్యా గోచరులు. అట్టి వానిని ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె మొగము తోలు కిరీటముగా కూర్చి కక్షపాల కావి కుబుసము రుద్రాక్ష పోగులతో మానవ మధ్య గతుని గావించి పాఠకుని యెదుట నిలిపినాడు. అందు మూలమున మానవుల ఊహాలోని వాడైనాడు సిద్ధుడు. వర్ణన చిత్తాకర్షణీయ మైనది. మానవుల చిత్త ప్రవృత్తిని సంఘ వ్యాపారమును ప్రతిబింబింప చేయు నప్పుడే కావ్యమునకు వినూతన మగు శోభ వాటిల్లును. అట్టి కావ్యము లోక ప్రసిద్ధ మయి చిర స్థాయిగా నివసించి యుండును. రాముడు శ్రీమన్నారాయణుని యవతారము. వాల్మీకి రామాయణము నందు రాముని పాత్ర లోక సామాన్య మగు నొక మహారాజ కుమారునిగా చిత్రించినాడు గాని యనభిగమ్యము లగు శక్తులు గల దేవతా మూర్తిగా చిత్రింప లేదు. సీత లక్ష్మి. ఆమెను మానవ సంఘములోని యువతిగానే యభివర్ణించినాడు. అతీత మగు గుణముల నేమియు నామెయం దారోపింప లేదు. రామాయణ మంతయు వాల్మీకి కాలములోని వాతావరణములకు ప్రతిబింబము. పాత్రల సంభాషణ లన్నియు మానవ చిత్త ప్రవృత్తులకు మేలు బంతులు. రాము డరణ్యవాసమున కరుగు చుండెను. సీత వెంట వత్తు నన్నది. రాముడు వలదని వారించెను. అప్పుడు సీత అన్నమాట లివి

కిం త్వా మన్యత వైదేహః
పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య
స్త్రియం పురుష విగ్రహం

ఈ మాటలు స్త్రీల మానస ప్రవృత్తికి సహజములు. సుమిత్ర లక్ష్మణునితో

సృష్ట స్త్వం వన వాసాయ
స్వనురక్త స్సుహృ జ్జనే
రామే ప్రమాదం మా కార్షీః
వత్స ! భ్రాతరి గచ్ఛసి

రామం దశరథం విద్ధి
మాం విద్ధి జన కాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి
గచ్ఛ తాత! యథా సుఖం

అన్నది. ఇవి గుణవతి యగు తల్లి కుమారునకు బోధించు పలుకులు. ఇట్లే కణ్వుడు శకుంతలకు

శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియ సఖీ వృత్తిం సపత్నీ జనే
భర్తృ ర్వి ప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
యా న్త్యేవం గృహిణీ పదం యువతయో వామాః కుల స్యాధయః

అని బోధించినాడు. ఇది ప్రతి తండ్రి కుమార్తె నత్తవా రింటికి పంపునప్పుడు బోధించునదే. వీనియందు లోకము సంఘము ఆచారములు గోచరించును. కావుననే యా యా కావ్యములు లోక ప్రసిద్ధములయినవి. సంస్కృత భాషయం దనేక కావ్యములు పుట్టినవి. వానిని

తలంచు వారైనను లేరు. మనుచరిత్రకు తెనుగు భాషయందు ఘనతను సంపాదించినది కవి కాలము నాటి మానవ ప్రవృత్తి. సాంఘిక ప్రదర్శనములందు సదాచార సంపన్నులయి యాహితాగ్ని కుటుంబముల జీవితము విపులముగా ప్రదర్శింప బడినది. తిమ్మన పారిజాతాపహరణములో నిట్టి మానవ వ్యాపారము గోచరించును. కావుననే దానికి ద్వితీయ స్థానము కావ్యలోకమున లభించెను. పెద్దన వరూథినిని కాళిదాసు వలె

> హస్తే లీలా కమల మలకా బాల కుందా నవిద్ధం
> నీతాలోధ్ర ప్రసవ రజసా పాండుతా మాననశ్రీః

అని వింత వేషము గల అలోక సుందరిగా సృష్టించ లేదు. కావి వన్నె పావడా కట్టి తెల్లని జిలుగు వలువను వల్లె వాటుగా దాల్చిన సామాన్య మానవ లోక కన్యకగా వర్ణించెను. చందిరి కావి పావడ పిసాళి రుచుల్ సరిగంచు చీరపైఁ జిందులు ద్రొక్క నని సుభద్రను వర్ణించినాడు చేమకూర వేంకట కవి.

> వలిపె చెంగావి పావడ కొసల్ బిగియించి
> కుంకుమ పువ్వంచు కోక గట్టి

ఇళ నలంకరించినది రాధ. ఇది లోక స్త్రీసామాన్య మగు వస్త్రధారణము. అట్టి వస్త్రములనే వరూథిని తాల్చినది. శశికాంత మణి పీఠిపై గూర్చుండి వీణ వాయించు చున్నది. పెద్దన యితర కావ్యకవుల వలె వరూథినిని ఆపాద మస్తకము ప్రత్యంగమును వర్ణించి పాఠకుని మనస్సునకు విసుగు పుట్టింప లేదు. అది యాతని స్వభావము కాదు. కథ కెంత వరకు వర్ణన యుపయోగించునో అంత వరకే వర్ణించును. అదియు క్లుప్తముగా రెండు మూడు పద్యములలో తేల్చి వేయును. వర్ణించిన దానినే మరల మరల వర్ణించుట వాని స్వభావము కాదు. కావుననే వాని వర్ణనాంశముల నందరు

చదివి మెచ్చు కొందురు. ప్రవరుని వర్ణన హిమాచల వర్ణన సరయునది. చాల వరకు నాయన వర్ణన లన్నియు కథాంశములలో సమ్మిళితము గావించి రసోత్పాదన కారణంబులుగా నొనరించును. అందు మూలమున కావ్యమునకు శోభ నొదవించును. అదియే పెద్దనగారు మనుచరిత్రయందు చూపిన ప్రతిభ. వరూధినిని పెద్దనగా రధికముగా నేమియు వరి ంపలేదు

తత నితం బాభోగ ధవ ళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన

అను పద్య పాదమునందు తత నితంబాభోగ యని సూచించెను. తత నితంబము లనగా విరివి యైన పిరుదు లని యర్థము. యౌవనము ప్రాదుర్భావము నొందు కొలంది పిరుదులు విరివి తనము నొందును. స్తనములు పెరిగి యుత్తుంగము లగును. తొడలు విశాలము లయి గట్టితనమును వహించును. మిగిలిన యవయవము లన్నియు విస్తరించి వికాసము నొందును. పై పాదమునందు పిరుదుల విరివి తనమును తరువాతి పాదమునందు కుచపాళి యుత్తుంగతయు తెల్పుటచేత వరూధిని సక లావయవములందు పుష్టి కలదయి నిండు ప్రాయంబునం దుండె నని సూచింప బడినది. ముఖ సౌందర్యమునకు కనులును దృష్టాంతములు. అంగ సౌందర్యమునకు నిండు యౌవనమునకు నితంబ స్తనములును ప్రధానములు. ఆ కారణముచేత నా రెంటిని పెద్దన వర్ణించి వరూధిని యౌవన వైభవమును పాఠకుల యూహకు వదలి పెట్టెను.

మనుచరిత్ర మొదటి మూడాశ్వాసములందు వరూధిని నాయకురాలు. ఆమె శృంగార నాయిక. గంధర్వాంగన. యజ్ఞ కోటులం బావను లౌటకున్ ఫలము మా కవుగిళ్ల సుఖించుటే కదా యని ప్రవరునితో వచించినది. అందు మూలమున నామె సామాన్య. అందును వెతలం బెట్టకు మింక నన్ను, ప్రాంచ ద్భూషణ బాహుమూల రుచితో, అను పద్య భావములవలన నామె ప్రౌఢ యగును.

వరూధిని కంట బడినాడు ప్రవరుడు. ఆతడు వినూతనుడు. యక్ష తన యేందు జయంత వసంతులం జక్కదనంబునఁ గెలువఁ జాలినవాడు. ఎక్కడి వాఁడా! యని యబ్బుర పాటు తోఁచినది. అందు మూలమున నయనాంబుజములు వికసించినవి. కాంతి పెల్లుబ్బినది. కనీనికలు వికసి తోత్పల పంక్తులు గ్రుమ్మరింపగా ప్రవరుని చూచినది. వాని చక్కదన మామె మనస్సు నాకర్షించినది. లోన వలపు జనించి నది. శృంగార రస, ముబు కెత్తినది. గుబ్బ మెఱుంగుఁ జన్నవ గగుర్పొడిచినది. మనస్సునం దుండి యనేకము లగు కోరికలు పుట్టినవి. విభా వానుభావ సాత్త్విక వ్యభిచారీ సంయోగాత్ రస నిష్పత్తిః. వరూధినియందలి శృంగార రసోదయమునకు ప్రవరు డాలంబన విభావము. ఆతని చక్కదనము ఉద్దీపన విభావము.

కారణమైన విభావము
చే రస ముత్పన్నమైనఁ జెలఁగెడి దానం
బ్రారూఢ కటా క్షాదిక
మారయ ననుభావ మయ్యె

నని కావ్యాలంకార సంగ్రహము. ప్రవరు డాలంబనముగా నాతని యందున్న సౌందర్యము వరూధిని చిత్తమందలి శృంగార రసము నుద్దీపనము నొందినది. దానివలన నయనాంబుజములు వికసింప కాంతి పెల్లుబ్బి కనీనికలు వికసి తోత్పల పంక్తులు గ్రుమ్మరింపగా ప్రవరుని చూచినది. అది అనుభావము. అందువలన గుబ్బ మెఱుఁగు చన్నవ గగుర్పొడిచినది. ఇది సాత్త్విక భావము. సత్త్వ మనగా మన స్స్వభావము. దాని వలన పుట్టిన భావము సాత్త్విక భావము. వరూధిని మనస్సునందు పొడమిన శృంగార రసమువలని తనకు ప్రియ మగు ప్రవరునియందలి చక్కదనమును కనులార నరయుట చేత కలిగిన చిత్త స్వభావము వలన చనులు గగుర్పొడిచినవి. దీనిని రోమాంచ మని యాలంకారికు లందురు.

స్తంభ ప్రలయ రోమాంచాః
స్వేదో వైవర్ణ్య వేపథూః
అశ్రు వైశ్వర్య మిత్యష్టౌ
సాత్వికాః పరి కీర్తితాః

ఇవి సాత్త్విక భావములు. అందు

మనోరథస్య లాభేన సిద్ధ్యా యోగ్యస్య వస్తునః
ప్రియ సంగమ దేవాది ప్రసాదేశ్చ కల్పితః
మనః ప్రసాదో హర్షః స్యా త్తత్ర నేత్రస్య ఫుల్లతా
ప్రియ భాషణ మాశ్లేషః పులకానాం ప్రరోహణం

అని చెప్పబడినది. వరూధిని మనస్సునకు యోగ్య మగు వస్తువు కంటబడినది. ఆమె విప్పారు కనులం జూచినది. చనులు గగుర్పొడిచినవి. పెద్దన యే విషయమును వ్రాసినను శాస్త్ర విహిత మయి యుండును. అతడు శాస్త్రమును లోకానుభవముతో మేళవించి యనుభవము మీద మెరుగులు దిద్ది పద్యము వ్రాయును. పై పద్యము నందు వరూధిని కనీనికలు నల్లకలువల వలె నున్న వని ప్రకర ణాంతరముగా వర్ణించెను. అట్లు చూచినది చూచినట్లు వరూధిని యూరకుండ లేదు. తా నూరకుండినను మనసూరకుండనీయ లేదు. వీణె నవల డించినది. శశికాంత మణి వేదిక మీద నుండి యతి వేగముగా లేచినది. ఆ లేచు నప్పుడు పాదములందలి యందెలు ఝళం ఝళ శబ్దము లీనినవి. ఆశబ్దము లామె యెంత వేగముగా లేచినదియు సూచించినవట. ఝళం ఝళ యని అనుకరణమును రెండు సారులు పెద్దన ఏక దేశమందు వాడినాడు. పాదము రెండు తడవలుగా ఒక దాని వెంబడి నింకొకటి నేల మోపినది. అంతర విరహితము లయి లేచుటలో అతి వేగమును కటకములు సూచించినవి. లేచి యచ్చట నిలువ లేదు. కుచంబులుం దురుము లేనడు మల్లల నాడ నచ్చటం బూచిన యొక్క పోక నును బోదియ దరికి చేరినది. ఆ పోవు నప్పుడు

అతి వేగముగా పోయినది కాబోలు. లేనిచో కుచంబులుం నురువు లేనడు మంత యల్లలనాడి యుండవు. అవును. ఆమె కుతూహల మామె నంత తీవ్రముగా ముందునకు నెట్టినది. ఆమె మిగుల వేగముతో పోక నును బోదియ చేరినది. దానిని చాటు చేసికొని ప్రవరుని చూచినది వరూథిని. ఆ చూపుల నుండి తెల్లని కాంతులు తరంగముల వలె ప్రసరించినవి. ప్రవరుడు వచ్చు మార్గ మంతయు పాల సముద్రము వలె చేసినవి. ఈ పద్యమునకు వ్యాఖ్యానము వ్రాయుచు వావిళ్ల రామస్వామి శాస్త్రిగారు బోదియ = ఆలవాల మని యర్థము వ్రాసిరి. అది తప్పు. ఆలవాల మనగా కుదురు. కుదురు నున్నగా నుండ నేరదు. నును బోదియ యనగా నున్న నగు ప్రకాండ మని యర్థము. పోక చెట్ల బోదెలు నునుపుగా నుండును. పోక నును బోదియ చేరి యనుటలో పెద్దన యువిదల సహజ స్వభావమును పొందు పరచెను. వారు సిగ్గరులు. తలుపునో ద్వారమునో చాటు గావించు కొందురు. మేనర దోప పర పురుషుల నరయుదురు. అట్లే వరూథిని పోక నును బోదియ మాటున చేరి చూచిన దని పెద్దనగారి భావము. పోక నును బోదియ యనుట యందు పెద్దనగారి నిగూఢ మగు నభిప్రాయ మింకొకటి యున్నది. ఇతర వృక్షములకు కొమ్మలు రెమ్మ లుండును. అది యామె చూపుల కడ్డము వచ్చును. పోక చెట్టునకు కొమ్మ లుండవు. నిరాటంకముగా చూపులు దొరలింప వచ్చును. ప్రవరుని దారియందు కలశాంబుధి వెల్లి గొల్పు వచ్చును. ఆ కారణముచేతనే మలబారు ప్రాంతములందు పుట్టి పెరుగు చుండు పోక మ్రాకులను హిమాలయంపు లోయలో నాటించినాడు పెద్దనగారు. నిరంకుశాః కవయః

పెద్దన అబ్బురపాటుతోడ అను పద్యము మొదలుకొని మూడు పద్యములలో వరూథిని చూపులను వర్ణించినాడు. ఆ వర్ణనము చక్షుః ప్రీతి యను నాయకురాలి శృంగార చేష్టను ప్రదర్శించు చున్నది. అపూర్వ సౌందర్య రాశియు వినూతనుడు నగు ప్రవరుని మొదట

అబ్బురపాటుతో చూచినది. అప్పుడు కనీనికలు వికసి తోత్పల పంక్తులను గ్రుమ్మరించినవి. ఆమె పోక నును బోదియ చేరినది. అప్పటికి వాని సౌందర్యముతోడి కొంత పరిచయము లభించినది. అబ్బురపాటు దూర మయినది. వానిని తదేక దృష్టితో కన్నులు నిండార విచ్చి తేరిపార చూచినది. తొల్లింటి వికసి తోత్పల పంక్తులు మాయ మైనవి. ఆమె విలోకనముల నుండి పాల సముద్రము వలె తెల్లని కాంతి తరంగములు పొడమినవి. అట్టి చూపులవలని పొడమిన మానసిక పరిణామమును

మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్
జొనుపన్ గోర్కులు గ్రేళ్లు ద్రిప్ప మది మెచ్చుల్ ఱెప్ప లల్లార్ప న
త్యనుషంగ స్థితి ఱిచ్చపా టొసఁగ నొయ్యారంబునన్ జంద్రికల్
దనుకన్ జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్ల న్నేత్ర పద్మంబులన్

అని వర్ణించినాడు. ప్రవరు డంత కంతకు సమీపించు చుండెను. వరూధిని మనస్సునందు మొదట కొంకు పుట్టినది. కొంకు అను శబ్దమున కిచ్చుట భయ మని యర్థము చెప్పుట యుత్తమము. యువిదలు సహజ బీరువులు. ప్రియ వస్తు సందర్శనముచేతను భయము వారికి కలుగును. ప్రవరుడు క్రొత్తవాడు. వాని స్వభావము వరూధిని యెరుంగదు. తా నట్లు చూచుటవలన నాత డేమనుకొనునో యని భయము. అందు మూలమున ఆమె చూపులందు చాంచల్యము కలిగినది. కాని యామె సంతోషము చూపులను విస్తరింప చేసినది. మనస్సునం దనేకములగు కోరికలు పుట్టినవి. అవి చూపులను గంతులు వేయించినవి. వరూధిని ప్రవరుని యందమును లోలోన మెచ్చుకొనినది. ఆ మెప్పులు కను ఱెప్పల నల్లార్చినవి. ఇది వింత విశేషము. వరూధిని గంధర్వాంగన. ఆమె యనిమేష. కను ఱెప్పపా టామె కుండదు. మది మెప్పుల్ ఱెప్ప లల్లార్ప నని నుడివెను. ఇది జాతి లక్షణము నకు విరుద్ధము. ఆ సంగతి పెద్దనకు తెలియును. ఈ విషయమును

అనిమేషస్థితి మాన్చె నను పద్యమునందు సమర్థించినాడు. అత్యనుషంగ స్థితి చెచ్చెరఁ బొదవించినదట. ఇది తుది పరిణామము. వరూథిని చూపు ప్రవరుడు సమీపించు కొలంది మనస్సునందు పొడమిన భావ ములను బట్టి మార్పులు కలిగినవి. అంతలో నాతడు మిక్కిలి సమీపమునకు వచ్చినాడు. ఆమె నిశ్చేష్టురా లయినది. ఆమెతో పాటు చూపులు నిశ్చైతన్యము లయినవి. కన్నులు విచ్చు కొని అట్లే చూచుచు నిలబడినది. ఇది స్తంభ మను సాత్త్విక భావము. ఎంత చక్కని వర్ణన. చూపును చూపులోని క్రమ క్రమ పరిణామములను ఒక్క పద్యములో నింత విపులముగా నింత యంద ముగా వర్ణించిన కవి తెలుగులో లేడు. కవికి శాస్త్ర పాండిత్య మొక్కటి చాలదు. శాస్త్ర పరిజ్ఞానమును లోకముతో సరిచూచు కొన వలయును. ఆ రెంటిని జోడించి స్వానుభవమునకు తెచ్చుకొన వలయును. దానికి సహజ మగు వినూతన దృక్పథము కుదురు కొల్పి కావ్య గతిము గావింప వలయును. అప్పుడు వర్ణన చిత్తామోద మొద వించును. పాడినదే పాటయిన పాఠకునకు నిరాదర మొదవించును. అందుకనె చిన్నయసూరి బహు దేశాటనంబు బహు శ్రుతులతోడ నిరంతర సాంగత్యము పండితులతోడ గోష్ఠి చిరకాలము రాజ సంభలం దునికియు గావలయు నని నుడివెను. ఇవన్నియు పెద్దన గారికి గలవు. కావుననే యిట్టి పద్యము వ్రాయ గలిగెను. పై పద్యము నందు పరిణామాలంకారము కలదు.

వరూథిని నయన పద్మములను వికసింపఁ జేసినది. తెలి వెన్నె లలు ప్రసరించు నటులఁ బ్రవరు నీక్షించినది. మనమున మోహ మతిశయించినది. మన్మ థాగ్ని చెల రేగినది. ధూమాంకూరముల వలె పులకలు పొడమినవి. ఇది రోమాంచ మను సాత్త్వికభావము. గుబ్బ మెరుంగు చన్నుగవ గగుర్పొడువన్ అని యదివరకే రోమాం చమును వర్ణించెను. మరల నీ రోమాంచ మేల వర్ణింప వలయును.

ఇది పునరుక్తి కాదా యని కొంద రందురు. అట్లు కాఁజాలదు. గుబ్బ మెఱుఁగు చన్గవ నావిర్భవించిన గగుర్పాటు మోహాతిశయము వలన మేనెల్ల వ్యాపించిన దని భావము. ఆమె మరియు బ్రవరు నర సినది. అరయు కొలంది వరూథిని యొడలు చెమరించినది.

తొంగలి ఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించు కొనునో ముఖ చంద్రు నటంచుఁ బోవనీ
కంగజుఁ డాన పెట్టి కదియన్ గుఱి వ్రాసె ననంగ జాఱె సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మ లలాటము డిగ్గి చెక్కులన్

ఇది పెద్దనగారి పేరెన్నుఁ పద్యము. ఇందలి భావములో నెవ్వ రే మాత్ర మపహరించినను కనుగొన వచ్చును. వరూధిని కస్తురితో తిలకము దిద్దుకొనినది. చెమటచేత కస్తురి బొట్టు కరిగినది. లలాట మునం దుండి దిగి చెక్కుల మీఁదికి జారినది. దానిని యుత్ప్రేక్షించి నాఁడు పెద్దన. వరూథిని ప్రవరుని యందమును నయనాంబుజములు వికసింప కాంతి వెల్లుబికించి చూచినది. ఆమెకు తృప్తి కలుగ లేదు. మరింత పెద్దవి చేసి తెలి నిగ్గులు వెల్లువలు కట్ట పరికించినది. అయి నను ప్రవరుని యందము నరయుటకు చాలలేదు. అంత కంతకు విరివి తనము వహించు చున్న యామె కనులు తొంగలి రెప్పలను తొలఁగ త్రోచుకొని ముఖ మంతయు నాక్రమించు కొనునేమో యను భయము తోచినది మోహాధి దేవత యగు అంగజునకు. ఆ కారణముచేత నింక కనుగవ విస్తరించి పోవ కుండ ఆన పెట్టిన గురుతులా యను నట్లున్నవిట యిటు నటు చెమటచేత తిలకము కరిగి చెక్కుల జారిన రేఖలు. ఎంత చక్కని భావము. కల్పన మనిన నిట్లుండ వలయును. పెద్దనగారి యూహ చాల పెద్దది. ఆ పేరులోనే యా గొప్పతన మున్నది. చూపులను వర్ణించిన పైపద్యములలోని భావము లన్నియు నీ పద్యమునందు కలిపినాడు. ఈ పద్య భావ

మును ముందుగా దృష్టియందుంచుకొని వెనుకటి పద్యములను చిత్రించినాడు పెద్దన. దీనిని బాగుగా నర్థము చేసికొనిన గాని వెనుకటి పద్యముల సమన్వయము కుదరదు. వరూథిని చూచు నప్పు డొకొక్క స్థితిలో నొకొక్క రకముగా నంత కంతకు విరివి తనము వహించిన వామె కనులు. ఆ స్థితి భేదములను బట్టి యబ్బుర పాటు చేత వికసి తోత్పలములను గ్రమ్మరించిన చూపులు విస్తరించి కలశాంబుధిని వెల్లి గొల్పినవి. తరువాత చంద్రికలను విరియించినవి. మూడు పద్యములు మూడు పరిస్థితులను వివరించు చున్నవి. ప్రవరుడు సమీపించు కొలంది భావములు మారినవి. భావములను బట్టి పరిస్థితులు మారినవి. స్థితులు మారిన కొలందియు కనులు విస్తరించినవి. కనులు విస్తరించిన కొలందియు చూపులు మార్పు చెందినవి వరూధినికి. ఇది స్వేదమను సాత్త్వికభావము. దేవతలకు కను రెప్పపా టుండదు. వారు అనిమిషులు. చెమట పట్టదు. అస్వే దులు. పెద్దన మది మెచ్చుల్ ఱెప్ప లల్లార్ప ననియు సారంగ మదంబు లేఁజెమటఁ గ్రమ్మె ననియు పై పద్యములందు వర్ణించెను. ఆ వర్ణనలు సంప్రదాయ విరుద్ధములు. వానిని సమర్థించుచు

> అనిమేష స్థితి మాన్చె బిత్తరపుఁ జూపస్వేదతా వృత్తి మా
> న్చె నవ స్వేద సమృద్ధి బోధ కళ మాన్చెన్ మోహ విభ్రాంతి తో
> డనె గీర్వాణ వధూటికిన్ భ్రమర కీట న్యాయ మొప్పన్ మను
> ష్యుని భావించుట మానుషత్వము మెయిన్ జూపెట్టెనా నత్తరిన్

అను పద్యమును వ్రాసెను. పెద్దన మహా పండితుడు, కవి. ఊహాలు మెండు. విరుద్ధ వర్ణనలు గావించినను సమర్థించుకొన గల శక్తి యున్నది. వరూధిని గంధర్వాంగన. ప్రవరుడు మానవుడు. మానవు లకు కను రెప్ప పాటు స్వేదతా వృత్తి విభ్రాంతియు గలవు. గంధర్వులు దేవతలు. వారి కవి లేవు. వరూథిని ప్రవరుని వలచినది. వానిని నిరంత

రము భావించుటచేత మానుషత్వ మామెకు వచ్చినదా యను నట్లు చిత్తరపుఁ జూపువలని నిమేష స్థితి కలిగినది. స్వేద మంకురించినది. మోహ విభ్రాంతి కలిగినది. అది యట్లు జరుగునా యను సందేహము వారించుటకు భ్రమర కీట న్యాయము దృష్టాంతముగా చూపెను. తుమ్మెద కీటమును దెచ్చును. దానిని తన గూట నిడుకొనును. నిరంతరము ఝుంకారము చేయుచు దాని చుట్టు తిరుగును. కీట మెల్లపుడు దానినే భావించుచు చూచు చుండుటచేత భ్రమర మగును. అట్లే వరూథిని మానుషత్వము తాల్చిన యట్లైనది. ఇది సత్త్వ స్ఫూర్తి. నాయకుని గుణ రూపములు నాయకురాలు. వహించుట.

పర గత సుఖ దుఃఖాదుల
నరయంగ భావించి యట్ల యలరుట సత్త్వ
స్ఫురణము

దానివలన కలుగు భావములు సాత్త్వికభావములు. దీనినే నాయికా విషయమున లీల యను శృంగార చేష్ట యందురు. అధిపుని యలఘు గుణానుకృతి లీల యగు నని కావ్యాలంకారము. వరూథిని ప్రవరుని యందమును చూచు కొలందియు పరవశత్వము నొందినది. లోలోన వాని సౌందర్యమును ప్రస్తుతించినది. మదనుడు మిగుల కొంటెవాడు. అందము గల యువతీ యువకు లొక్క చోట నుండగా చూచి యూర కుండడు. అందు నది ఘోకాంతము. ఇంకేమి. అవకాశము లభించినది. వరూథిని మీద నారాచములను గుప్పింప నారంభించి నాడు. ఆమె మానసాంబురుహము సమ్మూర్ఛిత మయినది. మిగుల తత్తరపాటు పుట్టినది. అతడు తన్ను చూడకుండ దాటి పోవునేమో యని భయము. అచ్చట తన యునికి తెలుప వలయును. తన యందమును జూపి ప్రవరు నాకర్షింప వలయును. దాని కుపాయ మామె యెరుంగును. వరూథిని యతి ప్రౌఢ. అంఘ్రి కటకంబుల్

పైగా యాఁ బ్రవరుని దారి కడ్డమై నిలిచినది. ఇది స్త్రీజన సహజ మగు చర్య. ప్రియుడు పర ధ్యానమునం దుండి తన వంక చూడ నప్పుడు ప్రియురాలు గాజుల గలలు నందెల ఝుణ ఝుణాలు పెల్లో దవ నేదో పని యున్నటుల నెదుటకు వచ్చును. అంతతో ప్రియుడు ప్రియురాలి రాక గుర్తించును. ఇది లోక వృత్తము. పెద్దన యిట్టి లోక స్వభావ ప్రవృత్తులను కథకు పొదిగించి మనుచరిత్ర రమణీయ ముగా రచించెను. కథ పౌరాణిక మయ్యును ఇట్టి లోక ప్రవృత్తుల వర్ణనా సమ్మేళనము చేత పాఠకు ననుదిన లోక పరిచయములకు దరి దాపు గావించి కథను అందముగా నడిపించినాడు. అందు మూలమున సాంఘిక ప్రవృత్తి కలదయి మనుచరిత్ర పాఠకుని మనస్సు అడు గడు గునను మిగుల నాకర్షించు చుండును. పెద్దన వాడిన ప్రతి పదము నందు నేదో యొక విశేషము గోచరించును. నిరర్థక మగు వర్ణన గాని పదము కాని మనుచరిత్రయం దగుపించదు. వరూధిని యందెల మొరపమ్మునకు తల యెత్తి చూచినా డామె ముఖమును ప్రవరుడు. ఆమె అడవియందు నొంటరిగా నుండుటకు విభ్రాంతు డయినాడు ప్రవరుడు.

ఎవ్వతె వీవు భీత హరి ణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వన భూమి

అని లోక సామాన్యముగా ప్రశ్నించినాడు ప్రవరుడు. తపతి నళ్లే సంవరణుడు

ఎటుఁగఁ జెప్పు మబల యెవ్వరి దాన వి
ట్లేల యున్నదాన వేకతంబ
క్రూర వన మృగములు గ్రుమ్మరు చున్న యీ
విజన విషమ శైల విపిన భూమి భా. ఆది.

అని ప్రశించెను. వరూధిని భీత మృగేక్షణ యట. భావ గర్భిత

మయిన సంబోధన. పెద్దన మునుమున్ బుట్టెడు కొంకు తాల్వాను నిడన్ అని యామె చూపులను వర్ణించినాడు. ఆ కొంకు లౌల్యమామె కనులలో గోచరించినది ప్రవరునకు. కావున ఆ సంబోధన. భీత హారి ణేక్షణ యను సంబుద్ధి ప్రవరుని వంటి నిష్కామి నోట రాఁదగ దని కొంద అందురు. సంబోధ నౌచిత్యము తెనుఁగు కవులు దృష్టిలో నుంచి రస జాల మని వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు నుడివిరి. ఇందు ప్రవరుని నోట రాతగని మాట యేదియు లేదు. వరూధిని మానకసి వ్యవస చూపులందు గోచరించినది. కావున అట్లు సంబోధించి నాడు ప్రవరుడు. అం దనౌచిత్య మేమియు లేదు. ఇతరి తెనుగు కవుల సంగతి అట్లయిన కావచ్చు నేమో గాని పెద్దనగారి సంబోధనలందు ప్రకరణమును బట్టి యర్థముచేసికొన వలయును గాని యనౌచిత్యము గోచరించదు చూపులందు అట్టి కొంకు లౌల్యములు కలిగియు భయములేక ఒంటరిగా నీ వన భూమి చరించు చుంటివి. ఎవతెవు నీవు అని ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానము వరూధిని చెప్ప వలయు నని ప్రవరుని యభిప్రాయము కాదు. అతడు శమము దమము గల యాహితాగ్ని. వేలిమియు సుకార్చనయు విప్ర సపర్యలందు గల యభిమాన మింక దేనియందును లేదు. కాల నియమము తప్పకుండ వానిని నిర్వర్తించు కొనుట వాని నిత్య కృత్యము. ఆ నాటి సత్క్రియా కాండము లింకను తీర్చుకొన లేదు. వానిని కొన సాగించు కొనుటకు మనస్సు తహతహ లాడు చున్నది. ఇంటికి పోవలయును. ఆ తొందర పాటులో తన ప్రశ్న కామె సమాధాన మిచ్చు నంత వరకైన మన స్సాగ నీయ లేదు. వెంటనే తన కథ చెప్పుకొనుట కారంభించినాడు ప్రవరుడు.

భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి

అన్నాడు. ఆ మాట సత్యము.

అకలం కౌషధ సత్త్వముం దెలియ మాయా ద్వార కావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుఁ గొం
డకు రాఁ జెల్లునె·

యని ప్రవరుడు చింతించెను. అట్లు వచ్చుట క్రొవ్వున ముందు వెనుక లాలోచింపక చేసిన పని. కావున క్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచితి ననుట సమంజసము. ఇంత వరకు సక్రమముగానె యున్నది. తరువాత

పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁ గదవే తెరు వెద్ది శుభంబు నీ కగున్

అన్నాడు ప్రవరుడు. పల్లె పట్టునం దుండెడి పంట కాపులు చాల అమాయకులు. క్రొత్త చోటికి రాగానే వారికి గాబరా యెక్కు వగును. రైలు స్టేషనులో టికెట్లిచ్చు చోటికి పోయి మా అత్తవారి యూరికి టికెట్టియ్య మని తొందర పెట్టాడట ఒక పంటకాపు. అట్లున్నది ప్రవరుని ప్రశ్న. అనవసగ మయిన తన పేరు చెప్పుకొనినాడు. ఊరి పేరు చెప్ప లేదు. పురంబుఁ జేర నింకెవ్విధి గాంతుఁ దెల్పఁ గదవే యని యడిగి నాడు. అతడు విభ్రాంతుడు. మన స్సంతయు సత్క్రియా కాండముల మీాద నున్నది. ఇంటికి పోవలయు నని వాని కాతురత హెచ్చినది.కావున అసలు సంగతి నుడువ లేదు. మరచి పోయినాడు. చివరకు శుభంబు నీ కగున్ అని ఆశీర్వదించినాడు. బ్రాహ్మణున కాశీర్వచనము సహజ మగు వాక్కు. ప్రవరుని వంటి శ్రోత్రియుని యాశీస్సు నిరర్థకము కాఁజాలదు. కావున స్వారోచిష మనువు కులోద్ధారకు డయి తన గర్భ వాసమున పుట్టిన స్వరోచికి జన్మించినాడు. ప్రవరుని త్రొట్రుపాటును గ్రహించి నది వరూధిని. ఆమె మాట చతురత గలది. ఒక్క మాటలో ననేక భావములు స్ఫురింప చేయ గలదు. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేడెదు అని యొక్కసారి అదలించినది. ఆ యదలింపులో

పరిహాస మున్నది. చతురత యున్నది. అవును పరిహాసింపదా మరి. ఆమె నడి వయస్సునం దున్న యందకత్తె. ప్రవరుడు యావ నుడు. ఎవరు లేకుండ చూచి ఊరి పేరు చెప్పక మా యూరికి దారి యేది యని యడుగుట కొంటె తనము కాదా. అందుకని యామె యట్లన్నది. ఆతని తబ్బిబ్బు గ్రహించినది. ఆమె ప్రౌఢ మగు సమా ధానము చెప్పినది. ఆమె వేశ్య. చతురత వేశ్యల పాలిటి సొమ్ము. దారి వెంట నొంటరిగా పోవు చున్న యావనవతి యగు నందకత్తెను చూచి కోడె వయస్సునం దున్నవాడు అమ్మాయి! అమ్మాయి! మా యింటి కెటు పోవలయు నని యడిగినచో నామె ముఖము చిట్లించు కొని కండలు రాల్చుకొనుచు దయ్యా లంటి కళ్లు పెట్టుకొని దారి నన్నడిగెద వేమి? నీకు కన్నులు కనబడవా? వచ్చిన దారి తెలియదా? ఆడది ఒంటరిగా కనబడినది కదా యని పలుకరించుట కిది యొక కొంటె వేష మని ముఖము వాయు నట్లు నానా చివాట్లు పెట్టును. అట్లే వరూధిని ఇంతింత పెద్ద కన్ను లున్నవి. దారి యెవ్వరి నడు గుదువు అనినది. ఆ యదలింపుతో పాటు చే యెత్తి ప్రవరుని యాకర్ణాంత విస్తారము లగు కనులను చూపినదేమో కూడ. లేక చేరలతో అభినయ పూర్వకముగా ప్రదర్శించినదో! ఆమె వేశ్య. అభినయ మెరిగినది. తన మాటలకు ప్రవరుడు బెదిరి పోవు నని తలంచినది కాబోలు వరూధిని. భూసురేంద్ర యని సంబోధించినది. అందు కొంత ఆదరము పరిహాసము కూడ కప్పబడి యున్నది.

ఏ

కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియగాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు

అని గద్దించినది. ఒంటరిగా నున్నదానను. పడుచుదానను. ఏదో యొక మిష పెట్టుకొని పలుకరించ వలయు నని పన్నిన పన్నాగ మిది. కానిచో నీ వదివరకు వచ్చిన దారి నీకు తెలియదా? తెలి యును. తెలిసియే ప్రశ్నించితివి అన్నది. పై పెచ్చు ఇంత భయంబు

తే కడుగ నెల్లిద మైతిమి. మాట లేటికిన్ అని తేల్చినది. వలచి వలపించుకొను వారెపో వనిత లెందు అన్నా డొక మహాకవి. ఆ మాట నిజము. ప్రవరుని యంద చందములను జూచి మొదట వలచినది వరూథిని. ఏలని బంటుగా మరున్ డక్కఁ గొనంగ రావె యకటా నను వీఁడు పరిగ్రహించినన్ అని లోలోన మురిసి పోయినది. ప్రవరుడు పలకరించినాడు. బిగతీసుకొని బెట్టు చేసినది. ఇది స్త్రీల స్వభావము. పెద్దన స్త్రీల ప్రకృతిని బాగా గుర్తించినవాడు. కావున వరూథినిచేత నట్లు పలికించెను. ఆమె మాటలలో నొక విధముగా వేళాకోళము పరిహాసము నిందారోపణము అదలింపు బెదరింపు నిమిడి యున్నవి. ఈ పద్యమునకు మనుచరిత్రలో నొక ప్రత్యేక స్థానము కలదు. మనుచరిత్ర పేరు తలంపగానే రస గ్రహణ పారీణుల కీ పద్యము మొదట జ్ఞాపకమునకు వచ్చును. పైకెంత బెట్టుగా మాట్లాడినను లోని వల పూర కుండ నిచ్చునది కాదు. అది యుబుకెత్తి పొంగి పొరలి యేదో విధమున బైటికి రాక మానదు. అది దాచు కొంద మనినను దాగదు. ఆమె మాటలలో మనస్సు విప్పి చెప్పినది. అది అంతర్వాహిని వలె ప్రతి పదమునందు మరుగు పడి యున్నది. సవిమర్శముగా పరిశీలించి చూచినచో నగుపించును. వరూథిని మాట చతురతకు గంభీర స్వభావమునకు పాఠకుడు వహావ్వా యని యబ్బుర పోవును. వరూథిని శృంగార నాయిక. అందును వేశ్య. అతి ప్రౌఢ. గంధర్వాంగన. తేలికగా బైట పడునది కాదు. ప్రవరుడు శమ దమములు గల విరాగి. అతని వైరాగ్యము పరాంగనలను కన్నెత్తి చూడనీయదు. అతడు ధీరశాంతుడు. పరస్పర విరుద్ధములగు

## శృంగార వైరాగ్యములు

గల నాయికా నాయకులను ఒక్క చోట చేర్చి నాటక మాడించినాడు పెద్దన. అదియే వాని చతురత. మనుచరిత్రలోని విశేషము. ఇట్టి విరుద్ధ రసములను కావ్యమునందు పొందు పరచిన వా రింకొకరు లేరు.

నన్నెచోడుని కుమార సంభవమునందును (శ్రీ)నాథుని హరవిలాసము నందును పార్వతీ పరమేశ్వరుల కథా సంబంధమునం దిట్టి సంఘటనము కలదు. కాని యది పరిపూర్ణతను బొంద లేదు. మన్మథుని జోక్యము పానకములోని పుల్లవలె నైనది. అది పౌరాణికము. పౌరాణికముగా పరిణమించినది. వరూథినీ ప్రవరుల కథ పౌరాణిక మయ్యును లోక ప్రవృత్తిని కూడ తీసికొని సాంఘిక రూపమును దాల్చినది. అది పెద్దనగారి విచిత్ర రచనా చాతుర్యము. ఆ సాంఘిక ప్రవృత్తి మను చరిత్రకు జీవ సిద్ధిని కల్పించినది. అమృతత్వము చేకూర్చినది. ఇంతలు కన్ను లుండ అన్నది వరూథిని. చెంపకు చేరెడేసి యాక ర్ణాంత విశ్రాంతములయిన విశాలములగు నేత్రము లున్న వని చూపి నది. విశాలము లగు నయనములు ముఖమునకు సౌంద ర్యాపాదక ములు. అందు మూలమున ప్రకరణాంతరమునందు ముఖ సౌందర్యము వర్ణింప బడినది. అంద మగు ముఖము విశాలములగు నయనములు కలవాడ వని భావము.

వదన ప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబు లన వీని కన్ను లమరు

అన్నది వరూథిని. పర పురుషుని యందమునకు జవరా లగు నొక స్త్రీ మురియుట వానియందు గల వలపు వ్యక్త పరచును. కావున వరూథిని ప్రవరుని మోము నందమును వర్ణించుటచేత వానియందు గల మోహమును విశద పరచినది. తెరు వెవ్వరి వేడెదు అన్నది తరువాత. దారి యెవ్వరి నడుగుదువు. ఎవ్వరి నడుగ వలసిన పని లేదు. నీ విశాల మగు కనులే నీకు దారి తెలుప గల వని భావము. కాని నన్ను దారి యెందు కడిగితి వందువా? ఏకాంతమునందు నున్న జవరాండ్రను అని లోక సామాన్యముగా నుడివినది. అందు మూల మున నేను ఒంటరిగా నున్న దానను. ఎవరి యాటంక ముండదు. కామానుభవమునకు తగిన నడిమి ప్రాయంబునం దున్న దానను అని

సూచించినది. నెపం బిడి పల్కరించు లా గింతియ కాక యన్నది యటు మీాద వరూథిని. నా యొంటరి పాటు తనము యౌవనము గుర్తించితివి. దారి యను నొక మిష కల్పించి నన్ను పలుకరించు టకు పన్నిన పన్నాగ మిది. ఇట్లు పలుకరించుటచేత నీకును నాయందు మోహము కల దని నిరూపించినది. అట్లు కా దందువా, నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు అని నిదర్శనము చూపినది. ముందు నీవు వచ్చిన దారి నీకు తెలియదా? తెలియును అని భావము. తెలిసియు నడుగుట కొంటె తనము. అదే నీ వలపు తెలుపు చున్నది. నీ కింత భయంబులే కడుఁగ నెల్లిద మైతిమి అని తేల్చినది. నీవు భయంబు లేక నన్ను పలుకరించుటచేత నా మనో భావమును నీవును గుర్తించితివి. నేను నీయందు వలపు గలదాన నగుటచేత నీకు తేలి కయితిని. మాట లేటికిన్ అన్నది. ఇరువురి మనములందు ఒండొరులపై ప్రేమ కలదు. ఇంక మాటలతో పని యేమి. మన వలపు కార్య రూపమున పరిణమించు గాక యన్నది. నీవు అందగాడవు. నీయందు నాకు వలపు కలిగినది. నేను ఒంటరిగా నున్నాను. ఎవరి యాటంక ముండదు. కామానుభవమునకు తగిన నడి వయస్సునం దున్నదా నను. ఆ సంగతి తెలిసి దారి యను మిష యొకటి కల్పించి నన్ను పలుకరించితివి. అందు మూలమున నీకును నాయందు ప్రేమ కలదు. మాట లెందుకు. మన ప్రేమ కార్య రూపమును బొందుగాక అని ఫలి తాంశము. ఇది శబ్ద మూల మగు వస్తు కృత వస్తు ధ్వని. ఇందు వరూథిని రసికత, మాట చతురత, సందీయని కార్య కారణ భావములతోడి బిగు వగు తార్కిక వాదము, గోచరించు చున్నది. ఇది యంతయు పెద్దనగారి రచనా వైదగ్ధ్యము. పద్యమునందలి భావము లన్నియు సర్వ సామాన్యములు. లోక సహజములు. వాని నుండి యసా ధారణములగు వ్యంగ్య భావములు స్ఫురింప జేసిన పెద్దనగారి ప్రతిభ అన్య కవి జనాతీత మయినది. ఈ పద్యము కావ్య లక్ష్మికి మకుటాయ మానము. దీనిని ప్రశంసింపని కవులు లేరు. ఇందలి భావముల

కబ్బుర పోని రసజ్ఞులు లేరు. తరువాత వరూథిని తన ఘనతను గూర్చి

చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధి
పొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిఁ బుట్టు జంత్ర గాత్రముల తాల్ గరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁ డఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయములనఁ బేర్వడ్డ
పవన తంత్రము లుంకువలు మాకుఁ

గనక నగ సీమఁ గల్ప వృక్షముల నీడఁ
బచ్చరా చట్టు గమి రచ్చ పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాము గరడీలు మాకు గోత్రామరేంద్ర

అని చెప్పుకొనినది. ఇది ఎవ్వతె వీవు భీత హరిణేక్షణ యను ప్రశ్నకు సమాధానము. ఇందు వరూధిని తన కుల విద్యా వైభవములను ప్రశంసించు కొనినది. పెద్దన యీ పద్యమును నిగూఢము లగు విశేష భావముల నిమిడ్చి విరచించెను. మొదటి పాదమునందు లక్ష్మి తన తోఁబుట్టు వని చెప్పుకొనినది. అందు మూలమున తన జాత్యౌ న్నత్యమును ప్రకటించు కొనినది. అంతే కాదు. తాల్ గరగించు విమల గాంధర్వంబు తనకు విద్య యన్నది. పద్మసంభవ వైకుంఠ భర్గ సభలు తన నాట్య విద్యా ప్రదర్శనములకు నెలవు లని నుడివి నది. అందువలన తన రసికతయు సరసత్వమును చెప్పుకొనినది. గానము నాట్యము మానవులకు రసికత నాపాదించు లలిత కళలు. అందు మూలమున పతివ్రతలు నట గాయకులను చూచుట కిష్ట పడరు. ఒక నాడు నారాయణుని సందర్శింప నారదుడు వైకుంఠమున

కరిగెను. అప్పుడు నారాయణునితో నున్న లక్ష్మి నారదుని రాక చూచి చరచర లోని కరిగినది. అది చూచినాడు నారదుడు. అట్లు పోవుటకు కారణ మే మని హరి నడిగినాడు. హరి నీవు గాన విద్యా కోవిదుడవు. గాయకులు అతి రసికులయి యుందురు. వారు స్త్రీలను తేలికగా లోగొందురు. అట్టివారి ముఖమును పతివ్రతలు చూడ రని నుడివెను. అంతకు మించినవారు నటులు. అందుకని నట గాయకులను విట కోటుల జాబితాలో చేర్చి పంక్తి భోజనములకు నసర్హు లని పూర్వాచార పరాయణులు వారిని పరిహరించిరి. లోకానుభవము కలవారి కందలి సత్యము తెలియును. కావున వరూథిని గాన నాట్య విద్యా ప్రవీణురాల నని చెప్పు కొనుటచేత తన సరసత్వ రసికత్వము లను వెల్లడించు కొనినది. వేశ్యలందు గల విశేషమే యది. దానికి కారణము నాట్య గానములు. అవి యెంతవాని నైన లోగొని బంధించును.

వింత వింతగఁ గలసిన యంత సరియె
యెమ్మెకాని మనోభావ మెఱుఁగ వలదె

అన్నది ముద్దు పళ్లని. దానిని బోధించునది కామ శాస్త్రము. ఆ శాస్త్రము వెన్నతో పెట్టినది మాకు అన్నది వరూథిని. నేను రసికు రాలను సరసురాలనే కాదు నీ మన స్సెరింగి కామానుభవమునందు శయ్యా బంధములచేత నీకు సకల విధముల సుఖ మొసంగ గల నని అంతరార్థము. ప్రవరుడు బ్రాహ్మణుడు. వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడు. అది గ్రహించినది వరూథిని. సవన తంత్రము లుంకువలు మాకు అని చెప్పుకొనినది. యజ్ఞ యాగాదుల ఫలము స్వర్గమునందు రంభా ద్యప్సర స్సుదతీ సమాగమ మని శాస్త్రములు నుడువు చున్నవి. నీవు యజ్ఞములు చేసిన వాడవు. ఆ యజ్ఞములు మా కౌగిళ్ల సుఖింపనే గదా చేసినది. అట్టి సుఖము నీ కిక్కడ

లభింప గలదు. ఎప్పుడో మరణానంతరమునందు కోరుకొను సుఖము ఈ శరీరముతో నిక్కడ ననుభవింపు మని భావము. దీనినే

యజ్ఞ కోటులం
బావను లాటకున్ ఫలము మా కవుఁగిళ్ల సుఖించుటే కదా

యని వ్యాఖ్యానించినది. అట్టి నీ కోరిక తేలికగా లభించు నని సూచన. వరూథిని మాటలవలన ప్రవరుని మనస్సునందు సంచలనము కలుగ లేదు. అది గ్రహించినది వరూథిని. వేటగాడు ఎర వెట్టి మృగము నాకర్షించు నట్లు శృంగార రసోద్దీపన కారణము లయిన తన కుసు మోద్యా నాదికములను జూపి మనస్సు నాకర్షింప జూచినది.

బహు రత్న ద్యుతి మేదు రోదర దరీ భాగంబులన్ బొల్చు ని
మ్మహి కాహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్ నభో
వాహినీ లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహ ణేందిందిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్

అని చే యెత్తి చూపినది తన పూదోటల సౌభాగ్యమును ప్రవరునకు. సంస్కృత పదముల కూర్పుతో సమాసములను పొదిగించి పద్యము లను నడిపించుటలో నన్నయ శ్రీనాథుడు పెద్దన పోతనలు తెలుగు సారస్వతమునందు అగ్ర గణ్యులు. నిస్తరంగ మగు పయోనిధియందు నౌకా యానము వలె ఒడుదుడుకులు కలిగింపని నడక నన్నయగారి పద్యములం దెల్లెడలను కాన్పించును. వానియందు బాణ వేగము కలదు. బిగువు సడలని కూర్పు గోచరించును. శ్రీనాథుడు వీర శైవ మతావలంబి. వాని మనస్సు ఆవేశ పూరితము. వాని పద్య రచనలో తదనుగుణ మగు దుడుకు తనము గోచరించు చుండును. అల్లసాని పెద్దనగారి పద్యములు పద పదమునందు మార్దవము పెల్లు బ్బారి కఠకు తనము మచ్చున కైనను పొడగాన నీయవు. ఒక్కొ

కృష్ణుడు నన్నయ పద్యములందు కొంచెము కటుకు తనము నాలుకకు పొడమునేమో కాని పెద్దనగారి పద్యములందు ఆ మాత్ర మైనను పొడమదు. అవి సాన తీర్చి నునుపు తేర్చి మెరుగు పెట్టిన జాతి రత్నములు. వాని నుండి గూఢార్థ ప్రతిపాదకములైన భావ మరీచులు పరిశీలించిన కొలంది వింత వింత వర్ణములతో వెలువడు చుండును. పయి పద్యము నందు శీతల గంధవాహములు కుసుమ మంజరీ సౌరభములు ఇందింది రములు గల కాంతార సంతానములు చూపినది. అవి శృంగార రసోద్దీపకములు. అచంచల మగు ప్రవరుని హృదయము వానిని చూపుటవలన శృంగార రస సంకలిత మగు నని యామె భావము. తరువాత భూసుర కైతవ కుసుమ శరాసన అని సంబోధించినది. బ్రాహ్మణుని మిషతో నున్న మన్మథుడట ప్రవరుడు. అట్టి సంబోధన చేత వరూథిని మనస్సునందలి యనురాగమును ప్రవరునకు సూచించినది. మా యింటి విందు వయితివి. ఆతిథ్యము ను గైకొమ్ము.

కుందనము వంటి మేను మధ్యంది నాత
పోష్మ హతిఁ గందె వడ దాఁకె నొప్పు లొలుకు
వదన మస్మ ద్గృహంబు పావనము సేసి
బడలికలు వాసి చను

మనినది. ప్రవరుని మేను కుందనము వంటిదట. ఇది సౌంద ర్యాభి వర్ణనము. బంగారము నిప్పు సెగ తగులుటచేత కాంతిని బాసి కందు వారును. అట్లే మధ్యంది నాత పోష్మ హతి ప్రవరుని మేను కందినదట. వాని యందము లొలికించు ముఖము వడ తాకినదట. అందు మూలమున నామె మనస్సు బాధ పడినది. ఆ బాధకు నామె మనస్సులోని యకలంక మగు ననురాగము కారణము. దానిని ముఖ శరీర వర్ణనలచేత సువ్యక్తము గావించినది వరూథిని. ముఖము వడ దాకినది. శరీరము కందిన దనుటవలన ప్రవరుని వైవర్ణ్యతకు తాను పడుచున్న బాధ విదితము గావించినది.

ప్రియుని సుఖ దుఃఖములు తనవి గా భావించుట లీల యను శృంగార చేష్ట యగును. ఇంత వరకు మాటలలో వ్యక్తావ్యక్తముగా వెల్లడించిన ప్రేమను ఈ పద్యమునం దించుక వ్యక్తము చేసినది. ఇది యామె ప్రయత్నమునందు రెండవ మెట్టు. విన్నాడు వరూథిని పలుకులు ప్రవరుడు. ఆమె భావ మాతనికి విశద మయినది. ఎత్తిన తల వంచి నాడు. ఆ మాట లాతనికి రుచింప లేదు. అతని హృదయము శాంత రస పరిప్లుతము. అన్య కాంతల యందలి శృంగార రసమునకు తావు లేదు. శీలంబున్ శమమున్ దమంబు వాని సహజ గుణములు. కావున కాంక్ష చేయు జార కామినుల కాతడు భోగ బాహ్యుడు. వానికి దర్భలు సమిధలు స్రుక్స్రువస్రులు అగ్నులు అరణులు ఇష్టము లయినట్లు మ రేవియు గాజాలవు. అవి వాని కుద్దీపన విభావములు. వానిని చూడగానె యొడ లుప్పొంగును. మేను గగుర్పొడుచును. హర్ష ముదయించును. వేలిమియున్ సురార్చనయు విప్ర సపర్యయు వాని నిత్య కృత్యములు. వరూథిని చక్కదనము గాని యామె చూపిన కాంతార సంతానములు గాని ప్రవరుని మన స్సాకర్షింప లేక పోయి నవి. అవి తనూ సుఖము నొదవించునవి. అవి వానికి తుచ్ఛములు. మిన్నాసాలపైఁ దేనియల వంటి వని యాత డెరుగును. కావుననే

> కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములైన ట్ల్యాన్యముల్ గావొడల్
> తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్ మిన్నాసాలపైఁ దేనియల్

అన్నాడు వరూథినితో. ప్రవరుడు భాషాపర శేషభోగి. కావున మనసు నొవ్వని చక్కని మాటలతో తన కార్యము నిర్వర్తించుకొన దలంచి నాడు. అండజయాన యని సంబోధించినాడు. ఇది నిరర్థక మగు సంబోధన కాదు. వరూథిని మాటలవలన ఆమె దేవతా-స్త్రీ యని గ్రహించినాడు ప్రవరుడు. దేవతలు ఘటనాఘటన సమర్థులు. వరూథిని తలంచు కొనినచో తన్ను తేలికగా నిల్లు చేర్ప గల దని యూహ

పొడమినది. కావున ఆమెను వినుతిగా నా సంబోధన చేసినాడు ప్రవరుడు. అండజయాన యని యామె యానము నుతించుటంలో నొక విశేష మున్నది. అతడు పరస్త్రీ పరాఙ్ముఖుడు. స్త్రీలను తేరి చూచుట ప్రవరుని వంటివా డొనరించునది కాదు. ఆమె మాటలు తల వంచి వినినాడు. కావున వానికి యాన మొకటే కన వచ్చినది. ఆ కారణముచేత నట్లు సంబోధించెను. రామునకు సుగ్రీవాదులు సీత నగలు చూపించిరి. చూచినాడు రాముడు. వానికి కన్నుల నీరు తిరిగినది. వానిని సరిగా గుర్తించలేక పోయినాడు. లక్ష్మణుని యడిగినాడు రాముడు ఇవి సీత నగలేనా యని. లక్ష్మణుడు

నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వేవ జానామి
నిత్యం పాదాభి వందనాత్

అని నుడివినాడు. అట్లనుటచేత సీతయందు లక్ష్మణునకు మాతృ భావము కల దనియు నాత డామె నెన్నడు కన్నెత్తి చూడలే దనియు వాని దృష్టి యామె పాదములందే యుండెడి దనియు ఆ కారణము చేత అందెను మాత్రము గుర్తించె ననియు నీ శ్లోకమునందు లక్ష్మణుని శీలము ధ్వనించు చున్న దనియు వ్యాఖ్యాతలు నుడివిరి. అట్లే వరూథిని యానమును మాత్రము కను చుండుటచేత ప్రవరుని శీలము వ్యంజిత మగు చున్నది. తరువాత నీ వాసంగు నట్టి సపర్యలు మాకు వచ్చినవి. ఇందుండంగ రాదు అన్నాడు ప్రవరుడు. వరూథిని యేకాంతమునందు నున్న జవరాల నని తెల్పినది. ప్రవరుడు తరుణు డగు నగ్నిహోత్రి. ఆమెతో నచ్చట నుండుట తగ దని ఆంతరంగికము. పోవలయు నూరికి అని బైటికి కారణము వెలిబుచ్చి నాడు ప్రవరుడు. భక్తియ చాలు అన్నాడు. ప్రవరుడు భక్తి సంయుక్తి నెదురేగి ప్రణతు డగుచు నింటికిం గొని వచ్చి యాతిథ్య

మొసంగుట వాని యలవాటు. అట్టిదే యామె యాతిథ్య మని తలంచినాడు ప్రవరుడు. అత డుత్తముడు. పరుల భావము లుత్తమములు గానే పరిగణించుట యుత్తముల స్వభావము. అందు మూలమున నీ భక్తియే చాలు. నేను మీ యింటికి వచ్చి యొక్కటి యును రాకుండ నొకటియునా? రాకుండినను వచ్చినట్లే. సత్క్రియా కాండము దీర్ప వేగ చనఁగా వలయును.

ఏనిఁక యిల్లు సేరుటకు నెద్ది యుపాయము మీ మహత్త్వముల్
మానిని దివ్యముల్ మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యముల్
గానము గాన తల్లి! ప్రజలన్ ననుఁ గూర్పుము

అని యర్థించినాడు ప్రవరుడు. వాని మాటలకు నవ్వు వచ్చినది వరూథినికి. తల్లీ! యను పిలుచుటచేత ప్రవరుడు వరూథినియందు తన మాతృ భావము కనపరచినాడు. ఆమెకున్న ఆలోచన పోవలయు నని వాని తలంపు. తన నిగూఢాభిప్రాయము ప్రవరుడు గ్రహింప లేదని వరూథిని తలంపు. ఆ సంబోధన పరస్పర విరుద్ధ భావములను మొలకెత్తించినది. కావున తెగబడి వరూథిని

ఎక్కడి యూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
వక్కట మీ కుటీర నిలయంబులకున్ సరి రాక పోయెనే
యిక్కడి రత్న కందరము లిక్కడి నందన చంద నోత్కరం
బిక్కడి గాంగ సైకతము లిక్కడి యీ లవలీ నికుంజముల్

అని యాక్షేపించినది. మనుచరిత్ర ప్రథమాశ్వాసములోని పద్యము లకును ద్వితీయాశ్వాసములోని వరూథినీ ప్రవరుల సంభాషణ సందర్భ మున విరచించిన పద్యములకును తారతమ్యము కలదు. ఇందు చిన్న చిన్న వాక్యములను పొందు పరచి పద్యములను నడుపుటయే కాక యింతలు కన్నులు, కాల్నిలువక, ఎక్కడి యూరు, రాకుండ

నొకండు వచ్చి, మఱి యొండనె, ఇటు వంటి దేశీయములగు వ్యావహారిక పదములు చొనిపించి పద్యములను మిగుల నాకర్షణీయములు గావించెను. సిద్ధుడు ప్రవరునితోడి సంభాషణయందు నిట్టి దేశీయములు రచనకు శోభ కలిగించినవి. ఎఱుకలు కట్టుకొన్న, పండ్లును బూండ్లు, చెప్పక చెప్పెడు, ఇత్యాదు లరయునది. నన్నయగారి కవిత్వము మందాకినీ వాహిని. విబుధ జనావగాహన యోగ్యము. సామాన్య మానవ లోకమున కందుబాటులో నుండదు. దాదా పన్ని పద్యములు మొదటి నుండి చివరి వరకు నొక్కటే వాక్యముగా నుండును. అందందు

ఉత్తరపు గాలి విసరె వి
యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెన్
ఎత్తె నసల్ సేమంతులు
నెత్తమ్ములు తరిగె హిమము నెలకొనియె నృపా

వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠ మెయిన్ భవ దగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగ రాక్షస పన్నగ బాధ నొందెనో

ఇట్టి పద్యములు గూడ కలవు. చిన్న చిన్న వాక్యములను జొనిపించి వృత్తములను నడిపించుట యొక పద్ధతి. అందు ప్రసాద మాధుర్య గుణములు తొణికిస లాడు చుండును. అట్టి రచన సామాన్య మానవుల చిత్తమున కందుబాటులో నుండును. పాఠకుని మనస్సునకు పదములతో పాటు భావ మవగత మగు చుండును. రసావిష్కృతి కట్టి రచన చక్కని దారి కల్పించును. కావ్యమునకు శోభ నాపాదించును. దేశీయత నెలకొని యుండును. నన్నయ తన భారతము పండితులకే కాక పామర జనాకర్షణీయముగా కూడ నుండ వలయు

నని యిట్టి రచన గావించెను. అందు లోక వ్యావహారికము లగు దేశీయములను జొనిపించెను. ప్రొద్దును బోయె, నన లెత్తె, యిటువంటి వరయునది. ఇట్టి రచనలో హృద్య యాకర్షణీయ మగు నంద మున్నది. ఇట్టి రచనను సర్వ సామాన్యముగా నన్నయ సంభాషణలందు వాడుచు వచ్చెను. అందు దేశీయము లగు తెనుగు పదములతో తత్సమ పదములు కలయ కలిపి పద్యము నడిపించుట వాని యలవాటు. అట్లే యల్లసాని పెద్దన వరూథినీ ప్రవగుల సంభాషలో

అండజయాన ! నీ వొసఁగు నట్టి సపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగ రాదు పోవలయు నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి మఱి యొండునె భక్తియ చాలు సత్క్రియా
కాండము దీర్ప వేగ చనఁగా వలయుం గరుణింపు నాపయిన్

ఇట్లు చిరుత వాక్యములు గల పద్యములను రచించెను. సంభాషణాంశము లందిట్టి కూర్పులో పెద్దన నన్నయగారి ననుసరించెను. తిక్కన పదముల కూర్పునకు పెద్దన పదముల కూర్పునకు తారతమ్యము కలదు. తిక్కన అచ్చిక వైకృత దేశీయ పదముల బాహుళ్యముతో పద్యము నడుపును

వచ్చినవాఁడె ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినైన పెనంగిన బలంబులు రెండును గెల్వ వచ్చునే
హెచ్చుగుఁ గుందగున్ దొడరు టెల్ల విధంబుల కోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్క మెయి నిత్తఱిఁ బొందగు చేతయుం దగున్

ఇది తిక్కనగారి పోకడ. తెనుగునకు సరియైన తెనుగు తనము కూర్చిన వాడు తిక్కన. తెనుగు సజీవ మగు భాష. అది యెప్పటి కప్పుడు మారు చుండును. తిక్కనకు పెద్దనకు మధ్య దాదాపు మూడు వందల సంవత్సరములు గడచినవి. వారి రచనలు సరి పోల్చి యిప్పుడు చూచినచో తిక్కనగారి రచన ప్రాతపడి నట్లు తోచును. ఒక్కొక్కప్పు

డది పౌరాణికము కూడ అనిపించును. ఆ కాలపు తెలు గట్టిది. విశేషించి నెల్లూరు వాసుల తెలుగులో నొక విశిష్టత గోచరించును. అదియే యీ ప్రాత తనము సమకూర్చినది. నన్నయ అంతకు ముందు మూడు వందల సంవత్సరముల క్రింద నివసించి యుండెను. అం దా పౌరాణికత గోచరింపదు. దానికి కారణము అతని తెనుగు వేగినాటి తెనుగు. సంస్కృత తత్సమ పదముల బాహుళ్యము కలది. ఆ పదముల సంపుటీకరణములో అందము పొడ చూపును. పెద్దన మనుచరిత్రలో నా యందమే జీవము పోయు చుండును. ఎప్పటి కప్పుడు పాఠకుని మనస్సులో వినూతన చైతన్యము కలిగించు చుండును.

యువతీ జన సహజ మగు సిగ్గు ప్రవరుని యెడ గల యనురాగమును వరూధినిని వివరింపనీయ లేదు. గూఢముగాను గూఢా గూఢముగాను ఇంచు కించుక అగూఢముగాను వ్యక్త పరచినది. అతడు గ్రహించుకొను నని యామె యభిప్రాయము. కాని యామె ప్రదర్శనములు నాహ్వాన ములు ప్రవరునకు భక్తి యుతములుగా తోచినవి. కావుననే భక్తియ చాలు అన్నాడు ప్రవరుడు. అతడు ఆహితాగ్ని. ఆ నా డిలు చేర కుండిన సమస్త ధర్మములు తూలి పోవును. వాని మనస్సు సత్క్రియా కాండముల మీఁద నెలకొని యున్నది. ఆమె భక్తియు వాని మనస్సును మరల్ప లేక పోయినది. ఆ సంగతి గ్రహించినది వరూధిని. ఆమె నెఱజాణ. వివరించి చెప్పిన గాని గ్రహించుకొన లే డని యూహించినది.

నిక్కము దాప నేల ధరణీసుర నందన యింక నీ పయిన్
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజు బారికి నప్పగించెదో
చొక్కి మరంద మద్యముల చూఱలఁ బాటలు పాడు తేంట్ల సొం
పెక్కిన యట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెదో

అని సిగ్గు జార విడిచి మన స్సంతయు విప్పి చెప్పినది వరూధిని ప్రవరునకు. పరస్పర విరుద్ధ భావములు కల ఇద్దరు మహా పురుషులు

వాదించు నపుడు వారి సంభాషణలో శాస్త్రీయములైన విషయములు వెలువడు చుండును. వానిని దాపునకు చేర్చి చూచినచో నా యా శాస్త్రముల సారము విశద మగును. వరూథిని కామ శాస్త్రోపాధ్యాయిని. కామ శాస్త్రము యింద్రియ సుఖానుభవమును బోధించును. అది ఐహికము. కాముకులు దానిని అనుసరింతురు. ప్రవరుడు నిరంతరాధ్యయన అధ్యాపన తత్పరుడు. వానికి వేదములు ప్రమాణములు. వేదాచారములు ఆచరణీయములు. అవి పారమార్థిక దృష్టిని పరపించును. స్వర్గ సుఖానుభవమునకు దారి తీయును. ఇట్టి పరస్పర విరుద్ధ శాస్త్రములను మేలు బంతులుగ కొని తమ జీవితమును గడుపుచున్న పాత్రలు వరూథినీ ప్రవరులు. అందును వరూథిని గంధర్వాంగన. ఆమెకు స్వర్గ సుఖములు స్వానుభవములు. సవన తంత్రముల రహస్యమును గుర్తెరింగిన ప్రౌఢ. ప్రవరుడు శాస్త్ర పరిజ్ఞానము కలవాడు. మానవుడు. వీ రిరువురను మనుచరిత్ర యందు ప్రధాన పాత్రలుగా సృష్టించినాడు పెద్దన. వారి సంభాషణ మూలమున అయిహిక సుఖములను ఖండించు నట్టి ఒక విధమగు

వేదాంత గ్రంథము

గా మనుచరిత్రను రూపొందించెను. ఈ విషయమును దృష్టియం దుంచుకొని పెద్దన ప్రవరుని వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడును శమ దమాది సద్గుణ గరిష్ఠుండును నగు వేదాచార పరాయణునిగా సృష్టించెను. అతడు అగ్నిహోత్రి. నిత్య నైమిత్తిక కర్మలను విధి విధానములు తప్పకుండ నాచరించువాడు. సురార్చనయు విప్ర సపర్యయు వాని నిత్య నియమములు. అతడు మకరాంక శశాంక మూర్తి యగుటచేత వరూథిని మనస్సును ఆకర్షించెను. అతడు విరాగి యని యామె యెరుంగదు. కావున తన మనస్సులోని తగులమును వానికి విప్పి చెప్పినది. అందు మూలమున వాదోపవాదములు ఆరంభమయినవి. ప వరుడు

వనజేక్షణ యిట్లు పలుక వరసయె వ్రతులై
దినములు గడపెడు విప్రుల౯
జనునే కామింప మది విచారము వలదే ?

వ్రతి యనగా యమ నియమములు గలవాడని యర్థము. యమ మనగా నింద్రియ నిగ్రహము. అది శమ దమాదులవలన కలుగును. అట్టి యమ నియమములు గలవాడ నయి దినములు గడుపు చుంటిని అన్నాడు ప్రవరుడు. దేహ మస్థిర మయినది. దానికి వినాశము తప్పదు. అది యింద్రియావశ గతి వర్తించును. ఇంద్రియములు కామేచ్ఛ గలవి. వానిని బుద్ధిచేత కుంచించుచు మోక్ష సాధన కొరకు పరమేశ్వ రార్పణముగా కర్మ నాచరించుచు దేహము మిత్రాది ఆస్థ విడిచి యున్నవాడను. ముక్తి బడయ నెదురు చూచుచు దినములను బుచ్చు చున్నవాడను. అట్టి నన్ను కామింప తగదు. అని గద్దించినాడు వరూధినిని ప్రవరుడు. వనజేక్షణ యని సంబోధించినాడు. అట్టి తన గద్దింపువలన వరూధిని తన్ను అన్య విధమున భావింప కూడదు. తన కామె యిలు సేరు నుపాయము చెప్ప వలయును. ఆమె శృంగారవతి. ఆమె యందమును పొగడుచు కొంత వినుతి గావించినాడు సంబోధన మూలమున ప్రవరుడు. అతడు భాషా పరశేష భోగికదా! 'ఇంతలు కన్నులుండ' యను పద్యములోని భూసురేంద్ర యను సంబోధన వంటిదే యిది. తరువాత

వేలిమియున్ సురార్చనయు విప్ర సపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీ జనకుల్ కడు వృద్ధు లాకటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుందురు రాహితాగ్ని నే
దూలు సమస్త ధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేర కుండనన్

అని తన స్థితిని వివరించినాడు వరూధినికి ప్రవరుడు. నిత్య నైమిత్తిక కర్మ లయిన స్నానము సంధ్యావందనము జపము మొదలగునవి

ముగిసినవి. దైవత కర్మలగు అగ్నిహోత్రములు దేవతార్చన అతిథి పూజ మిగిలి పోయినవి. అతిథ్యము దైవత కార్యము. అభ్యాగతః స్వయం విష్ణుః అని శాస్త్రములు. అతిథి పూజకు భరత దేశము నందు మిగుల ప్రాధాన్యము కలదు. ఆహితాగ్నులు ప్రొద్దు పడమర తిరిగినచో భుజింపరు. అహింసా పరమో ధర్మః. పరులకు బాధ కలిగించుటయు హింస యగును. అందును దలిదండ్రులు మిగుల వృద్ధులు. వా రాకట సోలు నట్లు చేయుట హింస యగును. మాతృ దేవో భవ. పితృ దేవో భవ. మాతాపితలు దేవతలు. వారి యెడ హింస గావించుట పాప కారణము. మాతాపితృ భక్తి యిందు మూలమున వ్యంజిత మగు చున్నది. ఇట్టి సమస్త ధర్మములు దూలును. నేను ఆహితాగ్నిని. ఆహితాగ్నులు కాల నియమము తప్పకుండ ఆ యా కర్మ లాచరింప వలెను. నియత కర్మ మాచరింప కుండుట మహాపాప మని ప్రవరుని వాదము. విన్నది వరూధిని. తన గుట్టు బైట పెట్టినను లాభము లేక పోయినది. ముఖము చిన్నపుచ్చు కొనినది.

ఉ

భావజ రూప యిట్టి యెల ప్రాయము వైదిక కర్మ నిష్ఫలన్
బోవఁగ నింక భోగములఁ బొందుట యెన్నఁడు యజ్ఞ కోటులం
బావను లౌటకున్ ఫలము మా కవుఁగిళ్ళ సుఖించుటే గదా.

అని వరూథిని లౌకిక వాదమునకు శాస్త్రమును జత పరచి నుడివినది. యజ్ఞ మొనరించినవారు అవభృత స్నానముచేత పవిత్రు లగుదురు. మరణించి స్వర్గమును చేరుదురు. స్వర్గమునందు రంభా సంభో గాది సుఖము లనుభవింతురు అని వేదములు చెప్పుచున్నవి. కావున యజ్ఞ యాగాదుల ఫలము రంభా సమాగమము. రంభ అప్సరసలలో నొకతె.

పేరు వరూథిని విప్ర కు
మార ! ఘృతాచీ తిలోత్తమా హారిణీ హే

మా రంభా శశిరేఖ లు
దార గుణాఢ్యులు మదీయ లగు ప్రాణ సఖుల్.

అని చెప్పుకొన్నది వరూథిని. ఆ కారణముచేత వరూథినియు అప్స రసల కూటములలో నొకతె. కావున

హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకు

అని ప్రవరునితో ముందుగా నెరిగించినది. ప్రవరుడు ఆహితాగ్ని. దేహాంతరమునందు అప్సరః సమాగమము వాని యజ్ఞములకు ఫలి తము. భౌతిక దేహమును విడిచి సూక్ష్మ దేహముతో స్వర్గము నందు అనుభవించు సుఖము ఈ దేహముతోడనే నీకు లభించు చున్నది. అందుకొరకే కదా నీవు వివి ధాధ్వరములు పొనరించినది. అని వరూథిని వాదము. కావున

సద్యో వినిర్భిన్న సారంగ నాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీఱెండఁ గరఁగి కట్టిల నంటి
గమగమ వలచు చొక్కపు జవాజి
పొర లెత్తి ఘనసార తరువులఁ దనుఁ దాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దోనల నిండిన యట్టి తుహిన జలము

వివిధ కుసుమ కదంబంబు దివిజ తరు జ
మృదుల వసన ఫలాస వామేయ రత్న
భూషణంబులు గల విందు భోగ పరుఁడ
వయి రమింపుమ ననుఁ గూడి యనుదినంబు.

అని కోరినది. ఆమె వాదము శ్రుతి హితము. కోరిక సమంజసము. కాని అది కామ ప్రేరిత మగుటచేత ఆచరణీయము కాదని వరూధిని మరచి పోయినది.

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినం.

కామమునకు ఇంద్రియములు మనస్సు బుద్ధి ఆశ్రయములు. అది జ్ఞానమును కప్పి పురుషుని మోహ పెట్టును. ఆ మోహము పాపములకు కారణము అని గీతలు నుడువు చున్నవి. యజ్ఞ ఫలము పుణ్యమువలన పొడమినది. వరూధిని వలపు కామమువలన కలిగినది. ఇది యింద్రియములను మభ్యపరచి బుద్ధిని మోహ పరచును.

శ్రీకృష్ణరాయలు రాజాధిరాజు. వాని యేలుబడియందు మహాటవులు పెక్కు కలవు. వనేచర నాయకులు రాయలవారికి పడికాపులు. మహారాజును దర్శింప వచ్చు చుందురు. వచ్చునప్పు డెల్ల సద్యో వినిర్భిన్న సారంగ నాభము, కరగి కట్టిల నంటి గమగమ వలచు జవాజి తెచ్చి యిచ్చు చుందురు. వానిలో భాగస్వామి యల్లసాని పెద్దన్నగారు. పచ్చి కస్తూరి జవాజులలోని ఘుమాయింపు ఆ మహా కవికి నిత్యానుభవము. 'పచ్చకప్పురము సిరములు గొజ్జంగి నీరు మహారాజు పూదోటలలో తయారగు చుండును. వాని ననుభవించుటకు పెద్దనగారికి సర్వ స్వాతంత్ర్య మున్నది. కావున నీ పద్యము స్వానుభవము మీఁద రచించిన దగుటచేత నింత రమణీయముగా కుదిరినది. దీనిని చూచి వ్రాసిన యితర కవులు గలరు. అనుకరణ మనుకరణమే. మొదటిదాని యందమెంత ప్రయత్నించినను రాజాలదు. తరువాత వరూధిని

ఎన్ని భవంబులం గలుగు నిక్షుశరాసన సాయక వ్యథా
ఖిన్నత వాడి వత్త లయి కేలఁ గపోలము లూఁది చూపులన్

విన్నఁ దనంబు దోఁపఁ గను వేదుఱునం బయిగాలి సోఁకినన్
వెన్న వలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్

అని యూరించినది. ఈ పద్యము తన్ను వరించిన గంధర్వుని మన స్సునం దుంచుకొని పల్కినది వరూథిని. పంచ భూతాత్మక మగు నీ శరీరముతోడనే స్వర్గమునం దాసించు సుఖము నావలని నీ వనుభ వింప గలవు. అనశన వ్రతములతో శరీరమును శుష్కింపచేయ నేల యని అన్నది వరూథిని. విన్నాడు ప్రవరుడు. దానిని పూర్వ పక్షము చేసినాడు. నీ వన్న విషయము లన్నియు కామికి గాని మోక్ష గామికి గాదు. బ్రాహ్మణుడు ఇంద్రియములకు లోబడి మరుని బాణముల పాలయి బ్రహ్మానం దాదిరాజ్య పదవి నుండి తొలంగి పోవును అని సమాధానము చెప్పెను. అవును ఆ మాట సత్యము. కర్మాచరణము రెండు విధములు. కామ కర్మ యని నిష్కామ కర్మ యని. కామాసక్తుడగు వాడు కోరికను మనస్సునం దుంచుకొని నిత్య నైమిత్తిక వేద కర్మలను ఆచరించును. అట్టి వారికి స్వర్గ సుఖము లభించును. అప్సరః సమాగమము చేకూరును. అట్టి వాడు పుణ్య ఫలానుభవమును పొందిన తరువాత మరల భూలోకమునందు జన్మిం చును. అందు మూలమున స్వర్గ రాజ్య పదవి నుండి పరిచ్యుతు డగు చున్నాడు. రెండవది నిష్కామ కర్మ. మానవుడు చేయు నిత్య నైమిత్తిక నైతిక కర్మ లన్నియు ఫలము నపేక్షింపక లోక హితమును గోరి పరమేశ్వ రార్పణముగా నాచరింప వలయును. అందు మూల మున జన్మ విరహిత మగు శాశ్వత బ్రహ్మ పదవి లభించును. అదియే మోక్షము. ఈ సిద్ధాంతమునే కర్మ సిద్ధాంత మందురు. ఇది పూర్వ మీమాంస సారము. దీనికి భాట్ట మత మని పేరు. కుమారిల భట్టు మహాపండితుడు. ఆరవ శతాబ్దములోనివాడు. చార్వాకాది మతములను ఖండించి కర్మ సిద్ధాంతము స్థాపించెను. జైమిని సూత్రము లకు మహాభాష్యమును రచించెను. దానికే పూర్వ మీమాంస యందురు. ఇందలి సారాంశమునే

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః

అని గీత లుపదేశించు చున్నవి. పరం అనగా మోక్ష మని శంకరులు నుడివిరి. సత్త్వ శుద్ధి ద్వారమున కర్మయోగి మోక్షమును పొందు నని శంకర గురుపాదుల మతము. కర్మ యోగమే ఆత్మ దర్శన వ్యాపారమున శ్రేయస్కర మని రామానుజ మతము. అట్టి యాదర్శ ప్రాయు డయిన కర్మయోగిగా ప్రవరుని పాత్ర మలచినాడు పెద్దన. వేద మతము నందలి బ్రహ్మ పదార్థమును తన మతమున కనుగుణముగా వరూధిని

ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభ గత ప్రదీపకళికా శ్రీ దోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గను నా యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంత ర్బుద్ధి నూహింపుమా

అని నిర్వచనము చేసినది. ఇది సాంఖ్య మతము. ప్రకృతి సత్త్వ రజ స్తమో గుణముల సామ్యావస్థ. అది సకలమునకు కారణము. ప్రకృతి నుండి బుద్ధి జనించును. బుద్ధివలన అహంకారము, అహం కారమువలన శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్రల్లు కలుగును. పంచ తన్మాత్రల నుండి పంచ భూతములు, పంచ కర్మేంద్రియ ములు, పంచ జ్ఞానేంద్రియములు మనస్సు కలుగును. దేహము పంచ భూతాత్మక మయినది. ఆత్మ దేహముతో సంసర్గమువలన సుఖ దుఃఖాదు లనుభవించు చున్నటు లుండును. తామ రాకునకు నీ రంట నట్లు ఆత్మకు కర్మ లేప ముంటదు. ప్రకృతి జగత్తును సృష్టిం చును. ఆత్మకు సంబంధము లేదు. జడ మగు ప్రకృతి ఆత్మ సంయోగముచేత సృష్ట్యాది వ్యాపారములు జరుపు చున్నది. ఆ ప్రకృతియే ఆత్మకు భోగ మోక్షముల నిచ్చును. కావున ఇంద్రి యానుభవమువలన కలుగు ఆనందమే బ్రహ్మ. అందువలన నింద్రియ

ములను దేహమును పరిపుష్టము కావించుకొని యింద్రియ సుఖము ననుభవింప వలయును. దానివలన కలుగు సుఖమే యానంద మని వరూథిని వాదము. శుక రంభా సంవాదమునందు రంభ శుకునితో నిట్లే వాదించినది. పెద్దన యా గ్రంథమును చదివి దీనిని రచించి యుండును. వరూథిని ఘటికురాలు. వాదనమునం దాతని మెప్పించి యా నని పించుకొన వలయును. వానిని లోబరచుకొన వలయును. తన కార్యము నిర్వర్తించుకొన వలయును. ప్రవరుడు పరబ్రహ్మో పాసకుడు. ఆనందో బ్రహ్మ. ఆనంద ఏవ బ్రహ్మ అని వేదాంత శాస్త్రము. ఆనందమే బ్రహ్మ యని దాని భావము. బ్రహ్మ యనగా పరతత్త్వము. దేనివలన ఆనందము కలుగునో అదియే పరతత్త్వ సాధన మనియు దానివలన కలుగు ఆనందమే పరతత్త్వ మనియు వరూథిని వాదన. దేనియందు మనస్సు సంప్రీతి చెందునో ఏకాగ్రత కలిగి కుంభ గత దీప కళిక వలె నిశ్చలత వహించి యుండునో ఎందును చలింపక ఇంద్రియము లెందు సుఖించునో ఆ యింపే పరబ్రహ్మ. ఆన దో బ్రహ్మ యని వేదములు నుడువు చున్నవి. ఆ యానందము రతివలన లభించును. అదియే బ్రహ్మ మని వాదించినది వరూథిని. ఆమె వాదము కాముకులకు నచ్చునది. కామమునకు పరమావధి ఆనంద మనుటలో సందేహము లేదు. అది ఇంద్రియ జన్యము. ఆ యానం దానుభవములో మనస్సు సంప్రీతి నొందు ననుట నిజము. ఇంద్రియములు ఏకాగ్రత కలిగి నిశ్చలత వహించును. కాని అది క్షణికము. విషయికము. రత్యంతమునం దా యానంద ముండదు. ఇది దైహికము. బ్రహ్మ పర మయిన ఆనందము సుస్థిరము. అవిషయికము. ఆత్మను సంబంధించినది. ఆనందము అను శబ్ద మొకటి యైనను లక్షణముచేత సాధనముచేత విభిన్నములగు చున్నది. ఆ సంగతి ప్రవరునికి తెలియును. అలసాని పెద్దనగారు తన ప్రతిభ నంతయు వినియోగించి శిల్ప కళా నైపుణ్యము నంతయు ప్రదర్శించి తీర్చి దిద్ది మెరుగు పెట్టిన పాత్ర ప్రవరుడు. వానిని లోకమున కాదర్శ ప్రాయుడు

కర్మయోగియు నగు సంసారియుగా చిత్రించి కావ్యమునందు ప్రతిష్ఠించినాడు. ప్రవరుడు తత్త్వవిదుడు. ఫలాపేక్ష లేక పరమేశ్వరార్పణముగ కర్మకలాపములను నిర్వర్తించువాడు. బ్రహ్మానందానుభవము కలవాడు. వరూథిని విపరీత భాషణములను ఆలించినాడు. ఈ పాండిత్యము నకుఁ దక్కు మఱి యెందేఁ గంటిమే అని పరిహసించినాడు. రేపును మాపును హవ్యములచేత తృప్తుడగు వహ్నియొసగు సౌఖ్యము నీకెరుగ రాదు. అరణులు దర్భలు అగ్నులు నాకు ప్రియమైనట్లు ఇతరములు కాజాలవు. ఒడలు శాశ్వతము కాదు. ఇంద్రియ సుఖములు మీసాల మీది తేనియల వంటివి. ఆత్మానందానుభవము స్థిరమైనది. అదియే బ్రహ్మానందము. పరతత్త్వము. అని సిద్ధాంతీకరించెను. ఆ మాటలకు వరూథిని హృదయము జల్లు మన్నది. ముఖము చిన్నపోయినది. కన్నుల నీరు క్రమ్మినది. ప్రవరుని పుల్కపుల్కన చూచినది. డగ్గుత్తికతో తల యూచినది. "వనిత తనంతఁ దా వలచి వచ్చిన చుల్కన కాదె యేరికిన్" అన్నది. ఇందు అశ్రువు గద్గదిక అను సాత్త్విక భావములు వర్ణింపబడినవి. ఒక విధముగా వరూథినీ ప్రవరుల సంభాషణము

## దేహాత్మల వివాదము

దేహము పంచ భూతాత్మక మయినది. పంచ జ్ఞానేంద్రియములు పంచ కర్మేంద్రియములు నందిమిడి యున్నవి. శబ్ద స్పర్శ రూప రస గంధాదులగు తత్త్వములు ఇంద్రియ లక్షణములు. కావున ఇంద్రియము లా యా తత్త్వానుభవముల నపేక్షించును. అందువలన కలుగు సుఖానందమునందు రమింప నభిలషించును. ఆత్మ పరమేశ్వరుని రూపము. అది ఈశ్వరానుసంధానము కోరును. దానికి సాధనము నిత్య నైమిత్తిక వేద కర్మాదులు. మనుచరిత్రమునందు వరూథిని దేహము. ప్రవరు డాత్మ. వారి వారి వాదములు పెద్దన కథా రూపమున ప్రదర్శించెను. వరూథిని తన ప్రయత్నమును మాన

లేదు. బలవంతము మీఁద తన కార్యము సాధించు కొనవలె నని ప్రయత్నించినది.

వెతలన్ బెట్టకు మింక న న్ననుచు నీవీ బంధ మూడన్ రమో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్ గొప్పు వీడన్ దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననున యాలాపాలి దీనాస్యమై
రతి సంరంభము మీఁఱ నిర్జర వధూ రత్నంబు పైపాటునన్.

ప్రాంచ ద్భూషణ బాహు మూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగలించి యధరం బాసిం

చినదట. ఇది భావ శబలత. ఇందు కొంత రతి శృంగార మిమిడి యున్నది. మోహావేశమున వరూథినికి నొడలు తెలియ లేదు. ఆమె పరవశత్వమును పొందినది. జారుపాటులను గ్రహించుకొన లేదు.

స్రస్తా నీవీ నఖలు సహసా సా స్వయం ముక్త బంధా
గాఢాలింగన తత్పరే విగళితా నీవీ దృఢాపి స్వయం

అని కావ్యములు నుడువు చున్నవి. కామావేశమున దృఢముగా ముడిచిన నీవియే తనంతట తాను సడలునట. మిగిలిన జారు పాటుల సంగతి వేఱె చెప్ప వలసిన పని లేదు. అల్లసాని పెద్దన మిగుల సునిశిత మగు పరిశీలనా దృష్టి కలవాడు. ఏ సందర్భమున వెలందుల యే యవయవ మెంత వరకు నల్లల నాడునో ఏ యవయవ మెంత వరకు నుబికి దుబ్బిస లాడునో బాగుగా పరిశీలింప గలడు. దానిని యథా రీతిగా పద్యములో కావ్యమునం దిమిడ్చ గలడు. చూచి ఝళం ఝళ త్కటక, మట్టెల్ మ్రోయగ ఇత్యాది పద్యములు దానికి ప్రబల తార్కాణములు. అంత కంటె విశేషము వరూథిని యిరు చేతుల నెత్తి ప్రవరుని కౌగలించుకొని యధరం బాసించినదట. పెద్దన చూ పెక్కడ గ్రహించినదో గాని పాలిండ్లు పొంగారినవట. పై యంచులు పొటకరించినవట. ఎంత రసికత! అంచు లనగా చూచుకములు. చక్కని

పద మేరుకొనినాడు. పద లాలిత్య మన యట్లుండ వలయును. మహాకవులకు పిలిచిన పదములు పలుకును. ఆ కౌగలించుటయు అంచుల్ మోవగఁ గౌఁగలించినదట. ఎంత చక్కని భావము. స్త్రీల కౌగలింపులో మృదుత్వ మున్నది. పొటకరించిన చనుల తుదలు పురుషుని యురమున మోపుట వారి స్వభావము. అదియే వారి కౌగిలింత. తెలుగు కవులలో ఆ నాజూకు తనము సరిగా గ్రహించిన వాడు ఒక్క పెద్దన మాత్రమే. యువతులకు కామోద్రేకమున చను లుబికి బిగువు వారుటయు మొనలు పులకించి పొటకరించుటయు శాస్త్ర సమ్మతము. పెద్దనగారి కది యనుభవమునం దున్నది. ఆయన రసికుడు. ఆ వింత కనిపెట్టి యుండును. అది వరూథినియం దారోపించెను. కవుల యనుభవములే కవితలు, కావ్యములు.

హా శ్రీహరీ !

యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీయాంస ద్వయం బంటి పొ
మ్మంచున్ ద్రోచె

పెద్దన ప్రవరుని పాత్ర పోషణమునందు పద పదంబున మిగుల జాగ రూకతతో వర్తించెను. వరూథిని ప్రవరుని కౌగలించినది. ప్రవరుడు ఆమె యిరు భుజముల నంటి పొమ్మని త్రోచినాడట. అట్టి తొందర పాటునందును ప్రవరుడు తన శీలమునకు భంగము పొరపాటున నైన రానిచ్చుకొన లేదు. అది పెద్దనగారి ప్రతిభ. కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్, అను అర్థాంతర న్యాసముతో పద్య మును ముగించినాడు పెద్దనగారు. ప్రవరుడు ధీర చిత్తము కలవాడు. వరూథిని మాయలు వానిని కలంచ లేక పోయినవి. ఇట్టి ప్రవరుని మనో దార్ఢ్యమును ముందుగాఁ

"అచట పుట్టిన చిగురు కొమ్మయిన చేవ"

అను గీత పాదమునందు సూచించెను. ప్రవరుడు హరిని తలంచుట చేత విష్ణు భక్తుడని యూహింప వలసి యున్నది. తరువాత ప్రవరు

డగ్ని దేవుని ప్రార్థించెను. అగ్ని దేవుడు వానికి ప్రత్యక్ష మయ్యెను. ప్రవరునియందు విలీన మయి యింటికి చేర్చెను. అంతటితో ద్వితీయాశ్వాసము పూర్తి యగును. వరూథిని వియోగ శృంగారముతో తృతీయాశ్వాసము ప్రారంభ మగు చున్నది. వరూథిని ప్రవరుని యందచందములను తలంచుకొని విషాదము నొందినది. అంతలో సూర్యాస్తమయ మయినది. సాంధ్యా రాగము పొడమినది. కటిక చీకటు లావరించినవి. చంద్రోదయ మైనది. వెన్నెలలు వ్యాపించినవి. వీని నన్నిటిని పెద్దనగారిరువది యయిదు పద్యములలో వర్ణించెను. ఆయన వర్ణనలలోని భావములు మిగుల మనోహరము లైనవి. పాఠకుల వూహా కందుబాటులో నుండును.

> అంతటఁ బ్రాచి నిశాపతి
> యంతిక గతుఁ డౌట విని ముఖాలంబి తమః
> కుంతలములు దీర్పఁగఁ గొను
> దంతపు దువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్

అని చంద్రోదయమునకు పూర్వము తూర్పు దెస పొడమిన తెల్లని కాంతులను ఉత్ప్రేక్షించినాడు పెద్దన. దంతపు దువ్వెనను చూడని వారుండరు. అట్టి జన సామాన్య మగు వస్తువుతో పోల్చుటచేత పాఠకుని మనస్సు పద్యమునందలి భావమును చక్కఁగ అవగతము చేసికొన గలదు. అందు మూలమున పాఠకుడు రసానుభవము పొందును. కాళిదాసు కవితలో నున్న రహస్య మిదియే.

> క్వ సూర్య ప్రభవో వంశః
> క్వ చాల్ప విషయా మతిః
> తితీర్షు ర్దుస్తరం మోహా
> దుడుపే నాస్మి సాగరం

అని నుడివినాడు కాళిదాసు. ఇందలి ఉపమానము సర్వ జనులకు

విదిత మైనది. అందు మూలమున పదార్థములతో పాటు భావార్థము హృదయ గోచరమై పాఠకుడు రసావిష్టు డగును. ఇట్టి రచన రసము నకు ఉపస్కారక మగును. కావ్యాంగనకు శోభ నాపాదించు నలంకార మగును. పై శ్లోకమునందు విషమాలంకారము, దృష్టాంతాలంకారము కలవు. ఆ రెండలంకారములు రెండు విధములుగ రసావేశమును కలిగించి పాఠకుని చిత్తమునకు మిగుల ఆనందము నొదవించు చున్నవి. "ఆనందో రసః" అదియే రసము. పెద్దనగారు పద్యమునందు "ముఖాంబుజ తమః కుంతలము"లందు రూపకమును పొదివి "దంతపు దువ్వెన యనంగ" యనుటలో ఉత్ప్రేక్షను పొందు పరచెను. వానియందు దుపయోగించిన యుపమానములు సకల మానవులకు తెలిసినవి. కావుననే ఆ పద్యమును చదువు నపుడు మన స్సుప్పొం గును. ఆంగ్లేయ కవుల రచనయందు కనిపించు విశేషము కూడ నిదియె. వానిని చదివి యాంధ్రులు చిత్తమునందు మురిసిపోవు చుందురు. అది సర్వ జనావగతము లగు ఉపమానములలో నున్నది. ఇంకొక పద్యము

కలయ జగమునఁ గల యట్టి నలుపు లెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు దెలుపు సేయఁ
గా వశము గామిఁ బొడము దుఃఖమునఁ బోలె
సాంద్ర చంద్రిక తుహిన బాష్పములు గురిసె.

ఇట్టి రచనయె పెద్దనగారిని కవి లోకమునందు పెద్దవానిని చేసినది. ఆ రేయి యంతయు మదన పరితాపముచేత వేగినది వరూధిని. మరుడు విరహిణీ జనములను బాధించు కఠిన హృదయుడు. చంద్రుడు మలయ మారుతము వానికి సహాయ కారులు. వీరు మువ్వురు కలసి కాముకులను వేసట పెట్టు చుందురు. వారివలన తిట్లు తిను చుందురు. ఇది కావ్య లోకము. కావ్య ప్రపంచమునందు తెనుగు భాషలో

మన్మథ దూషణాదులు తెచ్చి పెట్టినవాడు అల్లసాని పెద్దన. తరువాతి కవు లందరు వాని ననుసరించిరి. పెద్దన లక్షణము ననుసరించి చంద్ర దూషణము, మన్మథ దూషణము, మలయ మారుత దూషణము, యథా విధిగ నడిపించెను. అందుండి యొక పద్యము.

గో వధము సేయు తురకల
దైవంబవు నీవు మొదలఁ దక్కఁగ పాంథ
స్త్రీ వధము సేయ రోయుదె
నీ వర్తన యేమి చెప్ప నీరజ వైరి

రాయలవారి కాలమునందు తురకలు చెలరేగి తెనుగు దేశమును ఆక్రమింప యత్నించిరి. రాయలు వీరాధి వీరుడు. రణ రంగమున బీజపూరు, గోలుకొండ, అహమ్మదు నగరు నవాబులను ఓడించి వారి గర్వ మణంచెను. రాయలు తురకల హృదయ శల్యమై మెలంగెను. రాయలకు నవాబులయందు వారి చర్యలయందు ఆచార వ్యవహారము లందు విద్వేషము కలదు. రాయల బహిః ప్రాణము అల్లసాని పెద్దన. తురకలు హిందూ మతముపై కల ద్వేషము కొలంది గోవులను వధింతురు. గోవులు భారతీయులకు దేవతలు. అట్టి దేవతలను పట్టి వధించు తురకలపై హైందవులకు ద్వేష ముండుట సహజము. రాజకీయముగాను మత విషయకముగాను భారతీయులను ద్వేషించు నట్టి తురకల దుశ్చరితమును ఈ పద్యమునందు పెద్దన ప్రకటించెను. తనకు వారి యెడ గల వైషమ్యమును వెలి బుచ్చెను. అట్లు కానిచో "గోవధము సేయు తురకల దైవంబవు" అని పద్యమును ప్రారంభింపడు. అట్టి వాడవు "స్త్రీ వధము సేయ రోయుదె" అని చంద్రుని ఉపాలంభించినది వరూథిని. ఇందు మూలమున తురకలు హైందవ స్త్రీలను పెట్టిన బాధ స్ఫురించును. దైవమును పోలి భక్తుల యాచార ముండును. ఇట్లు చంద్ర మన్మథ మలయమారుతోపాలంభములు సాగినవి. ఈ విధమును పరిశీలించి కావ్య కర్తలు ఉచితా

నుచితములను పరిశీలింపక యేదో యొక పట్టున యిట్టి యుపాలంభము లను చోనిపించుచు వచ్చిరి. ఆ కారణముచేత మనుచరిత్ర తరువాత విరచించిన శృంగార కావ్యములు దాదాపన్నియు నొక్కటే రకముగా తేలినవి. ఆంగ్లేయ భాషా కోవిదుల పరిహాసములకు గురి యైనవి. వీనితో పాటు కేళీవన విహారము, జలక్రీడ, పాడిన పాట లైనవి. తెల్లవారినది.

ఘనసార పంక మొక్క లతాంగి దెచ్చిన
మట్టి వ్రేలనె చుక్క బొట్టు పెట్టె
యింతి యొక్కతె పూవు టెత్తు లెత్తిన జూచి
విసువుతో నొక కొన్ని విరులు దుఱిమె
పడతి యొక్కతె రత్న పాదుక లిడ నిల్చి
తొడుగ కవ్వలికిఁ బో నడుగు వెట్టె
బాగాలు వెస నొక్క పద్మాక్షి యొసఁగిన
వెగ్గలం బని కొన్ని వెడల నుమిసె

సగము గొఱికిన యాకును సఖులు పిలువ
సగ మొసఁగు నుత్తరముఁ దెల్వి సగము మఱపు
సగము నయి చింతచే సగ మగుచు నరిగె
నవ్వరూథిని యంతి కోద్యానమునకు.

అచట మాయా ప్రవరుని కాంచినది. వానిని పెద్దన

అర్ధ చంద్రుని తేట నవఘళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగ మట్టితోడఁ
జెక్కుటద్దములందు జిగి వెల్లువలు చిందు
రమణీయ మణి కుండలములతోడఁ
పసిఁడి వ్రాఁత చెఱంగు మిసిమి దోఁపఁ జెలంగు
సరు ణాంశు కోత్తరీయంబుతోడ

సరి లేని రాకట్టు జాళువా మొలకట్టు
బెడఁ గారు నీర్కావి పింజెతోడ

ధవళ ధవళము లగు జన్నిదములతోడఁ
గాశికా ముద్ర యిడిన యుంగరముతోడఁ
శాంత రస మొల్కు బ్రహ్మ తేజంబుతోడఁ
బ్రవరుఁ గమ్యో వియచ్చర ప్రవరుఁ డపుడు.

అని వర్ణించెను. ప్రవరుని వేషమును పెద్దన యింతకు ముందు ఎచ్చటను విపులముగా వర్ణించ లేదు. కావ్యాదియందు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి అని మాత్రమే నుడివి యూరకుండెను. వాని గుణ శీలములను బీరువోనీయ కుండ వర్ణించెను. వరూథిని వదన ప్రభూత అను పద్యముచేత వాని యవయవ లావణ్యము నుగ్గడించినది. అది ఆలంకారికము. కావ్య ప్రసంగము. పెద్దన పై పద్యనముందు చక్కని శిల్పమును పొందు పరచి మాయా ప్రవరునియందు ప్రవరుని సహజ సౌందర్యమును వేషధారణమును వర్ణించినాడు. ఇట్టి పద్యము ఇచ్చట కావ్యమునకు శోభ కల్గించు నని ముందుగా యోచించి చేసిన పని. పెద్దన ఆలోచనా పరుడు. ఏ సందర్భమునందు ఏ పద్యము కథకు రస పోషక మగునో బాగుగా ఆలోచించి ఆ యా పద్యములను ఆ యా చోటులందు వెలయింప నిర్ణయించుకొని కావ్య రచనకు పూను కొనెను. మాయా ప్రవరుని చూచినది వరూథిని. కాంచి కణ క్వణ త్కనక కాంచియై యెదు రేగినది. మొదట ప్రవరుని చూచి ఝళం ఝళ త్కటక సూచిత వేగ పదార విందయై లేచి కుచంబులు న్దురుము లేనడును అల్లల నాడ పరుగిడి పోయిన ఆయుత్సాహ మిప్పుడు లేదు. దానికి కారణము ముందు పడిన తిరస్కారము. అందువలన దైన్యము పొడమినది. ఆమె నికుంజాచల వీథిఁ దారుచు ఘనాంత చల చ్ఛప లాకృతిని కలదియై మాయా ప్రవరుని సమీపించినది.

తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచి నప్పుడ
పల్లవాధర గుండె జల్లు మనియె.

ఇది కంపము.

నట రెండు మూఁ డంజ లరుగు నప్పుడు కాళ్లఁ
బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె.

ఇది తొట్రుపాటు.

డాయంగఁ జను నప్పుడు ముఖాంబుజంబునఁ
గంబు కంధరకు దైన్యంబు దోఁచెఁ

ఇది దైన్యము.

గదిసి నిల్చిన యప్డు కనుదోయి ఱెప్పల
లలనకు మిగులఁ జంచలత బెరసెఁ

గటకటా యను నపుడు గద్గదిక వొడమెఁ

ఇది వైస్వర్యము.

ఱెఱఁగు వట్టిన యపుడ లేఁజెమట గ్రమ్మె.

ఇది స్వేదము.

సొలసి మాటాడ నుంకింపఁ దలచి మోముఁ
దేరకొని చూచు నపుడ కన్నీరు వొడమె.

ఇది అశ్రువు. ఇట్లు సాత్త్విక భావము లన్నియు క్రమ క్రమముగా వరూధినికి ముంచుకొని వచ్చినవి. పెద్దనగారు వరూధిని చర్యలను లక్షణములను ఈ సందర్భమున చూచి వచ్చి నట్లే వర్ణించెను. అదియే యాయనలో నున్న గొప్పతనము. దేనిని వర్ణించినను మిగుల సహజముగ వర్ణించును. అది జరిగి నట్లే యుండును. ఇట్టి సందర్భ శుద్ధి కావ్య కవులందు చాల అరుదు. వరూధిని మాయా ప్రవరునితో

రా వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్య చిత్తంబునన్
రావై తేఁ జవి గాని యిందులకు హా హా రిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రతుకు నీ వాచారవంతుండవై
చావో యెక్కడో నీ యెడం బొడము వాంఛన్ భూసుర గ్రామణీ

అని అతి దీనముగా బలికినది. ఇది దైన్యమను సంచారీ భావము. బల మరి యునికిన్ దయరాఁ బలుకుట దైన్యంబు అని కావ్యాలంకారము. అత డందులకే వచ్చినవాడు గావున

ఐనన్ గానిమ్ము భవ
ద్దీనతకై వ్రతము విడిచితిన్ బరులకు మే
లైనన్ జాలు శరీరం
బైన నుపేక్షింప వలయు నది యట్లుండెన్

తివురక యింకొక్కటి విను
కవయు నెడన్ వలయుఁ గన్నుఁ గవయును మూయన్
భువి నిది యస్మద్దేశ
వ్యవహారము కన్నుఁ దెఱవ నఘ మగుఁ దెఱవా

అని నుడివెను. అందుల కామె యొడంబడెను. కామాంధోపి న పశ్యతాం. యుక్తా యుక్త వివేక శూన్యాః కామాంధాః. వరూథిని దేవాంగన. మాయా ప్రవరుని మాటలయందలి సత్యాసత్యము లెరుంగదా! యను సందేహము కలుగ వచ్చును. గంధర్వుని గుర్తింప లేక పోవుటయు మాటలు నమ్ముటయు కామాంధత్వము కారణము. వరూథినీ మాయా ప్రవరులకు సమాగమ మయినది. వరూథిని గర్భము తాల్చినది. సందర్భము నెరింగి రస భావములను కథాను గుణముగా పాత్రయందు పొందు పరచి వర్ణించుటలో పెద్దనకు సాటి యగు కవి లేడు. అట్టి స్థితియందు పాత్రల శృంగార చేష్ట లతి సహజముగా వర్ణించి పాఠకుని కనుల యెదుట నిలుపును. ఆ సంద

ర్భమునందు పాత్ర యంద చందములు గోచరింప చేయును. అది పెద్దనగారి వర్ణనలోని విశిష్టత. వరూథినిని వర్ణించిన పద్యము లన్నియు నట్టివి. మాయా ప్రవరుడు నీవు వదలఁ జెల్ల దేను నిను సమ్మతిలఁ జేసి యేఁగు దనుక అన్నాడు.

అని యాస గలుగఁ బలికిన
విని వేలుపు వెలఁది మోము వికసిల్లంగాఁ
దన చేతి చెఱఁగు బిగియన్
బెనఁచుచుఁ దల వాంచి నగవు బెరయఁగఁ బలికెన్

ఇందు వరూథినియందు హసిత మను శృంగార చేష్టయు జాడ్య మను సంచారీ భావముతో పొందు పరచి వర్ణింప బడినది. మదిఁ గల కోరిక చేకూరిన నల వెరుగక యునికి జాడ్య మని కావ్యాలంకారము.

## రస పోషణము

నందును రసానుగుణముగా పాత్రలను మలచుటయందును పెద్దన సిద్ధ హస్తుడు. గుణముల చేత ప్రవరుని నాదర్శ ప్రాయు డయిన ధీరశాంతుని గావించినాడు. అతనిని మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తిగా మలచినాడు. అందు మూలమున వరూథిని వంటి శృంగార నాయిక, అందును గంధర్వాంగన యగు వేశ్య, వాని చక్కదనమునకు కను వేమరు నొంద వలయునని పెద్దనగారి యభిప్రాయము. వానికి కూకటులు కొలిచి చేసిన కూరిమి సోమిదమ్మను భార్యగా చేసినాడు. అంతటితో నూరకుండ లేదు. తల్లియు దండ్రియు దేవియుం దేవర వోలె నుండి యిలు తీర్పగ కాపురము సాగు చుండు నని ప్రవరుని జీవ పితృనిగా సృష్టించినాడు. వాని సంసారము లోకమునకు మేలు బంతి యైనది. అన్నం బ్రహ్మేతి వ్యజాత్ అని తైత్తిరీ యోపనిషత్తు. కావున ప్రవరుని పేద సంసారిని చేయ లేదు. శరీర మాద్యంఖలు

ధర్మ సాధనం. ధర్మసాధన మయిన శరీరము ననన్యాపేక్షముగా పోషించు కొనుటకు మాన్య క్షేత్రములు కల్పించినాడు పెద్దన. అవి పెక్కు చందాలను బండునట. ఒకప్పుడును ఇంట పాడియు బంటయు దరుగదు. ప్రవరుని సిరి సంపదలు గల ఆహితాగ్ని సంసారిగా రూపొందించెను. ఆ పాత్ర నిర్మాణములోనే పెద్దనగారి ప్రజ్ఞ భాసిల్లు చున్నది. మిగిలిన గుణముల మాట టుండ నిండు

తీర్థ సంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేగు దవ్వౌంత యైన

అను పద్యమునందు ప్రవరుని త్రైర్థిక సేవయు తీర్థయాత్రాసక్తియు సూచింప బడినవి. ఈ గుణములు ప్రవరునియందలి శాంత రసమున కుప స్కారకము లయినవి. అవియే వానిని హిమాచలమునకు తెచ్చినవి. వరూథిని నాయకురాలు. ఆమె గంధర్వాంగన. సామాన్య గంధర్వాంగన కాదు

చిన్ని వెన్నెల కందు వెన్నుఁ దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు

అను పద్యముచేత నామె జాత్యౌన్నత్యము గాన నాట్య కళా వైదుష్య మనన్య సామాన్య మని నిరూపింప బడినది. నాయికా నాయకు లిరువురు శృంగార శాంత రసములచేత నిబిడీకృతు లయిన పాత్రలు. వారికి వారె సాటి. శృంగార రసమునకు గానము ప్రాబల్యము కూర్చు నంగము. ఒక విధముగా రస పోషక మని చెప్ప వచ్చును. ఆ రెంటికి పరస్పర సన్నిహిత సంబంధ మున్నది. కావున పెద్దనగారు వరూథినిని వైణికురాలను చేసి శశికాంత మణి పీఠిపై కూర్చుండ పెట్టినాడు ప్రవరుడు వచ్చు వేళకు. పెద్దనగారు గాన

ప్రియుడు. అందును వీణా వాదన మనిన ఆయనకు మిగుల ప్రీతి. ఆ కారణము చేత

కమ్ర కర పంకరుహ రత్న కటక ఝణ ఝ
ణ ధ్వని స్ఫూర్తి తాళ మానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపు చుండి

నది వరూథిని యని వర్ణించెను. వరూథిని యందాల రాశి. తత నితంబాభోగము చేతనే యామె యౌవన ప్రాదుర్భావమును నిరూపించినాడు పెద్దన. ప్రవరుని గాంచినది మొదలు ఆమెయం దొక్కొక్క రస భావములో నొక్కొక్క వింత యగు శృంగార చేష్ట నిమిడించి పలు పోకల యంద చందములు చివరి వరకు రూపించుచు వచ్చెను. ఆమె శృంగార రసాధిదేవత కావలయు నని పాఠకులకు తోపించెను. ఆయన వర్ణనలలో నంత మనోహరత యున్నది. వానిని చదివి నపుడు పాఠకుడా యా దృశ్యములను చూచు చున్నటుల భావించును. ఇట్టి వివిక్త దృశ్యాభివర్ణనము యే యితర కావ్యములందును లేదు. పెద్దనగారు

## ప్రకృతి ప్రియుడు.

మనుచరిత్రయందు వర్ణింప బడినంత ప్రకృతి సౌందర్యము తెనుగు కావ్యములందు మరెచ్చటను గానరాదు. ఆ కథ యటువంటిది. కథయందు కంటె పెద్దనగారిలో నా ప్రకృతి పిపాస నిబిడీకృతమయి యున్న దని చెప్ప వలయును. ఊహా శక్తి నాధారము చేసికొని యాకాశ మార్గమున కెగసినాడు కథా ప్రారంభమునందు పెద్దనగారు. సహజ సుందర మయిన వరుణా ద్వీపవతి నొక్క చూపులో నరసినాడు. దాని తటాంచలమునం దున్న యరుణాస్పదము మహీ కంఠ హారములోని తరళమై యగుపించినది. అచ్చట నుండి సావకాశము

లభించినప్పు డెల్ల ప్రకృతిని వర్ణించుచునే వచ్చెను. సిద్ధుని నోట పటీరాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలములలోని ప్రకృతి దృశ్యములను హృదయ నయనమునకు గోచరించు నటుల విశదముగా వర్ణింప జేసెను. ఆ వర్ణనము ప్రవరుని వివశుని గావించినది. హిమాచలమును చూడ నువ్విళు లూరించినది. ఆ ప్రకృతి వర్ణనలలో నంత యాకర్షణ శక్తిని పొందు పరచినాడు పెద్దనగారు. చదివి యర్థము చేసికొనినవారి కందలి యందము తెలియును. ద్వితీయాశ్వాసమునందు అట చని కాంచె అను పద్యము మొదలుకొని చిట్టచివరి వరకు హిమవత్పర్వతములలో నడుగడుగునను గోచరించు వింత వింత లగు దృశ్యముల నన్నిటిని మృదు మధురములగు పద జాలములతో కన్నుల కగుపించు నట్లు అభివర్ణించెను. వరూథిని అప్పర్వతమునందలి ఆ యా దృశ్యములను ప్రవరునకు వివరముగా చూపినది. ఆ యా ప్రకృతి వర్ణన లన్నియు కథతో మేళవించి చెప్పుటచేత స్థూల దృష్టికి ప్రకృతి వర్ణనలుగ గోచరింపవు. సూక్ష్మ దృష్టితో విడిగా ప్రతి పద్యమును పరిశీలించి చూచిన పక్షమున అందు ప్రకృతియే గోచరించును. హిమవత్పర్వతములోని నదులు, వనములు, పూఁబొదరిండ్లు, లోయలు, తల క్రిందులై క్రిందికి దిగి వచ్చు సెలయేటి కాలువలు, వాని తటములందలి మల్లె తీవెలు, కేదార క్షేత్రములు, ద్రాక్ష తీగెల పందిళులు, రసాల తరువులు ఒక టేమిటి ప్రకృతి యంతయు కనుల కగుపించును. అందు సహజముగ గోచరించు ప్రకృతి సౌభాగ్యము చాలక పెద్దనగా రందందు నాటిన పోక మ్రాకులు లవలీ లతలు హృదయ గతము లగును. పూఁబొదరిండ్ల సువాసనలను సేకరించు కొని సెలయేండ్ల మీఁదుగా వీచు శీత లానిలముల వైభవము వేరె చెప్ప వలసిన పని లేదు. ఇట్టి ప్రకృతి సౌభాగ్యము నంతయు కథాంశములతో కలిపి పెద్దన మనుచరిత్రమునకు వికాసమును కల్పించెను. వరూథిని మందిరమునకు చుట్టు పట్టులందు నిర్మించిన ప్రకృతి వైభవము పెద్దనగారి శిల్ప కళా ప్రతిభ వేనోళ్ళ

చాటు చున్నది. అది నాయికా నాయకుల సమావేశమునకు సృష్టిం చిన యుత్తమ శృంగార రంగము. రసోద్దీపకము లైన వస్తు జాలము లన్నియు నందమర్చినాడు పెద్దనగారు. సంస్కృతమునందు కాళిదాసు ప్రకృతి నారాధించు మహాకవి. అతని మేఘ సందేశము ఋతు సంహారము మొదలగున వన్నియు ప్రకృతిని వర్ణించు కావ్యములు. వాని శృంగార శాకుంతలము కూడ అట్టి దనియే చెప్ప వలెను. కాళి దాసు ప్రతిభ యంతయు ప్రకృతి వర్ణనమునం దిమిడి యున్నది. తెనుగు సారస్వతమునందు అల్లసాని పెద్దన కాళిదాసునకు సర్వ విధముల సమాన మైనవాడు. అతడు రంగ నిర్మాణమునందే కాక పాత్రలను ప్రవేశ పెట్టుటలో చూపిన నేర్పు ప్రశంసింప తగినది. ప్రవరుడు వెళ్ళి పోవుటలో శృంగార రసము ఆభాస మైనది. మాయా ప్రవరుని ప్రవేశముచేత మరల శృంగార రసము పోషింప బడినది. సాత్వీక సంచారి భావములచేత పుష్టిని వహించినది. వరూథినీ మాయా ప్రవరుల సమాగమముతో రసము స్థాయీభావమును చేరు కొనినది. తరువాత సంభోగ శృంగారము వర్ణింప బడినది. మాయా ప్రవరుడు వెడలి పోవుటతో తృతీయాశ్వాసము పూర్తియగు చున్నది.

మొదటి మూడాశ్వాసములందు శృంగారమును శాంత రస ముతో మేళవించి వరూథినీ ప్రవరుల కథ నతి మనోహరముగా నడి పించినాడు పెద్దనగారు. అందు ప్రతి పద్యమునందును రసము తొణికిస లాడినది. నిండార విరిసిన జాజి పూసరులలోని నెత్తావుల వలె భావములు గుబాళించినవి. వర్ణనలలో నభో వాహినీ లహరీ శీతల గంధవాహములు పచారించినవి. పదముల కూర్పులో రత్న కటక ఝుణ ఝుణ ధ్వని తాళ మానములతో చెవులకు విందొనరించినది. కవితలో జిగి బిగువులు నెలకొన్నవి. బాలకుల చిత్తము నాకర్షించు నందలి కథా సరణియు, నానంద మొదవించు మాటల చతురతయు, కావ్యాంగన కంద చందముల నొదవించు నలంకారములును, పెద్దన

గారిని లోకోత్తర ప్రతిభావంతుని చేసినవి. అందలి పద్యము లన్నియు సాన పట్టి మెరుగు తీర్చిన జాతి రత్నములు. ఒక్క పద్యమునైన నవలకు త్రోసి పుచ్చుటకు వీలు లేదు. తరువాతి మూడాశ్వాసములలోని కథకును మొదటి మూడాశ్వాసములలోని కథకును చాల భేద మున్నది. దానిని బట్టియే కవితలో కూడ తారతమ్యము గోచరించు చున్నది. నాల్గవ యాశ్వాసము మొదలుకొని దాదాపు చివరి వరకు స్వరోచి కథ యున్నది. దాని ననుసరించి మనోరమ, ఇందీవరాక్షుడు, విభావసి, కళావతి మొదలగువారి వృత్తాంతములు గలవు. ఇవి యన్నియు చిన్న చిన్న కథలు. వానియందు దొక చక్కని సన్నివేశమునకు గాని రచనా చాతుర్యమునకు గాని సావకాశము లేదు. తదనుగుణముగా కవితయు లేబాకమున పడినది. పదముల పొందికలో రమణీయత తగ్గినది. రచనలో చమత్కారమంతరించినది. పద్యముల యల్లికలో జిగి బిగువులు సడలినవి. భావములు లోక సామాన్యము లయినవి. ఇందు వీర శృంగారములకు సమ ప్రాధాన్య మొసంగ బడినది. కరుణ రస మంగము. మనుచరిత్రయందలి మొదటి మూడా శ్వాసములలోని పద్యములను చక్కగా తీర్చి దిద్ది రస పోషణ గావించుచు మెరుగు లమరించి పూర్తి చేయుటకు పెద్దనగారికి కొంత కాలము పట్టి యుండును. సావకాశము లభించి నప్పుడెల్ల ఎప్పటి కప్పుడు తాను రచించిన పద్యములను రాయల వారికి చదివి వినిపించి యుండ వచ్చును. కాల హరణమునకు మహారాజు మన స్నాగక కావ్యము పూర్తి యైనదా యని పెద్దన గారి నడిగి యుండ వచ్చును. పెద్దన మహారాజునందు గల చనవు చేత 'నిరుపహతి స్థలంబు' అను పద్యమును చెప్పి యుండ వచ్చును. ఇది యంతయు నేకాంత మందలి సంగతి. తరువాత పెద్దన కావ్యరచనయందు కొంత శ్రద్ధ వహించి తరువాతి మూడాశ్వాసములు కథకు ప్రాధాన్య మొసంగుచు త్వరగా పూర్తిచేసి యుండును. ఆ కారణముచేత కవితలో సారస్యాదులు తరిగినవి. పటుత్వము తగ్గినది. ఒక్కొక్క

చోట కొంచెము పేలవ మనికూడ అనిపించినది. ఇట్టి లోపము తెనుగు కావ్యములందు పెక్కింట గనిపించును. తిక్కన విరాట పర్వమునందు చూపిన కవితా పాటవము శిల్ప కళా వైశద్యము రచనా మాధుర్యము తరువాతి పర్వములందు చూపలేక పోయెను. చివరి చివరికి పోను పోను ఆశు కవిత వలె పేలవ మయినది. విరాట పర్వ మునందు సైతమ మారంభమునందు చూపిన యత్నము తుది వరకు నిలువ లేదు. పారిజాతాపహరణము వసుచరిత్ర విజయవిలాసము మొదలగు పెక్కు కావ్యములు ఇట్లే యున్నవి. కొన్నిట రసము కారణము. కొన్నిట కథ కారణము. ఆ లోపమే మనుచరిత్రయందు కనిపించు చున్నది. తరువాతి కథ చాల పెద్దది. అందు నీరసము లగు చిన్న కథలు కలవు. మంచి సన్నివేశములకు సావకాశములు లేవు. కవిత చప్ప బడినది. 'బహు రత్న ద్యుతి' వంటి పద్య మొక్కటి కాన రాదు. కథ లోక సహజముగా సాగి పోయినది. కాని పెద్దనగారి లోని సహజ మగు ప్రతిభ అందందు పొడగాన వచ్చు చుండును. పాత్రను రంగస్థలము మీఁదికి ప్రవేశ పెట్టుటలో పెద్దనగారి నేర్పు సంస్కృతంపు నాటక కవులను మించి పోయినది. స్వారోచి యడవి యందు వేటాడెను. మేని బడలికలు వాయ నొకచో కూరుచుండెను. అట్టి యెడ

మట్టెల్ మ్రోయఁగ గబ్బి చన్నుఁగవ కంపం బంద వేణీ భరం
బట్టిట్టై కటిఁ జిమ్మ చీకటులుగా నశ్రు వ్రజం బోడికల్
గట్టన్ జూపులు చిమ్మ రేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁ గా
మిట్టాడంగ నరుండు లేని యడవిన్ మీనాక్షి దీనాకృతిన్

పరుగెత్తుకొని వచ్చి ధరణీశు నెదుట నిలిచినది. ఆమె పేరు మనోరమ. ఆమె సరభసంపు పరుగు మాటిట్లున్నను పద్యము పద్యములోని భావ ములు పదానుగతముగా నొకటి వెంట నొకటి యతి వేగముగా

పరుగులు వారినవి. ఈ పద్యము ప్రత్యేకముగా చదివి వినిపించినను ఇది పరుగెత్తుచున్న యువతి వర్ణన మని చదువు రాని వాడైన గ్రహించుకొన గలడు. ఆ యావేగము పాత్ర వర్ణనలోను పద్యము నడకలోను జతకూడి యున్నది. వేణీ భరం బిట్టట్టయినదట. ఎంత మనోహార మగు వ్యావహారిక పదము. ఆ పద మొక్కటి చాలు నా యువతి పరుగులోని యంద చందములు పాఠకుని మనస్సును తలపింప చేయుటకు. ప్రాయంపు కన్నె పడుచుల పరుగున కది యొక యనిర్వచనీయ మగు నందము. మనస్సు నాకర్షించు చిహ్నము. ఆ రెండు నాపదముల భావము నందున్నవి. వేణి యడుగడుగునకు నిట్టట్టు నిరుపిరుందులను గొట్టు కొనుచు నెగి రెగిరి పడును. క్రిందు మీదగు చుండును. దానిని చూచువారి మనస్సంతయు నది యపహరించును. చూపంతయు నాకర్షించును. అవి పెరుగు కొలందియు నొండొంటికి నందము నొదవించు సంబంధము సృష్టియందే కలదు. ముందు పోవు కన్నె పడచును వెనుక నుండి యువకుడు వీక్షించును. వాని చూపా వేణి నాశ్రయించి గంతులిడు చుండును. ఈ యనుభవము లేని వారుండరు. పెద్దనగారి యా యనుభవమే యంత చక్కటి పదము లచ్చట నేర్చి కూర్చినది. అట్టిట్టు కొరకే పెద్దన మట్టెలతో వర్ణన ప్రారంభించినాడు. వేణివలన కటి చిమ్మ చీకటు లయినదట. తద్గుణాలంకారము. అంత నల్లని దా వేణి యని ధ్వనితము. పెండ్లికాని కన్నెలకు మట్టె లుండునా యని యొక విమర్శన. రాజ స్త్రీల యలంకార లక్షణములు పెద్దనగారికి బాగుగా తెలియును. రాజ కన్యలు సెల్లా మట్టెలు ధరింతురు. ఆ యువతి

విసమానములు గాఁగ నసతోడఁ బెన వెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు
బండి కందెన చాయ బైసి మూలిన మేన
మెదడు గందపు రొంపి మెత్తినాఁడు

కునఖంపు డాచేతి పునుక కప్పెర నిండఁ
బ్రాణి కోటుల నల్లఁ బట్టినాఁడు
కొకిబికి వేసంపు గూని మూఁపుల మీఁద
మూఁడు పంగల యీఁటె మోపినాఁడు

నిట్టితాడనఁ బొడవుచే నిక్కినాఁడు
నిడుద కోఱల మిడి గ్రుడ్ల నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడు మూన్నాళ్ల నుండి
యుసుఱు గొన వెంటఁ దిరిగెడు నసుర యొకఁడు

అని వచించినది. ఇది వర్ణనాత్మక మగు సంభాషణ పద్యము. నుడువునది మనోరమ. ఆమె మనస్సు నందలి భయము పరివేదనము అసూయ వైరము పరిహాసము వర్ణ నాంశములందు పొందు పరచి పద్యము నడిపింప బడినది. ప్రతిపాదము చివర వాడిన తచ్ఛబ్దము మనోరమ జుగుప్సాత్మక మగు భావమును వెలయించుచున్నది. ఈసందర్భమున కిట్టి పద్య రచన సముచిత మయి చదువరుల మనము నలరించు చున్నది. రసానుగుణముగా వాడిన పదములు వాని పొందిక మెచ్చ తగినది. పెద్దన యెట్టి పదములతోడ నైన పద్యమును హృదయాకర్షణీయముగా రచింప గలడు. అతడు పదముల కూర్పులో నారితేరిన నిపుణుడు. పై పద్యమునందు దేశీయ వ్యావహారిక పదముల మేళవింపుతో పద్యమును చక్కగా నడపెను. ఏ సందర్భమున కెట్టి పద్యంపు పోకడ యనువయి యుండునో పెద్దనకు బాగుగా తెలియును. సీస పద్య రచనయందు శ్రీనాథుడు అందె వేసిన చేయి. ఒక సారి పోయిన పోకడ యింకొక సారి పోడు. ఒక తడవ నడిపిన నడక మరొక తడవ నడిపింపడు. కాని యొకొక్కప్పుడు చివరి గీత పద్యము పై సీస పాదముల ననుసరించి యుండదు. అది ప్రత్యేక పద్యము వలె నుండును. పెద్దనగా రన్నిట నెఱ జాణ. మనుచరిత్రయందు దాదాపు వంద సీస పద్యము లున్నవి. ఒక దాని నడక యింకొక దానికి లేదు.

పోకడలలోను పదములలోను కూడ మార్పు కలదు. ఏ పద్యమున కా పద్యము ప్రత్యేకత కలదయి నాల్గు పాదములు సరితూచి నట్లు నమరి యుండును. సీసపు నడకలోని విధానము గీతములోనికి కూడ నందుకొని సీసములో నది యొక భాగముగా నుండును. పై పద్యమును అంతకు పూర్వము నుదహరించిన పద్యములను నరయునది. శ్రీకృష్ణ రాయలవారు విష్ణుచిత్తీయమునందు

మృత మర్త్య రెంటాన నిడ్డఁ జాలక నెత్రు
రంజిల్లు పెను పొట్ట ముంజివానిఁ
బల్ల చీమల వక్ర భల్లాతకియుఁ బోలె
నెత్త్రు దుప్పటి నొప్పు కత్తివాని
వ్యత్యస్త హస్తి మస్తాభఁ బాయగు గడ్డ
మును దంష్ట్రికలుఁ బొల్చు మొగమువానిఁ
గడుఁ దుర్గ నిడు త్రుళ్లు గతిఁ జోఁగలోఁ బాండు
రత మించు కపిల కూర్చంబువాని

నెఱకుఁ దెరువరిఁ గన శాఖ లెక్క జాఱు
ప్రేవు-జందెంబుఁ గసరి పైఁ బెట్టువాని
వ్రేలు డగు బొజ్జ గల బూరగాలివానిఁ
జెంబు తలవాని సవటు కచంబువాని

కండ కన్నులవాని నాఁకటను బండు
తిట్లు బేతాళికల సారెఁ దిట్టువాని
నగ గరిమవాని నన్వర్థనాముఁ గుంభ
జాను వను నొక్క ద్విజ నిశాచరునిఁ గనియె

అని యొక బ్రహ్మరాక్షసుని వర్ణించెను. పెద్దనగారు రాక్షసుని వర్ణిం చిన పద్యములోని పదము లన్నియు నాచ్ఛికములు దేశీయములు

వైకృతములు. వాని సమ్మేళనముచేత పద్యమునం దొక రకమగు మార్దవము చేకూరినది. శయ్యలో రమణీయత వాటిల్లినది. పదముల కూర్పులో బిగియు కలదు. పెద్దనగారి వర్ణనాంశములు గల సీస పద్యము లన్నియు నట్లే యుండును. ఆ నడకలో నాజూకుతన మున్నది. రాయలవారు వాడిన పదములు తత్సమములు దేశీయములు ఆచ్ఛికముల సమ్మేళనము. వానియందు కొన్ని మూరు మూల పదములు గలవు. రెంటాన, పల్లచీమలు, భల్లాతకి, కడుఁదుర్లు ఇత్యాదులరయునది. పదముల కూర్పులో కరకుతనము నడకలో నెగిడి దిగిడియు కలదు. అంతయు నొక్క తీరున నడవ లేదు. పాయ+అగు= పాయగు, వ్రేలుడగు బొజ్జగల, ఇట్టి కూర్పువలన నడకలో కుదింపు కలిగినది. పెద్దనగారి పద్యము చదువు నప్పుడు అర్థముతో పాటు భావము, భావముతో పాటు రూపము స్ఫురించును. రాయలవారి పద్యమునం దట్లుకాదు. పాఠకుని డర్థముచేసికొనుటకు కొంత సావకాశము కావలయును. రెండు మూడు నాల్గు పాదము లటువంటివి. రాయలవారి సీసాంతమున గల గీత మందలి భావ మతి సహజమును నగవు పుట్టించునదై రక్కసుని స్వభావము తలపించును. తరువాత గీతము నట్టదే. ఇంక శిల్పమును పరిశీలించినచో పెద్దనగారి పద్యములో రోత పుట్టించు భయంక రాకారము గోచరించును. రాయలవారి పద్యమునందు గుండె దడ కొల్పు నతిలోకభీకరం బగు నుగ్ర రూపము కనుల కగుపించును. అది స్వభావోక్తి. ఇది ఆలంకారికము. పెద్దనగారి పదములు, పదముల పొందిక, సమాసముల కూర్పు వేరు. రాయలవారి పదములు, పదముల కూర్పు, సమాసముల యల్లిక వేరు. రాయలవారి శయ్యలో కరకుతన మున్నది. పెద్దనగారి పద్యపు నడకలో మార్దవ మున్నది. అన్వయ క్రమములో తారతమ్య మున్నది. ఇన్ని విధముల భేద మగుపించు చుండగా పెద్దన విష్ణుచిత్తీయము రచించె ననుట సాహసము, ననాలోచితము.

మనోరమ తన కథను స్వరోచికి చెప్పినది. ఆమె ఇందీవరాక్షుం డను గంధర్వరాజు కూతురు. ఆమెకు కళావతి విభావసి యను నిరువురు చెలికత్తెలు గలరు. వారితో గలిసి మనోరమ

నెత్తమ్ము లే కొండ నెత్తమ్ములం దాడు
విద్యాధర కోటి విటులతోడ
నెచటి గాడ్పులc బుట్టు విచికి లామోదంబు
శబర కాంతల గుట్టు సళ్ళc బెట్టు
నెన్నగేంద్రపుc జఱుల్ మిన్నంది పెన్నంది
కోరాడుc దన గుబ్బ కొమ్ము లొడ్డి
యెందుండి గురివెంద పందిళ్ళc బూcదేనె
జడి యిందు శిలలందు జాలువాఱు

నట్టి కలధౌత శిఖరిc బుష్పాపచయము
సేయు వేడుకc బొదరిండ్ల చాయలందుc
దిరుగు చుండి యొకానొక దెసc దృణంబు
దళముగా వాత మొలచిన బిలమునందు

ఒక జీర్ణ మునిని గాంచెను. ఈ పద్యములోని మొదటి యర్ధ పాదము నందు నెత్తమ్ము లే కొండ నెత్తమ్ములం దాడు నను చోట పెద్దన గారు పాదము మధ్య గత యమకమును వాడిరి.

పలాశి డాసి రాజుc జూచి పల్కె నోరి నోరి కీ
హేలానc బెన్పోలాన లేక పోవ నీవు దోcచి తో
బల బలాలితోడ బాలc బట్టి బిట్టు చుట్టి నిన్
హాళాహళిన్ హాలాహ లాభయూ బుభుక్షుc దీర్చెదన్

అని రక్కసుడు స్వరోచితో ననెను. ఈ పద్యమునందు మొదటి పాదములో నోరి నోరికి యను చోట ఛేకానుప్రాసయును హేలానc

బెన్పొలాన, హాళాహాళిన్ హలాహ లాభ యను చోటులందు పద యమకమును, బలా బలాలి యను నెడ మరల చేకానుప్రాసయును వాడెను. వీనికి పంచచామరము తగిన దయి అందము నొదవించి నది. కవి తన భావమునకు నలంకారమునకు నను వగు వృత్తము నుపయోగించుటవలన కవిత రస స్ఫూర్తి కల దగును. అను వగు వృత్తముల నెన్నుకొనుటలో కవి కొక విశిష్ట మగు ప్రతిభయుండ వలయును. అట్టి ప్రతిభ సంస్కృత కావ్య రచయితలలో కాళిదాసు నందు కలదు. వాని వృత్తము లన్నియు కథకు రసమునకు భావము నకు ననుగుణముగా నుండును. మందాక్రాంత వృత్తము నడకకు ఆషాఢస్య ప్రథమ దివసములం దగుపించు తొలకరి మేఘముల నడకకు సన్నిహిత సంబంధము కలదు. కావున మేఘ సందేశమునందు మందాక్రాంత వృత్తమును వాడెను. వినోదిని వృత్తము కరుణ రసము నకు సహకారి. కావున కుమార సంభవమునందు రతీ విలాప సందర్భమున వినోదిని వృత్తము నుపయోగించెను. ఇట్లు రస భావా లంకారముల కనువగు వృత్తముల నుపయోగించుట మహాకవుల లక్షణము. నన్నయ తెనుగు కవులలో నట్టి ప్రతిభ కలవాడు.

రాక్షసులందు సరభస ప్రవృత్తి సహజము. వారి మాట లందును ఆ విధానమే గోచరించును. పంచచామర వృత్తము నందలి గణముల కూర్పులో సరభస మగు నడక కలదు. రాక్షస ప్రవృత్తి కా నడక తగి యున్నది. కావున పెద్దన పంచచామరమును వాడెను. రక్కసు మాటల హాళాహాళికి తగినట్లు యమకము నుప యోగించెను. పద్యమునకు యమకము, యమకమునకు పద్యము నొండొంటి పొందికవలన రాక్షసుని సరభసత్వము ఆడంబరము పద్యము చదువు నప్పుడు స్ఫురించు చున్నది.

స్వారోచికిని రాక్షసునకు యుద్ధ మారంభమైనది. చెంచులు రక్కసుని చుట్టు ముట్టిరి. శరావళుల గుప్పించిరి.

ఆ శరావళి నమ్మ్రను జాశనుండు
లీల మృగ దంశకము మశ కాళి నొడిసి
చప్పరించు విధంబున శాత దీర్ఘ
దంష్ట్రికలఁ జప్పరించి రౌద్రమునఁ గెరలి.

గళిత శృంఖల మైన గంధ నాగము వోలెఁ
ప్రజలపైఁ బేరెముల్ వాఱి పాఱి
కలశాబ్ధి మథియించు కైటభాంతకు లీల
జవ మొప్పఁ జేతులు సాఁచి చాఁచి
కన లూను కీనాశ కాసరమ్మును బోలెఁ
గమిచి తట్టువ గుంపుఁ జమరి చమరి
యమృ తాపహార ణార్థ మరుగు పక్షి స్వామి
గతిఁ బుళింద శ్రేణి గమిచి గమిచి

సెలవుల బిగించి నేత్ర దంష్ట్రికలు మెఱయ
నిడుద మొగ మెత్తి మీసాల నెత్తు రొలుకఁ
బట బటఁ గపాల పంక్తులఁ బగులఁ గొఱికి
బలము సెల్లను గడియలోపలన మ్రింగె

ఈ రెండు పద్యములందు రాక్షసుడు శబర సైన్యములను మడియించిన విధము వర్ణింప బడినది. ఆ వర్ణన రాక్షస స్వభావమునకు బలమునకు నుచితమయి వాని చర్యలు కన్నులకు బొడకట్టి నట్లు తోచును. మొదటి పద్యమునందును సీసము నాల్గు పాదములందు నుపమాలంకారము కలదు. సీస గీతమునందు స్వభావోక్తి. నిడుద మొగ మెత్తి మీసాల నెత్తు రొలుక బట బటఁ గపాల పంక్తులఁ బగులఁ గొఱికినాడట రక్కసుడు. ఆ పాదములు చదువు నప్పుడు రక్కసుడు కపాల పంక్తులను బగులఁ గొరుకు బట బట ధ్వనులు వినిపించును. మొగ మెత్తి మీసాల నెత్తు రొలుక తినుచున్న తీరు

కనిపించును. వర్ణ నాంశములను ప్రదర్శించుటలో పెద్దన ఘటికుడు. మూడవ ఆశ్వాసము వరకు శృంగార ఘట్టములను వర్ణించి మెప్పు పొందిన పెద్దనగారి గంటము నాల్గవ ఆశ్వాసమున వేటలో వీరా వేశము నొంది పరవడులు త్రొక్కినది. యుద్ధ ఘట్టమునందు రౌద్ర బీభత్స రసముల సమ్మేళనమున నుద్రేకమును బొంది యుద్భ్రాంత లూగించినది. రాక్షసుని యుద్ధ చర్యలను వర్ణించిన పై రెండు పద్యములందు రస సిద్ధి యలవడి కావ్య లోకమందు విశిష్టత కలదయి నది. చివరి గీత పద్యము దానికి తార్కాణము. పెద్దన కవి తావేశము రసావేశము గల సాహితీ వేత్త. వర్ణింప దలచిన విషయ మును పాఠకుని యెదుట నిలుప గలడు. భావ ప్రదర్శనమునందు నైశిత్యముతో పాటు వైశద్య ముండును. పదముల పొందిక సంగతి చెప్పవలసిన పనిలేదు. 'కలశాబ్ధి మథియించు కైటభాంతకు లీల' యను చోట కలశాబ్ధిని రాక్షసులు దేవతలు మథించిరి. కైటభారాతి మథించె ననుట పురాణము లందు కానరా దని వ్యాఖ్యాత నుడివెను. భాగవతము నందు పాలసముద్రమును విష్ణువు మథించి నటుల గలదు. స్వారోచి ప్రయోగించిన పావక బాణంబున రక్కసుడు తన రూపంబు నెడబాసెను. గంధర్వు డయి పొడచూపెను. అప్పటి వాని యాకా రము లయవిభాతి వృత్తమునందు వర్ణించెను. ముడిచిన యొంటి కెంజడ యిత్యాది పద్యములం దున్న శిల్పము దానియందు లేదు. ఆ జగియు బిగియు లయవిభాతియం దగుపించదు. లయవిభాతి యందే కాదు తరువాతి ఐదాశ్వాసములలోని కయితయం దెందును మొదటి మూడాశ్వాసములలోని బిగువు గోచరించదు. మొదటి యాశ్వాసములందలి పదములం దున్న రసవత్తత చివరి యాశ్వా సములందలి పద్యములలో నగుపించదు. వరూధినీ ప్రవరుల వృత్తాంత మంతయు రస పుష్టి నొదవించి పద పదమునందు వింత వింత భావములను పొందు పరచి పెద్దనగారు తన ప్రతిభను కవితా వైదుష్య

మును రసికతయు వెలయించిరి. చివరి యాశ్వాసములందు కథకు ప్రాధాన్య మొసగి కావ్యమును బూర్తి కావించుటకు పాటు పడిరి. ఇందీవరాక్షుడు తన వృత్తాంతము చెప్పుటతో పంచమాశ్వాస మారంభ మగును. బ్రహ్మమిత్రుడు శిష్యుల కాయుర్వేద ముపదేశించు చుండెను. ఇందీవరాక్షుడు బ్రహ్మమిత్రునితో

మౌనివరుఁ జేరి భక్తి నమస్కరించి
చెప్పవే నాకు నీ విద్య శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతార్థుండ నగుదు
ననుచుఁ బ్రార్థింప ననుఁ జూచి యపహసించి

అనెను. ఇట్టి సందర్భము పురస్కరించుకొని ప్రవరుడు ఔషధసిద్ధునితో

అనినన్ విప్ర వరుండు కౌతుక భర వ్యగ్రాంతరంగుండు భ
క్తి నిబద్ధాంజలి బంధురుండు నయి మీ దివ్య ప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి ముని లోక గ్రామణీ సత్కృపన్
నను మీ శిష్యుని దీర్థ యాత్రవలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే

అని ప్రార్థించెను. ఈ పద్యమునందు ప్రవరుడు చూపిన వినయము విధేయత అణకువ మాట నేర్పు పై పద్యమునందు కనిపించదు. శయ్యయందును రెండు పద్యములలో తారతమ్య మున్నది. క్రింది పద్యములో నడకయందును భావ ప్రకటనమునందు నున్న బిగువు తగవులు పై పద్యమునందు లేవు. క్రింద మత్తేభములో విపులముగా వెలయించిన భావమును కుంచించి పైన గీత పద్యములో సరిపెట్టెను. ఇందీవరాక్షుని వృత్తాంత మిరువది పద్యములలో వ్రాయ బడినది. అందు పదునాల్గు పద్యములు గీతములు కందములు గలవు. రెండు వచనము లున్నవి. మనోరమ వృత్తాంతము పదునేడు పద్యములలో వ్రాయబడినది. అందు పదమూడు పద్యములు కందములు గీతము లున్నవి. అది వరకు సమవృత్తముల బాహుళ్యముతో చక్కని వర్ణ

నల నిమిడ్చి కథను నడిపిన పెద్దనగారు మనోరమా ఇందీవరాక్షుల వృత్తాంతములందు గీత కందము లధికముగా వాడి కథను ముందునకు పరుగెత్తించిరి. దీనికి కారణము కథాంశము లంతి రసవంతములు గాక వర్ణనా శిల్పములకు తావు లేక పోవుటవలన నేమో యనిపించు చున్నది. అందు మూలమున నైరాశ్యము జనించి కళా ప్రదర్శనముతో పాటు కవితా ప్రదర్శనము కూడ వెనుక పడినది. కవి మనస్సునన కుల్లా సోద్రేకము లొదవించు కథాంశములు లేనప్పుడు నిరసనము జనించును. దానితో పాటు కవిత కూడ నీరసించును. అందుకనే మనోరమా ఇందీవరాక్షుల కథకు నీరస స్థితి పట్టినది. అట్లని మంచి పద్యము లందందు లేక పోలేదు.

అభ్ర మండలి మోచు నందాఁక నూరక
పెరిగినట్లా మేను నరవరేణ్య
యవధి భూధర సాను వందాఁక నూరక
పఱచినట్లా మేను పార్థివేంద్ర
యబ్జ భూ భువనంబు నందాఁక నూరక
యెగసినట్లా మేను జగ దధీశ
యహిలోక తల మంటు నందాక యూరక
పడిన యట్లా మేను ప్రభు వతంస

యఖిల జగములు మ్రింగునం తాఁకలియును
నబ్ధి లేడును జెడఁ గ్రోలు నంత తృషయు
నచల చాలన చణ మైన యదటు గలిగె
నసుర భావంబు నను జెందు నవసరమున

అని నుడివినా డిందీవరాక్షుడు స్వరోచితో. ఈ పద్యము పోకడ శ్రీనాథుని నలిన సంభవు సాహిణము అను పద్యమును బోలి యున్నది. కాని దానియం దున్న యా బిగువు దీనియందు లేదు. పెద్దన మొదటి యాశ్వాసములందు పెక్కు సీస పద్యములను

వ్రాసెను. వానియందు కల యంద చందము లిందు కానరావు. అంద చందములే కాదు బిగువు కూడ కానరాదు. ప్రత్యేకముగా నీ పద్యము చదువు నప్పుడు చెవుల కింపుగా నుండు ననుటలో సందేహము లేదు. పెద్దనగారి మిగిలిన సీసములతో సరిపోల్చి చూచి నప్పుడు నీరసముగా నున్న దనక తప్పదు. దీనికి కారణము వాని యందలి సాంస్కృతిక పద సమ్మేళన మని నా మిత్రులు కొందరు వాదింతురు. అది నేను కాదనను. పెద్దన ఉభయ విధ కవితా ప్రదర్శనమునందు మిగుల సమర్థుడు. అనువుగా చెప్పిన యుత్పల మాలిక దానికి ప్రబల నిదర్శనము

చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు

ఇత్యాది ప్రబంధ గత పద్యములు దానిని బలపరచు చున్నవి. అవి యన్నియు నాచ్చిక వైకృత దేశీ యాది తెలుగు పదముల కూర్పుతో చెప్ప బడినవి. వానియందలి జిగి బిగువులు నంద చందములు పై పద్యమునందు లేవు. పై పద్యము కేవలము వ్యావహారిక మనియు చిన్ని వెన్నెలకం దిత్యాదు లాచ్ఛికములు కావున వానియం దంద మున్నదని నామిత్రుల వాదన.

విసమానములుగాఁగ వసతోడఁ బెనవెట్టి
నెట్టమ్ముగాఁ బ్రేవుఁ జుట్టినాడు

ఇందు వ్యావహారికములు గలవు. ఈ మనోజ్ఞత దానియందు లేదు. అదే కాదు

అనఁగ నే నట్టివాఁడఁగా ననఘ చరిత
యించు కించుక విప్ర వంటి యెఱుక గలుగు
పెద్ద వారల శిక్షలఁ బెరిగినాఁడ
నవధరింపుము శిష్యుఁగా ననిన నతఁడు

ఈ వరుస వ్రాసిన పద్యము లన్నియు నీరస స్థితియం దున్నవి. ఇట్టి పద్యము లాశువుల కన్నదమ్ము లన వచ్చును. అవి మైచ్చికములుగావు. నాల్క తుదలం బుట్టి పొటకరించి వెడలినవి. కవిత్వ మావేశమువలన పొడమును. అందుకనే నన్నయను కవితావేశుం డని తిక్కన పొగడెను. ఆ యావేశము రస స్థితిని బట్టి యుండును. రస స్థితి కథా సందర్భముల ననుసరించి పొడమును. పండితు డగు కవి కథా ఘట్టములందు రసావేశమును పొందును. దానికి కవితావేశము తోడయి రసానుగుణము లగు సాంస్కృతి కాచ్ఛిక వైకృత దేశీ యాది పదములు శర పరంపరలుగా హృదయము నుండి యుబు కెత్తి స్థానాస్థాన ఉచితానుచితముల గుర్తించి రస నాగ్రమునకు దొరలి వచ్చును. అవి రసార్ద్రములయి కవితా పాటవము గల్గి నొండొంటఁ గలయ కూడుకొని ప్రవాహరూపమున పద్య స్ఫూర్తి వహించును. అది లేని నాడు నీరస స్థితి వహించును. స్వరోచి పెండ్లి కొడుకయి యూరేగు చుండెను. పురము వెలందుకలు వానిని చూడ వచ్చిరి. ఇది చక్కని కథా ఘట్టము. రసావిష్కృతికి చిత్తము నుబుకు లాడించు పట్టు. పెద్దన హృదయ ముప్పొంగినది. రసావేశము కవితావేశము కలయ కూడుకొనినవి. భావము లుద్రేకించినవి. కల్పనలు వెల్లి విరిసినవి. మనోహార పద జాలము లొండొంటిని బంధించుకొనినవి. పద్య రూపమున నొకటి వెంట నొకటి బయలు వెడలినవి. వానియం దుండి రెండు మూడు పద్యములు

చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటక సాల మేడపై
నిలువున నాడు చుండి ధరణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిన్ గనుంగొనుచు నెయ్యమునం దను వల్లి యుబ్బి కం
చెల తెగి పడ్డఁ గేతనము చీర చెఱంగున మూసె చన్నులన్

ఈ వరుస పద్యము లన్నియు చక్కని జాను తెనుగు పదముల పొందికతో వివిధ శృంగార రస భావము లుప్పతిల్ల పెద్దనగారు

విరచించిరి. ఒకొక్క పద్య మొకొక్క విధముగా స్వరోచి సౌంద ర్యాతిశయమును ధ్వనింప చేయు చున్నది. పెద్దనగారి కల్పనా శక్తికి కామ శాస్త్ర వేతృత్వమునకు వహావ్వా యనిపించును. ఆమె నాట్య కత్తె. నాటక సాల పైనిలువున నాట్య మాడు చున్నది. అంతలో స్వరోచి యూరేగుచు వచ్చెను. వానిని చూడ దలంచినది. మేడ చివరి యంచునకు వచ్చి నిలిచినదట. రాజును మిగుల నాసక్తితో చూచినది. ఆసక్తితో చూచుటకు కారణ మాతని సౌందర్యము. ఆ సౌందర్య మామె కింపొదవించినది. స్త్రీలు సౌంద ర్యోపాసకులు. సుందరములగు పదార్థములు చూచిన యెడ లుప్పొం గును. వానిని తమవిగా నొనరించుకొన తలంతురు. స్వరోచి యందము నమితాసక్తితో చూచినది. అది యామె కింపొదవించి నది. అందు మూలమున నొడ లుప్పొంగినది. చనులు విరివి వహించినవి. బిగియ కట్టిన చనుకట్టు చాలక పగిలి తెగి పోయి క్రింద పడినది. చనులు బయ ల్పడినవి. ఆమెకు పైవలువ లేదు. సిగ్గిలి దాపునందు మేడకు సింగారించిన జెండా గుడ్డతో తటాలున చన్నులను మూసికొనినది. క్రిందకు వంగి తెగి పడిన చనుకట్టు తీసి మరల కట్టుకొనుట కామె యిచ్చగింప లేదు. దానిక కారణము తన చూపున కంతరాయము వాటిల్లు నని భయము. ఈ పద్యములోని ప్రతి పదమునందు మనోహరతయు భావ పుష్టి రస సృష్టియు పాఠకుని మన స్సుబికించు కల్పనయు గలదు. శృంగా మనిన పైకి పెడ మొగము పెట్టువారి మాట నేను చెప్ప లేను గాని కావ్య రస పిపాసువుల చిత్తము లుఱ్ఱూత లూగించు పద్య మిది. ఈ పద్యమునందు నాయకురాలు నర్తకి. ఆమె స్వరోచిని రహిన్ కనుం గొనుచు ననుటచే చక్షు ప్రీతి యను నవస్థ వర్ణింప బడినది. భావము హావము హేల విలాసములను శృంగార చేష్టలు రహిన్ గనుం గొనుచు నెయ్యమునం దను వల్లి యుబ్బి కంచెల తెగి పడె ననుట యందు చెప్ప బడినవి. భావంబు వెలయు చుండు రస జ్ఞాన

యోగ్యతా మాత్ర మగుచు నని కావ్యాలంకారము. కావున రహిం గనుట భావము. భావ మీషా ద్వ్యక్త మయి హావ మగును. నెయ్యము నన్ అనుటలో హావ మున్నది. భావము సువ్యక్తం బయినచో హేల యగును. తను వల్లి యుబ్బుట కంచెల తెగిపడుటవలని నాయకు రాలి శృంగార భావము సువ్యక్త మయినది. కావున నది హేల. పతిఁ గనఁ తాత్కాలిక మగు వికారము విలాసము. నాయకురాలి యందు పొడమిన తాత్కాలిక కామోద్రేకమువలని స్వారోచిని తదేక దృష్టితో చూచుట విలాస మను శృంగార చేష్ట యగును.

ఈ పద్యమును వ్యాఖ్యానించుచు వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు నాటకసాలన్ మేడ పైనిలువునన్ అని విడతీసిరి. నాటకసాల మేడ పై నిలువునన్ అని అది యంతయు నేక సమా సము. నాటక శాల సంబంధియైన మేడ పై నిలువు నని అర్థము. సంబంధార్థే షష్ఠి. నాటక సాల యొక్క మేడ పై నిలువని విగ్రహము. అట్లు చెప్పి నప్పుడే యీ సమాసమున కందము బిగువు నుండును. పెద్దనగా రేక సమాసముగా వాడిరి. ఆంధ్ర మష్ట వర్ణ పర్యంతం సంస్కృతేన సమస్యతే అని. అట్లు సమాసించుట దోషము కాదు. నిలువు అనగా అంతస్తు అని యర్థము. ఇల్లు కాదు. రహిన్ = కోరికతో నని వ్యాఖ్యాతలు నుడివిరి. ఆసక్తితో నని యర్థము. నెయ్యమునన్ = స్నేహముచేత అని అర్థము వ్రాసిరి. ఆ యర్థము రస భావమునకు కుదురదు. అందు స్నేహము లేదు. ఇఃపున నని యర్థము. స్వారోచి సౌందర్యము నాయకురాలి కింపొదవించినది. అందు మూలము తను వల్లి యుప్పొంగినది. కంచెల తెగి పడ్డన్ అను దానికి కంచెల = కంచుకము. తెగి = బిగువుచే ముడి వీడి పోయి పడ్డన్ = పడిపోగా నని యర్థము వ్రాసి తాత్పర్యమునందు ఱవిక ముడి తెగి యూడి యని వ్రాసినారు శ్రీ రామస్వామి శాస్త్రీగారు. ఆ వాక్యములోని యందము గాని పదముల యర్థసౌష్టవము గాని

వస్త్ర ధారణ విధానము గాని పెద్దనగారి యూహ గాని వారికి తెలియ లేదు. పెద్దన యతి రసికుడు. ఏ శబ్దమునే యర్థముతో నెచట వాడ వలయునో యాయనకు బాగుగా తెలియును. ఆయన కామ శాస్త్రోపాధ్యాయుడు. కావున ఈ పాండిత్యము నీకుఁ దక్క మరి యెందేఁ గంటిమే కామ శాస్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలోహో! యని ప్రవరుని నోట నన వింబ శాస్త్రంపు మినుకు లావర్తించు పని వెన్నతోఁ బెట్టినది మా కని సగర్వముగా బలికిన వరూథినిని గెలికొట్టిన ప్రౌఢ. పాలిండ్లు పొంగి పొటకరించుటలో గల ప్రాబల్య మెరిగినవాడు. కావుననే ప్రాంచ ద్భూషణ బాహు మూల రుచితో పాలిండ్లు పొంగార పై యంచుల్ మోవగ ప్రవరుని కౌగిలింప చేసినాడు వరూథినిచేత. అప్పు డామె తాల్చినది మన స్త్రీలు కట్టి తొడిగి కొను రవిక కాదు. చనుకట్టు. ఒక సన్నని గుడ్డ పీలికను చనుల నంట చుట్టి వెనుక వంక ముడి వేయుదురు. దానికి చనుకట్టని పేరు. శకుంతల ప్రియంవదా! దయమాలి అనసూయ స్తన వల్కలమును బిగించి ముడివైచినది, ఇంచుక సడలింపు మన్నది. ఆమెకు నీ యవస్థగాం పట్టిన దప్పుడు. చనుకట్టు కలది కావుననే వరూథిని బాహు మూల రుచులు గోచరించినవి. అవిక యయినచో గోచరింపవు. పెద్దన స్త్రీలయందు, పాలిండ్ల ప్రాముఖ్యత బాగుగా నెఱింగినవాడు. మనోరమ స్వర్గోచి తల పైన తలబ్రాలు పోయుటకు దోసిలి పట్టి బాహువులు పై కెత్తినది.

ముడివడు కంకణ ప్రభల ముత్తెపు సేసలు దోయిలించి యె
త్తెడు తఱి బాహు మూల కుచ దీప్తులపైఁ బతి దృష్టి పర్వినన్
బొడమిన లజ్జఁ బాణి యుగమున్ వెస వంచియె మాలి మ్రోఁది కిన్
బొడవునఁ జల్లె లేనగవు పొల్పుగ జెప్పల నప్పళించుచున్

పెద్దనగారు కడు కొంటె. స్త్రీలయందు శృంగార భావములను తేలికగా నుద్రేకింప చేయుటకు తగిన చక్కని యుపాయము లెఱింగిన నేర్పరి. ప్రియురాలి యందు మొదట ప్రియుని చూపు ప్రసరించునది

కుచములమీాద. ఆ చూపు స్త్రీలయందు లజ్జాదిక శృంగార భావము లుద్రేకింప చేయును. దానిలోని రహస్య మనుభవము కలవారికి తెలియును. ఆ యనుభవము పెద్దనగారికి బాగుగా నున్నది. ఆ యనుభవమే పైపద్యమునందు వెలయించినాడు పెద్దన. అప్పుడు మనోరమ తాల్చినది కూడ చనుకట్టే. కావున బాహు మూాల కుచ దీప్తులు చూడ గలిగినాడు స్వరోచి. అది భారతీయ వస్త్ర ధారణ విధానము. పురాణ యువతు లందరు ధరించిన స్తన కంచుకములు చను కట్టులు. ఇప్పటి అవికలు కావు. కంచుకము, కంచెల చను కట్టులకు శబ్ద రత్నాకర కారుడు అవిక యని సర్వ సామాన్యముగా యర్థము వ్రాసెను. అది కొంచె మాలోచింప వలసిన విషయము. అవిక వేరు చనుకట్టు వేరు. పూర్వ కాలమందు అవికలు లేవు. కటిని లంగాలు కట్టి వలిపెము చుట్టు నిండుగా నమర్చి చనుకట్టులు కట్టి వేరుగా నుత్తరీయము వంటి దువ్వాలువ పైన కప్పు కొనుట భారతీయ స్త్రీ సంప్రదాయము. అప్పుడు పైట లుండెడివి కావు. ఇట్టి వస్త్ర ధారణము ఉత్తర దేశమునం దచ్చటచ్చట నిప్పటికిని కనిపించును. ద్రౌపది నేను ఏక వస్త్రను. కురు వృద్ధ జనాధిష్ఠితం బైన సభ కెట్లు రా నేర్తు నన్నది. ఆమె రజస్వల. రజస్వలలకు పై వలువ యుండదు. కావున ఏక వస్త్రలు వారు. వారికి కటి వలువ యొక్కటియే యుండును. కంచుక శబ్ద భవము కంచెల. కంచుకము స్తనాచ్ఛాదనము. అదియే చనుకట్టు. కంచెల యనిన నదే యర్థము. నర్తకి తను వల్లి పొంగి చను లుబికినవి. ఆ యుబుకునకు చనుకట్టు చాలక తెగి పడిపోయినది. క్రింద తెగి యనగా పగులువారి, పడన్ = క్రింద పడినది కాగా యని యర్థము. తెగిపడ్డన్ అనుటయందు పుటుక్కున తెగి చటుక్కున పడిన దని స్ఫురింప చేయు చున్నది. అందు మూాలమున చను లొక్కసారి యమితముగా పొంగారియుండ వలయును. ఆ పొంగులోని అతిశయము తెగి పడ్డన్ అను పదము స్ఫురింప చేయును. అవిక అయినచో మేని

కంటుకొని వ్రేలాడు చుండును. చనుకట్టు కావున తెగి పడినది. తెగి యనుటకు వ్యాఖ్యాత వ్రాసి నట్లు ముడి ఊడిపోయి అని కాదు. ముడి తెగి యని కావచ్చును. స్తనముల పొంగు కామోద్రేకము వలన కలుగును. ఆ కామోద్రేకము సుందరుడగు ప్రియుని సందర్శనము వలన యువతికి వాటిల్లును. కావున నర్తకి మోహోద్రేకము, అందు మూలమున స్వరోచి యందము, ఈ పద్యమునందు వ్యంజితము లగు చున్నవి. ఇంకొకటి.

జిలుఁగులఁ బెట్టుచున్ దొడలఁ జెంద్రిక పావడ యంట మై తడిన్
జెళ పెళ లేని చీరఁ గటి బింకపుఁ జన్నులఁ జేర్చికొంచు వే
జలకము లాడి యాడి గమికచాన కరస్థిత కేశయై నృపున్
వెలువడి చూచె లోఁబడితి నీ కని బాసకు నిల్చెనో యనన్

ఒక యువతి బాగా స్నానము చేసినది. అంతలో స్వరోచి యూరేగుచు వచ్చెను. వానిని చూడవలయు నను సంభ్రముముచేత ఆలస్య మగు నని ఒడలు తుడుచుకొనకుండ బట్టలు కట్టుకొనుచు చెంది వన్నె పావడ తొడల నంటుకొనగా మేని తడిచేత తడిసి పెళపెళ లాడని వలిపమును కటియందు బింకపు చన్నులయందు చేర్చి కొనుచు నింటి బైటికి వచ్చి చూచినది. అప్పటి కింకను చనుకట్టు తాల్చ లేదు. పావడ మీద చీర నమర్చు కొనలేదు. ఆ తడి గమికలితో డను తడిసిన బట్టలతోను వచ్చి నిలిచిన విధము చూడగా ఓ స్వరోచి నీకు నేను లోబడినదాన నయితి నని తడిబట్టలతో స్నాన మొనరించి ఎదుట ప్రమాణము చేయుటకొఱకు వచ్చి నిలిచి నట్లున్నదట. ఘోరముగా ప్రమాణము చేయు నప్పుడు స్నానము చేసి తడి బట్ట లతో ప్రమాణము చేయుదురు. అది లోక ప్రసిద్ధము. ఇందు ఔత్సుక మను శృంగార చేష్ట వర్ణింప బడినది. సమయాక్షమత్వము ఔత్సుకము. ఆలస్యము సహింప కుండుట. దీనిని వ్యాఖ్యానించుచు రామస్వామి శాస్త్రిగారు జిలుగులన్ = పలుచని చిన్న పంచెలను,

పెట్టుచున్ = తడి యొత్తుటకు మేనిపై నొత్తుచు అని అర్థము వ్రాసిరి. మరల వారికి సందేహము తోచినది కాబోలు తాత్పర్యమునందు వేగముగా తడి గుడ్డను విడిచి వైచి యని వ్రాసిరి. వారి యర్థము వారికే యనుమాన మయినది. కాని ఆ రెండు అర్థములు తప్పే. జిలుగులన్ = సన్నని దువ్వలువలను, పెట్టుచున్ = ధరించుచు అని యర్థము. శత్రర్థక ప్రయోగముచేత సంపూర్ణముగా వస్త్రములను ధరించుటవలని యగు నాలస్యము సహింపని దయి జిలుగులను కట్టు కొనుచు వచ్చిన దని భావము. అందువలన నాయిక యొక్క యాతుర్య క్యము సూచింప బడినది. ఒక్క గాగర మాత్రము ధరించినది. అది మేని తడిచేత తొడల కంటుకొని పోయినది. అది సహజము. ఆమె చనుకట్టు కట్టుకొన లేదు. కావున చనులు కటియు గానరా కుండ యొక మడుగు చీరతో కప్పుకొనుచు వచ్చినది. మడుగు వలువ ఎండి బిరుసెక్కి పెళపెళ లాడును. కాని నాయకురాలి మేని తడిచేత మడుగు చీర పెళపెళ లాడక తడిసి మెత్త పడినది. కావున పెళపెళ లేని చీర అని వాడినాడు పెద్దన. కటియందలి పెళపెళ లేని చీర యని కటిన్ అను శబ్దమును ముందున కన్వయించినారు శాస్త్రిగారు. అట్టి డొంక తిరుగుడు నన్వయము పెద్దనగారికి అంట కట్టుట కంటె పెళపెళలేని చీరతో కటిని చన్నులను మూయ కప్పుకొనుచు వచ్చె ననుట చాల యుచితము. మఱొక పద్యము.

> ఒక నేత్రాంబుజ మొక్క గల్ల మొక చన్నొయ్యారపున్ లీల వీ
> ధికిఁ దోఁపన్ దలు పోరగా నొక పురంధ్రీ రత్న మీక్షించె రా
> జ కిశోరంబుఁ దదీయలై వెలయు భాషా లక్ష్ములన్ జూచి త్ర్యం
> బక భాగంబు మొఱంగి మైత్రికి శివా భాగంబ యేతెంచెనాన్

పెద్దనగారి లేఖిని యెంత కొంటెయో యంత పెద్దమనిషి కూడను. అది కవుల లక్షణము. ఆ లక్షణము వర్ణనలలో నగుపించు చుండును. శృంగార కావ్య రచయితల కవి ముఖ్యముగా కావలసినవే. పై

పద్యములందు చిలిపి తనమును వెలయించిన పెద్దనగారి లేఖిని ఈ పద్యమునందు చాల పెద్దమనిషి తన మవలంబించినది. ఆమె పురంధ్రి. వెలి కగుపించు నామె శరీరాగ్ర భాగము అర్ధ నారీశ్వరు డయిన శంకరుని శివా భాగముగా వర్ణించినాడు పెద్దన. ఆమె మహా పతివ్రత. రాజ కిశోర మనుటచేతను నామె పురంధ్రి యనుటచేతను స్వరోచిని పుత్ర వాత్సల్యముతో చూచిన దని సూచింపబడినది. పార్వతి లోక మాత కావున ఆ సూచన సమంజసము. స్వరోచిని లక్ష్మి సరస్వతు లాశ్రయించి యున్నవి. లక్ష్మి సరస్వతులు పార్వతికి ఒక వరుసయందు కూతురు మనుమరాలు నగుదురు. వారాశ్రయించిన స్వరోచి యల్లుడు మనుమడు నగును. పార్వతికి పోల్చబడిన పురంధ్రి పుత్ర భావముతో రాజ కిశోరమును చూచుట తగియున్నది.

పెద్దనగారి శయ్య

యును భావములును సందర్భములను బట్టి మారు చుండును. అవి చక్కగా పాఠకుని మనస్సున కతుకుకొని యాహ్లాద మొదవించును.

తనుమధ్య త్రివళుల్ నటింప నిల మీఁదన్ మట్టియల్ మోవఁగాఁ
గను పాపల్ పయి కొప్పులన్ గదియ నుత్కంఠాగ్రయై నిక్కి నా
థుని మౌళిన్ దలఁబ్రాలు వోసె నవలా దోర్మూల కూలంకష
స్తన విస్ఫూర్తికి సంది దండల ధళల్ సాహో వినాదం బిడన్

ఇట్లు తత్సమ శబ్దములు అలంతి సంస్కృత సమాసములతో కలిసి ఆచ్ఛిక దేశీయ పద సమ్మేళనముతో పద్యము సామాన్య స్థితులందు సాగి పోవు చుండును. ఇది పెద్దనగారి యసలు పద్య రచనా విధానము. ఈ పద్యము మనోరమా స్వరోచి వివాహ సందర్భము లోనిది. మనోరమ విభుని తలపై తలబ్రాలు పోసిన విధానము వర్ణింప బడినది. పెద్దనగారి చూపు మిగుల వాడి యైనది. ఏ సమయమునం దే పాత్ర యొక్క యవయవ విన్యాసమునం దెట్టి సంచలనము

కలుగునో యతి తీవ్రముగా పరిశీలించ గలదు. పరిశీలించిన దానిని పరిశీలించి నటుల మనస్సున కందిచ్చును. మనసు దానిని రస ప్లావితము గావించి సముచిత పద సమ్మేళనముతో కవితా రీతులను సరిచూచి లేఖిని కందిచ్చును. అది ఘలంఘలారావములతో నటించును. మనోరమ దోయిలించిన బాహువు లెత్తి తలబ్రాలు పోయు చున్నది. అందు మూలమున త్రివళులు కాన్పించినవి. అవి చేతుల నెత్తి దింపుటలో కదలబారు చున్నవి. విభుడు తనకంటె పొడగరి. కావున మనోరమ కొంచెము ముందునకు జరిగి నిక్క వలసి యున్నది తలబ్రాలు స్వరోచి మౌళియందు పోయుటకు. ఆ కారణముచేత పాదాగ్రములను నేల మీద మోపి నిగిడినది. అప్పుడు మట్టెలు మాత్రము నేల మీద మోప బడినవి. మిగిలిన పాద మంతయు పీట మీద నున్నది. ఇల మీఁదన్ మట్టియల్ మోవఁగా ననుటలో భావ మది. తాను పోయు తలబ్రాలు మౌళియందు పడుచున్నవో లేవో చూడ వలయును. సిగ్గు తల యెత్తి చూడ నీయదు. కను లెత్తి కనుపాపలు పయి రెప్పలను గదియ తల వంచి పైవంకను చూచినది. ప్రతి వ్యస్తురా లయిన పెండ్లికుమార్తెయు తలబ్రాలు పోయు విధ మిది. మన మందరము పెండ్లిండ్లయందు చూచు చుందుము. కాని యీ వివిధాంగ సంచలనములు కనిపెట్ట లేము. కవి సౌంద ర్యోపాసకుడు. ఏ యంగంపు కదలికలో నెట్టి యంద మున్నదో వాని చూపు తేలికగా గ్రహింప గలదు. చూపున కందనిచో నూహ కందని సత్య ముండదు. కావుననే రవి కాననిచో కవి గాంచు నందురు. మనోరమ బాహు లెత్తి తలబ్రాలు పోయు చుండ సంది దండల ధళ ధళ కాంతులు దోర్మూల స్తన విస్ఫూర్తిక సాహో నినాదములు చేయు చున్నవట. అనగా హెచ్చరించు చున్న వని యర్థము. రాజులు బయలు వెడలు నప్పుడు ఇటు నటు నిలుచుండి ముందుగా సాహో ధ్వనులతో పరాకు అని హెచ్చరింతురు. మనోరమ స్తనములు కూలంకషములు అనుటచే చుట్టు పట్టుల నొరసి

యుబికి యున్న వని భావము. కావున మిన్న లయినవి. అట్లే దోర్మూలములు ఆ యున్నతివలన ఆధిక్యత కలవయినవి. అందు మూలమున సంది దండల ధళ ధళలు పరాకని హెచ్చరించు చున్నవి. ఆ హెచ్చరిక ఏమని యందురా ? దోర్మూల స్తనము లారా ! జాగరూకులై యుండుడు. స్వారోచి కొంటె. వాని చూపు మీపై బడును అని హెచ్చరిక. ఆ హెచ్చరిక నవి లక్ష్య పెట్ట లేదు. అవి యట్లే బయట పడినవి. స్వారోచి చూడనే చూచినాడు. మనో రమ గ్రహించిన దా చూపు. సిగ్గు పడినది. అదే

ముడివడు కంకణ ప్రభల ముత్తెపు సేనలు దోయిలించి యె
త్తెడు తఱి బాహు మూల కుచ దీప్తులపైఁ బతి దృష్టి పర్వినన్

అను పద్యమునందు నుడివినాడు పెద్దన. పైపద్యమునందు నటింప,నాథుని మౌళిన్, ధళల్, నినాదంబు తత్సమ పదములు వానికి తనుమధ్య త్రివళుల్, దోర్మూల కూలంకష స్తన విస్ఫూర్తికి అను సమాసముల పొందికచే పద్యపు టల్లిక బిగువు కల దయినది. వానితో సంది దండలు, మట్టియలు, కను పాప లిత్యాది జాను తెనుగు లైన దేశీయ పదముల కలయు కలుపువలన శయ్య మెఱు గెక్కి మృదుత్వము కల దయినది. శృంగార రసమునకు దేశీయములు వన్నె పెట్టు చుండును. వర్ణనల యాధిక్యతను బట్టి వృత్త్యనుప్రాసలు కూడ కలుపుకొని సమా సము లతిదీర్ఘములయి సాగిపోవు చుండును. మచ్చునకు

అరవిందాక్షులుఁ దాను నిట్లభిమత వ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొక చోటఁ గాంచె లఘు శీత స్వచ్ఛ వాః పూరమున్
వర కీర వ్రజ చంచు పాటిత తట వ్యాకీర్ణ మందార కే
సర మాకంద వినిస్సర త్ఫల రసాసారంబుఁ గాసారమున్

ఇది స్వారోచి సతీ యుతుండయి పోయి చూచిన కాసార వర్ణనము. 'బహు రత్న ద్యుతి మేదురోదర దరీ' ఆ మందిడి యతి డరిగిన

ఇత్యాది పద్యము లరయునది. ఒకొక్కప్పుడా సమాసములు భావాను గుణముగా తాళ లయా సమన్వితములయి యుండును. 'అటఁ జని కాంచె భూమిసురుఁడు' 'ఉల్లల దలకా జల' ఇత్యాదులు దృష్టాంతములు. శిల్ప రచనలందు ఆచ్ఛిక వైకృత దేశీయ పదములు బహుళములుగా వాడును. వానితో తత్సమములు రెండు మూడు పదముల కూర్పుగల చిరుత సమాసములు చేర్చి పద్యపు నడకకు నందములు దిద్దును. అందు మూలమున శయ్యా కుసుమ కోమలత వహించును. రూప ప్రదర్శనమునకు ఆచ్ఛిక వైకృత దేశీయములు నైసర్గిక స్థితి కల్పించును. 'ముడిచిన రెయింటె కెంజడ' 'చేర్చుకగొ నిడ్డ' 'విసుమానములుగాఁగ వసతోడ పెనవైచి, యిత్యాది సీస పద్యము లందలి శిల్పమునకు ఆచ్ఛికాది పదము లందము తెచ్చినవి. వానితోపాటిం కొకటి

నీల మేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామన చాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడగించు జిగి హెచ్చు
నాయతం బగు కన్నుదోయితోడఁ
బులుఁగు రాయని చట్టుపల వన్నె నొర పెట్టు
'హాళంబట్టు జిలుఁగు గెంటెంబుతోడ
నుదయార్క బింబంబు నొఱపు విడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడ

హరి స్వాలోచిషునకు సాక్షాత్కరించెను. ఇందలి శిల్ప మంత ప్రసంగింప తగినది కాదు. పదాడంబరము శిల్పమును మ్రింగి వేసినది. పైన సూచించిన పద్యములలో నిండు రూప శిల్పము కలదు. పెద్దన ఆరవ యాశ్వాసమునందు కథ త్వరగా నడిపించెను. రస పోషణకంటె శబ్ద పోషణ మించి పోయినది. అందుకు కారణము శబ్ద చిత్రములందు మనస్సు కలిగి యుండుట కావచ్చును. మొదటి యాశ్వాస

ములలో వాని జోలికి పోలేదు. ఇంక పాత్రల సంభాషణలందు సందర్భమును బట్టి జాతీయములు వ్యావహారికములు చేర్చి వినువారి చెవులకు విందొదవించెను. ' ఇంతలు కన్నులుండ ' కుందనము వంటి మేను, ఇత్యాదు లరయునది. మరొక మచ్చు తునక

మెలతకుఁ బతిపై నైనను
మెలఁతుకపైఁ బతికి నైన మేలగు టెందున్
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమం బగుట జన్మ వాసన చెలియా

అన్నది హంసాంగ చక్రవాకాంగనతో కథా సరళిలో

దట్టంబు నీ కట్టినట్టి చెంగావిక
    బాగు గా దని కేలఁ బయఁట నిమిరె
గోరంటా గోళ్ల నిక్కవపుఁ గెంపో యని
    చెయి పట్టి నయమున సెజ్జఁ జేర్చె
నగరు ధూపముచేత నయ్యో తనూ వల్లి
    సెక సోఁకె నని యెదఁ జెయ్యి వెట్టె
మృగనాభికా మకరికలఁ గప్రము మించె
    నని మూరుకొనుచుఁ జుంబన మొనర్చె

హార మణు లిటు సూపు నా యటుత నున్న
హార మణులకుఁ గాంతి నీడౌనో కావో
యనుచు నక్కునఁ గదియించు నా నెపమునఁ
గంపమును బొందు సతి మేను గౌఁగలించె.

ఇట్లు జాను తెనుగులగు జాతీయములను వ్యావహారికముల పొందిక చే పద్యము రాణింప చేయుట పెద్దనగారి కలవాటు. అందును సీస పద్యముల రచనలో మరింత యంద మొదవించును. ఇట్టి సందర్భ

చితము లయిన మృదుల శయ్యా విశేషముల నొదవించుచు పరిమితము లు హృదయంగమము లయిన

నలంకారములు

శోభిల మనుచరిత్ర కావ్యమును నవ నాజూకు తినంబు గల నిండు జవ్వనంపు నంగంబుల పొంకంబులు వెలయించు పలుకు నేటి జాణ తనంపు నాగరి కాంగనగా తయారు చేసినాడు పెద్దన. పదములు కుసుమ పేశలములు. వానియందు పెళుసు తనము మచ్చున కయిన నగుపించదు. అర్థముకొరకు తడుముకొన వలసిన పని యుండదు. మారుమూల పదములు వాడుట పెద్దన కలవాటు లేదు. అక్షరాస్యు లకు తేలికగా నర్థ మవగత మగుచుండును. అందు మూలమున నాజూకు తనము కలదయి పలుకుబడి యందు పాఠకుల మన స్నాక ర్షించు చుండును. పోకడలో వక్రత గాని కౌటిల్యము గాని కనిపించదు. సరళ మగు నొయారంపు నడక పదముల పొందిక కంద మొదవించు చుండును. అన్వయముకొరకు వెనుక ముందు తడుము లాట యుండదు. పద్యము చదివినంత మాత్రముచేతనే భావ మవగత మగు చుండును. పదముల పొందికకు నలంకార ప్రాయములయి యలంకారములు పద్యమునకు శోభ నొదవించు చుండును. అవి రసానుగుణముగా సందర్భముల ననుసరించి తమంతట తాము వచ్చి వాలు చుండును. ప్రయత్న పూర్వకముగా తెచ్చి పెట్టినవి కావు. కావున సహజ సౌందర్యము కలవయి 'కావ్యమున కందము నాపా దించినవి. అవియు పరిమితము లగుటచేత ఆకారంపు నాజూకు తనమునకు నాగరికత కల్పించినవి. విష్ణుచిత్తీయాదులు పలుకు కరకు దనమునకు తోడు అలంకారములు మితిమీర తెచ్చి పెట్టిన వగుట చేత పల్లె పడుచు వలె మోటు తనము కలవయినవి. పెద్దన

మానినాథ ! కుటుంబ జంబాల పటల
మగ్న మాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండు గలదె
యుష్మ దంఘ్రి రజో లేశ మొకటి తక్క

ఇట్లు కావ్య వాణికి స్వరూప యోగ్యములగు రూపకాలంకారములు వాడెను. కావ్యము కాంతా సమ్మితము. ఉచితానుచితముల ననుసరించి వ్యక్తావ్యక్త రూపమున భావములు వెలయించును. ఆమె మర్యాద నెఱింగిన సిగ్గరి. కళా గోపన మామె స్వభావము. అందు అంద మున్నది. పాఠకు నూరించు మానసిక తత్త్వ మున్నది. అట్టి కళా రహస్యములు రసికులగు విద్వత్కవుల మనస్సులకు గోచర మగు చుండును. వానిని వ్యంగ్య రూపమున ప్రదర్శించు చుండును. పైపద్యమునందు జంబాల మనగా బురద యని యర్థము. పటల మనగా సముదాయము. కుటుంబ జంబాల పటములనకు కుటుంబ మనెడు జంబాల పటల మని విగ్రహ వాక్యము. ఇది రూపకము. జంబాలమునందు దిగ బడినవాడు తనంతట తాను బైటికి రాలేడు. ఎవరైన వచ్చి యుద్ధరింప వలయును. జంబాల మున్న చోట ఇసుక పోసిన గట్టి పడి నడకకు యోగ్య మగును. లోపల దిగ బడినవారు బైటికి రా గలుగుదురు. అట్టి రజస్సు తెచ్చి పోయువా డుండవలయును. అట్లే కుటుంబ జంబాలమందు మగ్నులై యున్న మా వంటి వారిని ఉద్ధరించుటకు మీ పాద ధూళి యొకటే యుపాయము. అది మందు వంటిది. మందు లేశ మాత్ర మయినను గొప్ప రోగములను మాయించి మానవుని కాపాడును. అట్లే మీ యంఘ్రి రజస్సు లేశ మయినను జంబాల పటలము మాయించి మావంటి గృహస్థుల నుద్ధరింప గల దని భావము. మేము జంబాల మగ్నుల మగుటచే మీ యొద్దకు రాలేము. మీరే వచ్చి మమ్ముద్ధ రింప వలయును మీ పాద ధూళిచేత అని ఫలితార్థము. ఆ మాట

సిద్ధునితో ననుట యపరాధము. కావున వ్యంగ్యముగా సూచింప బడినది. ఇది రూపకాలంకార కృత వస్తుధ్వని. ఇదే కళా గోపనము. ఇంతలు కన్నులుండ, కుందనము వంటి మేను ఇత్యాది పద్యములందు వరూథిని తన వలపు వ్యంగ్యముగా సూచించినది. అది కావ్య కళా రహస్యము. ఇట్టి వ్యంగ్యాదులచేత పెద్దనగారు కావ్య లతా తన్విని సహజ గుణ స్వభావములు కలదానిని గావించెను. కావ్య లోకమున మనుచరిత్రను ప్రథమ గణ్యగా నొనరించెను.

కవి యనృత వాది. అబద్ధములను చెప్పి మానవులను నమ్మించి మోసగించు నని యొక పాశ్చాత్య మహాపండితుడు నుడివెను. ఆ మాట నిజము. ప్రకృతమును మాయ బుచ్చి యప్రకృతములకు చిలువలు పలువలు కల్పించి పాఠకుని చక్కగా నమ్మించి యూ ననిపించును. అట్టి రచనలలో పెద్దన చాల ఘటికుడు.

తలచూపె నప్పు డఖిలా
శల దట్టంపు టిరులు చిలువ జవరాలు నభ
స్స్థల మండప కోపరి సీ
మల నిడిన సితాండ పటలి మాడ్కిన్ జుక్కల్

సాంధ్య నటన చండ చండీశ పద హతిఁ
దరణి చక్ర మొరగి శరధిఁ గ్రుంగ
దోరగల్లు వడియె భూ రథేతర భాగ
చక్ర మనఁగ నపుడు శశియుఁ దోఁచె

వీని రెంటియందు నుత్ప్రేక్షలు గలవు. వానిని రూపకములతో జత పరచెను. పెద్దనగారీ రెండలంకారములు నడప తడప వాడుట చేత కావ్య కన్యక కొక విశిష్ట మగు నున్నతిని సమకూర్చెను. అంత మాత్రముచేత పెద్దన యనృత వాది యని యనుకొన రాదు. వాని రచనలో స్వభావోక్తులు తక్కువ లేవు. అవి పాత్రల స్వరూప

చిత్రములను కనుల యెదుట నున్నవి యున్నటుల తెచ్చి పెట్టును. 'ముడిచిన' గొంటి కెంజడ, 'చేర్పుచుక్కగా నిడ్డ', 'తత నితం బాభోగ' ఇటువంటి పద్యము లందలి శిల్ప రచనలను దర్శించి పాఠకు డానందించును. చివరి రెంటియందు కల్పిత రూపములకు మెఱుగులు దిద్ది తద్గుణాదులు స్వభావమునకు మరింత అంద మొదవించినవి. మరొక చక్కని మచ్చు తునక

చెంగల్వ పూదండ శేర్చి పెందుఱుముపై
ఘనసారమున నూసకము ఘటించి
పన్నీటితోఁ గదంబము సేసి మృగనాభిఁ
బూసి కుంకుమ సేస బొట్టు తీర్చి
విశద ముక్తా దామ రశనఁ జందుర కావి
వలిపపు వలువ పై నలవరించి
యఱుత వెన్నెలఁ గాయు హార మొక్కటి వెట్టి
మణుల సొమ్ములు మేన మట్టు పఱచి

కన్నుఁ గవ గెల్చి డాకాలఁ గట్టె ననఁగ
ఘల్లు ఘల్లునఁ బెండెంబు గండు మ్రోలు
గదల నల్లన నడిపించి యొడివి తెచ్చె
నెచ్చెలుల పిండు యువతి నా నృపతి కడకు

ఇందు యువతి మనోరమ. నృపతి స్వరోచి. అఱుత వెన్నెల గాయు హార మొక్కటి పెట్టినారట ఆమెకు. కంఠ హారములు దిగవేయ లేదు. పెద్దన నవనాగరికుడు. ఒడలికి బరు వొదవింప మితి మీరిన అలంకారములతోఁ గై సేయుట వాని కిష్ట ముండదు. వెన్నెల వెలుగు లీను నొక్క సొమ్ము చాలును మెడయందు. మిగిలినవి యథ్థు పాటులు. పోవునది భర్త యొద్దకు. అగునది ప్రథమ సమాగమము. మేను మేను కలయిక కడ్డంకు లుండరాదు. మహారసికుడు పెద్దన. అది నాజూకు తనము కూడను. ఆ గుణమునే తన కావ్య పుత్రిక

కలవరచినాడు. తండ్రిని బోలిన కూతు రయినది మనుచరిత్ర. ఆమెకు వెన్నెల వెలుగు లీను పరిమి తాలంకారములను సమకూర్చినాడు పెద్దన. కవి స్వభావము కావ్యమునందు ప్రతిబింబించు నన్నారు లాక్షణికులు. అది సత్య మయినది పెద్దన యందు. అట్టి నాగరిక ముద్రగల బాగరిగా కవితను సృష్టించుటచేతనే కవి లోకమును గెల్చి డాకాల ఘల్లు ఘల్లనఁ బెండెంబు రాయలచేత తొడిగించు కొనఁ గలిగినాడు. పెద్దనగారి ప్రతిభను ప్రకటించు పాద మిది. స్వభావోక్తియందును ఉత్ప్రేక్ష మరచి పోలేదు. అది ఆయనకు జన్మతః సిద్ధించినది. పుట్టు కవి ఆంధ్ర కవితా పితామహుడు. పెద్దన గారు వాడిన యలంకారములలో నర్థాంతర న్యాసము తరువాతిది. 'అకలంకౌషధ సత్త్వమున్' దెలియ మొదలగు పద్యము లరయునది. మరొకటి.

తండ్రీ నాకు ననుగ్రహింపఁ గదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గా నటు లాడి ధిక్కృతులఁ బో కాల్మంటి వోహో మదిన్
దీంట్రల్ గల్గిన వారి కే కరణి నేనిన్ విద్య రాకుండునే
గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కుం గష్ట ముష్టింపచా

అన్నాడు స్వరోచి బ్రహ్మమిత్రునితో. ఇందు లోకోక్తి కలదు. అబ్బుర పాటుతోడ నయనాంబుజముల్, చూచి ఝళం ఝళ త్కటక సూచిత మొదలుగా గల పద్యములందు పరిణామాలంకారము వాడ బడెను. ఇవి కాక అక్కడ క్వాచిత్కముగా నుపమ, ఉల్లేఖనము, పరికరము వాడబడినవి. ఈ యర్థాలంకారములకు తోడు కావ్యాంగన పాద మంజీర శింజా రవంబులై నాలకింప చెవులకు విందొదవించుచు వృత్త్యనుప్రాసలు యడు గడుగున శబ్దగతము లయి వినిపించును. అయిదా రాశ్వాసములలోలాటానుప్రాస ఛేకానుప్రాస పాదాది యమ కము ముక్త పదగ్రస్తము చాల యరుదుగా గలవు. ఇట్లు నాజూకు

తనముతోడ పెనుపొందిన నవ నాగరికత కల దయ్యును కృతి వెలంది యాంతరంగిక ప్రవృత్తి యందు విష్ణు భక్తియు

విశిష్టాద్వైతము

ను జనకునివలన నుండి పుణికి పుచ్చుకొనినది. అవును. కన్నవారి గుణములు సంతానమున కలవడుటలో నాశ్చర్యము లేదు. పెద్దన సర్వతో ముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీన మానసుఁడు. విశిష్టాద్వైతి. ఈ రెండు మనుచరిత్రయందు వెల్లెడలను గోచరించును. వైష్ణవము రెండు రకములు. ఆళ్వారుల పరంపరా సమాగత మయిన సంప్రదాయము. ఈ మతము నిరంతర మగు విష్ణు సేవయు విష్ణు భక్తియు బోధించును. అది మోక్ష ప్రాప్తికి సాధన మని వారి వాదన. వారికి భాగవతము విష్ణు వరాహాది పురాణములు భగద్గీత ప్రమాణములు. ఇది పౌరాణిక సంప్రదాయము. ఈ మత సంప్రదాయులు శాస్త్రీయ వాగ్వాదనలకు నిలువ లేవు. రెండవది విశిష్టాద్వైతము. ఇది రామానుజులవారు స్థాపించినది. రామానుజులు మహాపండితులు మేధావి. ప్రతిభ కలవాడు. పై నుడివిన యాళ్వారుల సంప్రదాయములకు వేదములు శాస్త్రములు బ్రహ్మసూత్రములు జోడించి పండిత సాంప్రాయ సిద్ధముగా విశిష్టాద్వైత మతము స్థాపించెను. ఈ మతమునకు వేదములు బ్రహ్మసూత్రములు ప్రమాణములు. ఒక విధముగా పూర్వోత్తర మీమాంస లంగీకరించెను. పూర్వ మీమాంస వేద కర్మావబోధక మయిన శాస్త్రము. ఉత్తర మీమాంస జ్ఞానావబోధక మయిన గ్రంథము. ఉత్తర మీమాంస బ్రహ్మ రూప గుణ రహిత మని చెప్పును. విశిష్టాద్వైతము బ్రహ్మకు రూపము ప్రతిపాదించును. అదియే విష్ణువు. ఉత్తర మీమాంస పరతత్త్వముతో జీవాత్మ ఐక్య మగుట మోక్ష మని బోధించును. విశిష్టాద్వైతము జీవాత్మ పుణ్య విశేషమున వైకుంఠమునందు విష్ణు సాలోక్య సామీప్య సారూప్య ములను బొందును. అదియే మోక్ష మని

తెలుపును. శంకరుని అద్వైతము కంటె విశిష్ట మైనది కావున విశిష్టాద్వైత మయినది. ఇది శాస్త్ర వాదమునకు నిలుచునది. పండితులు దీని నంగీకరింతురు. పెద్దన పండితుడు. విశిష్టాద్వైతము నంగీకరించెను. మనుచరిత్రయందు విష్ణు భక్తియు విశిష్టాద్వైతమును అంతర్వాహిని వోలె రస జీవముతో నైక్య పరచి ప్రవహింపచేసెను. ఈ తత్త్వము గ్రహించిన గాని మనుచరిత్ర పూర్తిగా నర్థము కాదు. ప్రకృతియైన దేహము సృష్టికి కారణ మనియు నది జీవాత్మకు మోక్షము కల్పించు నను సాంఖ్య మతము నొక విధముగా ఖండించును. ప్రకృతివలన పంచ భూతములు పుట్టు చున్నవి. పంచ భూతాత్మకము దేహము. పంచ కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు కలది. తన్మూలమున దేహమున కొదవు నానందము జీవునకు మోక్షమొసంగు నని సాంఖ్యము. ఆ మతమును ప్రతిపాదించినది మనుచరిత్ర యందు వరూథిని. దానిని ఖండించినాడు ప్రవరుడు. ప్రవరుని పాత్రయందు విశిష్టాద్వైత ప్రథమ సోపానము లగు విష్ణు భక్తియు కర్మల ప్రాముఖ్యతయు జ్ఞాన సిద్ధాంతమును ప్రతిపాదించి నాడు పెద్దన. స్వారోచిషునియందు 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేవ శరణం వ్రజ' అను తుది సిద్ధాంతమును పోషించి మోక్ష స్వరూపమును వెలయించినాడు. విష్ణువునందలి భక్తితో నిష్కామముగా కర్మ లాచరించి దేహ శుద్ధి కలవాడు కావలయును. జీవాత్మ పరమాత్మల తత్త్వ విచార మొనరించి రెంటి సంబంధములను గూర్చిన జ్ఞానము సంపాదింప వలయును. పిమ్మట సర్వ ధర్మములు పరిత్యజించి విష్ణువును నిరంతరము ధ్యాన మొనరింప వలయును. తత్ప్రసాదమున విష్ణు సారూప్యము నొంద వలయును. అదియే మోక్ష మని విశిష్టాద్వైత సారము.

ప్రవరుడు విష్ణు భక్తుడు. ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామన స్తుతి పరత్వమున లేచును. వరుణా తరంగిణియందు నఘమర్షణ స్నాన మాచరించును. సావిత్రి జపియించును. కర్మ

సాక్షి కొంగును. ఇది నిత్యకర్మ. అతడు వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడు. యజ్ఞ యాగము లొనరించిన తరు ణాగ్ని హోత్రి. అధ్వ రాగ్ని కర్మలు వేద విహిత కర్మలు. ఇవి యన్నియు ఫలాపేక్ష లేక ఈశ్వ రార్పణముగా నొనరించును. ఈశ్వరు డనగా బ్రహ్మము. విష్ణు వని భావము. కర్మాచరణకు శరీర పోషణ ముఖ్యము. శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం. ప్రవరునకు మాన్య క్షేత్రములు పెక్కు కలవు. అవి పెక్కు చందాల పండును. పాడి పంటలకు తరుగు లేదు. తల్లి దండ్రులు పార్వతీ పరమేశ్వరుల వలె నుండి యింటి పనులు చక్క పెట్టు చుందురు. భార్య అనుగుణము కలది. వానికి చీకు చింతయు లేదు. నిరంతరము అధ్యాపన తత్ప రుడయి యుండును. ప్రవరుడు శీలము కులము శమ దమములు గలవాడు. వైదిక కర్మాచరణ కవి ముఖ్యాంగములు. పౌరాణిక వైష్ణవమునందు శీలమునకు సంయమనమునకు ప్రాధాన్య మంతగా లేదు. నిరంతర మగు విష్ణు సేవ విష్ణు భక్తియు చాలును. తొండరడిప్పొడి యాళ్వారులు విప్రనారాయణుడు దేవదేవి యను వేశ్యయందు లోలు డయ్యెను. వానికి రంగడు తో డయ్యెను. వీని కథ లోక విది తము. అట్టిది విశిష్టాద్వైత మంగీకరింపదు. కావుననే శీలము శమ దమములు గల్గవాడు ప్రవరు డని సూచించినాడు పెద్దన. దీని ఫలి తమే వరూథినిని ప్రవరు డంగీకరింప కుండుట. కుల విచక్షణ లేదు పౌరాణిక మతమునందు. దానిని విశిష్టాద్వైతు లంగీకరింపరు. ఆ కారముణచేత కుల శబ్దము చేర్చినాడు పెద్దన. ప్రవరుని గుణములలో వేలిమియు సురార్చనయు విప్ర సపర్యయు వాని దైనందిన కార్య కలాపములు. ఇట్టి కర్మిష్ఠిగా చిత్రించినాడు ప్రవరుని పెద్దన. ఇది పూర్వ మీమాంస మతానుయాయుని జీవితము. పెద్దన ప్రవరు నిట్లు చిత్రించుటచేత పూర్వ మీమాంస మత మంగీకరించిన విశిష్టాద్వైతి యగుట సత్యము. కాని కర్మాచరణమువలని మోక్షము రాదు. దానివలన దేవతా ప్రీతి కలుగ వచ్చును. దేవతలు స్వాధీనులు

కావచ్చును. స్వర్గ మొసంగ వచ్చును. స్వర్గము ఫలాంత పరిమితి కలది. మోక్ష ప్రాప్తికి జ్ఞానము సాధనము. జ్ఞాన మనగా జీవాత్మ పరమాత్మల సంబంధము నెఱింగి పరతత్త్వ పరిజ్ఞానము సంపాదించుట. అది నిరంతర మగు బ్రహ్మ జిజ్ఞాసవలన గాని గలుగదు. బ్రహ్మ జిజ్ఞాస వేదములందు నుపనిషత్తులందు బ్రహ్మ సూత్రములందు కలదు. ఉత్తర మీమాంస మతము నంగీకరించినవాడు పెద్దన. కావున ప్రవరుడు కర్మ పరతంత్రు డగుటయే గాక అనార తాధ్యాపన తత్పరుండని నుడివినాడు. అందు మూలమున ప్రవరుడు వేదాదులను నేర్చి బ్రహ్మ విద్య కలవాడయి శిష్యులకు బోధ చేయు చుండుటచేత నిరంతరము బ్రహ్మ జిజ్ఞాస చేయు చుండువా డని మొదటనే సూచించి నాడు. కావుననే ప్రవరుడు కుంభ గత దీప కళిక వలె నింద్రియములు దేనియందు నేకాగ్రత కలిగి నిశ్చలత పొందుటవలని ఆనందము కలుగునో అదియే బ్రహ్మము. ఆనందో బ్రహ్మ యని వేదములు నుడువు చున్నవి. అట్టి యానందము మా కౌగిళ్ళ సుఖించుటవలన కలుగును. యజ్ఞాది కర్మల ఫలిత మదే కదా. ఇంద్రియ సుఖానందము బ్రహ్మ మని వాదించిన వరూథినికి ఈ పాండిత్యము నీకు దక్క మరి యెందేని గంటిమే. మోక్ష లక్ష్మీ పద్యాగమ సూత్ర పంక్తి కివెపో మా సంప్రదాయముల్ అని వెక్కిరించినాడు ప్రవరుడు. అతడు బ్రహ్మజ్ఞాని కావున

నీవన్న యర్థమెల్ల

నిజము కాముకుం డయిన వానికి నకాముం
డిది గణించునె జలజాక్షీ

బ్రాహ్మణుం డింద్రియ వశ గతి
జిహ్మచరణైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మానం దాధిరాజ్య పదవీ చ్యుతుండై

యని సమాధానము చెప్పెను. ఇందువలన ప్రవరుడు ఈశ్వ రార్ప ణముగా నిష్కాముడై కర్మల నాచరించు బ్రహ్మజ్ఞాని యని తేలు చున్నది. ఈ పద్యములు 'ఈ పాండిత్యము నీకు తక్క' అను పద్యము సాంఖ్య మతమును పూర్వ మీమాంస మతమును ఖండించు చున్నవి. అంతే కాదు, మత జాతి వివక్షతయు సంయమనము లేని పౌరాణిక వైష్ణవ మతమును పూర్వ పక్షము చేయు చున్నవి. ఉక్తి భక్తియ కాదు. బ్రహ్మానందాధిరాజ్య పదవికి బ్రాహ్మణత్వము నింద్రియ నిగ్రహము ప్రధానములని బోధించు చున్నవి. బ్రాహ్మణు డనుటలో నిదియే భావము. బ్రాహ్మణు డనగా బ్రహ్మజ్ఞాని యని యర్థము. బ్రహ్మ జ్ఞానము, ఇంద్రియ నిగ్రహము. బ్రహ్మానందాధిరాజ్య పదవికి సాధనములు మాత్రమే నని సూచన. బ్రహ్మత్వము పొందుటకు కాదు. బ్రహ్మత్వము మోక్షము. దానిని పొందుటకు జ్ఞాని యయి బ్రహ్మను గూర్చి ధ్యాన మొనరింప వలయును. అది విశిష్టాద్వైత ములో తరువాతి మెట్టు. ఇందు మూలమున జ్ఞానము మోక్షోపాది యను ఉత్తర మీమాంస మతము ఖండింప బడినది. జీవాత్మ పరమాత్మల సంబంధము పరమాత్మ స్వరూప తత్త్వములు తెలిసి కొనుట జ్ఞానము. అదే బ్రహ్మ విద్య. పరమాత్మ తత్త్వమును తెలిసికొని నంత మాత్రమున మోక్షము రాదు. తత్ప్రసాద సిద్ధికి ధ్యానము భక్తితో చేయ వలయును. అన్ని ధర్మములు విడిచి ఆ పరమాత్మయందు నిశ్చల మగు భక్తి వహించి యేకాగ్రత కలవాడయి స్వారోచిషుని వలె తప మాచరింప వలయును.

విశిష్టాద్వైతమునందు పరతత్త్వము విష్ణువు. అతడు లక్ష్మి సమేతుడయి వైకుంఠమునం దుండును. విష్ణు వనాద్యుడు. అనంతుడు. అచ్యుతుడు. సర్వ వ్యాపి. ప్రకృతికంటె ముందున్నవాడు. వాని రూపము 'నీల మేఘము డాలు డీలు సేయఁగఁ జాలు' నను పద్యమునందు వర్ణింపఁ బడినది. అతడు మొదట ఏకాకి. నేను బహు రూపములను తాల్చెద నని తలంచెను. పంచ భూతములు,

దేవతలు మాన వాదులుగా నయ్యేను. కావున తనకు సాక్షాత్కరించిన విష్ణువును స్వారోచిషుడు

అవ్యయానంద విశ్వాత్మక విశ్వేశ
బ్రహ్మవు నీవ కపర్ది వీవ
యింద్రుండ వీవ వహ్నివి యనిలుఁడ వీవ
వరుణుండ వీవ భాస్కరుఁడ వీవ
యముఁడ వీవ వసూత్కరము నీవే రుద్రులు
నీవ యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోం
కృతి వషట్కృతి శ్రుతి స్మృతులు నీవ

వేద్య మీవ యీ వచ్చిన విబుధ గణము
సర్వమును నీవ యెట్లన్న సర్వ గతుఁడ
వగుట మఱి నీవు గాని వాఁ డనఁగ నెవ్వఁ
డరయఁగను శేష భూత సమస్త శేషి

యని నుతించెను. అతఁడు దశావతార పురుషుడు. వాని యవతారము లన్నియు పెద్దన స్వారోచిచేత నుడివించెను. అట్టి పరమాత్మ యగు విష్ణువును జ్ఞానముచే నెరింగి సర్వ ధర్మ పరిత్యాగ మాచరించి భక్తితో మనన ధ్యాన తపములచేత సాక్షాత్కరింప చేసికొనవలయును. వాని ప్రసాదమును పొంద వలెను. అట్టి జీవి దేహాంతమున వైకుంఠము చేరి విష్ణు సారూప్య పదము పొందును. అది అవ్యయానంద పదము. అదియే మోక్షము. వాని కింక జనన మరణాదులు లేవు. తనకు సాక్షాత్కరించిన హరిని స్వారోచిషుడు

దవ భవద్దాస్య సుఖం
బే వేఁడెద దయకుఁ దగుదునే సాలోక్యం
బీవే యితరము లొల్లన్

అని యర్థించెను. అదియే విశిష్టాద్వైతమునకు తుది మెట్టు. ఇట్లుత్తమోత్తమ మయిన విశిష్టాద్వైతమును శృంగార రసోపేత మగు జీవముగా ప్రతిపాదించి మనుచరిత్రను తన ప్రతిభా విశేషముచేత నుపజ్ఞతచేతను మహాకావ్యముగా నొనరించెను. పెద్దన ఆది యగు వైష్ణవ కవి. అతడు వైష్ణవ వాఙ్మయమునకు తెనుగునం దాది కావ్యకర్త. లోకోత్తర కవితా చాతుర్యము కలవాడు. రసికుడు. మాట చతురత కలవాడు. పండితుఁడు. సకలవేదాంత వేత్త. విశిష్టాద్వైతి. వానికి నా యభివాదములు.



౬

# శ్రీ కృ ష్ణ దే వ రా య లు

విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన వారిలో శ్రీకృష్ణ దేవరాయల వంటి మహారాజింకొకడు లేడు. ఆయన క్రీ. శ. 1509 మొదలుకొని 1530 వ సంవత్సరము వరకు రాజ్య పరిపాలనము గావించెను. ఆయన కాలమునందు తెలుగు దేశము సర్వ విధముల మహోన్నత స్థితి ననుభవించినది. రాయ లప్రతిమాన పరాక్రమ ధురంధరుడు. అభిమాన ఘనుడు. దేశ మన్నను దేశ భాష యన్నను వానికి ప్రాణ తుల్యములు. రణావని విజృంభించి నరపతుల నోడించెను. గజపతుల జయించెను. అశ్వపతుల గెలిచెను. మూరు రాయర గండపెండేరమును కాల దొడిగించు కొనెను. రాయలు బహు భాషా పండితుడు. సంస్కృతము తెలుగు కన్నడము భాషలు వానికి కరత లామలకములు. అందు సంస్కృ తాంధ్రములు వాని కభిమాన భాషలు. సంస్కృతమునందు మదాలస చరిత్ర, సత్యా వధూ ప్రీణనము, సకల కథా సార సంగ్రహము, జ్ఞాన చింతామణి, రస మంజరి మొదలగు పెక్కు కావ్యములు రచించెను. విశేషించి తెలుగు భాష యనినను తెలుగు కవిత్వ మనినను వానికి మహో త్సవము. మనస్సునందు మురిసి ముప్పందు మగు చుండును. కవులను పిలిపించి కవితలు వినుచుండును. వారిని బహు విధముల సత్కరించి సంతోషించు చుండును. అది వాని కొక వినోదము. ఆనందము. ఆయన కాలమునందు ధనార్థియై పేద పడిన కవి గాని కోవి దుడు గాని గాయకుడు గాని లేడు. దేశ దేశముల నుండి వచ్చి విద్యానగరమున సుఖముగా కాలము గడుపు చుండిరి. రాయలు చేయని దానములు పండితు లందుకొనని పారితోషికములు లేవు. సాహితీ సరస్వతి రవ్వలు పొదిగిన పైడి గజ్జెల గిలుకు టందియలు

ధరించి ఝుణం ఝు ణారవములతో కావ్య నాటక ప్రబంధములను తాళ మాన గతుల నాట్య మాడినది రాయల సభా భవనమునందు. గాన కళా దేవత రహి పుట్ట జంత్ర గాత్రముల గాంధర్వంబు నెరపి రా ల్గరగించినది. పండితుల శాస్త్ర వాదములకు పరిమితి లేదు. దేవేంద్రుని సభా వైభవమును మరపించినది రాయల సభ యని చరిత్రలు నుడువు చున్నవి.

ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల
శరదిందు ముఖులు చామరము లిడఁగఁ
బణిన సూను కణాద బాదరాయణ సూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వ భూమి నభీరు భట కదంబ కరాళ
హేతి చ్ఛటా చ్ఛాయ నిరులు కొనఁగ
సామంత మండ నోద్దామ మాణి క్యాంశు
మండలం బొలసి యీరెండ గాయ

మూరు రాయర గండ పెండార మణి మ
రీచి రింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంక పాళి నట ద్దుకూ లాంచలములు
చిత్ర మాంజిష్ఠ విభ్రమ శ్రీ వహింప

రాయలు భద్రాసనముపై నిండు కొలు వుండును. మొదట రాచ కార్యములు. తరువాత కవితా గోష్ఠి. ఆయన కొలువునందు ఎనిమిది మంది మహాకవులు గలరు. వారు దిగ్గంతుల వంటివారు. శాస్త్ర వేత్తలు. సాహితీ సామ్రాజ్య చక్రవర్తులు. రస సిద్ధులు.వారిలో ముగ్గురు తెలుగు కవులు. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, ధూర్జటి. మిగిలిన వారు సంస్కృత కన్నడ భాషా కవులు. వారిలో అనుష్టుపు కవి యొకడు. ఎంతటి భావము నయిన నొక్క యనుష్టుపు శ్లోకములో నమర్చ గల శక్తి వానికి గలదు. వానికి అనుష్టుపు కవి యని రాయలు

బిరుద మొసంగెను. వీరితో రాయ లనుదినము కొంత కాలము వినోదముగా గడుపు చుండును. వారిలో పెద్దనగా రనిన రాయలవారి కధిక ప్రీతి, గౌరవము. వీరు కాక భట్టుమూర్తి, పింగళి సూరన, తెనాలి రామ కృష్ణుడు మొదలగువారు కలరని

కట్టు కధలు

పెక్కు ప్రచారమునం దున్నవి. భట్టు మూర్తి వసు చరిత్రమును రచియించెను. దానిని 'శ్రీ భూ పుత్రి వివాహ వేళ' అను పద్యముతో మొదలు పెట్టెను. శ్రీ తరువాత నున్న భూ వాయు బీజము. వసు చరిత్రమును రాయల సభయందు వినిపించుట కారంభించెను. అపుడు తెనాలి రామ కృష్ణుడు రాయల సభయం దుండెనట. ఇసుకను అరచేతిలో పోసికొని శ్రీ యను అక్షరము వ్రాసెనట. దానిని భూ యని యెగర నూదెనట. మహారాజా! ఈ కృతిని అంకితము తీసికొనినచో విద్యా సంపద లన్నియు నిట్లే ఎగిరి పోవు నని నుడివెనట. రాయలు భయపడి వసుచరిత్రమును కృతి గైకొనుటకు అంగీకరింప లేదట. రాయలు సాహితీ వేత్త. కృత్యాదియందలి శ్రీ కారము సకల దోషములను హరించు నని ఆయన యెరుంగక పోలేదు. రాయలు ఒక నాడు సభయం దుండి స్తుత మతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీ యతులిత మాధురీ మహిమ అను సమస్యను ఒసంగినాడట. పెద్ద నాదులు మిన్న కుండిరి. రామ కృష్ణ కవి దానిని పూర్తి చేయుటకు మహారాజును గడు వడిగెను. రెండవ రోజున రాయలు మరల నా సమస్య నొసంగెనట. రామకృష్ణ కవి దానిని పూర్తి చేసెనట. మరొక కథ. ఒక సారి రాయలవారు మనుచరిత్ర వసుచరిత్ర పారిజాతాపహరణములం దే కావ్య మెట్లు న్నది అని ప్రశ్నించిరట రామ కృష్ణ కవిని. రామ కృష్ణకవి అల్లసాని పెద్దన ఆవురు మని యేడ్చినాడు. ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా నేడ్చినాడు. భట్టు మూర్తి బావురు మని యేడ్చినా డని సమా

ఖ్యానము చెప్పినాడట. మూడు కావ్యములందు నాయికా విలాపములు కలవు. ఆ సాకు తీసికొని కావ్య కవితను రామకృష్ణుడు పరిహాసించినాడు. రాయలు రసజ్ఞుడు. కవితా మాధుర్యము గ్రహింప గలవాడు. ఉభయ భాషా పండితుడు. తెనాలి రామకృష్ణుని అడుగ వలసి నంత పని రాయలకు పట్టదు. అడిగిన పండితు లన్యోన్య మత్సరులు. నిజము తేల దని యీ మహారా జెరుంగును. కావున రామకృష్ణు నడిగె నను మాట యబద్ధము. ఇట్టి కథల కంతు లేదు. ఇవి యన్నియు కల్పితములు. అష్ట దిగ్గజములను పేరుతో నా యీ కవులకు సంబంధములు కుదుర్చుటకే యిట్టి కథలు పుట్టినవి. వీనిని నమ్మి సారస్వత చరిత్ర వ్రాసినచో నంతయు దలక్రిం దగును. ఈ కవుల కొకరితో నొకరికి సంబంధము లేదు. ప్రజలకు కవుల మీద గల యభిమానాసూయ లిట్టి కథలకు కారణములు. ప్రథలు నట్టివే. పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు వాణి నా రాణి యని చాటించు కొనినాడట. తాను చే యెత్తి నమస్కరించు తల్లి యగు వాగ్దేవత నిల్లాలని ప్రచారము కావించుకొను మూర్ఖు డుండడు. పుట్టించినవారు పుట్టించినను పినవీర భద్రుడు బ్రహ్మ మూర్త్యంతర మనిన నమ్మువా రుండరు. వాణి జైమిని భారతమును స్వయముగా నొక్క రాత్రిలో విరచించినదట. ఆ మాటయే నిజ మయిన, పెద్దనాదుల కవిత నింకెవరు వ్రాసి రన వలయును. పినవీరనలో పెద్దనలో నున్న కవితా మాధుర్యము లేదు. గ్రంథమును విమర్శించు నపుడు సత్యమును పరిశీలింప వలయును. పక్షపాతము అసూయ విద్వేషములు పనికిరావు. నన్నయ రాజ పురోహితుడు. ఆయన కవిత వ్రాయుట యేమిటి. నారాయణ భట్టు భారతము వ్రాసెను. ధనార్థియై రాజాదరముకొరకు నన్నయ పేరు పెట్టెను. నన్నయ రాజుచేత నగ్రహార మిప్పించెను అని వాదించినవా రున్నారు. నన్నయ వంటి నిస్వార్థ పరుని మీద యీ యపవాదు. ఆయనకొరకు రాజు నొక్క యగ్రహార మడగ లేదు. ఆయన యీయ లేదు. అంత కంటె నింకొక మెట్టధిరోహించి నియోగులే కవిత నింత వరకు.

వ్రాయుచు వచ్చిరి. పౌరోహిత్యము చేసికొను వైదికి కావ్యము వ్రాయుట యేమిటి. అందు నాది కావ్యమా! నన్నయ నియోగియై యుండ వలయు ననినవా రున్నారు. కవిత దేవతా ప్రసాదము. ఆమె యనుగ్రహ మెవరి మీద నున్నదో వారి కది లభించును. కుమ్మరి మొల్ల రామాయణము వ్రాసినది. ముద్దు పళని రాధికా సాంత్వనము వ్రాసినది. వారి కవిత మృదు మధురమయి రసవంతముగా నుండును. ఇవన్నియు నోటి వాడి తనముచేత పలుకు మాటలు. విమర్శకులకు తగవు. ఇంక క్రొత్తలు నిర్మింప బోయి కాగితము చెరుచు ప్రతిభావంతుల మాట ముచ్చటింప వలసిన పని లేదు.

రాయ లాంధ్ర భోజుడు. భోజ మహారాజు ధారా నగరాధినేత. పరాక్రమవంతుడు. సంస్కృత పండితుడు. కవి. రామాయణ చంపువును రచించెను. రాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముడు. ఉభయ భాషా కావ్య రచనా సమర్థుడు. ఐదారు గ్రంథములను రెండు భాషలయందు వ్రాసెను. భోజుని యాస్థానమునం దెనిమిది మంది మహాకవులు గలరు. వారందరు సంస్కృత భాషా కోవిదులు. రాయల సభయం దష్ట దిగ్గజములను పండిత కవులు గలరు. వారిలో ముగ్గురు తెనుగు కవులు. మిగిలినవారు సంస్కృత కన్నడ భాషా కవులు. భోజుడు కాళిదాసును మిగుల మన్నించెను. రాయలు పెద్దనను అధికముగా గౌరవించెను. కావున రాయల కాంధ్ర భోజుడను పేరు సమంజసము. రాయలు ధైర్య స్థైర్యములు గల భూనేత. తనతో పాటు వేటలకు యుద్ధములకు కవులను వెంబడి కొనిపోవు చుండును. వినోదముగా వారితో గోష్ఠి సలుపు చుండును. యుద్ధ మనిన రాయల కొక బాల్య క్రీడ. వాని కత్తి నిరంతరము విజయ సాధక మయిన సాధనము. రాయలకు తెను గనిన మహా ప్రీతి. దానిలో నమృతము నందలి తీపి యున్నది. వెన్నయందలి మృదుత్వ మున్నది. పూల

యందలి కోమలత్వ మున్నది. పైడిలోని మెఱుంగులు వెలయించు నవక మున్నది. దక్షిణ దేశభాషలను పరిశోధించి దేశ భాషలందుఁ దెలుగు లెస్స యని నిర్ణయించిన మహారాజకవి కృష్ణరాయలు. ఆంగ్లేయులు తరువాత తెలుగును లాటిన్ ఆఫ్ ది యీస్ట్ అని తెలిసికొనిరి. లాటిన్ పాశ్చాత్య భాషలలో నతి మనోహార మగు భాష. అజంత మయినది. తెనుగు ప్రాచ్య దేశములలో హృద యాహ్లాదకర మయినది. అజంతము. నన్నయ తీర్పులు దిద్ది తెనుగున కుత్త మాకారము కల్పించెను. ప్రస్తుత నవనాగరికులు కురూపిని గావించుచున్నారు. బాగుచేయువా డొకడు. పాడుచేయువాడొకడు. రాయలవారుకత్తి పట్టి కదనరంగమునం దరాతి వీరుల కుత్తుక లుత్తరించిన కరముతో పైడి గంటము నందుకొని

ఆముక్త మాల్యద

యను మహాకావ్యము రచించెను. అది నవ రస భావాలంకార శోభితము. అందు అలసాని పెద్దన పద్యములు కొన్ని పీఠికయందు కలవు. మనుచరిత్రలోని పద్యముల వంటి పద్యములును గలవు. అందు మూలమున విష్ణుచిత్తీయము పెద్దన కృత మని విమర్శకుల వాదము. సందర్భము, పరిశీలించి చక్కగా నాలోచించినచో రాయలవారి పీఠికయం దా పద్యములను ఎందుకు వాడిరో తెలియును. ఆంధ్ర విష్ణువు స్వప్నమునందు సాక్షాత్కరించినాడు రాయల వారికి. విష్ణుచిత్తీయము వ్రాయ మని యాన తిచ్చినాడు. మరునా డా సంగతి పండిత మండలి కెరిగించినాడు రాయలవారు. ఆపండితులలో పెద్దనాదులుండిరి. పెద్దన యనని రాయల కెక్కడ లేని గౌరవము గలదు. గౌరవమే కాదు రాయల యొక ప్రాణము పెద్దన. అతడు విశిష్టాద్వైతి. అందరికంటె గొప్ప కవి యని రాయల యెన్నిక. అది నిజము. అప్పటికే పెద్దన మనుచరిత్ర వ్రాసెను. పెద్దనయు మిగిలిన పండితులతో పాటు తన యంగీకారము సూచించెను. అది అందరికంటె

రాయలకు శిరో ధార్యము. పండితులు రాయల వంశ వర్ణన గావించిరి. అందు పెద్దనయు గలడు. ఆయనయం దున్న యభిమానము కొలంది మనుచరిత్రలోని పద్యములను పెద్దనగారి యంగీకారము తాను పొంది గ్రంథ రచన గావించితి నని లోకమునకు సూచించుటకు గ్రహించెను. పెద్దనగారియందలి గురుత్వ మటు వంటిది. లేనిచో రాయల వంటి సార్వభౌముడు పుర మేగ పెద్దనగారి పల్లకి తన కేలఁ బట్టి యెత్తునా? పెద్దనను కవితా గురువుగా రాయలు పాటించెను. వాని పద్యములు తన గ్రంథమునం దుండుట ప్రసాద మనుకొనెను. ఆయన యనుమతిని బొంది పీఠికయందు నెక్కించు కొనెను. అది ఆయన కానంద కర మయినది. ఇంక మనుచరిత్రలోని పద్యములను బోలిన పద్యములు విష్ణుచిత్తీయమం దున్న వందురు. పూర్వ కవుల పోకడలు భావములు తరువాతి కవులయం దుండుట లోకమున సామాన్య మగు విషయము. తిక్కన నన్నెచోడు ననుకరించెను. పెద్దన నన్నయ శ్రీనాథుల ననుకరించెను. మనుచరిత్ర ముందు వ్రాయబడినది. అది సర్వోత్తమ మైన కావ్యము. ఆ కావ్య మనిన మిగుల యిష్టము రాయలకు. అందలి పద్యములను బోలిన పద్యములు విష్ణుచిత్తీయమందు వ్రాసెను. అంత మాత్రముచేత విష్ణుచిత్తీయము పెద్దన వ్రాసి రాయల పేరు పెట్టె ననుట పొరపాటు. రాయలు పండితుడు, కవి, యాలంకారికుడు. క్షాత్ర తేజము కలవాడు. ఆత్మాభిమాని. పరుల కావ్యములకు తన పేరు పెట్టించుకొను నంతటి నైచ్యమునకు లోబడు స్వభావము కలవాడు కాడు.

రాయలు విష్ణు భక్తుడు. వైష్ణవ మతావలంబకుడు. తిరుపతి వేంక టేశ్వర చరణా రాధన తత్పరుడు. అట్లయ్యును ఇతర వీర వైష్ణవుల వలె శివుని గాని శివ భక్తులను గాని ద్వేషించ లేదు. పట్టాభిషేక సమయమున విరూపాక్షునకు ధనాగ్రహార దానములు గావించెను. తన యాస్థానమునందు వీర శైవుడైన ధూర్జటికి తావు నొసంగెను. మిగుల గౌరవించెను. వాని కవిత ప్రశంసించెను. రాయలవారు సర్వ

మత సహనము గలవాడు. బౌద్ధులను తురకలను సమానముగా నితర మతస్థులతో పాటు గౌరవించెను. అది రాజ లక్షణము. కావుననే రాయలంతటి మహారాజు లే డని ప్రశంసల నొందెను. అల్లసాని పెద్దన పురాణము నందలి కథను గ్రహించి కావ్యముగా రచించెను. పూర్వ కవు లందరు చేసిన పని యదే. అందు నూతనత్వము లేదు. కథా కావ్య సరణులందు నూతన పద్ధతుల ననుసరించినవారు వీర శైవ కవులు. వారికి మతాభిమానము మెండు. ఆవేశ మధికము. వారి చూపు నూతన మార్గములకొరకు వెదకు చుండును. తెనుగు సారస్వతమునందు క్రొత్త దారులుతీసినవారు వీర శైవ కవులు. దేశీయ చ్ఛంద మగు ద్విపదలో కావ్యములు మొదట వ్రాసినవారు వీర శైవ కవులు. తరువాత కవులు వారి ననుసరించిరి. పాల్కురికి సోమనాథుడు మహామేధావి, ప్రతిభావంతుడు. తెనుగు కావ్య రచనకు మలుపు త్రిప్పిన వ్యుత్పన్న మతి. పండితుడు. పండితారాధ్య చరిత్ర బసవ పురాణము రచించెను. అవి పురాణ కథలు కావు. మత ప్రవక్త లగు మహాపురుషుల కథలు. అట్టి కథలు ప్రబంధించినవా రంతవరకు నెవరు లేరు. అవి ద్విపదయందు వ్రాయబడినవి. ద్విపదలకు కావ్య స్వరూప మాపాదించినవాడు సోమనాథుడు. శ్రీనాథుడు చరిత్రాంశ మితి వృత్తముగా తీసికొని పలనాటి వీర చరిత్ర ద్విపదగా వ్రాసెను. అది వినూతనము. మత ప్రచారముకొఱకు మొదట ప్రబంధింప బడిన పండితారాధ్య చరిత్ర బసవపురాణాది సోమనా థాదుల ద్విపద కావ్యములు తెనుగు సారస్వతమునందు వివిధ విధ రచనలకు దారి తీసినవి. ప్రతి దేశమునందును మతముతో వాఙ్మయ మారంభించును. క్రమ క్రమముగా దృక్పథము కాలమును బట్టి మారును. వివిధ మార్గ ముల ననుసరించును. సంస్కృత వాఙ్మయము వేదములతో నారంభించి నది. పురాణములు గాను కావ్యములు గాను నాటకములు గాను పరిణ మించినది. సమ యానుగతముగా శృంగార వీర రసాకరము లయిన సాంఘిక చారిత్రక ప్రబంధములు రూపొందినవి. ప్రతి వాఙ్మయమునకు

మతము పునాది రాయి. దాని పయిన వివిధ ప్రబంధ సౌధములు నిర్మింప బడును. ద్రవిడ వాఙ్మయమునకు ఆళ్వారుల పాశురములు మూలములు. వానిని ద్రవిడ ప్రబంధము లనియు ద్రవిడ వేదము లనియు నందురు. అవి విష్ణు స్తవములు, గాథలు. వానిని రచించిన వారు వైష్ణవ మత ప్రవక్తలు. వారి పాశురముల నాధారమున ద్రవిడ సారస్వత మభివృద్ధి నొందినది. పాశురమనగా పాట యని యర్థము. మాలదాసరి పాడిన దా పాశురము. ఆళ్వారులలో పెరియాళ్వారు ఆండాళ్లు సుప్రసిద్ధులు. పెరియాళ్వారు అనగా పెద్ద భక్తు డని యర్థము. అతడే విష్ణుచిత్తుడు. ఆయన కూతు రాండాళ్లు గోదాదేవి. ఆండాళ్లు ముప్పది రెండు పాశురములు విష్ణువుపై చెప్పినది. గోపికలు శ్రీకృష్ణుని వలె శ్రీరంగములోని విష్ణువును భక్తితో సేవించినది. వరించి వివాహ మాడినది. ఆమె నాచ్యార్మొడి యను ప్రబంధమును కూడ వ్రాసెను. అందు రంగభర్త తనకు స్వప్నమునం దగుపించి పరిణయ మాడిన కథ వర్ణించినది. ఆమె పూర్వ జన్మయందు సత్యభామ. భూదేవి యవతారము. వీరిరువురి కథలు విష్ణుచిత్తీయమునందు కలవు. వానికి యామునాచార్యుని కథ తోడుచేయ బడినది. రాయలు ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము చండాల బ్రహ్మరక్ష స్సంవాదాది పౌరాణిక కథలు మత కర్తల కథలతో పొందు పరచి ప్రబంధమునకు క్రొత్త రూపము కల్పించెను. మత కర్తల కథలను ప్రబంధములుగా వ్రాయుటకు దారి చూపినవారు వీర శైవ కవులు. దానిని చూచి రాయ లీ విష్ణుచిత్తీయమును వ్రాసెను. తెనుగు సారస్వత చరిత్రము నందు వైష్ణవ వాఙ్మయమున కాది కర్త అల్లసాని పెద్దన. ఆది కర్తయే కాదు ఆది కవియు పెద్దన యనియే చెప్పవలయును.

స్వారోచిషుడు విష్ణువును గురించి తపము అకామతః చిరతరం బాచరించెను. హరి ప్రత్యక్ష మయ్యెను. వరము వేడు మనెను. స్వారోచిషుడు

దేవ భవద్దాస్య సుఖం
బే వేఁడెద దయకుఁ దగుదునే సాలోక్యం
బీవే యితరము లొల్లన్

అన్నాడు. ఇది వైష్ణవ సంప్రదాయము. సాలోక్య సాన్నిధ్య సారూప్యములు పుణ్య విశేషములను బట్టి భక్తులకు లభించు నని విశిష్టాద్వైత మతము. సాయుజ్యము అద్వైతము. విష్ణు భక్తుడు మరణానంతరము వైకుంఠము చేరి విష్ణువునకు సపర్యలు చేయుచు విష్ణు సన్నిధానమున నుండునని వైష్ణవము బోధించు చున్నది. స్వారోచిషుని నోట పై విధముగా బలికించుటచేత పెద్దనగారి వైష్ణవ మత తత్త్వము వెల్లడి యగు చున్నది. వైష్ణవము భక్తిని, బోధించును. జ్ఞానాదులతో సంబంధము లేదు. దానికి కుల విచక్షణ లేదు. భక్తి వినా శాస్త్రాదిక జ్ఞానము నిత్య నైమిత్తిక వైదిక కర్మలు నిరుపయోగములు. భక్తి యున్నచో నేదియు నక్కరలేదు. అదియే గీత చరమ శ్లోకము బోధించు చున్నది అని వారి వాదము.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

ఇది భక్తి లక్షణము.

తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం

బను నవి భక్తి మార్గములు. భక్తి రెండు విధములు. దాస భక్తి, మధుర భక్తి. దాసత్వము నర్థించినవాడు స్వారోచిషుడు. ఇది వైష్ణవ సంప్రదాయము. కావున పెద్దన వైష్ణవుడు. ఎవరు కాదన లేరు. అతడు హరి భక్తుడు. తన విష్ణు భక్తి ప్రవరుని ముఖమున ప్రదర్శించెను. 'వామనస్తుతి పరత్వమున లేచి, హా శ్రీహరీ యంచున్ బ్రాహ్మణు డోర మోమిడి' యిత్యాదు లరయునది. పెద్దనగారి

వైష్ణవము వంశ పరంపరాగతముకాదు. అంగీకృత వైష్ణవము. అదియు పౌరాణికము కాదు. పౌరాణిక వైష్ణవమునకు వైదిక కర్మలతో పని లేదు. భక్తి ప్రధానము. పెద్దన మహాపండితుడు. మొదట అద్వైతి. పూర్వోత్తర మీమాంసలను సంపూర్ణముగా పఠించి యనుభవము నకు తెచ్చుకొనినవాడు. నిష్కామ కర్మవలన ఆత్మ శుద్ధి లభించి పరతత్వమును గుర్తించిన జ్ఞానోదయము కలుగు నని ఆయన మతము. ఇది భాట్ట శాంకర మతముల సమ్మేళనము. నిష్కామ కర్మవలని ఆత్మ శుద్ధి లభించి మోక్షము పొందునని కుమారిల భట్టు. కర్మ స్వర్గ సుఖదాయి. మోక్ష మొసంగదు. బ్రహ్మజిజ్ఞాసవలన జ్ఞానముకలుగును. దానివలనమోక్షము లభించునని శంకర గురు పాదులు. అందుకనే అథాతో బ్రహ్మ జిజ్ఞాస యను సూత్రముతో నుత్తర మీమాంస నారంభించెను. ఇద్దరి సమ్మేళనము పెద్దన మతము. మూడవది రామానుజము. మోక్ష మనగా శంకరమతమున జనన మరణ విరహిత మయిన బ్రహ్మ సాయుజ్యము. రామాను జాచార్యులవారి మతమున మోక్ష మనగా జనన విరహిత మయిన విష్ణు సారూ ప్యము. కావున పరబ్రహ్మకు రూపము కల్పించినారు రామానుజుల వారు. పరబ్రహ్మకు రూపము లేదు శంకర మతమునందు. ఇదే శంకర రామానుజుల మత తారతమ్యము. అందు మూలమున అది అద్వైత మయినది. ఇది విశిష్టాద్వైత మయినది. దీనికిని వేదము ప్రమాణము. పౌరాణిక వైష్ణవమునకు పురాణములు ప్రమాణములు. వేదము లంగీకరించిన విశిష్టాద్వైతము వేద కర్మలంగీకరించినది. కావున పెద్దన గారు ప్రవరుని నిష్కామ పరుడగు నాహితాగ్నిగా సృష్టించినాడు. స్వారోచిషుడు అకామత చిరతర తపం బాచరించె నని నుడివెను పెద్దన నిష్కామ కర్మ నంగీకరించె ననుట నిర్వివాదాంశము. త్రయీ ధర్మములందు ఆయనకు ప్రామాణ్యత యున్నది. ఆనందో బ్రహ్మ యటన్న ప్రాచదు వంతర్బుద్ధి నూహింపుమా యన్నది వరూథిని. దాని కామె కూర్చిన విపరీ తార్థము ఖండించినాడు ప్రవరుడు.

ఆ ఖండన పెద్దనగారి యభిప్రాయము. నిష్కామ కర్మాచరణచేత ఆత్మ పరిశుద్ధి నొంది బ్రహ్మ జ్ఞానము బడయు ననియు నందు మూలమున విష్ణు సాలోక్యమును పొంది వైకుంఠమున పరతత్త్వ మగు నారికి శాశ్వతముగా సేవ లొనరించు చుండునని పెద్దనగారి మతము. అదియే మనుచరిత్రలో నిరూపించెను. ఇది యథ్రము చేసికొనినగాని మనుచరిత్ర పూర్తిగా అర్థము కాదు. పెద్దన ఉపనిష ద్విదుడు. మత త్రయముల నవగాహన చేసికొనినవాడు. ఒక ప్రత్యేకాభిప్రాయము కలవాడు. అతడు విశిష్టాద్వైతి. మనుచరిత్ర వేదాంత గ్రంథము. సంస్కృతములోని శుక రంభా సంవాద కావ్యమును దృష్టియందుంచుకొని వరూథినీ ప్రవరుల సంభాషణ పెద్దనగారు రచించిరి. శ్రీకృష్ణ దేవరాయలు వీర వైష్ణవుడు. వైష్ణవ మత ప్రచారముకొరకు విష్ణుచిత్తీయము రచించెను. వైష్ణవులు దానిని మత గ్రంథముగా భావింతురు. అందు పౌరాణిక వైష్ణవ తత్త్వ మభివర్ణింపబడినది. విష్ణుచిత్తుని కథ, మాలదాసుని కథ, గోదాదేవి వృత్తాంతము పౌరాణిక భక్తి సంప్రదాయములకు తార్కాణములు. అందలి విశేషము లాయా తావులందు చర్చింప బడును. విష్ణుచిత్తీయము ఆరాశ్వాసముల మహాకావ్యము. మొత్తము 873 పద్యముల గ్రంథము. ఇందు శ్రీరంగేశుడు నాయకుడు. గోదాదేవి నాయిక. రసము శృంగారము. శాంత వీరములు అంగము. ఇందలి శృంగారమునకు మిగిలిన కావ్యములందలి శృంగారమునకు భేదమున్నది. ఇందలి శృంగారము రంగశాయియందలి భక్తి సమ్మిళిత మయినది. దీనిని వైష్ణవము నందు మధుర భక్తి యందురు. విష్ణుచిత్తునిది దాస భక్తి. మనుచరిత్ర మందు శృంగార శాంతములు నాయికా నాయకులందు విభిన్న రూపముల ప్రదర్శింప బడినది. విష్ణుచిత్తీయమునందు శృంగార శాంతములు (మధురభక్తి) నాయికయగు నొక్క గోదాదేవియందు పొందు కూర్చి నిరూపింప బడినది. ఇది భాగవత తత్త్వము. దశమ స్కంధము నందు గోపికలలో గోచరించినది.

శ్రీకృష్ణ దేవరాయలు తిరుమల వేంకటేశ్వర పాద జలజ సేవాసక్త మానసుడు. విష్ణుచిత్తీయమును వేంకటేశ్వర స్వామికి నమస్కారముతో నారంభించెను. ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖం అనుటచే నమస్కారముతో కృతి నారంభించుట సమ్మతము.

తరువాత వైష్ణవ సంప్రదాయమును పురస్కరించుకొని విష్ణు పాదసేవకులయిన ఆదిశేషువు గరుత్మంతుడు విష్వక్సేనుడు మొదలగు వారిని గ్రంథారంభమున వినుతించెను. హరి యాయుధము లగు సుదర్శన పాంచజన్య కౌమోదకి శార్ఙ్గములను నందకమును తలంచెను. పిమ్మట సన్నిద్ధ రాళ్వారులను ప్రస్తుతించెను. వీరందరు వైష్ణవులకు పూజనీయులు. వీరిని గ్రంథాదియందు వినుతించి భావి వైష్ణవ కవుల కావ్యారంభమునకు దారి చూపినవాడు రాయలవారు. ఇట్లు కావ్యము నారంభించినవారు పూర్వ కవులలో నెవరు లేరు. నన్నయ మొదలుకొని రాయలవారి వరకుగల కవులందరు మూర్తి త్రయమును వారి యిల్లాండ్రను వినుతించిరి. పెద్దన వైష్ణవు డయిన నట్లే కావించెను. శ్రీకృష్ణరాయలు శివాదులను తన కృతియందు తలంప లేదు. రాళ్వుల విధానము ననుసరించి వైజయంతీ విలాస కర్త యగు సారంగు తమ్మయ ఇష్టదేవతా స్తవము గావించి యాది శేషువు మొదలగు వారిని యథారీతిగా వినుతించెను. తమ్మయ వైష్ణవుడు. వైజయంతీ విలాసము తొండరప్పొడి యాళ్వారుల కథ. దానినే విప్రనారాయణ చరిత్ర యందురు. రాయలు విష్ణుచిత్తీయము వ్రాసి వైష్ణవ వాఙ్మయమునకు పునాది వేసెను. వైష్ణవ సంప్రదాయము, మతము, కావ్యలోకమున నెలకొల్పెను. రఘునాథరా యాదులగు వైష్ణవ కవులు వాని ననుసరించిరి. రాయలు కళింగదేశ విజిగీషా మనీషన్ దండెత్తిపోయెను. మధ్య విజయవాటికయందు గొన్ని దినము లుండెను. శ్రీకా

కుళ నికేతనుం డగు నాంధ్ర మధుమథనుని సేవింప నరిగెను. ఆ నాడు హరివాసరము. ఆ నాడుపవసించెను. ఆ రేయి చతుర్థ యామంబున ఆంధ్ర విష్ణువు రాయలకు కలయం దగుపించెను. గోదాదేవి కథను వ్రాయ మని యాన తిచ్చెను. దానిని తిరుమల విభున కంకిత మిమ్మని నుడివెను. దీనిని బట్టి యీ కావ్యము కళింగ విజయము తరువాత వ్రాయ నారంభించి పూర్తి చేసి యుండును. మనుచరిత్రయందు కళింగ విజయము పేర్కొనబడినది. కావున మనుచరిత్రయు కళింగ విజయానంతరము రాయలు కృతి నొందెను. దాని తరువాత విష్ణు చిత్తీయము రాయలు రచించెను. అందుకనే మనుచరిత్రయం దలి పద్యముల పోకడలు విష్ణుచిత్తీయమం దున్నవి. రాయలు విష్ణు చిత్తీయము కథను విలుబుత్తూరు వర్ణనతో నారంభించెను. రాయలు సార్వభౌముడు. సర్వ స్వతంత్రుడు. రాజ్య పరిపాలనమునందు వలెనే కావ్య రచనయందును నిరంకుశత్వము నెరపెను. ఆయన స్వతంత్ర భావములు కలవాడు. పరుల దారుల ననుసరించుట రాయలకు నచ్చని పని. పరులకు నతి గొనరించుట తన రాజసమునకు వెలియగు పని. అతడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు. కవుల యాచారము ననుసరించి కావ్యాదియందు సంస్కృతాంధ్ర కవులలో నెవరిని తలంప లేదు. కుకవి నిందఁ జేయ లేదు. పర నింద మహాపాప మని యా మహారాజెరుంగును. కావ్యాదియందు పాప మొనరించుట తగని పని. ఆత్మ స్తుతి పర నింద తగనివి. కావుననే రాయలు పండిత మండలిచేత తన వంశ కథను చెప్పించెను. అందు తన పరాక్రమాభినుతియు కలదు. దీనిని చూచి రఘునాథ నాయకుడు మొదలగు తంజావూరు రాజకవులు ముద్దు పళని తమ స్వప్న వృత్తాంతములను పండిత మండలి కెరిగించి వారివలన తమ వంశ కథలను చెప్పించు కొనినారు. ప్రబంధ కవు లందరు పుర వర్ణ నానంతరము నాల్గు జాతుల వారిని వర్ణించుట యలవాటు. అట్టిది విష్ణుచిత్తీయమునందు గాన

రాదు. విలుబుత్తూరునందలి తోటలు వీథులు మేడలు వేశ్యలు ద్రావిడాంగనలు మొదలగువానిని ఇరువది యారు పద్యములలో వర్ణించెను. రాయలు లోకానుభవము కలవాడు. దక్షిణముగా దిగ్విజయ యాత్ర సాగించెను. ద్రవిడ దేశమునందలి ప్రకృతి సౌంధర్యమును మనసార ననుభవించెను. ఇంటింట ముంగిళులందు పెరుగు నారికేళ తరువుల సింగారమును

కోరకిత నారికేళ
క్ష్మారుహములు రత్న కుట్టిమంబులఁ దోచున్
ద్వారముల యత్న కృత శృం
గారంబుగ నలికి ముగ్గు ఘటియించి రనన్

రాయలవారి యూహలు చాల చక్కనివి. భావములు స్వభావ సిద్ధములు. కాని యతిశయోక్తులు ఉత్ప్రేక్షలు వానికి కావ్య స్వరూపమును కల్పించు చుండును. అలంకారము లేని పద్యము వర్ణనాంశములందు ఒక్కటియు నుండదు. వానిని అర్థము చేసికొనుటకు కొంచెము ప్రరిశ్రమ కలిగించి నను అలంకారముల నవల నుంచి యసలు భావములు గ్రహించినచో నందు సహజత్వ ముండును. రాయల లోకానుభవమున కానందము కలుగు. మహారాజులు నిరంత. రాంతః పుర నివాసులు. వారికీ యనుభవ ముండునా యనిపించును.. రఘు నాథ నాయకుని రామాయణమునందు నిట్టి వింతయే గోచరించును. పండితుల సంవాదములు రెడ్ల కొలువులు భోజన పంక్తులందు వడ్డ నలు నరయునది. వానియందు నింతటి యలంకార సామగ్రి తక్కువ. నన్నెచోడుడు రాజు. ఆయన కుమార సంభవములో ప్రబంధ లక్షణ ములే గాని సహజ లక్షణములు కానిపించవు. పై పద్యమునందు ముంగిళులందు పడిన కోరకిత నారికేళ తరువుల నీడలు అలికి ముగ్గుదు పెట్టిన ట్లున్నవట. నీడలు నల్లగా నుండును. కావున వాకిళు లలికి నట్లున్న వనుట సమంజసము. ముగ్గులు తెల్లగా నుండును. ఆ తెలు

పెక్కుడ దనినచో పూత పట్టిన నారికేళములని సమాధానము. పూతలు తెల్లని నీడల నిచ్చునా యని సందేహింప వచ్చును. ఆ కారణము చేత అవి రత్న కుట్టిమము లని సమర్థింప బడినవి. రత్నములందు కోరకములు తెల్లగాను ఆకులు నల్లగాను ప్రతిబింబించును. అందు కని యీ కల్పన. ఉత్ప్రేక్ష చక్కగా కుదిరినది. మహాకవులు మట్టి వాకిళులను మాణిక్యపు వాకిళులు చేయ గలరు. అవన్నియు నతిశయోక్తులు. వానిని తొలిగించినచో కొబ్బరిచెట్ల నీడలతో వాకిళులు చల్లగా నుండు నని తేలును. ద్రవిడ దేశములో ప్రతి యింటి ముందు చల్లని నీడల నిచ్చుచు కొబ్బరి చెట్లుండును. రాయలవారు వానిని చూచి యిట్లు వర్ణించిరి. ఇది స్వానుభవము రాయలవారికి. విలుబుత్తూరు ద్రవిడ దేశములోనిది. ఇంతకంటె

తల పక్షచ్ఛటఁ గుక్కి బాతువులు కేదారంపు గుల్మాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నాత ప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటుల న్నవిఁ దదావాసంబు జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱు వానిఁ గని నవ్వున్ శాలి గోప్యోఘముల్

రాయలు రాజ్య పరిపాలనా విధానమునం దతి జాగరూకత కల వాడు. తన సేవకుల ప్రవర్తనము నరయుటకు మారు వేషములతో తిరుగు చుండెడివాడు. అట్టి సంచారములం దిట్టి సంఘటనము వాటిల్లి యుండును. దానిని కావ్య గతము గావించెను. రాయలు దేని నయినను నిశితముగా పరిశీలించును. బాతులు తలను పక్షము లందు గ్రుక్కుకొని నిద్రించుట స్వభావము. ఇది స్వభావోక్తి. అప్పుడవి తెల్లగా నుతికి నీటిని పిండి పెట్టిన వస్త్రముల వలె నుండును. ఆరెకులు వానిని చూచి యుపస్నాత ప్రయాతు లయిన ద్విజావళి శాటువులని భ్రాంతి పడుటయు సహజము. ఇది భ్రాంతిమ దలంకారము. ఆరెకుల యవివేకమునకు శాలి పాలికాంగనలు నవ్వుట ప్రసిద్ధముగా జరుగు సంగతి. ఇందు హాస్య రస మున్నది. ఆరెకుల యుచిత

వర్తనము రాయలకు వారి యెడ గల విశ్వాస మిందు ప్రదర్శిత మయినది. రాయల దృష్టి తరువాత వేశ్యల పయి బడినది. వారిని నాలుగు పద్యములో సహజముగా వర్ణించెను. అన్నిటికంటె ద్రవిడాంగనల వర్ణన చెప్పుకొన తగినది. వారి యాచార వ్యవహార సంప్రదాయము లా పద్యములు చదవగానె మనోగతము లగును.

శయ పూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ జన్దోయి లేఁగానుపై
దయఁ దప్పన్ బస పాడి పాగడపుఁ బాదం బొప్పఁ జెంగల్వ డి
గ్గియ నీర చ్యుత మజ్జ నార్థము కటిం గీలించి దివ్య ప్రబం
ధ యుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులో త్రోవలన్

ద్రవిడ దేశము వైష్ణవమునకు పుట్టిల్లు. ఆళ్వారు లందరు ద్రవిడ దేశము లోనివారు. వారి ప్రబంధము లన్నియూ ద్రవిడ భాషయం దున్నవి. అవి వైష్ణవులకు వేదముల వంటివి. వాని నింటింట పఠింతురు. ఆలయములందు పాడుదురు. వైష్ణవుల కందరి కవి కంఠస్థములయి యుండును. ద్రవిడ స్త్రీలు పసపుతో జలకమాడి చెంగల్వ డిగ్గియలందలి కమలములు హరి పూజార్థము కోసికొని నీటి బిందెలు నడుమునం దాల్చి ద్రవిడ ప్రబంధములు చదువుచు పూదోటలలో నుండి నడిచి పోవు చుందురట. అవును వైష్ణవ యువతులు గోదాదేవి రచించిన ప్రబంధములలోని పాశరములు మడి కట్టుకొని పాడుకొను చుందురు. శ్రీరంగము మొదలగు వైష్ణవ క్షేత్రములం దెవరి నోట నుండి వినినను దివ్య ప్రబంధ ముల గానము వినిపించును. రాయలవా రా గాన మాధురి కబ్బుర పోయి యుందురు. వారి యాచార సంప్రదాయము లా మహారాజు నాకర్షించినవి. ఆ భక్తియు నంతటి దని యొప్పుకొనక తప్పదు. మన దేశములం దా భక్తి కనిపించదు. రాయలవా రందుకనే వారి యలవాటు కావ్యగతము గావించెను. ద్రవిడాంగనలు పసపు రాచు కొని స్నానము చేయుదురు. ఎంత ధనికు లయినను ముత్తైదువలకు

నాటను నేటను పసు పనిన యంత ప్రీతి గౌరవము. అది లేనిది స్నానము చేయరు. పసుపు కుంకుమలు వారికి లక్ష్మీ ప్రదములని భావన. అది చూచినాడు రాయలవారు. పద్యములోనికిపట్టించినాడు ద్రవిడ దేశంపు కైదువుల పసుపు స్నానము.

ద్రవిడ కుటుంబినుల్పసపు రాచిన రత్నపుఁ దాప క్రింద నం
బువు దెరవాఱఁగా నిదుర వోయి గరుత్తతి పచ్చఁ బాఱినన్
భవన సరో మరాళములు భర్మమయ చ్ఛద గుచ్ఛ విస్ఫుర
ద్దివిజ ధునీ మరాళి వితతి భ్రమఁ బూన్చఁ బురి భ్రమించుచున్

రాయంచల ఱెక్కలు సైతము పచ్చ బడు నంత పసపు స్నానమున కుపయోగింతురు ద్రవిడ కుటుంబినులు. పసిమి ఱెక్కలతో మందాకినిలోని మరాళము లని అవి భ్రాంతి కలిగించుచు విలుబుత్తూరునందు తిరుగుచుండునట. భ్రాంతి మదాలంకారము. 'కుటుంబినులు' ఎంత గౌరవ పదము. రాయలవారి శీలమును ప్రకటించును. సంసార స్త్రీలపై రాయలకు గల గౌరవ మర్యాదలు ప్రదర్శితము లగుచున్నవి. 'ద్రోణునితో శిబిరం బడక ద్రోణ కుటుంబిని యున్న దింట' అనిపించినాడు పోతన్నగారు ద్రౌపదిచేత. కుటుంబిని శబ్దమునందు గౌరవ మర్యాదలుపొందుపడినవి. ద్రౌపదికి ద్రోణ కుటుంబినియందు గల గౌరవ మర్యాలు లెట్టివో రాయలయని ద్రవిడ కుటుంబినిలో నున్నవి. అవును. రాయలను పెంచినది తిమ్మరుసు. రాజుల కుండవలసిన లక్షణము లన్నియు తీర్చి దిద్దినాడు రాయలందు. ఆదర్శ ప్రభువుగా మలచినాడు. కావుననే ఉత్తమశీలము గల పురుషు డయినాడు రాయలవారు.

కన్ను దోయికి నన్య కాంత లడ్డం బైన
మాతృ భావము చేసి మరలు వాఁడు

అన్నాడు పోతనగారు. రాయలవా రట్టివాడు. ఆ విష్ణు భక్తి ఆ పరాక్రమము ఆ నిగ్రహము వినయము వాని నొక విశిష్ట వ్యక్తిగా

నొనరించినవి. రాయలు విష్ణుచిత్తీయమునందు వెలయించిన సాంఘిక ప్రవృత్తి మరే యితర కావ్యములందు నగుపించదు. వాని వర్ణన లన్నియు నా కాలమునందలి సంఘ మర్యాదలను ఆచారములను మనో వృత్తులను పాఠకులకు దలంపునకు తెచ్చుచుండును. పెద్దన పూర్వోత్తర మీమాంసలయందు పండితుడు. శఠకోప యతికి శిష్యుడయి విశిష్టాద్వైత సారమును గ్రోలెను. కావున వాని దృష్టి వేద విదులయిన ఆహితాగ్ని కుటుంబముల వైపు మరలినది. తన మనుచరిత్రయం దా సంఘములోని ఆహితాగ్ని కుటుంబముల ఆచార వ్యవహారములను మనోవృత్తులను చిత్రించినాడు. రాయలవారు మహారాజు. జనరంజన మాయన వృత్తి. కావున ఆయన భావము లన్నియు సంఘములోని సామాన్య జన సముదాయము మీద మరలినవి. వాని వర్ణన లన్నియు వాని ననుసరించి యుండును. వాని వైష్ణవ తత్త్వము దాని కనుగుణముగా పౌరాణిక మయినది. మనుచరిత్ర విష్ణుచిత్తీయములు తెనుగు సారస్వతమునందు రెండమూల్య రత్నములు. పదునారవ శతాబ్దమునందలి విజయనగర సామ్రాజ్యములోని సాంఘిక ప్రవృత్తులను వైష్ణవ మత తత్త్వములను ప్రకటించు చుండును. పండితారాధ్య చరిత్ర బసవ పురాణము సాంఘిక కావ్యములనుటలో సందేహము లేదు. వానియందు సంఘము మీర శైవ సాంప్రదాయములు వర్ణింపబడినవి. విష్ణుచిత్తీయములో నిరూపింప బడి నంత విరివిగా సాంఘిక ప్రవృత్తి వానియందు కానబడదు. రాయలు ప్రతి విషయము విపులముగా వర్ణించెను. విలుబుత్తూరునందు భగవ ద్భక్తులు గలరు.

> ఎదు రేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి
> నారికేళ కటాసనముల నునిచి
> నునుఁ బోఁక పొత్తిఁ గుట్టిన దొప్ప గమితోడ
> రంభా విశాల పర్ణములు పఱచి

శాల్యన్న సూపాజ్య కుల్యా బహు వ్యంజ
న క్షీర దధు లర్పణంబుఁ జేసి
వార్చిన పిదప సంవాహన మంఘ్రుల
కొనరిచి తాంబూల మొసఁగి కుశల

మడిగి పోయెద మన్న దవ్వనిచి సిరికిఁ
దగిన సత్కృతిఁ జేసి ఖేదమున మగిడి
యర్చఁ గావింతు రెపుడు నిట్లతిథు లైన
భాగవతులకు నప్పురి భాగవతులు

మనుచరిత్రయం దల్లసాని పెద్దన రచించిన

తీర్థ సంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేగు దవ్వంత యైన

అను పద్యమును మనస్సునం దుంచుకొని రాయలవారు పై పద్యమును రచించిరి. ఇరువురు రెండు పద్యముల నొకటే విధముగా నారంభించిరి. ఐనను చాల తారతమ్య మున్నది. పెద్దన ఆతిథ్యము లోని యారంభ దశ వర్ణించెను. పిమ్మట ఇష్టాన్న సంతృప్తులుగా జేయు నని యొక్క మాటలో ముగించెను. రాయలవారు భోజనాదికము నుండి చివరి దాక వర్ణించెను. పెద్దన యాతిథ్యము అద్వైత సంప్రదాయము. రాయల యాతిథ్యము ద్రవిడ వైష్ణవ సంప్రదాయము. వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండ వత్ప్రణమే ద్భువి. సాష్టాంగ దండప్రణామ మాచరించుట సంవాహన మంఘ్రుల కొనరించుట వారి యాచారములు. రాయలవారి సీసములోని గీతము నందు వాడిన క్త్వార్థక క్రియల క్రమములో తారుమారు లున్నవి.

అందుండుం ద్వయ సద్మ పద్మ వదనుం డద్వంద్వుఁ డశ్రాంత యో
గాండూ బద్ధ మధుద్విష ద్ద్విరదుఁ డన్వర్థాభిధానుం డురు
ఛందో బృంద తదంత వాగపరనా సంజాత తజ్జన్య ని
ష్పంద ద్వైత సుసంవి దాలయుఁడు విష్ణ్వాస్యుచిత్తుం డిలన్

ఇది విష్ణుచిత్తుని వర్ణన. విష్ణువును చిత్తమునందు కలవాడు విష్ణుచిత్తుడు. అత డన్వర్థాభిధానుఁడు. ఈ పద్యము మనుచరిత్రలోని ఆ పురిఁ బాయకుండు నను పద్యమును బోలినది. ఇందలి సమాసము లన్నియు విష్ణుచిత్తునకు విశేషణములు. మనుచరిత్రలోని పద్యమునందు వాడిన సమాసములు ప్రవరునికి విశేషణములు. మనుచరిత్రలోని పదముల కూర్పులో నున్న మార్దవము దీనియందు లేదు. పదములలో పారుష్యము లేక పోయినను శయ్య నున్నని గులకరాళ్ళ మీద నడక వలె నున్నది. పెద్దన్నగారి పద్యములోని సమాసము లన్నియు తూకము తూచి నట్లు సమానముగా నున్నవి. రాయల పద్యములోని సమాసములం దెగిడి దిగిడి తనము కలదు. కావున పద్య మంతయు నొక్క విధముగా నడవలేదు. పెద్దనగారి పద్యంపు టెత్తుగడయు దింపుగడయు బిగువు సడలక మనోహరముగా నుండును. రాయలవారి నిష్ఠ న్విష్ణుచిత్తుం డిలన్ అను నపుడు పేలవ మయి దింపుగడ తేలి పోయినది. ఇట్లు శయ్యయందే కాక పద జాలమునందును చాల తారతమ్య మున్నది. వానిని బాగుగా పరిశీలించినవా రెవరు విష్ణుచిత్తీయము పెద్దన వ్రాసిన దనరు. విష్ణుచిత్తుడు న్యాయార్జిత విత్తంబున నిరంతరముగా వైష్ణ వావలికెల్ల నన్నంబు పెట్టు చుండును.

> ఆ నిష్ఠానిధి గేహ సీమ నడు. రే యాలించినన్ మ్రోయు నెం
> తే నాగేంద్ర శయాను పుణ్య కథలుం దివ్య ప్రబంధానుసం
> ధాన ధ్వానము నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
> పో నాస్త్రోదన సౌష్టవం చ కృపయా భోక్తవ్య మన్మాటలున్

ఈ పద్యము వండ నలయదు వేవురు వచ్చిరేని యను మనుచరిత్రలోని పద్యమును జ్ఞాపకము తెచ్చుచున్నది. ఇది ఒక విధముగా దానికి వివరణము. పెద్దన దేనిని వర్ణించినను క్లుప్తముగా నుడివి విడిచి పెట్టును. రాయలవారు దేనిని విపులముగా తుది వరకు వివర్ణింపక

విడువడు. భావము లెన్ని తోచిన నన్నియు పద్య గతములు గావించును. ఋతువున కొక్క పద్యము చొప్పున విష్ణుచిత్తుని భాగవత పూజ వర్ణించెను. ఆ పద్యములు చదువు నపుడు రాయలవారి లోక పరిజ్ఞానమున కాశ్చర్య మొదవును. ఏ ఋతువునం దే భోజన పదార్థము లుచితములో వానికి తెలిసిన ట్లితరులకు తెలియవు. కావ్య కవులలో నిట్లు వర్ణించినవా రింకొకరు కానరారు. రఘునాథ నాయకాభ్యుదయమునందు రాజుల యింటి భోజన మొకటి విపులముగా వర్ణింప బడినది. అది తలంపునకు వారి నపుడు మహారాజుల వైభవము కన్నులకు కట్టి నటుల కనిపించును. అట్టి వైశద్యము రాయల వర్ణనలలో నున్నది. దానికి కారణము స్వానుభవము. రాయల వర్ణన లన్నియు చూచి యనుభవించి వ్రాసినవి. ఇంతటితో ప్రథమాశ్వాసము ముగియును. మధురా పుర వర్ణనతో ద్వితీయాశ్వాసమారంభమగును. దానిని ముప్పది యెనిమిది పద్యములలో రాయల వారు వర్ణించిరి. అందు కోట పరిఘ కరులు హరులు పుష్పలావికలు చాతుర్వర్ణములవారు పణ్యాంగనలు వర్ణింప బడిరి. రాయలవారు తంజావూరు మధుర మండలములను జయించి స్వాధీనము గావించుకొనిరి. ఆ మహారాజు నిగూఢ సంచారములందు పుష్పలావికలు విటుల తోడి సంభాషణలను విని యుండును. వారి ప్రశ్నోత్తర సంభాష ణాదులు నాలుగు పద్యములలో వర్ణించెను. మచ్చునకు

వెలది యీ నీ దండ వెల యెంత నా దండ
కును వెలఁ బెట్ట నెవ్వని తరంబు
కలువ తావులు గాన మలి కదంబక వేణి
కలువ తావులు వాడకయ కలుగునె
కడివోదు నా కిమ్ము పడఁతి యీ గేదంగి
నన కడివోమి ముందరికిఁ జూడు
జాతు లేవంబు జేక్షణ పన్నినులు నైత
మును సున్న యెడ జాతు లునికి యరుదె

యనుచుఁ దొలి నుడి నభిలాష లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మ గర్భంబుగాఁగ
నుత్తరము పల్లవ శ్రేణి కొసఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున

పుష్పలావికల సరస సల్లాపములు మనుచరిత్ర యందు లేవు. రాయలవారు సాహితీ సమరాంగణ సార్వభౌము డని ప్రతీతి. పుష్పలావికలను గురించి వ్రాసిన నాల్గు పద్యములు చదివి చక్కగా అర్థము చేసికొనిన వారికి రాయలు రసిక సార్వభౌము డనియు మాట చతురత కలవా డని కూడ తోచును. అచ్చ తెనుగు పదములకు వాడుక పదములకు శ్లేష కల్పించిన నేర్పరి. దండ, తావులు, వాడకయ మొదలగునవి అరయునది. అట్టి వైదుష్యత తరువాతి కవులలో భట్టుమూర్తికి కలదు. 'అని వెన్క ముందర లరయని కుమారులు, మొదలగు పద్యము లరయ వచ్చును. తంజావూరు కవులలో ముద్దు పళని కా నిపుణత యున్నది. పై పద్యమునందు వ్యాజోక్తి యలంకారము

సరసుల నర్మ మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ
గరఁగుటఁ జెల్వు దృక్తరళ కాంతులు నుత్తర మిచ్చు నంత రాం
తరముల నవ్వులు న్గలువ తండము మొల్లలు నంచు మిన్న గ్రు
చ్చి రహిని రిత్త నూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్

ఎంత రమణీయ మగు భావము. పుష్పలావికల చూపులు కలువల వలె విశాలము లయిన వనియు నవ్వు మొల్ల పూల వలె తెల్లగా నుండు ననియు వర్ణితములు. రాయలవారి పరిశీలన శక్తి చాల తీవ్ర మయినది. పుష్పలావికలు విటుల మాటలకు

మోవిఁ జెఱం గిడి యాఁగ నవ్వు
కంట నిగుడ విరు ల్నాన్చు కరణిఁ జల్లు
పసపు జలంబె జాణల మరులు కొల్పు

నట. ఈ భావము చెయ్యిము నూహ కందునది కాదు. పూల యంగడి యందు చూచి వ్రాసినది. రాయలు చాల ఘటికుడు. ఇట్టి వెన్నియో మారు వేషములతో పోయి పరిశీలించి వచ్చుచుండును. వానికి కావ్యరూప మొసంగును. మోవిని చెఱం గిడి నవ్వు కాన రాకుండ నాపుకొనుట స్త్రీలకు సహజము. అప్పుడా నగవు కనుల నుండి తెలి నిగ్గులతో కనిపించును. ఇది స్వభావోక్తి. తమ యానందమును విరుల నాన్చు మిషను విటులపై జలము చల్లి వెలి బుచ్చిరట పుష్పలావికలు. ఇది కైతాపహ్నుతి. విలుబుత్తూరులో ద్రవిడ కుటుంబినుల పైన ప్రసరించిన రాయల చూపు తెల్లవారి పూల జడల విప్పుకొను చున్న వేశ్యల మీాదుగా పయనించి మధురలోని పుష్పలావికల మీాద వ్రాలినది. ఆ యా యువతుల చేష్టలు స్వభావములు సహజముగా వర్ణించినాడు. రాయలవా రలంకార ప్రియుడు. ప్రతి వర్ణనకు నలంకారములు సంతరించి కావ్యరూపము పొసగించినాడు. రాయలు విష్ణుచిత్తీయమునందు వాడి నన్ని యలంకారములు మరే యితర కావ్యములం దెవరు వాడి యుండలేదు. మధురా పురమున కథినాయకుడు మత్స్యధ్వజుడు. అత డిందు కులావతంసుడు.

పాటీర గిరి వనీ వాటిఁ గ్రీడించియు
నహి భయం బెఱుఁగఁ డావంత యైన
నత్యంత మిత భావ నవికత్థనుం డయ్యుఁ
బరులఁ గేరడమున భంగ పఱచుఁ
బ్రీతిఁ దాఁ దానుప్రవర్ణికి నాథుఁ డయ్యును
సద్గోష్ఠిచే ననంజనత మెలఁగు
మహనీయ మహిమఁ దా మధు రాస్పదుం డయ్యు
లావణ్య కలన నుల్లాస మొందు

విషధి లహరి భిదోత్పత త్ప్రవత జటిల
వల దురు క్రమ తిమి వర వాల పతన
తులిత పర బల కరి శిర స్స్థల సముత్థ
బహుళ ముక్తా విము క్తాసి పాతుఁ డతఁడు.

ఈ పద్యమునందు రాయలువారు తన ఘనతను మత్స్యధ్వజుని వర్ణన మూలనమున వెలయించు కొనెను. రాయలు ధీరోదాత్తుడు. ధీరోదాత్తునకు అవికత్థనత్వము సహజ గుణము. అతడు మితభాషి. అయినను ఇతరులను పరిహాసముల చేత భంగ పరచును. దీనికి పుష్ప లావికల వర్ణనము, యామునాచార్యుని కథలో మధురాధిపతి వర్ణ నము, గోదాదేవి చెలులతోడి సంభాషణము తార్కాణములు. అతడు మధుం మండలము జయించెను. లావణ్యము కలవాడు. మహో ల్లాసి. మధుర శబ్దమునకు తీపి మధురా నగరము అని అర్థములు. లావణ్య శబ్దమునకు కాంతి, యుప్పు అని అర్థములు. అతడు మహా పరాక్రమశాలి. పర బలము లందలి ఏనుగుల కుంభ స్థలములను పగుల గొట్టినవాడు. అతడు అహి భయము లేనివాడు. రాయలవారు గారుడ మంత్రోపాసన కలవాడయి యుండ వలయును. సీసములోని మొదటి పాదము వలనను, వేట కొరకు వన వాటికలందు క్రీడించు చుండును గావునను అహి భయము లేకుండుటకు ఆ మంత్రము నుపదేశము పొంది యుండ వచ్చును. దుష్ట భుజంగా హితుండికుండు అని అలసాని పెద్దన రాయలను వర్ణించెను. అందీభావము అంత రత మయిన దేమో యని నా యూహ. తామ్రపర్ణి యొక నది. అందుండి ముత్యాలు జన్మించు నని ప్రతీతి. అది దక్షిణమున నున్నది. గోకర్ణ క్షేత్రము దాని తీరమందు కలదు. దక్షిణ దిగ్వి జయము సాధించిన రాయలవారి కది యేలుబడి లోనిది. కావున దాని కధినాథుడు రాయలు. ఆయన పండిత కవుల గోష్ఠియందు నిరంతరము

నుండువాడు. ఇట్టి రాయల గుణములు విష్ణుచిత్తీయమునందును వాని జీవిత కథాంశములందును గోచరించు చున్నవి.

రాయలవారి పాండిత్య ప్రకర్షకీ పద్య మొక నిదర్శనము. విరోధాభాసాలంకారము. కవి పాండిత్య ప్రదర్శనమునకు ఒరిపిడి రాయి. దానిని కావ్యములందు సామాన్యులగు కవులు వాడరు. రాయలు నిరాఘాటముగా నీ పద్యమునం దుపయోగించెను. అందును సందర్భోచితము లగు భావములతో పద్యమును రమణీయముగా కూర్చెను. పెద్దనగారి సమాసముల కూర్పునకు రాయలవారి సమాసముల కూర్పునకు హస్తి మశ కాంతర మున్నది. ఆ రచనలోని మార్దవము లయాభిహిత మగు పదముల సంపుటీ కరణ మిందు గానరాదు. సమాసంపు నడకలో కుదిలింపులు మెండుగా నుండును. పై గీత పద్యమును పరిశీలించునది. గ్రీష్మ ఋతు వేతెంచినది. అష్టాదశ వర్ణనలో ఋతు వర్ణన మొకటి కావ్యములం దుండ వలయు నని లక్షణ వేత్తల మతము. రాయలవారు గ్రీష్మ ఋతువును కరువు తీర నిరువది యెనిమిది పద్యములలో వర్ణించెను. అందుండి ఒక పద్యము

అట్టి వేసవి బెడిదంపు వెట్ట కతన
హస్తము సెమర్ప సారెకు లస్తకంబు
దిసికిలఁగఁ గాదె నవరింప వసము గాక
పుష్పబాణుని చెఱకువి ల్పుడమిఁ బడియె

నట. భూమి మీద చెఱకు పండె నని యుత్ప్రేక్షించినాడు. ఇట్టి వింత భావములు గల పద్యములు గ్రీష్మ ఋతు వర్ణనమునందు కలవు. పద్యమున కొక వింత భావము. భావమున కొక యలంకారము. ఋతు వర్ణన మంతయు నట్లు నడచినది. రాయలకు ఊహాలు మెండు. పుట్టిన యూహా లన్నియు పట్టించ వలయు నని తలంచుట కావ్యాంగనకు తల కంటకిం పనక తప్పదు. పాఠకులకు

విసుగు పాటు. రస ప్రస్రుతికి కథా వాహిని కది యడ్డు పాటు. సంస్కృత కావ్యములం దున్న లోప మిదియే. అందును వచన కావ్యముల సంగతి చెప్ప నక్కర లేదు. వర్ణనలు కథను మ్రింగి వేయ రాదు. విష్ణుచిత్తీయమునందు కథారంభము నుండి నూట యేబది పద్యములు నడచినవి. అన్నియు వర్ణనలే. కథ సున్న. ఒక్క కావ్యమునందు తన పాండిత్య మంతయు రాశీభూతము చేసి లోకము నకు ప్రదర్శింప వలయు నని కవి తలంప రాదు. పలు విధముల పలు కావ్యములందు పలు రకములుగా మలచి లోకమునకు వెలయించు టలో ఘనత యున్నది. కాళిదాసు కథ కొరకు కుమార సంభవము రచించెను. వర్ణన కొరకు మేఘ సందేశమును వ్రాసెను. ప్రకృతి ప్రదర్శనము కొరకు ఋతు సంహారము రచించెను. విభిన్న కావ్యము లందు తన ప్రతిభను విభిన్న రూపముల వెలయించెను. ఆ కారణము ననే వాని కావ్యములందు కవిత విభిన్న మూర్తులతో నాకర్షించును. విష్ణుచిత్తీయము సకల సుగంధ ద్రవ్యములు కలయ కూర్చి చక్కని పాకమున ఘృత శర్క రాదికములు మెదిపి వినూతన విధానమున తయారు చేసిన చక్ర పొంగలి. దూర దూరముల వరకు పచ్చకర్పూ రము కుంకుమ పువ్వు ఏలకీ లవంగాదుల సువాసనలు పరిమళించు చుండును. ఆస పడి చే చాచి యందుకొని యొక కబళము తిను నప్పటికి ఘాటు భరింప లేక వెగటు తోచును. మొగమోట పడి మరి కొంత నోటి కందిచ్చినచో బైటికి వెళ్ళుకొని వచ్చును. జీర్ణించు కొన జాలక సామాన్యుడు మొగము మొత్తి విడిచి పెట్టి పోవును. అది సాహితీ సార్వభౌముల గడసరి పోకడలలోని పాకము. దానిని భుజించి జీర్ణించు కొన గల వారు సాహితీ సార్వభౌములు కావల యును. పండితులు శాస్త్ర విదులు వేదాంతులు కావలయును. కావు ననే మధ్య రకములవారు విష్ణుచిత్తీయము జోలికి పోరు. వసు చరిత్ర నైన వశము చేసికొన వచ్చును గాని విష్ణుచిత్తీయము చిత్త గతము కావించుకొనుట చాల కష్టము. అది సకలాలంకార శోభిత మయిన

వైష్ణవ మత వేదాంత గ్రంథము

కథ గురు పరంపరా ప్రభావము లోనిది. తెనుగునందు విష్ణు చిత్తీయము వైష్ణవులకు పూజనీయము. కాని తమిళములో గురు పరంపరా ప్రభావమునందున్న మనోహరత మార్దవము రస వత్తత విష్ణుచిత్తీయమునందు లేదని నా వైష్ణవ మిత్రులు చెప్పగా విను చుందును. వారప్పుడప్పుడు నాకు కొన్ని పద్యములు వినిపింతురు. అర్థ తాత్పర్యముల నుడువుదురు. రస మయులయి ఆనందాశ్రువుల విడుతురు. అందు మనస్సును కరిగించు భక్తి భావములు కలవు. గురు పరంపరా ప్రభావము భక్తిని పురస్కరించు కొని కథాంశములు ప్రధానముగా వ్రాయబడిన గ్రంథము. కావున నది హృదయాహ్లాద కరములుగా నుండును. విష్ణుచిత్తీయము మహాకావ్యము. కావ్య లక్షణముల ననుసరించి వర్ణనలతో వ్రాయ బడినది. ఆ వర్ణనలు అలంకార శోభితములు. కావున కొంచెము చదువు నపుడు పాఠకు నకు సహనము నుత్సాహము నుండ వలయును.

మధురా నగరమునకు సమీపమున వృషగిరి కలదు. అందు సుందరబాహు స్వామి ఆలయము కలదు. ఆ స్వామికి వేసవి కాలమునందు తెప్ప తిరునాళ్ళు జరుగును. ఆ యుత్సవము దర్శించు టకు వాడ వాడల నుండి జనులు వచ్చుచుందురు. ఒక విదేశి బ్రాహ్మణుడు ఆ యుత్సవమును దర్శించెను. మగిడి తన పురమున కరుగుచు మధురా నగరమును చూడ నేతెంచెను. అది వెన్నెల రేయి. రాజ పురోహితు నింట

పరిపక్వ సురభి రంభా ఫలంబులతోడ
దల మెక్కు పనస పెందొనలతోడ
ఘృత పిండ నిభ కర్కరీ ఖండములతోడఁ
బలు తెఱంగుల మావి పండ్లతోడ

గో స్తనీ మృదు గుళుచ్ఛ స్తోమములతోడఁ
గప్పు లేరిన వడ ప్రప్పుతోడ
సుమధుర స్థూల దాడిమ బీజములతోడఁ
దనుపారు రసదాడి గనెలతోడఁ

బానకం బతిథుల కిడ్డఁ దానుఁ గ్రోలి
యర్చనా దత్త చందన చర్చఁ దేలి
విరులు సిగఁ దాల్చి కర్పూర వీటెఁ జౌరు
గొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టు గాయ

ఇది వైష్ణవుల యింటి యాతిథ్యము. రాజ పురోహితుడు వైష్ణవు డని చెప్పకయే చెప్పు చున్నది. విష్ణువు మహాభోగి. శృంగార పురుషుడు. సిరిగలవాడు. వాని భక్తులా దేవుని సకల సుగంధములతో నర్చింతురు. ఫల భక్ష్య పరమాన్నముల నారగింప నిడుదురు. వాని ప్రసాదము తా మారగింతురు. పూజిత కుసుమ మాల్యములను తలఁ దాల్తురు. కర్పూర వీటి సేవింతురు. తమతో పాటు నింటికి వచ్చిన యతిథులకు సమర్పింతురు. ఇది వైష్ణవ మర్యాద. రాయల కాలము నందలి జనుల వైభవము వారి యతిథి మర్యాదయు నీ పద్యము చాటు చున్నది. మనుచరిత్ర విష్ణుచిత్తీయములను జోడించి పరిశీలించినచో పదునారవ శతాబ్దమునందు పేదరికము వలన తిండికి లేక బాధ పడిన మానవు డున్నటుల తోచదు. దేశము ధనవంత మయి సకల సుఖము లనుభవించి యుండె నని తోచును. విష్ణు చిత్తుని యింటి యాతిథ్యము రాజ పురోహితు నింటి యాదరము రాయల కాలమునందలి భోజన విధానములను తెల్పు చున్నవి. అప్పటి ప్రజల భోజ నానుభవములు అనన్య సామాన్యములు. విదేశ యాత్రికులు విజయ నగర రాజ్య వైభవమును వేనోళ్ళ వర్ణించిరి. వారి వర్ణనయు కావ్య గతము లయిన యీ పద్యములను చదివినవారు ఆ నాటి దేశ సౌభాగ్యమును గుర్తించక లేక పోరు.

కెలకుల నున్న తంగెటి జున్ను గృహమేధి
యజమాను డంక స్థితార్థ పేటి

అను పద్యమును బట్టి తీర్థ యాత్రా పరులకు సంసారులు వివిధ విధముల నుపకరించు చుండెడివా రని తెలు చున్నది. కావున నే కాలి నడకతో కాశి గయాదుల దర్శించి సురక్షితముగా తిరిగి ఇంటికి వచ్చు చుండెడివారు. ఆ కాలమునందలి ప్రజల సాంఘిక ప్రవృత్తి యన్యోన్య సహకార సంపత్తియు నంత ప్రశంసింప తగిన దయినది. రాజులు సహితము ప్రజాభిహితములను తెలిసి కొనుటకు మారు వేషములతో సంచరించు చుండెడివారు. ఆ పరదేశి బ్రాహ్మణుడు మాత్ర సంచి తలాడగా నిడుకొని దారి యరుగు పైన శయనించెను. ఆ విప్రు డుబుసు పోకకు

నెల ల్చతుర్ద్వయిని వృష్టి దినాళికి రాత్రికై దివం
బున జరకై వయస్సునను బూని పరంబున కిహ్మ డుద్యమం
బనువుగఁ జేయఁగా వలయు

నను నర్థము నిచ్చు

వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసా
న్నిశార్థ మర్థం దివసే యతేత
వార్ధక్య హేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహ జన్మనా చ

అను శ్లోకమును చదువు చుండెను. ఇది విష్ణుచిత్తీయ కావ్యమునకు బీజ ప్రాయము.

పన్నీటితోఁ గదంబము సేసి పూసిన
మృగనాభి పస రాచ నగరు దెలుపఁ
బాట లానిలము లార్పఁగఁ దపారపుఁ జుంగు
లలరుఁ దావికి మూఁగు నళులఁ జోపఁ

గర్ణ డోలా మౌక్తిక చ్ఛాయ లెగఁ బ్రాకు
నురు హార రుచులఁ ద్రసరికిఁ దన్న
శశికాంతి చెంగావి దసిలి మించిన కేల
స్వర్ణ త్సరువు వాఁడి వాలు మెఱయ
మొలఁత యడపముఁ దేఁ జర స్మేరు వనఁగఁ
దలవరులు గొంద ఱొలసి ముందఱఁ జనంగ
నర్థి రథ్యాంత రాంతఃపు రాంతరమున
భోగినీ సంగతికి రాజు వోవు చుండి

యీ శ్లోకము నాలించెను. ఇది మత్స్యధ్వజుని వర్ణనము. అల్లసాని పెద్దన రాయల వారిని

ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల
శరదిందు ముఖులు చామరము లిడఁగ

అను పద్యముచేత వర్ణించెను. అందు రాయలవారి రూప ప్రదర్శ నముకంటె రాజస వైభవము లెక్కువగా స్ఫురించును. రాయల వారు పై పద్యమునందు మత్స్యధ్వజుని వర్ణించెను. అందు పరిపూర్ణ ముగా రూప శిల్పము లేకపోయినను శిల్పరచనయందు పెద్దనగారి పద్యముకంటె నయ మని చెప్పక తప్పదు. చేమకూర వేంకటరాజ కవి రఘునాథనాయకుని విజయ విలాసమునందు

కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ
జొకట్ల నిగనిగల్ చౌకళింప
హురుమంజి ముత్యాల యర చట్టపై గొప్ప
పతకంపు హారముల్ పరిఢవిల్ల
వెలఁ జెప్ప రాని కెంపుల వంక జముదాడి
పీతాంబరంబుపైఁ బెరిమె నెరప
గబ్బి మన్నె కుమార గండపెండారంపు
జిగి పదాగ ంబుపైఁ జెంగలింప

దొరల మంత్రులఁ గవుల నాదరణ సేయు
కరము కంకణ కాంతి నల్గడలు నిండ
నిండు కొలు వుండెఁ గన్నుల పండువుగను
శివి నచ్యుత రఘునాథ భూవిభుండు

అని వర్ణించెను. ఈ పద్యములోని శిల్ప వైశద్యము పై పద్యము లందు లేదు. కావ్యమునకు నందము తెచ్చునది శిల్పము. శిల్ప విరహిత మగు వర్ణనము తిలకము లేని ముఖము వలె మనస్సు నాకర్షింపదు. అలంకారము లెన్ని పెట్టినను ముఖమున బొట్టు లేనిచో పాడు ముఖ మగును. పాత్రలను వర్ణించు నపుడు హృదయాకర్షణీయ మగు చక్కని రూప శిల్ప ముండ వలయును. శిల్ప మను శబ్దమునకు స్వరూప ప్రదర్శన మని నా యభిప్రాయము. అర్థ శిల్ప మని భావ శిల్ప మని కథా శిల్ప మని యిప్పటి విమర్శకులు వివిధ విధములుగా వచింతురు. అవి శిల్పము లనిపించు కొనవు. మృదు మనోహరములగు సముచిత పద జాలముతో రూపమును పాఠకుని కనుల యెదుట కనిపించు నటుల చిత్రించుటయే శిల్పము. దానికి అలంకారములు జత పరచి సహజ స్వరూపమును కప్పి పుచ్చుట తగని పని. అది బీబీల మేని ముసుంగు వలె పాఠకుని మనస్సున కేవగింపు కలిగించును. అలంకార మందము కావచ్చును. అది మితి మించినచో దేవతా విగ్రహములకు చేయు నలంకారము వలె అసలు రూపము కనిపించ నీయదు. సహజ శిల్ప కళా ప్రదర్శనము పాఠకుని హృదయము నుప్పొంగించి రస మయము గావించును. వాని నందు విలీన మొనరించును. భాగవతము పేరెత్త గానె

కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగం బెల్లఁ గప్పి కొనఁగ

కన్నుల మిరుమి ట్లొదవించును. మనుచరిత్ర యనగానే

ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మెగము తోలు కిరీటముగ ధరించి

సిద్ధుడు కనిపించును. తిక్కనగారిని తలంపగానే

అడుగుల నునుఁ గాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణిఁ దోప

ఉత్తర యెదుట నడచి పోవును. ఈ పద్యములు కంఠస్థము చేయనివా రుండరు. దానికి కారణ మందు గోచరించు సహజ సిద్ధ మగు స్వరూప వర్ణనము. అదే శిల్పము. అట్టి శిల్ప వైశద్యము కాన రాని పాత్రల వర్ణన కావ్యమునకు నిరర్థకము. రాయలవారి మత్స్యధ్వజుని రూప వర్ణనలో కొంత శిల్ప మున్నది. కాని అది సంపూర్ణము కాదు. దానియందు విపులత కాన రాదు. కావున పాఠకుడు దానిని చదివి పొంద వలసి నంత యానందము నొందడు. రాజ మూర్తి యంతయు పాఠకుని యెదుట కనిపించదు. అది లోపము.

పై పద్యమునకు వ్యాఖ్యాత కర్ణ=శ్రోత్రములందు, డోలా=క దలుచున్న యనియు; తన్నన్=కాలఁ ద్రోయగా ననియు నర్థము వ్రాసెను. అది సరి యగునది కాదు. కర్ణడోలలు చెవుల యలం కారములు. పెద్ద పోగుల వలె నుండును. అందు మ్రూడు నాల్గు పెను ముత్యములు గ్రుచ్చబడి యుండును. ఆ ముత్యముల కాంతి ఉరు=గొప్పవగు లేక పెద్ద వగు, హార=ముత్యాల, హారములయొక్క కాంతిని త్రస్తరికిన్ = వెనుకకు, తన్నన్ = తన్నుచుండగా నని యర్థము. తన్నన్ అను శబ్దమునకు మరల్చు చుండగా నని లక్షణార్థము చెప్ప వలయును. కర్ణడోలా మౌక్తిక కాంతులు హార కాంతులను మించిన వని ఫలితార్థము.

మత్స్యధ్వజుడు శ్లోకార్థము గ్రహించు కొనెను. తన యవివేకము నకు చింతించెను. లోలోన సంతాపించెను. రాజ్య వైభవములందును భోగములందును విరక్తు డయ్యెను.

ఉన్నట్లు యుండ నద్దరి
కి న్నరులను నావ చేర్చు క్రియ వెసఁ దాఁ బో
కున్నట్లు యుండి కాలం
బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చున్

అని తలంచెను. చక్కని యుపమాన మిందమర్చ బడినది. రాయల వారికి కాలమును గురించిన యనుభవ మిది. రాయలవారిదే కాదు లోకమునందలి మానవుల యనుభవము కూడ నట్టిదే. కాని అది గ్రహింపునకు రాదు. నదిని దాటువా రీవలి యొడ్డున నావ నధిరోహింతురు. అంత వంకే వారికి తెలియును. సరంగు నావను నడుప నారంభించును. నావ కదలు చున్నటుల గాని పయనించు చున్నటుల గాని యుండదు. ఒడలు కదలదు. ఆవలి యొడ్డున చేర్చి సరంగు దిగ మనిన గాని తెలియదు. సుఖానుభవములో కాల పరిమితి కాన రాదు. ప్రయాణీకు లప్పుడే యవలి యొడ్డు చేరితిమా యని అబ్బుర పోవుదురు. అట్లే నరుడు సుఖానుభవములందు కాల మెరుగడు. ఏండ్లు గడచి పోవును. వయస్సు తీరి పోవును. చివరకు విషాదను నొందును. కాలము నడిచి నట్లే యుండదు. కడ కాయువును బుచ్చి మోసమును దెచ్చును. అనగా మృత్యువు పాలొనరించును. అదియే మానవ జీవితమున కవలి యొడ్డు. జననమే యివలి యొడ్డు. వయసు నది. కాలము నావ. ఉపమాలంకారము. మనస్సు నూగులాడించు పద్య మిది. దీనిని చదివి భావమును నవగతము కావించుకొనినవారి మనస్సులో నొక విధమగు సంచలనము కలుగక మానదు. ఒక్కొక్కప్పుడు వైరాగ్యము కూడ కలుగు నేమో. ఆ శక్తి యా యుపమానమునం దున్నది. హృదయమును మూల మట్టుగా కదిలించి భావికి చూపు మరలించును. కావుననే కవి కావ్యము లందు పాఠకుని యూహానుభవముల కందుపాటులో నుపమానములను వాడ వలయును. అది మనస్సును చక్కగా లోగొని

సార్థకతను పొందును. లేని నాడు నిరర్థక మగును. అలంకారము లలంకారములకొరకు లాక్షణికులు నిర్దేశించ లేదు. తన్మూలమున పాఠకుని మనస్సు నాకట్టి లోకము ననుభవమునకు తెచ్చి విశ్వ శ్రేయములు కూర్చుటకు. విశ్వ శ్రేయః కావ్యం. తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ. సావా గ్యా రస వృత్తిః అని. కావ్యము కాంతా సమ్మితము. ప్రభు సమ్మితముల వలె నాజ్ఞాపించవు. లోకమును గ్రహింపునకు తెచ్చి నీతిని బోధించును. పరమునకు మనస్సు మర ల్చును. అదే భారత భాగవత రామాయ ణాదుల ప్రయోజనము. మను చరిత్ర విష్ణుచిత్తీయముల ప్రయోజనము నదియే. అవి చిరంజీవములు. వానికి నాశనము లేదు. కుక్క గొడుగుల వలె వందల కొలంది కావ్యములు పుట్టి నశించినవి. వానిని తలంచువా రుండరు. అభ్యుదయ రచయితలు కాలమును బట్టి కావ్యములలోని యితి వృత్తము మారు చుండ వలయును. సంఘమును సంస్క రించి పురోగమనమునకు దారి చూపు రచనలు కావలయును. అట్టి రచనలు గావించు కవులను కాలము కోరు చున్న దందురు. ఆ మాట నేను కాదనను. బాహ్య ప్రవృత్తులను బట్టి కాలానుగతముగా సంఘములో మార్పులు వచ్చును. వాని యంతట నవి యంతరించును. అవి ప్రవాహములోని నీటి బుడగల వంటివి. ఎప్పటి కప్పుడు పుట్టు చుండును. గిట్టు చుండును. అవి సంఘ జీవనమున కాధారములు కాజాలవు. వానికొరకు కవి తన కవితా శక్తిని వ్యయ పరచుట నిరర్థకము. అవినీతి ప్రవృత్తులు చెలరేగి ప్రధాన జీవనమును కలుషిత మొనరించి వినాశన మొదవించు నప్పుడు కవి తన ప్రతిభను చూపి సంఘమును సంస్కరించి నిల బెట్ట వలయును. వ్యాస వాల్మీకాదు లొనరించిన కార్య మది. అందుల కుపయోగింపని కవి సంఘమున కుపకారి కాజాలడు. వాని రచనలు చిర కాలము నిలువ జాలవు. పదునారవ శతాబ్దమునందు రాజులు వేశ్యా లోలు రయిరి భోగములను మరగిరి. మోక్ష

ప్రదుండగు సత్యమగు దైవమును మరచిరి. యథా రాజా తథా ప్రజా. ఆ ప్రవృత్తియే ప్రజలలో వ్యాపించినది. రాయ లది గ్రహించినాడు. రాజులందును తన్మూలమున ప్రజ లందును మార్పుతే తలంచినాడు. అవినీతిని రూపు మాప తలంచినాడు. విష్ణుచిత్తీయము వ్రాసినాడు. గురు పరంపరా ప్రభావమునందు తన్ను గురించి ప్రజ లేమనుకొను చున్నారో విన వలయు నని బయలు చేరి నట్టి రాజును వేశ్యా గృహమున కరుగు చున్నటుల కథ మార్చి నాడు. రాజులలోని దురాచారమును బైట పరచినాడు రాయల వారు. కథను రసపోషణ కొరకు కవి యుచిత సరణి మార్చుకొన వచ్చును. పూర్వ కవు లట్లే గావించిరి. అది దోషము కాదు. రాయలవారు ప్రతిభావంతుడు. సంఘ సంస్కారము కొరకు కథను మార్పు గావించెను. వైజయంతీ విలాస కర్త యట్లు గావించ లేక పోయినాడు. రంగనాయకుల నొక తార్పుడు వానిగా చిత్రించినాడు. అది యొక లోపముగా పర మతానుయాయుల వెక్కిరింతలకు సందు దొరికినది.

మత్స్యధ్వజుడు తన రాజ నగరునకు మరలి పోయెను. మరునాడు సభ తీర్చెను. బీర పువ్వులఁ బోని టంకసాల వాటులు నించి యాస్థానిఁ గట్టించినాడు. బీర పువ్వుల వంటి క్రొత్తగా ముద్ర వేసిన బంగారు నాణెములట యవి. ఎంత లోక సామాన్య మయిన యుపమానము. బీర పువ్వులు పచ్చగా నుండును. మత్స్యధ్వజుడు

కొలువై బహు సమయంబుల
మెలఁగెడు కోవిదులఁ జూచి మీ మీ శాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం
బెలయించునో చూచి నిశ్చయింపుఁ డటంచున్

అన తిచ్చినాడు. వాద మారంభ మయినది. హరు డని యొకడు, శిఖి యని యొకడు, కరిముఖు డని యొకడు. పలువురు పలు దేవతలను

నిరూపించిరి. ఇవి యన్నియు రాయల కాలమునందలి మతములు. ఇప్పటికిని వాని శాఖలు ద్రవిడ దేశమునం దున్నవి. విల్లిబుత్తూరు నందు విష్ణుచిత్తుడు తులసీ సుగంధి మాల్యమును నిర్మించెను. దానిని మూల మంత్ర మగు శ్రీమదష్టాక్షరితో మన్నారు స్వామి వక్షమున చేర్చు చుండెను. మహామతీ ! నీవు రయంబున మధురా నగరమున కరుగుము. పాండీని దివాణము ప్రవేశింపుము. అందు ప్రేలెడు దుర్మదాంధుల గర్వ మడంపుము. నా మహిమ నచట ప్రకటింపుము. శుల్కమును హరింపుము. పాండ్యరా జగు మత్స్యధ్వజుని వైష్ణవునిగా నొనరింపు మని స్వామి యాన తిచ్చెను. విష్ణుచిత్తునకు భయము కలిగినది. కర పాదములు వడంకినవి. స్వామికి సాష్టాంగ మెరగినాడు. ఇట్లని విన్నవించు కొనినాడు స్వామికి విష్ణుచిత్తుడు.

స్వామీ ! నన్ను నితః పురాపఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధు నా
రామ క్ష్మా ఖనన క్రియా కర ఖనిత్ర గ్రాహి తోద్య త్కిణ
స్తోమా స్నిగ్ధ కరు న్భవ ద్భవన వాసు న్వాదిఁగాఁ బంపుచో
భూమీభృత్సభ నోట మైన నయశంబు ల్మీకు రాకుండునే.

గృహ సమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికా కరణమో వాల్లభ్య లభ్య ధ్వజ
గ్రహణంబో వ్యజ నాతపత్ర ధృతియో ప్రాగ్దీపి కారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరు ల్నీ లీలకుం బాత్రముల్.

ఒకప్పుడు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు పద్యముల రసవత్తతను గురించి ప్రసంగించుచు నే పద్యము జన సామాన్యములో పెక్కు మంది నోట వినవచ్చు చుండునో ఆ పద్యము రసవంత మని యూహించ వచ్చు నని నుడివిరి. ఆ మాటలో కొంత సత్యమున్నది. హృద యాహ్లాద కరమగు పద్యమును సాహిత్యప్రియుడు కంఠస్థము చేయును. సమయము దొరికి నప్పుడు దానిని పరులకు వినిపించును. 'అల వైకుంఠపురంబులో', సిరికిం జెప్పడు ఇటువంటి పద్యములు జన'

సామాన్యములో చాలమంది నోటికి వచ్చును. అందు మూలమున వాని ఘనతను గ్రహించుకొన వచ్చును. సాహిత్య ప్రియు లందరు కావ్యములోని రసవంతములగు పద్యములను వల్లింతు రనుట నిస్సంశయాంశము. విష్ణుచిత్తీయము చదివిన వారి రెండు పద్యములను కంఠస్థము చేయక మానరు. విష్ణుచిత్తీయములోని రాయలవారి పద్యరచనా విధానమును విప్పి చెప్పు ప్రతివారు నీ పద్యము లుదాహరించుచుందురు. అందు మూలమున వాని ఘనత ప్రసంగింపకయే తెలిసికొన వచ్చును. ఈ పద్యములు విష్ణుచిత్తుని భక్తి వినయములను వెలయించు వజ్ర శకలములు. అంతే కాదు వైష్ణవ మతము ప్రబోధించు దాస భక్తి వీనియందు నిబిడీ కృత మయి యున్నది. భక్తుడు విష్ణువునకు సేవకుడు. భక్తి వినయ విశ్వాసములతో నిరంతర మా రమా వల్లభుని సేవించుట భక్తుని ధర్మము. ఆ ధర్మమును గుర్తించి విష్ణుచిత్తుడు ఆలయమును శుభ్ర పరచును. జలమును తీసికొని వచ్చును. స్వామి పల్లకిని మోయును. వనమాలికలను కట్టును. ధ్వజమును మోసికొని వచ్చును. వింజామరములు వీయును. దీపములు వెలిగించును. ఆరామ భూమిని చక్కగా త్రవ్వి చెట్లకు కుదురులు గావించును. అన్యవ్యాసక్తి వానికి లేదు. హరి సేవ మోక్షోపాది యని విష్ణుచిత్తుడు తెలిసికొనెను. శాస్త్రముల జ్ఞానము వానికి లేదు. వైదిక కర్మ కలాపములతో వానికి పని లేదు. తొల్లింటి యనేక జన్మలయందు చేసిన సుకృతమువలన గురువుల కటాక్షమును పొందెను. జీవాత్మ పరమాత్మలకు గల సంబంధ మనాది సిద్ధ మని గ్రహించెను. హరి స్వామి యనియు తాను వాని దాసుడననియు ననుభవమునకు తెచ్చుకొనెను. ఈ విజ్ఞానము కలిగినవాడు నిర్వృతిని పొంది సుఖించును. అది లేని వానికి వేదాది విద్యలు నిష్ప్రయోజనములు. హేతు వాదము ధాతు వాదము కాణాదము ప్రాణములు తీయునవి. సాంఖ్యమును బోధించు కాపిలు మతము బుద్ధిని చలింప చేయును. అగ్నిష్టోమాది కర్మ కాండలను బోధించు పూర్వ మీమాంస శాస్త్రము హింసాకరము.

న్యాకరణ శాస్త్రము కాలము దాపురించునపుడు రక్షించునది కాదు. వీని నన్నిటిని చదువ బూనినచో మానవుని యాయుర్దాయము చాలదు. విఘ్నము లనేకములు కలుగు చుండును. శాస్త్రాభ్యాసమున కున్న సాధన సంపత్తి చాలదు. కొంచెము చదివినంత మాత్రమున గర్వము పెరిగి పోవును. తుది ముట్ట పరిపూర్ణ శాస్త్ర పరిజ్ఞానము కలవా డయ్యెను త్రిగుణాత్మకము లయిన విషయములను చివరకువిడువ వలయును. శాంతి దాంతులు గల నేను మొదట వాని నధిగమింప నేల ? తుది విసర్జింప నేల ? జడ భరతుని వలె భగవత్పరిచర్య చేయుచుండుట పరమ పురుషార్థంబు అని చింతించినాడు విష్ణుచిత్తుడు. తన కాల మంతయు విష్ణు సేవయందు గడుపు చుండెను. తాను న్యాయముగా సంపాదించిన ధన మంతయు భాగవతులగు వైష్ణవావళికి వెచ్చించు చుండెను. విష్ణుచిత్తుని మాట యెట్లున్నను ఇది యంతయు రాయలవారి నిశ్చితాభిప్రాయము. అందు సత్యము లేక పోలేదు. రాయలు మహాతత్త్వ వేత్త. శాస్త్ర పరిజ్ఞాత. లోకానుభవము కలవాడు. వైష్ణవమత తత్త్వమును బాగుగా గ్రహించు కొనినవాడు. స్వబుద్ధిచేత నాలోచించి యొక నిర్ణయము నకు వచ్చెను. విష్ణుచిత్తుని రూపము దాల్చిన భక్తిగా మలచినాడు. వానియందు వైష్ణవ ధర్మములను తీర్చి దిద్దినాడు. శాంతి దాంతి వినయాది గుణములచేత మెరుగులు పెట్టి సత్యమగు. విష్ణుతత్త్వ పరిజ్ఞాన మను జీవము పోసినాడు రాయలవారు. పెద్దన మనుచరిత్రమునందు ప్రతిపాదించిన విశిష్టాద్వైత సంప్రదాయమునకు ఒక విధముగా

## విష్ణుచిత్తీయము ఖండన గ్రంథము

శఠకోపయతి నాథముని యామునాచార్యాదులు వైష్ణవ మతమును మిగుల ప్రచారములోనికి తెచ్చిరి. వారు మహాపండితులు. వేద విదులు. సకల శాస్త్రముల నధిగమించిరి. విష్ణు తత్త్వము

ననుభవమునకు తెచ్చుకొనిరి. విజ్ఞానము సంపాదించిరి. నిరంతర కర్మానుష్ఠానము లొనరించిరి. పవిత్రాత్ము లయిరి. విష్ణువును ధ్యానించి మోక్షమును సాధించిరి. వారు వేదములను వేద కర్మలను అంగీక రించిరి. వారిని దృష్టియం దుంచుకొని పెద్దన ప్రవరుని పాత్రను సృష్టిం చెను. అట్లు సృష్టించుటలో నొక కారణ మున్నది. ప్రవరుని కథ మార్కండేయ పురాణములోనిది. ప్రవరుడు పురాణపురుషుడు. పురాణ ములకు వేదము లాధారములు. వేదములు యజ్ఞ యాగాది కర్మలను బోధించు చున్నవి. యజ్ఞ యాగాది నిత్య నైమిత్తిక వైదిక కర్మలు మోక్ష సాధనము లని పూర్వ మీమాంస బోధించు చున్నది. అవి నిష్కామముతో నాచరింప వలయును. పెద్దన యుపనిషత్తులను చదివిన పండితుడు. పూర్వోత్తర మీమాంసలను పఠించెను. విశిష్టా ద్వైత సార మెరింగెను. ప్రవరుని యామునాచార్యాదుల వలె నిరంత రాధ్యాపన తత్పరుని గావించెను. పూర్వ మీమాంస ననుసరించి నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుని చేసెను. యావన మందు యజ్వగా నొనరించెను. ప్రవరుడు నిత్యాగ్నిహోత్రి. అభ్యాగతసేవా పరతంత్ర సకల జీవనుడు. శాంతియు దాంతియు శీలము గలవాడు. వేలిమియు సురార్చనయు విప్ర సపర్యయు వాని నిత్య కృత్యములు. అరణులు దర్భలు నగ్నులు వానికి ప్రీతి యయినట్లు మరేవియు కాజాలవు. రేపును మాపును హవ్యముల చేత తృప్తుడగు వహ్ని సౌఖ్యము లొసంగు నని వాని నమ్మకము. మోక్ష లక్ష్మి సమాగమమునకు త్రయీ ధర్మములు సాధనములని వాని తలంపు. ప్రకృతి నుండి పుట్టిన దేహ మనిత్య మనియు దేహానుభవము లయిన తుచ్ఛ భోగములు మిథ్యాసాలపై తేనెలనియు ఆనందము బ్రహ్మయనుడు త్తర మీమాంసమతము బోధించు విజ్ఞానము పొందెను. ఆ బ్రహ్మ విష్ణు వని విశిష్టాద్వైతమువలన అనుభవమునకు తెచ్చుకొనెను. అతడు సర్వ మయుడు. ఏ వేల్పును సేవించినను నెవరిని పూజించినను

ఆకాశాత్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరం
సర్వ దేవ నమస్కారః
కేశవం ప్రతి గచ్ఛతి

యని అభేద బుద్ధితో ఈశ్వ రోపాసి యగు ఔషధ సిద్ధునికి నభ్యాగత పూజ గావించెను. అగ్నిని సేవించెను. వానిని

దివిష ద్వర్గము నీ ముఖంబున తృప్తిం గాంచు ని న్నీశుగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగ దంతర్యామివిన్ నీవ

అని వినుతించెను. విష్ణుతత్త్వమును పాటించి ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామన స్తుతి పరత్వమున లేచును. హటాత్సంభవము లయిన పాపముల యెడ శ్రీ హరీ యంచు పెడమొగం బగును. ఇది స్మరణమను భక్తి విశేషము. ఇది పెద్దనగారి విశిష్టాద్వైత మతము. కావుననే తనకు సాక్షాత్కరించిన హరిని స్వారోచిషుడు.

అవ్య యానంద విశ్వాత్మక విశ్వేశ
బ్రహ్మవు నీవ కపర్దివీవ
యింద్రుండ వీవ వహ్నివి యనిలుండ వీవ
వరుణుండ వీవ భాస్కరుండ వీవ
యముండ వీవ వసూత్కరము నీవ రుద్రులు
నీవ యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోం
కృతి వషట్కృతి శ్రుతి స్మృతులు నీవ
వేద్య విద్యావ యీ వచ్చిన విబుధ గణము
సర్వమును నీవ యెట్లన్న సర్వ గతుండ
వగుట మఱి నీవు గాని వాడనంగ నెవ్వం
డరయఁ గను శేష భూత సమస్త శేషి

అని వినుతించెను.

విద్యయను శబ్దమునకు బ్రహ్మ విద్య యని యర్థము. అది భారతీయ సంప్రదాయము. తర్క వ్యాకరణ వేదాంత మీమాంసాది శాస్త్రములు సాంఖ్యాది మతములు బ్రహ్మ విద్యా సౌధమును చేరుటకు సోపానములు. శాస్త్రములు మతములు నభ్యసించి అనుభవమునకు తెచ్చుకొని బ్రహ్మ విద్యా తత్త్వమును గ్రహించి సత్య మగు విజ్ఞానమును సంపాదించి సకల శాస్త్రముల సార మగు మోక్ష సాధన మార్గము నుపదేశింప గల గురువు లభించి నపుడు జీవిత కాలము వ్యయించి శరీరమును చిక్కించి బుద్ధిని బాధ పెట్టి శాస్త్రాదికములను చదువుట నిరుపయోగ మని రాయలవారి యభిప్రాయము.

శాస్త్ర జ్ఞానం బహు క్లేశం
బుద్ధే శ్చలన కారణం
ఉపదేశా ద్ధరిం బుద్ధ్వా
విరమే త్సర్వ కర్మసు

ఇదియే జగద్గురు పాదులయిన శంకరులవారి యభిమతముకూడ. శ్శంకర శ్శంకరః సాక్షా ద్వ్యాసో నారాయణః. శంకరాచార్యులవారు స్నానార్థము నది కరుగు చుండిరి. ఒక యింటి యరుగు మీద కూర్చుండి యువకుడు 'డుకృం కరణే' యను వ్యాకరణ సూత్రమును వల్లన వేయుచుండెను. విన్నారు శంకర గురుపాదులు

భజ గోవిందం భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే !
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృం కరణే

అని ప్రబోధించిరి. మరణ కాల మాసన్నమయి నప్పుడు డుకృం కరణే యను వ్యాకరణ సూత్రము రక్షింపదు. ఓమూఢమతీ!గోవిందునిభజింపు మని దాని భావము. ఇట్లే శంకరులవారు భజ గోవింద శ్లోకముల

చేత లోకమును ప్రబోధించి తత్త్వ ముపదేశించిరి. కావున శాస్త్ర జ్ఞానము ప్రాణ ప్రయాణ సమయమునందు సంరక్షింప నేరదు. గోవింద మంత్రోపాసన యొక్కటియే కాపాడునది. ఎన్ని శాస్త్రములు చదివి నను నిష్ప్రయోజనము. ఎన్ని మతము లెరింగినను ఫలము శూన్యము. ఎంత వారైనను చివరి కన్నియు విడిచి యా హరిని సేవింప వలసిన దే. ఆ పరమాత్మ యొక్కడే రక్షింప గలవాడు.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః

శ్రీకృష్ణ పరమాత్మ అర్జునకు సకల యోగము లుపదేశించి చివరకు చెప్పిన మాట యిది. ఈ శ్లోకము వైష్ణవ మతమునకు మూలకందము. సర్వ ధర్మములను విడిచి పెట్టి నీవు నన్ను సేవింపుము. నేను నిన్ను సర్వ పాపముల నుండి విడిపింతును. విచారము వలదుఅని దీని భావము. అంత కంటె పురుషునకు కావలసిన దేమున్నది. ఇందు భక్తి సాధన చేత మోక్షమును సంపాదించు మార్గ ముపదేశింప బడినది. ఈశ్లోకము అష్టాక్షరి మహామంత్రము, ద్వయము ప్రతి వైష్ణవునకు గురువు ఉపదేశించును. అవి భక్తి సాధనములు. అట్టి గురూపదేశమును పొంది విష్ణుచిత్తుడు హరిని భక్తితో సేవించెను. దాసుడై కొలిచెను. విష్ణు సాక్షాత్కారమును పొందెను. ఎదురు పడి సంభాషించెను. అదియే జనన ప్రయోజనము. అదియే జీవన్ముక్తి. విష్ణుచిత్తుడు శాస్త్ర జ్ఞానము లేనివా డయ్యును భక్తివలన కాయ క్లేశము లేక జీవన్ముక్తి పొంద గలిగెను. బుద్ధిని కష్టపెట్టి కాయమును క్లేశ పరచి శాస్త్ర జన్య మయిన విజ్ఞానమువలని కర్మ లాచరించి ప్రవరుడు సంపాదించి నదియు నదియే. అగ్నివానియందు లీన మయి గృహమునకు చేర్చెను. ఫలము రెంటికి నొకటే. కాని కైవల్య సౌధమును చేరుటకు సులువగు

రాచ బాట భక్తి యని వైష్ణవుల తలంపు. అదియే విష్ణుచిత్తీ యమునందు ప్రదర్శింప బడినది. విష్ణుచిత్తీయ మొక విధముగా

విశిష్టాద్వైతము

ను ప్రతిపాదించు గ్రంథము. అన్య మత ఖండనముతో తృతీయాశ్వాస మారంభ మగు చున్నది. విష్ణుచిత్తుడు మథుర కరిగెను. మత్స్య ధ్వజుని కొలువునందు ప్రవేశించెను. శ్రీమన్నారాయణుడు విష్ణు చిత్తునియందావేశించెను. ఈవు మాధ్యస్థ్యమున నున్న నేముఁ గొన్ని మాటల నొడివెద మని రాజుతో విష్ణుచిత్తు డనెను. రా జంగీక రించెను. వాద మారంభ మయినది. మొదట

జగ దుద్గతికిని బీజము ప్రధాన మన నీ
క్ష త్యాది వీశున శబ్దవాది

ని ఓడించెను. ఇది సాంఖ్య మత ఖండనము. సాంఖ్య మత మంతయు నవగతము గావించుకొని మూల సూత్రము గుర్తించి యొక్క పాద ములో సాంఖ్య మనువదించి ఖండనము నిమిడ్చిన రాయల ప్రతిభ కొనియాడ తగినది. దీనిని వ్యాఖ్యానింప వలయు ననిన నొక గ్రంథము పట్టును. శబ్ద మనగా వేదము. వేదము ప్రమాణముగా వాదింపని వారు అశబ్ద వాదులు. వారు సాంఖ్యులు. వీశులు. విగతో ఈశ్వ యశ్య సః వీశః వీశః విగతేశులు వారు. ఈశుడు జగ త్కార ణుడు కాడు అని వాదింతురు. ప్రధాన మనగా ప్రకృతి. దానిని విశిష్టాద్వైతులు అచిత్తు అందురు. అది జడము అనగా చల నాదిక ములు లేనిది. ప్రాణము లేని దని భావము. ప్రకృతి సత్త్వ రజ స్తమో గుణముల సామ్యావస్థ. దీనికే ప్రధాన మని సాంఖ్యు లందురు. ప్రకృతివలన బుద్ధి, దానివలన అహంకారము, అహం కారమువలన స్పర్శ రూప రస గంధములు, సూక్ష్మము లయిన పంచ భూతములు, పుట్టు చున్నవి. సూక్ష్మ రూపమున నున్న పంచ భూతము

లను పంచ తన్మాత్ర లందురు. పంచ తన్మాత్రలవలన పంచ భూతములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు, నుత్పన్నము లగు చున్నవి. ఇవి యిరువది నాలుగు తత్త్వములు. జీవుడు ఇరువది యైదవవాడు. అతడు నిత్యుడు. బుద్ధుడు. శుద్ధ స్వభావుడు. స్ఫటికమునకు రక్త వస్త్రముతోడి సంపర్కమువలన నెఱ్ఱతనము కలిగినట్లు ప్రకృతితోడి సంయోగముచే ఆత్మకు సుఖ దుఃఖాదులు కలుగు చున్నట్లు తోచును. కాని యాత్మకు సుఖ దుఃఖాదులు లేవు. తామరాకు మీది నీటి బిందువుల వలె కర్మ లేపము అంటదు. ప్రకృతి జడము. ఆత్మతోడి సంయోగముచేత సృష్ట్యాది వ్యాపారములు ప్రకృతి చేయు చున్నది. కావున ప్రకృతి జగత్కారణ మనియు అదియే యాత్మకు భోగ మోక్షముల నిచ్చున దనియు సాంఖ్యుల వాదము.

ఈ సాంఖ్య మతమును విష్ణుచిత్తుడు 'ఈక్షతి' ఇత్యాది ఛాందోగ్యోపనిష ద్వాక్యముచేత ఖండించెను. 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయః' ఈ సృష్టి ముందు తచ్ఛబ్ద వాచ్య మయిన వస్తు వొకటియే యున్నది. ఆ వస్తువు నేను బహు రూపముల నొందుదు నని చూచెను. ఈక్షతి అనగా చూచెను అని అర్థము. ప్రకృతి జడము. అది చూడ్డలేదు. కావున 'త న్నిష్ఠస్య మోక్షోపదేశాత్' అని యుండుటచేత ప్రకృతి నిష్ఠుడైన ఆత్మ జగత్కారణము కాని జడ మగు ప్రకృతి కా దని ఖండనము. తరువాత విష్ణుచిత్తుడు

పొరి నీశుఁ డేనన భోగ మాత్రేత్యా దు
దాహృతి స్ఫూర్తి మాయా వివాది

ని జయించెను. రాయలవారు ప్రకృతిచేత నసమాన పరాక్రమశాలి. స్వభావముచేత సాహిత్య కళా కోవిదుడు. ఆత్మచేత మహా వేదాంతి. మేధా సంపత్తిచేత నుత్తరంగిత మయి బహుముఖముల పొంగి పొరలి వచ్చుచున్న సర్వ మత వేదాంత వాహినిని పరిపూర్ణముగా

త్రాగి హృదయ గతము గావించు కొనెను. అనుభవము నకు తెచ్చు కొనెను. విష్ణుమయం జగత్సర్వం అను పరిజ్ఞానమును పొందెను. గురు పరంపరా ప్రసిద్ధమును శాస్త్ర సిద్ధమును నగు విశిష్టాద్వైత శాఖలను రెంటిని నేక ముఖముగా చేర్చెను. విష్ణు చిత్తీయ కావ్య ద్వారమున వినిగ్రతము గావించెను. రాయలు జహ్ను మహాముని. సాంఖ్య చార్వాక బౌద్ధ తార్కి కాది మతములను ఖండించి అద్వైత మత స్థాపన గావించినవాడు శంకర గురు పాదులు. ఆ మతము నాసేతు శీతాచల పర్యంతము ప్రచారము చేసెను. దాని నందరు నంగీకరించిరి. జగ జ్జేగీయ మానుడయి విజయమును సాధించి నాడు శంకరుడు. దానిని ఖండించిన మహామేధావి రామానుజుల వారు. ఆ మహామహుని ఖండన వాద గ్రంథము విశిష్టాద్వైత పర మయిన వ్యాఖ్యానము. గీతా భాష్యము ఉపనిష ద్భాష్యము విష్ణు సహస్ర నామ భాష్యము సిద్ధిత్రయము దానికి నంగములు. వాని నన్నిటిని హృదయస్థము గావించుకొని గురు పరంపరా సిద్ధము లయిన సంప్రదాయములను అవగతము గావించుకొని అనుభవమునకు తెచ్చుకొనిన వీర వైష్ణవుడు రాయలవారు. రఘునాథ నాయక విజయ రాఘవ నాయకుల వంటి యాడంబరములు కలవాడు కాడు. అవికత్థను డగు ధీరోదాత్తుడు.

రెండవ పాదము అద్వైత మత ఖండనము. అద్వైత మనగా జీవాత్మ పరమాత్మలకు భేదము లేదు. రెండు ఒకటి అని చెప్పు మతము. అహం బ్రహ్మ అని. అహం అనగా నేను బ్రహ్మ బ్రహ్మను అని యర్థము. ఇచ్చట నేను అర్థ మిచ్చు అహం అను శబ్దము దేహముకంటె భిన్న మయిన ఆత్మను సూచించును. ఈ మతమునందు ఆత్మయు బ్రహ్మయు నొక్కటి గావున ఆత్మ జగ త్సృష్టికి కారణ మని తేలుచున్నది. ఈ యద్వైతమును 'భోగ మాత్ర సామ్య లింగాచ్చ' అను బ్రహ్మ సూత్రార్థముచేత విష్ణుచిత్తుడు ఖండించెను.

ముక్తిని బొందిన జీవుడు బ్రహ్మ యాథాత్మ్యానుభవ రూప మగు భోగానుభవమునందు మాత్రమే బ్రహ్మతోడి సామ్యమును బొందు నని దీని భావము. 'జగద్వ్యాపార వర్జం ప్రకరణా దసన్నిహితత్వా చ్చ' యనియు 'సోశ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా విప శ్చితా' యనియు వేదములు బోధించుటచేతను ముక్తు డయిన జీవు నకు జగత్సృష్ట్యాది వ్యాపారములందు ఎంత మాత్రము జోక్యము లేదు. అందు మూలమున జీవుడు బ్రహ్మ కాదు. జీవుడు వేరు బ్రహ్మ వేరు.

ఫలియించుఁ గ్రియయ నా ఫలమత యిత్యాది
సర్వేశుఁ గొనని యపూర్వ వాది

ని జయించెను. ఇది పూర్వ మీమాంస మత ఖండనము. వేదములు బ్రహ్మ ముఖమునం దుండి పుట్టినవి. అవి అపౌరుషేయములు. పురుషు లగు నాది మునులచేత చెప్పబడినవి కావు. నిష్కామముతో చేసిన వేద విహితములగు యజ్ఞయాగాది కర్మలు సుకృతముల నొసంగును. ఆ సుకృత మాత్మకు ముక్తి నిచ్చును. ఆత్మ నిత్యము. ఆ యాత్మయే జగత్సృష్టికి కారణము. అగ్నియందు వేల్చ బడిన హవిస్సును అగ్ని ముఖమున వేల్పులు పరిగ్రహింతురు. ఇంద్రాయస్వాహా వరుణాయ స్వాహా 'ఇత్యాదులందు ప్రతిపాదితము లయిన దేవతయే బ్రహ్మము. వేరె యీశ్వరుడు లేడు అని వారి వాదన. క్రియ యనగా యజ్ఞ యాగాది కర్మలు. ఫలియించున్ పుణ్య ఫలము నిచ్చును అని భావము. అపూర్వ మనగా పుణ్య ఫలము. దానిని గురించి వాదించువాడు అపూర్వవాది. పూర్వ మీమాంస మతము ప్రత్యే కముగా నీశ్వరు నంగీకరింపదు. ఆ మతమును 'ఫలమత ఉపపత్తేః' అను సూక్తిచేత విష్ణుచిత్తుడు ఖండించెను. యజ్ఞ యాగ అగ్ని ష్టోమాది కర్మ లచేతనములు. వానికి ఫలము నిచ్చు శక్తి లేదు. యజ్ఞ యాగాదులవలనను ఉపాసనచేతను ఆరాధింప బడు పరమ పురుషుడే

బ్రహ్మము. అతడే ఐహి కాముష్మిక సుఖములను సారూప్య మగు మోక్షము నిచ్చును. 'అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ' అని భగవద్గీత. ఈపూర్వమీమాంస మతమే మనుచరిత్రలోని ప్రవరుని పాత్రయందు ప్రతిపాదింప బడినది. కాని విష్ణువు సర్వ వ్యాపకు డని స్వారోచిషుని హరి వినుతియం దంగీకరింప బడినది. ఈ పూర్వమీమాంస మతము నిచ్చట రాయలు పూర్వ పక్షము గావించెను. ఆ కారణముచేత మనుచరిత్ర మతమునకు విష్ణుచిత్తీయము ఖండన గ్రంథ మయినది. తరువాత

శాస్త్ర యోనిత్వాది సరణి నీశ్వరునిఁ దె
ల్పెదు ననుమానమ న్పీలు వాది

ని విష్ణుచిత్తుడు పూర్వ పక్షము గావించెను. ఇది వైశేషిక మత ఖండనము. వైశేషిక మతమును తార్కిక మత మందురు. ఇది పీలు వాదము. పీలువు అనగా పర మాణువు. పీలువు జగత్కారణ మని వాదించువాడు పీలువాది. పరమాణువులు జగత్తున కుపాదాన కారణములు అణువుల సంయోగము వలన జగత్తు సృష్టి యగు చున్నది. ఈశ్వరుడు నిమిత్త మాత్రుడు. ఈశ్వరు డనగా పరబ్రహ్మ బ్రహ్మోపాసనవలన ఆత్మకు సుఖ దుఃఖాదులు జ్ఞానేచ్ఛా దులు నశించును. అదియే యాత్మకు మోక్షము అని తార్కిక వాదులువాదింతురు. వారి మతమునందు ఆత్మజ్ఞానాదులు నశించి యొక శిల వలె పడియుండును. ఈశ్వరుడు ఎవరికి కాన రానివాడు. ప్రత్యక్షముగా కానరాని ఈశ్వరుని పరోక్ష జ్ఞానముచేత అనుమానింప బడుచున్నాడు. ఉండిన నుండ వచ్చును. లేక పోయిన లేక పోవచ్చును. ఈశ్వరు డున్నా డనుట అనుమానము. కావున వారిని అనమాన వాద మయినది. 'క్షిత్యంకురాదికం సకర్తృకం కార్యత్వా ద్ఘటవత్' అని వైశేషిక సూత్రము. ఈ మతమును శాస్త్ర యోని త్వాత్ అను సూత్రముచేత పూర్వ పక్ష మొనరించెను. పరబ్రహ్మను

తెలిసి కొనుటకు శాస్త్రము లాధారములు అని దాని యర్థము. శాస్త్ర జ్ఞానము లేనిది బ్రహ్మ జ్ఞానము కలుగదు. అందుకనే శంకరుల వారు బ్రహ్మజిజ్ఞాస చేయవలయును. అని బోధించిరి. బ్రహ్మ జ్ఞానమునకు విజ్ఞానము మూలాధార మనిరి. విజ్ఞాన విరహిత మైన భక్తి నిరర్థకము. విష్ణుచిత్తుడు తలంచినది సరియైన యూహ కాదు. అందు మూలమున రాయలవారి అభిప్రాయము సరి యగునది కాదని తేలు చున్నది. భక్తివలన ఈశ్వర సాక్షాత్కారము కలుగ వచ్చును. కాని ఈశ్వరుని గురించిన పరిపూర్ణ సుస్థిర విజ్ఞాన ముండ వలయును. దానిని ప్రసాదించునవి శాస్త్రములు. ఆ విజ్ఞానము లేక పోవుటవలన విష్ణు వాతనియందావేశించి వాదింప వలసి వచ్చినది. రామానుజుల వారు కూడ ఈ విజ్ఞాన మంగీకరించిరి. కావున రాయలవారి విష్ణు చిత్తీయములోని భక్తి బోధ పౌరాణికము గురు పరంపరాగత సంప్రదాయము. శఠకోపయతి నాథముని యామునాచార్యాదులు రామానుజులవారు సర్వ శాస్త్రములను పరిపూర్ణముగా చదివి పరతత్త్వ విజ్ఞానమును సంపాదించి సన్యాస స్వీకారముచేత సర్వధర్మము లను పరిత్యజించి విష్ణువును విజ్ఞాన సహిత మయిన భక్తితో సేవించిరి. అక్షయ మగు మోక్షము పొందిరి. ఆ విజ్ఞాన సహిత మగు విష్ణు భక్తినే మనుచరిత్ర బోధించు చున్నది. అది పెద్దనగారు ప్రతిపాదించిన విశిష్టాద్వైతము. రామానుజులవారి మతము వేద విహిత మయినది. అందు విజ్ఞాన విరహిత మయిన భక్తికి స్థానము లేదు. పిమ్మట

> నిత్యులం దెల్ల నిత్యుండ న్నృశత్యురాక్తి
> క్షణిక సర్వజ్ఞ తేషి సౌగత వివాది

ని జయించెను. ఇది బౌద్ధ మత నిరాసనము. బౌద్ధులు సౌగత వాదులు. 'సౌగత శ్శూన్యవాదిని' అని. వారు శూన్య వాదులు. క్షణిక సర్వజ్ఞ తేషి అని బౌద్ధుల వాదన. క్షణికత్వము సర్వజ్ఞత్వము నీశ్వరుని లక్షణము లందురు. ప్రతి క్షణము జ్ఞానము మారు చుండును. పార్థివ తైజ

సాప్య వాయవీయ పరమాణువులు ఒండొంటితో కలసి పంచ భూతము లేర్పడు చున్నవి. వానివలన శరీ రేంద్రి యాదు లుత్పన్నములగు చున్నవి. సర్వ సంసారములు క్షణికములను జ్ఞానమువలన మోక్షము సిద్ధించు నని వారి వాదము. ఆ వాదమును నిత్యులం దెల్ల నిత్యు డీశ్వరు డని యర్థ మిచ్చు వేద వచనముచేత పూర్వ పక్షముచేసినాడు విష్ణుచిత్తుడు. 'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం ఏకో బహూనాం' అని కఠోపనిషత్తు.

> అనుపపత్తే ర్న యను సూత్ర మాది యైన
> వాని నృపతీనుఁ బ్రత్యక్ష వాది గెలిచె

ఇది చార్వాక మత ఖండనము. ఇట్లు షణ్మత వాదులను గెలిచెను. చివరకు వైష్ణవ మతమును స్థాపించెను.

ఈ సందర్భమునందు రాయలవారు ఖాండిక్య కేశిధ్వజ సంవాద మను నుపాఖ్యానము నిందు పొందు పరచెను. ఈ యుపాఖ్యానము విష్ణు పురాణములోనిది. ఈ కథకు ప్రధాన కథతో నేట్టి సంబంధము లేదు. దీని నిక్కడ ముడిపెట్టినాడు రాయలవా రని కొందరు విమర్శకుల యభిప్రాయము. అది అట్లు కాదు. విష్ణు చిత్తుడు 'ఏకో హవై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానః' అనియు 'నతత్ర సూర్యో భాతి న చంద్ర తారకః నేమావిద్యుతో భాన్తి కుతో౽యమగ్నిః' అనియు శ్రుతులు తెల్పుచున్నవి. వాని ననుసరించి

> ఆది నారాయణుం డాయె నొక్కఁడ బ్రహ్మ
> లేడు మహేశుండు లేఁడు లేదు
> రోదసి లేఁడు సూర్యుఁడు లేఁడు చంద్రుండు
> లేవు నక్షత్రముల్ లేవు నీళ్ళు

అను పద్యమున నారాయణుం డగు విష్ణువు ఒక్కడే నిత్యు డనియు ఆ హరియే పరతత్త్వ మనియు నిరూపించెను. 'తుల లేకుండు స్వరూప రూప గుణ భూతుల్ దోచె' నను పద్యమునందు విష్ణువు యొక్క స్థితి వర్ణింప బడినది.

యచ్చ కించి జ్జగ త్యస్మిన్
దృశ్యతే శ్రూయతేఽపివా
అంత ర్బహిశ్చ త త్సర్వం
వ్యాప్య నారాయణ స్థితః

అను తైత్తిరీ యోపనిషత్తు నందలి సూక్తికి పై పద్య మనువాదము. విష్ణువును సాక్షా త్కరించుకొని మోక్షమును బొందు విధ మింత వరకు నుపదేశించ లేదు. అది ఖాండిక్య కేశిధ్వజ సంవాదమునందు తెలిపెను. అది యుపన్యాస రూపమున పద్యములలో వ్రాసినచో చదువుటకు విసుగు జనించును. అది కథలో పొందు పరచి సంవాద రూపమున నిరూపించుటవలన అందముగాను రసవంతముగాను నుండును. కావున నీ కథ నిందు పొందు పరచెను. విష్ణుచిత్తీయము గురుపరంపరా ప్రభావములోని సాంఘిక కథ 'దానికి పౌరాణిక దృష్టిని కల్పించి వైష్ణవ మత ప్రమాణ గ్రంథముగా నొనరించుటకు ఖాండిక్య కేశిధ్వజ సంవాదము' మాలదాసరి కథ నిం దిమిడ్చ బడినవి. రాయల వారు ఎంత శాస్త్ర పండితుడో అంత దూరపు ఆలోచన కలవాడు. తన పరిశ్రమ చిర స్థాయిగా నాంధ్ర లోకము సంస్మరింప వలయు నని తలంపు. ఆ తలంపుతో విష్ణుచిత్తీయము రచించెను. మహా కావ్యముగా కవులు వేదాంత శాస్త్రముగా పండితులు మత గ్రంథముగా వైష్ణవులు శిరమున ధరించు నటుల గావించెను. రాయలవారు కవియు లాక్షణికుడు పండితుడు వేదాంతియే కాదు. యోగ విద్యా విదుడు కూడ. వేద వేదాంత విద్యా పరిశ్రమవలన పరతత్త్వ మగు

విష్ణువును గుర్తించిన తరువాత సకల సంగ పరిత్యాగము గావించి యోగ నిరూఢిచేత విష్ణు సాక్షాత్కారము పొంద వలయును. ఈ తత్త్వమునే పెద్దనగారు మనుచరిత్రయందు నిరూపించిరి. పెద్దనగారు పర మతఖండనలతో రేఖా మాత్రముగా చిత్రించిన విశిష్టాద్వైతమును రాయలవారు విపులార్థ గోచరముగా వర్ణితము గావించెను. కావున మనుచరిత్రకొక విధముగా విష్ణుచిత్తుని వాదము వ్యాఖ్యాన మన తగి యున్నది.

ఖాండిక్య కేశిధ్వజులు నిమి వంశీయులు. అన్నదమ్ముల బిడ్డలు. అందు ఖాండిక్యుడు కర్మఠుడు. యజ్ఞ యాగాది వేద కర్మలొనరించువాడు. కేశిధ్వజుడు బ్రహ్మ నిష్ఠుడు. అనగా బ్రహ్మ జ్ఞానము కలవాడు. వా రిరువురు రాజ్య సంపదల కొరకు పోరాడిరి. ఖాండిక్యుని కేశిధ్వజుడు యుద్ధమునం దోడించెను. వాని రాజ్యమపహరించెను. ఖాండిక్యుడు మంత్రి పురోహిత పరివారముతో వనమున కరిగెను. పర్ణశాలలు నిర్మించుకొని యందు నివసించెను. పిమ్మట కేశిధ్వజుండు మృత్యువును అవిద్యను గెలిచి చావు పుట్టుకలు లేని మోక్షపదవిని సంపాదింప తలంచెను. ఆ కారణముచేత జ్ఞానాశ్రయుడై యోగ నిరతిని బూని ఫలాపేక్ష లేక యజ్ఞములు చేయు చుండెను. ఒక యజ్ఞమునందు యాగము కొరకు నియమింప బడిన ధేనువు యజ్ఞశాల సమీపమునందు పూరి మేయు చుండెను. దాని నొక పులి చూచెను.

గబ్బు సమక్షికం బయి మొగం బడువ న్దరు పర్ణము ల్వడన్
ద్రొబ్బుచుఁ గార్మొగిళ్ళ రొదతోఁ బురణించెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞగాఁగఁ జెవు లూఁదిన వల్లవుఁ డుర్విఁ గూలఁగా
బెబ్బులి గొంతు క్రొ ల్లఱచి పెల్లున మార్మెడఁ ద్రెళ్ళ దాఁటుచున్

తనువుఁ గొమ్ముఁ గొరిజఁ గొన కుండ మలపుచుఁ
జప్పు డెసఁగఁ దోఁక నప్పళించి
శోణితంబు గ్రోలుచునె నేర్పునై ఘర్మ
కవిని గవికి నీడ్చు నవసరమున

పొలమరు లందుఁ గూఁత లిడ భూసురు లన్నది వార్చి వార్చి మ్రా
కుల తుద లెక్కి చప్పటులు గొట్టి యదల్పఁగ సాహిణీలు మా
వులఁ బఱపఁగ వైచి సెలవుల్ వెస నాకుచుఁ బోయె వృక్ష మం
డలికయి తూలుచున్ ఘుట ఘుట ధ్వని సారె మలంగి చూచుచున్

కవికి భావనా శక్తి యెక్కువ. రాజులకు పరిశీలన శక్తి యధికము. మానవులయొక్కయు జంతువులయొక్కయు స్వభావములను పరిశీలించుటలో వారి దృష్టి యతి తీవ్రముగా పని చేయును. వాని చర్యల నతి సులువుగా గనిపెట్ట గలరు. వారు నిర్భీకులు. పులి యన్నను సింహ మన్నను వారికి భయము లేదు. బల పరాక్రమములు ధైర్య స్థైర్యములు వారి సొమ్ములు. అస్త్ర శస్త్ర విద్యలు వారికి బాసటలు. ఎంత భయంకర సత్త్వము నైన నెదిరించి మడియింపఁ గలరు. చావనిన లక్ష్యము లేదు. దానితోడి చెరలాట వారికి దిన చర్య. ఎదుట నిలిచి నిబ్బరముగా క్రూర సత్త్వముల చర్యలు చక్కగా నిశ్చల మగు మనస్సుతో పరిశీలింతురు. కావున స్వభావ పరిశీలనలో వారి చూపు నైశిత్యము వహించును. ఇతరు లట్లు కాదు. పులి యెదురు పడి నంతనే గడ గడ వడంకుచు ప్రాణ భయమున మ్రాకుల తుద లెక్కి చప్పటులు గొట్టి యదల్పుదురు. ఇంక వారికి దాని చర్యలు పరిశీలించుట యెక్కడిది. రాజు కవి యగుచో తాను చూచిన ప్రతి చిన్న విషయమును తు, చ తప్పకుండ వర్ణింప

గలఁడు. ఆ వర్ణనలు స్వభావ సిద్ధముగాను హృదయంగమము గాను సామాన్య కవి వర్ణనల కంటె విభిన్నముగాను విపులముగాను ఉండును. పెద్దన మహాకవి

గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱయంగాఁ గాంచి రా జేసె నే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పై కర్లించి రా నేసె రెం
డవ కాండంబుఁ ద దస్త్రమున్ గొనక డాయన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నంబయి నేలఁ గూలెఁ బవి ఘారా భిన్న శైలాకృతిన్

అని మనుచరిత్రమునందు స్వరోచి పులి వేటను వర్ణించెను. ఈ పద్యములో స్వభావోక్తి కలదు. దానికి తోడు ఉపమాలంకారము కూడ నున్నది. అందు మూలమున స్వరోచి కత్తి దెబ్బ వజ్రాయుధ ఘాతము వలె తీవ్ర మయిన దనియు, పులి శైల మంత యున్నత మయిన దనియు అది కూలు నప్పుడు కొండ పడి నట్లు శబ్ద మయ్యె ననియు స్ఫురించు ననుటలో సందేహము లేదు. ఆ పులి యాకార రేఖాదులు గాని యేటు తిన్న తీవ్రత గాని కోప స్వరూ పాదులు గాని పద్యమందు గోచరింపవు. ఇది కవి భావ నోక్తి. దీనినే రా జయిన కవి వర్ణించినచో రెండు మూడు పద్యములలో ప్రతి విషయము విపులముగా కనుల కగుపించు నటుల చెప్పును. ఆ వర్ణనలలో పులి చెయిములందలి తీవ్రత కనిపించును. ఇదే కాదు. ప్రతి విషయము నంతే. కావున రాజ కవుల వర్ణనలు విపులములుగా నుండును. అందు వలన పద్యములు పెరుగు చుండును. గ్రంథము పెద్ద దగును. ఇందుకు విష్ణుచిత్తీయము తార్కాణము. 'పులి నేలఁ గూలెన్' అని యొక్క మాటలో తేల్చినాడు పెద్దన. రాజకవి యట్లూరకుండడు. పులి మరణావస్థను తప్పక వర్ణించును. ఆ పరిశీలన వాని కొక వినోదము. ప్రతి సంగతి బాగుగా విలోకించును. దానిని కావ్యములోని కెక్కించును. కవి చిత్తము అతి మృదులము. రాజుల చిత్తము వలె కఠినము కాదు.

కావున మరణ స్థితిని విశదముగా పరిశీలింప లేదు. కన్నీటితో మొగ మవలకు తృప్తి కొనును. అట్టి వానిని వర్ణింప వలసినచో నూహకు పని కల్పించును. కిరాతుడు బాణమును ప్రయోగించెను. క్రౌంచము నేల గూలెను. దాని మరణావస్థను రఘునాథ రామాయణమునందు రఘునాథ నాయకుడు

పడి రోఁజు కొనుచు నెత్తురు
బుడ బుడఁ గ్రక్కుచును బోర పొడపై యెగ యూ
ర్పడరఁగఁ బొరలం దొడఁగెన్
వెడ తెప్పం గన్నుఁ గప్పి వేదన బలియన్

కుల కుల కూయుచు నిలపై
జల జలఁ జట్టుపలు రాల సారెఁ బొరలుచున్
విల విలఁ దన్ను

కొనుచు క్రౌంచి మరణించినదట. ఈ యవస్థ లన్నియు సునిశితముగా చూచుటకు కవి చిత్త మిచ్చగింపదు. వారి కా మనస్సు గట్టితన ముండదు. వాల్మీకి మహాకవి. ఆయనయే చూడ లేక కన్నీరు కార్చెను. రామాయణమున వర్ణింప లేక పోయెను. రాయలవారు యజ్ఞ ధేనువు మరణావస్థను

జుఱు జుఱుకున నెత్తురు వెలి
కుఱుకుచు రొద సేయ నఱితి యొడిపిన యూర్పుల్
పఱువ మిడి గ్రుడ్లు వడఁకఁగఁ
గొఱ ప్రాణముతోడఁ దన్ను కొ

నె నని వర్ణించెను. ఇట్టివి ప్రతి దినమునందు రాయ లెన్నో చూచు చుండును. వాని కది యొక లక్ష్యము కాదు. కావున అంత విపులముగా వర్ణించెను. ఆ పద్యము చదువు చున్నప్పుడు గవి మరణావస్థకు పాఠకుడు జాలిపడకుండ యుండలేదు. అది ఆ వర్ణనలో నున్నది. ఇట్లే

రాయలు పులి చర్య లతి విపులముగా వర్ణించెను. ఆయన మహారాజు. అడవికి వేట కరుగు చుండును. మాటు పెట్టి పులుల నాకర్షించును. వానిని వేటాడును. అప్పటి వాని చర్యలు చక్కగా పరిశీలించును. కావుననే ఆ పద్యము లంతి సహజముగా వ్రాయ గలిగెను. ఆ చర్యలలోని సహజ స్వభావ వర్ణనము సామాన్య కవులకు సాధ్యము కాదు. అవి యూహా కందునవి కావు. చూచి గాని చిత్రింప నలవి కావు. రాయల పద్యమందు స్వభావోక్తి కలదు. పెద్దనగారి పద్యమందలి స్వభావోక్తి యూహా కల్పితము. రాయలవారి పద్యము లందలి స్వభావోక్తి అనుభవ కల్పితము. ఆ భేద మా పద్యములలో కనిపించును. పెద్దన గారి పద్యములో శిల్పము లేదు. రాయలవారి మొదటి పద్యములో పులి యావేగము మూడవ పద్యమునందు సెలవుల నాకుచు కోపమున ఘుట ఘుట ధ్వనితో మలంగి చెట్ల గుంపులోనికి మరలి మరలి చూచుచు నరుగుచున్న రూపము కని పించును. సారె మలంగి చూచుచున్ అనుటలో బెబ్బులి ధైర్య రాజసములు స్ఫురించును. వర్ణనాంశములం దిట్టి విభేదము పరిస్ఫు టముగా కనిపించు చుండ విష్ణుచిత్తీయము పెద్దన వ్రాసె ననుట అనాలోచిత మనక తప్పదు.

కేశిధ్వజుడు బ్రహ్మజ్ఞాని. రాజయోగి. నిష్కామ కర్మా చరణ పరతంత్రుడు. యజ్ఞ కర్మకు విఘ్నము వాటిల్లినది. దానికి ప్రాయశ్చిత్త మాతడెరుగడు. ఋత్విజులను మునులను వేర్వేర నడిగెను. వారు నెరుగ మనిరి. ఖాండిక్యు నడుగ మనిరి. కేశిధ్వజు డరుగుటకు వెనుకాడ లేదు.

హరి ణాజి నోత్తరీయుండు
నిరాయుధుండు నగుచు నతని నెలవగు నడవిన్

జొర నేగెను. వేగులవాండ్రు వాని రాక నరసిరి. ఖాండిక్యున కెరి గించిరి. ఖాండిక్యుండు

వలస బెదర నృపతి కలఁగక ప్రజ వగ
లార్పఁ బనిచి కనుమలందు నిలువ
వేలు వేల యేర్చి విలుమందిఁ బనిచి తాఁ
దడుకు పెండె మలుక వాడము వెడలి

నాడట. ఇది రాజుల యాత్మ రక్షణోపాయము. రాయలవారు కథా కథన విధానమునందు ప్రతి యంశము నింత వివరముగా వర్ణించెను. ఆయన మహారాజు విరోధి. రాజులతో పని పట్టినప్పుడు తన్ను తా నెట్లు రక్షించుకొన వలయునో యా రహస్య మెరుగును. కావుననే గజపతిరాజు నిర్మించిన కత్తుల బోనులో చిక్కుకొన కుండ బయట పడెను. అది తిమ్మరుసు మంత్రి ప్రజ్ఞా విశేష మయిన కావచ్చును. మంత్రి ప్రతిభ కనువగు రా జుండ వలయును. రాయ లట్టి సుగుణ సంపద కలవాడు. తిమ్మరుసు వంటి మంత్రి చేతిలో మెదిగినవాడు. కావున మహా పరాక్రమ శాలియు రాజనీతి వేత్తయు నయ్యెను. ప్రజానురంజన మాతని తొలి చూపు. ఎట్టి కష్టమునం దైనను మనస్సు కలత వహింప కుండుట వాని స్వభావము. కావుననే క్రూర స్వభావులగు తురకలతోడి యుద్ధమునందు మనస్సు దిటవు గలిగి నిలువ గలిగెను. విజయ పరంపరలు సాధింప గలిగెను. రాయలవారి చిత్త ప్రతిబింబమే పై పద్యములోని మొదటి పాదము. ఆ మహారాజు రాజనీతి వైదుష్యము మిగిలిన పద్యము. ఆ రెండు ఖాండిక్యునం దారోపించెను. తరువాత

వచ్చు రిపుఁ జూపులనె చుఱ
వుచ్చుచు సిరిఁ గొనుట మగుడఁ బోడముట రుషమ
చ్చిచ్చు నను వెచ్చమరి వి
దృ చ్చ్ఛల చాప జ్యఁ దూపు దొడుగుచుఁ బలికెన్

ఖాండిక్యుఁడు కర్మ పరతంత్రుఁడు. అగ్ని కార్యము లాతని నిత్య కృత్యములు. ముచ్చిచ్చుల నర్చించుట వాని దిన చర్య. కావున ముచ్చిచ్చు నను వెచ్చ మరి కేశిధ్వజుని చూపులనె చుఱు పుచ్చుచు బాణము వింట సంధించె నని రాయలవారు వర్ణించిరి. అనగా మూ డగ్నుల వేడిమి కలవా డయ్యె నని భావము. అందు మూలమున ఖాండిక్యుని నిరంత రాగ్నిహోత్రిత్వము స్ఫురింప చేయఁ బడినది. ఈ పద్యమునందు ఖాండిక్య కోప స్వరూప వర్ణనా వైరళ్యము గమనింపఁ దగినది. ఖాండిక్యునకు కేశిధ్వజుడు తన సంగతి నెరిగించెను. ఆ సంగతి ఖాండిక్యుఁడు మంత్రులకు దెలియ నుడివెను. ఈ సందర్భమున రాజామాత్యుల వాద ప్రతివాదములు పద్యములలో నతి మనోహరముగా నడిపిరి. శృంగారవైరాగ్య రసముల నేక వేదిక మీఁది కెక్కించి నాటక మాడించినా డల్లసాని పెద్దనగారు మనుచరిత్రలో. విష్ణుచిత్తీయములో వీర వైరాగ్యముల నొక్క చోట చేర్చి వాద ప్రతివాదములు చేయించి నాడు రాయలవారు. శత్రువు చేత చిక్కి నప్పుడు వానిని మడియించుట రాజనీతి యని మంత్రుల ప్రబోధము.

పాలు గలవాఁడు మన కొక
జాలి యిడక తాన తారసానకు వచ్చెన్
వేళ యిదె లెమ్ము నృప! కృప
చాలు న్గారాకు మేపి చంపకు ప్రజలన్
అతని పని దీర్ప రాజ్య
ద్వితయము నీకుఁ జేరు నెట్టి వెరవున నైనన్
క్షితిపుల కరి జయము ధనో
న్నతియుఁ బ్రజా నీతి రక్షణము ధర్మంబుల్
అన్యాయంబున దుస్సహా
మన్యుం డగు ప్రబల రిపుని మడియించిన ధ

ర్మ న్యక్కృతి కగు నిష్కృతి
నన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్

శిష్టు నిను నింత చేసిన
దుష్టాత్మునిఁ బిలుకు మార్చి దురితము పిదపన్
నష్టంబుగ భూవల్లభ
యిష్టాపూర్తములు సేసి యెసఁగఁగ రాదె

జనవర! తపమునకుం జో
చ్చినఁ గన్నులు మూసికొంటె నెల వింతియ కా
క నిది ధ్యానకు బ్రహ్మం
బెనయునె పరిభవము శల్య మెదలో మెఱమన్

అని వాదించినారు సచివులు. రాయలవారు రాజనీతి విదుడు. ఋణ శేషం రణ శేషం న శేషయే త్తని రాజనీతి. నీతిని గ్రుడ్డిగా ననుసరించుట వివేకికి తగునది కాదు. కాలము లోకము స్థితి గతులు భావియు దృష్టియం దుంచుకొన వలయును. ఉచితానుచితములను గుర్తించి ప్రవర్తింప వలయును. ద్రుపదుని బంధించి యర్జునుడు గొని తెచ్చెను. ద్రోణునికి గురు దక్షిణగా సమర్పించెను. ద్రోణుడు ద్రుపదుని పరిహాసము లాడి విడిచి పుచ్చెను. అతడు దూరాలోచన కలవాడు. భావి స్థితి గతులు గ్రహించుకొను శక్తి గలవాడు. పాండవులు ద్రోణుని చర్యకు అబ్బుర పోయిరి. దాని ప్రయోజనము తరువాత తెలిసి వచ్చెను. ద్రౌపది వివాహాము దృష్టద్యుమ్నుని పాండవ సర్వ సైన్యాధి పత్యము ద్రుపదుడు పాండవ పక్షమున యుద్ధ మొనరించుట దాని ఫలితములు. రాజ నీతికి స్వబుద్ధిని జత పరచి కర్తవ్య మాచరింప వలయును. రాయలు స్వతంత్ర మగు నాలోచన కలవాడు. శాస్త్రముల నంధముగా ననుసరించుట వానికి గిట్టదు. కాలానుకూలముగా నుచితానుచితముల నాలోచించును. గజపతిరాజు

యుద్ధమునం దోడి పోయెను. రాయలచేత చిక్కెను. వానిని చంప లేదు. కుమార్తెను పరిణయ మాడి చుట్టరికము కలుపు కొనెను. గజపతిరాజు కూతురు చిన్నాదేవి. ఆమె రాయలను చంప ప్రయత్నించినది. ఆ దురాగతమును క్షమించెను. అంతఃపురము వెడల నడిచెను. ఆమెను చంప లేదు. ఇట్టి చర్యలవలన లాభము రాయలు తరువాత జీవిత విశేషమునం దనుభవించెను. ఆ యనుభవము ఖాండిక్య కేశిధ్వజ సంవాదము ప్రారంభమునందు విశద పరచెను. కవి తన యను భవములను కావ్యమునందు సందర్భాను సారముగా పొందు పరచును. మంత్రులు ఖాండిక్యునితో

పులి మల డిగి యూళ్లకు న
త్తుల రుజ రా జనము మాన్పకోఁ బనిచి గవిన్
నెలకొన సురియలు గొని చని
పొలియునొ యూరఁ గుయి రేఁగి పొడుచునొ చెపుమా

అని దృష్టాంత పూర్వక మయిన లోక వృత్తమును చూపిరి. ఈపద్యము నందు అప్రస్తుత ప్రశంసాలంకారము కలదు. రాయలకు రాజ నీతితో పాటు లోక జ్ఞాన మధికము. అతడు పులుల సంగతి యెరిగిన వేటకాడు. పులికి ప్రసవించిన తరువాత కన్నులు కానరావు. ఆకలి మెండగును. తన పిల్లలను తాను భక్షించును. ఆకలి తీరక దగ్గర యూరిపై బడును. జంతు జాలములను మడియించి భక్షించును. ఈ చర్య పై పద్యమునం దనుసంధింప బడినది. ఖాండిక్యుడు పారమార్థిక చింత కలవాడు. మంత్రుల మాటలు వానికి నచ్చలేదు.

బద్ధాంజలి పుటు దీనున్
గ్రుద్ధతఁ దన మఱుఁగు సొరఁగఁ గూల్చుట కడుఁ గీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి నను కందు వాక్యములు దలఁపరొకో

అని ఖాండిక్యు డమాత్యులకు సమాధానము చెప్పెను. ఇందు రాజనీతియు పారమార్థిక బుద్ధియు పొందుపడి యున్నవి. ఖాండిక్యుడు వెడలి వచ్చినాడు. కేశిధ్వజునివలన ధర్మ నైచికీ వధ క్రమం బంతయు వినినాడు. తగిన నిష్కృతి వచించినాడు. రాయల రసన సంస్కృతాంధ్ర పదముల సర్వస్వమునకు రంగ భూమి. శాస్త్రములకు నివాస మందిరము. శాస్త్రాంశములు పద జాలము నిరాఘాటముగా దొరలుచుండును. దుష్కర ప్రాస లైనను వాడు చుండును. వెను తీయుట వాని స్వభావమునందు లేదు. రణ రంగమునందు వలెనె సారస్వత రంగమునందును స్వైర సంచార మొనరించును. రచనా విధానము నందు నిరంకుశత్వమును ప్రదర్శించును. వ్యాకరణము వాని కడ్డు రాదు. లాక్షణికుల శాసనములు వానికి తృణ ప్రాయములు. తన భావ రచనల కడ్డు వాటిల్లినచో త్రొక్కి వేయును. అవి దోషము లనియు లక్షణ విరుద్ధము లనియు కవి లక్ష్యము తెరుంగనివారు విమర్శింతురు. కవి లోక విమర్శనలకు బద్ధుడు కాడు. అతడు సర్వ స్వతంత్రుడు. లక్షణ నిర్మాత. శాసన కర్త. అట్టి కవి కావ్యములందు దోషము లున్న వనుట విమర్శకుల యవివేకము. వాని రచనలు దిద్దుట తన్ను తాను వంచించు కొనుట. కవుల ప్రయోగములు లాక్షణికులకు శిరో ధార్యము. ఆ సంగతి వ్యాఖ్యాతలు విమర్శకులు గ్రహించు కొనరు. దిద్దుపాట్లకు దిగుదురు. దప్పులని లోకము మెప్పునకయి వెలయింతురు. అది వారి తప్పు కాని కవిది కాదు. 'లు క్సంశ్లేషో నాచి' అని శాసించిన నన్నయభ ట్టంతటివాడు తన సూత్రము నతిక్రమించి

తత్కూపమున విలస త్కూల ఘన వల్లి
యన్నిష్ట సఖ నూఁది యున్నదాని

అని యయాతి చరిత్రమునందు ప్రాస యతి కొరకు వాడెను. అను నిష్ట సఖ యనినచో గణము సరిపోయినను ప్రాస యతి పడదు.

'అదేమి' యని వ్యాకరణ వేత్తల నడిగిన క్వాచిత్కముగా వాడవచ్చు నని నన్నయ యభిప్రాయ మనిసమర్థించి చెప్పుదురు. అదే భాగవతము నం దుపయోగించినాడు పోతన. అది మహాదోషముగా పరిగణించి నారు పీఠిక కర్తలు. షష్ఠీ సమాసమునందు ఉకార ఋకారములకు అచ్చు పరంబగు నపుడు నుగాగమం బగు నని వ్యాకరణము

అన్ననన్న మొగము వెన్నని
యన్నన్న జయించు

అన్నాడు చేమకూర వెంకటకవి. వ్యాఖ్యాతల దురాగతాలు గుర్తిం చెను గాబోలు సరిగా ప్రాస స్థానమున దిద్దటానికి వీలు లేకుండ 'అన్నన్న' అని రెండవ పాదమునందు వాడెను. ఇట్టి వ్యాకరణ విరుద్ధములగు ప్రయోగము లెన్నో కావ్యములందు కలవు. క్వార్థక 'ఇకార' సంధులు తత్సమ అకార సంధులు చాల కలవు. కవుల సంగతులు తెలిసినవారు అధర్వణాదులు. వారు మరల నిట్టి వన్నియు పరిశో ధించి కారికలు వ్రాసిరి. భాష మహా ప్రవాహము. కాల పరిస్థితు లను బట్టి వివిధ విధములుగా మారు చుండును. కవి కాలాను యాయి. ఆ యా కాలములందలి భాషా స్వరూపములను గుర్తించి కావ్యములం దుపయోగించును. అవి లక్ష్యములుగా తీసికొని లక్ష ణములను నిర్మించువారు లక్షణ వేత్తలు. వారి శాసనములకు మహా కవులు కట్టుబడి యుండ వలసిన పని లేదు. వ్యాఖ్యాతలకు కవుల రచనలను దిద్దుట కధికారము లేదు. ఉన్న దానిని చేత నయినంత వరకు సమర్థింప వలయును. లేనిచో నమస్కరించి యూర కుండ వలయును. రాయలవారు సాహితీ సార్వభౌముడు. మహా విద్వాం సుడు. లక్షణ విదుడు. వైదిక నైతిక లౌకిక విషయముల నొం డొంటితో పొందు కలిపి యేక ముఖమున కావ్య స్రోతస్సున వెల్లి విరియించిన మహాకవి. వాని రచనలందు

## వ్యాకరణ దోషములు

కల వనుట అతి సాహసము. స్వతంత్రించి పూర్వ కవి కావ్యములం దగుపించని యొకటి రెండు ప్రయోగముల నుపయోగించిన మాత్రము చేత నిరసింప తగినవాడు కాడు. తరువాతి లక్షణ వేత్తలు భాషా స్వరూపములను గుర్తించి వానికి సూత్రములను నిర్మించిరి. కావున నవియు తరువాతి కవులకు శిరోధార్యము లయినవి. విష్ణుచిత్తీయము నందలి

పూని ముకుందు నాజ్ఞఁ గను బొమ్మనె గాంచి యజాండ భాండముల్
వానను నిల్పెఁదఁ బోవ నడువం గొనె

అనుచోట కొనె ననునది గ్రామ్య మని వ్యాఖ్యాతలు నుడివిరి. కొను అనునది ధాతువు. లిడ్లోట్లుల దుజ్జున కెను ను వర్ణంబులగును అను సూత్రముచేత భూతార్థంబునందు కొనునకు ఎను పరంబగును. అంద్వవ గాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగు నపు డచ్చునకు సంధి యగు నని యుండుటచేత కొను+ఎను=కొనెను అను రూప మేర్పడును. గురు విరహితంబులయి యయాంతంబు లయిన యేక స్వర ద్విస్వరంబుల యించు గ్వక్రంబుల కియుడాగ మంబు విభాష నగును. గావున కొను+ఇయ్+ఎను=కొనియెను అను నది పాక్షికము. ఇందు మూలమున కొనె, కొనియె అను రూపములు సిద్ధించును. కొనెను అనునది తప్పు కాదు. గ్రామ్య మనుట సాహసము.

'నింగిటు త్రిశంకు కతన మాతంగ వాటి యయ్యె' 'నిట్టతాడు వంటతివ రమించెఁ దా ముసలి యయ్యె' నిత్యాదులందలి నింగి+ఇటు - నింగిటు; నిట్టతాడువంటి+అతివ=నిట్టతాడువం టతివ యనునవి లక్షణాపేతములని మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు విష్ణుచిత్తీయము పీఠికయందు వ్రాసిరి. ఏమ్యాదులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు నను సూత్రమునందలి ఆది శబ్ద ప్రయోగము చేత పూర్వ కవి ప్రయోగముల మూలమున నాకృతి గణముల నిందు

చేర్చుకొన వలయు నని లక్షణ కర్త యభిప్రాయము. తెలి వొంది, ఒకటేల, ప్రొయ్యెడుదు, ఆనతిమ్ము, కనుదో యొలయన్ అని తిక్కనగారి భారతమునం దికార సంధులు పెక్కు కలవు. వానిని పరిశీంచి తరువాతి కవులు వెండుంగరము, పైడందెలు అని యుపయోగించిరి. రాయలు పూర్వ కవి ప్రయోగములను మనసునం దుంచుకొని ఇకారమునకు సంధి కావించెను. అది లక్షణాపేతము కాదు. లక్షణ సమ్మత మని యంగీకరింప వలయును. నన్నయ వాడక పోవచ్చును. తిక్కన కాలము నాటి కది యాచరణలోనికి వచ్చినది. కావున ఇట్టి సంధికి ఆది కర్త తిక్కన యని గొప్పుకొన వలయును. ఇట్లే గంజి+ఇండ్లన్=గజిండ్లన్ అగును.

‘తమ సేగిఁ జెప్ప లో దయ మీర విని చీరఁ జించిచ్చువారి దీవించువారు నీదు కఱకుట్లందీ నదస్త్రాల కాంతా రాంత ర్ష్మౌ కపాల’ ఇట్టి వాని యందలి చించి + ఇచ్చు, అంది + ఈన్ = అందీన్ అను క్త్వార్థక ఇకార సంధులు దుష్టము లని రమణాచార్యులవారి యభిప్రాయము. ఈ క్త్వార్థక ఇకార సంధి తిక్కన కాలము నాటికే యాచరణలోనికి వచ్చినది. తిక్కన విరాట పర్వమునందు చాపము నా కందిమ్మనుడు అనుచోట నిలుచుండు వలెనే అందిమ్ము అనునది ధాతు పల్లవం బని గుప్తార్థ ప్రకాశికయందు సరిపెట్టిరి. అట్లే రాయవారి అందీన్ అనునది ధాతు పల్లవము. కావున నది దోషము కాదు. భారతోద్యోగ పర్వమునందు ‘ఇతఁడు మదీయాగ్ర పురోహితుఁ డితనికి నెల్ల పనులు నెఱిగించిపుడే’ అనియు ‘వెఱచిట్లంబుధినాథ నందను’ లని నిర్వచనోత్తర రామాయణమునందు గలవు. అడిదము సూరకవి తన కవి సంశయ విచ్ఛేదమునందు వానిని క్త్వార్థక ఇకార సంధులుగా నుదాహరించెను. ‘వానికి ఎఱిగించి తగన్, వెఱ నిట్లంబుధి’ యని పాఠాంతరములను గుప్తార్థ ప్రకాశిక కారులు చూపిరి. అడిదము సూరకవి కాలము వరకు దీనిని బట్టి చూడగా పాఠాంతరములు లే వని తేలుచున్నది. తరువాతివారు దిద్ది పాఠాంతరములు

సృష్టించిరి. తిక్కన కాలమునుండి సూరన కాలము వరకు నున్న రచనను తను యిచ్చ వచ్చి నట్లు ప్రకాశకులు దిద్దుట చాల పొరపాటు. ఇట్లే ప్రకటన కర్తలు పాఠాంతరములు దిద్దుపాటులు కావ్యములందు కల్పించి భాషా స్వరూపమును చెడ కొట్టినారు. భాషాంగన కవుల పలుకుబడిలోనిది. దానిని లోకానుకూలముగా విద్వన్మహా కవులు వ్యవహరింతురు. దానిని మార్చుటకే కాదు ముట్టు కొనుట కైన ప్రకాశకుల కర్హత లేదు. తిక్కనగారు లోక వ్యవహారమును బట్టి యొకొక్క చోట క్త్వార్థకేకార సంధి సందర్భానుసారముగా నంగీకరించిరి. దానిని చూచి 'చించిచ్చు' అని వాడినారు రాయల వారు. 'అటు తరువాత విజయ విలాస కారుడు 'అటు చూపిటు, అన వలసంటి గాని, మగిడిచ్చునో' ఇటువంటివి నిరాఘాటముగా వాడి నాడు. అతడే కాదు. భాగవతమునందు 'ఎఱింగెఱింగి నా వలు విడి యేల కట్టుకొని' అని కలదు. క్త్వార్థక ఇకార సంధి తిక్కన కాలము నుండి యలవాటుగా వచ్చుచునే యున్నది. దానిని వాడుటలో రాయలవారి తప్పేమియు లేదు.

'దంచనపుఁ జేతులు గంగను కాసె, దూరఁగా వడుకుచెు కాకచేష్టుడిగె, చూడరయ్య సభవారి రంగభర్తంచు వీనియందలి గంగ+ అను = గంగను, చేష్ట+ ఉడిగి= చేష్టుడిగి, రంగభర్త + అంచు = రంగభర్తంచు నని తత్సమ అకారమునకు సంధి కూర్చుట దోష మని చాల మందివాదము. వీని కాధారము లేక పోలేదు. పూర్వకవుల కావ్యములందు కానరా కున్నను 'క్వచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్తని' అధర్వణుడు చెప్పెను. గంగ, చేష్ట, భర్త శబ్దములు సంస్కృతములు. వానికి తెనుగు శబ్దములగు అను, ఉడిగి, అంచులు పరమైనవి. వాని ఆది అచ్చునకు సంధి చేయ బడినది. అదివర కిట్టి సంధు లితర కావ్యములం దుండనిచో నిట్టి సూత్ర నిర్మాణము నకు తావుండెడిది కాదు. అట్టి సంధి కల రచన లాయన కాలమునం

దుండి తీర వలయును. అవి కాల గర్భమున మణిగి యుండ వచ్చును. లేదా స్వతంత్రించి యీ సూత్రమునకు లక్ష్యముగా రాయలవారీ ప్రయోగములను చేసి యుండవచ్చును. అతడు తగిన సమర్థుడు. కావున పై సంధులు తప్పులు గావు.

ఇంక కొను ధాతువునకు 'క' వాడుట కలదు. 'కొంగవా ల్నరుకు లంగుళులఁ బట్టుక జబ్బ లంట గుట్టెడ వెజ్జు నరయువారు' ఇందు పట్టుకొని యనుటకు పట్టుక అని వాడుట తప్పందురు. పట్టుక వ్యావహారికము. 'ఊదుక పోవు శంఖము నహో గళ రేఖ' అని విజయ విలాసము. ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. రాయల వారి కాలమునం దిట్టివి వాడుకయం దుండి యుండ వచ్చును. అప్పటినుం డిప్పటి వరకు గల కావ్యము లందు నిట్టి వ్యావహారిక క్రియలు పెక్కు గనిపించు చున్నవి. కావున రాయలవారు పట్టుక అని వాడి యుందురు. వెతికి చూచినచో నిట్టి ప్రయోగములు పూర్వ కవుల కావ్యములం దుండక పోవు.

'పుట్టు న్నీగెద దీని నా నొదవి యో పుణ్యాత్మ' పుట్టున్ + ఈగెద = పుట్టున్నీగెద నని విష్ణుచిత్తీయ మారవ ఆశ్వాసమునందు రాయలవారు వాడిరి. పుట్టు నీగెద నని యుండ వలయు నని యందురు. 'లు క్సంశ్లేషౌ నాచి' అచి పరే సతి ద్రుతస్య లోపసంశ్లేషౌ నస్యః అచ్ పరకత్వేన ద్రుతస్య లోపో న స్యాత్. అచ్చు పర మగు చుండ ద్రుతమునకు లోపము కలుగదు. కావున పుట్టున్ + ఈగెద అని యుండగా 'ద్రుతా ద్ద్రుతః క్వచి చ్చాత్ర దృశ్యతే కవి భాషితే' అను అధర్వణ కారికవలన ద్రుతము మీద ద్రుతము వచ్చి పుట్టున్ + న్ + ఈగెద = పుట్టున్నీగెద నను రూప మేర్పడును. ఇట్టి ప్రయోగములు భారతాదులందు చాల గలవు. ఇది దోష మని యెత్తి చూపిన వారిది దోషము కాని రాయలవారిది కాదు. 'వరుదుడు పార్థు శౌర్యవిభవంబున కాతని ధైర్య శక్తికి న్నరుదుగ' శక్తికిన్ + న్ + అరుదుగ = శక్తికిన్నరు

డుగ ననియు, 'దీని నేట్బలు గ్రమ్మరింతు మదీయ భాషిత మెన్నడు స్నేని మోఘము కాదు' ఎన్నడున్ + న్ + ఏని = ఎన్నడు స్నేని యనియును భారతమునందు నన్నయగారు వాడిరి. రాయలవారు సర్వ లక్షణ లక్ష్యములను పరిశీలించి వ్యాకరణ విరుద్ధములు గాని ప్రయోగములనే వాడెను. విష్ణుచిత్తీయమునందు దోషము లున్న వనుట అతి సాహసము.

రెణ్ణాళ్లు, కళ్లానన్ అనునవి విచిత్ర ప్రయోగము లని వేంకట రమణాచార్యులవారు తలంచిరి. రెండు + నాళ్లు = రెన్నాళ్లు, ఇది ఆర్య వ్యవహార సిద్ధము. మూడు + నాళ్లు మూన్నాళ్లు వంటిది కళ్లము నన్ కళ్లానన్ అని 'వికృతౌ క్వచి చ్ఛ లోపో మోద్ధీగ శ్చాత ఆది మస్యభవేత్' అను సూత్రముచేత నేర్పడిన రూపము. ఇందు విచిత్ర మేమియు లేదు. తెలుగునకు వ్యాకరణము చిన్న దీప మని వేంకట శాస్త్రిగారు చెప్పిన మాట నిజము. లాక్షణికులు తెలుగు వాఙ్మయమును పరిశీలించిన కొలంది క్రొత్త క్రొత్త ప్రయోగములు దొరకును. వాని కింకను లక్షణములు ప్రతిపాదింప వలసి యున్నవి. క్రొత్త శబ్దములు సంధులు పొడము చుండును తెలుగు సజీవ మగు భాష. అది కాల గతి ననుసరించి మారు చుండును. వానిని మహాకవులు కావ్యములం దుపయోగింతురు. వానికి సూత్రములు నిర్మించుట వాఙ్మయ వేత్తల పని. విద్వాంసు లగు మహాకవుల రచనలందు దోషములు కల వనుట సాహసము. పురాతన వ్యాకరణ గ్రంథములను దృష్టియం దుంచుకొని వానిని దిద్దుట అంత కంటె సాహసము. అది భాష నగౌరవ పర చుట యగును.

ఖాండిక్య కేశిధ్వజ సంవాదము విష్ణుచిత్తీయమునం దతికించి నటు లున్నది. కావ్యమునందు దాని ప్రయోజన మేమియు లేదు. రాయల రాజనీతి యోగ విద్యా వైదుష్యము వెల్లడించుటకు దానిని చేర్చె నని కొందరి వాదము. అది సరికాదు. విష్ణుచిత్తుడు పర మత ములను ఖండించెను. విష్ణు తత్త్వమును నిరూపించెను. విషువ

పరతత్త్వమను పరిజ్ఞానముచేత మోక్షము లభింపదు. వైకుంఠము నందు విష్ణు సాన్నిధ్యమును చేర వలయును. అదియే విశిష్టాద్వైతము నందు మోక్షము. దానిని సంపాదించుటకు యోగము సాధనము. దాని విధానము తెలిపిన గాని విష్ణుచిత్తుని కార్యము సంపూర్తి కాజాలదు. ఖాండిక్య కేశిధ్వజ సంవాదము మూలమున దాని నెరిగించెను. కేశిధ్వజుడు యజ్ఞ కార్యమును పరిపూర్తి గావించు కొనెను. తిరిగి ఖాండిక్యుని దగ్గరకు వచ్చెను. గురు దక్షిణ కోరు కొమ్మని ఖాండిక్యు నర్థించెను. అతడు మంత్రుల నడిగెను. వారు గురు దక్షిణగాఁ జతురర్ణవీ వృతోర్వీ వలయం బశేషమును వేడు మని నుడివిరి. ఆ మాట ఖాండిక్యునకు నచ్చ లేదు. అతఁడు కర్మయోగి. ముముక్షువు. కేశిధ్వజుడు జ్ఞానయోగి. మోక్షార్థి. యజ్ఞాదులవలన పుణ్యము సంపాదించు కొన యత్నించు చుండెను. ఆ పుణ్యము స్వర్గమునందు భోగానుభవముచేత క్షయించు నని వానికి తెలియును. కాని యవిద్య వాని నావరించి యున్నది. దానిని కేశిధ్వజుడు జయింప లేకుండెను. అందు మూలమున రాజ్యము మీఁద మమత నెడ బాయ కుండెను. ఈ సందర్భమున రాయలు

ఆస పడుదురె బుధులు రాజ్యమున మమత
మాని జడాత్ము లట్ల హాంమాన పాన
మత్తులకె కాక యది యేల మాదృశులకు
ననిన హర్షించి మెచ్చి యజ్ఞనకుఁ డనియె

ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప
ననఘ రాజ్యమును మఖాదికములుఁ
జేయు చున్నవాఁడ క్షీణింపఁ జేయుదుఁ
బుణ్య ఫలము భోగ భుక్తివలన

అని రెండు పద్యములు రచించెను. ఇందు ఖాండిక్య కేశిధ్వజుల ప్రవృత్తి భేదములు చిత్రింప బడినవి. కర్మ పుణ్యము నొసంగును.

అంత మాత్రము చేత మోక్షము లభింపదు. ఆధ్యాత్మిక చింతన యుండ వలయును. అందు మూలమున పరతత్త్వ జ్ఞానము సంపాదింప వలయును. ఉట్టి జ్ఞానము వలన ప్రయోజనము లేదు. నిరంతరము నావృత మయి యుండు నవిద్యను జయింప వలయును అను భావము పై పద్యములం దిమిడి యున్నది. కేశిధ్వజుడు అవిద్యను వివరించెను.

ఆత్మ కాని మేన నాత్మ బుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వ మతియు
నవనివర ! యవిద్య యను మహాతరువు ను
త్పత్తికి ద్వయంబు విత్తు మొదలు

ఈ పద్యము

అనాత్మ న్యాత్మ బుద్ధిర్యా
అస్వే స్వ మితి యా మతిః
అవిద్యా తరు సంభూతి
బీజ మేత ద్ద్విధా స్థితం

అను విష్ణు పురాణ శ్లోకమునకు ననువాదము. భావ మించు కంతైన బీరు పోనీయక తెలిగించుటలో రాయలవారు సిద్ధ హస్తుడు.

ప్రాణి కోటి కెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు
విషయ సంగియైన విను బంధకారి ని
ర్విషయ మైన ముక్తి విభవ కారి

ఈ పద్యము

మన ఏవ మనుష్యాణాం
కారణం బంధ మోక్షయోః
బంధాయ విషయా సంగి
ముక్త్యై నిర్విషయం మనః

అను శ్లోకమునకు తెనుగు. ఆంధ్రీకరణ మొక నేర్పు. దానికి ప్రజ్ఞయు ప్రతిభయు తోడు కావలయును. అప్పుడు కాని యిట్టి రచన యల వడదు. శ్లోకమునకు తగిన వృత్తము నెన్నుకొన వలయును. అందు నిరర్థక పదములు గాని యధికార్థక పదములు గాని రారాదు. భావము సరిగా తూచి నట్లు వ్రాయవలయును. ఇట్టి విధము లన్నియు రాయల యనువాదములో కనిపించును. వానికయి ప్రయత్నించును. కృతకృత్యు డగును. కావున వాని పద్యము లొకొక్కప్పుడు ప్రయత్న పూర్వక ముగా రచించి నటు లగుపించును. రాయలవారి పద్య రచనా విధాన మొక విచిత్రముగా నుండును. ఆయన మహాపండితుడు. తన భావమున కను వగు

శబ్దములు

నిర్మించుకొనును. దానికి చక్కని రూప కల్పనము గావించును. పద్యమునం దను వగు చోట నుపయోగించు దానిని చదువు నప్పుడు పాఠకుడు మొదట తబ్బిబ్బగును. ఆలోచించి యర్థము చేసికొనిన పిదప రాయల శబ్ద శాస్త్ర జ్ఞానమునకు నబ్బుర పాటు వహించును. లోలోన నుబ్బి పోవును. పైపద్యమునందు 'అస్వంబు, స్వత్వము' అటువంటివి. స్వ అను దానికి ప్రథమా విభక్తి చేర్పగా స్వము స్వంబు అగును. నజ్ వచ్చి అస్వంబు అగును. నజ్ తత్పురుష సమాసము. ఇట్లే అహంస చ్ఛద, పురిమేగించి మొదలగునవి అరయునది. వెనుకటి పద్యము నందు అహం మానము కూడ నిట్టిదే. ఇట్టి రాయల పాండిత్య ప్రకర్ష వెలయించు శబ్దములు విష్ణుచిత్తీయమునందు పెక్కు కలవు. సాధ్య మగు నంత వరకు తన భావము బీరు పోనీయ కుండ పద్యములో నిముడ్చు టకు రాయలు అల్పాక్షరములు గల పదములను వెదకి యుపయోగిం చును. శయ్య జాల్వారినను వార కుండినను వానికి పనిలేదు. పదము లందు కాని కూర్పు నందుకాని మృదుత్వ పరిశీలన పాటించుట వాని పని కాదు. భావ మిమిడించుట వాని యుద్దేశము. ఇన + ఊష్మన్ = ఇనో

ష్మన్ అల్ప + అనేహాః = అల్పానేహాః, స్వల్పాక్షర సహిత మయి అధిక భావము ప్రదర్శింప గల శబ్దములు తత్సమములు. కావున రాయల వారి రచనయం దధికముగా తత్సమ శబ్దములు కలవు. ఆయన హృదయ మమర కోశమునకు నిఘంటువులకు నిలయము. తలంపు మాత్రముచేత భావానుగుణము లగు శబ్దములు బయలు వెడలును. రాజులు నూతన ప్రియులు. రాయలు మహారాజు. వానియందు క్రొత్త క్రొత్త శబ్దముల నెన్ను కొనును. వానిని పద్యములం దుపయో గించును. అవి పాఠకుల నిత్య పరిచయమునకు దూరముగా నున్నను రాయలవారి కంతగా పట్టదు. అవి మూరు మూల పదము లయినను వానికి లక్ష్యము లేదు. వినూతనత్వ మున్న చాలును. అది వాని హృదయమున కానందము తృప్తి నాపాదించును.

స్యందన స్థిత బిడౌజః క్షుత్తృ జాడ్య కృ
జ్ఝంయూ మరు ద్గరు జ్ఝాత్కృతములు

'క్షుత్తృ జాడ్య కృత్ సూతః క్షుత్తా చ సారథిః' అని క్షుత్తా యనగా సారథి యని యర్థము. సారథి సూత శబ్దములు వాడుకలో నున్నవి. అవి ప్రాత బడిన శబ్దములు. వానియందు వినూతనత్వము లేదు. కావున రాయలవారి కవి ప్రీతి కరములు కాలేదు. అందును అవి వర్ణ దార్ఢ్యములు కావు. ఊతము తక్కువ. పలుకు బడిలో నాలుకకు గట్టిగా తగులవు. రాయలకు రణాంగమునందు వలెనె సాహితీ సమ రాంగణమునందును తన పాటవమునకు తగిన పద ముండ వలయును. కావున బిడౌజః క్షుత్తృ జాడ్య ఇత్యాది పదముల సంపుటీ కరణము రాయలకు వినోద మయినది. చర త్కలంబ కదంబకములట. 'కలంబి మార్గణ శరాః' అని కలంబము లనగా బాణము లని యర్థము. ధర్మ నైచికీ వధ క్రమంబు నైచికి యనగా గోవు అని యర్థము. ఉత్తమా గోషు నైచికీ. ఆవులం దుత్తమ మైన ఆ వని భావము. కృత పయః పాన నవ మేఘ పృథుకము

లు, పసిబిడ్డలు. 'పృథుక శ్శాబక శ్శిశుః' స్తనయిత్నుచ్ఛట ' స్తనయిత్ను ర్వలాహకః' అని' ఇట్టి వింత వింతలగు మూరు మూల శబ్దములు విష్ణుచిత్తీయమునం దపారముగా గలవు. ఇవి యన్నియు రాయల పాండిత్య ప్రకర్షను వెల్లడించును. దానికి తోడు రాయవారు వైష్ణవ మతావలంబి. అందలి యాచార వ్యవహారములను పట్టుదలతో నభ్యసించినవాడు. అభ్యసించుటయే కాదు. ఆచరణలో పెట్టిన వీర వైష్ణవుడు.

లావు గల యట్టి గుఱ్ఱపు
జావడముల మీఁద మాత్ర సంచులు దూలన్
గ్రేవల నేకాంగులు రా
లీవధముల నరిసె లవని విభునకుఁ గొనుచున్

సాత్తిన సాత్తని'కులము బలసి
విధి నిషేధము లెఱింగి తే మధుర కరిగ

మిగిలిన పదముల మాటటుండ నిందు. ఏకాంగులు, సాత్తినవారు, సాత్తనివారు, వైష్ణవులందు తెగలు. ఏకాంగులు విరాగులు. సంసారమును పరిత్యజించి నిరంతరము విష్ణు సేవయందు జీవిత సర్వస్వము గడపువారు. వీరు కాషాయములను ధరింతురు. సాత్తిన కులము వారు ద్రవిడ ప్రబంధములను చదివి విష్ణు సన్నిధియం దుపచరించు నధికారము గల బ్రాహ్మణ వైష్ణవులు. సాత్తని కులమువారు ద్రవిడ ప్రబంధములను చదువు నధికారము గలవారు. కాని విష్ణు కైంకర్యాదులకు పనికిరారు. వారు బ్రాహ్మణేతరులు. సాత్తని శబ్దము నుండి సాతాని శబ్దము వచ్చిన దనియు సాతాని మతస్థు లగు వైష్ణవు లనియు వారిది రామానుజ వైష్ణవ మనియు కొంద రభిప్రాయ పడు చున్నారు. ఈ విభిన్న మతములు రాయల కాలమునం దుండియు నున్నవి. నేను విష్ణుచిత్తీయము చదువు చున్న కాల మది. నా కీ

మత విభేదములను తెలిసికొన వలయు నని కుతూహలము కలిగినది. చాల మంది వైష్ణవ స్వాముల నడిగితిని. నాకు సరిగా సమాధానము చెప్పినవారు లేరు. పైగా కోపగించుకొని మొగము మోడ్చు కొనినవారు పెక్కుమంది కలరు. నాకు చిన్నతనము. కొంటె తనమున కడుగు చుంటి నని వారి తలంపు. బందరునందు రామానుజ కూట మున్నది. అది సుప్రసిద్ధ మయిన వైష్ణవ కూటము. అచటి కొక సారి వైష్ణవ స్వాము లరుదెంచిరి. వారు మహా పండితులు. మా తండ్రిగారి వెంట నేనును వారిని దర్శించుట కరిగితిని. మహా పండితులను సందర్శించుట మొదటి నుండియు నా కొక యలవాటు. దానికి మా పితృ పాదులు దోహద మిచ్చు చుండెడివారు. వారి యడుగు జాడలు నాకు రాజ మార్గము లయినవి. వారి తను చ్ఛాయ నా కాశ్రయ మయినది. వారి శాస్త్ర పరిజ్ఞానము నాకు దీప మయినది. మా తండ్రిగారు స్వాములవారితో శాస్త్ర చర్చలు సలుపు చుండెడివారు. ప్రతి దినము స్వాములవారు శిష్యులలో నొకనిని సాయంకాలము మా తండ్రిగారి కొరకు పంపు చుండెడివారు. వానితో నాకు పరిచయ మయినది. నేను వారి నడిగితిని. వారు వైష్ణవ తెగలను గురించి వివరించిరి. చాత్తిన చాత్తని శబ్దాలు ద్రావి డములు. అవి సాత్తిన సాత్తని అని వాడుదురు. అని తేల్చినాడు. ఇట్టి వైష్ణవ పారిభాషిక పదాలు వేదాంత శాస్త్ర సూత్రాలు రాయల వారి పద్య రచనలో కనిపించును. అందు మూలము శయ్య పెళు సుగా నున్నటుల తోచును. వీనికి తోడు సంస్కృతమునందు స్త్రీలింగ శబ్దముల విశేషణములు స్త్రీలింగములుగా వాడుటలో శబ్దములు ఖండింప బడి నటు లుండును. అందు మూలమున వినిడికి విందుగా తోచవు.

పసిఁడి గచ్చుమరక సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలితయుఁ జిత్రితయు నైన

సభ మహాకుథముపై

సభా స్త్రీలింగము సంస్కృతము. దీర్ఘాణాం హ్రస్వ స్యాత్. సభ తత్సమము వాని విశేషణములు తుంగిత, విశాలిత, చిత్రిత శబ్దములు. స్త్రీలింగములుగా చేయబడినవి. సంస్కృత రచ నానుభవము కలవారి కది అందముగా నుండును. తెనుగు రచన కలవాటు పడిన వారికి వింతగా నుండును. శబ్దములందు నిండిక లోపించి నటుల తోచును. తుంగితము విశాలితము చిత్రితము అని నంత మృదుత్వము కనుపించదు. యతి కొరకు గాని ప్రాస కొరకు గాని గణ పూరణ కొరకు గాని వ్యర్థ పదములు వాడుట రాయలవారి కిష్ట ముండదు. కావున అన్వయ క్రమమును తారు మారు గావించి యైన పదములు వెనుక ముందులు మార్చి నిర్థక పదములు లేకుండ ఒకొక్కప్పుడు అన్వయముకొరకు సరిపెట్టును. అందు మూలమున పాఠకుడు తారుమా రగును. వెనుక ముందరలు తడుముకొన వలసి వచ్చును

ఎప్పుడు హరిఁ గని రమరులు
ముప్పదియును మూఁడు కోట్లు మునిఁ గనుఁ గొను వా
రప్పుడు తత్కరములతో
దిప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్

విత్తు మొదలు మొదటి విత్తు ప్రథమ బీజ మని యర్థము. పద క్రమము తారు మా రగుటవలన అన్వయము పద్యము చదువ గానె భావ మవగతముకాదు. కొంత ప్రయత్నము కావలసి వచ్చును. రాయలవారి పద్య రచనా విధానమున కలవాటు పడినవాని కది వినోదముగా నుండును. లేనివానికి నారికేళ పాక మని పించును. పాండిత్య సంపాదన కొఱకు తెనుగు సాహిత్య గ్రంథములలో విష్ణుచిత్తీయము, వసుచరిత్ర, శృంగార నైషధము, చదివి తీరవలయును. వానియందు మణి దీపము లున్నవి. వాని నొక్క టయిన విడువ కుండ పరిగ్రహింప వలయును. అందు మూలమున విజ్ఞాన తేజము పాఠకుల చిత్త కుహారము నందు పాటిల్లును. వాని నొక ప్రత్యేక వ్యక్తిగా తెనుగు సారస్వ

తమునందు భాసింప చేయును. భాగవతము వేదాంత గ్రంథము. అందు కథలో నంతర్లీన మయి వేదాంత మంతటను వ్యాపించి యుండును. కావున భాగవతము చదువుటకు వినోదముగా నుండును. విష్ణుచిత్తీయము విశిష్టాద్వైత వేదాంత గ్రంథము. ఇందు వేదాంత ములో కథ యిమిడి యున్నది. వేదాంత శాస్త్రము తార్కిక వాదములతో నిబిడీకృత మయి యుండును. వానిని సమన్వయము చేసి కొని యనుభవమునకు తెచ్చుకొనుట చాల కష్టము. అట్టి విషయ ముల సారాంశమును గ్రహించి హృదయ గతము చేసికొనిన వాడు రాయలు. హృదయ గత మయిన దానిని అనుభవమునకు తెచ్చి కొని సర్వ జన మానసైక వేద్య మగు నటుల విష్ణు పురాణము లోని యంశములను ఉత్తర మీమాంసలోని విషయములను రామానుజులవారి వాదములను దృష్టియం దుంచుకొని

## పరతత్త్వ పరిజ్ఞానము

నకు చక్కని రాజ బాట కల్పింప గలిగెను. దేహము వేరు. ఆత్మ వేరు. దేహమునందు ఆత్మ యను బుద్ధి కలిగి యుండుట అజ్ఞానము. అది యవిద్యకు మూల బీజము. శరీరము పంచ భూతములతో నిర్మింప బడినది. గృహ క్షేత్రాదులు బొందివి. పుత్ర పౌత్రాదులు బొందివలన పుట్టినవారు. కావున ఆత్మవి కావు. శరీరము మరణించును. అట్టి కాయమువలన జనించిన పుత్రాదులందు తనవా రను బుద్ధి తగదు. ఆత్మ వేరని యెఱింగి నపుడు భోగము లాత్మ కంటవు.

జని సాహస్ర బహు ప్రయాణ మగు సంసారంపుఁ ద్రోవ న్సదా
చను చుండు న్ఘన మోహ ఖేద మలమ న్సంసారి పాంథుండు వా
సనలం ధూళి ముసుంగుఁ గాఁగ నెపుడేన్ జ్ఞానంపు టుష్ణోదకం
బునఁ దత్క్షాళన సేయు వాని కపు డమ్మోహ శ్రమంబు ల్గనున్

ఆట్టి మోహ శ్రమం బాఅ నా శరీరి
స్వస్థుఁడై తా ననన్యాతిశయ మబాధ
మనఁగ విలసిల్లు నిర్వాణ మనుభవించు
ననఘ తొల్లియు నిర్వాణ ఖనియ కాన

అని కేశిధ్వజుడు ఖాండిక్యున కుపదేశించెను. మాయావృతు లయిన మానవులకు రాయలవా రుపదేశించిన పరిజ్ఞాన మిది. ఆ పరిజ్ఞానము జ్యోతి వలె రాయల చిత్తమునందు వెలుగొందినది. కావుననే రాజ ఋషియై క్షత్రియ ధర్మము నాచరించుచు పరిజ్ఞాన వేత్త యయి జనకుని వలె మానవులకు జ్ఞాన జ్యోతిని వెలయింప గలిగినాడు. అంబరీషుని వలె నిరంతర విష్ణు సేవా పరాయణుడయి స్వ ధర్మము నాచరించుచు పర మత ద్వేషము లేక వర్తింప గలిగెను. రాయలు రాజులకే కాదు మానవుల కందరకు నాదర్శ పురుషుడు. ఆయన జీవి తాదర్శములు మానవులకు సమాచరణీయములు. పై పద్యములందు కొంత ప్రసాద గుణము కలదు. రూపకాలంకారము కవితకు స్వరూప చైతన్యములను కల్పించు చున్నది. ఒక్క వ్యర్థ పదము రానీయ కుండ పద్యములను నడిపించుటలో రాయల ప్రజ్ఞ యినుమిడి యున్నది. సంసారి యొక బాటసారి. సంసార మనునది దారి. అనేక జన్మలను ప్రయాణము సాగించును. కావున కర్మలను ధూళి వానిని కప్పుకొని యుండును. జ్ఞానము వేడి నీరు. దానితో స్నాన మొనరింప వలయును. అందు మూలమున కర్మ పాంసువులు తొలంగి పోవును. అవిద్య వలని పొడమిన శ్రమ నశించును. శరీరి స్వస్థత కలవా డగును. దానివలన నిర్వాణ పదమును పొందును. ఆత్మ మొదటి నుండియు నిర్వాణ ఖని. అనగా మోక్షమునకు నిలయమని భావము. చక్కని అభిప్రాయము. ఇంత యభిప్రాయము నిట్టిమిడించి వ్రాయుటలో రాయల నేర్పు ప్రశంసింప తగినది. ఇంతే కాదు రాయలవారి పద్యము లన్నియు నింతబిగువు కలిగియుండును. ఏ యక్షరము తొలగించిన నేవిశే

షార్థము పోవునో యనిపించును. దానికొరకు పదము కుంచించి వాడును. కాన రాయల కవిత జాలు వారక జటిలత కల దయి యుండును. ఈ జటిలత్వము పద్య రచనయందే కాదు వచన రచన యందును గోచరించును. 'జలం బస్పృష్ట దహనం బయ్యెఁ దదీయ యోగంబునఁ గల శోదరంబున నునికిం దా నతి శీతలం బయ్యె నుడికి శబ్దోద్రే కాది ధర్మంబులం బొందున ట్లాత్మయుం బ్రకృతి సంబంధమున నహమ్మా నాది దూషితుండై ప్రాకృతంబు లగు ధర్మంబులం బొందు'. ఇత్యాదికము లరయునది. ఇట్టి రచనకు ప్రధాన కారణములు సంస్కృత భాషా పరిచయము, శాస్త్ర పాండిత్యము, అనువాదము. రాయలవారు సంస్కృత భాషయందు మిగుల పరిశ్రమ గావించెను. సంస్కృతమునందు వాక్య రచనా విధానము అన్వయ క్రమము ననుసరించి యుండదు. పదములు తారు మారుగా వాడబడు చుండును. విశేషణ విశేష్యములు తప్పకుండ లింగ విభక్తులందు సమన్వయింప వలయును. ఇట్టి రచన తెనుగునకు వింతగా నుండును. రాయవారి విష్ణుచిత్తీయములోని తృతీయాశ్వాస మంతయు వేదాంత శాస్త్ర చర్చ. శాస్త్రములందు నిరర్థక పద ప్రయోగ ముండదు. ప్రకృతి, అవిద్య, నిర్వాణము ప్రత్యాహారము, బీజము, అబీజము, పరము, అపరము, మూర్తము, అమూర్తము మొదలగునవి సాంకేతిక పదములు. వానిని పద్యములం దుపయోగించుటవలన శయ్య మరింత జటిల మయి వేదాంత శాస్త్ర పరిచయము లేని వారికి అగమ్య గోచరముగా నుండును. రాయలవారు వాడిన ఖండన సూత్రము లన్నియు నర్థము చేసి కొనుటకు శాస్త్ర పరిచయ ముండ వలయును. ఖాండిక్య కేశిధ్వజ సంవాదము సంపూర్ణముగా విష్ణు పురాణాంతర్గత భాగమునకు విశిష్టాద్వైత పరముగా ననువాదము. అందు మూలమున విష్ణుచిత్తీయములోని తృతీయాశ్వాసము కావ్య రస పిపాసువులకు పూచిన సంపెంగ పొలుపు మధుక రాంగనలకు వలె భోగ బాహ్య మయి తోచును. సహనముతో చదువ నారం

భించు వారికి రాయల విషయ వివరణ మెంత హృదయంగమముగా నుండునో తెలియును. ఆయన సర్వతో ముఖ పాండిత్యమునకు పాఠకు డాశ్చర్య పోవును. రచనా వైదగ్ధ్యమునకు రిచ్చపాటు వహించును. విష్ణుచిత్తీయములోని తృతీయాశ్వాసమునందు డెబ్బది యారవ పద్యము మొదలు ఎనుబది యారవ పద్యము వరకు ముక్తికి కారణ మయిన అష్టాంగ యోగమును కేశిధ్వజుడు ఖాండిక్యునకు విపులముగా నుపదేశించెను. అపార మయిన వేదాంత శాస్త్ర మహా పయః పయోరాశి లోతు పాతులు తుదిముట్ట నెరింగినవాడు రాయలవారు. అందలి రహస్యములను అవగాహనము గావించు కొనెను. సారామృత మును ముముక్షువుల కందిచ్చెను. మానవుల మోక్ష సంపాదనకు దారిని కల్పించెను. అది రాయలవారు స్వానుభవము చేసికొని విశ్వశ్రేయము కొరకు కావ్య రూపమున నిర్మించిన రాజ మార్గము. విశ్వశ్రేయః కావ్యం.

రాయలు సకల శాస్త్ర పరిజ్ఞాత. శాస్త్ర విషయములను పరిపూర్ణముగా నవగాహన చేసి కొనినవాడు. వానికి లోకానుభవము జత పరచి యాచరణయందు పెట్టినవాడు. అందు మూలమున నన్ని విషయములందు విజయము సాధించ గలిగెను. అనన్య సాధారణ మగు కీర్తిని సంపాదింప గలిగెను. విష్ణుచిత్తీయములోని ప్రతి పద్యము రాయలవారి సర్వతో ముఖ పాండిత్యము, స్వానుభవము, నిశిత పరిశీలనా దృష్టి, ప్రతిభ బహు ముఖముల చాటు చుండును. వాని నన్నిటిని చక్కగా నవగాహన చేసికొనినచో పాఠకునకు రాయల వారి యసాధారణ ప్రజ్ఞాసమంచిత మగు నిజ స్వరూపము గోచ రించును. విష్ణుచిత్తీయము రాయలవారి

జీవిత సర్వస్వ ప్రతిబింబము

మిగిలిన కావ్యములకు విష్ణుచిత్తీయమునకు చాల తారతమ్యము కలదు. భారతాది కృతు లాంధ్రీ కరణములు. వానియందు కవి స్వాను

భవనములను ప్రదర్శించుటకు తావు లేదు. కవి గంటను మూాల మడుగు జాడలలో వర్తింప వలయును. తిక్కన పోతనాదులు కొంత స్వతంత్రించినను కథానుగతమే గాని లోకానుగతము కాదు. కుమార సంభవాది కావ్యములు పాక్షికముగా ననువాదములు. ఊహా నిర్మితములు. కవి రస పోషణకు తన భావములు వెలయించును. అవి యనుభవమునకు సత్యమునకు దూరములుగా నుండును. వాని లేఖిని లక్షణంపు కట్టు త్రాళ్లను త్రెంచుకొన లేదు. పాల్కురికి సోమనాదుల పండితారాధ్యాది చరిత్రలు మతావేశ పూరితములు. వాని యందు కొంత సత్య మున్నది. సాంఘిక ప్రవృత్తి ప్రతిబింబించుచుండును. కాని యవి ప్రత్యేకముగా మత ప్రచారమునకు పుట్టినవి. అందభూత కల్పనలు మెండు. ఆధునిక కావ్య ప్రపంచము విశ్వామిత్ర సృష్టి. వానియం దచ్చ టచ్చట లోకము ప్రతిబింబించినను కవికి యనుభవము తక్కువ. ప్రతిభ సర్వ శూన్యము. తిరుపతి కవులవంటి మహాపురుషుల మాట నే నెంచుట లేదు. వారు ఆధునిక కవి గురువులు. లోక వంద్యులు. నేను నుడివినది సామాన్యోక్తి. విష్ణుచిత్తీయము వీని యన్నిటికంటె విభిన్న మయినది. రాయలు తెలుగు సామ్రాజ్యాధినేత.

తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
తెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకండ
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స

నిజమునకు రాయలవారు కన్నడ రాయడు. వాని మాతృ భాష కన్నడము. కావుననే యలవాటు చొప్పున కన్నడ పదము లందందు విష్ణుచిత్తీయమునందు దొరలుచు వచ్చెను. సంస్కృత భాషయం దపారమగు పాండిత్యము సంపాదించెను. అందు మొదట మదాలస చరిత్రాదులు పెక్కు రచించెను. అనుభవము మీాద దేశ భాషలందు తెలుగు లెస్స యని గ్రహించెను. దానిలోని తియ్యతనము

చవి చూచెను. తెనుగును స్వంత భాష కావించు కొనెను. తెనుఁగొకండ యెల్ల నృపులు గొలువ బాసాడెను. తెనుగు కవులను మిగుల గౌరవించెను. తెనుగు కావ్యములను కృతి గొనెను. తెనుగున విష్ణుచిత్తీయము రచించెను. స్వానుభవము మీద సంపాదించిన యీ తెనుగు మీది యభిరుచి తనువులోని నర నరమునకు పట్టినది. ఆ సత్యము ఆంధ్ర మహావిష్ణువు నోట ననిపించెను. అది రాయల వారి అభిప్రాయము. దానిని దేవుని నోట పలికించుటలో నధిక ప్రమాణ మున్నది. ఆ కారణముననే దేశ భాషలందు తెలుగు లెస్స యను నుడి సుస్థిర మయినది.

రాయలవారు తెనుగు భాషా మాధుర్యమును స్వరూప గతము గావించు కొనిన కన్నడ రాయడు. కావుననే యీ యనుభవ మట్లు వ్రాయించినది. రాయలు ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను దృష్టియం దుంచుకొని రాజ్య పాలనము గావించిన మహారాజు. 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం ధర్మము సాధించుటకు శరీరము ప్రధాన సాధనము. దానిని సంరక్షించు కొనుట మానవ విధి. అందు రాజుల జీవితము పెక్కు అపాయములతో కూడి యుండును. కావున ఆత్మ రక్షణమునం దప్రమత్తులయి యుండ వలయును. • దానిని గుర్తించినవాడు రాయలు. అతడు మేధావి. జాగ్రత్త కలవాడు. తన యనుభవము 'కనుమలందు నిలువ వేలు వేలు యేర్చి విలుమందిఁ బనిచి' నాడు ఖాండిక్యు డని నుడివెను. ఇతర కవు లయినచో ఆ మాటయే స్మరించెడివారు కారు. అంతే కాదు ఖాండిక్యుడు యుద్ధమునం దోడి పోయెను

చెడ విఱిఁగి యడవిఁ బడి యెడ
నెడ గట్టుల తుదలఁ గోటి యిడిలోఁ గడకున్
దడుకుఁ బొడిపించి యాకుల
గుడిసెల వసియించె మంత్రి గురు భట యుతుఁడై

కొండల మీఁద వేగులను కాపుంచుటయు చుట్టు కంప నాటించుటయు నాత్మ రక్షణోపాయములు. సామాన్య కవుల మనోదృష్టికి తగులనివి. రాయలు క్షత్రియ ధర్మములు బాగుగా నెరింగినవాడు. వాని నాచరించినవాడు. కావున నిదర్శనముగా చెప్ప గలిగెను. ప్రజా సంరక్షణము రాజులకు ధర్మము. దానికి బల పరాక్రమము లుండ వలయును. వైరుల నెదిరించి విజయము సాధింప వలయును. పరరాజుల వలని ప్రజలకు బాధ కలుగరాదు. అట్లు రాజ్య రక్షణము కావించు కొన లేని రాజు రాజ్యమును విడిచి యడవులం దుండుట మేలని రాయలవారి తలంపు. కావునఖాండిక్యుని నోట

రణం

బునఁ బాడిన్ రిపు గెల్చు వాడియుఁ బ్రజా పోషణంబు ధర్మంబు రా
జున కౌ నైన నశక్తుఁ ద్వ ద్విజిత రాజ్యా న్న న్నఘుం బంటునే

నరనాథ ! యీ రాజ్య పరిపాల నారాతి
హాన నాది కృత రూప యగు నవిద్య
యనధికారికి విసర్జనముఁ గావింపంగఁ
గలుషంబు రా దధికారి యైన
వాఁడు విసర్జింప వచ్చు వర్ణాచార
లోపంబుచే నగు పాప లేప

మని యనిపించెను. రాయలవారు క్షత్రియుడు. ప్రజాపోషణము రాజ్య రక్షణము క్షత్రియ ధర్మములు. అట్టి ధర్మాచరణకు రణంబునఁ బాడియు రిపుల గెల్చు వాడియు నుండ వలయును. అవి గల వానికే రాజ్య పాల నాధికార మున్నది. ఆ సంగతి లోకానుభవము వలన గ్రహించినాడు రాయలు. ఆయన మహావీరుడు. పరాక్రమ శాలి. స్వ మత దేశ భాషాభిమానములు కలవాడు. రాయలు

పట్టాభిషిక్తు డగు నాటికి దేశ మల్లకల్లోలములం దుండెను. ఒక వంక బీజపూరు సుల్తానులు ప్రబల శత్రువులు. మతావేశమున నుత్తరంగిత మయిన తురుష్క సైన్యములు మహా సముద్రము వలె పొరలి హైందవ మతమును సంస్కృతిని విధ్వంసము గావింప నుండెను. ఇంకొక వంక నాశా పిశాచ మావేశింప కర్ణాట రాజ్య సింహాసనము కబళించుకొరకు నోరిస్సా గజపతులు చిందులు త్రొక్కు చుండిరి. రాయల స్థితి పంచాగ్ని మధ్య గతం బయిన సింగంపు గొదమ వలె నుండెను. చూచినాడు తన పరిస్థితులను. తలంచినాడు తగు నుపాయమును. స్వదేశోద్ధారణకయి కంకణము కట్టినాడు. చతురంగ బలములను కదలించినాడు. కత్తి కేల బట్టి రణయాత్ర కయి బయలు వెడలినాడు. బీజపూరు సైన్యములపై బడినాడు. వీరావేశ మిరు దరుల నతిక్రమించినది. మిన్నంట పొంగి నురుగులు కట్టినది. కత్తి వేయంచుల వాలయినది. అరాతి వీరుల గుండె లవియ చించి చెండాడినాడు రాములు. తురకల దుర్గముల నేల పాలు గావించినాడు. భయంకర సింహ గర్జనము గావించినాడు. రాయచూరు దద్దరిల్లినది. ఇరు చేతుల నెత్తి తెనుగు రాయలకు స్వాగత మిచ్చినది నగర లక్ష్మి. రాయలు ధన్య జీవి. రాజ ధర్మము తెలిసినవాడు. రాజ్య రక్షణకయి తన పదవి సుస్థిరము గావించు కొనుటకు విజయ యాత్ర విధ్యుక్త కార్యమని యాతఁ డెరుంగును. యామునాచార్యుడు రాజ్యాధికారమునకు వచ్చెను. ఒక్క సారి రాయలకు తన వెనుకటి సంగతి తలంపు నకు పారినది.

ఇట్లు శర త్సమయం బెసంగిన సంగీకృత క్షత్ర ధర్ముండు
గావున దిగ్విజయ యాత్ర ధర్మం బని యానీత బల షట్కంబు నాకృష్ట
సామంత రాట్కంబుగా వెడలి

గజ ఘోట స్యంద నాళీ కబళిత ధరణిం గాద్రవే యాధిరా ణ్మా
ర్ధజ రత్న శ్రేణు లంత ర్మణుల సవతులై మ్రగ్గఁ బాదాంత కుంత
ధ్వజ వాతాఘాత ఘూర్ణ ధ్వనధుల రవళు లాద్యము ల్మీరఁగాఁ ద
ద్ద్విజ రాజన్యుండు విద్వి డ్విదళన మని గావించె దిగ్జైత్ర యాత్రన్

ఇది రాయల స్వానుభవము. అనుభవమే కాదు. తా నొనరించిన కృత్యము. రాయల జీవితముతో దానికి సంబంధ మున్నది. కావున నింత చక్కగా చెప్ప గలిగెను. ఈ పద్యము వ్రాయు నప్పుడు తన జైత్ర యాత్ర మనో నయనమునకు పొడ గట్టి ప్రతి విషయము నుద్బోధించినది. ఏదియు బీరు పోనీయ కుండ పై పద్యమునందు పొందు పరచెను. అది పేరుకొని కరడు కట్టిన ఏకైక దధి పిండము. దానియం దే యణువు నిరర్థకము కాదు. పులియని తియ్య తనంబు తోడి పొందు కొనిన రాజసంపు కరకు తన మందు కలదు. ఆయన చిత్త సముద్రము నుండి మహోన్నత భావ తరంగము లుబుకెత్తును. దానిని వృత్తమునం దిమిడించును. ఆ యిమిడించు నపుడు భావ మిసుమంతైన దుసికిలి పోరాదు. కావున సముచితము లగు స్వల్పాక్షర శబ్దములను వాడు చుండును. అధిరాట్, ధ్వనదులు, విద్విట్, షట్కము, రాట్కము ఇత్యాదు లరయునది. రాజులు-స్వల్ప భాషణులు. అందు విపుల గంభీ రార్థము లిమిడి యుండును. తూకము నకు సరిపోవును. నిరర్థకము లుండవు. రాజసంపు కరకు పోకడలు వారి స్వభావములు. స్వభావ మనతిక్రమణీయము. ఆ లక్షణములే రాయల కవిత యందు గోచరించును. కావ్యము కవి స్వభావము ప్రతి బింబించు నిగ్గు టద్దము. విష్ణుచిత్తీయము రాయల పాండిత్య ప్రకర్ష, స్వభావము, గుణములు, జీవి తాశయములు ప్రదర్శించు మహా ప్రబంధము. ఇట్టి కావ్యము తెలుగు సారస్వతమునం దింకొకటి లేదు. విష్ణుభక్తి సత్యాన్వేషణము రాయల గుణములు. తాను నమ్మిన దానిని పట్టుదలతో నాచరణయందు పెట్టుట వాని

స్వభావము. మోక్ష సాధన మాయన జీవి తాశయము. రాయలు విశిష్టాద్వైత మతావలంబి. పారమార్థిక చింత కలవాడు. సంసారార్ణవగుం డయిన శరీరికి మోక్షము పరమావధి. మోక్ష ప్రదుం డగు పరతత్త్వమును గురించి సత్యాన్వేషణము గావించెను. వాని జిజ్ఞాస 'యపవర్గదుఁ డే వేల్పొతింగి వాని భజింప' తలంపు గొలిపినది

బహు సమయంబుల
మెలఁగెడు కోవిదులఁ జూచి విద్యా విద్యా శాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం
బెలయించునొ చూచి నిశ్చయింపుఁ డటంచున్

ప్రశ్నించెను. సాంఖ్యము, తార్కికము, బౌద్ధము, పండితుల సమక్షమున నభ్యసించెను. వాని ఖండనములు చదివెను. అవి యేవియు వానికి నచ్చలేదు. పూర్వ మీమాంస శాస్త్రము చదివెను. అవి స్వర్గాపాది. కర్మవలని కలుగు పుణ్య ఫలము స్వర్గ భోగానుభవమువలన క్షయించును. మరల ఆత్మ దేహము తాల్చి భూమిపై జనించును.

మఖాదికములు
చేయుచున్నవాఁడ క్షీణింపఁ జేయుదుఁ
బుణ్య ఫలము భోగ భుక్తివలన

అనినాడు కేశిధ్వజుడు. అది రాయలవారి యభిప్రాయము

త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే

తే పుణ్య మాసాద్య సురేంద్ర లోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవ భోగాన్

తే తం భుక్త్వా సర్వ లోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి

అని గీత యుపదేశించు చున్నది. స్వర్గ భోగములు తా ననుభవించు భోగములకంటె మిన్నలు కావు. వానియందు రాయల కాశ లేదు. మరల జన్మింప రాదు. మరణింప రాదు. అట్టి మోక్షము కావల యును. దానికయి మరల నన్వేషించినాడు రాయలవారు. అద్వైతము సాధన చేసినాడు. అందు చెప్ప బడిన జ్ఞానము పరతత్త్వము నెరుం గుటకు మాత్ర ముపయోగించును. అద్వైత పరతత్త్వమునకు రూపము లేదు. 'ఆకాశ మివ అనంతం బ్రహ్మ' అని వారి వాదము. ఆనందో బ్రహ్మ అని నిర్వచనము. రూత విరహిత మయిన యా పరతత్త్వ ముపాసనకు పనికిరాదు. పరతత్త్వ జ్ఞానమువలన మోక్షమురాదు. మరల పరిశీలించినాడు. పండితుల దండ నభ్యసించినాడు విశిష్టాద్వైతము తన మనోరథమందు సిద్ధించినది. పరతత్త్వ స్వరూప నిరూపణ మందు చేయ బడినది.

శరదించు చక చక స్మయ జిత్వ్రసన్నాస్య
దొడ్డ కెందమ్మి కందోయివాని
అతి కమ్ర గల్ల భాగాభోగ ఫాలాఢ్య
మకరాంక రత్న కర్ణికలవానిఁ
గాంబ వోద్య చ్ఛి విడంబి వృత్త శిరోధి
సిరి పొల్చు మచ్చ పేరురమువాని
నత నాభి యుత వళి త్రితయ శాతోదరు
జాను లంబి చతుర్భుజములవానిఁ

కరి వర కరోరు రుచిర జంఘా మనోజ్ఞ
సమత పొందిన పద పల్లవములవాని

హైమ వసనుఁ గిరీట హారాంగ దాది
కలితు శంఖ రథాం గాదు లలరువాని

శ్రీ మహావిష్ణువును చింతించిన మోక్ష మొదవు నని బోధించినది. వానిని చింతించుట యెట్లు అని మరల సందేహము. త న్నివృత్తికయి యోగము నభ్యసించెను. సమాధి యందుండి

ద
న్నియుఁడగు యోగి క్రమంబుతోడ
నొక్క యంగమె మున్ను చిక్కలో భావించి
యది దృఢం బగుటయు నవలి యంగ
కము మఱి చింతింపఁగాఁ దగు నట్టియ
భ్యాసంబువలన నయ్యవయవములు
నడచిన నున్న మానక యెద్ది యేనియుఁ
జేయు చున్నను మదిఁ బాయఁ డేని
యతని సామ్యంబు గని ముక్తు డగు

నని తెలిసికొనినాడు రాయలవారు. అంతటితో వాని యన్వేషణము ముగిసినది. అభ్యాస మారంభ మయినది. నిత్యము దాని నాచరించి కృతకృత్యు డయినాడు. తన యనుభవమే కేశిధ్వ జోపన్యాసము. యమ నియమములు గల

## మహారాజయోగి రాయలవారు

ఆ సంయమ నియమములు రాయవారి పద్య రచనయం దెల్లెడల గోచరించును. పదములను కుంచించి భావమును పెంచుట వాని స్వభావము. అ కారణముచేతనే వాని కవిత ఓజో గుణమును దాల్చి నారికేళ పాకమున పడినది. వాని యచంచల మగు దీక్ష అనన్య సామాన్యము. కావుననే విష్ణుచిత్తీయము ప్రారంభించినది మొదలు చివరి యక్షరము వరకు నొక్కటే రకముగా నడచినది. శయ్యయందు

మూార్పులేదు. నడకయందు దుడుకులేదు. యతి ప్రాసలకయి తడుము లాట లేదు. ఇట్టి నిరంతర మగు నేక వాహిక యగు కవిత ప్రదర్శించిన వారు తెనుగు సారస్వతమున చాల యరుదు. పోతన కది లభ్య మయినది. తిక్కన కలవడ లేదు. పెద్దన తిమ్మనలయం దగుపించదు. ఈ యభిప్రాయము కొందరికి విపరీతముగా తోచ వచ్చును. నిష్పాక్షిక బుద్ధితో పరిశీలించిన వారి కందలి సత్యము గోచరింపక మానదు.

ఆళి వచః కార్పణ్యాం

బా లేమల చెవులు సోఁక దథమాన్వయ జీ
ర్ణాలావణ్యుల పిలుపున
కై లాభముఁ దెలిపె నేని యవి శ్రీ లగుటన్

ఇది ప్రథమాశ్వాసమునందు వారకాంతల వర్ణనము. వార వనితల చెవులు శ్రీకారములు. ఆ కారణముచేత నవి చెలి కత్తెలు ధన లోభ మున అథమాన్వయులు, ముదుసలులు, కురూపు లగు పురుషుల వలని గలుగు లాభము నెంత యెరిగించినను వినవట. ఇందు హేతూ త్ప్రేక్ష కలదు. శ్రీ లగుటన్ అనుచోట సంపత్కారములు శ్రీకార మును బోలినవి అని యర్థములు

కృత పయః పాన నవ మేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాల పండ్లు
మఱి బలాకా ద్విజాళి సంప్రాప్తి కలిగెఁ
బెరుఁగఁ బెరుఁగంగ ధ్వనియు గంభీర మయ్యె

ఇది చతుర్థాశ్వాసములోని మేఘముల వర్ణన. వయస్సు ద్రావు నట్ట తొలకరి మేఘములనెడు పసి బిడ్డలకు వడగండ్లను పాల పండ్లు రాలి నవి. బలాకము లను పళ్ల వరుస వచ్చినవి. అవి పెంపొందిన కొలందియు పలుకుబడిలోని ధ్వను లతి గంభీరము లయ్యెను. రాయల

వారి కల్పన, అలంకార ప్రీతి, భావ గంభీరత, లోకజ్ఞానము, పద్య రచనా వైదగ్ధ్యమున కీ పద్య మొక్కటి చాలు. పసిపిల్లలకు మొదట పాలు త్రాగు కాలమున పాల పళ్లు వచ్చును. అవి యూడిపోవును. మరల దంతములు వచ్చును. అవి పెరిగిన కొలంది మాటలలో స్ఫుటత్వ మేర్పడును. రాయలకు పరిశీలనా శక్తి మెండు. వాని చిత్తము నూచిన ప్రతి విషయమును నిగూఢముగా దాచి కొనును. సమయమునకు వినియోగించును. కవికి శాస్త్ర జ్ఞాన మొక్కటి చాలదు. పాండిత్యము గ్రుడ్డెద్దు వంటిది. దానికి లోక జ్ఞానము స్వానుభవము తోడు కావలయును. దానిని పాండిత్యముతో జోడించి స్వబుద్ధి కల్పనా చమత్కారముతో ప్రదర్శించి నపుడే కవిత రాణించును. అక్కడే పండితునకు కవికి భేద మున్నది. కవికి బుద్ధి వికాసము మెండు. అది పండితున కుండదు. రాయలు సకల శాస్త్ర పండితుడు, కవి. కావుననే విష్ణుచిత్తీయము వంటి కావ్యము వ్రాయ గలిగెను. అతడు స్వతంత్ర మగు నాలోచన కలవాడు. వాని యూహా కొండల కెక్కి మింటికి ప్రాకును. పై పద్యమునందు పయః పాన మను చోట పాలు త్రాగు ననియు నీరు త్రాగు ననియు శ్లేష. మేఘములు పృథుకములు గాను, వడగండ్లు పాల పండ్లు గాను, బలాకములు దంతములు గాను ఉపమానోపమేయముల కభేదము కల్పించుటవలన రూపకాలంకారము. ఇందు శ్లేషాను ప్రాణిత మయిన రూపకాలంకారము కలదు

మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁ బ్రాలు వోయుచో
మెఱయు తదంగుళీ కిసల మేళనఁ జక్రి చెమర్ప రాలె పై
నఱి మఱి ఘర్మ బిందువులు నమ్మణులు న్మొగులందు నుండి డా
ల్గిఱిగొన జాలు ధారల బలె న్వడగండ్ల బలె న్గనుంగొనన్

ఇది షష్ఠాశ్వాసమునందు గోదాదేవి వివాహ ఘట్టములోనిది. ఇందు గోదాదేవి యంగుళీ కిసలయ మేళనమున శ్రీరంగేశుని మేన ఘర్మ

బిందువులు రాలె ననుట సాత్త్విక భావము. శ్రీరంగేశుని మేను నీల మేఘము వలె నల్ల నయినది. ఘర్మ బిందువుల ముత్యము లవలె నీటి ధారల వలె వడగండ్ల వలె జారె ననుట యుత్ప్రేక్షాలంకారము. కొందరు ఉపమాలంకార మని చెప్పుదురు. మేఘములం దుండి వడగండ్ల వలె ముత్యములు పడె ననుట శాస్త్ర సమ్మతము. మేఘములు ముత్యములకు జన్మ స్థానములు.

ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తు చోట
గుబ్బ పాలిండ్ల క్రేవఁ గ్రక్కున మురారి
కన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పైకెగురఁ జల్లె

నట. ఈ చిలిపితనము ప్రాయంపు కన్నెలను పరిణయ మాడు యువకుల కందరకు గల గుణము. అల్లసాని పెద్దనగారు

ముడి వడు కంకణ ప్రభల ముత్తెపు సేసలు దోయిలించి యె
త్తెడు తరి బాహు మూల కుచ దీప్తులపైఁ బతి దృష్టి పర్వనన్
బొడమిన లజ్జఁ బాణి యుగమున్ వెస వంచియె మౌళి మీఁదికిన్
బొడవునఁ జల్లె లే నగవు పొల్చుక చెప్పల నప్పళించుచున్

అని మనుచరిత్రయందు వర్ణించిరి. రెండింటియందు భావ మొక టైనను పెద్దనగారి పద్యమునందలి వర్ణనా వైరళ్యము రస స్ఫురితి, భావ శబలత రాయల పద్యమునందు లేవు. రెండింటియందు స్వభావోక్తి యలంకారము గలదు. ఇట్లు విష్ణుచిత్తీయ మాది నుండి యంతము వరకు బిగువు సడల నీయని శయ్యా పాకములతో రచన సాగించిన వాడు రాయలవారు. అట్టి రచనకు ప్రధాన కారణ మాతని కార్య దీక్ష. యమ నియమములు నితాంత మగు విష్ణుభక్తి, యోగము సహాయములు. ఒక వంక రాజ్య పాలనము, ఇంకొక వంక విజయ

యాత్రలు సాగించుచు దీక్షా నియమములు వహించి, యోగము బూని విష్ణువు నారాధించిన మహా యోగి రాయలు

అతి మహత్త్వంబుచే వెల్గు నట్టి శక్తి
నలరు బ్రహ్మాంబ దేవ తిర్య ఙ్మనుష్య
నామ చేష్టావ దవతరణముల నాత్మ
లీల జగ మువకృతికిఁ గల్పించు చుండు

నని యెఱింగినవాఁడు రాయలు. కావున విష్ణు నవతార మయిన తిరుపతి వేంకట నాయకుని అచంచల మగు భక్తి నియమములతో సేవించెను. ఆ దేవదేవుండు సకల ఫల ప్రదుండని నిశ్చయించు కొనెను. హరి వాస రోపవా సాది వ్రత నియమము వహించెను. యోగ శక్తిచే నా పరతత్త్వమును జూడ గలిగెను. యుద్ధాదికములం దైనను తన యమ నియమములను విస్మరించలేదు. రాయలు కళింగ దేశ విజిగీషా మనీషం బలముల గొని యుద్ధ యాత్రకు బయలు దేరెను. బలములతో విజయవాడ చేరెను. అందు కొన్ని దినము లుండెను. శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్ర మధు మథను సేవింప నరిగెను. హరి వాస రోపవాసం బచ్చట గావించెను. అప్పుణ్య రాత్రంబు చతుర్థ యామంబున

నీల మేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామన చాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడగించు జిగి హెచ్చు
నాయతం బగు కన్ను దోయితోడఁ
బులుఁగు రాయని చట్టుపల వన్నె నొరఁబట్టు
హొంబట్టు జిలుగు రెంటెంబుతోడ
నుదయార్క బింబంబు నొఱపు విడంబంబు
దొరలంగనాడు కౌస్తుభముతోడఁ

దమ్మి కేలుండఁ బెఱకేల దండ యిచ్చు
లేము లుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలఁకు దయఁ దెల్పు చిరు నవ్వుతోడఁ గలఁ ద
దంధ్ర జలజాక్షుఁడు

రాయలకు సాక్షాత్కరించెను. జాగ్ర దవస్థయందు కాని సుషుప్త్య వస్థయందు గాని కలలు రావు. సంధియందు వచ్చుచుండును. సామాన్యముగా రేయి నాల్గవ యామమునం దట్టి స్థితి మానవులకు వాటిల్లుచుండును. అప్పుడు స్వప్నములు వచ్చుట సహజము. వానియందు సత్య ముండు నని ప్రతీతి. కావుననే తెలుగు కవు లందరికి తెల్లవారు జామున స్వప్నములు వచ్చినవి. అందు మొదటగా కలను కన్నవాడు తిక్కన. వాని యుపాస్య దైవము హరిహర నాథుడు. తండ్రి నాక లోక వాసి యగు కొమ్మ నామాత్యుడు. వానిచేత ముందుగా హరిహర నాథు డిదె విజయంజేయు చున్నవా డని తన కెరింగింప చేయుట లౌకికము. పోతన రెండవవాడు. అతడు కుల పరంప రాగతం బయిన పంచాక్షరీ మంత్రోపాసకుడు, శైవ మతావలంబి. సోమోపరాగంబు రాకం గని గంగయందు క్రుంకు లిడెను. బయలు వెడలెను. మహనీయ మంజుల పులిన తలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుండెను. కించి దున్మీలిత లోచనుండయి యుండెను. రామ విభు డాయన కన్నుగవ యెదుట కానం బడియెను. ఇది మానసికము. రాయలు వేంకటపతి పద భక్తుడు హరివాస రోప వాసంబు గావించెను. రేయి జాగరణం బొనరించెను. హరి ధ్యాన స్మరణాదులతోడ రేయి వెళ్ళ బుచ్చు చుండెను. హరి రూపాం తర మయిన ఆంధ్ర విష్ణువు సాక్షాత్కరించెను. ఇది యౌగికము. రాయలు రాజయోగి. విష్ణువు రూపము లయిన ఆంధ్ర విష్ణువు వేంకట నాయకు లేక మూర్తు లని యెరింగినవాడు. తన యభిప్రాయ

మును ఆంధ్ర విష్ణువు ముఖమున 'ఒక్కొక సంకేతమగా కతఁడు రస న్నే గానె' అని పలికించినాఁడు.

పై సీస పద్యమునందు మొదటి నాల్గు పాదములు అలసాని పెద్దన గారివి. చివరి గీతము రాయల వారిది. ఈ రచనా సంయోగము పెద్దనకు రాయల వారికిని మనుచరిత్రకు విష్ణుచిత్తీయమునకుఁ గల

సమైక్యత

ను చాటుచున్నది. సీస గీతములు భిన్న వృత్తములు. అట్లయ్యును వానికి సమైక్యత నాపాదించి సీస లక్షణముగా నంగీకరించినారు లాక్షణికులు. సీస పాదములకు చైతన్య మగు జీవ కళ నుత్పాదించునది తుది గీతము. ఆ విధముగానే పెద్దన రాయవారు విభిన్న రూపులు. ఆత్మ శక్తిచేత ను భావముల చేత పాండిత్య ప్రకర్షణచేతను ఏక స్వరూపులు. పెద్దన దేహము. దానికి చైతన్యమును కల్పించిన ప్రాణము రాయలు. వారి యవినా భావ సంబంధము పెద్దన సీస పద్య పాదములకు తన గీతమును పొందు పరచుటచేత లోకమునకు ప్రదర్శించినాఁడు.

చిగురుఁ బొట్లపు దోయిఁ జెందమ్ములనఁ దార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర
నున్నుఁ గప్పు మేనఁ దోచిన తదర్కచ్ఛాయ
లీలఁ దాల్చు పసిండి చేల మెఱయ
వ్రాలిన యోగి వర్గము నిర్మలాంతఃక
రణముల వోలె హారములు దనర
సిరికిఁ బుట్టింట నెచ్చెలు లౌట మనవికి
డాసినా మకర కుండలము లమర

శ్రిత సిత మరాళ వాత్యాభిహత పరాగ
వలయ మండిత కల్పశాఖలో యనంగ
శంఖ చక్రాంచి తోరు హస్తములు దనరఁ
దోచె గమలేక్షణుండు చతుర్భుజుండు

అని యతి మనోహరముగా విష్ణుచిత్తునకు సాక్షాత్కరించిన హరిని వర్ణించిన రాయలు సీస పాదములు వ్రాయ లేక కాదు; పెద్దన రాయల యాత్మ లొక్క తీరువి. ఒక్క తీరువే కాదు ఒక్కటి. కావున రాయలకు సాక్షాత్కరించిన హరి స్వరూపము పెద్దన స్వారోచిషునకు సాక్షాత్కరించి నటుల వర్ణించిన స్వరూపము బింబ ప్రతిబింబము లయినవి. అందు మూలమున అభేదము లగు నాత్మ భావనలను నిరూపించుటకు నాల్గు సీస పాదములను గ్రహించెను. ఆ యభేద బుద్ధి రాయలకు లేనిచో పుర మేగ పల్లకి తన కేలఁ బట్టి యెత్తుటయు, కవి గండపెండేరము కాల తొడుగుటయు కలుగదు. రాయలు మహారాజాధి రాజు. సామంత మండల మౌళి మండన రత్న కాంతి నీరాజిత పాద యుగళుండు. పెద్దనను గౌరవించుట తన్ను తాను గౌరవించు కొనుట యని తలంచెను. అంతె కాదు తెనుగు దేశమును తెనుగు వాణిని గౌరవించుట యని భావించెను. పెద్దనకు చైతన్య జీవము రాయలు. అది పెద్దన్నకు తెలియును. అందుకనియే

ఆంధ్ర కవితా పితామహా అల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలుచు నట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రతికి యున్నాఁడ జీవ చ్ఛవంబ నగుచు

అని వ్రాసికొనెను. జీవచ్ఛవంబ నగుచు ననుటలో పెద్దనగా రంగీకరించిన సత్యమే యది. కాళీ దాసునకు భోజరాజునకు గల

యవినా భావ సంబంధము

పెద్దనకు రాయల వారికి గలదు. అది లోక వ్యాప్తమయిన సత్యము. దానినే తిరుపతి కవులు

అల భోజు చెప్పంగ నారంభమును జేసి
కాళిదాసునిఁ జెప్పి గాని మాన
రల విక్రమార్కు యోగ్యత చెప్పఁగాఁ బూని
భట్టిఁ జెప్పక మున్నె గట్టిపెట్ట
రల్ల రాజనరేంద్రు నారంభమును జేసి
నన్నయఁ జెప్పక మున్నె మాన
రల కృష్ణ దేవరాయలఁ జెప్పఁగాఁ బూని
పెద్దనఁ జెప్పక రద్దు సేయ

రని నుడివిరి. తెలుగు కవులలో నా గౌరవము నన్నయ పెద్దనలకే లభించినది. అందును తెలుగు సారస్వత చరిత్రయందు రాయలకు పెద్దనకు గల సన్నైక్యత మరే కవికి రాజునకు లేదు. వారు అభిన్నాత్ములే కాదు. అభిన్న భావులు. ఆ విశేషము వారి రచనలందు పరిస్ఫుటముగా గోచరించును. పెద్దన మనుచరిత్రమునందు. శాంత రసముతో శృంగారమున కాభాసము కల్పించెను. అందు మూలమున యమ నియమములు భక్తికి ప్రధానాంగములుగా నిరూపించెను. "ఎందే డెందము కందళించు" నను పద్యమునందు ఇంద్రియానందమే బ్రహ్మ మని వాదించిన వరూథిని వాదమును పరిహాసము పాలు గావించెను. అద్ది దేహమే యాత్మ యని యూహించు అవిద్యావృతులయిన బౌద్ధ చార్వాకాదుల వాదము. దానిని ప్రవరుడు ఖండించెను. రస పుష్టి కొరకు కథాంతర్గతముగా ప్రతిపాదించిన యీ వాదమును ఖండనమును విష్ణుచిత్తీయమునందు వ్యాఖ్యాన రూపమున విపులముగా నుడివినాడు రాయలు.

నిష్కామ కర్మ నియువు రంగీకరించిరి. కాని యది స్వర్గాపాది కాని మోక్ష దాయిని కాదని ప్రవరుని కథయందు పెద్దనగారును, కేశిధ్వజుని తలంపుచేత రాయలు నిరూపించిరి. మనుచరిత్రయందు దపస్సుచేత స్వారోచిషుడు హరిని దర్శించెను. అది యోగము.

దానిని విపులముగా కేశిధ్వజుడు విష్ణుచిత్తీయమునందు బోధించెను. మనుచరిత్రయం దంతర్వాహిని వలె కథా సరళిలో విశిష్టాద్వైత మంతటను ప్రతిపాదింపబడినది. విష్ణుచిత్తీయమునందు గంగా యమునల వలె కథతో పాటు విశిష్టాద్వైతము వెలయింపఁ బడినది. విష్ణుచిత్తీయమునందు శాంత రస పోషక మయిన విష్ణుచిత్తుని దాస భక్తి గోదాదేవి మధుర భక్తితో పోను పోను పొందు కలిసి కథా వస్తువున కందము నొదవించినది. పాత్రలకు మెరుగు వాటించినది. మనుచరిత్రయందు స్వారోచిషునకు హరి సాక్షాత్కరించెను. హరిని స్వారోచిషుడు దశావతార వర్ణనలచేత వినుతించెను. విష్ణుచిత్తీయమునందు హరి విష్ణుచిత్తునకు ప్రత్యక్ష మయ్యెను. విష్ణుచిత్తుడు హరిని దశావతార వర్ణనలతో వినుతించెను.

రాయలవారు వేదములను వేదాంతములనే కాదు గీతలను కూడ బాగుగా నభ్యసించినవాడు. అందలి సకల విషయములను ఆత్మానుభవమునకు తెచ్చుకొనినవాడు. వానిని విష్ణు వరాహ పురాణములతోడను రామానుజాదుల బోధలతోడను ఆళ్వారుల చరిత్రలతోడను సమన్వయము గావించుకొనెను. వానిని జీవితమునందాచరణలోనికి పెట్టెను. దానినే విష్ణుచిత్తీయమునందు మాల దాసరి కథయందు నిరూపించెను. మాల దాసరి కథ వరాహ పురాణములోనిది. విష్ణుభక్తుండగు మాలవాడు అజ్ఞాని యయిన బ్రాహ్మణున కయినను మోక్షంపు దారిని చూప గలవాడని రాయల అభిప్రాయము. దానినే మాల దాసరి కథయందు నిరూపించెను. వైష్ణవ మతమందు జాతి మత భేదములు లేక నిరంతరము విష్ణువును సేవించు భక్తు డెవ డయినను పూజనీయుడు. తిరుప్పాణి ఆళ్వారు పంచముడు. అతడు వైష్ణవుల పూజ నందుకొనెను. వాని ప్రబంధములు వారికి శిరోధార్యము లయినవి. మారనేరి నంబి యామునాచార్యుల శిష్యుడు. అతడు పంచముడు.

యాము నాచార్య పుత్రుని యనుమానము తీర్చెను. వాని బోధ వైష్ణవులకు చిర స్మరణీయ మయినది. కావున భక్తికి జాతి మత భేదములు లేవు. శ్రీకృష్ణ భగవానుడు.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్య భాక్
సాధు రేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః
మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాప యోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిం

అని గీతలయందు వచించెను. కావున విష్ణు భక్తు డగువా డెవడైనను పూజ్యుడని వైష్ణవుల భావన. విష్ణు భక్తుం డజ్ఞానుండగు విద్వాంసుని కంటె ఘనుండని చూపుటకు ప్రమాణముగా మాలదాసరి కథ విష్ణు చిత్తీయమునందు రాయలు పొందు పరచెను. అది గురుపరంపరాగత మయిన తలంపు. గీతా ప్రబోధము. పురాణ ప్రథితము. రాయలు

## రాజ నీతి వేత్త

శుక్ర నీతి, చాణిక్య నీతి, కామంద కాదికములను చదివెను. వానిని చిత్త గతము గావించు కొనెను. తన కాలమునందలి రాజ్యాంగ విధానములను పరిశీలించెను. వాని ననుభవమునకు తెచ్చు కొనెను. శాస్త్ర జ్ఞానమున కనుభవము జత చేసెను. రాజ్య పరిపాలనా విధానమునం దుపయోగించెను. ఉత్తీర్ణు డయ్యెను. తన యనుభవ జ్ఞానము నూరు పద్యములలో నాల్గవ యాశ్వాసమునందు నుడివెను. అది యామున ప్రభువు తనయున కుపదేశించిన నీతి. 'దేశ వైశాల్య మర్థ సిద్ధికి మూలం' మని గుర్తించినవాడు రాయలు. కావున అర్థ సంపత్తి కొరకు వీరాధి వీరుండయి పరాక్రమించి దండ యాత్రలు సాగించెను. ఆరాతి వీరులగు నరపతులను, అశ్వపతులను, గజపతులను, రణరంగమునందు నెదిరించెను. విజయములు సాధించెను. రాజ్యమును తూర్పు

సముద్రము వరకును దక్షిణమున కన్యాకుమారి వరకు ను త్తరమున సింహాచలము వరకును వి స్తరింప జేసెను. విరోధులకు హృదయ శల్యమయి మెలంగెను. మూరురాయర గండపెండెరము కాల దొడిగించు కొనెను.

మూరురాయర గండపెండార మణి మ
రీచి రింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంక పాళి నట ద్దుకూ లాంచలములు
చిత్ర మాంజిష్ఠ విభమ (శ్రీ) వహింప

విజయ నగర సామ్రాజ్య సింహాసన మధిష్ఠించెను. ప్రజా పాలనము గావించెను. 'ఉరవా చాగంబు భోగంబు భయము నొకపా లుగ్ర సేనావనార్థం బిరుపా ల్నిండారు బండారిలు చొర నొకపా లిట్లు' తన ఆదాయమును విభజించెను.

భండారముతో హాయ మద
శుండాల ఘటాళి దనదు సొమ్మై సాగా
నుండిన

పండితుడును బిరుదున్నై యుండెను.

కన్నొకటి నిద్రవోఁ బెఱ కంట జాగ
రంబు గావించు భూరు హాగ్రంబు మీఁది
యచ్చ భల్లంబు గతి భోగ మనుభవించు
నెడను బహి రంతరులపై దృష్టి

వహించి రాయలు వ ర్తించెను. కావుననే యంతః శత్రువులు గాని బహిః శత్రువులుగాని వాని నేమియు చేయ లేక పోయిరి. గజపతిరాజు పరాక్ర మించి రాయల చేతిలో పరాజయ మొందెను. తన కూతును రాయల

కిచ్చి పరిణయము గావించెను. అయినను గజపతిరాజు కోప మడగ లేదు. తన కూతుచేత రాయలను చంపింప యత్నించెను. రాయలు భూను హాగ్రంబు మీఁది భల్లంబు వలె నొక కంట కనిపెట్టు చుండెను. సర్వము గుర్తించి తనుఁ దాన రక్షించు కొనెను. రాణిని గాని గజపతిని గాని చంపలేదు. రాణిని రాజ్యము నుండి వెడల నడిపించెను. గజపతిరాజును

వీఁ డెడరునఁ గీ డెన్నిన
వాఁడని జయమైన హింస వదలి

కొనెను. వాని శ్రీని పుడమి భాగమును గైకొనెను. కొఱప ల్వాఁడి సెడిన పామేమి చేయగల దని రాయల తలంపు. ఆ మాటలో సత్య మున్నది. మరల గజపతిరాజు రాయల వంక గాని వాని రాజ్యము వంక గాని బ్రతికి యున్నంత కాలము తల యెత్తి చూడలేదు.

రేవుల్ మూవు మతంగజంబులు మణీ ఖండ ముక్తాదియున్
రా వాణిజ్యము పెంచి యే

లిన రాజన్యుడు రాయలవారు. పరదేశీయులగు యాత్రికులు విజయ నగరమునందలి యంగడులలో రత్నములు రాసులుగా బోసి యమ్ము చుండెడివా రనియు లక్షకు మించిన తురగ బలము కల దనియు గజ సైన్యము కల దనియు రచించిరి. విదేశములతో నోడ వర్తకమును ప్రోత్సాహము చేసెను. పోర్చుగీసువారితో వర్తకపు టొడంబడికలు గావించు కొనెను.

గడివాఁడు చెడునె యేఁ దగుఁ
జెడఁ జేయుట చెడఁడ యేని చెల్మియె తగుఁ బై
గడివాఁ డేపని కగుఁ దన
గడివాఁ డరి యైనఁ దనకె గడి కావఁ బడున్

అను రాజనీతిని చక్కగా నాచరణలో పెట్టినవాడు రాయలు. రాయలు బీజపూరు సుల్తానుల నోడించెను. వారిలో వారికి స్పర్థలు కల్పించి తన రాజ్యపు టెల్లలను గాపాడుకొన గలిగెను. వారితో సంధి కావించుకొని చెలిమి పాటించెను. సమయమును బట్టి వారి కొక్కొక్కప్పుడు సాయము గావించెను. యవన రాజ్య సంస్థాపనాచార్య బిరుదము వహించెను.

సౌఖ శాయనిక భిష క్పూర్వకము కాల్య
వేళఁ గార్తాంతిక ద్విజుల గోష్ఠి
జాము వోవ నమాత్య సామంత పూర్వకం
బర్థార్జనస్థ కాయస్థ గోష్ఠి
దిన మధ్యమమున మర్దన మల్ల పూర్వకం
బగు సూన సూపకృ న్మృగయు గోష్ఠి
యపరాహ్ణమున దేవ తార్చన పూర్వకం
బార్య ధర్మాధికృ ద్వ్రతుల గోష్ఠి

భుక్తి మీఁద విదూషక పూర్వకము పు
రాణ కవి గోష్ఠి చార పూర్వకము సంజ
జాము గాయక గోష్ఠి నిశన్ సుషుప్తి
పూర్వకము ప్రేయసీ గోష్ఠి పొసఁగు బతికి

నని బోధించిన యాము నాచార్యుని బోధ రాయల దిన చర్యయే గాని అన్యంబు కాదు. రాయలీ క్రమమున గోష్ఠులతో కాలము గడుపు చుండెడివా డనుటకు వాని ప్రథమాశ్వాసములోని వంటకము లను గురించి వర్ణించిన 80, 81, 82, పద్యములును, ద్వితీయా శ్వాసము 74 వ పద్యము 98 వ పద్యము సాక్ష్యములు. రాయల వారి కవితా గోష్ఠి, యుద్ధ పాండిత్యము, శాస్త్ర పరిచయము, యోగాభ్యాసము, విష్ణుభక్తి, ప్రబల తారాణములు. వీనిని గురించి మరల వ్రాయుట చర్విత చర్వణము.

దానము ద్విజ రక్షణకును
జ్ఞానము నిజ రక్షణకుఁగ శరణము చొరు మెం
తే నారాయణు రాజ్యాం
తే నరకం ధ్రువ మటంటఁ దీరునె యొంటన్

ఇది రాయలవారి లక్ష్యము. నా విష్ణుః పృథ్వీపతిః. విష్ణువు నంశతో రాజు జన్మించును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే

అని గీతా వాక్యము. సాధు రక్షణము దుష్ట శిక్షణము ధర్మ సంస్థాపనము విష్ణువు కార్యములు. అట్లే రాజు దుష్టులను శిక్షించును. శిష్టులను రక్షించును. ధర్మమును నాల్గు పాదముల నడిపించును. అట్టి చర్యయం దొకొక్కప్పుడు ప్రమాదములు వాటిల్ల వచ్చును. అందు మూలమున మహా పాపము ఘటిల్లును. దానికి నరకము రాజులకు శిక్ష. తెలిసి తెలియక సంభవించు పాపముల నుండి నిర్వృతి పొందుటకు రాజు మోక్ష ప్రదుండగు నారాయణుని సేవింప వలయును. పాపముల నుండి విముక్తి పొందవలయును. అందులకే పురాణ కాలమునందలి రాజులు ముదిమి వాటిల్లి నంతనే తనయుల పయి రాజ్య భారము మోపి వనమున కరిగి తప మాచరించిరి. యోగాభ్యాసముచేత తనువును పరిత్యజించిరి. దానినే కాళిదాసు

వార్థకే ముని వృత్తీనాం
యోగేనాంతే తను త్యజాం

రఘూణా మన్వయం వక్ష్యే యని నుడివెను. రాయలు జనన మరణ విరహితం బయిన మోక్షము కాంక్షించిన రాజయోగి. జ్ఞాతాజ్ఞాతముల

వలన వాటిల్లు నఘముల నుండి విముక్తిని బొంది మోక్షము సంపాదింప నెంచెను. అందులకు శాస్త్ర పరిశోధనము గావించెను. పరతత్త్వ మగు విష్ణువును గుర్తించెను. యోగ మభ్యసించెను. హరి యనుగ్రహము సంపాదించెను. ద్విజులను పలు విధములగు దానములచేత తనిపించెను. పెద్దనాది కవి శేఖరులకు కోకటా ద్యనేకాగ్రహారముల నొసంగెను. ఇట్లిహ పర సుఖ సాధనకయి తన జీవిత సర్వస్వమును వినియోగించి చిర కీర్తిని సంపాదించెను. తన జీవితానుభవములను పద్యరూపములో యామునప్రభు రాజనీతి యను పేర కావ్యమునందు చొనిపించెను. భావి రాజులకు ధర్మ ప్రభోధము గావించెను. రాయలు కన్నడ రాయలు. తెలుగుతన మలవంచు కొనిన మహావీరుడు. తన రాజ్యమును రామ రాజ్యముగా పరిపాలించెను. సకల మత సమత్వము కలవాడయి ప్రజల రక్షించెను. నాల్గు వర్ణముల వారిని ధర్మమును కాపాడెను. ఆత్మ రక్షణకు వేదాంత జ్ఞానము సంపాదించెను. రాజ నీతిని పాటించెను. మోక్షముకొఱకు విష్ణు రూపుండగు తిరుపతి వేంకటపతిని సేవించెను. దేశ భాషకొఱకు దేశముకొరకు ధర్మ రక్షణకొరకు తన జీవిత సర్వస్వము వ్యయించెను. లోక ముత్తరింప చేయుటకు తాను నమ్మిన దానిని తన యనుభవములను విష్ణుచిత్తీయమున ప్రదర్శించెను. అది విశ్వ శ్రేయ మగు కావ్యము. రాయలు అపూర్వ మగు వ్యక్తి. ఆ యపూర్వ వ్యక్తిత్వము సరిగా చదివి యవగాహనము చేసి కొనినచో పాఠకునకు విష్ణుచిత్తీయమునందు గోచరించును.

రాజులు సుఖ భోగులు. అట్టి రాయలవారును విష్ణుచిత్తీయము ప్రత్యక్షర పరిశీలన గావించిన వారికి రాయలు అమర నిఘంటువు మొదలు వేదములు నుపనిషత్తులు బ్రహ్మ సూత్రములు వాని భాష్యములు సాంఖ్యాది మత గ్రంథములు విశిష్టాద్వైత మత సర్వస్వము చదివినట్లు తోచును. యోగ మభ్యసించి యాచరణ యందు పెట్టినట్లగుపించును. వీని నన్నిటిని చదువుటకు సావకాశ

సొక్కుచు నున్నది. ఒక వంక యుద్ధములు. ఇంకొక వంక రాజ్య పాలనము. మరొక వంక కవితా గోష్ఠులు సలుపుచు వచ్చెను. ఒక్కొక్క శాస్త్రము చదువుట కొక్కొక్క జీవితకాలము చాలదు. దానికి తోడు కావ్య రచన. ఇది నమ్మ తగినది కాదు. శ్రీహర్షాదులు ధన మిచ్చి పరులచేత వ్రాయించి గ్రంథములు తమ పేరు పెట్టుకొనిరి. అట్లే రాయలు చేసియుందు నని నాతో చాల మంది వాదించిరి.

రాజులు సుఖ భోగులు కారు. సుఖానుభవములకు మరిగిన రాజుల రాజ్యములు నిలువ లేదు. దానికి చరిత్ర లాధారములు. రాజ్యము వీర భోజ్యము. మహావీరు లయిన వారికే రాజ్యములు దక్కునవి. విజయ నగర సామ్రాజ్యము దానికి తార్కాణము. మహావీరుల చిత్తములు పటిష్ఠములు. అచంచలములు. పట్టుదల వారికి మెండు. రాయలు అనన్య సామాన్య మగు పరాక్రమము గల మహావీరుడు. అతడు మిగుల పట్టుదల గలవాడు. కార్య సాధనయం దాతనికి తుల్యులు లేరు. విజ్ఞాన పరిగ్రహణమునం దాతనికి పిపాస మెండు. రాయల జీవితము వేరు. తిమ్మరుసు మంత్రి చేతిలో పెరిగినవాడు. రాయలు తిమ్మరుసు పండితుడు. రాజనీతి వేత్త. బ్రాహ్మణుడు, కవి. వాని శిక్షణ యందు రాయలు బాల్యమున అమరము మొదలు సాహిత్య గ్రంథములు సంస్కృతమునం దభ్యసించెను. పాణినీయాది వ్యాకరణములు పఠించెను. వాని సాహిత్య ప్రీతి సంస్కృతమునందు మదాలస చరిత్రాదులు వానిని వ్రాయింప చేసినది. అందు అలంకారములు బాగుగా నభ్యసించినవాడు. కావున

పలికి తుత్ప్రేక్షోపమల జాతిఁ బెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర
భావ ధ్వని వ్యంగ్య సేవధిగాఁగఁ జె
ప్పితిని సత్యా వధూ ప్రీణనమ్ము

శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకల కథా సార సంగ్రహంబు
శ్రోత్ర ఘచ్ఛటలు విచ్చగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞాన చింతామణి కృతి

మఱియు రస మంజరీ ముఖ్య మధుర కావ్య
రచన మెప్పించు కొంటి గీర్వాణ భాష

యని ఆంధ్ర విష్ణువు నోట చెప్పించెను. మొదట నలంకార భావ వ్యంగ్యములతో నారంభించిన రచన తరువాత శ్రుతి పురాణోపసంహితల వైపు మలుపు తిరిగినది. అప్పటికి రాయలు పట్టభద్రు డయి నాడు. వాని యాస్థానమునందు మహాపండితులు పెక్కు మంది గలరు. సంస్కృత కవు లుండిరి. రాయలు తన కాలమును వ్యర్థ పుచ్చ లేదు. దినమును సక్రమముగా విభజించుకొని నిత్యము కొంత కాలము పండిత గోష్ఠిలో గడపెను. అతని విజ్ఞాన పిపాస వానికి ప్రోత్సాహ మిచ్చినది. అది మానవ ప్రకృతి. దాని నెవ రాప లేరు. మనస్సును సరి యగు దారియందు పెట్టుటలోనే యున్నది. పైన తిమ్మరుసు మార్గోపదేష్ట. రాయలు మహామేధావి. దేని నయినను త్వరగా గ్రహించు కొనగలడు. గ్రహించు కొనిన దానిని అనుభవమునకు తెచ్చుకొన గలడు. పండిత గోష్ఠి యెట్టివాని నయిన పండితునిగా జేయ గలదు. అందులకు బాణ కవి జీవిత మొక తార్కాణము. రాయలు పండితులతోడి నిరంతర సాంగత్యమున శ్రుతులను పురాణోపసంహితల నెఱింగెను. వానియందలి కథలను సమన్వయ పరచి సకల కథా సార సంగ్రహము వ్రాసెను. ఇది రాజ్యమునకు వచ్చిన ప్రారంభ దశ. సాహిత్య చింత యూరకుండనిచ్చునది కాదు. విజ్ఞానమును తుది మెట్టు వరకు పాకించును. రాయల కుతూహలము మరొక్క మెట్టెక్కినది. రుచి మరిగిన ప్రాణి. మహాపండితుల సాంగత్యమునను వైష్ణవ గురువుల గోష్ఠివలనను సాంఖ్యాది మత

ములు, వాని మూల సూత్రములు, సారాంశములు, వాని ఖండనములు, విశిష్టాద్వైత సారము, గురు పరంపరాది ద్రవిడ గ్రంథ గత విషయములు, సేకరించుకొన గలిగినాడు రాయలు. అది యంతయు శ్రుత పాండిత్యము. పఠితము కాదు. అతడు మేధావి. చక్కని జ్ఞాపక శక్తి కలవాడు. సావకాశము లభించి నపుడు వానిని నెమరు వేసెను. వాని పాండిత్యము కోవిదుల వలె వాగ్వాదముల కుపకరించునది కాదు. కావుననే క్లుప్తముగా నొక్క సీసములో సర్వ మతముల మూల సూత్రములను వాని ఖండనలను సూత్ర ప్రాయముగా విరచించెను. యామునాచార్యుడు పండితులతో వాదించు ఘట్టము నందు లౌకికముగా పోనిచ్చినాడు. శైవ మత ఖండనము సాధారణ మైనది కాదు. ఈ రెంటిని పరిశీలించినచో రాయల పాండిత్యము పండితుల బోధ విని యవగాహన చేసికొనిన దని తేలును. విశిష్టాద్వైతము రాయల యభిమాన మతము. రామానుజాదుల మత గ్రంథ పరిజ్ఞానము నట్టిదియే. ప్రథమాశ్వాసము 78 వ వచనమునందు ప్రకృతి కంటె పరుండగు తన్నును తనకంటె పరుండగు పరమేశ్వరుం బరమేశ్వర ప్రసాద బహు జనన కృత సుకృత ఫల రూప యగు నాచార్య కృప గుప్త దానంబు నిధానంబు దెలిపిన గతిం దెలుపగా నాత్మీయ తదీయ శేష శేషిత్వ సంబంధం బనాద్యంబుగా దెలిసి యని విష్ణుచిత్తుని గురించి రాయలు వచించిన దంతయు తన్ను గురించియే యని చక్కగా నర్థము చేసి కొనిన వారికి తెలియును. తరువాత రాయలు ఆ వచనమునందు విష్ణుచిత్తుడు చింతించి నట్లు చెప్పిన దంతయు తన యభిప్రాయము, తన యనుభవమే కాని వేరొండుకాదు. సౌవీర భూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కనిచిన భరత భూమి సుర వతంసంబును బోలె తాను భూసుర వతంసుల బోధచేత ముక్తి మార్గంబు కన గలిగితి నని ద్యోతకము గావించెను. అందుకనే రాయల జీవిత సర్వస్వ ప్రతిబింబము విష్ణుచిత్తీయ మని నుడివితిని. భూసుర సంబోధనా విశేషంబున పరతత్త్వ జ్ఞానమును బొంది విష్ణు

పూజా కైంకర్య ధ్యానాదులందు నిత్యము నపరాహ్ణమును గడిపి నాడు రాయలు. అదే

అపరాహ్ణమున దేవతార్చన పూర్వకం
భార్య ధర్మాధికృ ద్యతుల గోష్ఠి

యని రాయలు వచించెను. రాయల యనుభవమే యామున ప్రభు రాజ నీతి. ఈ సందర్భమున నా కొక సంగతి జ్ఞాపకమునకు వచ్చు చున్నది. నాకు చిన్న తనము. మా తండ్రిగారి యొద్ద కౌముది చదువు చుంటిని. ఒక నా డిరువురు రాజకీ యోద్యోగులు మా తండ్రి గారిని దర్శింప వచ్చిరి. ఒకరు జిల్లా మునుసబు. నీలకంఠంగారు. రెండవవారు సబ్ జడ్జి. గంగాధర సోమయాజులుగారు. మా తండ్రి గారు సగౌరవముగా కూర్చుండ నియమించిరి. వారు 'శాస్త్రిగారు! మాది తూర్పు గోదావరి జిల్లా. ఇక్కడికి బదిలీ యయి వచ్చితిమి. మాకు చాల కాలము నుండి భాష్య త్రయము శాంతి చేయ వలయు నని గలదు. మాకు వాని నేక గురు ముఖమున చదువ వలయు నని యున్నది. మా కట్టి వా రెవరు లభింప లేదు. మిమ్ములను గురించి పిఠాపురమునందు తాతా రాయుడు శాస్త్రిగారు చెప్పగా విన్నాము. బందరునకు వచ్చిన తరువాత పురాణం వేంకటప్పయ్యగారు జంధ్యాల గౌరీనాధ శాస్త్రిగారు న్యాయ వాదులు చెప్పగా వింటిమి. వారు మీ దగ్గర సూత్ర భాష్యము చదువు చుంటి నని నుడివిరి. మాకు కూడ మీ దగ్గర చదువ వలయు నని కలదు. మేము బదిలీ యయి పోవు లోపల భాష్య త్రయము కావలయును. అందులకు మిమ్ములను దర్శింప వచ్చితిమి. మాకు ప్రొద్దున నేడు గంటలు మొద లెనిమిది వరకు తీరిక యుండును. రెండు సంవత్సరముల కంటె ప్రభుత్వము మమ్మిచ్చట నుంచదు' అన్నారు. మా తండ్రిగా రడిగిన వారి కెల్ల పాఠము చెప్పెడివారు కారు. కొంచె మాలోచించినారు మా తండ్రిగారు. గ్రహించారు వచ్చినవారు. 'అయ్యా మీ రాలోచన అక్కరలేదు.

స్నాన సంధ్యాదు లొనరించు కొందుము. ధౌత వస్త్రములతో వత్తుము. యథా శాస్త్రీయముగా విందుము. గౌరీనాథ శాస్త్రి గారు విషయము వివరించిరి. మా మనవి త్రోసి 'వేయకు' డని నమ స్కార పూర్వకముగా నర్థించిరి. తరువాత మా పితృపాదులు రెండేం డ్లలో భాష్య త్రయ మొట్లు ముగియును. పది పది నైదేండ్ల పరిశ్రమ యని అని. అంత వారు 'శాస్త్రిగారు మాకు పాండిత్య ప్రకర్ష కొరకు గాని వాద ప్రతివాదముల కొరకు కాదు. విషయ పరిజ్ఞానము చాలును అన్నారు. సరే నన్నారు మా గురుదేవులు. మరునాడు పాఠము ప్రారంభ మయినది. మూల సూత్రములు వ్యాఖ్యాన సహితముగా నుపన్యాస రూపమున నారు మాసములలో పూర్తి గావించినారు మా తండ్రిగారు. గంగాధర సోమయాజులుగారు నీలకంఠంగారు చాల మేధావులు. చెప్పినది మరచి పోయెడి వారు కారు. తరువాత వారి మేధా సంపత్తి చూచి మిగిలిన సంవత్సరము నారు మాసము లలో నుపన్యాస ధోరణిని శంకర రామానుజ మధ్వ భాష్యములు చార్వాకాది మత ఖండ నాదులు ముగించిరి. ఇంక పది రోజు లలో బదిలీ చేయ బడుదు రని మా గురుదేవు లాలకించిరి. ఆ నాడు తత్త్వ మసీత్యాది సూత్రముల మీద వివరణను గురించి ప్రశ్నించినారు మా గురువులు. తు. చ. తప్పక స్వామి నివేదించి నారు వారు. కది శ్రుత పాండిత్యము. ఆ భాష్య త్రయము వాగ్గేయ కారక హరి నాగభూషణముగారు, సుప్రసిద్ధ గాయకులు, పదు నైదేండ్లు చదివి మహాపండితు లయిరి. అట్టి గురువులు బహు జనన కృత సుకృత ఫల పరిపాకంబున లభింతు రనియు వారి బోధ పరతత్త్వ పరిజ్ఞాన సంపాదనకు సాధన మనియు రాయలు వచించెను. అట్టి గురువులు రాయలకు లభించిరి. జ్ఞాన బోధ గావించిరి. ఆ యను భవము విష్ణుచిత్తుని ముఖమున వెలయించెను.

రాయలకు తెలుగనిన అభిమానము కలదు. తెనుగు కవుల కావ్యముల నాలకించెను. అందలి తీపి చవి చూచెను. నిరంతర

కవితా గోష్ఠివలన తెనుగున కవిత నభ్యసించెను. విష్ణుచిత్తీయము రచించెను. అందు తన వేదాంత నీతి శాస్త్ర పరిజ్ఞాన సారము చిందించెను. రాయలు సంస్కృత కవితయందు నధిక పరిశ్రమ గావించెను. శబ్ద వాక్యాదిక రచనలందు తెనుగున నా పోకడలే వెలయించెను. అతని రచనయందు ప్రత్యేకత కలదు. దాని నదివరకే నుడివితిని. ముందింకను విపులముగా చర్చింప బడును. అలసాని వారి పోకడలకు రాయల రచన కెట్టి సంబంధము లేదు. రాయల వా రాత్మాభిమానము కలవాడు. పరుల గ్రంథమునకు తన పేరు పెట్టుకొన వలసిన పని వానికి లేదు.

రాయలు యామునాచార్యులకు క్షత్రియ కన్య నిచ్చి పరిణయము గావించెను. అది వాని మత సాంకర్య గుణమును వెల్లడించు చున్నదని కొందరు నాతో వాదించిరి. అది యవివేకము. బ్రహ్మజ్ఞునకు బ్రహ్మమునకు వలెనె మత జాతి భేదములు లేవు. అట్టి వివాహములు పురాణ ప్రసిద్ధములు. అగస్త్యుడు లోపాముద్రను పరిణయ మయ్యెను. ఆమె క్షత్రియ కన్య. చ్యవనుడు సుకన్యను పరిణయ మయ్యెను. ఆమె క్షత్రియ కన్య. ఇట్టి కథ లెన్నో పురాణము లందు కలవు. రాయ లొనరించిన క్రొత్త లేమియు లేవు. ఆయన బ్రహ్మ వేత్త. వానికి జాతి మత భేదములు లేవు, అని నేను వాదించితిని. ఆ సంగతి ఆది యుగముల మాట. ఇది కలియుగము రాయలు వర్ణ సంకరమునకు ప్రయత్నించెను అని వారు పూర్వ పక్షము చేసిరి. సత్యమగు బ్రహ్మవేత్తలకు నే యుగ మయినను ఒకటే. కలియుగము వేరు కాదు అంటిని.

విష్ణుచిత్తు డొక నాటి మధ్యాహ్న కాలమునందు మన్నారు స్వామికి తులసి మాలిక లర్పించెను. తన మందిరమునకు తిరిగి యరుగు చుండెను. స్వామి కడకంట వాని నరసి లక్ష్మీదేవితో

యామునాచార్యుఁ డొక్కఁడు నీ మహాత్మ్యఁ
డొక్కఁడును గాదె మన్మతం బుద్ధరించి
రస్మదీయ కృపాతిశయమున ననిన
నిందిరా దేవి తన భర్త కిట్టు లనియె

ఇతని కథ యెఱిఁగినదికా
యతఁ డేమి యొనర్చె ననిన నబ్జాక్షుం డా
శతపత్త్ర నిలయ కిట్లను
నతివ కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డాదిన్

అని యామునాచార్యుని కథ చెప్ప నారంభించెను. భూతం, సరస్య, మహా దాహ్వాయ, భట్టనాథ, శ్రీభక్తిసార, కులశేఖర, యోగివాహాన్, భక్తాంఘ్రి రేణు, పరకాల, యతీంద్ర మిశ్రాన్, శ్రీమత్పరాంకుశ మునిం, ప్రణతోస్మి నిత్యం అని శ్రీ వైష్ణవుల గురు పరంప రానుసంధాన శ్లోకము. అందు మొదటి ముగ్గురు పురాణ కాలము వారనియు విష్ణుచిత్తుడు కలియు గాదిని నలుబది యారు సంవత్సరముల తరువాతి వాడనియు వైష్ణ మత గ్రంథములు చెప్పు చున్నవి. మతము నాధారముగా చేసికొని చెప్పిన యీ మాటలు నమ్మ తగినవి గావు. శ్రీకాకుల ఆంధ్ర నాయకు డగు నాంధ్ర విష్ణువు కలియు గాదియం దుండె నని స్థల పురాణము నుడువు చున్నది. నిశుంభునితో నాంధ్ర విష్ణువు కొన్ని శతాబ్దములు పోరాడి నాడట. ఇవి యన్నియు నిజ మని నమ్మువా రుండరు. వారి వాద ములు విమర్శనలకు నిలుచునవి కావు. చరిత్రాంశములను పరిశీలించి నచో వైష్ణవము క్రీ. శ. ఆరవ శతాబ్దమునకు కొంచెము ముందు మొలకెత్తిన దని చెప్ప వలసి యుండును. మొదటి ముగ్గు రాళ్వా రులలో తిరుమ్లిశై అళ్వారు లొకరు. ఆయన ఆరవ శతాబ్దములోని వాడు. పల్లవ రాజుల కాలమునం దుండెను. పల్లవరాజులలో కుమార

విష్ణువు, విష్ణు గోపవర్మ, సింహ విష్ణువు మొదలగువారు విష్ణు భక్తులు. దీనిని బట్టి వైష్ణవము రెండు శతాబ్దముల ముందారంభించినను నాలవ శతాబ్దమును మించి యుండదు. కావున పురాణ కాలమునందు కాని కలియు గారంభమునందు కాని వైష్ణవము కల దనుట యసంభవము. ఇట్లనుటచేత పురాణ కాలమునందు విష్ణుభక్తులు లేరని నా యభిప్రాయము కాదు. ప్రహ్లా దాంబరీ షాదులు కలరు. వైష్ణవ స్వాములకు వారికి సంబంధము లేదు. వారి తత్త్వము వేరు. వైష్ణవ మత తత్త్వము వేరు. నాల్గవ యాళ్వారు లగు పెరియాళ్వారు విష్ణుచిత్తుడు వల్లభ దేవుని కాలము వాడు. వల్లభదేవుడు పాండ్యరాజు. తొమ్మిదవ శతాబ్దములోని వాడు. కావున విష్ణుచిత్తుడు తొమ్మిదవ శతాబ్దములోని వాడు. పై పద్యములను బట్టి యామునాచార్యు డంతకు పూర్వమువాడు కావలయును. రామానుజాచార్యులు అసూరి కేశవ సోమయాజికిని కాంతిమతికిని వాలివాహన శకము తొమ్మిని వందల నలుబదవ సంవత్సరమున అనగా క్రీస్తుశకము 1018 పింగళి నామ సంవత్సర చైత్ర శుద్ధ పంచమి గురువారమున జన్మించెను. యామునాచార్యుని శిష్యుడగు శ్రీశైల పూర్ణుడు రామానుజుని మేనమామ. అతడు పిన తల్లి కుమారుడగు గోవింద భట్టుతో గలిసి కాంచీ పురమునందు యాదవ ప్రకాశుల యొద్ద అద్వైత వేదాంత శాస్త్రము నభ్యసించు చుండెను. ఆ సమయమున యామునాచార్యులు రామానుజుని చూడ వచ్చిరి. అప్పటికి యామునాచార్యులు చాల ముదుసలివాడు. తొంబదేం డ్లుండ వచ్చును. కావున యామునాచార్యులు పది పదునొకండు శతాబ్దములం దుండెనని చెప్ప వచ్చును. అతడు విష్ణుచిత్తునకు పూర్వుండనుట రాయలవారి పొరపాటు. పొరపా టనుటకు వీలు లేదు. ఈ సంగతి వైష్ణవు లందరికి తెలియును. రాయలవారి కెఱుక లేనిది కాదు. యామునాచార్యుని కథ తన కావ్యమునందు చేర్ప నెంచెను. యామునాచార్యుడు వైష్ణవ మత ప్రచారమునకై పాటు పడిన విష్ణు భక్తుడు.

మహాపండితుడు. శైవమును ఖండించి విష్ణు మత స్థాపన చేసినవాడు. కావున పెరియాళ్వారగు విష్ణుచిత్తుని కథతోపాటు వాని కథ కూడ వ్రాయ తలంచెను. దానికి నీ యుపాయము పన్నెను. ఉపాయము బాగున్నది. కాని కాలము తారు మారైనది. తన మాట సత్య మని లోకమును నమ్మించుటకు విష్ణువుచేత సాక్ష్య మిప్పించినాడు రాయలవారు. కవుల చేతిలోని వారు దేవతలు. వా రాల్లాడించిన నల్లాడుదురు. విప్రనారాయణుని కొరకు దేవదేవికి సువర్ణ పాత్ర నర్పించినాడు హరి. హరి మిక్కిలి వారికి సాక్షాత్కరించి మోక్షము ప్రసాదించినాడు. భక్తునికొరకంత పని చేసిన యా హరి రాయలవారి చేతిలో యామునాచార్యుడు విష్ణుచిత్తుని కంటె ముందు వాడని సాక్ష్య మిచ్చుటలో వింత లేదు. రాయలు సాహితీ సమరాంగణ సార్వ భౌముడు. వాని శాసన మనతిక్రమణీయము. తా నెట్లు నుడువు మనిన విష్ణు వటుల నుడువ వలయును. భక్తులకు దాసుడా హరి.

అతఁడు చిఱుత నాఁడె యాచార్య కులమున
వేడ్క వేద శాస్త్ర విద్య లభ్య
సించు చుండ నపుడు చెలువ! యిప్పటి పాండ్య
నృపతి పూర్వ వంశ్యుఁడే యొకండు.

వెఱ్ఱి శైవంబు ముదిరి మద్వినుతి వినఁడు
నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును
హరుఁడె పరతత్త్వ మఁను

నట. ఇది విష్ణు వనిన మాట. శివస్య హృదయం విష్ణుః, విష్ణోశ్చ హృదయగ్ం శివః అని వేదము. శివుని హృదయము విష్ణువు, విష్ణువు యొక్క హృదయము శివుడు అని దాని యర్థము. శివ కేశవులకు భేదము లేదు. వా రిద్దరు పరతత్త్వ స్వరూపులు. వేద మయుండగు విష్ణువు తన మత ప్రచారము కొరకు తన హృదయ మయిన శివుని

మతమును వెక్కిరి శైవ మనినాడు. తన హృదయమును తాను నిందించు కొనిన వారి వెక్కిరి కాక యే మగును. ఆ కారణముచేతనే యామునాచార్యుని వాదమునకు పిలిపించిన చోళ రాజును 'ఇప్పటి పాండ్య నృపతి పూర్వ వంశ్యుఁడే గొకండు' అని పాండ్యరాజుగా మార్చి వేసినాడు రాయలు. ఇది రాయల వారికి పాండ్య రాజుల మీఁద గల ద్వేషము. యామునాచార్యుడు చోళ మండలములోని వీరనారాయణ పుర నివాసి. తండ్రి ఈశ్వర ముని. తాత నాథముని. యామునాచార్యుని కాలమున చోళ రాజు నాస్థానమునందు అక్కియాళ్వారను పండితుడు కలడు. అతడు మహా విద్వాంసుడు. పండితుల నందరిని జయించి విద్వజ్జన కోలాహలు డను బిరుదము నొందెను. పండితుల యొద్దనుండి కప్పము గొను చుండెను. యామునాచార్యుడు గురువు నొద్ద పాఠము చదువు చుండ కోలాహలుడు తనకు చెల్లింప వలసిన సుంకము నిమ్మని యామునాచార్యుల గురువునకు నొక లేఖ వ్రాసి పంపెను. యామును డా లేఖ నంది కొనెను. దానిని చింపి పార వేసెను.

న వయం కవయ స్తు కేవలం, నవయం కేవల తంత్ర పారగాః
అపితు ప్రతివాది మస్తక, ప్రక టాటోప విపాటన క్షమాః

అని సమాధానము వ్రాసి పంపెను. కోలాహలునకు కోపము వచ్చినది. రాజున కా సంగతి నెరిగించెను. రాజు యామునాచార్యుని పిలిపించెను. కోలాహల యామునులకు వాగ్వాదము జరిగినది. ఇది అసలు కథ. రాయలవారు కావ్య స్వరూపమును దృష్టియం దుంచుకొని పై కథను చక్కగా మార్చిరి. పాండ్యరాజు శివ భక్తుడు.

శివ లింగముఁ దాల్చిన జన
నివహాము లేమైనఁ జేయ నిది పాపము దా
నవుఁ గాదనఁ డా సమయము
నవు వను విప్రులకు యగ్రహారము లిచ్చున్.

అతఁడు రాజ్యంబు పాలించు నవసరమునఁ
దన వశంబైన యట్టి యత్తాన్వపర్ణిఁ
గలుగు నల పుట్టరాని ముక్తా మణి వర
కులము మహేశ్వరుల కంధరలకుఁ దీఱె

ఇది స్వ మతాభిమానము. రాజు చర్యలు మనోహరముగా వర్ణింప బడినవి. పక్షపాతము గల వారియందు రాజుల వర్తనము లిట్లే యుండును. ఒక్క రాజులే కాదు. మానవ సహజ స్వభావ మిది. రాయలవారు లోక స్వభావము బాగుగా నెఱిగిన వ్యక్తి. ఇట్టి వర్తనకు తన జీవితమొక తార్కాణము. రాయలవారు విష్ణు భక్తుడు. అలసాని పెద్దన వైష్ణవుడు. మనుచరిత్రం బందుకొను వేళ పల్లకి తన కేలఁ బట్టి యెత్తినాడు. కవి గండపెండేరమున కీవె తగు దంచు పెద్దన పాదములకు తొడిగినాడు. రాజు లిట్లయి నప్పుడు ప్రజల సంగతి చెప్ప వలసిన దేమున్నది. యథా రాజా తథా ప్రజా. కావున

అప్పు డిచ్చకు లగు బ్రాహ్మణౌఘ మెల్ల
నాత్మ జని భూమి విడువలే కలిక భూతి
గడ్డముల నాన రుదురాక లిడ్డ సంది
సూత సంహిత లిఱికించి చొరఁ దొడఁగిరి.

రాయలవారు పరులను వెక్కిరించుట యందును చాకచక్యము కలవాడు.అందరికి బ్రాహ్మణులులోకువ.ఎవరన్నను ముందు వారి నందురు. దానికి కారణము వారి నమ్రత. పాండ్యరాజు కొలువున బ్రాహ్మణులు ఇచ్చకులట. మతము మార్చుకొని విభూతి రుద్రాక్షలు తాల్చిరట. అన్నిటికంటె సూతసంహితలు చంక నిరికించుకొని రాజు కొలువు చొచ్చిరట. 'సంది నిరికించుకొని, గడ్డము నాన రుద్రాక్ష లిడి' ఈ రెండు పదములు రాయలవారికి శైవము నెడ గల యక్కసును

బయలు పరచు చున్నవి. 'వెఱ్ఱి శైవము ముదిరి' యనుటలోనే యీ విద్వేషము కనబడు చున్నది. అంత కంటె

శీలముఁ బట్టియు గంజా
హాలలు పాంశున భుజించు నధముల

ట శివ భక్తులు. రాయలవారి శైవ మత ద్వేషమున కీ పద్యము ప్రబల తార్కాణము. ఆయన వైష్ణవాభిమాన మట్టు లనిపించినది. ఈ మత ద్వేషమే యీ కథా కథనమున కిట్టి మార్పు కలిగింప పురి కొల్పినది. ఈ పద్యము లాలించిన ధూర్జటి యెంత కుమిలి యుండునో తెలియదు. కావుననే తన కావ్యమును రాయల కంకిత మీయ లేదు. కాళహస్తీశ్వరున కొసంగెను. రాయలు కన్నడ రాయడు. ఏమనిన నను.

రాయలవారిలో మూడు మూర్తులు

న్నవి. రాజకీయ, సారస్వత, వైష్ణవ మూర్తులు. రాయలు రాజనీతి వేత్త. శుక్ర, చాణక్య, కామందకి మొదలగు నర్థ శాస్త్రములందు పాండిత్యము కలవాడు. తన కాలమునందలి రాజకీయ పరిస్థితుల నను భవమునకు తెచ్చు కొనినవాడు. సునిశిత మగు దృష్టి కలవాడు. స్వానుభవములతో తన నీతి శాస్త్ర వైదుష్యమును జోడించి రాజ్య పరిపాలనా విధానమునం దుపయోగించెను. వైరి రాజులను జయిం చెను. సర్వ జనాదరణీయముగా రాజ్య పాలనము గావించెను. తురుష్కులకు తన కొలువున నుద్యోగము లొసంగెను. బౌద్ధులను జైనులను ఆదరించెను. పోర్చుగీసువారితో స్నేహము పాటించెను. రాజకీయముగా సర్వ మత సహనము కలవాడు. అందరి నేక దృష్టితో మన్నించెను. ప్రజలు సుఖించిరి. ఆ మహారాజు రాజకీ యానుభవము నకు యామునాచార్యుడు కుమారునకు బోధించిన నీతి యొక మచ్చు తునక

కుడుపున నొక కడి దఱిఁగినఁ
జెడఁ జూచుటె కాని పతికిఁ జెలియుం గలఁడే
యిడ నని విడువం జెల్లునే
నడప వలయు నేర్చి నట్లు నమ్మకమె కృపన్

ఇది రాయల రాజకీయ మూర్తి. ధర్మరాజును 'మెత్తనిపులి' అన్నాడు తిక్కన. అంతకంటె మించిన విలయాకారము రాయలలో కప్ప బడి యున్నది. కావుననే తిమ్మరుసు కన్నులు తీయించుట కలిగినది. అక్బరు మహారాజ నీతి వేత్త. అంతవాడు తురక రాజులలో నింకొకడు లేడు. సర్వ జన రంజన మాతని యాదర్శము. ప్రతాపసింగు చెల్లెలు బూంది ప్రభువు నిల్లాలగు పద్మినిని మానభంగము చేయ ప్రయత్నించెను. తన్నునెత్తి పెంచిన ఖాన్ ఖానును చంపించి వాని భార్యను నిఖా కట్టుకొనెను. ఇవి రాజకీయ స్వరూపములు. రాయలు సాహితీ సార్వభౌముడు. సంస్కృతాంధ్రములందు మిగుల పాండిత్యము గలవాడు. ఆయనకు నలంకారములందు మిక్కిలి ప్రీతి. ఈ సంగతి రాయలు విష్ణుచిత్తీయమునందు వాడిన యలంకారములు సాక్ష్యములు. దానికి తోడు

పలికి తుత్ప్రేక్షోపమల జాతిఁ బెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర

యని సగర్వముగా చెప్పుకొనెను

భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనమ్ము

అనునది తరువాతి సంగతి. వీనిని బట్టి రాయలు సకల లక్షణ విదు డగుట సత్యము. ఈ సీసములోని కృతు లన్నియు సంస్కృతములు. సంస్కృత సాహిత్యమునం దందె వేసిన చేయి రాయలు. గీర్వాణ

వాణితో నారంభించిన కవిత్వము తెలుగు చవి మరిగి విష్ణుచిత్తీయము రచించెను. ఉభయ భాషా కవి యనిపించుకొనెను. కవులు సౌందర్యోపాసకులు. వారి చిత్తములు రస మయములు. అతి మృదులములు సాహిత్య రంగమునందు వారి ప్రవృత్తులు జాతి మత భేదములను లక్ష్యము చేయవు. కవితా సౌందర్యములో పరమాణు వయి పరిభ్రమించును. ఆనందించును. అభినుతించును. కావుననే రాయలు

స్తుత మతి యైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీ
యతులిత మాధురీ మహిమ

యని వీర శైవ మతావలంబి యగు ధూర్జటి కవితనుగూర్చి యబ్బురపోయెను. తిమ్మన అద్వైతి. వాని కగ్రహారము లిచ్చెను. పెద్దన వైష్ణవుడు. వానిని పెద్ద పెట్టున గౌరవించెను. సాహిత్య సింహాసనాధిరూఢు డయి నప్పుడు రాయలకు సాహిత్య దృష్టియే కాని మత విద్వేషము లేదు. ఇది రాయలలో రెండవ మూర్తి. కావుననే రాయలు నిష్కాపట్య మగు చిత్త వృత్తితో పెద్దన పద్యములను తన విష్ణుచిత్తీయమునందు గ్రహించెను. పెద్దనకంటె తాను రసవంత మగు కవిత వ్రాయ లేనని రాయ లెరుంగును. ఆ రచనలోని జిగి బిగువులు మార్దవము తన కవితయం దుండ వని యా మహారాజునకు తెలియును. పెద్దన చేసిన వర్ణనలను తాను చేయవలసినప్పుడు వానిని తా నుపయోగించు కొనెను. ఇది రాయల వారి నిరతిశయ సాహితీ మూర్తి. ఇది మొదటి దానికి వన్నె పెట్టునది. మూడవది వైష్ణవము. అది స్వకీయము. పరులకు సంబంధించినది కాదు. పాలిత జనులతో గాని రాజకీయ ప్రవృత్తితో గాని సాహిత్య జగత్తుతో గాని సంబంధము లేనిది. రాయలు వైష్ణవమునందు పట్టుదల కలవాడు. అది ప్రకృతి జనుల మీద నుపయోగించి నపుడు తనకు వినాశము తెచ్చును. రామరాయలు హిందూ మతస్థుడు. మహమ్మదీయులను ద్వేషించెను. వారి మత గ్రంథములను మసీదు

లను నాశనము చేసెను. చివరకు తన వినాశమును తెచ్చుకొనెను. ఔరంగజేబు హిందూ మతమును ద్వేషించెను. దేవాలయములను నాశనము చేసెను. కడకు తాను నాశన మయ్యెను. అక్బరు అన్యమత సహనము వానిని సర్వజన మనోరంజకుని గావించినది. రాయలు తాను నమ్మిన వైష్ణవమును తా నభినుతించెను. అది లోక స్వభావము. ఆ దృష్టితో చూచి నపుడు శైవ మా రాజునకు వెట్టిగా కావచ్చును. జంగములు గంజా హోలలు సేవించువారు కావచ్చును. అది వాని యభిప్రాయము. దానిని కావ్య గతము గావించినాడు రాయలు. ఈ దృష్టి వహించి రాయలు శైవులను హింసింప లేదు. అది యింటిలోని సంగతి. స్వగతము వంటిది. తనకు మాత్రము సంబంధించినది. పరులకు సంబంధించునది కాదు. కావున రాయల వంటి మాహారా జింకొకడు లేడని పొగ డ్త గనినాడు. ఈ ముమ్మూర్తుల యేక స్వరూపము రాయలు. దేని స్వభావము దానిదే. ఒక దానిలో నొకటి చొర నొల్లదు. విమ్షుచి త్తీయము చక్కగా పరిశోధించిన వారికి రాయ లా మూడు మూర్తులతో కనిపించును. పాండ్యరాజు భార్య విష్ణు భక్తురాలు.

వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టిఁ దాన
దశమినాఁ డేక భుక్తముఁ జేసి యవలినాఁ
డొర్చి జాగరముతో నుండు నిట్రు
బారసి పోసీదు పై నిద్రఁ బాఱుట
క్కలు పాడు మత్పుణ్య కథలఁ ద్రోయు
నేమంపు మూన్నాళ్లు కామింప దధినాథు
మఱునాడు కన్నును మనసు దనియ

నారజపు వన్నెఁ బతి సెజ్జ కరుగు గూర్మి
నరుగుచో నాభిఁ దుడిచి కప్పురపు నాభిఁ

బెట్టు నిట్టులు మద్భక్తి పుట్టియును ని
జేశు నెడ భక్తి చెడదు మదిష్ట మగుట

## పాత్ర పోషణము

ఇది రాజు దేవేరి వర్ణనము. రాయలయందలి చతురత యీ పద్యము చాటు చున్నది. భారత నారీ మణికి భర్త మనస్సు నొవ్వ కుండ వర్తించుట స్వభావము. అది పతివ్రత లక్షణము. ఆ పాతివ్రత్య గుణము రాజ్ఞి వర్తనమునందు చిత్రింప బడినది. భర్త కడ కరుగు నెడ నుదిటి నామిఁ దుడిచి కప్పురపు నామి పెట్టు కొనునట. భర్త మనసు నొవ్వింపని రాణి యనువర్తనము ప్రదర్శిత మయినది. యామునుడు రాణిని దర్శించెను. రాజును విష్ణు భక్తి కలవానినిగాఁ జేతు ననెను. రాణి సంతసించెను.

గ్రీష్మ సమయ నిరుత్సాహ కేకి రమణి
నవ ఘన ధ్వని కలరు చందమున నలరి
యేకతపు నర్మ గోష్ఠిఁ బ్రాణేశుతోడ
నతని విధ మెఱిఁగింప నిట్టట్టు వడుచు

ఇది యుపమాలంకారము. ఇందు నుపమానము చక్కగా బొదగఁ బడినది. అందు విపుల మయిన భావము కలదు. ఇంత కాలము తన భర్తను విష్ణు భక్తునిగా జేయ గలవాడు కనిపింప లేదు. భర్త విష్ణు పరాఙ్ముఖత్వమునకు నామె మనస్సు పరితపించినది. నిరుత్సాహము చెందినది. కావున ఆమె గ్రీష్మ సమయ నిరుత్సాహ కేకి వలె నుండెను. యామునుని మాటలు నవ ఘన ధ్వని యైనది. ఆమె నలరించినది. రాణి పూర్వమునందలి మనస్తాపము ఇప్పటి యానందము కవి యీ యుపమానమునందు గర్భితము గావించెను. అట్లని యామె తొందర పడలేదు. ఏకాంత సమయమునకు నిరీక్షించినది.

ఇది యామె సహనమును తెలుపును. అందు నర్మగోష్ఠి వరకు నిరీక్షించినది. అందు మూలమున రాణి సమయజ్ఞత పరిస్ఫుట మగుచున్నది. అప్పుడు భర్తతో యామునాచార్యుని సంగతి నుడివినది. అత డిట్టట్టయి నాడట. చక్కని వ్యావహారికము. ఆ మాట విని తబ్బిబ్బయినాడని భావము.

> భూవల్లభు 'డెట్టెట్టూ
> తా వాదముఁ జేసి శివ మతంబు జయింపం
> గా వచ్చెనో'

అనెను. వెనుక పద్యమును అట్టిట్టు పడుచునో ముగించి తరువాత పద్యమును ఎట్టెట్టు అని మరల ద్విత్వ టకారముతో నారంభించుట కవి రచనా వైదగ్ధ్యము వెల్లడించు చున్నది. ఆ తబ్బిబ్బున కీ యాశ్చర్యము ఫలితము. అట్టిట్టు పడుట కారణము. ఎట్టెట్టూ అనునది మదిలోని యాశ్చర్యమును నిరూపించు వాగ్రూపక కార్యము. తరువాతి వాక్యము రాజునకు శైవమునందు కల ధృఢ విశ్వాసమును సగర్వముగా నిశ్వసించు చున్నది. ఇట్లు రాజ దంపతుల మనోవృత్తులు రాయల వారు రెండు పద్యములలో వెలయించెను. రాజు రాజసము రాణి వినయము బహు నిపుణముగా పదముల పొందికలో నుపమాన పదములో రాయ లిమిడ్చెను. రాణి వాసంపు దేవేరుల నడవడిక నెరింగిన మహారాజ కవి రాయలు. రాణిని రాణినిగా చిత్రింప గలిగెను. రాయలకు స్త్రీల యెడ గల గౌరవ మా పాత్ర పోషణయందు గోచరించు చున్నది. అది భారతీయ సంస్కృతికి ప్రతిబింబము. యామునాచార్యుడు వాదింప వచ్చెను. రాజు

> పసిఁడి గచ్చుమర సోపానముల్ మూఁటఁ దుం
> గిత విశాలితయుఁ జిత్రితయు నైన
> సభ మహాకుథముపై శార్దూల చర్మకం
> ఛావృతుల్ జటిలులు నైన జగర

మాహేశ్వరులు చుట్టిరా హార సంధి రు
  ద్రాక్షాయుతముఁ దాల్చి యళిక భూతి
సురఁటి గాడ్పుల రాల నరుణాయ తాక్షుఁడై
  కుఱు గద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి
నంది ముద్రిత పాణియందుఁ జెక్కాఁదియా
  గమములు వినుచు హేమము పొదివిన

యలఁతి రుదురాక గమి కుట్టులందు మెఱయ
వెలి దపారంబు మించ దువ్వలువఁ గప్పి
యడపమును నాఁడి వాలొక్క యతివ దాల్ప
భార్య వింజామ రిడ నొప్పు పాండ్యుఁ గనియె

నట యామునుడు. మనోహర మగు శిల్ప మీ పద్యమునం దున్నది. ఈ పద్యము చదువు నప్పుడు మూడు మెట్లు గల యున్నతము విశాలము నగు నరుగు, దాని మీద శార్దూల చర్మము, దాని మీద పలు రుద్రాక్షలు మెడయందు తాలిచి నొసట విభూతి ధరించి యెఱ్ఱని విశాల మగు నయనములు గలవాడయి కుఱు గద్దె బిల్ల మీద మోచేయి నునిచి చేతిలో చెక్క నమర్చుకొని, బంగారు రుద్రాక్ష పోగులు, తెల్లని తలపాగ ధరించి దుప్పటము దాల్చి యున్న పాండ్య రాజు కనులకు చిత్రమునందు వలె నగుపించును. రాయ లీ రూప మును మొదట మనస్సునందు నూహించుకొని సముచిత పద సము దాయముతో నిచట చిత్రించినాడు. పాండ్యరాజు అరుణాయ తాక్షుడట. ఆయతము లనుటచేత మోము నందము, అరుణ మనుట చేత పౌరుష లక్షణము చిత్రింప బడినవి. అళిక భూతి సురఁటి గాడ్పుల రాలు చున్నదట. చక్కని పరిహాసము. బిల్లఁ బ్రకోష్ఠ మిడి పాణి యందు చెక్కాఁని ఆగమములు వినుచున్న రూప చిత్రములో రాజ సము చక్కగా ముద్రింప బడినది. మిగిలిన మాహేశ్వర చిహ్న

ములు సహజములు. రాయల పదములలో గల సారస్యము ప్రశం
సింప దగినవి. నిరర్థక మగు పద మొకటియు నుండదు. రాజు

సంగతియె యోయి యిసుమంత తింగణావు
తత్త్వ నిర్ణయ వాదంబు దరమె నీకు
నోడి తేనియుఁ బట్టె మొట్ట్రో యనంగ
లింగమును గట్ట కుడుగ మెఱింగి నోడువు

ము అన్నాడు. ఈ పద్య రచనా విధానము పరిశీలింప తగినది. చిన్న
చిన్న వాక్యములు. పదములు వ్యావహారికములు. 'ఇసుమంత
తింగణావు, మొట్ట్రో యనంగ, ఎఱింగి నోడువు'. యామునుడు
చిన్నవాడు. రాజు అనుభవశాలి. వయసు మళ్ళినవాడు. యామునుని
చూడగానే వానికి నవ్వు వచ్చి యుండును. అతడు పై విధముగా
నుడివెను. యామునుడు బ్రహ్మచారి

అతఁడు మృగ కృత్తి పెళ పెళ యనఁగ బసుపు
గోచి కట్టిన మోదుగుఁ గోల నెగయఁ
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బటంచు
నర్థ•ముక్తాసనత నిట్టు లనియెఁ బతికి

యామునుని బ్రహ్మచారిత్వము వినయము చక్కగా వర్ణింప బడినది.
అతడు

పంత మైనను గానిమ్ము పార్థివేంద్ర
యుక్తులను నిగ్రహ స్థాన మొదవె నేని
యమ్మ దెచ్చిన విద్వాంసుఁ డనఁగ వలవ
దెట్లు గావింప వలయు నట్లట్ల చేయు

యనినాడు. రాయలవారి కవితలో ప్రసన్నత లేదని కొందరి భావము. ఈ పద్యములు ప్రసాద గుణము కలిగి యుండ లేదని యెవ రన గలరు. రాయల కవితలో ప్రసాద గుణ మున్నది. ఓమటకు నిగ్రహాస్థాన మనియు, సగము లేచి యనుటకు అర్ధముత్థాసనత యనియు, సంగతియె యని యుక్తమా యనుటకును వింత వింతలుగా నందందు వాడు చుండును. అవి యర్థము చేసికొనుటకు కొంచె మాలోచనన కవిత్వానుభవము భాషానుభవ ముండ వలయును. అది లేనివానికి క్లిష్టముగా నుండును. వాని కవిత యందు వింత పదము లుండును. వింగడము, నిట్రు, బారసి, పాలు టక్కులు, తుంగితము, విశాలితము, బిల్ల, కుట్టులు, తపారము మొదలగునవి. యామునుడు వాదులను జయించెను. రాజ్యార్ధ రాజ్య మిచ్చెను. తాను విష్ణు భక్తు డయ్యెను. తన చెల్లెలిని యామునా చార్యున కిచ్చి పరిణయము గావించెను. ఇది రాయలు చేసిన మార్పు. రాయలు వర్ణ సాంకర్య మొనర్చినా డని వాదము. వివాహ సాంకర్య వృత్తి సాంకర్యమును చూపించి తన సంస్కార గాభిమానము వెలి బుచ్చుటకే కవి అసలు కథ నిట్లు మార్పు చేసె నని వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు నుడివిరి. క్షత్రియ కన్యలను వివాహ మాడుటయు శస్త్రాస్త్ర విద్యా నిపుణు లయి రాజ్య పాలనము గావించుటయు బ్రాహ్మణుల కనాది నుండియు వచ్చుచున్న యాచారము. పరశురాముడు రణ విద్య నభ్యసించి క్షత్రియులను బరిమార్చెను. ద్రోణాశ్వత్థామలు మహావీరులు. చరిత్ర కాలమున శృంగి వంశీయు లయిన పుష్యమిత్రుడు అగ్నిమిత్రుడు సార్వభౌములు. మగధ రాజ్యము పరిపాలించి యవన రాజుల నోడించిరి. ఇంక వివాహము లందుమా పెక్కు దృష్టాంతములు కలవు. అగస్త్యుడు లోపాముద్రను పరిణయ మయ్యెను. ఆమె క్షత్రియ కన్యక. చ్యవనుడు సుకన్యను వివాహ మాడెను. ఆమె క్షత్రియ యువతి. చరిత్రకాలమున అగ్నిమిత్రుడు మాళవ రాజు కూతును పెండిలి యాడెను. యామునుడు పాండ్యరాజు చెల్లెలిని పరిణయం బయి శస్త్ర

విద్య నభ్యసించి వైరుల జయించుటలో రాయ లొనరించిన సాంకర్య మేమియు లేదు. పైగా రాయల సర్వ మత కుల సమత్వము మానవు లందరు నేక రూపులను వేద విహిత సంప్రదాయమును ప్రదర్శించెను. యామునాచార్యుడు దండయాత్రకు పో దలంచెను. వర్షా కాలము వచ్చినది. దానిని రాయలు అరువది పద్యములలో వర్ణించెను. ఇంత విస్తరించి కావ్యములలో ఋతు వర్ణనము గావించినవా రింకొకరు లేరు. పద్యము లన్నియు రాయల లోకానుభవము ప్రకృతి పరిశీలనా స్వభావము వ్యక్త పరచు చున్నవి. రాజ సౌధములం దుండి సుఖ భోగము లనుభవించుచు వర్ష శీతాతపముల నెఱుంగక యుండు రాజ కులాలంకారు డగు రాయలు ఇట్లు వర్ణింప గలుగుట చాల వింతగా తోచును. కాని రాయల జీవితము చక్కగా విమర్శించు కొన గలవారికి అతుల పరాక్రమ శాస్త్ర పాండిత్య లోకానుభవముల మూటెని కలిపి బ్రహ్మ అప్రతిహత ప్రతిభా సంపన్నునిగా సృష్టించిన ప్రత్యేక మూర్తి రాయలు యని స్ఫురించును.

ఇలకు డిగ్గి చుట్టి చుట్టి దుమ్మెత్తి యెగసి
పోయి తము ముంచు సుడిగాలి పుష్కరముల
గడలి నీ రభ్ర కలభము ల్గ్రోలె ధరణి
నభ్ర కరి శిక్ష దివి గాంచి నట్టి కరణి

ఇందు రూప కోత్ప్రేక్షాలంకారముల సాంకర్యము కలదు. రాయల వారికి గజ స్వభావములను గురించిన యనుభవము వర్షము కురియుటకు ముందు వీచు సుడిగాలిని గురించిన పరిజ్ఞానము ఈ పద్యము నందు ద్యోతక మగు చున్నది. సుడిగాలివలన మిన్నంట దుమ్మెగసి మేఘములు కలయ కూడి వర్షించుట ప్రకృతి స్వభావము. తొండముతో దుమ్మెగయ చల్లుకొనుటయు నీటెని పీల్చి చిమ్ముటయు నేన్గుల కొక వినోదము వాని కది యొక యాట. రాయ లవి చక్కగా.

పరిశీలించి రెండనుభవములను జత కూర్చి యీ పద్యమును వ్రాసెను. ఇంతే కాదు

కృత పయః పాన నవ మేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాల పండ్లు
మఱి బలాకా ద్విజాళి సంప్రాప్తి కలిగెఁ
బెరుఁగఁ బెరుగంగ ధ్వనియు గంభీర మయ్యె

ఇందు శ్లేషానుప్రాణిత రూపకాలంకారము కలదు. పసి పిల్లలకు పాల పళ్లు ముందు వచ్చును. అవి యూడి పోయి మరల గట్టి పండ్లు వచ్చును. అప్పుడు వారికి పరిస్ఫుట మయిన గంభీర ధ్వని మాటలలో క్రమముగా వృద్ధి పొందును. మేఘములు మొదట తొలకరి వాన సమయమున వడగండ్లు రాల్చును. అవి పోయి మేఘములు క్రమ క్రమముగా వృద్ధి పొంది ఉరుములతో వర్షించును. ఆ కాలమున కొంగలు బారులు కట్టి గగనమున నెగురు చుండును. ఇది మేఘముల స్వభావము. అది పిల్లల విధానము.

మొగిలునై చీకటులు నెక్కు జిగి మెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె
సకలమును నిద్ర పుచ్చు కేశవుని నిద్ర
పుచ్చు ఘనునకు నిట్టి దద్భుతమె తలఁప

యథా సంఖ్య అర్థాపత్తి యలంకారము లిందు గలవు. విష్ణువు వర్ష కాలమున యోగ నిద్రయం దుండుట శాస్త్ర విదితము. ఇట్టి రాయల వారి శాస్త్ర ప్రకృతి స్వభావ పరిజ్ఞానములను దెలుపు పద్యములు వర్ష కాల వర్ణనమునందు చాల గలవు. తరువాత శరదృతు వర్ణనము కలదు. ఇది నలుబది యైదు పద్యములలో ముగించ బడినది.

రాయలు వర్ణన ప్రియుడు. అలంకార సమాసక్తుడు. రాజులు సంపూర్ణముగా నెన్నాని నయిన ననుభవించిన కాని తృప్తి పడరు. అనుభవించిన యానందము చివరి వరకు వర్ణించి చెప్పుట వారి యుత్సాహము. అది విద్వాంసు డగు కవి యలంకార సహితముగా నొసంగులు దిద్ది క్రొత్త తీర్పులు వెలయించి ప్రదర్శించు చుండును. కావున రాయలవారి వర్ణనలు విపులము లయి అలంకార సహితము లయి యుండుటలో వింత లేదు. అందు రాయలవారి యలంకార ముల దిద్దుగడ యప్రతిమాన మయినది. అతడు సాహితీ సార్వ భౌముడు. రాజ సార్వభౌముడు. వింత వింతలయి చిరంతనము లయిన సొమ్ము జాతులను వెదకి వెదకి యలంకారములందు వాడును. కావున పద్యములు చదివిన వెంటనే భావములు స్ఫురణకు రావు. దానికి తోడా రాజునకు సంస్కృత భాషా పరిచయ మెక్కువ. అమరము రసనాగ్రమునం దున్నది. నూతన ప్రియులు రాజులు. ప్రాతలు వారికి రోతలు. క్రొత్తల మీద మనసు పారు చుండును. కావున క్రొత్త క్రొత్త పదములు వాడు చుండును. అందు మూలమున పద్య రచన నన్నయ శ్రీనాథాదుల పద్య రచన వలె కాక కొంత అన్వ యములో తడబాటు కలిగించును. ఆ కారణమున ప్రసాద గుణము తరిగి నటు లుండును. ఇవన్నియు చేరి రాయల కైత నారికేళ పాక మని పించును. ఆ మహారాజు కవితలో సంస్కృత పాండిత్య ప్రకర్ష యధికముగా గోచరించును. అది సాహితీ సహజ స్వభావ గుణములను కప్పి పుచ్చినది. ఇది రాయల కవితలో నిమిడి యున్న రహస్యము. కవిత కవి స్వభావానుగత మయి యుండును. రాయలకు అనుభవ ముతో పాటు భావనా శక్తి మెండు. అది పాండిత్య ప్రకర్షణను తోడు చేసికొని సముచిత పదముల నవలంబనముతో పద్యమునందు అవతరించును. గోదాదేవి యౌవనవతి యైనది. ఆమె కనులు వర్ణించినాడు రాయలు.

నవ వయ స్సీధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
నిడిన శృంఖల లనఁ గాటు కిడిన దీర్ఘ
పక్ష్మ రేఖలఁ గనుదోయి పడఁతి కలరు

నట. ఈ వర్ణన క్రొత్తది. పూర్వ కవుల గ్రంథములందు కనులను వర్ణించిన పద్యములు పెక్కు కలవు. ఇట్టి వినూతన భావము కని పించదు. ఇది రాయల భావనానుభవముల పరిపక్వ ఫలము. ఏనుఁగులు యౌవన ప్రాదుర్భావముచేత మదించి నపుడు కనులనుండి సీధు వను మద మూరు చుండును. ఆ మద జలము కనులయందు చూపుల నరికట్టును. అప్పుడు వానిని విడిచినచో దారి కనబడక నూతి నూఁతులను గోతులను పడును. ఆ కాలమునందు మావటివాండ్రు వానిని గొలు సులతో నిటు నటు పోకుండ కట్టి యుంచుదురు. రాయలకు ఏనుఁగుల స్వభావము అనుభవమునం దున్నది. ఆ యనుభవము వినూతన భావనా శక్తికి నుద్బోధక మయినది. స్త్రీలకు యౌవనాతిశ యము మద్యము వంటిది. చెవులను నూతులలో బడు నను సందే హముచేత వాని చాంచల్య మరికట్టుటకు చుట్టు ద్రాములగు కనురెప్పల మీఁది వెంట్రుకల బారులను గొలుసులచేత కట్టివేయబడి నవా యన్నటుల గోదాదేవి కాటుక యిడిన కను లున్నవట. మద్యము త్రాగి నపు డటు నిటు తూగు లాడుట స్వభావము. కనులు యౌవన మను మద్యము త్రాగుటచే నతి చంచలము లయినవి. అందు మూల మున దూగి తూగి పోయి చెవు లను నూతులలో పడు నని భయము. ఆ కారణముచేత నవి కనురెప్ప వెండ్రుకల బారు లను గొలుసుల చేత కట్టివేయ బడినవట. గోదాదేవి కనులు యౌవనోదయముచేత చప లము లయి చెవుల వరకు వ్యాపించి యుండె నని ఫలితార్థము. ఈ పద్యమునందు రూప కానుప్రాణిత మయిన యుత్ప్రేక్షాలంకారము కలదు. సీధు వను శబ్దమునకు మద్య మనియు నేనుగు కంట కారు

మద మనియు శ్లేష. రెండవ యర్థమునం దుపమానముచేత గజ మను నది వ్యంజిత మగు చున్నది. కావున ఇందు కనులు మద గజములకు పోల్చ బడినవి. అందువలన నవి చాల నిడివి కలవని భావము. యౌవనము సీధువునకు పోల్చ బడినది. ఈ పద్యమునందు కనులు మద గజములకు పోల్చి చెప్పుట అసమంజస మని కొందరు పండితుల యభిప్రాయము. యౌవన సీధువు పక్ష్మల శృంఖలముల మాత్రము ఇందు ప్రధానముగా గ్రహింప వలయును. కనుల నేనుగులకు పోల్చి చెప్పినను విరివితనమును మాత్రము గ్రహింప వలయును. ఈ పక్షము నందు ఉపమాన మగు మదగజము దోషము కాదు. ఉపమానోపమే యముల సాధర్మ్యము మాత్రము గ్రహింప వలెను. ఇది రాయల పాండిత్య ప్రకర్ష. అది శ్లేషార్థక మయిన సీధు శబ్దము నవలంబనముగా గొని పద్యము వినూతన మగు వికాసము, గంభీర భావము, గలిగి గోచరించు చున్నది. దీనికి మూలము అలసాని వారి అంగజు డాన పెట్టె యను పద్యములో గలదు. ఇదే రాయలం దున్న ప్రతిభ. ఇట్టి ప్రతిభను వెలయించు పద్యములు వాని వర్ణనలందు చాల కలవు. గోదా దేవి రూపమును తనివి తీర నాపాద మస్తకము ముప్పది పద్యములలో వర్ణించెను. విష్ణుచిత్తీయ కావ్యమునకు నాయకురాలు గోదా దేవి. ఆమె రంగనియందు భక్తి కలది. వానిని శ్రీకృష్ణుని గాను తాను గోపిక గాను సేవించి తరించినది. ఆమె కవయిత్రి. గాయకురాలు. రంగని భర్తగా వరించిన పతివ్రత. అంతే కాదు ధరణీ దేవి యవతారము. రంగధాముని పయి పాశురములను రచించినది. వానిని పాడి తన కంఠ మాధుర్యముచే తను భక్తివైభవముచేతను జనుల మెప్పు సంపాదించినది. ఈ సంగతులను మనస్సు నందుంచుకొని

కమల దళేక్షణ సంగీ
తమున నిగుడు మంద్ర మధ్య తార త్రిస్థా
నములకుఁ దీర్చిన రేఖల
క్రమ మగు రేఖా త్రయమునఁ గంఠం బమరున్

అని గోదాదేవి కంఠమును వర్ణించెను. ఇందు ఉత్ప్రేక్షాలంకారము కలదు. మంద్ర మధ్యమ తారలు సంగీత శాస్త్రమందు స్థాయి భేద ములు మంద్రస్తు గంభీరే తారోఽత్యుచ్చె త్రయ స్త్రిషు, విలంబితం ద్రుతం మధ్యం అని అమరము. ఈ మూడు స్థాయిలను మూడు స్థానము లమర్చి తీర్చిన రేఖలా యను నటుల కంఠమున మూడు రేఖ లున్నవట. ఇందు మూలమున గోదాదేవి గాన కళా నైపుణ్యము ద్యోతక మగు చున్నది. మరియు కంఠము శంఖమును బోలి మూడు రేఖ లుండుట పతివ్రత లక్షణము.

యస్యా స్తిస్రో గళే రేఖా
దృశ్యన్తే సా పతివ్రతా

అని సాముద్రికము. పై పద్యము వలన గోదాదేవి మహాగాన కళా కోవిద యనియు పతివ్రత యనియు ధ్వనితము. ప్రతివ్రతగా చెప్పటచేత ఆమె పూర్వ జన్మయందు భూదేవి యని గోచర మగు చున్నది. ఇది అలంకార కృత వస్తు ధ్వని. ఇట్టి పద్యములలో గోదాదేవి స్వరూప గుణ వర్ణనములు చేయ బడినవి. రాయలవారు చిన్న పద్యములలో నతి గంభీర భావములు గల యలంకార సహి తములగు వర్ణనల నిమిడించ గలడు.

వృత రఘూత్తము శాప మొక్కింత విడిచి
విడిచి కడకేఁగ నప్పు డప్పుడ కవిసెడు
చక్ర యుగ మన జోడైయ్యె నాక్రమించి
కొమిరె చన్నులు పృథు చూచుకముల నమరె.

శ్రీరాముడు సీతా వియోగ మనుభవించు నెడ చక్రవాకములకు రేలు వియోగ మొదవుగాత మని శపించుట పురాణ ప్రసిద్ధము. పై

పద్యమునందును ఉత్ప్రేక్ష కలదు. రాయలవారికి ఉత్ప్రేక్షాలంకారము లన నిగుల ప్రీతి. వానిని చాల చోటులందు ప్రయోగము చేసియు ప్రత్యేకముగాను వాడెను. గోదాదేవి విష్ణువునందు వలపు గలదైనది. వారిని భక్తితో సేవించినది. చివరి రెండాశ్వాసములందు భక్తి సంయుతం బగు శృంగారము వర్ణింప బడినది. కావున అందలి రసము

## మధుర భక్తి.

అందు నిది వియోగము.

ఆ నవలా యలంతి పసుపాడి దుకూలముఁ దాల్చి గుబ్బచన్
గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ తేటల నిగ్గు దేఱఁగ
న్నానన నాభిఁ దీర్చి పితృ బద్ధ లతాంతము లక్కఁ గొప్పునం
బూని యొకింత సే పునికి పుచ్చి

కూప వారి నీడ వీక్షించి కృష్ణునిఁ గూడ నునుచు చుండును. ఆమె చెలికత్తెలు వారిని గురించి పాటలు పాడు చుందురు. ఆమె

సుగ్గా పాడిన హరి చందము
లే పాడిగఁ దలఁప వచ్చు నితఁ డే సతులం
గాపాడినవాఁ డనుగై
యో పాడినఁ దన్ను వలచి తొయ్యలులారా ?

తాను సుర వరాని స్రుప తనుల్ దాల్చి యకట
కామినీ తతి నుడికించు కంటు సట్ట
గండెయును నల్ల దాసరిగాఁడు కిరియు
హరియునై పోవుటయ మాచి దను యుగంబు.

చెలువము దాల్చి తగ్గవయఁ జేరిన రాగిణి రావణ స్వసను

ఒల్లఁ బొమ్మన్నఁ బోదె తా నుల్లసముల
నేఁప నది రక్కసియ యాట నెగ్గ వలచి
స్త్రీలు దలవంపఁ దాన వచ్చె నది చాల
కాఁడుదాని బజీతు సేయంగ నగునె

బజీతు సేయు చక్కని వ్యావహారిక పదము.

తనకు నందఱుఁ గూర్చ బృందావనమున
నొకతె రతిఁ దేల్చి కాఁక నొండొకతెఁ బ్రేల్చి
యంత రాధకు మేలువాఁడై మురారి
యెల్ల సతులకు నుడుకే యిడెండె

అని త్రపా భరంబున నర్మగర్భంబుగా నుపాలంభించినది. హాని దెప్పినది. ఇది బిబ్బోకమను శృంగార చేష్ట

వరుని కథయం దనాదర
మరయఁగ బిబ్బోక మయ్యె

అని నరస భూపాలీయము

స్త్రీలు భర్తల యపరాధములను గుర్తింతురు. వారిని సూటి పోటి మాటలచేత దెప్పు చుందురు. అవి పూలకంటె మెత్తగా నుండును. శూలములకంటె పదునుగా నుండును. వానిలో సరసత పరిహాసము లిమిడి యుండును. అవి రసికుల కనుభవ నీయములు. మనోజ్ఞములు. ఆ స్త్రీ సహజము లగు నుపాలంభ గర్భితము లయిన చతురాలాపములు గోదాదేవి పలుకులలో నన లెత్తి గుబాళించు చున్నవి. రాయలు దక్షిణ నాయకుడు. ముగ్గురు దేవేరులతో కాపురము చేసిన రసికు డగు మహారాజు. ఆయన కిట్టి వెన్నియో యనుభవము

నం దున్నవి. వానిని రాణుల ముఖమున నందుండి విని యుండును. అవి గోదాదేవి నోట పలికించెను. చెలికత్తెలు ఆమె వల పెరింగి

ఎవ్వరు నట్లు పో నెరసు లెన్నక మానరు ప్రాణభర్తలన్
దవ్వుల నున్నఁ గాక కతన స్మృతి వారలు వస్యులైనఁ దా
రెవ్వరి నొల్ల కొక్కటయి యింపుడు చంద్రుఁ డుటండ్రు బోటి దా
నివ్వల దేగకత్తె యగు నిట్టివి నీ తల వేగనే చెలీ !

అని సమాధానము చెప్పిరి. తేఁకత్తె, తలవేగు, ఇట్టి వ్యావహారికము లీ పద్యములలో చాల కలవు. అవి యన్నియు స్త్రీలనోట నెడలునవి. గోదాదేవికి వలపు వలని కాక మిక్కుటమయినది. ఆమె యభిమానవతి. తాను పడు పరితాపము లోలోన నడచుకొనును. చెలులకు చెప్పదు. ఈ సందర్భమున రాయలవారు మిగిలిన కవుల వలె వియోగ తాపమును వర్ణింప లేదు. రాయలు మహారాజకవి, వాని సంబంధము మహారాజ పుత్రికలతో. వారు రాగర్భ శ్రీమంతులు. రాణి వాసములందు పుట్టి పెరిగినవారు. సహనము మనోగోపనము వారి సహజ గుణములు. అవి చక్కగా గ్రహించు కొనిన వాడా మహారాజు. ఆ ప్రకృతిని గోదాదేవి యందు చూపించెను. ద్రవిడ భాషయందు ఆమె పాశురములను, కావ్యమును చదివిన వారు గోదాదేవి రాజసమును గుర్తించ గలరు. రాయలు వాని నన్నిటిని చదివినవాడు. గోదాదేవి పాత్ర యందు దా రాజసము, మనోగోపనము ఏకాంతానుతాపము చక్కగా వర్ణించెను. దానికి రాయలు రాణివాసంపు పరిచయము సహకారి యయినది. ఆమెను విష్ణుచిత్తు రాణివాసంపు దేవేరిగా తీర్చి దిద్దెను. ఈ కథ ఇంకొక కవి రచించినచో నీ రాణివాసంపు బిగువు ఉండెడిది కాదు. లోకములో పాటుగా నుండెడిది. అదియే ఉత్తము లయిన మహారాజ కవులకు సామాన్య కవులకు గల భేదము. అదియే గోదాదేవి కథలో గోచరించును. ఆమెను భక్తి పూరితురాలుగా

త్రిలోకాధినేతయు పరతత్త్వ స్వరూపుడు నగు హరి దేవేరిగాను ప్రతి ష్ఠించెను. ఆమె వియోగ పరితాపమును చెలికత్తెల సంభాషణ రూప మున నాటకము నందు చూళికాదుల వలె చెప్పించెను. ఇది క్రొత్త పోకడ. ఇతర కావ్యము లందు వలె మన్మథాది దూషణలు చూపింప లేదు. అందుండి రెండు పద్యములు

ఎఱుఁగరుగా యొకద్భుతము నీ చెలి దీర్ఘికకుఁ దీర్థమాడ నా
యఱుతఁ దగిల్చి పోవుఁ దన హారము వోయిన నేను పోవుదున్
మఱువక వెంటఁ బోవ జల మగ్నతనా నది సున్న మైనఁ దాఁ
గఱకఱి పెట్టి సొమ్మడుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్

అది అతిశయోక్తి. ముత్యములు వేడి చేసి నీరు చల్లిన సున్న మగును. అతను తాపముచేతఁ గాలిన ముత్యాల హారము దీర్ఘికా జలముచేత పొడి పొడి యైనది. ఇది యార్తి యను సంచారీ భావము. హృదయమందలి తాపం బినుమడియై వెలిఁ బర్వ ననయముఁ దను పీడ యార్తి యగు నని కావ్యాలంకార సంగ్రహము

అనినన్ స్రగ్విణి వల్కెఁ దన్నుఁ జెలులారా! నే లతాడోలఁ జి
క్కన నూఁపం దెగి వ్రాల దీని చను ప్రేఁకం బే క్రియం దాల్తునో
యని పట్టం దిన మధ్య మార్కరుచి ఖద్య న్మంజరు ల్వ్రాని వా
డిన పాలిండ్లను బెండు బొమ్మ గతి నుండెన్ సందిటం జుల్కనై

తాప జ్వరమువలని బిగువు తరిగి పాలిండ్లు వాడి వదలయి తేలిక లగుట సహజము. ఇది యరతి లేక తాపము. గోదాదేవి రాత్రులం దొంటి పాటున తనలో

అక్కట రాధ నీకుఁ దగవా మగవారల నత్త మామలం
దక్కి ముకుంద వేణు కల నాదపు టీలకు లేటి మొత్తమై

నైక్యాను కాంక్షచే నడికిరే లరుదెంచిన గోపి కావళిన్
బొక్కఁగఁ జేసి త న్నుచిర భోగము గుత్తగ నీవ కైకొనన్

అని యిట్లు పలు విధముల హరిని గురించి తలంచును. చెలికత్తెలు గోదాదేవి పూర్వ జన్మయందు సత్యభామ యనియు దాము ఉరగ కన్యల మనియుఁ దెలిపిరి. ఆమెకు వలపు మరింత యగ్గల మయినది. ఆమె చెలిని కత్తెల బోధ లనుసరించి యనుదినము రంగాధాముని భజించు చుండెను.

బోటి కట్టిన చెంగల్వ పూవు టెత్తుఁ
దన పరిణ తోరు కదళి మంజరియుఁ గొనుచుఁ
బోయి గుడి నంబి విజనంబుఁ జేయఁ జొచ్చి
మ్రొక్కి వేదికఁ బలు వన్నె ముగ్గు వెట్టి

విజనంబుచేసి నాడట గుడి నంబి. అది యామెయందు గల గౌరవము. గోదాదేవి ఆత్మాభిమానము తెలియించు పదము. ఈ రాజసము రాయలు గోదాదేవియందు తుది వరకు పోషించెను.

చెలువ గర్భ గృహ ప్రదక్షిణముఁ జేసి
వినతియు మ్రోలి శఠకోపము ను ధరించి
చరణ తీర్థము గొని తత్ప్రసాద లబ్ధ
మయిన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు

ఇది యామె భక్తి. అంతలో వసంత ఋతువు వచ్చినది. దానిని నలుబది యెనిమిది పద్యములలో నతి దీర్ఘముగా వర్ణించి నాడు రాయలు. ఆ సమయమున

వెలఁది కతి తాపం బయ్యె విరుల పాన్పు
మును తదంఘ్రి హతాది భగ్నసనలు గన్న

తరులఁ బొడమిన వూఁటట దన కోసఁగునే
పొంచి తరి వేచి మిగుల నొప్పించుఁ గాక

ఇది కావ్య లింగాలంకారము. ఇందు రాయల ఆత్మ రక్షణయందలి జాగరూకతను తెల్పు పద్యము. తన వలన శిక్షింప బడిన వారు సమయమునకు వేచి యుండి తన్ను నొప్పింతు రను జ్ఞానము రాయలను గలదు. కావున తగు జాగరూకత కలవాడయి వర్తించెను. ఈ విజ్ఞానము గోదా దేవి వియోగ తాపమున కంట కట్టెను. స్త్రీల కాలి తాపుల చేత చెట్లు పుష్పించును. అవి వానికి దోహదము. వానివలన పొడమిన పూలు ఆమెకు మిగుల బాధను కలిగించినవి.

శ్రీపతి మ్రోఁది గీతముల ప్రేమ విపంచిక నంటఁ బాణి సం
తాపము సోఁకి మెట్ల మయినంబు గరంగిన డించి పాడు నా
లాపినిఁ దాల్చి పెన్జెమటల న్మతి తంత్రులు జజ్జరోఁ గలా
లాపిని దాన పాడును గళంబును గద్గద మైన మాన్పడున్

గోదా దేవి నానాటఁ గృశించి పోవు చుండెను. విష్ణుచిత్తున కామె మనో వేదనము తెలియదు. అతడు మిగుల ఛాందసుడు. స్త్రీల యంతరంగము తెలియనివాడు. గోదా దేవి చర్యలు వాని కర్థము కాలేదు. అది యొక వ్రత మని తలంచెను. స్వామికి కూతురు స్థితి నివేదించెను. ఈ సందర్భమున కవి విష్ణుచిత్తుని యమాయికత్వము చక్కగా ప్రదర్శించెను. రాయలవారి కావ్యమునందు శకుంతలా పరిణయము మనుచరిత్రలందు వలె నొక మన్మథ దూషణ గాని చంద్ర దూషణగాని గోదా దేవి నోట వెడల నీయ లేదు. రాయలవా రీ విషయమున తన యూహను వినియోగించి గోదా దేవి పాత్రను చక్కగా పోషించెను. ఆమె పూర్వ జన్మయందు భూ దేవి. విశ్వంభర. విష్ణువున కిల్లాలు. ఆయనయందు నిరంతం మగు భక్తి

తాత్పర్యములు గలది. సత్యభామపై జనన మందినపుడు శ్రీకృష్ణుని తన చేతి కీలుబొమ్మ గావించుకొని వాని యనురాగ సంతతియుం జూర గొనినది. ఇప్పుడా హరి వియోగము సహించ లేక పోయినది. తీవ్ర మగు పరితాపము పొందినది. ఆ వేడిమికి తబ్బిబ్బయినది గోదాదేవి. ఏమయిన నామె యభిమానము గల యాడుది. తన చెలికత్తెల కైన తన పరితాపము తెలియనీయ లేదు. తాను చెప్ప లేదు. దానిని లోలోన భరించినది. రంగనాయకుని దిన దినము సేవించినది. అతడు భక్త పరాధీనుడని యామె యెరుంగును. చెలులు బోధించిరి. గాన కళా విలాసమున నా వాసుదేవుని మీద గీతము లాలపించినది. ఆ రివలన చిక్కి శల్య మయినది. రాయలవారు గోదాదేవియందు నీటిలోని ప్రతిబింబము వలె పతివ్రతలగు యువతుల గుణ స్వభావములను గోచరింప చేసినాడు. ఆ పతి భక్తి నిరంతరతయందు చంద్ర దూషణాదులకు తావు లేదు. హరి కరుణా రస సిద్ధికొరకు నిరీక్షించుట ఆమె పని యైనది. అతనిని నారాధించి దానిని పొంద వలయును. తదేక నియమముతో కాలము గడిపినది గోదాదేవి. విష్ణుచిత్తుడమాయికుడు. వానికా సంగతి తెలియదు. అది యొక తపంబని తలంచెను. తా ననుదినము పూజించు స్వామికి కూతు నవస్థ నివేదించెను. ఆ స్వామి యాలించి విష్ణుచిత్తునకు మాల దాసరి కథ నుడివెను. అందు గాన మహిమను నిరూపించెను. విష్ణువు గీతి ప్రియుడు. తన్ను గాన కళా విశేషముచేత గోదాదేవి సేవించుట యెరిగించెను. ఆమెను శ్రీరంగమునకు తీసికొని పొమ్మని యాన తిచ్చెను.

## మాల దాసరి కథ

వరాహ పురాణములోనిది. వరాహ భూదేవీ సంవాదములో

జాగరేతు విశాలాక్షి! జానతో వా ప్యజానతః
యో మే ప్రగాయతే గీతం మమ భక్త్యా వ్యవస్థితః

యావంతి త్వక్షురా ణ్యత్ర గీయమానే యశస్విని
తావ ద్వర్ష సహస్రాణి స్వర్గ లోకే మహీయతే

అని యున్నది. ఇట్టి గాన మహిమను దెలుపుటకు మాల దాసరి కథ వరాహ హరి భూదేవితో చెప్పెను. ఆమె విష్ణుచిత్తుని కూతురయి జన్మించినది. గోపికలు కాత్యాయనీ వ్రతము నాచరించి రని వినినది గోదాదేవి. ఆమె ధనుర్మాసమునందు స్నానము చేసి ద్రావిడ భాషలో దినమున కొక్క పాశరము రచించి వటపత్ర శాయిని ముప్పది దినములు ముప్పది పాటలతో సేవించినది. హరి కరుణను సంపాదించి వానిని పరిణయ మాడినది. రాయలవారు మాలదాసరి కథ యథామూలముగా విరచించిరి. సోమశర్మ యజ్ఞమున శూల దోషముచే మరణించి బ్రహ్మ రాక్షసు డైనట్లు మూలమునం దున్నది. దానిని మార్చినాడు రాయలు. చండాల బ్రహ్మరక్ష స్సంవాదము నందు శఠకోప రామానుజులను పేర్కొని రక్కసుడు 'ఇట్టి యేమ్యం బులు మదీయ దివ్య బోధంబున నెరింగి యుండుదు' నని నుడివెను. ఇందు మూలమున కవి రాక్షసుని భావి కాలజ్ఞత చేత కలియుగ మందలి వైష్ణవ మునుల వృత్తాంతము చెప్ప గలిగె నని సమర్థించెను. తరువాత గోదాదేవి పెండ్లి కథ యథారీతి వర్ణింప బడినది. ఇందు కొంత పార్వతీ పరిణయ కథావిధానము ననుసరించినాడు కవి. రాయల వారి సహజ మగు కవనంపు

## పోకడలు

గోదాదేవి కథయందు గోచరించును. అది స్వతంత్ర రచన. కథ తన భావముల కనువుగా మలచి చక్కగా తీర్పులు దిద్దెను. రాజాంతః పురాంగనల సహజ గంభీరంపు స్వభావములతో గోదాదేవిని అతి సహనము గల భారతీయ దైవతంపు టిల్లాలుగా రూపొందించెను. అది యా కవిలోని రాజసము కారణము. రాయల కవిత అసలు స్వభావము

చేత మాధుర్య గుణము కలది. అందు వ్యావహారికములు దేశీయము లతో గూడి దొరలు చుండును. వానికి తత్సమములు సంస్కృతములు తోడయి పుష్టి నొసంగు చుండును. పదములను కుంచించియు కుదిలించియు వాడుటచేత పద్యంపు నడకలో ధారావాహికయందు కతుకులు వాటిల్లును. దానికి తోడు రాయల అన్వయ క్రమము సంస్కృత సంప్రదాయములను పుణికి పుచ్చుకొనుటచేత క్లిష్టతకలిగి జాలువారు తెలుగు తనంపు పోకడలకంటె భిన్నముగా నుండును. అందందు కన్నడ రచనా విధానములు కూడ పొదిగించె నేమొ కూడ యని నా తలంపు. ఇందు మూలమున కవిత నారికేళ పాకమున పడినది. పదముల కుంచింపు వలన నడకలో సాపు తనము పోయినది. కరకు తనము నెలకొనినది. వాని కల్పనలు కవితకు మరింత క్లిష్టత చేకూర్చినవి. అలంకారములు బిరుసు తనము కలిగించినవి. అందు మూలమున పద్య భావము లవగాహన మొనర్చుకొనుటకు పాఠకునకు శ్రమ కలిగించును. అందు శాస్త్రీయములగు చర్చలు సామాన్యులను దరికి చేరనీయవు.



# ౭

## ధూర్జటి

ఆంధ్ర సామ్రాజ్యాధి నేత యగు శ్రీకృష్ణ దేవరాయలవారి యాస్థానమునం దష్ట దిగ్గజములను విఖ్యాతి నొందిన వివిధ భాషా కవులలో ధూర్జటి యొకడు. అతడు తెలుగు కవి. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, శ్రీకాళహస్తీశ్వర శతకము, అను రెండు గ్రంథములు రచించెను. తెనుగు కవుల పరంపరా గతమైన సంప్రదాయము ననుస రించి తన కావ్యమునందు నీ కవి వంశమును గాని తన కుల గోత్రము లను గాని చెప్పుకొన లేదు. కాని ఆశ్వాసాంత గద్యమునందు సింగమ రమా నారాయణ జక్కయ నారాయణ తనూభవ యని యుండుట వలన తల్లి సింగమ యనియు తండ్రి జక్కయ యనియు తేలుచున్నది. తరువాత భవ పరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబైన శ్రీ కాళహస్తి మాహాత్మ్యం బను మహా ప్రబంధం బని యున్నది. కావున శ్రీ కాళహస్తి మాహాత్మ్యము భవ బంధములను త్రెంచుకొని వైరాగ్యము కలవాడయి సన్యసించిన తరువాత వార్ధక్యమునందు రచించి యుండును. యత్యాశ్రమమునందు ధూర్జటి యను నామమును పొంది యుండును. ఆ నామమును తన ప్రబంధమునందు పేర్కొనెను. అసలు పేరేదో తెలియదు. ధూర్జటి యను నామము పరిపాటి యైనది. ఈ యతీంద్రుని మనుమడు వేంకటార్యుడు. వానికి కుమార ధూర్జటి యను పేరు కలదు. అతడు కృష్ణరాయ విజయమును రచించెను. అందు ధూర్జటిని పేర్కొనెను. దానిని బట్టి ఈ కవి మాన్యుడు పాకనాటి యార్వేల నియోగి యనియు ఆపస్తంభ సూత్రు డనియు భారద్వాజ గోత్రు డనియు తెలియు చున్నది

స్తుతమతి యైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీ
యతులిత మాధురీ మహిమ

యని రాయలవారిచేత వినుతి గాంచిన మహాకవి ధూర్జటి. దీనిని

హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వార వనితా జనతా ఘన తాప హార సం
తత మధు రాధ రోదిత సుధా రస ధారలఁ గ్రోలుటం జుమీ!

యని తెనాలి రామకృష్ణుడు పూరించె నని యందురు. అతడు రాయల వారి అష్టదిగ్గజములలో నొక డని కొందరి యభిప్రాయము. ఈ పద్యమును గురించి యొక కథయు ప్రచారమునం దున్నది. రాయలవారు పై పద్య భాగమును కవుల గోష్ఠియం దనిరి. దానికెవరు సమాధానము చెప్ప లేక పోయిరి. రామకృష్ణుడు రెండు రోజులు గడు విచ్చినచో సత్యమెఱింగి పద్యము పూరింతు ననెను. రాయలవారు సమ్మతించిరి. రామకృష్ణుడు రహస్యముగా ధూర్జటి వెంట దిరుగ నారంభించెను. వాని జాడ లరయు చుండెను. మరునాడు రేయి ధూర్జటి యొక వేశ్య యింటి కరుగుట చూచెను. అతడు తిరిగి వచ్చునంత వరకా వారాంగన యింటి మెట్లమీద పొంచుండెను. ధూర్జటి చీకటి మరుగునందు కనబడక వాని మీద నడుగు వేసెను. రామకృష్ణుడు వెంటనే లేచి ధూర్జటి స్వాములకు నమస్కార మనెను. ధూర్జటి నిర్ఘాంత పోయెను. రాయలవారికి చెప్పవల దని కాళ్ళ వేళ్లం బడి బ్రతిమాలెనట. మరునాడు రామకృష్ణుడు రాయల కొలువునందు పైవిధముగా పద్యమును పూరించి ధూర్జటికి తల వంపొదవించెను. ఇది పిల్లలు నమ్మ వలసిన కథ. రామకృష్ణుడు పండితుడు, కవి. ఎంత కొక్కిరాయి యైనను వారాంగన యింటి మెట్ల మీద పొంచి యుండు నీచత్వమునకు పాల్పడడు. ఒక వేళ వైరము కొలంది లోబడె నని యందురుగాక. కవులు ఆత్మవంచకు లనిపించుకొన జాలరు. వైరమును కవితా ప్రదర్శనముచేత తీర్చుకొందురు. సెబా సనిపించుకొందురు. నీచాతి నీచములగు కార్యముల నొనరించుట కంగీకరింపరు. అసలు రామకృష్ణుడురాయల కొలువులోనివాడు కాదు.

అతడు వికటకవి. అతని కవిత కటుకయినది. ఆ సమాస మంత సగళ ముగా నడిపింపలేదు. రామకృష్ణుని పేర ననేక కథలు కలవు. వాని లో నిది యొకటి. ఎవరో దాని నట్లు పూరించిరి. వాని పేరు పెట్టిరి. స్తుత మతి యను విశేషణమునం దొక నిగూఢార్థ మున్నది. వినుతింప దగు మనస్సు కలవాడని దాని యర్థము. అది ధూర్జటి ప్రవర్తనములేక శీలమును సూచించు సమాసము. ధూర్జటి యతి విరాగి. యకలంక మగు శివభక్తి కల వాడని వాని గ్రంథముల వలన తెలియ నగును. విరాగుల రచనలకు రసికుల రచనలకు చాల భేద ముండును. జయదేవుడు నారాయణ తీర్థుల రచనలలో నా భేదము చూడ వచ్చును. త్యాగరాజు క్షేత్రయ్యల కవితలో భేద మున్నది. విరాగి యగు ధూర్జటి రసికు లగు కవులకు సాధ్య మగు నింత మధుర మగు కవిత యెట్లు వ్రాయ గలిగె నని యీ సమస్యలోని నిగూఢ భావము. ఆంధ్ర కవి యనుటచేత ముద్దు లొలికించు చక్కని వ్యావ హారికం బగు దేశీయ కవిత కలవా డని సూచన. మచ్చునకు

మంచెల మీఁద నెక్కి కటి మండలిఁ జుట్టిన పాటుటాకు లిం
చించుక సంచలించి మరు నిల్లు బయల్పడఁ జేయఁ బిట్టలన్
జెంచెత లార్చి వేయుదురు చిత్రముగా నొడిసెల్ల బాహు మూ
లాంచిత దీధితుల్ చిలుత యైన చనుంగవ మీఁద పర్వఁగన్

వడి కొల్పి యొక కేల ముడిచిన క్రొమ్ముడి
గొబ్బునఁ గటిఁ జుట్టికొన్న చేల
యొండొంటఁ బెనఁ గొని యున్న హారంబులు
నిద్ర దేఱెడు నేత్ర సీరజములు
వాడఁ బాఱిన తీఁగ వంటి చక్కని మేను
చిన్ని కెంపులతోడి చిగురు మోవి
పిఱుఁదు భారంబున బెణకెడు పదములు
చనుగవ వ్రేఁగున జడియు కౌను

కలిగి కలఁగని మనముతోఁ గాళహస్తి
విభునిఁ దలఁచుచు దిక్కు నీవే యటంచు
సరగ నేతెంచి యూర్పులు సందడింప
రాజు ముందర నిలిచె నంభోజ వదన

ఇటు వంటి శృంగార పద్యములు వ్రాయుటకు కొంత స్వానుభవ ముండ వలయును. సీస పద్యములోని మొదటి రెండు పాదములు రతి యనంతర సంరంభము. అది రసికుల యనుభవములోనిది. నంది తిమ్మన.

అన విని మానినీ తిలక మప్పుడు మే యటు దోప నిక్కి వీ
డిన కచ పంక్తిఁ బల్మఱు ముడి న్వడ దోపుచుఁ బైచెఱంగు గ్ర
క్కునఁ జనుగోయిఁ జేర్చుచు మొగంబున లేఁ జెమరంకురింప జం
కెన నెఱి చూపు చూచి పలికెం జలితాధర పల్లవాగ్రయై

ఇట్టి స్త్రీ సహజము లగు చర్యలు ఊహా కందునవి కావు. కవికి పరిశీలనా శక్తి యనుభవము నుండ వలయును. అది లేని నాడా పద్యము లట్లు వ్రాయ లేడు. కావున ధూర్జటి రసికు డనక తప్పదు. అతని జీవితానుభవముల ప్రతి బింబము.

## శ్రీ కాళహస్తీశ్వర శతకము.

అది వేమ నాది శతకములవలె లోకమునకు నీతి బోధించుటకు వ్రాయ లేదు. ధూర్జటి తన చిత్తావేదనమును కాళహస్తీశ్వరునకు నివేదించు కొనిన గ్రంథము. శతకముల రచనయం దిది క్రొత్త పద్ధతి. దీనిని చూచి తిరుపతి కవులు కామేశ్వరీ శతకము రచించిరి. ఇందలి భావములు వారి శతకములందు కలవు. శ్రీ కాళహస్తీశ్వర శతక మొక నాటి రచన కాదు. అందాలు బిడ్డలు పొడటున నాటి నుండి ముదిమి తలకొన్న నాటి వరకు గల యనుభవములు గలవు.

ఆలంచు న్మెడఁ గట్టి దానికి నపత్య శ్రేణిఁ గల్పించి త
ద్బాల వ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధంబు గావించి యా
మాలర్కంబున బాంధవం బనెడు ప్రేమం గొంద ఱం ద్రిప్పఁగా
సీల న్సీల యమర్చి నట్లొసఁగి

తి వని ధూర్జటి వచించెను. అప్పటికి పుత్ర పుత్రీవంతుడు ధూర్జటి.
ఇచ్చి పుచ్చుకొనుచు బహు బాంధవము కలవాడయ్యెను. వారితో వీ
నెడ తెగని సంబంధము ననుభవించెను. దానిని తెగ తెంపులు చేసికొన
లేక

ఆలుం బిడ్డలుఁ దల్లి దండ్రులు ధనం బంచు న్మహా బంధనం
బేలా నా మెడఁ గట్టినాడ

వని ఈశ్వరునకు నివేదించుకొనెను. అతడు వేశ్యా లోలుడు

కాయ ల్గాచె వధూ నఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయ న్రాపడె బొమ్ము మన్మథ విహార క్లేశ విభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను బట్ట గట్టెఁ దల చెప్పన్ రోత సంసార మేఁ
జేయం జాల విరక్తుఁ జేయ గదవే

యని ఈశ్వరు నర్థించినాడు. రక్తి విరక్తుల నడుమ నూగులాడి నాడు
కొన్నాళ్లు. రోసీ రోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యం బని
మరల తడుము లాడినాడు. అమర స్త్రీల రమించినం జెడదు
మోహం బింతయు నని తెలిసి కొనినాడు ధూర్జటి. దీనినిబట్టి ధూర్జటి
స్త్రీలోలుడని తలంప వలసి యున్నది. రాయల పద్య మట్లు పూరింప
బడుటలో నసత్యము లేదు. ఈ సంఘటనము ధూర్జటి సన్యసించి
కాళహస్తి మహాత్మ్యము రచించిన తరువాత జరిగి యుండును. అప్పటికి
ధూర్జటి సన్యసించెను. విరాగి యగు సన్యాసి కిట్టి కవిత యెట్లబ్బె

నని రాయల యాశ్చర్యము. అందు రాయలవారి వెక్కిరింత కూడ కొంత కలదు. ఆ మహారాజు నిండు కుండ. అతని లోలత్వము వెల్లడి చేయుటకే యీ సమస్య నిచ్చెను. ముఖప్రీతి కొరకు రాయల కొలువు నందలి కవులలో వాని విరోధు లెవరో దానిని పూరించి యుందురు. రామకృష్ణుడు మాత్రము కాదు. రాయల కది యానంద మయినది. కుమార ధూర్జటి యీ రహస్య మెరుగడు. దానిని ఘనతగా చెప్పుకొనెను. ధూర్జటి మహా పండితుడు, కవి, వేదాంతి, సాంఖ్యాది యోగము లెఱంగినవాడు. మంత్ర శాస్త్ర మా మూలము పరిశీలించెను.

పరిశీలించితి మంత్ర తంత్రములు చెప్ప న్వింటి సాంఖ్యాది యో
గ రహస్యంబులు వేద శాస్త్రము వక్కాణించితిన్ శంక వో
దరయం గుమ్మడి కాయలోను యవ గింజం తైన నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవఁ జూపఁ గదవే

యని ఈశ్వరుని వేడుకొనినాడు ధూర్జటి. ఇన్ని శాస్త్రములు చదివినను వాని వలన మోక్షాపాది యగు విజ్ఞానమునకు దారి వానికి దొరక లేదు. అవి నిరర్థకములని.తోచినవి పరమేశ్వరుడే దానిని ప్రసాదింప వలయు నని వాని నమ్మకము. అది యీశ్వర సేవవలన లభించు నని నిర్ణయము. కావుననే

ఏ వేదంబు పఠించె లూత భుజగం బే శాస్త్రము ల్చూచెఁ దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెంచే మంత్ర మూహించె బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా ! కావు మీ పాద సం
సేవాసక్తియె కాక జంతు తతికిన్

అని విస్పష్టముగా నుడివెను. ఈ విషయమునే రాయలవారు విష్ణు చిత్తీయమునందు విష్ణుచిత్తుని నోటఁ బలికించెను. శైవ వైష్ణవములు

రెండు భక్తి నంగీకరించు మతములు. శాస్త్ర విద్యలతో పని లేదని పరమేశ్వర పద పంకజ సేవయే మోక్ష దాయకము లని తెలుపు చున్నవి. ఆ రెండు మతములకు దైవములు వేరయినను మోక్ష సాధన సంపత్తి యొకటే. ధూర్జటి రాయలవారివలన చతురంతయానాది సన్మానములు పొందెను. సుఖ భోగము లనుభవించెను.

మదమాతంగము లం దలంబులు హారుల్ మాణిక్యము ల్పల్లకుల్
ముదితల్ చిత్ర దుకూలము ల్పరిమళంబుల్ మోక్ష మీ నేర్చునే
మదిలో వీని నపేక్ష సేసి నృప ధామ ద్వార దేశంబుఁగా
చి దినంబుల్ వృధ

పుచ్చుట యజ్ఞాన మని తోచినది. భవ దుఃఖంబులు రాజ కీటములను బ్రార్థించినం బాయునే యని యాలోచన పొడమినది. రాజులు కీటకములట. మత్తులట.

రాజు ల్మత్తులు వారి సేవ నరక ప్రాయంబు వా రిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మ వ్యధా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్ము దయతో

నని దైవమును వేడుకొనినాడు ధూర్జటి. ఇది రాయల యెడ గల విద్వేషము

సంతోషించితిఁ జాలుఁ జాలు రతిరాజ ద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁ జాలు బహు రాజ ద్వార సౌఖ్యంబులన్

అని స్త్రీల యందును రాజుల యందును విరాగము కలవాడైనాడు. కాని

పది వేలైనను లోక కంటకులచేఁ బ్రాపించు సౌఖ్యంబు నా
మదికిం బథ్యము గాదు సర్వమునకున్ మధ్యస్థుఁడై సత్య దా
న దయాదుల్లల రాజు నా కొసఁగు మే నవ్వాని నీ యట్లు చూ
చి దినంబు న్మదిఁ దెందుదున్ గడపటన్

అని మనవి చేసికొనినాఁ డీశ్వరునకు. దీనివలన రాయలవారి యందు ధూర్జటికి కోపము కలిగిన దనియు పై రాజ నింద రాయలనే యని యూహింప వలసి యున్నది. రాయలు మధ్యస్థుడు కాక పక్షపాతమున నసత్యము కలవాడయి వర్తించె నని తెలుపు చున్నది. అది మత కార్పణ్యము కావచ్చును. రాయలు విష్ణుచిత్తీయము నాల్గవ యాశ్వాసములోని యామునాచార్యుని కథయందు "వెఱ్ఱి శైవంబు ముదిరి" యను పద్యము మొదలు 'శిలముఁ బట్టియు' అను పద్యము వరకుఁ గల అయిదారు పద్యములలో శివుని శివ భక్తులను నిందించెను. అది వాని శైవ మత ద్వేషమును తెలుపు చున్నది. ధూర్జటి వీరశైవుడు. స్వతంత్ర బుద్ధి కలవాడు. అభిమాని. రాయలు వైష్ణవుడు. రాజు. వాని శైవ ద్వేష మేదో ధూర్జటిని నొప్పించి యుండును. వైష్ణవ గురువులు రాజాదరము కలవారు. గర్వమున ధూర్జటితో వాదనలకు దిగి యుందురు. వాని యెదుట వాగ్వాదన యందు నిలువ లేకపోయి రాజుతో కొండెములు చెప్పి యుందురు. అందుకనే

అయవారై చరియింప వచ్చుఁ దన పాదాంభోజ తీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని నర్థ ప్రాణ దేహాదు ల
న్నియు నా సొమ్మనవచ్చుఁ గాని సిరుల న్నిందించి ని న్నాత్మ ని
ష్ఠియతం గానఁగ రాదు పండితులకున్

అని వైష్ణవ మత గురువులను నిందించెను. వారి మాటలు ఆచార వ్యవహారములు ధూర్జటికి నచ్చలేదు. వైష్ణవ మత గురువులను

శ్రుతు లభ్యాసము చేసి శాస్త్ర గరిమ ల్బోధించి తత్త్వంబులన్
మతి నూహించి శరీర మస్థిరము బ్రహ్మం బెన్న సత్యంబు గాం
చితి మంచున్ సభలన్ వృథా వచనము ల్చెప్పంగనే కాని ని
ర్జిత చిత్త స్థిర సౌఖ్యముల్ తెలియ

రని పరిహాసించెను. మత గురువుల కొండెములు విని రాయలు ధూర్జటిని కోపించి యుండును. ధూర్జటి యాత్మాభిమానము కలవాడు. రాజ సేవయందు విరాగము కలవాడయ్యెను.

నిచ్చల్ నిన్ను భజించి చిన్మయ మహా నిర్వాణ పీఠంబుపై
రచ్చల్ సేయక యార్జవంబు కుజన వ్రాతంబుచేఁ గ్రాఁగి భూ
భృచ్చండాలురఁ గొల్చి వారు తను గోపింపన్ బుధుం డార్తుఁడై
చిచ్చారం జమురెల్లఁ జల్లుకొనునో

యని రగడు చేసికొనక రాజ కొలువు చాలించుకొనెను. కాని వాని కపకార మొనరించిన వారి పయి పగ యడగ లేదు. కోపము కొలంది

నిను నిందించిన దక్షుపైఁ దెగవా వాణీ నాథు శాసింపవో
చనునా నీ పద పద్మ సేవకులఁ దుచ్ఛుం బాడు దుర్మార్గులం
బెనుప న్నీకును నీదు భక్త తతికిన్ భేదంబు గానంగ వ
చ్చెనో లేకుండిన నూర కుండఁ గలవా

యని యీశ్వరునితో వారిని శిక్షింపు మని మొర పెట్టుకొనెను.

జ్ఞాతుల్ ద్రోహులు వాండ్రు సేయు కప టేర్ష్యాది క్రియా దోషముల్
మా తం డ్రానసహింప రాదు ప్రతి కర్మం బించుకేఁ జేయఁగాఁ
జేతో దోషము గాన మాని యతినై పోఁ గోరినన్ సర్వదా
చేతః క్రోధము మాన దెట్లు నడతున్

అని ధూర్జటి వ్యాకుల పడెను. వాని జ్ఞాతులు ద్రోహ మొనరించిరి. కపటముగా వానితో స్నేహము నటించి అసూయ కొలంది రాజుతో నేవో కొండెములు చెప్పి యుందురు. అవి సహింప రాని వయ్యెను. వారి మెపె ధూర్జటికి విరాగము కలిగినది. సన్యసింప తలంచెను. కాని మనస్సు నందలి క్రోధ మడంచు కొనలేక పోయెను. జ్ఞాతులతో కలిసి కుమారులు కూడ వానిని వ్యతిరేకించిరి. అది మరింత వ్యాకులమునకు కారణ మయినది.

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకు ల్జీవన భ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నే గతుల్
పడసెం బుత్రులు లేని యా శుకునకుం బాటిల్లె నే దుర్గతుల్
చెడునే మోక్ష పదం బపుత్రకునకున్

దుర్మార్గులగు పుత్రులు కలుగుట కంటె తండ్రి యపుత్రకు డగుట మేలనియు దానివలన మోక్షము రాక పోదని తలంచెను. ఇట్టి కష్ట సుఖముల మధ్య జీవితము గడపినాడు ధూర్జటి. వానికి

వెనుకం జేసిన ఘోర దుర్దశలు భావింపంగ రోతయ్యెడున్
వెనుక న్ముందట వచ్చు దుర్మరణము న్వీక్షింప భీతయ్యెడున్
నను నే జూడంగ నా విధు ల్దలచియు న్నాకే భయం బయ్యెడున్
జెనకుం జీకటి నాయెం గాలమునకున్

తా నొనరించిన పనులను తలంచుకొనన రోత కలిగినది ధూర్జటికి. రాబోవు మృత్యువును తలంచుకొనన భీతికలిగినది. వాని హృదయము వాని స్థితికి పరితపించి పోయినది. దానికి నిష్కృతి నూహించినాడు చివరకు.

దినముం చిత్తములో సువర్ణముఖరీ తీర ప్రదేశాప్ర కా
నన మధ్యోపల వేది కాగ్రమున నానందంబునం బంకజా

సన నిష్ఠ న్నినుఁ జూడఁ గన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీ విలా
సిని మాయా నటనల్ సుఖంబు లగునే

యని యాలోచించెను. కాళహస్తి కరిగెను. సంసారము మీఁద విరక్తి కొలంది

లేవో కానలఁ గంద మూల ఫలముల్ లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవాస్తరణముల్ లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుప జాలిం బొంది భూపాలురన్
సేవల్ సేయఁగఁ బోదు రేలకో జనుల్

అని తోచినది. సన్యాసము స్వీకరించినాడు ధూర్జటి. కాలము గడిచినది కొంత. అప్పటికి వార్ధక్య మరుగుదెంచినది. ఆరోగ్యము చెడినది. తడుము లాడినాడు చివరకు మందులకు మాకులకు.

చావం గాలము చేరువౌ టెఱిఁగియుం జాలింపఁగా లేక త
న్నే వైద్యుండు చికిత్సఁ బ్రోవఁ గలఁడో యే మందు రక్షించునో
యే వేల్పుల్ కృపఁ జూతురో యనుచు నిన్నింతైనఁ జింతింపఁడో
జీవ శ్రాద్ధముఁ జేసికొన్న యతియున్

అని కాళహస్తీశ్వరుని సేవించి యారోగ్యవంతుఁడైనాడు. అప్పుడు

నీకుం గాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిన్ బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు

అని కాళహస్తీశ్వరున కంకితముగా

కాళహస్తి మాహాత్మ్యము

అను కావ్యమును రచించెను. కృత్యాదియందు ఇతర కవుల వలె తన కుల గోత్రాదులను వ్రాసికొన లేదు. తల్లి దండ్రుల పేరు చివర రమా

నారాయణ, నారాయణ, శబ్దములను చేర్చి సింగమ రమా నారాయణ, జక్కయ నారాయణ, యని వ్రాసికొనెను. దీనిని బట్టి ధూర్జటి యత్యాశ్రమము స్వీకరించిన తరువాత నీ ప్రబంధమును రచించె నని తోచు చున్నది. ఇంతె కాదు. కృత్యాదియందు పూర్వ కవుల నెవరిని వినుతింప లేదు. కాళహస్తిమాహాత్మ్యము నాలు గాశ్వాసముల గ్రంథము. అందు నేడు వందల యేబది యారు పద్యములు గలవు. కావ్య కథ కాళహస్తి పుర వర్ణనతో నారంభింప బడినది. పరమేశ్వరు డొక్క నాడు తెన్నండ లాధిపతి యగు యాదవరాజు భక్తిని పరీక్షింప గోరి

అడుగు నెత్తమ్ముల నపరంజి పావాలు
కరమునఁ గేదార కంకణంబు
బంగారు వ్రాఁతి చెఱుంగుల గోణాము
గళమున రుద్రాక్ష కంఠ మాల
నొక కేల భసిత భస్త్రికతోడి బెత్తంబు
సందిఁ గట్టిన తరుణేందు ధరుఁడు
మాణిక్య రుచుల యుష్ణాణంబు భూతిపైఁ
బెట్టిన కస్తూరి బొట్టు

సార్వ కాలిక తాంబూల చర్వణార్ద్ర
రాగ సౌభాగ్యమునఁ బద్మరాగ మణులఁ
దృణముగాఁ జూచు దంత పంక్తియును గలిగి
యాంగజారాతి యొక మిండ జంగ మగుచు

రాజధాని యగు నారాయణవన పురమును జేరి యొయ్యారంబున రాజ వీథియందు చరించు చుండెను. అట్టి యెడ నా పట్టణంబున

తన సౌందర్యముఁ జూచి కామ శర సంతాపంబునుం బొంద కుం డిన కాంతామణిఁ దాల్మి దూలని వధూటిం గౌగిలింపం దలం

పని శంపా లలితాంగిఁ బోటులకుఁ జెప్పం బోని పంకేరుహా
ననఁ గీర్తింపని లేమ మందునకు నైనం గాన

రా కుండెనట. ఒక్క కలకంఠీ రత్నము వానిని చేరం జని

బిజమాడు దేవరు నిజకృపా దృష్టిఁ జె
న్నారు నా యిల్లు బిడారు మీకు
నాకు మీ పాదార్చనము సేయ నడలింగ
మూర్తి చేకుతె వచ్చి మూర్త మాడి
యొడయ చిత్తేశ నా యునికిని మజ్జనం
బాడి శివార్చన మాడ బేకు
విచ్చేయుఁడు విభూతి పీడియం బందుకో
జంగమ స్వామి నా సదనమునకు

నోగిరంబులు మంచి మే లోగిరములు
నావటించెదఁ బదఁడు మీ రారగింపఁ
బ్రతి దినంబును జంగ మార్చనము లేక
తనివు పడ నొల్ల విజిత కందర్ప

యని యర్థించినది. వీర శైవ మతము కన్నడ దేశ ప్రాంతమునం దావిర్భవించినది. పండితారాధ్య బిజ్జలాదులు కన్నడ ప్రాంతీయులు వీరశైవ మత ప్రచారకులు. కావున సంభాషణలందు కన్నడ పారిభాషిక పదములు, అరవ పదములు వైష్ణవమునందు వలెనె, దొరలు చుండును. బిజ మాడు, ఆడ బేకు, మూర్తమాడి, ఇట్టి పదములు పై పద్యమున ధూర్జటి యుపయోగించెను. ఆమె జంగ మాంగన. మాట నిపుణత కలది. చిత్తేశ, విజిత కందర్ప ఇత్యాది సంబోధనల చేత తన యనురాగము వెలిబుచ్చినది. చిత్తేశు డనగా మనసును

నియమించు వాడని యర్థము. పరమేశ్వరుడు మనోభావములకు కారణ భూతుడు. కావున శివుడు చిత్తేశు డయినాడు. జంగములు శివ స్వరూపులు. ఆ కారణముచేత చిత్తేశ యని సంబోధించిన దా యువతి. చిత్తేశ యనగా ప్రియుడా యని అర్థాంతరము. ఇది యనురాగ సూచకము. శివుడు నిజమునకు విజిత మన్మథుడు. మన్మథుని దహించినవాడు. అందముచేత మన్మథుని జయించినవాడా యని సంబోధన. ఇది మోహమును ప్రదర్శించునది. ఇట్లుభయార్థ ద్యోతకము లయిన సంబోధనలచేత తన మోహావేశమును భక్తియు వెలిబుచ్చిన దా యువతి. అది పలుకు నేర్పరితనము. దానిని వెలయించుటకే కవి యా సంబోధన లట్లు వాడెను. ఆ మోహావేశము జంగముని దాటి పోనీయకుండ 'ఓగిరమ్ములు మంచి మే లోగిరములు నావటించెద' ననిపించినది. వచ్చిన కపట జంగముడు ఆమె యంద చందములకు మన సొగ్గినాడు. ఆమె ప్రార్థన మంగీకరించినాడు. కాని

కాంతా! నీ యింటికిఁ
జనుదెంచెద నీదు గుబ్బచనుఁ గొండల సం
దునఁ దెరు వెఱుఁగక తిరిగెడి
మనసను తెరువరికి దప్పి మాన్పం గలవే

యని యామెను ప్రశ్నించినాడు శివజంగముడు. ఈ పద్యమునందు దప్పి అను శబ్దమునకు శ్రమ మని యర్థము. అందుల కా కలకంఠి

నీదు మనసు వచ్చిన రీతిం
బని వినియెద మాటల కేఁకఁ
బనిలే దీ తలంపు నాదు భాగ్యము గాదే

యని సమ్మతిల బలికినది. జంగముడు యువతి వెంట చంద్రికా (శ్రీ) వెను వెంట నేగు నల శీతమయూఖుని రేఖఁ బోలె నింటికి నరిగెను. ఆమె చేసిన పూజలు గైకొనినాడు జంగముడు. ఏకాంత గృహములోని యలరు సెజ్జ పయి నిరువురు మే నెరుంగని రతీ వినోదంబుల నానందించు చుండిరి. ఆమె యా పుర మేలు యాదవరాజు భోజనమునకు పళ్లెము లమర్చు పనికత్తె. సమయమునకు రాలేదు. రాజునకు కినుక పొడమినది. ఆమెను గొని తేర భటుల నంపించినాడు. తల గొరిగించి పంపినాడు. ఆమె శోకావేశమున

ఓ యను రోదనం బోంకార మనువుగాఁ
  గనుఁ గవ నీరు మజ్జనముగాఁగ
నిడు వాలుఁ గన్నులు నీలోత్పలములుగా
  నెమ్మోము గ్రొత్త నైత్తమ్మిగాఁగఁ
గమ్మని నిట్టూర్పు గాడ్పు ధూపంబుగా
  దంత కాంతులు దీప తతులు గాఁగ
నధరోష్ఠ మమృతోపహారంబుగాఁ బదా
  బ్జంబులఁ బడుట దండంబు గాఁగ
నవధరించెనో కాక లోకైక విభుఁడు
భక్త జనముల ముంగిటి పారిజాత
మేల యేడ్చెదు మానవే చాలు ననుచు
హస్తమస్తక సంయోగ మాచరించె

ను. అంతట నా దాసి పెన్నెరులు యథారీతిగా సాగి వచ్చెను. వినినాడు యాదవ రాజీ వృత్తాంతము. మాయా జంగముని దర్శింప వచ్చినాడు. యాదవ రాజునకు జంగమ రూపమున నున్న శివుడు కాళహస్తీశుని మహిమ వినిపించెను. ఇది యుపోద్ఘాతము. కావ్యారంభమునకు చక్కని పునాది. కథావస్తువున కాకర్షణీయ మగు తొలి సంజ మెఱుంగు కెంజాయ.

దక్షిణ దిశయందు గజవనము కలదు. అది భయంకర జంతు సంతానముల కాకరంబయి యుండును.

వారణ కుంభముల్ శబర వల్లభు లమ్ముల ప్రక్కలించి ర
క్తారుణ ముక్త కావళిఁ గుహాంతర వీథు లలంకరించి నీ
రేరుహ పత్ర నేత్రలకుఁ బ్రీతి గొనర్తురు తీఱె నింక వ
క్షోరుహ సామ్య గర్వ మిభ కుంభ యుగంబుల కంచు నచ్చటన్

విశ్వామిత్రుని కారణంబున వసిష్ఠుడు నూర్గురు కుమారులను గోల్పోయెను. పుత్ర శోకమున కుమిలి పోవుచున్న వసిష్ఠుడు భూదేవి యుపదేశమున నవ్వనము నందు ఘోర మగు తపము గావించెను. వానికి శివుడు లింగ రూపమున ప్రత్యక్ష మయ్యెను. అందుండి దక్షిణా మూర్తి యావిర్భవించెను. వానిని వసిష్ఠుడు

మన్ననతో నాకిచటఁ బ్ర
సన్నుఁడ వైనట్లు ఘోర సంసార గదా
పన్నౌషధ ఘుటికా మహి
మోన్నతిఁ బూజఁ గొనవయ్య యుగముల నెల్లన్

అని యర్థించెను. అమ్మహాదేవు డందుల కంగీకరించెను.

శంబరసూదనాహితుని శాసనముం దల మోచి వచ్చి లో
కాంబ తదీయ సన్నిధిఁ బ్రియంబున నిల్చె సమస్త భక్త భృం
గంబులఁ జిన్మరంద రస గాఢ సుఖాత్ములఁ జేసి జ్ఞాన సూ
నాంబ యనంగఁ గీర్తిఁ గని యవ్యయ భూ భువనైక వాసనన్

అచట యగస్త్యుడు తపము గావించెను. వానికి బ్రహ్మదేవుడు ప్రత్యక్ష మయ్యెను. వర మడుగు మని కోరెను. అగస్త్యుడు అభ్ర గంగా నదిని దెచ్చి యిచ్చుట నఖండ గతిం బ్రవహింపఁ జేయవే యని

స్థాపించెను. తమ్మిచూలి గగనంబును గనుంగొనెను. సువర్ణ శోభా విభవంబుతో బహుళ భంగ మహో ముఖ్యాత్మ సంపదతో దేవ నదీ ఝరంబు ననుదెంచినది. సువర్ణముఖ యని బ్రహ్మ దానికి నామకరణము చేసెను. ఇది ప్రథమాశ్వాసములోని కథ. ధూర్జటి కవిత శర వేగము కలది. అతడు పండితుడు. ఆ పాండిత్య ప్రకర్ష పద జాలమునందు కనిపించును. కాళహస్తీశునందలి భక్తి రసావేశము పాండిత్యమును ముందునకు త్రోయును. పదములు శర పరంపరలుగా సెలయేటి నీటి ప్రవాహము వలె పొరలి వచ్చును. వానియందు కరకు తన ముండదు. పై పద్యములు గమనించునది. అతని యావేశము పద్య రచనా విధానమునందు శయ్యలో నొక విధమగు నుద్రేకమును పొసంగించును. అది పాఠకుని చిత్తము నుప్పొంగించి యుబుకు లాడించును.

శుండాలార్భక షండ గండ తల ఖర్జూ భర్జ నోపాజ్ఞ నా
ఖండ గ్రావము చండకుం డలివిశంక వ్యాప్తి కింపైన శ్రీ
ఖండ స్థాణువు శారికా శుక విహంగ వ్రాత పుండ్రేక్షు కో
దండ క్రీడకు నీడయై తప మ్మతి స్థైర్యంబునం జేయఁగాన్

ఇది ఆ కవి పాండిత్యమునకు తార్కాణము. కవితయందు ప్రతిభ కంటె పాండిత్య మధికముగా గోచరించును. ప్రతిభ వినూతన భావాంకూరములకు జనన కారణము. అది అంతగా గోచరించదు. ద్వితీయాశ్వాసమునందు సరస్వతి నూరు రూపములవలని బ్రహ్మకు నూర్గురు దుర్మార్గు లగు కుమారులు పుట్టుటయు వారిని బ్రహ్మ యుగ్రుడను కుమారునిచేత చంపించుటయు బ్రహ్మకు పుత్ర హత్యాది దోషములు కలుగుటయు తత్పరిహారార్థము దక్షిణ కైలాస గోత్రంబునం దాత్మవిద్యా ధురంధరుండైన కొడుకును బడయుగా గోరి తపము గావించుటయు కలదు. ఈశ్వరుడు ప్రత్యక్షమయి

బ్రహ్మను వర మిచ్చెను. ఋభువుడు జన్మించెను. తరువాత చెలది పురుగు శివైక్యము పొందుట కలదు. అందుండి యొక పద్యము

ఇది పెక్కేడులు పట్టెన్
సదనంబులు గట్ట నాకు శంభునికొరకున్
మదిఁ గుమ్మరి కొక యేడును
గుడె కొక పెట్టన్న మాటకున్ సరి వచ్చెన్

చెలది పురుగు

నాకీ భవ దుఃఖంబులు
లేక మహాజ్ఞాన రస విలీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని
యా కైవల్యమె యభీష్ట మని ప్రార్థింపన్

దిక్కులు ముంచు కొన్న తన తేజములోపల సూర్ణనాభమున్ గ్రక్కున గూర్చెఁ దన్మయముగా శివ లింగము భక్తిలోలతన్. ఆ శ్రీ సర్పమునకు నేన్గునకు తన సర్వ వ్యాపక జ్యోతిలో సాయుజ్యం బొసఁ గూర్చినాడు శివుడు. అప్పటి నుండి యాలింగమునకు శ్రీ కాళ హస్తి పతి యను పేరు వచ్చెను. విజయనగర రాజుల కాలములో పొడసూపిన కావ్యములందు జైమిని భారతము మను చరిత్ర విష్ణుచిత్తీయములు వైష్ణవ మత గ్రంథములు. అందు జైమిని భారతము శ్రీకృష్ణుడు పరతత్వముగా బోధించును. అతడు హరి. సర్వ వ్యాపకుడు. వాని భక్త రక్షణ దీక్ష బహు ముఖముల జైమిని భారతమునందు వర్ణింప బడినది. కావున అది భక్తి ప్రధానముగా గలది. అది పురాణము. అందు జీవాత్మ పరమాత్మల కద్వైత స్థితి బోధింప బడినది. మనుచరిత్ర కాలము నాటి వైష్ణవము భిన్న మార్గముల పట్టినది. ఆళ్వారుల సిద్ధాంతములు రామానుజుల ప్రబోధము వెలుగులోనికి వచ్చినవి. జీవాత్మ విష్ణు లోకమును చేరి విష్ణు

సారూప్యమును పొందును గాని సాయుజ్యమును పొంద దను విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రచారము చేయ బడినది. ఈ సిద్ధాంతము కర్మ జ్ఞాన సిద్ధాంతములతో జత గూడి యంతర్వాహిని వలె కథా వస్తువునందు పొందు పఱచి పెద్దన మనుచరిత్ర రచించెను. రాయల వారు భక్తికి ప్రాధాన్య మిచ్చి విష్ణుచిత్తీయము రచించిరి. మను చరిత్ర విష్ణుచిత్తీయములు మొదట విభిన్న భావములు కల వయ్యును తుదియం దేకాభిప్రాయము కల వయినవి. ఇది రాయల నాటి విష్ణు మత తత్త్వము. వీర శైవము గంగతోడి యమునా నది వలె వైష్ణవము నొరసి కొని దేశములో ప్రచారమునం దున్నది. దాని తత్త్వమే కాళహస్తి మాహాత్మ్యము. అది వీర శైవ మత గ్రంథము. అది శివ సాయుజ్యమును బోధించును. భక్తి రెండు మతములను సమానము. కావున భక్తిచేత చెలది పురుగు కాళము హస్తి శివ సాయుజ్యము పొంది నటుల చెప్ప బడినవి. ధూర్జటి వీర శైవాద్వైతి. కృష్ణ రాయల కాలమునం దీ రెండు మతములు బాగుగా ప్రచారమునం దున్నవి. ధూర్జటి లింగధారి కాడు. అయినచో యాదవ రాజు దాసి కొక లింగకాయ మెడయందు తగిలించెడి వాడేమో నని నా తలంపు. భక్తుడు తా నుపాసించు దైవమును సర్వ వస్తువులందు పరిశీలించును. పిపీలికాది బ్రహ్మ పర్యంతము గల సకల జీవ కోటులను పరతత్త్వ ములుగా భావించును. 'శివ మయం జగ త్సర్వం' అని శైవమతము 'విష్ణు మయం జగ త్సర్వం' అని వైష్ణవము. కాని శైవము సాయుజ్యమును బోధించును. వైష్ణవము సారూప్యమును బోధించును. ఈ మూల సూత్రము లను బట్టి శైవ వైష్ణవుల భావనలో భేదము కలుగు చున్నది. కావున శైవుడు ప్రతి వస్తువును శివుడుగా విలోకించును. తాను శివుడు. తాను చూచు ప్రతి జీవుడు శివుడే. ఉత్తర మీమాంసలోని 'తత్త్వ మసి, బ్రహ్మాస్మి' అను సూత్రముల నుపాధిగా గైకొని శివోహం అని శైవు లందురు. పరబ్రహ్మకు శివు డను నామకరణము గావించిరి. విష్ణువునకు భక్తులకు గల సంబంధము శేషశేషిత్వము. భక్తుడు ఎప్పటికీ

దాసుడే కాని విష్ణుత్వమును బొందడు. అతడు వైకుంఠమునం దున్నను దాసుడే. కావున 'అహం విష్ణుః' అనలేడు. వారి వారి నమ్మకములను బట్టి రచనలందు వారి వర్ణనలు కథలు నుండును. నన్నెచోడుడు వీర శైవుడు. అతడు కుమారసంభవమును రచించెను. అతడు విషయములను శివ పరముగా వర్ణించెను. తన గురువు పరమ శివునిగా నిరూపించెను. అది వీర శైవ కవుల లక్షణము. అట్లే ధూర్జటియు తన వర్ణన లన్నియు శివ పరముగా నొనరించెను. అది యీ కవి వీర శైవ మత తత్త్వమునందలి యచంచల మగు నిష్ఠను ప్రదర్శించును. మచ్చునకు

అతు లైశ్వర్య పరంపరా విలసితంబై నట్టి తత్పట్టణ
ప్రతిబింబం బన చంద్రకాంత రచిత ప్రాకార మొప్పారు న
ద్భుత మాయా బహు విభ్రమ భ్రమిత వస్తువ్రాత లోకోదయ
స్థితి లోఁగొన్న శివుం డనంగ హృద యాచింత్య ప్రభావంబునన్

ఇది కాళహస్తి పుర ప్రాకార వర్ణనము.

ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి ధర ధ్వాంతంబు ధూప ధూమ ముజ్జ్వల ద్దీప ప్రభా రాజి కౌ
ముది తారా నివహంబు లర్పిత సుమంబుల్గాఁ దమో దూర సౌ
ఖ్యదమై శీత గభస్తి బింబ శివ లింగం బొప్పెఁ బ్రాచీ దిశన్.

ఇది చంద్ర వర్ణనము. ఇట్టి వర్ణనలు శైవ మతాచార దీక్ష, శివ భక్తి ప్రాబల్యము వెలయించు చుండును. ఇట్టివి వైష్ణవ కావ్యములం దుండదు. దానికి కారణము హరి సర్వాంతర్యామిగా వినుతింప బడినను విష్ణుత్వ సిద్ధి భక్తునకు లేక పోవుటయే నని నా యూహ. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము చక్కని శైవ మత గ్రంథము. కావ్యత్వ ప్రతిపాదన కంటె శివ తత్త్వ ప్రతిపాదన విస్తరించి కనిపించును. అది కథా రచనలో విశదముగా గోచరించును.

తృతీయాశ్వాసము నందు తిన్నని కథ కలదు. ఈ కథా భాగము కావ్యమునకు మకుటాలంకారము. దానిని ధూర్జటి పొత్తపి నాటిలోని యుడుమూరు వర్ణనతో నారంభించెను. అది చెంచులకు నివాసము. వారి వైభవము ధూర్జటి పది పద్యములలో నతి రమణీయముగా వర్ణించెను. అందలి భిల్లాంగనలు

కఱకు జుంజుఱు వెండ్రుకల కొప్పు గాఢ త
 రంబుగా నెమలి పింఛంబుఁ జుట్టి
తెట్టు పున్నన వన్నె పెట్టి నట్టి లలాట
 పట్టిక జేగుఱు బొట్టు వెట్టి
కురువింద పేర్లకుం దెరు వీని పాలిండ్లఁ
 బొఱు టాకులుఁ గూర్చి పైటఁ దీర్చి
జమలి యొడ్డాణంబు సందున నిరియంగ
 బర్హాంబరముఁ గట్టెఁ బదిల పఱచి

వీఁక గల కుఱుచ గనుపుల వెదురు వింటఁ
జాఁగ పురిఁ దాల్చి నారిగా సంతరించి
గసిక కోలల గొని భిల్ల బిసరుహాక్షు
లడవిఁ దిరుగుదు రాత్మ నాయకులఁ గూడి

అని వర్ణించెను. ధూర్జటియందు కొంత శిల్ప రచనా చాతుర్య మున్నది. దానికి తగిన పద సామగ్రియు గలదు. పై పద్యమునందా యా విశేషములు గోచరించును. కాని పెద్దన గారి రచనలోని వైశద్యము దీనియందంతగా కనిపించదు. ఇంగువ కట్టిన వలిపము ధూర్జటి. ఆ వాసన వలిపము శిథిల మయినను వీడునది కాదు. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము రచించు నప్పటికి వార్ధక్యమున శరీర పాటవము తగ్గిన దయ్యు తొల్లింటి శృంగార రసానుభవములు స్మృతియందు బొత్తిగా తుడుపు పడ లేదు. మరు నిల్లు మరవ లేదు. ఎట్లు మరువ గలడు.

మించెల మీఁద నెక్కి కటి మండలిఁ జుట్టిన పాఁము టొంకు లిం
చించుక సంచలించి మను నిల్లు బయల్పడ జేయఁ బిట్టలన్
జెంచెత లార్చి క్రేయుదురు చిత్రముగా నొడి నెల్ల బాహు మూ
లాంచిత దీధితుల్ చిరుత యైన చనుంగవ మీఁద పర్వఁగన్

ధూర్జటి యుద్రేకము కల కవి. ఆ యుద్రేకము శయ్యా ప్రవాహ వేగము నందు విశదముగా కనిపించును. అది రచనా సౌష్టవమును పొందుకొని భావ వీచికల నుబికించి మిన్నంట నెగయించును. అట్టిది పై పద్యము. ఇటు వంటి శృంగార వర్ణనలు మహాకవులకు జన్మ హక్కు. ఈ హక్కును తగు విధాన నుపయోగించుకొని నప్పుడు కావ్యమునకు రమ్యత కలుగును. అదుపు తప్పి అతిగా పోయి ఆభాసము కావించుకొనిన కవులు తెనుగు సారస్వతమునందు కలరు. ధూర్జటి యా కోవంగోని వాడు కాడు. సముచిత మగు శృంగార వర్ణనలతో కావ్యమునకు శోభ నొదవించెను. అది శ్రీనాథుని కావ్య పద్ధతి. వానివర్ణనలు రుచిచూపించి పాఠకుని యూరించు చుండును. కాని యీ వింత లగు రచనా విధానములు ధూర్జయందు కాని పెద్దనయందు గాని లేవు. రాయలవారి యందన లగుపింపవు. అతడు పుట్టు కవి. యుగ కర్త. వాని దారు లితరులకు రా జాలవు.

ఆ కాననమునకు రాజు నాథనాథుడు. వాని భార్య తందె. ఆమెకు నెల తప్పినది.

భసి తాంగరాగ శోభా విలాసంబుతోఁ
బ్రతి వచ్చు నానన పాండు గరిమ
కంఠ హాలాహల కాళిమ చ్ఛవితోడ
నెన వచ్చు గుబ్బ చన్మొనల నలుపు
పరమ శివాకృతితోడ సరి వచ్చు నంతరం
బనఁ జాలి ఘన తరంబైన నడుము
స్వ స్వరూప విచార సంప్రాప్త శాంతితో
మార్పడుఁ జితేధమాన జడిమ

79)

సరభ సానంగ సంక్రీడ జరుగ నీక
దౌహృదము గర్భమున నున్న తనయు డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁ డని యపుడు తెలుపు
కరణిఁ బొంపొందె నమ్మంద గామినికిని

గర్భస్థు డగు బాలుని గుణముల కను వగు భావములు లక్షణములు గర్భవతికి కలుగు చుండును. పుట్టబోవు శిశువు పరమ శివ భక్తుడు. దానికనువగు లక్షణములు కలదయినది తంది. ఈ సందర్భమున వ్రాసిన పద్యములు ధూర్జటి యకలంక మగు శివ భక్తిని చాటు చున్నవి. తిన్నడు జన్మించెను. యౌవను డయ్యెను. విలు విద్య నభ్యసించు చుండెను.

విల్లు పట్టిన నెల పది నాళ్లలోన
వీఁక కలిగిన తడ విల్లు వెదురు విల్లు
నెలసు విల్లును మొదలైన చేఁగ విండ్లు
చులుకగాఁ దీసి శబరేంద్ర సూనుఁ డేయు

ధూర్జటి శబరులు విండ్ల నుపయోగించు విధాన క్రమము బాగుగా నెరుగును. కాళ్రేని జాతర సాగినది. పూజలు విందు భోజనములు జరిగి నవి. వానిని తొమ్మిది పద్యములలో కవి వర్ణించెను. అందుండి

నాతి యొకర్తు చిత్తము పనాథుని పై నిడి సారె సారె మో
హాతిశయానఁ బోలె నధి కాసవ మిచ్చి నిజేశుఁ గూర్చి య
ల్లాతని నాథు పేరనె ప్రియంబునఁ బిల్చుచుఁ గౌగలించి హా
లాతుర తాత్మికా గతి విలాసము చూపుచుఁ గూడె వేడుకన్

తిన్న డొకనాడు పరిజనములతో వేట కరిగెను. అలసట నొంది ప్రసూన వకుళ ప్రకరంబుల నీడ నొంటిఁ బడి నిద్రించెను. వాని స్వప్నమున శివుడు సాక్షాత్కరించి

బాలక ! యిచట శిలావట
మూలంబునఁ గొండ దండ మొగలేటి దరిన్
శైల సుతా పతి భక్తుల
పాలిటి పెన్నిధి వసించు భక్తిఁ గొలువుమీ

అని యదృశ్యు డయ్యెను. తిన్నడు నిద్రనుండి మేలుకొనెను. ఒక యడవి పందిని గాంచెను. దానిని తరుముకొని పోయి శివ లింగమును గనుంగొనెను. అమితానంద భరితుం డయ్యెను. అమ్మహాలింగము నకు సాష్టాంగ నతు లొనరించెను. ముకుళిత కరుండయి వినుతించెను. ఆ పద్యములు కాళహస్తి మాహాత్మ్య కావ్య కాంతా లలామ కమూల్యా భరణాలంకారములు. మిగుల రసవంతములు. తిన్నని యమాయికత యపార మగు భక్తి రెండు గసములను రెండు స్రోతస్సు లలో నుండి వెల్లి గొలిపి యేక ముఖమున ప్రవాహముగా నున్నత భావ తరంగములతోడి పద్య రూపమున వెలువరించిన కథా భాగ మిది

ఓ సామీ! యిటువంటి కొండ దరిలో నొంటిం బులుల్ సింగముల్
గాసిం బెట్టెడు కుట్ర నట్టడవిలోఁ గట్టుబ్బి క్రీనీడ నే
యాసం గట్టితి వేటి గడ్డ నిలు నీ వాఁకొన్నచోఁ గూడు నీ
క్లే సుట్టంబులు తెచ్చి పెట్టెదరు నీ కిందేటికే లింగమా

ఇందు శివలింగమును సాక్షాత్తు శివు డని భావించుట తిన్నని యమాయి కత్వము. అది సజీవ మని వాని యూహ. కావుననే వాని యా ప్రార్థన యుడుమూరునకు రమ్మని. అది మహారణ్యము. పులులు సింగములు తిరుగాడు చోటు. అవి గాసిం బెట్టును. ఒంటరిగానున్నది శివలింగము. దాని కాకలి దప్పిక లయినచో కూడు నీళ్లు నే చుట్టములు పెట్టు దురు, అని వాని విచారము. ఇంతకంటె నమాయికత యేముండును. వాని పలుకు పసి పాపని మోహముతోడి ముద్దు మాటల వలె విను వారికి నవ్వు పుట్టించును.

కొండలఁ గానలం దిరిగి క్రొవ్విన పందుల లేళ్ల దుప్పులన్
జెండిన బెక్కు చందములఁ జిన్నక పెద్దక గారు కమ్మగా
వండుదురు అట్లి పిట్టలను వండుదు రిచ్చట నుండ నేల నా
కొండొక టానతీక యుడుమూరికి రాగదవయ్య లింగమా

ఉడుమూరునందు వానికి చిన్నక్కయు పెద్దక్కయు గలరట. వారు వేటాడి తెచ్చిన మాంసమును కమ్మగా వండి పెట్టుదురట. అచ్చట పలు రకములగు పండ్లు, బియ్యములు గలవని ఊహాని స్ఫురించిన ధూర్జటికి అడవి పండ్లు అడవి బియ్యము వానిలోని రకములు బాగుగా తెలియును. అన్నిటికంటె తరువాతి పద్యము మిగుల నవ్వు పుట్టించును.

ఇల్లో ముంగిలియో యనుంగుఁ జెలులో యీడైన చుట్టంబులో
యిల్లాలో కొడుకో తలంప వశమే యే పోడుముల్ లేక మా
పల్లెం గోరిన వెల్లనుంగలవు తెప్పల్గాగ నీ కిచ్చెదన్
జెల్లంబో యిటు నోంటి నుండ కటు విచ్చేయంగదే లింగమా

ఇందు ధూర్జటి కొంత పరతత్త్వ పరిజ్ఞానము నిమిడించెను. పరతత్త్వము రూప రస గంధాదులు లేని జ్యోతి స్వరూపము. అది త్రిగుణములను దాల్చి మూర్తిత్రయ మగును. అప్పుడు కైలాసము, వైకుంఠము, సత్యలోకము భార్య బిడ్డలు విభిన్నాకృతులతో వారికి భాసింతురు. శుద్ధ పరబ్రహ్మ మొక్కడే. వానికంటె భిన్న మగు పదార్థ ముండదు. అది సర్వాంతర్యామి యయి జ్యోతి ర్మూర్తియై వెలుగుచుండును. శైవులకు శివుడు పరబ్రహ్మ. ఆ తత్త్వమున కిల్లు వాకిలి భార్య బిడ్డలు నుండరు. సర్వం శివ మయం జగత్. అతడు ఒంటరిగాడు, అని శివునందు పరతత్త్వ నిరూపణచేసి యీ పద్యము చెప్పెను.

చుఱుకుఁ జూపునఁ గాలిన కొఱంత నుఱుకు
నుఱుకుఁ జూపులఁ బుట్టించు నెఱుకువారి

నిటులు వలి గుబ్బ పాలిండ్ల యిగురుఁబోండ్ల
సేవ కిచ్చెద నీకు విచ్చేయు మయ్య

తిన్నడు శివలింగమును నీ కిక్కడెవ రున్నారు. ఉడు మూరునకు రమ్ము. నీకు ఇటులు గుబ్బ పాలిండ్ల యిగురు బోండ్లను సేవ కిచ్చెద నని యాశపెట్టినాడు. మొదట భోజనము మీద ఆసపెట్టెను. తరువాత ఫలహారముల మీద ఆస కల్పించెను. శివలింగము పలుకలేదు. ఆడువాండ్ర మీద ఆస లేనివారు లేరని తిన్న డెరుగును. చివరి కాయాస కల్పించినాడు. కవి మిగుల ప్రౌఢుడు. శివునకు కూడ తన యనుభవము చవి చూప తలంచినాడు. స్వభావము మరువ రానిది. తాను విడువ నెంచినను అది విడువదు. స్త్రీల యాసకుగూడ లొంగలేదు శివుడు.

నను మన్నించెదవేని నీ విపుడు రా నా వెంట రాకుండినన్
నిను నేఁ బాసి చనంగ నోప నిచట న్నీతోడిదే లోకమై
మనువాఁడన్ గనువాఁడ నీ కరుణ నీ మానంబు చిత్తంబు వ
చ్చినచో మానుదు గాని ని న్నిపుడు కష్టింబెట్ట నా కేటికిన్

చివరకు నిను బాసి నే చనంగ నోపను. నీ తోడిదే లోక మని యిచటనే మనువాడను అని మొండి పట్టు పట్టినాడు. ఇది ధూర్జటి యద్భుత మగు రచన. ఒక్కొక్క కవి తన రచనలలో యొకొక్క కథా ఘట్టమునందు సిద్ధహస్తుడగు చుండును. శ్రీనాథుడు నైషధము నందు హంస నల దౌత్యములు కాశీ ఖండములో వ్యాసుని కథ తీర్చి దిద్దినాడు. మను చరిత్రలో పెద్దన వరూథినీ ప్రవరుల కథలో పేరు సాధించినాడు. తిమ్మన పారిజాతాపహరణమునందు సత్యభామా స్వాంతనము నందు కీర్తి నార్జించెను. ధూర్జటి తిన్నని భక్తి వర్ణించి కావ్యమునకు చిరంజీవము పోసినాడు. వీని కొఱకే కావ్యములు సారస్వతము నందు చిరస్థాయిగా నిలువ గలవు. వీనిని చదివి సారస్వత ప్రియులానందింతురు. ఇట్లనుటచేత మిగిలిన భాగములు రసవంతములు కావని నా భావము కాదు. అవి అన్ని విధముల నిగ్గుదేరిన ఘట్టములు.

తిన్నని బోయలు వెదకికొనుచు వచ్చిరి. వాని నరసి మిగుల దుఃఖించిరి. ఆ ఘట్టము నందుండి రెండు పద్యములు

అన్నా! నిన్నలయించి తెచ్చిన వరాహం బెందుఁ బోయెన్ మమున్
గన్న న్మన్ననఁ జూడ వేటికి వడిన్ గన్నీరు గారంగ నే
మన్నన్ బల్కవదేమి కారణమొ వేఁటాడంగ నేతెంచి యి
ట్లున్నం దల్లియుఁ దండ్రియు న్మఱుఁగరే యుల్లంబులో నక్కటా

ఓ తండ్రీ! నిను డించిపో మనసు మా కొక్కింతగా నొప్పునే
మీ తోఁబుట్టులుఁ దల్లిదండ్రులు చెలు ల్మిమ్మెల్ల నేతేరఁగా
మా తిన్నం డిపు డెందుఁ బోయె ననిన న్మా ప్రాణము ల్పోవె రా
వే తిట్టింపక పల్లెలోన మముఁ దేవే వన్నెయున్ వాసియున్

వర్ణనలకంటె కావ్యమున కందము తెచ్చునది సంభాషణ. అది యెంత సహజముగా నెంత రమణీయముగా కవి నడుప గలిగిన కథ యంత యాకర్షించు చుండును. శ్రవ్య కావ్యముకంటె దృశ్య కావ్యము మానవుల హృదయమును చూరగొనుట కదియే కారణము. శ్రవ్య కావ్యములందు పాత్రల సంభాషణ కొక ప్రత్యేక స్థాన మున్నది. పాత్రల సంభాషణల మూలమున రస పోషణ చక్కగా జరుగును. కథ నూరక చెప్పుకొని పోయినచో అంద ముండదు. కావ్యమునకు శోభ కలుగదు. ఆ కావ్యము పాఠకుని చిత్తము నాకర్షింపదు. కథ కొఱ కొక్కసారి చదివి పాఠకు డవల త్రోసి పుచ్చును. దానికి సారస్వతమునందు విలువ యుండదు. అట్లే వర్ణనలు కథను మింగివేయ కూడదు. అట్టి కావ్యము చదువుటకు విసుగు పుట్టించును. అవి సంభాషణ గతము లయినచో రచన అందముగా సాగును. ముక్కు తిమ్మన కైలాసాది వర్ణన లట్లు గావించెను. కావ్యమునకు పాత్రల సంభాషణ రమణీయత చేకూర్చును. పారిజాతాపహరణములోని ప్రథమాశ్వాసము మనుచరిత్రలోని ద్వితీయాశ్వాసము పాఠకుని

మన స్పారస్యము కదియే కారణము. వాని కా యీ కావ్యములందగ్ర
గణ్యత లభించుట కా యీ సంభాషణలు కారణము. కథ, కథకు సముచిత
మగు వర్ణనలు, వానితోడు హృదయ రంజకములగు పాత్రల సంభాష
ణలు కావ్యమునం దెప్పటి కప్పుడుండ వలయును. అట్టి రచన కావ్యము
నాకర్షణీయముగా నొనరించును. ఇన్నిటిని మరపించునది శయ్య. అది
వృత్తములను కావలయును. ఇన్ని లక్షణములు కలవి పారిజాతాపహర
ణము, మనుచరిత్ర. కాళహస్తి మాహాత్మ్యము మొదటి రెండాశ్వాస
ములు వర్ణనాత్మకములు. కావున వానిని చదువుటకు కొంత సహన
ముండ వలయును. వానిని గడచి గట్టెక్కి బైట పడిన తరువాత తిన్నని
కథ పాఠకునకు ఆనందము కలిగించును. ఆ రమణీయత యీ
సంభాషణాత్మక మయిన కథ మలుపులో నున్నది. కావున తిన్నని
కథ బాగున్న దని కవులు మెచ్చుకొందురు. రఘునాథ నాయకుడు
వాల్మీకి చరిత్ర రచించెను. అది వర్ణనాత్మక మగు కావ్యము. కథ
కంటె వర్ణనలు మిక్కుటముగా నుండును. శయ్యలో నంద మున్నది.
అయిన నేమి. దాని నంతగా నాదరించు వా రుండరు. ఆ కోవలోనిదే
విష్ణుచిత్తీయము. వసుచరిత్రయు నా జాబితా లోనిదే యన వల
యును. సంస్కృత కావ్యము లన్నియు నట్టివే. కాని వాని యందలి
శ్లోకములు చిన్న వృత్తములందు రచించుట వలన కొంత పాఠకు
నకు శాంతి కలుగదు. తెనుగు కావ్యము లందలి వృత్తములు
పెద్దవి. కావున విసుగు పుట్టించు ననుటలో సందేహము లేదు.
విజయ నగరాంధ్ర కవుల కావ్యములలో అన్నిట సమ పాళము కలవి
మనుచరిత్ర, పారిజాతాపహరణము.

వాల్మీకి మొదట నొక బోయవాడు. సప్తమహర్షుల ప్రబోధమున
తప మొనరింప మొదలు పెట్టెను. వాని చుట్టపక్కములు వానిని
వెదకుచు వచ్చిరి. వానిని గాంచిరి. ఆ సందర్భమున రఘునాథ
నాయకుడు వారు బోయనితో ననిన మాటలు పది పద్యములలో

రచించెను. అవి ధూర్జటి పద్యముల కంటె నొకింత మనోహరము లేమో యనిపించును. అందుండి

నట్టడవిఁ జుట్టు కొడుకై
కట్టెదుటన్ మనము నిలువఁగాఁ జూడఁడు తా
నట్టట్టు బాపన దయ్యము
పట్టెనొ యీ రావి నుండి బాపురె పీనిన్

దీనియందు కొంత కుల సహజ మగు హాస్యము నబ్బురపాటు కలదు. బ్రహ్మ రక్షస్సులు అడవులందు రావిచెట్ల నాశ్రయించి యుండు నని అనాది కాలము నుండియు నమ్మకము. దాని నిందు కవి ప్రకటించెను. తృతీయాశ్వాసమునందు తరువాత నత్కీరుని కథ కలదు. అది మధురాపుర వర్ణనతో ప్రారంభింప బడెను. నత్కీరుడు పాండ్య రాజు నాస్థానకవి. శంఖ ఫలకముపై వసించి యుండు కవులలో నొకడు. వాని కాలమునందు దేశమున దుర్భిక్షు పొడమినది. అది మానసి మానసిని తిను కరవు. ఈశ్వరు డొక పద్యము ద్రవిడ భాషయందు రచించి తన భక్తుడగు హారద్విజున కిచ్చెను. దాని నాతడు పాండ్యుని సభలో వినిపించెను. అందుఁ సింధురరాజ గమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధం బని యుండెను. అది తప్పని నత్కీర్రు డనెను. హారద్విజు డగౌరవమును పొందెను. ఆ సంగతి శివునకు

నీ మాట నమ్మి పోయిన
నా మోసముఁ జెప్ప నేల నత్కీరునిచే
నే మాట పడ్డ దుఃఖము
తామ వ్యథ కొలఁది గాదు సద్భక్త నిధీ !

అని మనవి చేసికొనెను. శివుడు స్వయముగా నత్కీరునితో వాదింప వచ్చెను. గిరి తనయా ఘన కచ భారమ్ము సహజ గంధం బని సమ ర్థించినాడు శివుడు.

అగజకు నైనం దగు నిల
మగువలకుం దగదు మాను మత్సర మింకన్
గగన ప్రసూన వాదము
జగతిం బ్రత్యక్షమునను సరి యనఁ దగునే

అని నత్కీరుడు శివుని వాదమును ఖండించెను. తార్కికులు ప్రత్యక్ష ప్రమాణము నంగీకరింతురు. పరోక్ష ప్రమాణము నంగీకరింపరు. దానిని గగన ప్రసూన వాదన మని త్రోసి పుచ్చుదురు. భూమియందే యువతి తల వెండ్రుకలు సహజ గంధము కలవి కావు. పార్వతి కుండిన నుండవచ్చును. అది యెవరును చూచినది కాదు. కావున నమ్ముటకు వీలులేదు. అని నత్కీరుని వాదము. శివునకు కోపము వచ్చినది. కుష్ఠు రోగివి కమ్మని నత్కీరుని శపించినాడు శివుడు. కైలాసము చూచిన నీకు శాప విముక్తి కలుగు నని నుడివినాడు.

ఈ కవి తాభిమానము వహించితి నేటికి శంఖ పీఠిపై
నీ కవు లున్న యట్లు వసియింపక దేవుని తోడ నేల చా
ర్వాక తమునచ్చితిం గడు భరం బగు కుష్ఠ రుజా విషాదమే
నే కరణిం ధరింతు నిఁక నెన్నఁడు చూచెద వెండి గుబ్బలిన్

అని చింతించినాడు నత్కీరుడు. తీర్థ యాత్రలకు బయలు దేరినాడు. దారియందు

చెవ్వం దీర్వగు నీశ్వరేశ్వరునిఁ గాంచెన్ భీషణాంహో లతల్
త్రెవ్వం దీవ్రతరాంగ సంభవ శర శ్రేణీ విదాహ వ్యథల్
వివ్వం దీఅని భక్తితో హృదయ మావిర్భూత మోదంబునన్
నవ్వం దీఁగయుఁ బోలెఁ జూడ్కు లొదవ నత్కీరుఁడుత్కంఠతోన్

ఇది యీ ఘట్టమునందు మొదటి పద్యము. తరువాత

చెంగట నుండఁ గాంచెఁ గవి సింహము పోయి హిమాచ లాత్మజో
త్తుంగ కుచోప గూహన విఘాత మనోభవ భూతి లేప స
ర్వాంగము లోచనీ కృత సుధాంశు కృశాను పతంగమున్ విని
ర్లింగము జంబునాథ శివ లింగము భక్త మనోజ్ఞ భృంగమున్

అటు తరువాత పద్యము

చనిచని దాఁటె నంతఁ గవి చంద్రుఁడు ధన్యఁ గవేర కన్య జీ
వన శిత ఖడ్గ ఖండిత భవ ప్రభ వాఘ విరోధి సైన్యఁ బా
వన నిజ నామ సంస్మరణ వారిత మానవ దైన్య నిత్య మ
జ్జన రత కోటి ముక్తి పద సౌఖ్య వదాన్యఁ గృతావగాహుఁడై.

ఆ పిమ్మటి పద్య మిది

అరుణ గిరీంద్ర కూటముఁ గృతాఘ కపోల చపేటమున్ నిరం
తర భవ దావ పావక విదాహ కృపీటము పుణ్య కోశ మం
దిర విలస త్కవాటముఁ బ్రదీపిత ముక్తి వధూ కిరీటమున్
బరిహృత సంతత భ్రమణ భార పద శ్రమ భాను ఘోటమున్

సిద్ధుని తీర్థయాత్రలు మనుచరిత్రయందు పెద్దన

ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణ శశాంక తీర్థ యా
త్రా చణ శీలినై జనపదంబులు పుణ్య నదీ నదంబులుం
జూచితి నందు నందుఁ గల చోద్యములం గనుఁగొంటి నా పటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్

కేదారేశు భజించితిన్ శిరమునం గీలించితిన్ హింగు ళా
పాదాం భోరుహముల్ ప్రయాగ నిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథ సుతా కళత్రు బదరీ నారాయణుం గంటి నీ
యా దేశంబన నేల చూచితి సమ స్తాశావకాశంబులన్

అని వర్ణించెను. అలసాని పెద్దన యెంత సమాసమును పొడిగించినను శబ్దములలో మార్దవమునకు ప్రాధాన్య మొసంగును. అట్టి పదముల నేర్చి కూర్చి పూల సూలికలోని మెత్తిందనమువలె నతుల సమాసమును తీర్చి దిద్దును. దానిని చదువునపుడు హృదయాహ్లాదకరముగా నుండును. అతని కవనంపు పోకడలు పదము లొత్తుకొనని యనిని నిండార విచ్చిన విరి మల్లెల మీది నడకలు. అతడు వైష్ణవుడు. వైష్ణవులు సాత్విక భక్తి కలవారు. అది దాసత్వములో నిమిడి యున్నది. శేష శేషిత్వ భావములు వైష్ణవులకు విష్ణువుతోడి సంబంధములు. కావున వారి మానసిక ప్రవృత్తి మిగుల మృదులము. ఆ మృదుత్వము పెద్దన కవితలో నెలకొన్నది. ఇది వైష్ణవ కవుల రచనలోని రహస్యము. వారియందావేశము కంటె రచనా మార్దవము పదమాధుర్యము మిక్కుటముగా గోచరించును. ఎంత దీర్ఘ సమాసము వాడినను దానిలో వారి స్వభావము ప్రతిబింబించు చుండును.

అల్లసాని పెద్దన కాలము వరకు గల కవు లందరు దాదాపు శైవులు. వారిలో వీర శైవులు గలరు. శైవులు రజోగుణము కల వారు. వారి భక్తి రజోగుణ ప్రధాన మయినది. అది వీరావేశములో నిండి యుండును. అందు వీరశైవ సంప్రదాయములు తీవ్రావేశములకు నిలయములు. వారి ప్రవృత్తి ఆవేశ సహితము. వారి రచనలలో నా యావేశము నెలకొని యుండును. అది శివుని గురించి గాని శివ క్షేత్రములను గురించి గాని శివునికథలను గాని చెప్ప వలసి వచ్చినపుడు గూడు కదిలించుకొని గుర్రీ వేగములో వెల్లువలు గట్టుకొని పొంగు లాడును. ఆ తీవ్రతలో పదముల మార్దవము కంటె భావ ప్రదర్శనమునకు ప్రధాన స్థానముండును. అది ఆవేశ పూరితము. ఆ యావేశమున సమాస మంతే దీర్ఘ మయినను నయాగరా జల పాతము వలె ననివార్యం బగు ధారా వేగములో దొంతలి నురుగులు గ్రమ్ము కొనుచు వినిర్గమించును. ఇట్టి రచన పాల్కురికి సోమనాథ నన్నెచోడ శ్రీనాథుల కావ్యములందు కలదు. ధూర్జటి

యీ కోవలోనివాడు. వానిది యావేశ పూరితమగు రచన. అందు అని వార్యంబగు నావేగము నెలకొని యుండును. అది పోను పోను పెచ్చు పెరుగుచుండును. ఆవేశము పెరిగిన కొలంది పద్యంపు నడకలో వేగ మభివృద్ధి నొందును. దానితో పాటు సమాసములు దీర్ఘము లగు చుండును. ధూర్జటి ప్రవృత్తి తీవ్ర మయినది. ఆవేశ పూరిత మయినది. అదియే పై పద్యములందు క్రమ క్రమాభివృద్ధితో కనిపించును. దానికి తోడు అంత్యప్రాసలు ఆతీవ్రతకు బాసట యైనవి. పద్యములను మరింత యావేశ పూరితములుగా తోపించినవి. ఈ విధానమును ధూర్జటి పోతన యొద్ద పుణికి పుచ్చుకొనెను. ఆ మహాకవికి వర్ణనలలో రసా వేశము కలిగి నప్పుడు కవిత్వమంత్యప్రాసలతో దొరలుకొని వచ్చును. పదములు భావముకంటె ముందుగా పరిగెత్తును. ఇట్లు వారి వారి ప్రవృత్తులను బట్టి కవిత యలవడు చుండును. కాళహస్తి మాహాత్మ్యము నాల్గవ యాశ్వాసమునందు వారాంగనలు శివ సాయుజ్యము పొందిన కథ కలదు. ధూర్జటి కథను నడుపుటలో ఘటికుడు. వాని వర్ణనలు పాఠకునకు విసుగు కలిగించవు. అతని శివ భక్తి యపార మయినది. వాని యా భక్తియే యీ కావ్యము వ్రాయించినది.



౮

## సింహావలోకనము

విజయనగర ఆంధ్ర కవులు రచించిన కావ్యములలో జైమిని భారతము మనుచరిత్ర పారిజాతాపహరణము విష్ణుచిత్తీయము శ్రీ కాళహస్తి మాహాత్మ్యము ప్రధానము లయినవి. అందు మొదటి నాలుగు విష్ణు భక్తిని ప్రదర్శించు గ్రంథములు. చివరిది శివభక్తిని చాటు గ్రంథము. విజయనగర రాజులు విష్ణు భక్తులు. వారి యాస్థానమునందలి పినవీరభద్రుడు తిమ్మన ధూర్జటి శైవులు శివోపాసకులు. ధూర్జటి వీర శైవుడు. పెద్దన రాయలవారు వైష్ణవులు. రాయలవారి కాలమందు శైవ వైష్ణవములు గంగా యమునల వలె నొండొంటి నొరసికొని వెల్లి విరిసినవి. రాజులు వైష్ణవులగుటచేత శైవ ప్రాబల్యము కొంత తగ్గినది. వైష్ణవము ప్రబల మైనది. కావున ధూర్జటి వంటి వీరశైవ కవి రాజాస్థానమునుండి తొలగిపోవలసి వచ్చినది. తిమ్మన పినవీరభద్రులు శైవులయినను రాజాదరణకొఱకు పారిజాతాపహరణము జైమిని భారతము వ్రాసిరి. ధూర్జటి అతి స్వతంత్రుడు. ఆత్మాభిమానము శివ భక్తియందు అచంచలి మగునమ్మకము గలవాడు. కావున రాజు నధఃకరించి కాళహస్తి చేరి స్వామి మాహాత్మ్యము రచియించెను. పినవీరనయంత స్వతంత్రుడు కాడు. కాని శివ దీక్ష శృంగార శాకుంతలమునందు మిక్కుటముగా కనిపించును. సాలువ గుండ నాయకు కొలువు చేరిన తరువాతఅది కొంత సడలిన దేమో యనిపించును. అతడు విష్ణు భక్తుడు. శృంగార శాకుంతలములోని యా శైవావేశము జైమినిభారతమునాటికి కనిపించదు. తిమ్మన శివ పూజాసక్తు డయినను విష్ణువును కూడ భజించువాడు. శివ కేశవుల యందు అభేదబుద్ధి కలవాడు. కావున రాయల ప్రీతికొఱకు పారిజాతాపహరణము రచించెను. పెద్దన రాయలవారును వైష్ణవులు. వైష్ణవమును

తమ కావ్యములందు ప్రతిపాదించిరి. మనుచరిత్రలో అంతర్వాహిని వలె వైష్ణవము గోచరించును. కాని అది విశిష్టాద్వైతము. శాస్త్రీయము. వేదములు ప్రమాణముగా కలది. పౌరాణికము కాదు. పెద్దన కర్మ జ్ఞాన భక్తి యోగములను దృష్టియందుంచుకొని మనుచరిత్ర రచించెను. పూర్వోత్తర మీమాంసలు భగవద్గీతలు వాని యభిమాన శాస్త్రములు. కావున ప్రవరుని కర్మయోగిగాను జ్ఞానిగాను చిత్రించెను. రాయలు పౌరాణిక వైష్ణవమును విష్ణుచిత్తీయము నందు ప్రతిపాదించెను. దానికి భక్తి ప్రధానము. ఆ భక్తిని శాస్త్ర వాదములతో సమర్థించెను. భక్తి వీరశైవ వైష్ణవ మత సిద్ధాంతములకే కాదు శాంకర రామానుజ మధ్వ సిద్ధాంతములకు కూడ వర్తించును. భక్తి వినా యేదియు మోక్షమొసంగదు. భక్తునకు శాస్త్ర జ్ఞానమక్కర లేదు. అదే ధూర్జటి తిన్నని కథవలన నిరూపించెను. అటే రాయలు విష్ణుచిత్తుని కథ యందు వెలయించెను. దైవ భక్తికి జాతి కుల మతములతో పని లేదు. ఎవరైనను ముక్తి బడయ వచ్చును. దీనిని రాయలు మాల దాసరి కథ యందును ధూర్జటి తిన్నడు వేశ్యల కథ యందు విదితము గావించిరి. మృగ కీట కాదులు గూడ భక్తి వలన మోక్షమును పొంద వచ్చునని యుభయ మత సమ్మతము. కాని మోక్ష నిర్వచనమున భేద మున్నది. శైవము సాయుజ్యమును బోధించును. వైష్ణవము సారూప్యము బోధించును. శైవ పరతత్త్వము రూప విరహిత మగు తేజస్సు. అది ఆకాశము వలె అనంత మయినది. కాని యుపాసనాదులకు శివుని రూపము కల్పింప బడినది. అది లింగాకృతి. విష్ణు పరతత్త్వము రూప సహిత మయినది. ఇంతే భేదము. విజయనగ రాంధ్ర కవులు పండితులు. తత్త్వ విద్యా విదులు. వారి రచనలు రసవత్తరము లగుట చేత మహా కావ్యములు. పరతత్త్వ ప్రతిపాదకము లగుట చేత వేదాంత గ్రంథము. కావున నవి విశ్వ శ్రేయములు. వాని వంటి గ్రంథములు తెనుగు సారస్వతమున లేవు. అందు మనుచరిత్ర సర్వ శ్రేయో

దాయక మయినది. విష్ణుచిత్తీయ కాళహస్తి మాహాత్మ్యములు మత విషయకము లయినవి. పారిజాతాపహరణము కావ్యత్వ సిద్ధి కలది. ఇవి భారతీయ సంస్కృతిని ప్రతిపాదించు కావ్యములు. భారతీయ సంస్కృతి మిక్కిలి యుదార మయినది. చీమ మొదలు బ్రహ్మ పర్యంతము గల సకల జీవ రాసులకు మోక్ష సంపాదనకు స్వాతంత్ర్య మున్నది. అన్ని జీవరాసులు సమాన మని బోధించును. ఈ బోధ ప్రపంచమునందు మరే మతము బోధించదు. ప్రతి ప్రాణికి జీవిత స్వాతంత్ర్యము బోధించునది భారతీయ సంస్కృతి. అందుకని అహింసా పరమోధర్మః అని వేదములు బోధించు చున్నవి.

సమాప్తము



విజయవాడ నిర్మలా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. ఫోన్. 4674